# శ్రీ మదాంధ్ర రామాయణము

యుద్ధ కాండము.

మూలము

శ్రీ వాల్మీకి రామాయణము



ప్రణీతము

**పోచిరాజు కామేశ్వర రావు**

# శ్రీ మదాంధ్ర రామాయణము

యుద్ధ కాండము.

మూలము

శ్రీ వాల్మీకి రామాయణము

ప్రణీతము

పోచిరాజు కామేశ్వర రావు

# శ్రీమదాంధ్ర రామాయణము

(మూలము: శ్రీవాల్మీకి రామాయణము)

## యుద్ధ కాండము

## సర్గము 1.

కం. శరణోపగత విభీషణ!
శరైక నిశ్చేష్ట యామ్యశరధీ! లంకా
పుర వాసాసుర భయదా!
ఖర వింశద్భుజ యుత దశకంఠ నిహంతా! 1.

సీతను గాంచి వచ్చి పలికిన హనుమంతుని మాటల నాలకించి రాముఁడు సంతోష ముప్పొంగ హనుమంతుని మహా కార్యమున కాతని మెచ్చి శ్లాఘించి కౌఁగిలించుకొని సముద్రమును వానర సైన్యము తోడ దాఁటు విధ మెట్లని చింతించి ధ్యాన మగ్నుఁ డగుట.

కం. విని హనుమంతుని వాక్యము
లను బ్రీత మనస్కుఁ డయి నరర్షభుఁ డంతం
గని యనిలాత్మజుని వచిం
చెను రాముం డుత్తరమును జెన్నుగ నిట్లున్ 2.

చం. మన మలరంగఁ జేసె హనుమంతుఁడు లీలగ గొప్ప కార్యముం
గన నతి దుర్లభం బది జగమ్మునఁ జేయ మనమ్ము నందు న
న్య నరుల కౌ నశక్యము మహాంబుధి దాఁటెడు వానిఁ గాంచ నే
ననిలుని వైనతేయు ననిలాత్మజుఁ దక్కఁగ నన్యు నెవ్వనిన్ 3.

ఉ. ఉర్విని దేవ దానవ మహోరగ రాక్షస యక్ష దైత్య గం
ధర్వులు సేర రాని దగు తద్ద పురమ్మును లంక రావ ణా
ఖర్వ సు రక్షితంబును నఖండ బలమ్ము వహించి చేరి పే
గర్వ మెలర్ప వచ్చు నవికార మెవండు సజీవ మివ్విధిన్ 4.

కం. బలమునఁ గాకున్న సముఁ డ
నిల తనయున కెవ్వఁ డవనినిఁ గనఁ దిరిగి రాఁ
గలఁ డివ్విధిఁ జొర రాన
ట్టి లంకఁ జేరి ధృతిని మగిడి సురక్షితమున్ 5.

ఆ.వె. తనదు విక్రమమ్ము ధవుఁడు సుగ్రీవున
కిం పడరఁగఁ జూపి పంపును నెర
పేర్చె గొప్ప పనిని వీరవర్యుఁడు హను
మంతుఁ డిటుల నొసఁగ సంతసమ్ము 6.

ఉ. కాంతుఁడు దుష్కరం బయిన కర్మ మొసంగిన సత్వరమ్మునన్
సంతస మంది యే భటుఁడు చక్కఁగఁ జేయునొ వాని నెల్లరున్
స్వాంతము నందు మెచ్చి కడు పల్కుదురే పురు షోత్తముండు నా
నెంతయుఁ బ్రీతి తోడుత నహీన పరాక్రము భూతలమ్మునన్ 7.

తే.గీ. ఎవఁడు శాసింపఁ బడఁగ మహీత లాధి
నేత చేత మిక్కుటమును బ్రీతి నొసఁగు
దానిని సమర్థుఁ డయ్యును దనరి చేయ
కుండు నతఁడు మధ్యమ పురుషుం డనఁబడు 8.

కం. నృపతి నియోగింపఁ బనిని
విపుల సమర్థుండు నైన భృత్యుఁడు దానిం
గపటి యయి చేయకుండినఁ
గపివర! పురుషాధముఁ డనఁగ వచింపఁ బడున్ 9.

కం. హనుమంతుం డొనరించెను
సునియుక్తుఁ డయి పని నెల్ల శుభముగ సుగ్రీ
వున కానంద మొసంగెను
దనకుఁ దగుల నీయ కుండెఁ దక్కువ తనమున్ 10.

ఆ.వె. రఘు కులమ్ము నేను లక్ష్మణుం డతి బలుఁ
డవనిజ జనకసుత నరయ రక్షి
తుల మయితిమి నేఁడు తోరముగను దగి 11.

నట్టి రీతి వాన రాగ్రగణ్య!

ఆ.వె. నాకు మనము దీనున కెరియు చున్నది
ప్రియ గిరలు వలికిన వీరునకు స
దృశ హితమ్ము నకట యింత యేని తిరిగి
చేయ కుంటి నన్న చింత తోడ 12.

కం. ఇప్పటి యిక్కాలమ్మున
నొప్పిద మగు కౌఁగిలింత యున్నది యొకటే
మెప్పు నెఱిఁగింప నా కడఁ
జొప్పడ నిత్తును హనుమకు శూరున కెలమిన్ 13.

కం. హనుమంతుని కృత కర్ముని
ఘనుఁ గదిసిన వానిఁ బ్రీతిఁ గౌఁగిలిఁ జేర్చెం
దన వాక్యము లొనరింపఁగ
నిన వంశోద్భవుఁడు రాముఁ డెలమిని నంతన్ 14.

కం. అంత నిలిచి ధ్యానమున నొ
కింత రఘు వరేణ్యుఁ డనియె నివ్విధిఁ బర వీ
రాంతకుఁడు కపీశ్వరుతోఁ
జెంతను సుగ్రీవుఁ డుండఁ జెన్నుగ వినఁగన్ 15.

కం. సీతాన్వేషణమున నేఁ
బ్రీతిం జెందితి నది నెఱవేరినది తగన్
వీత మనస్కుఁడ నయితిని
యాతత తోయధిఁ దలంప హరిశార్దూలా! 16.

ఆ.వె. దుస్తర మయి తనరు తోయధి దక్షిణా
శకు నరుగఁగ నెట్లు శక్య మగును
వానరులకుఁ గలసి వారి రాశిని దాఁటి
తోఁపకున్నది కడు దుష్కరమ్ము 17.

తే.గీ. సీత వృత్తాంత మంతయుఁ జెప్పి తీవు 18.

కడలి దాటింపఁ బ్లవగ నికాయము నిఁక
నెద్ది యగు నుపాయము మన కిత్తఱిం ద
లంప వలయు నిశ్చయముగ నింపుగాను

కం. అని హనుమంతుని తోడ వ
చనమ్ము లివ్విధిఁ గలంత సంభ్రమ మెదలోఁ
దనరంగ రాముఁ డాలో
చ నాంబుధి నిమగ్నుఁడయ్యె శత్రు దమనుఁడే 19.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నొకటవ సర్గము.

# యుద్ధ కాండము
## సర్గము 2.

సముద్రము నెంచి శోకములో మునిఁగిన రామునితో శోక నాశము లగు పలుకుల సుగ్రీవుఁ డూఱడించి కడలిని దాఁటు నుపాయము నాలోచింపు మని వేఁడికొనుట.

కం. కని శోక తప్తు దాశర
థిని రాముని వగపు నెల్లఁ దీర్చు పలుకులన్
ఘనుఁ డా సుగ్రీవుఁడు వ
ల్కెను శ్రీమంతుఁడు కడింది ప్రేమ సెలంగన్ 1.

ఆ.వె. శూర వర్య! యేల శోకింప నన్య సా
మాన్య భంగి వీడుమ వగ పెల్ల
స్నేహమును గృతఘ్ను చెన్నున శీఘ్రము
గాఁ బురుష వరేణ్య! కలఁత తగదు 2.

తే.గీ. తావుఁ గాంచను నీదు సంతాపమునకుఁ 3.

బడయఁగఁ బ్రవృత్తి శత్రుని పట్టణమ్ము
తెలియ మనకు నరోత్తమ! తెల్లముగను
వీడు మింక శోకమ్మును వీరవర్య!

ఉ. సన్నుత బుద్ధిమంతుఁడవు శాస్త్ర విదుండవు పండితుండవే
యెన్నకు పామ రాలి మతి యింపుగ వీడు కృతాత్ముఁ డిద్ధరం
గ్రన్నన నర్థ నాశ మయి క్రాలెడు బుద్ధిఁ ద్యజించు భంగినిన్
మిన్నగ దాఁటి వార్ధిని నమిత్రు వధింతము చేరి లంకనున్ 4.

తే.గీ. శోక తప్తుని యుత్సాహ శూన్యు దీను
కార్యతతు లెల్ల నశియించు నార్య! యింక
నిశ్చయముగ వ్యసనములు నిత్య మందు
చుండు నాతండు ధర లోన మెండుగాను 5.

ఉ. వీరలు శూరు లెల్లరును బెద్ద సమర్థులు నెందు వానరుల్
మూరుచు నుత్సహింత్రు ప్రియముం దగఁ జేయఁ దలంచి యింపుగా
నో రఘు నందనుండ హరి యూథపు లందఱు నగ్ని దూఁకఁగా
నేరరు భీతి నింతయును నేరుదు వీరిని నే భృశమ్ముగా 6.

చం. హరుల ముదమ్మునుం గనిన నారయ తర్కము నిశ్చయమ్ము సూ
నరవర! నా యెడందను ఘనమ్ముగ నియ్యది యుద్యమింపుమా
వరసతి జానకీ సతినిఁ బన్నుగ నెవ్విధిఁ దెత్తు మవ్విధిన్
దురమున శత్రు రావణుని దుష్టునిఁ జంపి పరాక్రమమ్మునన్ 7.

ఉ. ఎవ్విధిఁ గట్టి వారధిని నింపుగ లంకను గాంచ నేర్తుమో
యవ్విధి రావ ణాలయము నార్య! తొడంగుమ రాఘవోత్తమా!
రివ్వున నా త్రికూట గిరి శృంగము నందు వెలుంగు పట్టణం
బవ్వర లంకఁ జేరిన దశాస్యుఁ డనిం బడి నట్టు లెన్నుమా 8.

కం. కట్టక వంతెన నంబుధి
బెట్టిదపు వరుణుని యింటఁ బృథ్వీప సుతా!
పట్టణము లంక నింద్రునిఁ
దొట్టి సురాసురులు గూల్పఁ దొడఁగ నశక్యుల్ 9.

తే.గీ. రామ కట్టి సేతువుఁ జేర లంక చెంత
కెల్ల సైన్యము మున్నీటి నెల్ల దాఁటి
నెగ్గి నట్లు భావింపుమ నీదు రిపుని
వీరు కామరూప హరులు వీరు లాజి 10.

ఆ.వె. విక్లబంపు బుద్ధి వీడు మింక సకల
కార్య నాశకము జగమ్మునందు
నరుల పౌరుషమును నశియింపఁ జేయును
శోక మడరి భృశము శూర వర్య! 11.

కం. మనుజుఁడు శౌండీర్యముతో
డ నే పనినిఁ జేయుఁ గర మడరి యది తగ నా
తనికి నలంకారంబై
తనరును దథ్యముగ శీఘ్ర తరముగ నృవరా! 12.

మ. అవలంబింపుమ సత్త్వ తేజముల నార్యా యిత్తఱిన్ రామ! ప్రా
జ్ఞ వరేణ్యా! నిను బోలు శూరులును ప్రజ్ఞావంతులున్ ధీర మా
నవులుం బొందఁగ, నష్టముం బడసినన్ నాశంబు నందుం, గలం
త వినాశం బొనరించు నెల్ల పనులం దథ్యంబుగా నిద్ధరన్ 13.

ఆ.వె. నీవు సర్వ శాస్త్ర కోవిదుఁడవు బుద్ధి
మంతు లందు నుత్తమ పురుషుండ
వు నను బోలు నట్టి ఘన మంత్రులను గూడి
యర్హుఁడవు జయింప నరుల నాజి 14.

కం. కన ముల్లోకమ్ముల నే
రిని ధను వూని నిలువ నడరి యెదుట నీ కా
జిని నెదిరింపఁగ రాఘవ!
యిన వంశాంభోధి సోమ! యే నెన్నండున్ 15.

తే.గీ. ఉంచ వానరులం దిట్టు లంచితముగ
నీదు కార్య మెన్నఁడు చెడ నేర దెంచఁ 16.

జూతు వచిరమ్మున సతిని సీత నీవు
దాఁటి యక్షయ నీరధిఁ దథ్యముగను

ఆ.వె. నృపతి పుంగవా! వగపు నాపు మిఁక రోష
మూను మయ్య మందు లుర్విఁ గాంచ
జడత నున్న యెడలఁ బుడమి పతులు చండు
నకు భయపడుదురు ఘనముగ రిపులు 17.

ఆ.వె. రామ ఘోర వార్ధి లంఘింప నాపగా
పతిని మమ్ము గూడి పరమ నిశిత
బుద్ధి తోడ నిపుడు పురుష పుంగవ! చింత
సేయ వలయు వీడి చింత సెల్ల 18.

తే.గీ. దాఁటఁ గడలి యెంచు జయము తథ్య మంచు
సైన్య ముత్తరించి వనధి చనిన దరికి
విజయ మందుట తథ్యము నిజము సుమ్ము
కామ రూపులు శూరు లీ కపులు కలిని 19.

తే.గీ. శిలల తరుల వాన కురిసి చెలఁగి రిపుల
సంహరింతురు ప్లవగ వృషభులు చూడ
నెట్టు లైన జలధి దాఁట నిట్టి హతుఁడు
రావణుఁ డనుచు నెంతుఁ బరంతప! యని 20.

కం. పలుకంగ నేల నిఁక మా
ట లనేకము లిటులు విజయుఁడవు రాఘువ! కం
టి లలిత నిమిత్తములు మది
యలరుచు నున్న దిట నాకు నత్యధికముగన్ 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు రెండవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 3.

సుగ్రీవుని మాటల నాలకించి సమ్మతించి రాముఁడు హనుమంతుని లంకా పట్టణమును వివరముగా నుడువు మని వేఁడ లంకా రాజ్య ప్రాభవమును రక్షణ విధానమును మారుతి వివరించుట.

కం. విని సుగ్రీవుని వాక్యము
ల నర్థవంతముల నా కరణ యుక్తములన్
మనమున గ్రహించి రాముఁడు
కని హనుమంతుని వచించెఁ గాకుత్స్థుఁ డిటుల్ 1.

చం. కడలిని నెండఁబెట్టియును గట్టి దృఢమ్ముగ సేతు పైననుం
దడయక నే సమర్థుఁడను దాఁటగ నంబుధి నెట్టు లైన నీ
వడరి వచింపు మంతయు దశాస్యుని రాజ్యము లంక గూర్చి నే
నెడఁదను నేరఁగాఁ దలఁతు నింపుగ నా వివరమ్ము లిచ్చటన్ 2.

చం. బల పరిమాణ మెల్ల మఱి ద్వార మహోన్నత దుర్గ నిర్మితుల్
వెలసిన రక్షణం బసుర వేశ్మ నికాయము నెల్లఁ జూచి న
ట్టులఁ గపి వీర పల్కుమ కడుం గడు నేర్పరి వీవు సర్వ మీ
వల నగరమ్ము సూచితి కదా చరియించి సుఖమ్ముగాఁ దగన్ 3.

చం. విని రఘు వీరు మాటలను వీరుఁడు మారుత నందనుండు వ
ల్కెను వచనమ్ము లా గిరల శ్రేష్ఠుఁడు రాముని తోడ నివ్విధిన్
వినుమ వచింతు సర్వమును విస్తృత దుర్గ వినిర్మితమ్ములన్
ఘన పుర మెట్లు గుప్త మయి కన్పడు సైన్యము కాచు తీరునున్ 4.

ఉ. రక్కసు లెట్లు కూడుదురో రాజును రావణు గొప్ప తేజమున్
వెక్కస మైన లంక సిరి భీమ సముద్రము సైన్య భాగముల్
మిక్కుట మైన వాహన సమీకరణమ్ము వచింతు నీకు నం
చక్కపి ముఖ్యుఁ డెల్లను యశస్వి వచింపఁ దొడంగె నంతటన్ 5.

తే.గీ. మత్త గజ సంయుతం బయి మహిత రథ స
మాకులం బయి రక్షోగ ణావృతంబు
నై విలసితమ్ము లంక మహాపురమ్ము
నిత్య ముదితం బయి చెలంగు నత్యధికము 6.

ఆ.వె. కట్టఁ బడఁ దలుపుల బెట్టిదముగ గొప్ప
గడియ లుండ నాల్గు కరము విపుల
మైన ద్వార వరము లా లంక కమరు మ
హోన్నతముగ నింక నొప్పిదముగ 7.

ఉ. అచ్చట జాలనే విసరు యంత్రము లున్నవి శత్రు సైన్యమే
వచ్చినఁ జేయఁ దాడనము పర్వులు పెట్ట భయమ్ము మీఱఁగన్
హెచ్చు శతఘ్ను లున్న వట నిన్నవి ద్వారము లందు నెల్లనున్
మెచ్చి సృజింప రాక్షసు లమిత్ర వధార్థము భీకరమ్ములన్ 8.

తే.గీ. కాంచన మయమ్ము దాని ప్రాకార వర మ
తిక్రమింప రా దేరి కతి విపులమ్ము
విద్రుమ మణి వైడూర్య వివిధ వరేందు
రత్న విరచి తాంతర సు విరాజితమ్ము 9.

కం. శీతల తోయమ్ములతో
నాతత గంభీర పరిఖ లమరెన్ నక్ర
వ్రాతము మీ నావళులుం
బ్రీతిఁ జరింప సతతమ్ము భీతి నొసఁగుచున్ 10.

తే.గీ. యంత్రములఁ గూడి వంతెన లచట నాల్గు
ద్వారముల నమర్పఁ బడియె బహు విశాల
ము లవి గొప్ప వైన యనేకములు గృహావ
ళులు కలవు రాఘవ! విలసిల్లుచు భృశమ్ము 11.

కం. పర సైన్యం బేతేరం
గ రక్షితము లౌను యంత్ర కాయము చేతన్
గురు వారధులు రయమ్మునఁ 12.

బరిఘుల నవకీర్ణము లయి పన్నుగ నంతన్

తే.గీ. ఒకటి నిష్కంప మైనది యురువుగ దృఢ
మైనది నడవ విలసిల్లు నందముగను
గాంచన స్తంభములు పెక్కు లంచితములు
వేదిక లడర బల మందు బెద్దది సుమి 13.

తే.గీ. రామ! యుద్ధాభిలాషియె రావణుండు
స్వయముగ స్వభావ మందు నాపన్నుఁ డప్ర
మత్తుఁడు బలము వీక్షింప నెత్తఁజేఁ దగ
నుద్యమించుచుఁ జరియించు నొప్పిదముగ 14.

ఆ.వె. లంకకు నరయ మవలంబము సురలకు
దుర్గమము భయ మిడుఁ దోరముగను
గిరులు నదులు వనులు కృత్రిమములు దుర్గ
ము లవి నాల్గు లంకఁ జెలఁగు చుండు 15.

చం. వనధి తటమ్ము నం గలదు పట్టణ మేరికి రాదు చేరఁగం
గన మట దారి నావలకుఁ గాంచము వార్తలఁ బంపు తీరునున్
ఘన గిరి పైన నిర్మితము కష్టము చేరఁగఁ గాంచ దేవ రా
జ్య నిభము వాజి వారణ సమాకుల మా పురి లంక రాఘవా! 16.

కం. రావణు దురాత్ము లంకను
వేవేలు పరిఘు శతఘ్ను వివిధమ్ములు యం
త్రావళులు విరాజిల్లు మ
హా వైభవము నుడువంగ నలవియె నృవరా! 17.

కం. పదివే లసురులు పూర్వం
పు దిశను గల ద్వార మందుఁ బోర నజేయుల్
పదిలముగ నూని శూలము
లు దిట్టలే ఖడ్గముల నిలుతు రనిశమ్మున్ 18.

ఆ.వె. లక్ష మంది భటులు దక్షిణ ద్వారమ్ము 19.

నాశ్రయించి స చతురంగ బలము
యోధ వరులు సెలఁగి యుందురు రక్షణా
ర్థం బనుత్తములు ముదమ్ము తోడ

ఆ.వె. అసురులు పది లక్ష లాపశ్చిమంపు ద్వా
రమ్ము నందు సంతతమ్ము చర్మ
ఖడ్గ ధారు లయి సకల శాస్త్ర కోవిదు
లుందు రుగ్ర వీరు లుద్యమించి 20.

ఆ.వె. ఉందురు పదికోటు లుత్తర ద్వారమ్ము
చెంత రక్కసులు విశేష రథికు
లాశ్వికులు కులీను లధిక పూజితులు ని
రంతరమ్ము ఘనులు సంతసమున 21.

ఆ.వె. నడిమి దేశ మందు నడరి వందల వేల
యాతుధాను లుందు రందఱును దు
రాసదులు దురమున నగ్రముగాఁ గోటి
మంది రాక్షసు లట మసలు చుంద్రు 22.

ఉ. నే నట మూరి కూల్చితిని నేర్పున సేతుల నా యగడ్తలన్
మానుగ రేఁగి పూడ్చితిని మంటలఁ గాల్చితి లంక నుగ్రతన్
దానివి చుట్టుగోడలను ధాత్రినిఁ గూల్చితి నమ్మహాత్ములం
దేను బలమ్ము కొంత నశియింపఁగఁ జేసితి రాక్షసాలినిన్ 23.

ఆ.వె. మార్గ మెద్ది యైన నిర్గమింపఁగఁ దరిం
చి వరుణాలయమ్ము శీఘ్రముగను
దలఁప వచ్చు నిఁక హతం బని లంకా న
గరము తథ్యముగను నరవరేణ్య! 24.

సీ. అంగదుండు ద్వివిదుఁ డా మైందుఁడును జాంబవంతుఁడు వీరులు పనస నలులు
నీలుండు కపి వాహినీ పతి తక్కిన వారేల యిఁక నీకుఁ బార్థివేంద్ర!
యెగురు వారలు వీర లేఁగి రావణు మహా నగరికి భేదించి నగముల వన
ముల ప్రహరుల ఖాతముల తోరణముల గృహములను గూడి మహాత్మ! తెత్తు

ఆ.వె. రు రఘువీర! యాజ్ఞ నరవరేణ్య! యొసఁగు
మిట్టు లీ బలమున కెల్ల వేగ
పన్నుగ వరియింపు ప్రస్థానమును త్రుటి
మాత్రమునఁ జనంగఁ బాత్రముగను 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు మూడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 4.

లంకా నగర విశేషములను హనుమంతుఁ డెఱిఁగింపఁగ రాముఁడు ప్రయాణమునకు నేఁడ మంచి ముహూర్త మని పలికి సుగ్రీవ లక్ష్మణ వాన రానీకముతో దక్షిణ దిశ వైపునకు నదులు గిరులు నరణ్యము లెల్ల దాటి దక్షిణ సముద్రపు టొడ్డును జేరుకొనుట.

కం. విని హనుమంతుని వాక్యము
లను నుడువఁగ మొదటి నుండి రాముం డంతన్
ఘన తేజుం డివ్విధిఁ బలి
కెను సత్యపరాక్రముండు గిర లుచితములన్ 1.

తే.గీ. నీ పలికెడు భీమాసుర నిచయ పట్ట
ణమ్ము లంకను వాయుజ! పమ్మి నాశ
నం బొనర్తును నా వచనమ్ము లెల్ల
సత్యములు సుమ్ము వల్క నసత్యములను 2.

తే.గీ. యుక్తము ముహూర్త మిది జయ మొసఁగు విజయ
మనఁగఁ బరఁగును దిన మధ్యమున వెలింగె
సూర్యుఁ డిప్పుడు సుగ్రీవ! చూడు మింక
మన ప్రయాణ మిప్పట్టునఁ దనరు నట్లు 3.

ఉ. ఎక్కడి కాతఁ డేఁగఁ గలఁ డింతినిఁ దోడ్కొని జానకీ సతిన్
టక్కరి యాలకింపఁగను డాయఁగ నా యరుదెంచు టింపుగం
మిక్కిలి యాశ నూను సెద మేదిని కూఁతురు జీవితమ్ము నన్
మెక్క విషమ్ము నంతమున మేలి సుధం గొని మించి నట్టులన్ 4.

తే.గీ. చూడ నుత్తరా ఫల్గుని నేఁడు హస్త
తోడ గూడును గన సెల్లి తోడ నుంచి
యెల్ల సైన్యము సుగ్రీవ! యింక నేఁగ
నొప్పు మనకు సత్వరముగ నిప్పు డనఘ! 5.

తే.గీ. ఏ నిమిత్తము లిట జనియించు చున్న
వొ కడు ధన్యము లవి యెల్ల నొప్పు చున్న
వి ప్రకటించు నట్టుల నాజి విక్రమించి
చంపి రావణుఁ దెత్తును జానకి నని 6.

కం. అదిరెడు నా నేత్రమ్ముల
విదితం బగుచుండె నాదు విజయం బింకం
బదిలముగ మనోరథ మె
ల్లఁ దడయక లభించు నంచుఁ బ్లవగాధీశా! 7.

ఉ. ఆవలఁ బూజితుండు నయి యార్యుఁడు లక్ష్మణు చేత నింక సు
గ్రీవుని చేతఁ దిగ్గి పలికెం దగ రాముఁడు భాషణమ్ములం
గోవిదుఁ డిట్లు సైన్యమునకున్ మును నీలుఁడు గాంచ దారి తా
నావృతుఁ డేఁగు వానర సహస్ర శతాధిక సంఖ్యలం దగన్ 8.

ఉ. శీతల కాన నాంబువులు శ్రేష్ఠ ఫలమ్ములు మూల రాసు లెం
దాతత ముండు తేనియలు నా గతి నెన్నుచు సేన నింపుగాఁ
బ్రీతిని నీల! నీవు నడపింపుమ యూథప! యాతుధానులే
యే తఱి నైన నాశ మొనరింతురు మూల ఫలాంబు మార్గముల్ 9.

చం. అనయము నుద్యమించి యమ రారుల నుండి సతమ్ము కావ నొ
ప్పును గపి వీర! నీకుఁ బరి పూర్ణము నిమ్నము లందుఁ గానలన్ 10.

వనచరు లెల్ల దుర్గములఁ బన్నుగ గెంతుచు రాక్షసాలి దాఁ
గినఁ బరికింపఁగా వలెను క్షిప్రము చక్కఁగ నప్రమత్తులై

ఆ.వె. బలము లేని వారు కల రేని యిందు వా
రెల్ల రిచట నిల్వుఁ డెవ్వ రైన
ఘోర కృత్యము మనకు నొనరింపఁ గలదు
విక్రమమ్ము నూని విరివి గాను 11.

ఉ. సాగర తుల్య సైన్యమును సన్నుత వానర సింహు లెల్లరున్
బాగుగ పేలు వందలును వానర సేనను జాగ నిండు పే
పేగ కడింది బల్లిదులు వీర వరేణ్యులు విక్రమమ్ముతో
నేఁగఁగ నుద్య మింపు డిపు డెల్లరు యూధప ముఖ్యు లింపుగన్ 12.

తే.గీ. గజుఁడు శైల నికాశుఁడు గవయుఁ డరయ
బల్లిదుండు గవాక్షుఁడు ధ్వజిని కగ్ర
మందుఁ బయనమ్ము కండు మహావృషభము
గర్వమున నాల ముందటఁ గదలు పగిది 13.

ఆ.వె. వానరర్షభుండు ప్లవగుల నాథుండు
ఋషభుఁ డుద్యమించి యేఁగుఁ గాక
ధ్వజిని దక్షిణంపుఁ బార్శ్వముఁ గాపాడు
చుండి యెల్ల కపుల మెండుగాను 14.

ఆ.వె. గంధ హస్తిఁ బోలు గంధమాదనుఁడు మ
హా బలుండు గెలువ నలవి కాని
వాఁడు సైన్య సవ్య పార్శ్వము కాచుచు
నప్రమత్తుఁ డవుచు నాతఁ డేఁగు 15.

కం. బల మధ్యమ్మున నా భుజ
బలుఁడౌ హనుమంతు స్కంధ వర మందున్ నే
నిలిచి యరుదెంతు నలరుప
బలమ్ము నైరావతమున వాసవు భంగిన్ 16.

తే.గీ. సార్వభౌ మేభము పయిన సర్వ భూత
పతి ధనదు భంగి నంతకు పగిది వెలయు
లక్ష్మణుం డంగదుని గూడి రాఁ గలండు
ప్లవగ సేనాంతరమ్మున బల్లిదుండు 17.

తే.గీ. ఋక్షపతి జాంబవంతుఁ డహీన సత్త్వుఁ
డు ప్లవగుఁడు సుషేణుండు పటుతర వాన
రుండు వేగదర్శి హరుల దండు నందుఁ
గుక్షి నడరి రక్షింత్రు ముగ్గురు సతమ్ము 18.

చం. విని రఘు రాము వాక్యములు వృక్షచ రాధిపుఁ డర్క సూనుఁ డం
త నడరి వానరర్షభుఁడు తత్కపి శూరుల నెల్లఁ గాంచి పం
చె నటుల వీర్య వంతులను శీఘ్రమ వానర వర్యు లెల్లరున్
ఘనముగ నుద్గమించిరి స కందర శైల శిఖాలి దూఁకుచున్ 19.

ఆ.వె. పూజ లంది యంతఁ బురుషోత్తముండు సు
గ్రీవ లక్ష్మణు లిడఁ బ్రీతి తోడ
రాముఁ డలరి ధర్మ రతుఁడు స సైన్యము
దక్షిణ దిశ వైపు తరలఁ జాగె 20.

చం. కరి నిభు లైన వానరులు క్రమ్మగ వందలు వేలు కోటులున్
నరవరుఁ డేఁగె రాముఁడు ఘనమ్ముగ హర్షము నంది రా కపుల్
హరిపతి నిత్య పాలితులు నా రఘు వీరుని వెంట నేఁగఁ జా
గిరి నిజ వాహినిం గలసి గెంతుచు వాఁగుచు దూఁకుచున్ వెసన్ 21.

చం. తినుచును మంచి వాసనల తియ్యని తేనె ఫలమ్ము లింపుగన్
ఘన తరు లెల్లఁ గూల్చుచును గాచిన చక్కటి పూల గుత్తులం
దనరుచు నొక్క రొక్కరిని దర్పము తోడుత నెత్తుచున్ వెసం
గని పడ వైచి గెంతుచును గ్రమ్మఱ గూల్చుచు నన్యులం దమిన్ 22.

ఆ.వె. రావణు దశ వక్త్రు రజనీచరుల నెల్ల
సంహరింతు మడరి సమర మందు
మే మని వచియింత్రు భీమ హర్యృషభులు 23.

రాఘవేంద్రు చెంత రంకె లిడుచు

కం. దారినిఁ గల్పించుచు నా
వీరులు ఋషభుఁడు కుముదుఁడు ప్రీతిన్ నీలుం
డైరావత నిభుఁ డరిగిరి
వారి ననుసరింప వేగ ప్లవగు లనేకుల్ 24.

తే.గీ. రాజు సుగ్రీవుఁ డా రామ లక్ష్మణులు ప
రంతపులు ఘన భీమ పరాక్రమ కపి
వీరు లావృతులై యుండ మూరి సేన
కెల్ల మధ్య నిలిచి వేగ యేఁగు చుండ 25.

క. వృతుఁడై పదికోట్ల కపుల
శతవలి హరి వీరుఁ డొకఁడ శాఖామృగ సం
యుత బలము నెల్లఁ దా నా
తతముగ రక్షించు చుండెఁ దరలుచు నుండన్ 26.

ఆ.వె. వంద కోట్ల బలము పరివృత మయి యుండఁ
గేసరి పనసుండు కేలి లీల
గజుఁడు నర్క్కుఁడుం దగ నొక పార్శ్వమ్ము ర
క్షించు చుండి రడరి సేన నపుడు 27.

తే.గీ. ఋక్షము లనేకములు పరివృతము లై చె
లంగ సుగ్రీవు మున్నిడి రమ్యముగను
జాంబవంత సుషేణులు జఘన మెల్లఁ
గాచు చుండిరి సేనా నికాయ మందు 28.

కం. వానర సేనాపతి ఘనుఁ
డా నీలుఁ డెగెరెడి వారి యందు హరి వరుం
డే నగచర సైన్యమ్మును
గానల రక్షించు చుండెఁ గమనీయముగన్ 29.

కం. చనఁ దొడఁగిరి త్వరపఱచుచు 30.

ఘన వానర వాహినిఁ బ్లవగములు ప్రజంఘుం
డును రంభుండు  దరీముఖుఁ
డును రభసుండును సకల తటులఁ గల హరులన్

ఉ. ఏఁగుచు వానరర్షభు లహీన పరాక్రము లంత నింపుగా
నా గిరి సహ్యముం గనిరి యగ్ర్యలతా ద్రుమసంయుతమ్మునున్
బాగుగఁ బూయ పుష్పములు పన్నుగ వెల్గు సరోవరాలితో
నా గిరినిం దటాకములు నందముగా వనరాశి భాసిలన్ 31.

ఆ.వె. ఉగ్ర కోపి రఘుకులోత్తము శాసనం
బరసి భీతి సెలఁగఁ బట్టణముల
జానపదముల విడి సాగరౌఘ నిభ భీ
మబల మొనరిచె పరమస్వనమ్ము 32.

తే.గీ. దాశరథి చెంత శూరులు తద్ద ప్రీతి
నెగురుచుఁ గపికుంజరు లెల్ల రింపుగఁ దర
లిరి సుచోదితాశ్వముల వలెఁ గడు వడి ము
దమ్ము సెలఁగ భృశముగ మనమ్ము లందు 33.

ఆ.వె. మోయు చుండఁగా నమేయ సత్త్వులు కపు
లిరువు రట్లు మించి నర వరులను
రాఘవు లపుడు పెను గ్రహముల తోడ ను
న్న రవి శశుల పగిది పరఁగి రపుడు 34.

ఆ.వె. పూజ లంది ఘనుఁడు పురుషోత్తముండు సు
గ్రీవ లక్ష్మణు లిడఁ బ్రీతి తోడ
రాముఁ డలరి ధర్మ రతుఁడు స సైన్యము
దక్షిణ దిశ వైపు తరలు చుండ 35.

కం. కని రాముని నంగదు భుజ
మున నడరెడు లక్ష్మణుండు మోమున భాసి
ల్ల నగవు ప్రతిభావంతుం
డనె నిట్లర్థ యుతము లగు నంచిత గిరలన్ 36.

చం. అపహృత జానకీ సతిని నన్న! గ్రహింతువు చంపి రావణుం
గపటిని క్షిప్ర మింక నిజ కార్య మొనర్చి సమృద్ధ పట్టణ
మ్ము పురుష పుంగవా! తరలి పూర్ణ ముదమ్మున గాంతు వింపుగన్
విపుల నిమిత్త పుంజములఁ బృథ్విని నింగినిఁ గాంచుచుంటినే 37.

ఉ. నీకు శుభప్రదమ్ము లవి నిత్యము కార్యఫలప్రదమ్ములే
యీ కపి సేన కీయ సుఖ మింపుగ వాయువు వీఁచు చున్నదే
యీ కమనీయ సుస్వరములీ మృగ పక్షు లొసంగు చున్నవే
కాఁక వెలుంగు నిర్మలుఁడు గాంచఁగ దిక్కులు సుప్రసన్నముల్ 38.

చం. విరివిగ బార్గవుం డిపుడు వెల్గుచు నుండెను శుక్రుఁ డుద్ధతిం
దిరుగుచు నీకు వెన్కఁ గడు తేటగ నున్నది బ్రహ్మ రాశియే
యురువుగ నిప్డు సప్త ఋషు లుత్తమ కాంతుల వెల్గు చుంటిరే
పరఁగఁ బ్రదక్షిణమ్ములు ధ్రువ స్థిర తారకు గారవమ్మునన్ 39.

ఆ.వె. శుద్ధ కాంతు లీను చుండెఁ ద్రిశంకు వి
క్ష్వాకు నామ పరమ వంశజులకు
మనకు తాత కూడి తన పురోహితుని రా
జర్షి విమల తరము చదలు నందు 40.

తే.గీ. విమల మగు ప్రకాశమ్మున వెలుఁగు చున్న
దిట విశాఖ నక్షత్రము దివ్యము నిరు
పద్రవముగ మహాత్ములు పార్థివ వరు
లయిన యిక్ష్వాకులకు వర మయిన తార 41.

ఆ.వె. నైరృతమ్ము తార నైరృతులకు నేఁడు
ముట్టఁ బడెను గాంచ మూలవంత
ధూమ కేతు భీమ దోర్వరమ్ముల చేతఁ
బీడకు గురి యయ్యె బెట్టిదముగ 42.

తే.గీ. ఉన్న దిది యెల్ల నసుర వర్యుల వినాశ
నార్థ మంత్య కాలము నందు నసుర తారఁ 43.

గ్రహము పీడించు చున్నది కాలు బారిఁ
బడఁగ రాక్షస గణ మెల్లఁ బుడమి యందు

తే.గీ. విమల తరము లింక రుచిమంతములు నీళ్లు
వనములు ఫలవంతమ్ములు వాయు వరయ
గంధమును గూడి మెల్లగఁ గదలు చుండె
ఋతు కుసుమ సంయుతమ్ములు వృక్ష తతులు 44.

చం. ఉరువుగ నీ మహా కపుల వ్యూఢము భాసిలుచున్న దిత్తఱిన్
సురవర ఘోర సైన్య మని నోఁకునిఁ దారకుఁ జంపు వేళలోఁ
బరఁగిన భంగి నార్య! కని భవ్య నిమిత్తము లెల్ల నింపుగన్
విరివిగ నింక డెందమునఁ బ్రీతికి నర్హుఁడ వౌదు రాఘవా! 45.

తే.గీ. ఆశ్వసించె నిట్లు పలికి యన్న నంత
హృష్టుఁ డా లక్ష్మణుండు నరేంద్ర సుతుని
నావరించి వసుధ నెల్ల హరులు ఋక్ష
వరములు నఖ దంష్ట్రాయుధ వరులు చనిరి 46.

ఉ. వానర పాద బాహువుల పన్నుగ రేఁగిన దుమ్ము కప్పగా
నా నభమున్ జగత్త్రయము నర్కుని కాంతిని నెల్ల నాపుచుం
గానన పర్వతమ్ములను గ్రక్కున దాఁటుచు దక్షిణాశనున్
వానర సేన సాగెను నభమ్మును మేఘము భంగి నిండుచున్ 47.

ఆ.వె. వెడలు చుండ దాఁటి పెక్కు యోజనములు
సేన యాగకుండ నా నదీ జ
లములు పాఱు చుండె రయముగ వెనుకకుఁ
జూచు వారి కట్లు తోఁచు చుండి 48.

తే.గీ. విమల జల సరోవరముల వృక్ష తతి వి
కీర్ణ గిరుల నడుము నుండి క్రింది నుండి
మీదు నుండి సమాన భూమిప్రదేశ
ముల ఫలయుత వనమ్ములఁ బుడమి నెల్ల 49.

ఆ.వె. హరివరేణ్య సేన వ్యాపించి మారుత
తుల్య వేగ మూని తుష్ట వదన
ములను రామకార్యముఁ దలంచి యింపుగ
నేఁగు చుండె నంత వేగముగను 50.

ఆ.వె. యౌవనంపు దర్ప మడర నుద్రేకము
హర్ష మింక బలము హరులు చూపు
చుండి యొకరి కొకరు మెండుగ వింత ధ్వ
ను లొనరింప దొడఁగి రలరి భృశము 51.

ఉ. కొందఱు వేగ పర్విడిరి కొందఱు గెంతిరి కోఁతు లుగ్ర లీ
లం దమి వింతగాఁ గిలకిలధ్వను లింపుగఁ జేయఁ దోఁకలం
గొందఱు కొట్ట నేల కిఁకఁ గొందఱు త్రొక్కిరి నేలఁ గాళ్లతోఁ
గొందఱు నూఁప బాహువులు కొందఱు కూల్చిరి శైల వృక్షముల్ 52.

తే.గీ. కొండ కొనల పై కెక్కిరి కొండ ద్రిమ్మ
రులు ముదమ్మునఁ గొందఱు విలసనమున
గొప్ప ధ్వను లొనరించిరి కొంద ఱింక
సింహ నాదము లన్యులు చిత్రముగను 53.

కం. నలిపిరి నిజోరు వేగము
న లతా పుంజముల భృశము నగచర వర్యుల్
బల విక్రము లాడిరి యా
వులించుచు శిలా ద్రుమవర పుంజము లందున్ 54.

చం. పుడమిని నాక్రమించి హరి పుంగవు లెల్లరు వేలు వందలుం
దడయక కోటు లాగ కెటఁ దద్దయు ఘోరులు రే పవల్ వడిన్
వెడలిరి హృష్ట మానసులు వీరుని సూర్యజు రక్షణమ్మునం
బుడమి కుమార్తె సత్వరపు మోక్షముఁ గోరుచు యుద్ధ రక్తులై 55.

తే.గీ. క్రిక్కిఱియఁగ వృక్షమ్ములు మిక్కిలి చెలఁ
గుచు మృగములు తిరుగు చుండఁ గొండ నంత
సహ్యమును నింక మలయమ్ము శైల రాజ 56.

మును గదిసిరి వా రెల్లరు ముదము మీఱ

కం. కాననములు చిత్రములు మ
హా నదు లింక సెలయేర్ల నరయుచు నంతన్
మానవ వర్యుఁడు రాముం
డా నగముల సహ్యము మలయమ్ముల సేఁగెన్ 57.

తే.గీ. పొగడలను బొట్టుగులను మావుల నశోక
ములను మఱి సిందువారకములను దినిశ
ములఁ దిమిశములఁ గరవీరములను జెట్ల
నెల్ల విఱుచు చుండిరి హరు లేఁగుచుండి 58.

తే.గీ. మఱియు నంకోలములఁ గాన్గు మ్రాను లింక
జువ్వి మఱ్ఱి తిందుకములఁ జూచి జంబు
వు లుసిరికల నీపమ్ముల నలరి చెట్ల
నెల్ల విఱుచు చుండిరి హరు లేఁగుచుండి 59.

ఆ.వె. వివిధ వన తరువులు వీవఁ వాయువు పూల
ను పెదచల్లు చున్నయవి విరివిగ
నందమైన ఱాల హరివరేణ్యుల పైన
గాలి చల్ల నయ్యెఁ గంధము వలె 60.

చం. వనములఁ దేనె వాసనలఁ బన్నుగఁ గూయుచు నుండెఁ దుమ్మెదల్
ఘనముగ ధాతు పుంజములఁ గాంతుల నీనుచు నుండె శైలముల్
వనచర సేన పై నచటఁ బర్వత ధాతుజ ధూళి గాలి చే
త నడరఁ జక్కఁ గప్పఁబడె దండిగ నెల్లెడ లందు వింతగన్ 61.

సీ. కొండ నెత్తము లందు మెండుగ నెల్లెడఁ బూసి వెలుఁగు చుండె భూజ రాశి
కేతకీ సిందువా రాతత రమ్య వాసంతులు మాధవీ చారు లతలు
మంచి వాసన లీను మల్లె తీగలు నింకఁ జిరిబిల్వములు నిప్పచెట్ల గములు
వంజుల స్ఫూర్జక వకుళ స తిలకమ్ము లిద్ధ నాగ తరులు నెల్లఁ దనరఁ

తే.గీ. జూత పాటలీ స కుసుమ వ్రాత కోవి
దార ముచులింద శింశుప తరు సమూహ 62.

కుటజ శాల్మ లార్జున తరు కురవ కారు
ణములు ధవ వృక్ష సంచయ నగ వరములు

తే.గీ. గిఱక తాడులు తినిశము లఱుదుగఁ గనఁ
బడెడు చూర్ణక తరులు దీపక వరణము
లింకఁ బద్మ కాంకోలము లీ ప్లవగులు
నీలము లశోకములఁ గూడి చాల గనిరి 63.

ఉ. వాపులు శీత లాంబువుల పల్వము లున్నవి పర్వతమ్ముపై
నేపునఁ దిర్గు చుండఁగను నింపగు పక్షులు చక్రవాకముల్
దోఁపఁగఁ గన్నె లేళ్లు నట దూఁకఁ బ్లవమ్ములు సాగఁ గ్రౌంచముల్
దాపుల నా వరాహ మృగ తండము లింపుగ సంచరింపఁగా 64.

తే.గీ. ఋక్ష శార్దూల సింహ తరక్షులు భయ
దములు వ్యాల రాజము లనేకములు దనర
ఫుల్ల గంధ పద్మ కుముదమ్ములు జలాశ
యమ్ము లుత్పలములు వెలయంగ నడరు 65.

చం. వివిధములౌ విహంగములు ప్రీతినిఁ గూయును శైలసానులం
బ్లవగము లాడి స్నానము జలమ్ములు ద్రాగుచు నాడి నీటిలో
నవి నగ మెక్కి హర్షమున నంతఁ బరస్పర మార్చి దద్పు కొం
చు వన విహారమే చలుపుచున్ వెస నేఁగ దొడంగి రెల్లరున్ 66.

ఆ.వె. తివిరి బల మదమునఁ దియ్యని వాసన
లీను పండ్ల నింక వృక్షమూల
ములఁ గుసుమములను హరు లట భంజించుచు
వెడలఁ జాగి రంత వేగముగను 67.

కం. తూము బరువు తూఁగెడు శా
ఖామృగములు తేనె రంగు కలవా రచ్చో
నా మానుల వ్రేలాడెడు
నా మంచి మధువును గ్రోలి రానందముగా 68.

తే.గీ. విఱుచుచు హరి వరేణ్యులు వృక్షములను
లాగుచుం ద్రెంచి బలిమిని లతల నెల్ల
విసిరి వైచుచు కొండల వింతగాను
వీర్య దర్పమ్ముఁ జూపుచు వెడలిరి వడి 69.

తే.గీ. త్రాగి తేనె తృప్తిల్లి కొండ అఱచి రగ
ముల పయి నిలిచి పాదపములఁ గదిసిరి
కొంద అంతఁ దమిని మఱి కొందఱు హరు
లు పడు చుండిరి వృక్షముల పయి నుండి 70.

కం. ధర నిండెను సంపూర్ణము
హరి సైన్యము తోడఁ బండి నట్టి వరి వసుం
ధరఁ జెలఁగిన భంగి నపుడు
త్వరిత గతి ముదమ్ము తోడఁ దరలుచు నుండన్ 71.

ఉ. అంత మహేంద్ర పర్వతము నంబుజ నేత్రుఁడు సేర రాఘవుం
డెంతయు వేడ్క నెక్కి శిఖ రేంద్రము పాదప భూషితమ్మునున్
సాంతము కూర్మ మీన నిచ యావృత వార్ధినిఁ గాంచె నింపుగా
సుంత గతించి సహ్య గిరి సుందర మా మలయమ్ము నెల్లరున్ 72.

ఆ.వె. క్రమముగ హరి వరులు కదిసిరి భీమ ని
స్వన సముద్ర మంతఁ బర్వతమ్ము
రాముఁడు ముద మిడు నర వరుల శ్రేష్ఠుఁడు
దిగి తటి వనమును గదిసెను వేగ 73.

తే.గీ. అనుజ సుగ్రీవులు తనను ననుసరింప
నుర్థి తోదక ధౌత శిలోత్తమ తల
వేల విపులము రాముఁడు వేగ సేరి
పల్కె వారితో నివ్విధి భాషణములు 74.

తే.గీ. చేరు కొంటిమి సుగ్రీవ వారి రాశి
నిప్డు చింతింపఁ దగు మన కింక మున్ను
తలఁచి నట్టి దాని నిట సత్వరము జాఁగు 75.

సేయక యరయ నొప్పు నుపాయ మడరి

కం. తీరము లేదు నదీపతి
కారయఁ గడలికిఁ దలంప నరయ కుపాయం
బేరికి దాఁట నశక్యము
పారావారమ్ము నెట్టి భంగిని సైనన్ 76.

కం. విడిసెద మిచ్చట మంత్రము
లడరి కడింది దలపోయ నర్హము మనకుం
గడలిని దాఁటించి సుగతి
వడిఁ జేర్పఁగ నావలి తటి వానర బలమున్ 77.

చం. విరివిగ జానకీ హరణ పీడితుఁ డంబుధిఁ జేరి పంచి నా
హరిగణ సేన నంతటిని నచ్చట నిల్పుఁ డటంచుఁ బల్కె నా
హరిపతిఁ గాంచి చేరితిమి యబ్ధిని దాఁటు నుపాయ మెంచఁగా
గురుతర మంత్ర కాల మిది గూఢముగా నొనరింప మే లగున్ 78.

చం. తమ తమ సేన వీడి కడు ధైర్యముతోఁ జన నొప్ప దేరికిన్
క్రమమున శూర వానరులు కన్గొన నొప్పు భయమ్ము దాఁగి యుం
డ మనకు నిచ్చ టెద్దియును డగ్గఱ నా విని లక్ష్మ ణార్కజుల్
ద్రుమ యుత వార్ధి తీరమునఁ దూర్ణము నిల్పిరి సేన నింపుగన్ 79.

కం. తేనె తెలుపు రంగులతో
వానర సైన్యము వెలింగె వారిధి వేలం
గానఁగ రెండవ దైన మ
హా నీరధి సన్నిభముగ నడరుచు నచటన్ 80.

తే.గీ. చేరి వేలా వనము కపి శ్రేష్ఠు లెల్ల
నపర పారము వీక్షింప నత్యధికము
గా నెడఁదలఁ గాంక్షించుచుఁ గడలి దాఁటి
నిలిచి రుత్సాహమున బల్లిదులు మురియుచు 81.

కం. నిలిచిన సైన్య మహా స్వన 82.

ములు సెలరేఁగ భృశముగ సముద్ర నినాద
మ్ములు మఱుఁగునం బడెను వీ
నుల కందక చిత్రముగ ఘనులు కూయంగన్

ఉ. వానర సేన వార్ధిఁ దటిఁ బన్నుగ నిల్చెను ముప్విధమ్ములన్
మానవ వర్యు రాఘవుని మాన్యుని కార్యము సేయ నెంచుచున్
వానరు లెల్లఁ గాంచి యట వాయు రయమ్మునఁ బొంగు నట్టి యా
మీన మహాకరమ్మును నమేయ ముదమ్మునఁ బొంగి రత్తఱిన్ 83.

తే.గీ. రాక్షస గణ ముండ నిఱు కరయని యట్టి
కడలి యావలి యొడ్డును గాంచు చుండి
నిలిచిరి వరుణాలయమును నెమ్మిఁ గనుచు
ప్లవగ యూథపు లెల్లరు  రమ్యముగను 84.

ఆ.వె. దినపు టంత మందును నిసి కాదిని ఘోర
ములగు నండజములు మొసళు లడర
నురుఁగు గముల తోడఁ గరము నవ్వి నటుల
నలల గెంతి నటుల నబ్ధి సెలఁగె 85.

తే.గీ. చంద్రుఁ డుదయింప నుప్పొంగఁ జంద్ర బింబ
ముండఁ దన యుదకమ్మున నుగ్ర వాయు
సన్నిభ గ్రాహముల తోడ సంద్ర మడరె
తిమి తిమింగిలములు లోనఁ దిరుగు చుండ 86.

చం. జ్వలిత సుభోగ సంయుత భుజంగమ సత్త్వ నికాయ సంవృ తా
మల జలరాశి శైల చయ మండిత దుర్గమ మార్గ హీనమౌ
నిలయము రాక్ష సావలికి నిత్య మగాధము నక్రముల్ మహా
నిల చలితమ్ములై యెగిరి నింగికి శీఘ్రము కూలుచుండఁగన్ 87.

తే.గీ. పొంగిన జలరాశి చన నిప్పు పొడి పరిఢ
విల్లిన పగిది నిత్యము వెల్గు చుండి
నీటి పాములు నీరధి నిండి యుండ
నసుర పురము పాతాళ గృహమ్ము జలధి 88.

తే.గీ. సాగరం బభ్ర సదృశమ్ము చదలు కడలి
సన్నిభమ్ము భేద మరయ జాల మెందు
జల మయము నింగి నభ ముండు జలము నందుఁ
దార లుండఁ బైన మణి రత్నములు క్రింద 89.

తే.గీ. ఎగయు నట్టి మేఘమ్ముల గగన ముండ
నలల మాలలతో నిండ నర్ణవమ్ము
కాన రాదు విశేషమ్ము గగనమునకుఁ
గడలికిని లేశ మంత యక్కజము గాంచ 90.

కం. కెరటము లన్యోన్యమ్ముల
నురువుగఁ గొట్టుకొను చుండ నుదధి నడరుచుం
బరఁగె రవమ్ములు రణమున
గురు భేరుల ధ్వను లనంగ ఘోరతరముగన్ 91.

తే.గీ. చూచి రుత్సాహులు ప్లవగ శూరు లబ్ధి
వాయు సక్త రత్నౌఘోద కాయతస్వ
న విలసితమును సంక్రుద్ధ నక్ర మీన
ముఖ జలచ రావృతమ్ము సముఖము నందు 92.

తే.గీ. గాలికి చెదరి నట్టి భంగమ్ముల నిన
దమ్ము లడరు చుండఁగ మారుత హత వారి
రాశి కంపించు విధ ముండఁ బ్లవగ వృషభు
లరసి విస్మయ మందిరి యాత్మ లందు 93.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నాలుగవ సర్గము.

## యుద్ధ కాండము

# సర్గము 5.

వానర వాహిని దక్షిణ సముద్ర పుటుత్తర తీరమున విడిసి యుండ సీతను దలఁచుకొనుచు రాముఁడు వగచుచుండ లక్ష్మణుఁడు తగ నూఱడింపఁగ సూర్యాస్తమయ మగుట.

కం. నీల సురక్షిత వాహిని
మేలుగ నుంచఁ బడె నాజ్ఞ మేరకు నా మీ
నాలయపు టుత్తర తటినిఁ
గోలాహల మేర్పడంగఁ గోఁతుల మూఁకన్ 1.

కం. ఇరువురు మైందద్వివిదులు
హరి పుంగవులు దళ రక్ష ణార్థంబు తగం
దిరుగుచు నెల్ల దిశలఁ గా
పరులై తనరారి రపుడు ప్లవగుల కెల్లన్ 2.

తే.గీ. నద నదీపతి తీరమ్మున నిలువంగ
సేన లక్ష్మణుండు తనదు చెంత నిలువఁ
గాంచి రాముఁడు పల్కెను మించి నట్టి
శోకమున నీ వచనములు శూర వరుఁడు 3.

చం. కడవఁగ లక్ష్మణా వసుధఁ గాలము శోకము తగ్గు నందురే
యడరుచు నుండెనే యహరహమ్మును దుఃఖము నాకు మిక్కిలిం
బుడమి కుమార్తెఁ గాన కెద ముగ్ధను గాంతను జానకీ సతిం
బడఁతి తలంపులే మదిని వర్ధిలు చుండఁగ సంతతమ్మునున్ 4.

తే.గీ. దూర మందుండఁగఁ బ్రియ లేదు వగ నాకు
నపహృత యయి నందులకును నరయ వగపు
ప్రాయము గతించు చుండెను బడఁతి కకట
దాని నెంచుచుఁ జింతింతు నేను భృశము 5.

ఆ.వె. వాయు దేవ యేఁగి వైదేహి యున్నెడ
కంటి యామె నన్ను నంటు మయ్య 6.

చంద్రు వలన దృష్టిఁ జక్క నీ వలన స్ప
ర్శను బడయుదు నెమ్మిఁ గనుమ దయను

తే.గీ. తస్కరింపఁబడు తఱి నాథా యని నను
బిలిచి యేమి నుడివెనొ యాపలుకు లాత్మఁ
జింత సేయ విషము నింత వింత గ్రోలి
నట్టులు దహించు చున్నవి యంగములను 7.

తే.గీ. ఇంధనమ్ము కాఁగ వియోగ మింకఁ జింత
కాఁగఁ బెనుమంటలు సెలఁగి కాల్చుచున్న
దెల్ల దేహము మద నాగ్ని తల్లడిల్ల
డెంద మెల్ల రేపవళులు కుందుచుంటి 8.

కం. మునిఁగి మహాంబుధి సౌమి
త్రి! నిన్ను వీడి తివిరి నిదురింపఁగ నెబ్బం
గిని జ్వలిత కామము దహిం
ప నేర్చు సుఖ సుప్తు నన్ను బరికింపంగన్ 9.

తే.గీ. నిజము కామాతురుండను నేను నింకఁ
జారులోచన వామోరు జనక తనయ
యొక్క నేలపయిఁ బరుండు నొక్క కార
ణమున బ్రతికి యుంటిని నేను విమల చరిత! 10.

కం. నీరము లేని వరి సరస
నీరున్న వరి వలనఁ గడు నెగడు విధమునన్
నారి బ్రతికున్న దని విని
మూరి బ్రతుకుచుంటి నేను బొలఁతినిఁ గాంచన్ 11.

కం. ఎన్నఁడు వీక్షింపఁగ నగు
నన్నలిన దళాక్షి నాకు నా సుశ్రోణిన్
మిన్నగ నే సమరమ్మున
గ్రన్నన నోడించి రిపుల రమణీయముగా 12.

కం. ఎన్నం డా పద్మానన
జెన్నగు బింబాధరమును శ్రేష్ఠ రసమ్ముం
బన్నుగ గ్రోలుదు మందును
గొన్న మహా రోగి భంగిఁ గొంచెం బైనన్ 13.

కం. ఎన్నండు కౌఁగిలించును
నన్నా నలినాక్షి స్వస్తనమ్ములఁ దగఁ పీ
నోన్నత తాలఫలమ్ముల
చెన్నలరఁగ సంతసమ్ము సెలఁగ భృశముగన్ 14.

తే.గీ. తప్పక యసితాపాంగి యా ధరణిజ యటఁ
జిక్కి రాక్షసులకు మధ్య చింత మీఱ
నిలువ నాథుఁడ నున్నను నే ననాథ
భంగిఁ గాంచదు రక్షక వరుని సీత 15.

ఆ.వె. అకట యెట్లు జనకు నాత్మజ నాకు ద
యిత దశరథు కోడ లీ యసుర గ
ణమ్ము మధ్య నిశల నాతుక శయనింప
నేర్చుఁ గలఁత తోడ నీరజాక్షి 16.

ఆ.వె. పాఱఁదోల రాని భైరవ రాక్షస
గణముఁ ద్రోసి వేగ కాంత యెన్నఁ
డరుగుదెంచు నలుపు టంబుదములఁ ద్రోయు
శారద నిశ లందుఁ జంద్రు భంగి 17.

కం. ప్రకృతిన్ సన్నము జానకి
యకట వగపుఁ గారణమున నన్నము దా నిం
చుక గైకొనమి మఱియు దే
శ కాలవిపరీతములను సన్నము పెరుఁగున్ 18.

ఉ. ఎన్నఁడు రాక్షసేంద్రు నెద నిద్ధ శరమ్ములు నాటి తెత్తు నే
నన్నలినాక్షి జానకిని నాత్మ విచారముఁ బాపువాఁడనో
యెన్నఁడు కౌఁగిలించు నను నీ లలితాంగి విశుద్ధ సాధ్వియుం 19.

గన్నుల రాల్చు సంతసపుఁ గంటి జలమ్ము్మను శోక హీనయై

తే.గీ. ఎలమి మాసిన బట్టల నెల్ల వీడి
నట్లు సీతా సతీ విరహంపు వగపుఁ
నెల్లఁ జెలరేఁగి శీఘ్రము యే పగిదిని
ఘోర మైనట్టి దీనినిఁ గూల్ప నేర్తు 20.

ఆ.వె. ఇవ్విధి విలపింప నీ రఘురాముఁడు
ధీ వరుండు గడవ దినము మంద
గించి సూర్యుఁ డస్తమించెను రాఘువు
శోక మణఁగు నంచు వీఁక నుడువ 21.

కం. అనుజుం డూఱట నీయఁగ
ఘనుఁ డా రాముం డెడందఁ గాంతఁ దలఁచుచున్
జనకాత్మజ నంతట వా
ర్చెను సంధ్యను వ్యాకులుఁడు నృశేఖరుఁడు తమిన్ 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నేనవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 6.

హనుమంతుఁడు లంకలోఁ జేసిన ఘోర కార్యమును గాంచి రావణుఁడు సిగ్గుతో ముఖము వంచికొని రాక్షసు లందఱితో రాముని నుండి రాఁగల ముప్పు నెదురుకొనుటకు మంత్రము లాలోచింపుఁ డని పల్కుట.

కం. కని హనుమంతుం డొనరిం
చిన కార్యము ఘోరమును విశేష భయదమున్
ఘన లంక నింద్రు వలెఁ బ 1.

ల్కెను రావణుఁ డసురలఁ గని రేఁగ బిడియమే

తే.గీ. ముఖము వంచి తా నివ్విధముగ గిరలను
జేరె లంక దహించెను మూరి దుస్త
రమును వానర మాత్రుఁ డరసెను సీత
జానకీసతి నాతఁడు శంక లేక 2.

ఉ. ఆలయ కోటి ధర్షితము లయ్యె నహో హనుమంతుచే వెసన్
పే లయ మైరి రాక్షసులు భీకర యోధులు వాని చేతసే
కాలెను లంక మిక్కుటముగం గపి వీరుని చేష్టలం గటా
మేలుగఁ జింత సేయ వలె మీరలు మేలు నొసంగు కార్యముల్ 3.

తే.గీ. భద్ర మగు మీకు రాక్షస వర్యులు! వచి
యింపు డేమి జేయఁగ నొప్పు నింక నేను
బల్కుఁడు పిదపఁ జేసెడు పనిని మే లొ
సంగు నట్టి దానిని నాకుఁ జక్కఁగాను 4.

ఆ.వె. మూల మందురు జయమునకు నాలోచన
మార్య వరులు కాన నసుర వరులు!
సత్వవంత ధీర చరితులు! తగు మంత్ర
మును దలఁపుడు రాఘవుని కయి వెస 5.

ఉ. ఉందురు మాన వావలిని నుర్విని నుత్తమ మధ్య మాధముల్
విందుము మూడు భంగులను భేదము లింపుగ వారి యందు నే
నందఱు నప్రమత్తత మహాత్ములు సొంతము నాలకింపుఁ డా
చందము రాక్ష సోత్తములు! స్పష్టముగా వచియింప నిత్తఱిన్ 6.

ఉ. హితమును గోరు మంత్రులను నెంతో సమర్థుల మంత్ర వేత్తలన్
హితులను బంధు మిత్రులను నేక హితైషుల సంప్రదించి దే
వతలను నమ్మి యత్న మునఁ బన్నుగఁ గార్యము లందు మగ్నుఁడై
మతి నిడి చేయఁగాఁ దొడఁగు మానవు నుత్తము డందు రిద్దరన్ 7.

ఆ.వె. ఒక్క కార్య మందు నొక్కఁడు తలఁపుంచి 8.

ఒక్క ధర్మ మందుఁ జక్క మనసు
నుంచి చేయఁ బనుల నొక్కండు వాని నం
దు రిల మధ్యముఁ డని పురుష వరులు

కం. ఎంచక గుణ దోషమ్ముల
నుంచక మతి ధర్మ మందు నుచితపు భంగిన్
మంచిగఁ దప్పక చేయుదు
నంచు నుపేక్షించిన నరుఁ డధముఁ డగు ధరన్ 9.

ఆ.వె. ఒప్పుగఁ బరికింప నుత్తమాధమ మధ్య
ములు పరఁగు విధమ్ము కలవు మంత్ర
ణముల యందు నుత్తమములు మధ్యమములు
నధమము లన మూడు విధము లవని 10.

ఆ.వె. శాస్త్ర దృష్టి నరసి చక్కగ నాలోచ
నముల మంత్రు లెల్ల నైపుణమున
నైకమత్య మూని వీఁకఁ జేసిన మంత్ర
ముత్తమమ్ము నాఁగ నుర్విఁ జెలఁగు 11.

ఆ.వె. వివిధము లయి నట్టి పెక్కు లభిప్రాయ
ము లొదవినను మంత్రములు జరిపెడు
వేళ నిర్ణయమునఁ బిదప నేకత మర
యంగ మధ్యమ మని యంద్రు దాని 12.

కం. తలఁచుచు నొక్కొక్కరి మత
మల వాదించుచు భృశ మొక యాలోచనమే
కలుగనిచో మేలుగ విబు
ధు లందు రధమ మని దాని దూషిత మనుచున్ 13.

తే.గీ. కాన మంత్రి పుంగవు లార! కానఁగ మతి
మంతులం దుత్తములు మీరు చింత సేసి
యొక్క మంత్రము నాకిఁక నొప్పుగ నొన
రింపఁ దగు కార్యమును జెప్పుఁ డింపు కొలుప 14.

ఉ. వేల కొలంది వానరులు వీర వరేణ్యులు చుట్టు నుండఁగా
నాలము సేయ లంకకు రయమ్మున వచ్చుఁ దరింప భీమ మీ
నాలయమున్ సమర్థుఁడు నిజానుజ వానర కోటి తోడుతన్
మేలుగ యుక్త రూపమున మించి బలమ్మున నిశ్చయమ్ముగన్ 15.

తే.గీ. కడలి నెండించియు నితర కార్యమున న
యినను వానరులం గూడి యింకఁ జేర
నిట్లు సేనకు లంకకు నెల్ల హితము
గూర్చు మంత్రము దలఁపఁ దగు నిట మీకు 16.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నాఱవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 7.

రావణుని మాటలను విని రాక్షసు లెల్లరు రావణు వీరత్వ మభివర్ణించి రాముని తోడ వానర సైన్యము నెల్ల నిర్జింప నింద్రజిత్తుఁ డొక్కఁడు చాలు నని దర్పాలాపములు పల్కుట.

చం. విని యసురేంద్రు వాక్యములు భీమబ లాసురు లంద ఱంత ని
ట్లనిరి మొగిడ్చి చేతులు దశానను తోడ విపక్ష వీర్య మె
ల్ల నెఱుఁగ కుండ నీతినిఁ దలంపక బుద్ధి విహీనులై ధృతిన్
ఘనముగ దర్ప మూని దశకంఠున కీయ ముదమ్ము పేర్మినిన్ 1.

తే.గీ. పరిఘ శక్తి ఋష్టి సశూల పట్ట సాయు
దమ్ము లుండ మనకు మిక్కుటమ్ముగ నసు
రేంద్ర! సుమహా బలం బుండ నేల చింత
నెందు దీ విప్విధ మసురు లంద ఱుండ 2.

తే.గీ. అరిగి భోగవతీ పుర మహుల నెల్ల
నీవు నిర్జించి తింపుగ నీదు బలిమి
ధనదు కైలాస శిఖరమున నివసించు
యక్ష నాథు జయించితి వద్ధ్బ తాజి 3.

తే.గీ. విశ్వనాథు మైత్రి దలంచి విజ్ఞవీఁగు
లోకపాలుఁ డతి బలుండు రోష మూని
సమర మొనరింప నీవు భృశమ్ముగ వశుఁ
డయ్యె నీకు సత్త్వ ముడుగ నా ధనదుఁడు 4.

కం. కూలిచి యక్షౌఘమ్మును
దూలఁగఁ జేసి చెఱ నుంచి తూర్ణము వారిం
గైలాస శిఖర మందలి
యా లలిత విమాన రత్న మందితి కాదే 5.

ఆ.వె. మైత్రిఁ గోరె నడలి మయుఁడు నీ తోడ దా
నవ వరేణ్యుఁ డతఁడు నందన నిడె
నీకుఁ బత్ని కాఁగ నిర్జర దమనుండ!
ప్రమద మెసఁగ నెడఁద రాక్షసేంద్ర! 6.

ఆ.వె. దానవేంద్రు మధువుఁ దర్జించి బలదర్పి
తుని దురాసదు ననిఁ గొనఁగ నీదు
వశమున నతఁ డంత భార్యగఁ గుంభీన
సను గ్రహించి సుఖముల నిడు చుండె 7.

కం. ఆసఁ జని రసాతలమున
కా సమరమ్మున జయింప నహులను నీకున్
వాసుకి తక్షక శంఖ జ
టీ సర్పమ్ములు వశులు పటిమ తనరారన్ 8.

ఉ. దానవ శూరు లక్షయులు తద్దయు బల్లిదు లొక్క యేఁడుగా
మానుగఁ జేసి యుద్ధమును మాయలు నింక వరమ్ము లుండినన్ 9.

దానవు లెల్ల నీదు వశతం బడి యుండిరి వారి మాయలన్
దాన మొసంగి రింపుగను ద్వద్పల మట్టిది రాక్షసేశ్వరా!

చం. రణమున లోకపాలకుల రాక్షసనాథ! జయించి తింద్రుతో
క్షణమున దేవ లోకము సుఖమ్ముగఁ జేరి బలమ్ము తోడ వా
రుణుల మహా బలాన్వితుల రోషము నూని మహాభుజుండ నీ
వణఁచితి భండనమ్మున మహా చతురంగ బలప్రసిద్ధులన్ 10.

చం. ఘన మగు మృత్యు దండ మను గ్రాహము శాల్మలి లంక వెల్గఁగాఁ
దనరఁగఁ గాల పాశ మను తద్ద తరంగము కాల కింక రా
హి నిచయ భాసితమ్మున యమేద్ధ బలార్ణవ మందు ముగ్ని నీ
వనుపమ మైనదౌ జయము పన్నుగఁ బొందితి మృత్యు వాపితే 11.

కం. ఇంపును బడసిరి యెల్లరు
నింపగు నీ సంగర మసు రేంద్ర!యచట నీ
క్షింపఁగ లోకు లెడందల
సంపూర్ణముగ భయదంపు శమనుని జగతిన్ 12.

తే.గీ. కలరు వీరు లనేకులు క్షత్రియులు పు
రందర సమ విక్రము లిల రాక్షసేంద్ర!
వృక్ష రాజముల పగిది వీరి కెల్ల
సముఁడు కాఁ డెన్న రాముఁడు సమర మందు 13.

ఆ.వె. వార లెల్ల రెంచఁ బరమ దుర్జయు లేరి
కైన రణము నందు నట్టి వారి
ని నవలీల నీవు నిర్జించితివి మించి
రాముఁ డనఁగ నెంత రాక్షసేంద్ర! 14.

చం. నిలువుము రాజ! యేల శ్రమ నీకు వనేచర కోటి నొక్కఁ డీ
బలుఁడగు నింద్రజి త్తసుర వర్యుఁడు చంపఁ గలండు లీలగా
సలలిత రీతిఁ జేసి క్రతు సంచయ మీశ్వరు నెంచి తా వర
మ్ము లడరి దుర్లభమ్ములను బొందెను నీ తనయుండు రాడ్వరా! 15.

సీ. శక్తి తోమరములు చారు మీనములు కాఁ గీర్వాంత్రములు నాచు క్రియ సెలంగ
గజములు కచ్ఛప కరణి మెఱయ నశ్వములు కప్పల పగిదిఁ జెలఁగు చుండ
రుద్రులు నాదిత్యులు మకర వ్రాతము కా మరుద్వసువులు కాఁగ ఫణులు
రథ గజాశ్వము లడరంగఁ దోయౌఘమ్ము వోలె భట చయము పులిన రీతి
ఆ.వె. నున్న దేవ సంచ యోగ్ర బలం బను
నుదధిఁ దూఱి రాక్షసోత్తముండు
వాసవు సుర విభుని బంధించి తెచ్చి లం
కా పురమున నుంచెఁ గార లోన 16.

కం. విడువఁ బడి పితామహుఁ డే
నుడువఁగ సుర పూజ్యుఁడు సనెను దివికి వడి నిం
ద్రుఁడు నగ రిపుండు నమరేం
ద్రుఁ డంత రాజేంద్ర! నీ సుతుఁ డజేయుండే 17.

ఆ.వె. పంపు మింద్ర జిత్తుఁ బన్నుగ నీ తన
యుని సమస్త వాన రోత్కరమును
రాముని సహితమ్ము రయమునఁ బంపును
యమ సదనమున కసు రాధినేత! 18.

కం. చనుదెంచె నొక్క పామర
జను నుండి యయుక్త మైన సంకట మిట్లున్
మనమున నుంచకు దీనిని
యినకుల రాముని వధింతు వెలమిన్ లీలన్ 19.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నేడవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 8.

రావణుని సభలో నున్న ప్రహస్తుఁడు మున్నగు రాక్షస వీరులు తమ తమ బలమ్ముల‌ను వర్ణించుచు రాముని స సైన్యము హతమార్పఁ గల మని భయము వలదని రాక్షసేశ్వరునకు ధైర్యము సమకూర్చుట.

కం. పలికెఁ బ్రహస్తుఁ డసుర ప్రాం
జలి నీలాభ్ర సదృశుండు సైన్యాధ్యక్షుం
డు లలిత రీతిని వాక్య
మ్ములు శూరుం డడరి యిట్లు మోద మొసంగన్ 1.

తే.గీ. దేవ దానవ గంధర్వు లీ వసుధ స
పన్నగ పిశాచ సంచయ పతగ తతులు
నిన్ను భయపెట్టఁగ నశక్యు లన్న నింక
వానరులఁ జెప్ప నేలొకొ భండనమున 2.

ఆ.వె. అందఱును బ్రమత్తులై యుండి యింక న
మ్మకము నుంచి యెదల మసల హనుమ
మోసపుచ్చె మనలఁ బుడమి నే జీవింపఁ
బ్రాణ మూని చనునె వానరుండు 3.

చం. కడళులఁ గూడి నట్టి స నగవ్రజ కానన సర్వ భూమి లం
దడరి యవానరమ్ముగ నిజైక బలమ్మునఁ జేయు వాఁడనే
కడఁగి దశాస్య! నా కిడుమ క్రన్నన నాజ్ఞను జేయ నవ్విధిం
గడపెద నీదు చింత కపి కాయము నుండి సురక్ష నిచ్చెదన్ 4.

ఆ.వె. వెఱవ నేల నీకు స్వీయాపరాధజ
దుఃఖ మింత యేని తొడర దింక
నన విని కడు క్రుద్ధుఁ డయి దుర్ముఖుఁడు వల్కె
రయమున గిర లిట్లు రాక్షసుండు 5.

తే.గీ. ఇప్పరాభవమ్ము మనకు నెల్ల నెన్నఁ
డు క్షమియింపరానిది గాంచుఁడు మఱి యంతి
పురమునకుఁ బురమునకు నసుర విభునకుఁ
గూడ వానరుండు సెలఁగి కీడు సేసె 6.

ఉ. ఇప్పుడ యీ ముహూర్తమున నేఁగి వధింతును నేన భీతి వా
రప్పుల దాఁగి రేని మఱి యంబర మందు రసాతలమ్మునం
దప్పక మించి యొక్కఁడను దద్దయు రోషము నూని పల్కఁగా
నప్పుడు వజ్రదంష్ట్రుఁడు మహా పరిఘమ్మును బట్టి క్రుద్ధుఁడై 7.

తే.గీ. హనుమతోఁ బని యెయ్యది యతఁడు కనిక
రమున కర్షుఁడ దీనుఁడు రాముఁ డుండ
నుదరి లక్ష్మణ సుగ్రీవు లుండఁ జెంతఁ
గడు దురాసదుఁడు రిపు నికాయమునకు 8.

ఆ.వె. నేఁడ క్షోభ పఱచి నేన వానరసేనఁ
బరిఘ మూని యొకఁడఁ బంత మూని
చొత్తు నిటకు వేగ సుగ్రీవ లక్ష్మణు
ల సహితమ్ము చంపి రాము నాజి 9.

తే.గీ. రాజ! వినుమ యిష్ట మయిన రాక్షసేంద్ర!
నాదు మఱి యొక్క వాక్యము నైపుణుం డ
యిన నుపాయము లందు జయించు రిపుల
నేమఱని వాఁడు నిక్కము నెంచి చూడ 10.

ఉ. కోరిన రూప మూనఁ గల ఘోర బలాఢ్యులు భీమ దర్శనుల్
శూరులు వేల రాక్షసులు సుందర మానవ రూప ధారులై
యా రఘు వీరుఁ జేరి తగ నాతని తోడ వచింపఁగాఁ దగున్
ధీరులు వీడి సంభ్రమము దిట్టతనమ్మునఁ బల్కు లివ్విధిన్ 11.

ఉ. వచ్చితి మెల్ల నీ యనుఁగు భ్రాతయె పంపఁగ రాఘువేశ్వరా!
వచ్చును సేన తోడ వడిఁ బన్నుగ నా భరతుండు నంచు మే
మిచ్చట నుండి రాజ! వడి నేగెద మెల్లర మూని శూలముల్
హెచ్చుగఁ జాప బాణములు నింక గదా కరవాల శక్తులన్ 12.

కం. గగనమున గుంపులుగ నిలి
చి గురుత రాశ్మాస్త్రముల యశేషపు వృష్టిం 13.

దగఁ గురిసి కోఁతి మూఁకలఁ
దెగటార్చి యనిపెదము యము ధిష్ణ్యమ్ము నకున్

ఆ.వె. ఇవ్విధముగఁ గదియ నవ్వీరులను రామ
లక్ష్మణుల నిరువుర రఘు తనయుల
నడరి వంచనమున నందుఁ దగిలి వారు
జీవితమును వగఁ ద్యజింత్రు నిజము 14.

ఆ.వె. అంతఁ గుంభకర్ణు నాత్మజుండు నికుంభుఁ
డలుక వీరవర్యుఁ డారసి తగ
రావణు ననె లోక రావణు వాక్యమ్ము
లిట్లు దర్ప మడర నెలమి మీఱ 15.

ఉ. ఈ వర రాక్షసేంద్రు కడ నింపుగ నిల్వుఁడు మీర లెల్లరున్
రా వల దేఁగి యొక్కఁడను రాముని లక్ష్మణు నింక రాజు సు
గ్రీవుని మారుతిం గపుల శ్రేణిని రేఁగి వధింతు నెల్లరన్
వావిరియై చెలంగ నెదఁ బంతము నేను రణాంతరమ్మునన్ 16.

ఆ.వె. పర్వత సదృశుండు వజ్రహను వను రా
క్షస వరుండు కినిసి కరము నాకు
చు నధరాంతములను ఘనజిహ్వ తోడఁ దాఁ
బలికె నిట్టు లంత వాక్యములను 17.

తే.గీ. విచ్చలవిడి మీ పనులను వీడి జ్వరము
సేయ నర్థులు సేన భక్షింతు నెల్ల
ప్లవగ యూథపుల నడరి స్వస్థు లగుచు
నాడుచు మధు మద్యమ్ముల నానుఁ డెలమి 18.

తే.గీ. ధవుని సుగ్రీవు నా లక్ష్మణు వధియింతు
హనుమను హరివరుని నంగదుని రఘూత్త
ముండు వీరుండు రణ కోవిదుండు నయిన
రాముని నని నే నొక్కఁడ రాక్షసేంద్ర! 19.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నెనిమిదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 9.

ఇంద్రజిత్తు మున్నగు రాక్షస వీరు లెల్ల రామ లక్ష్మణులను సుగ్రీవుని హనుమంతుని వధించెద మని యుత్సహింప విభీషణుఁడు రావణుని తమ్ముడు వారిని నంజలించి  వారించి రావణునకు హితమును బోధించి సీతను రామున కిమ్మనుట.

తే.గీ. అసురులు నికుంభుఁడు రభసు డతుల బలుఁడు
సూర్యశత్రువు సుప్తఘ్ను శూర వరుఁడు
యజ్ఞహుఁడు మహాపార్శ్వుఁడు నా మహోద
రుండు నగ్నికేతువు బల్లిదుండు నింక 1.

తే.గీ. రశ్మి కేతువు దుర్ధర్ష రాక్షసుండు
నింద్రజిత్తు మహాతేజుఁ డీతఁ డవని
రావ ణాత్మజుండు నసుర రాజ మంత్రి
యగు ప్రహస్తుఁడు మఱి విరూపాక్షుఁ డింక 2.

తే.గీ. వజ్రదంష్ట్ర ధూమ్రాక్షులు  వజ్ర నిభులు
బలులు నతికాయ దుర్ము ఖాహ్వాయు లగు నసు
ర వరులు ధరించి పట్టిస ప్రాస పరిఘ
శక్తి శూల పరశ్వధ చాపములను 3.

తే.గీ. బాణములు ఖడ్గములు కడు పదను గలవి
గైకొని పరమ క్రుద్ధులు వీఁక నెగిరి
వెలిఁగి తేజమున నసుర వీరు లంతఁ
బల్కి రిట్లు రావణుఁ గాంచి పౌరుషమున 4.

తే.గీ. కృపణు హనుమంతు లంకకుఁ గీడు నొసఁగి
నట్టి వాని నేఁడ వధింతు మడరి రాము
నింక సుగ్రీవు లక్ష్మణు నంక మందు
రయమున వెడలి తప్పక రాక్షసేంద్ర! 5.

ఉ. చేతులు మోడ్చి యాయుధ విశేషము లవ్విధి నూన వారికిం
బ్రీతిని వారి నెల్లర విభీషణుఁ డింపుగ నాలకించెడిన్
రీతినిఁ గూరుచుండ నొనరించి వచించెను రావణానుజుం
డాతత ధర్మ యుక్తముల నంచిత వాక్యము లివ్విధమ్ముగన్ 6.

చం. ఘనములు మూ డుపాయములు కార్య ఫలమ్ము నొసంగ కున్నచో
ననువుగ విక్రమమ్మును నిజారులపై వెసఁ జూప నొప్పు నం
చనెదరు బుద్ధిమంతు లిలఁ జక్కఁగఁ గాంచి యొనర్ప మత్తులం
దును నభియుక్తు లందు విధి దూషితు లందు ఫలించు సోదరా! 7.

తే.గీ. అప్రమత్తుని జిత రోషు నడ్డగింప
రాని వానిని జయశీలు సేన గూడి
యున్న వానిని నెదిరింప నన్న! తొడఁగు
చుంటి వక్కట యెవ్విధి యుక్త మగును 8.

ఆ.వె. ఎవ్వరికిఁ దలంప నెట్లగు నదనదీ
పతి వననిధి దాఁటి పవన సుతుఁడు
దుష్కరంపుఁ బనినిఁ దూఁటి లంకను జేసె
నొక్కరుండ చూచుచుండ నడరి 9.

కం. అరి దళ బల సామర్థ్యము
లరయ కమేయముల నౌర యసురులు కనుఁడీ
త్వరపడి యెన్నండేని స
మరమ్ము కర్తవ్య మగునె మన కొనరింపన్ 10.

ఉ. రాముఁడు దోష మెన్నఁడును రాక్షస రాజున కింత సేసెనే
యీ మనుజవ్ర జోత్తముఁడు నెవ్వని భార్య జనస్థలిన్ వెసన్ 11.

భామను దొంగిలించె దశవక్త్రుఁడు రాముఁడు రక్షణార్థమై
భీమ ఖరున్ వధించె నటవిం దన నాతఁ డతిక్రమింపఁగా

తే.గీ. కలుగు వైదేహి వలన నిక్కారణమ్ము
ల మన కెల్ల ఘోర భయము రమణి సీత
నపహృతను ద్యజియింప నర్హ మగు నేల
కలహమునకు వేగిరపడ వలయు మనము 12.

ఆ.వె. తగదు వైర మిపుడు ధర్మవర్తను తోడ
వీర్యవంతు తోడ వీరవర్య!
యీ నిరర్థకమ్ము నేల సేయ వలయు
సీత నీయ వలయు నాతనిఁ గని 13.

ఆ.వె. సగజ సాశ్వ రత్నసంయుత లంకను
బుర వరమ్ము నెల్ల మూరి చీల్చు
మున్న శిత శరముల నన్న! రాఘువునకు
సీత నీయ వలయుఁ బ్రీతి తోడ 14.

ఆ.వె. ఘోరమైన యట్టి గొప్ప వానర సేన
యెదురు లేని యట్టి దింక మూరి
ముట్టడించు మున్న పుడమి పట్టి యగు నా
సీత నీయ వలయుఁ బ్రీతి తోడ 15.

ఆ.వె. సీత నీయ కున్నఁ జేరి స్వయమ్ముగ
రామపత్నినిఁ దగ రాక్షసేంద్ర!
లంక తోడ శూర రాక్షసు లెల్లరు
వడి నశింతు రిఁక నవశ్య మార్య! 16.

తే.గీ. ఎంచి బంధుత్వము హితము నిట్లు పలుకు
చుంటిఁ గరుణింపు మింపుగ యుక్తములును
పథ్యముల నాచరింపు నా పలుకు లెల్ల
సీత నీయ వలయుఁ జుమ్ము ప్రీతి తోడ 17.

తే.గీ. నృప సుతుండు రాముఁ డడరి నిను వధింప
నవ శితాగ్ర పుంఖములఁ దనరు శరత్స
మయ రవి కిరణ సన్నిభ మార్గణములు
పఱుపక మునుపె సీతను బంపు మయ్య! 18.

తే.గీ. వీడు కోపము సుఖ ధర్మ వినశనమ్ము
పడయు ధర్మము రతి కీర్తి వర్ధనమ్ము
బ్రతుకఁ గరుణింపుమ సపుత్ర బాంధవమ్ము
శీఘ్రముగ రామునకు నెమ్మి సీత నిమ్ము 19.

కం. విని యా విభీషణు పలుకు
లను రాక్షస నాథుఁ డంత రావణుఁ డేఁగెన్
ఘన రక్షో గణమును వీ
డి నిజాంతఃపురమునకు వడి మహోగ్రుండై 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ దొమ్మిదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 10.

మఱునాఁ డుదయముననే విభీషణుఁడు రావణుని సౌధమున కేఁగి మంత్రుల సమక్షమునఁ దాను బరికించిన యనేక దుర్నిమిత్తములను వివరించి సీతను రామున కొసఁగు మని తిరిగి వేఁడఁగా దశకంఠుఁడు పెడచెవినిఁ బెట్టి విభీషణుని వీడుట.

కం. అంత ప్రభాతము కా మతి
మంతుఁడు ధర్మార్థ వేత్త మహిలో దశ వ
క్త్రాంతికమునకు విభీషణుఁ
డెంతొ రతి గృహ వరమునకు హితమతి నేఁగెన్ 1.

తే.గీ. భీమ కర్ముఁడు గాంచె విభీషణుండు
శైల శృంగ నిభోన్నత శైల సంచ
యాగ్ర నిభ సువిభక్త కక్ష్యావృతము మ
హాజన పరివృతం బమాత్య విలసితము 2.

చం. హిత జన సంవృతమ్మును ననేక నిజాప్త జనాసు రైక ర
క్షితము మదేభ నిశ్వసన సేవిత మారుత రాజితమ్ము శం
ఖ తతి సతూర్య నాదితము కాంచన భూషిత దేహాళీ విరా
జిత తరుణీ జనావృతము జృంభిత జల్పిత రాజ మార్గమున్ 3.

తే.గీ. భూష ణోత్తమ సంచయ భూషితమ్ము
మరు దనీక గంధర్వాలి మంది రాభ
సౌధ రాజము రత్న సంబాధ మండి
త భవనము భోగి భవన సన్నిభ సదనము 4.

ఆ.వె. అగ్ర జాలయమ్ము నంతఁ బ్రవేశించె
వీర వర్యుఁ డా విభీషణుండు
విస్తృత కిరణముల వెలుఁగు భాస్కరుఁడు మ
హాభ్ర రాశిఁ దూఱు నట్లు మెఱసి 5.

తే.గీ. పుణ్య పుణ్యాహ వాచనములు విభీష
ణుండు విని వేద వేద్యులు నుడువు చుండ
నమ్మహా తేజుఁ డట విజయావహములు
రాక్ష సేంద్రున కన్నకు రావణునకు 6.

ఉ. కాంచె మహాబలుం డసుర కాంతుని తమ్ముడు విప్ర వర్యులం
గాంచన పాత్ర లందు దధి కమ్మని నేయి నొసంగి భక్తిఁ బూ
జించి యిడన్ సుమాక్షతలు చిత్తము లోఁ దనియంగ వార లా
యంచిత మంత్ర వేద విదు లచ్చట నింపుగ నిల్చియుండఁగా 7.

ఆ.వె. అంతఁ బూజితుండునై యసురాలిచే
వెలుఁగుచుఁ దన ప్రభల వీరుఁ డా మ 8.

హా భుజుండు గద్దె యందున్న ధనదాను
జునకు వందనమ్ముల నిడె భక్తి

తే.గీ. ఆచరించి యాచారము లంత యుక్త
ములను నాచార కోవిదుఁడు లలితముగ
నాసనము హేమ భూషిత మసుర రాజు
చూపఁగ నలంకరించె నసుర వరుండు 9.

చం. విజనము మంత్రి సన్నిధి విభీషణుఁ డింపుగ రాక్షసేంద్రు న
గ్రజునిఁ బ్రసన్నుఁ జేసికొని రావణు సాంత్వన వాక్య రాసులన్
నిజముగ దేశ కాలముల నెమ్మి గణించెడి వాఁడు పల్కె నె
ల్ల జగము లందు మంచి చెడులన్ మది నేరిన వాఁడు వాక్యముల్ 10.

తే.గీ. ఒసఁగ నత్యంతము హితమ్ము యుక్త రీతి
నిట్టు లో పరంతప! సీత యిచటకుఁ జను
దెంచిన దినము నుండి వీక్షించు చుంటి
నశుభముల నిమిత్తములను విశదముగను 11.

తే.గీ. మంత్రముల రాఁజఁబెట్టిన మండ దగ్ని
ప్రజ్వలింపదు బాగుగ రాలు నగ్ని
కణము లీఁక మంట లుండు పొగ లధికముగఁ
గ్రమ్ముకొనఁగ దూషితములై పమ్ము దిశల 12.

తే.గీ. ప్రాకు చున్నవి రాజ! సర్పములు వంట
యిండ్ల నగ్నిశాలల యందు నింక వేద
శాల లందు హవ్యములఁ బిపీలికములు
కాన వచ్చు చున్న వసుర గణ విభుండ! 13.

ఉ. ఆవులు వట్టిపోయినవి యాఱె మదం బిభ రాజ కోటిలో
నీ వర ఘోటకాలి సకిలించుచు నుండె సుదీన రీతినిన్
రావు భుజింప గ్రాసము ఖరమ్ములు నశ్వ తరోష్ట్రముల్ గనన్
పే వగ నందె భిన్నములు వెంట్రుక లారయ నేమి చేసినన్ 14.

తే.గీ. నిలువవు ప్రకృతి భావము నిల్పి యెల్ల
కాకు లఱచు చున్నవి క్రూర గతినిఁ గూడి
యెల్లెడల గుంపులుగఁ గూడి యిండ్ల పైనఁ
గాన వచ్చు చున్నవి దశకంఠ! వినుమ 15.

చం. నగరము పైన గృధ్రములు నర్తిలు చున్నవి మండలమ్ములన్
గగనము నందు నక్కలను గాంతుము కూయఁగ రెండు సంధ్య లం
దు గములతో నమంగళము దోరము దోఁపఁగ మాంసభుక్తులౌ
మృగములు ఘోర ఘోషలను బృందములై పురిఁ జేరు చున్నవే 16.

తే.గీ. ఇవ్విధముగఁ గార్యము లుండ నింక నీవు
మూర నొప్పుఁ బ్రాయశ్చిత్తము నొనరింప
సీత నిమ్ము రాఘవునకుఁ బ్రీతి నంది
తేని నాదు మాటల రాక్షసేంద్ర! మదిని 17.

తే.గీ. వీఁక వ్యామోహమున నైన లేక నేను
లోభమున నైనఁ బల్కిన రోష మూనఁ
దగదు నీకు మహారాజ! దయను గాంచ
నర్హుఁడవు రాక్షసవరేణ్య! యగ్రజ! నను 18.

కం. కనిరీ దోషము లగ్రజ!
మన యాడ మగ యసురు లిఁక మన పుర జనులున్
ఘను లంతః పుర జనులుం
గని రెల్లరు రాక్షసేంద్ర! కల్లల నాడన్ 19.

ఉ. చెప్పఁ దొలంగి రీ సచివ శేఖరు లెల్లరు మంత్ర మింపుగం
జెప్పక నాకుఁ దప్పదు విశేషముగా నసురేంద్ర! వింటివే
యిప్పు డితమ్ముఁ జూచినది యేనియు విన్నది యేని నీకు నిం
కొప్పగు కార్య ముత్తమము నొప్పును జేయఁగ నెంచి న్యాయమున్ 20.

ఆ.వె. మంత్రి గణము మధ్య మంత్ర మిబ్బంగి హి
తము విభీషణుండు తద్ద ప్రీతి
తమ్ముఁ డన్న తోడ నెమ్మిని రావణు 21.

తోడ  రాక్షసేంద్రు తోడఁ బలుక

ఆ.వె.  హితము మృదువు మఱియు హేతు యుక్త మయిన
మూడు కాలములకుఁ బాడి యయిన
మంత్ర మాలకించి మది రేఁగఁ గోపము
పలికె రావణుండు బదులు నిట్లు 22.

తే.గీ.  కాంచ నించు కేని భయము సెంచి చూడఁ
బడయఁ జాలఁడు రాముఁడు పడఁతి సీత
నమరు లింద్రు గూడి నిలువ రాజి ననఁగ
రాముఁ డెట్లెదిరింపఁ గలండు నన్ను 23.

కం.  అనుజ వరు నాప్త వాదిని
ఘన వీర్యుఁడు రావణుండు ఖర విక్రముఁ డం
త నమర సైన్య వినాశకుఁ
డనయమ్ముగ వీడె సెడఁద నలుక సెలంగన్ 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ  శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ బదవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 11.

రావణుఁ డంత యుద్ధ సమయ మాసన్నము కాఁగ సభా మంటపమునకు మంత్రాలోచనమున కేఁగ
రాజాజ్ఞ నమాత్యులు రాక్షస ముఖ్యులు విభీషణుఁడు సభ కేతెంచుట.

కం.  జనకాత్మజ మోహమ్మున
ఘన పాపి కృశించె రాజు కలుషపుఁ గార్య
మ్మున నవమానింప సుహృదు 1.

ననుజుని లంకేశుఁ డా దశాననుఁ డంతన్

ఉ. ఎన్ని దశాననుండు మది నింపుగ నప్పుడు యుద్ధకాల మా
సన్నము కా నమాత్యులను సఖ్యుల నన్యుల సంప్రదింపఁగాఁ
గ్రన్నన నంతఁ జేరి తమిఁ గాంచన జాల వృతంపుఁ దేరునుం
బొన్ను మణీద్ధ విద్రుమ విభూషిత మెక్కె మహాశ్వ యుక్తమున్ 2.

ఉ. ఎక్కి మహా రథమ్ము నసురేంద్రుఁడు భీమ ఘనస్వనమ్మునుం
జక్కఁగ నేఁగె వేగమ విశాల సభా ప్రవరమ్ము సేరఁగాఁ
బ్రక్కన ముందు రాక్షసులు పన్నుగ నాయుధ ధారు లెల్లరున్
మిక్కిలి వాడి కత్తులను మించిన డాలుల యోధు లేఁగఁగన్ 3.

తే.గీ. మూరి నానా వికృత వేష ధారు లైన
యసుర వరులు నానా భూష ణాభిభూషి
తులు పరివృతులై తగఁ బార్శ్వముల వెనుకను
దొడఁగి రేఁగ రక్షింపఁగఁ దొరముగను 4.

చం. అరదము లందు శీఘ్రము మహాతిరథ వ్రజ మింక భీమ కుం
జరముల వారువమ్ములను శౌర్య గుణాఢ్యులు రాక్షసేంద్రునిం
బరఁగుచుఁ గేళి లీల దశ వక్త్రుని నత్తఱి వెంబడించి యేఁ
గిరి గద లింక శూలములు కేలఁ బరస్వథ తోమరమ్ములున్ 5.

తే.గీ. పరిఘ శక్తు లన్యమ్ములఁ బట్టి భద్ర
దళము చన శంఖ తూర్య  నాదములు సెలఁగెఁ
దుములముగ నంత రాక్షసేంద్రుఁ డరుగంగ
నిజ సభకు సేమి ఘోషలు నెగడు చుండ 6.

ఆ.వె. గొప్ప ధ్వనులు సెలఁగ నప్పుడు  శోభిల్లు
రాజ పథము సురుచిరమును గదిసె
నమ్మహారథము దశానను నాతప
త్రమ్ము ధవళ శశి విధమ్ము వఱల 7.

ఆ.వె. పసిడి త్రాళ్లఁ గట్టఁ బడినట్టి  తెల్లని 8.

చామరవ్యజనములే మెఱయుచు
నుండెఁ గుడి యెడమల నువిదల కరముల
భాసితమ్ములు దశవక్త్రుఁ డలర

కం. శిరములు వంచి ధర నిలిచి
కరమ్ములు మొగిడ్చి యసుర గణ మా విజితా
మర సందోహునకు నమ
స్కరించె నసురేంద్రునకు వికసితాస్యునకున్ 9.

కం. రక్కసులు పొగడు చుండఁగ
పెక్కసముగ దీవన లిడ విప్ర వరేణ్యుల్
సక్కఁగఁ గూర్చిన సభకున్
రక్కసుల విభుండు సేరె రావణుఁ డెలమిన్ 10.

ఉ. చొచ్చెను రావణుండు తను శోభలు వెల్గుచు నుండ నా సభన్
నిచ్చలు వెండి స్వర్ణములు నింపఁగఁ గాంతుల నీను నట్టి యా
యచ్చపు స్ఫాటి కోపల మహాంతర భాగ విరాజితమ్మునున్
మెచ్చగ విశ్వకర్మ తమి మించి యొనర్చిన యట్టి దానినిన్ 11.

తే.గీ. కాంచ నాసన సంచయ కాంతి యుతము
షట్కృత పిశాచ రక్షిత సంతత ప్ర
భా విలసితమ్ముఁ జేరి రావణుఁడు సభను
శీఘ్రమ నిజాసనముఁ గదిసె నసుర పతి 12.

తే.గీ. ఆసన మది వైడూర్య మయమ్ము ప్రియక
చర్మ సంవృ తోపాశ్రయ సంయుతమ్ము
దా నలంకరించి విభు చంద మడరంగఁ
బనిచె దూతలఁ గడు వేగ వంతు లెల్ల 13.

చం. రయమునఁ బిల్వఁ డిచ్చటకు రాక్షస వర్యుల నేఁగి మంత్రి సం
చయమును గార్య మున్న దిటఁ జక్క విచారము సేసి చేయఁగా
నియతిని నేర్తు శత్రువుల నే నన నేఁగిరి మాట లాలకిం
చి యసుర దూత లెల్లరును శీఘ్రమ దిక్కుల కెల్ల లంకలో 14.

ఆ.వె. ఏఁగి వార లంత నింటింటి కుద్యాన
వన శయన విహార వాటికల క
భీతి రక్కసులను వీరులఁ బ్రేరేచి
రేఁగ రాజు నరయ వేగముగను 15.

కం. కొందఱు రమ్య రథమ్ములఁ
గొందఱు దృప్త దృఢములగు గుఱ్ఱమ్ముల రాఁ
గొందఱు గజముల పైనను
గొందఱు వచ్చిరి నడకలఁ గులుకుచు నంతన్ 16.

కం. ఇభ తురగ స్యందన వీ
ర భట గణము నిండఁగ నగరము ద్విజ సందో
హ భరిత నీలాంబర స
న్నిభముగ రాజిల్లె నపుడు నివ్వెఱ సెలఁగన్ 17.

ఆ.వె. నిలిపి యంత యానముల వాహనమ్ముల
వివిధములను నడచి వెడలిరి సభ
లోనికి గిరి గుహల లోని కరుగు సింహ
రాజముల పగిది విరాజిలి వెస 18.

ఉ. అందఱు రాక్షసప్రవరు లారసి రావణు రాక్షసేంద్రునిన్
వందనముల్ పదమ్ములకు భక్తి నొనర్చి గ్రహించి మన్ననల్
గొందఱు పీఠ రాజములఁ గొందఱు నా బ్రుసు లందు నింకనుం
గొందఱు కూరు చుండి రటఁ గూరిమి తోడుత భూమిపైఁ దగన్ 19.

ఆ.వె. ఉచిత రీతి కూడి యుండి రాక్షస రాజ
శాసనమున నర్హ సరణిఁ గూరు
చుండి రసురు లెల్ల రుత్త మాసనముల
రావణునిఁ గొలుచుచు రమ్య సభను 20.

చం. కనక సువర్ణ భాసితము కమ్ర సభాంతర మందు మంత్రులున్
ఘనులు సునిశ్చయార్థముల గౌరవ పండితులౌ యమాత్యులున్ 21.

వినయ గుణప్ర జోన్నతులు వీరులు ముఖ్యులు కార్య దక్షులున్
వినుతులు బుద్ధిమంతులును వేల కొలందిగఁ జేరి రచ్చటన్

తే.గీ. విపుల రథ మధిరోహించి పృథు తురంగ
యుక్తమును స్వర్ణ మయ మనురక్తి నవ్వి
భీషణుఁడు మహాత్ముఁడు యశస్వి యరు దెంచె
నగ్రజుని సభకు స్తుతించి యన్న నంత 22.

ఆ.వె. నామ ముచ్చరించి ప్రేమ నన్న చరణ
ములకు మ్రొక్కె నంత మూరి యట్టు
లా ప్రహస్త శుకులు నాచరింపఁగ వారి
కర్హముల నొసంగె నాసనముల 23.

తే.గీ. స్వర్ణ నానా మణి సువిభూషణము లుత్త
మ వసనములు ధరించి విమలముల నల
రు నసుర వరుల చందన రుచిర వాస
నాగరు స్రజ వాసన లడరె సభను 24.

తే.గీ. పలుక రెవరు బిగ్గరగను బలుక రనృత
ము ధ్వని సేయ రించుక వీర పుంగవులు స
భా సదులు సుసంసిద్ధులు భర్తృ ముఖము
ను దిలకించుచు నుండిరి పదిలముగను 25.

కం. వెలిఁగెను రావణుఁడు తన ప్ర
భల సభను మనస్వినులును వర శస్త్రధరుల్
బలవంతు లుండ నా వసు
వులతో విలసిల్లు నింద్రుఁ బోలుచు నచటన్ 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ బదునొకండవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 12.

రావణుఁడు సభను పరిశీలించి వాహినీ పతి ప్రహస్తుని లంకకుఁ గావలి సేకూర్చమని యాజ్ఞాపింప నతఁ
డట్లు సేయ సీతను దాను తెచ్చిన విధమును వివరించి తగిన కర్తవ్యముల నాలోచింపుఁ డనఁగఁ
గుంభకర్ణుఁ డకృత్యమును నిందించి పిమ్మట రామలక్ష్మణులను జంపుదు నని మాట యిచ్చుట.

కం. పరిశీలించి దశాస్యుఁడు
పరిషత్తు రణ విజయుండు ధ్వజినీ పతి నా
సురునిఁ బ్రహస్తుని వీక్షిం
చి రావణుఁడు పనిచె నంతఁ జెన్నుగ నిట్లున్ 1.

తే.గీ. నగర రక్షణమ్మునకు సేనాపతీ! చ
తుర్విధ చమూ గణ కృత యోధులను దగిన
రీతిఁ గావ నాదేశింప నీ తఱిం బ్ర
హస్త!యర్హుఁడవు దొడఁగు మవ్విధమ్ము 2.

ఉ. రాక్షసుఁ డా ప్రహస్తుఁ డసురవ్రజ నాథుని యాజ్ఞ నూని పే
యా క్షణ మేఁగి యప్పగిది నప్పుర మందు బలమ్ము నిల్పి తా
రక్షణ మెల్ల తావులను రమ్యముగా నొనరించి ప్రీతిమై
యక్షయ రీతి రాజుఁ గని యాసనముం గొని పల్కె నివ్విధిన్ 3.

చం. వర బల మెల్ల నిల్పితిని బాహ్యము నందును నంతరమ్ములన్
సరి యది నీ బలమ్మునకుఁ జక్కఁగ నింక యొనర్పు మిష్ట మె
ల్ల రతిని వీడి శోకమును రాజ! యనంగ ముదమ్ము నంది తా
నరసెడి వాఁడు రాజ్య హిత మాత్మ హితమ్ము దశాస్యుఁ డిట్లనెన్ 4.

తే.గీ. సుహృదులఁ దిలకించి గిరలు సురుచిరముగ
ధర్మ కామార్థ కృచ్ఛ్ర సంతతిఁ దగ సుఖ
దుఃఖములు హి తాహితము లందును బ్రియాప్రి
యముల లాభ నష్టముల మీ రర్హు లెఱుఁగ 5.

ఆ.వె. అడరి పనులు మీర లారంభముం జేయ
మంతనము లొనర్చి మాన్యులార!
నిష్ఫలమ్ము లగుట నేరవు మున్నెన్నఁ
డేని సత్యము పరికించి చూడ 6.

కం. మిముఁ గూడి నేను సిరులు భృ
శముగాఁ బడసితి గ్రహములు చంద్రుఁడు నక్ష
త్ర మరుత్తు లుండఁ తోడుగ
నమరేంద్రుఁడు గొన్న భంగి నైశ్వర్యములన్ 7.

చం. తొడఁగితి మీకు నెల్లరకు దుర్జయులార! వచింపఁ దిర్గి యి
ప్పుడు కడు నిద్ర నుండఁగ సమున్నత వీర్యుఁడు భ్రాత కుంభక
ర్ణుఁ డపుడు చెప్పకుంటిని మనోజ్ఞముగా నత డాఱు మాసముల్
పడుకొని నిద్ర లేచె నిఁకఁ బన్నుగ ముఖ్యుఁడు శస్త్రధారులన్ 8.

చం. ఉవిదను దండకా వనము నుండి రఘూత్తము భార్య సీత నా
యవనిజ రాక్షసావళి విహారము సేసెడి చోట నుండఁ దే
ర వనిత తాను నన్ను నను రాగము తోఁ గొన నిచ్చగింప దే
నవనినిఁ గాంచ సుందరుల నామెకుఁ దుల్యల నెందు నెన్నఁడున్ 9.

ఆ.వె. సన్నని నడు మతి విశాల నితంబము
లు శరదిందు ముఖము రుచిర హేమ
బింబ నిభయు సౌమ్య పేర్మి నిర్మించె మ
యుండు నాఁగఁ దనరి యుండు లలన 10.

కం. కన నున్నని యెఱ్ఱని రం
గున నున్న చరణ యుగమును గోమలి నఖముల్
దనరఁగ నెఱ్ఱఁదనమున న
వని సమముగ నాన నాకు వర్ధిలు వలపే 11.

తే.గీ. కామ వశ్యుఁడ నౌదును గాంచినన్ హు
తాగ్ని సదృశము రవి కళఁ దనరి యున్న 12.

తంపు నాశిక నలరెడు నింపు గొలుపు
ముఖము సతి  చారు లోచనములను వినుఁడు

తే.గీ. హర్ష రోషములు సమముల్లై చెలంగ
మేను కా వివర్ణము నా కమేయముగను
నిత్య ముండ శోకమ్ము నా కత్యధికము
గ నెదఁ గలుపితుఁడ నయితిఁ గామ మడర 13.

చం. అడిగెను నన్ను దా గడువు నవ్వనితామణి యొక్క యేఁడు రా
ముఁ డరుగుదెంచు నంచు నెద మోహము తోడుత వేచి యుంటకై
పడఁతికి నాదు సమ్మతము పన్నుగఁ దెల్పితిఁ జారునేత్రకుం
గడు వడి దూర మేఁగఁ దురగమ్ము వలెం దమి నేను డస్సితిన్ 14.

తే.గీ. దారుణంపు టక్షోభ్యాబ్ధి దాఁట తరమె
సత్త్వ సంపన్న మును వనచరుల కెన్నఁ
డేని దాశరథులకు నా మానవులకు
దుస్తరం బది  నరులకుఁ దోరముగను 15.

కం. కపి మాత్రుం డొక్కండ మ
న పురము సేరి గరిమఁ గదనం బొనరించెన్
రిపు వీరు లడరి యొనరిం
చు పను లెఱుఁగమె పలుకుండు సురుచిర రీతిన్ 16.

ఉ. లేదు భయం బహో మనకు లేశము నైనను మానవాలిచే
మేదిని నైన నొప్పు నిట మిన్నగఁ జేయ విచార మెల్లరున్
సాదర ముండ నా వెనుక నండగ మీరలు నే జయించితిం
గాదె సురాలి యుద్ధమునఁ గాంచితి మీరు జయింప వారినిన్ 17.

మ. కని వైదేహి చరించి నట్టి గతి నా కాకుత్స్థవీరాగ్రణుల్
వన సంచారులఁ గూడి వానర గణవ్యాఘ్రుండు సుగ్రీవుఁడుం
జన వెంటన్ జలరాశిఁ జేరి రట తచ్ఛాఖామృగశ్రేణితో
ఘనులా యుత్తర తీర దేశమును సంగ్రామార్థ సన్నద్ధులై 18.

ఆ.వె. సీత నీయకుండు చెన్ను దలంచి దా
శరథులను వధించు సరణి నెంచి
మంతనములు మీర లంతరంగమ్ముల
జలిపి చెప్ప వలయుఁ జక్కఁగాను 19.

కం. కన నన్ను లందు శక్తిని
వననిధి దాఁటంగఁ జెంత వానరు లున్నన్
ఘన విజయము నిశ్చయ మా
జిని నా కనుమాన మేల చింతింపంగన్ 20.

ఉ. నా విని కుంభకర్ణుఁడు ఘనమ్ముగఁ గామ పరీతుఁడైన యా
రావణు గాంచి క్రోధుఁ డయి రాక్షస వర్యుఁడు సోదరుండు తా
నీ వచ నాలి పల్కె నవనీ సుతఁ దెచ్చితి చిత్త వశ్యతన్
నీవ చెలంగి యా యమున నెమ్మిని గోతులు నింపు రీతినిన్ 21.

తే.గీ. రాముని స లక్ష్మణు సతిని రాజ! కొనక
మున్న యప్రతిమపుఁ గార్యము మము నగ్ర
జ! తగ సంప్రదించి చరింపఁ జక్క నౌను
గాదె వీక్షింపము గద సంకటము లిట్లు 22.

ఆ.వె. రాజ కార్యములను రాజెవ్వఁ డొకొ న్యాయ
ముగను నిశ్చయించి తగ నెడందఁ
జేయు నతఁడు పిదపఁ జింత నందఁడు దశ
గ్రీవ! నిశ్చయముగ నీ వసుధను 23.

ఆ.వె. పనులు సేయ వడి నుపాయము లెంచ కుం
డ విపరీతములను నవి నశించు
నపరిశుద్ధములను హవి వేలిచిన నప్ర
యోజన మగు భంగి రాజ! వినుమ 24.

కం. మొదలి పనినిఁ బిమ్మట మఱి
మొద లపరపుఁ బనినిఁ జేయు పూరుషుఁ డెన్నం
బదనుగఁ దాను న యానయ 25.

విదితుఁడు కాఁడు ధరలోన వీర వరేణ్యా!

ఆ.వె. చపల చిత్తు నందు శక్తి సమీక్షించి
చిద్ర మరసి యంతఁ జెలఁగు చుండ్రు
క్రౌంచ శైల మందు ఖగములు వీక్షించి
చొచ్చు పగిది పరులు మెచ్చి యిచ్చ 26.

కం. ఆరంభించితి వీ పని
నో రాక్షస నాథ! యెడఁద నుత్తమముగ నీ
వారయక భాగ్య వశమున
నా రాముఁడు చంప డట విషాన్నము భంగిన్ 27.

ఆ.వె. చంపి యనఘ! వేగ శత్రువులను నీవు
మొదలిడిన పనిని సముచితముగ స
రి యగు రీతిని నొనరింతు నప్రతిమము
ను పెఱవ వల దింక నుత చరిత్ర! 28.

తే.గీ. నీ రిపులఁ జంపుదు ననఘ! నే నిరువుర
శక్ర సూర్యు లయిన వారు విక్రము లన
లానిలులు ధనద వరుణు లయిన నాజి
నుద్యమించి నిశాచర! యూఱడిల్లు 29.

చం. గిరి నిభ దేహుఁడం బరిఘు కేల వహింపఁగఁ దీక్ష్ణ దంష్ట్రముల్
పరఁగఁగఁ జేయ గర్జలను బాఱఁడె యింద్రుఁడు భీతి తోడుతన్
శరమును వేసి రెండవది శల్యము రాముఁడు వేయు నంతలోఁ
ద్వరితము వాని రక్తమును ద్రాగుదుఁ బ్రీతిని నూఱడిల్లుమా 30.

తే.గీ. చంపి రాముని సుఖము నొసంగు జయము
నీయ నుద్యమింతును రాము నెలమి లక్ష్మ
ణ సహితమ్ముఁ వధించి వానర సమూహ
ముఖ్యులను దిందు నెల్లర సౌఖ్య మడర 31.

తే.గీ. చలుపు క్రీడలు మద్య శ్రేష్ఠమ్ముఁ ద్రాగు 32.

మడరి కార్యము లొనరింపు విడిచి చింత
పంప నేను రాముని‌ ( గాలు పట్టణమున
కింక వశ మగు జానకి యెలమి నీకు

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు( బండ్రెండవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 13.

క్రుద్ధు(డైన రావణునితో మహాపార్శ్వు(డు సీత( దెచ్చితివి కదా క్రీడింపు మన విని రావణు(డు తనకు బ్రహ్మ దేవు( డిచ్చిన శాప వృత్తాంతము వివరించుట.

కం. రావణు కోప మెఱి(గి ర
క్షోవరు( డొక యింత తల(చి సురుచిర వచన
ప్రావీణ్య మహాపార్శ్వుం
డా విభునకు మ్రొక్కి భక్తి నాతని కనియెన్ 1.

తే.గీ. చని మృగవ్యాల సంచయ సంకులంపు(
గాననమ్ము ప్రాప్తింప(గ( గమ్ర మధువు
త్రాగకుండక యుండిన తన్నరుండు
బాలిశుం డగును బరంతప! పరికింప 2.

తే.గీ. ఎవ్వ రీశ్వరుం డగును నీ కీశ్వరుండ
వీవ యెల్లరకును రాక్షసేంద్ర! సీత
తోడ రమియింపుమ యెలమి తోడ రిపుల
తలలపై నిడి నీదు పాదముల నడరి 3.

చం. బలిమిని( గుక్కుటంపు విధి బాలను సీత రమింపు మింపుగా 4.

లలనను నాక్రమించి తమిఁ బ్రాప్తము కాఁ దవ వాంఛితంబు నీ
కలవడ నేర్చు సెట్టి భయ మందఱ ముంటిమి ప్రాప్త మైననున్
విలయము చేయు వారలము వీర వరేణ్యుల మా భయమ్మునున్

ఆ.వె. కుంభకర్ణు నింక ఘోర బలుని నింద్ర
జిత్తుఁ గూడి మేము సేర వజ్రి
వజ్ర మూని మూరి వాని నిరోధింతు
మెల్లర మవలీలఁ దల్లడిలకు 5.

ఆ.వె. విరివి సామ దాన భేద ప్రయోగము
ల పయి నిపుణులు తమ రక్తి నుంతు
ర్థ సిద్ధి కొఱకు నాత్మ వరింతు దం
డమును నేను భయ పడక సతమ్ము 6.

కం. ఇచట కరుదెంచిన ద్విష
న్నిచయమ్మును స్వీయ శస్త్ర నిచయమ్మున మే
మచలితులమై వశం బొన
రిచి తనరం గాంతు విందు లే దరమరయే 7.

కం. పలుక మహాపార్శ్వుఁడు విని
పలుకులు మన్నించి వానిఁ బన్నుగ నంతం
బలికెను రావణుఁడు వచన
ములి ట్లసురు గని గభీరముగ వివరములన్ 8.

కం. వినుము మహాపార్శ్వ! కలదు
మును జరిగినయది రహస్యము దెలిపెదను నీ
కు నసుర వరేణ్య! నే నం
దినది వివరముగ నదెల్లఁ దెల్లము కాఁగన్ 9.

చం. అలరి నభస్థ లాధ్వమున నచ్చర యేఁగుచు నుండి పుంజిక
స్థల వెలుగంగ నగ్నిశిఖ సన్నిభమై కన నయ్యె దాఁగుచున్
లలన వివస్త్ర కాఁబడి బలమ్మున భుక్తగ నప్పు డయ్యె నా
వలనను జేరె నబ్జజు నివాసము లోలిత పద్మినీ క్రియన్ 10.

తే.గీ. తెలిసె నది యంచు నెంతును నలినజునకు
నా మహాత్మునకు విధాత యలిగి యిట్లు
వలికె నేఁటి నుండియు నీవు పర వనితల
ను బలిమిఁనిఁ గొన్న వంద తునుక లగుఁ దల 11.

ఆ.వె. ఇట్లు నాకు శాప మీయ ధాత బలవం
తముగ భయము చేతఁ దరుణి సీత
తోడఁ దల్ప మెక్కఁ దొలఁగుదు శుభము నే
నెన్నఁ డేనియుఁ దెగియింప వినుమ 12.

తే.గీ. సాగర నిభమ్ము సుమ్ము నా వేగ మెన్న
మారు తాభమ్ము గణియింప మద్గమనము
నేర కియ్యది రాముఁడు మూరి నన్ను
మార్కొనంగఁ దలఁచి నాఁడు మంద బుద్ధి 13.

ఆ.వె. ఎవ్వ రిట్లు లేప నెంతురు గిరి గుహ
యందు నిద్ర నున్న యమ్మృ గేంద్రు
పగిది నిలిచి యున్న భయదంపు మృత్యువు
చెన్ను నఁ గల క్రుద్ధు నన్ను నిట్లు 14.

ఆ.వె. చూచి యుండ లేదు నా చేతి నిశిత బా
ణమ్ములను ద్విజిహ్వ నాగ సన్ని
భముల రాముఁ డందు వలనఁ దా నెదిరింప
నెంచె నన్ను నూన కెడఁద భీతి 15.

కం. జ్వలియింపఁ జేయుదును వం
దల వజ్ర నిభ శరముల నతనిపై వడి నా
విలు నుండి కురిసి నే ను
ల్కలతోఁ గుంజరముఁ బగిది రాముని నాజిన్ 16.

కం. సు మహా బ లావృతుఁడ నయి
సమరమ్మున రఘు వరేణ్యు సత్తువ నెల్లన్ 17.

నిమిషమ్ముననఁ గైకొందు ది
నమణి యుడుప్రభల దినమున గ్రహించు క్రియన్

ఆ.వె. అమర నాథుఁ డా సహస్రాక్షుఁడు వరుణుఁ
డైనఁ దగరు గెలువ నాజి నన్ను
వైశ్రవణుఁడు మున్ను పాలించె నీ పుర
మతని భుజ బలమున నని గెలిచితి 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ బదుమూడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 14.

రావణ కుంభకర్ణుల పలుకులు విని విభీషణుఁడు వానర సైన్య బలమును రామ బాణముల శక్తిని తెలుపఁ బ్రహస్తుఁడు రామునకు వెఱవ మనిన తిరిగి విభీషణుఁడు రాముని శక్తి కెదురు లేదని సీతను రామునకు నొసఁగి రావణునిఁ గాపాడుఁ డని బోధించుట.

కం. విని యసురేంద్రుని వాక్యము
లను గర్జిత కుంభకర్ణ రావమ్ములఁ బ
ల్కెను హితము లర్థ యుక్తము
ల నివ్విధి విభీషణుండు రాక్షస పతితో 1.

తే.గీ. రాజ! చుట్టె నెయ్యదొ నేరు రావణ! యది
వక్ష మనెడు పడగ తోడ వగపు విషము
కాఁ జిఱునగవు దంష్ట్రము కాఁగ నైదు
వ్రేళ్లు నైదు తలలు నాఁగఁ బెద్ద పాము 2.

తే.గీ. వానరులు పర్వత శిఖర వ్రాత నిభులు 3.

ఘోర దంష్ట్ర నఖాయుధ వీర వరులు
మూరి లంకను చుట్టక మున్న రాజ!
దాశరథికి నీయ వలయు ధరణి సుతను

తే.గీ. వజ్ర నిభ వాయు సమ వేగ బాణపంక్తి
రాముఁడు పఱిపి రణ మందు రాక్షస గణ
మూర్ధముల నెల్లఁ ద్రెంపక మున్న రాజ!
దాశరథికి నీయ వలయు ధరణి సుతను 4.

కం. శితములు ప్రాణాంతకములు
గతిఁ దుల్యము లశనికి రఘు కాంతుని శర రా
శి తనువునం దూఱు దనుక
వితతమ్ముగ వదరెద వవివేకి! బ్రహస్తా! 5.

తే.గీ. కుంభక ర్ణేంద్రజిత్తులు ఘోర బలులు
నా మహాపార్శ్వుఁడు మహోద రాదులును ని
కుంభ కుం భాతికాయులు గూడ రాజ!
నిలువఁ జాల రాజిని రాముని సముఖమున 6.

చం. ఖరకరుఁడున్ మరుత్తులును గాచినఁ బ్రాణము లండ నేరవే
నరవరు రాము మార్కొన రణమ్మున రాక్షస పుంగవా! పురం
దరు నొడిఁ జేరినం గదియ ధర్ముని౯ దూఱ నభమ్ము లోన నీ
వరిగినఁ గ్రింది లోకమున కగ్రజ! సత్యము నాలకింపుమా 7.

చం. అన విని యా ప్రహస్తుఁ డనె నంతట వాక్యము లిట్లు మేము భం
డనమున దేవ దైత్యుల పటాలముచే నిసు మంతయున్ భయ
మ్మనరయ మెన్నఁ డేని మఱి భోగులు యక్షులు దేవగాయకుల్
వినయులు మాకుఁ బక్షులును భీతిని రాఘవుఁ డీయఁ జాలునే 8.

చం. మన కిట నా నరేశ్వరు కుమారుని చే భయ ముండునే యనన్
విని తగఁ బల్కె నప్పుడు విభీషణుఁ డన్న హితమ్ము కోరెడిన్
ఘనుఁ డసురుండు వాక్యములు గ్రన్నన నర్థ యుతమ్ము లిట్లు ధ
ర్మనిరత మాన సార్థ చయ మానిత కామ నిమగ్న చిత్తుఁడున్ 9.

తే.గీ. నీవును ప్రహస్త! రాజును నెమ్మి నీ మ
హోదరుఁడు కుంభకర్ణుఁడు నుదరి రాఘు
వార్థ మనిన వెల్ల జరగ వయ్యె స్వర్గ
మున కధర్మాత్ములు సనఁ జాలని విధమ్ము 10.

ఆ.వె. ఎల్ల రాక్షసులకు నింక నీకును నాకు
నర్థ వేత్త రాము నాజిఁ జంపఁ
దరమె యర్ణవమ్ముఁ దరణి లేని యతఁడు
దాటఁ జాలు నే విధము ప్రహస్త! 11.

తే.గీ. అరసి ధర్మప్రధానుని యమ్మహా ర
ఘుని వరేక్ష్వాకు వంశ జన్ముని మహా గు
ణుని మహా శక్తు రాడ్వరు పనుల నెల్ల
మూఢు లౌదు రమరు లెల్ల గాఢముగను 12.

కం. అతి తీక్ష్ణ కంక పత్ర శ
ర తతులు రాముఁడు విడువ దురాసదములు నీ
దు తనువునం దూఱు దనుక
వితతమ్ముగ వదరెద వవివేకి! బ్రహస్తా! 13.

ఉ. రావణ కుంభకర్ణులును రాముని ముందుఁ ద్రిశీర్షుఁ డైననుం
జేవను నింద్రజిత్తును విశేషబలుండు నికుంభఁ డీవు యు
ద్ధావని లోన శక్ర సము నాతని ముం దసమర్థు లౌదురే
యే విధి నైన నిల్వఁగ నరేంద్రుని ముందు ప్రహస్త! వింటివే 14.

తే.గీ. ఘోర దేవాంతక నరాంతకు లతి కాయుఁ
డయిన నతిర థాకంపను లయిన నద్రి
తుల్య సారులు రాక్షస దుర్జయులును
నిలువ లేరు రాముని యాజి నిక్క మెంచ 15.

ఆ.వె. దుర్వ్యసన పరుండు తోర మీ రాజు తీ
క్ష్ణుండు ప్రకృతి నెన్నకుండి చేయుఁ 16.

బనులు సఖు లసఖుల పగిది నుంటిరి దరి
నసుర నాశనమున కనఁగ మీరు

ఆ.వె. చుట్టుకొనఁబడె నిట బెట్టిదముగ రాజు
వేయి తలల తోడఁ బెద్ద పడగ
లున్నయట్టి ఘోర పన్నగ వరముచే
బలిమి నుద్ధరింప వలయు మీరు 17.

తే.గీ. సఖులు పరిపూర్ణ కాములు చక్కఁ గూడి
యెల్లరును రాక్షసేంద్రు రక్షింప వలయు
జుట్టుఁ బట్టియు భూతము పట్టి నట్టి
వాని విడిపించు విధమున బలిమి నైన 18.

తే.గీ. చంపు నట్టిదౌ రాఘవ సాగరమునఁ
బరివృతుం డయ్యెఁ గట దశవక్త్రుఁ డిపుడు
తగును రక్షింప మీకు నందఱకుఁ గలసి
తాను గాకుత్స్థ పాతాళ తలమునఁ బడె 19.

తే.గీ. పురమునకు రక్కసులకు నడర హితమ్ము
రాజునకును సుహృజ్జనులకును బథ్య
మేను నా మతమును వచియించు చుంటిఁ
బార్థ సుతున కిచ్చెద మిఁకఁ బత్ని నెలమి 20.

కం. స్వ పర బలము లెంచి స్థలము
స్వపక్ష మందును లయమ్ముఁ జక్కఁగ వృద్ధిన్
విపులముగ మంత్రి యరసి త
న పతికి హితము వచియించు నైపుణ్యమునన్ 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ బదునాల్గవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 15.

విభీషణుని మాటలు విని యింద్రజిత్తు పరుషముగాఁ బలుకఁగ విభీషణుఁ డాతని నిందించి రాముని శర
వేగములను వర్ణించి సీతను ధన చిత్ర మణి రత్నాంబరాది సత్కారములతో రామునకు సమర్పింపు
మని రావణుని వేఁడుట.

కం. విని కడఁగి బృహస్పతి తు
ల్యుని బుద్ధి విభీషణుని హితోక్తుల నంతన్
ఘనుఁ డింద్రజిత్తు వచియిం
చె నైరృత గణాధిపుఁ డరసి విభీషణునిన్ 1.

ఉ. ఏ మిది పిన్నతండ్రి! గిర లివ్విధిఁ బల్కు దనర్థకమ్ములన్
నీ మన మందు భీతి కడు నిండిన భంగినిఁ బుట్టకున్న నే
మీ మన వంశ మందు నెవ రిట్టులు పల్కుదు రిట్టి కార్యముల్
నీమము తప్పి జేయుదురు నీ వలె నక్కట యెన్నఁడేనియున్ 2.

తే.గీ. సత్త్వ వీర్య పరాక్రమ శౌర్య ధైర్య
తేజములు లేని పురుషుండు తెల్లముగ వి
భీషణుండ యీ పినతండ్రి వెదక నొక్కఁ
డున్నవాఁడు రక్కసు లందు నుర్విలోన 3.

ఆ.వె. మనుజ రాజ పుత్రులను మన లోన నె
వ్వండు నైన రక్కసుం డొకండు
ప్రాకృతుండు సంపు రణ మందుఁ జెలరేఁగి
పంద! యేలొకొ భయపడుదు వీవు 4.

చం. ధరణిని దేవరాజు నల తద్ద బలమ్మున మూరి యొత్తితిం
బరమ బలాఢ్య ముజ్జగపు భర్తను భీత మనస్కులై వెసన్
సురవరు లెల్ల దిక్కులకు శూరులు పాఱిరి వీత లజ్జులై
త్వరపడి వీడి ఘోరతర భండన భూమిని నక్కజమ్ముగన్ 5.

తే.గీ. నేలఁ గూల్చితిని సుఘోర నిస్వనము లొ
నర్ప నైరావతమ్మును దర్పమడర
దంతములు పీఁకి బల్మిని నంత దేవ
సంచయం బెల్ల భీతిల్లెఁ గాంచి కరిని 6.

తే.గీ. సురల దర్ప హంతను వీర వరుఁడ నేను
శోక కర్తను గొప్ప యసురుల కెల్ల
మనుజ మాత్రుల రాజ నందనులఁ బ్రాకృ
తులను జాలనె వధియింప బలము తోడ 7.

కం. సుర రాజ సన్నిభు నసురు
దురాసదుని నింద్రజిత్తు దుర్వాక్యములం
బరికించి పలికె నాయుధ
ధరుల వరిష్ఠుండు నుగ్రత విభీషణుఁడే 8.

తే.గీ. బాలుఁడ వపక్వ బుద్ధివి పడయఁ జాల
వీవు మంత్ర నిశ్చయ మర్థహీన భాష
ణములు పలుకు చుంటివి నాయన! నిజ నాశ
నమ్మునకుఁ బెక్కు లిట్టు లసమ్మతములు 9.

ఆ.వె. రాఘవేంద్రు వలన ప్రలయమ్ము విని కూడ
సమ్మతించు చుంటి పమ్మ వెడఁగు
పుత్ర రూప మందు మిత్రు పగిది నున్న
శత్రు వైతి వీవు పుత్ర! యిటుల 10.

ఉ. వధ్యుఁడ వీవు దుర్మతివి పన్నుగఁ జేయక నీ గుణమ్ము లి
ట్లధ్యయనమ్ము బాలు నిను నక్కట దెచ్చియు మంత్ర కర్త స
న్మధ్యము నందు నుంచు కతనం గన నాతఁడు కూడ బాలకా!
వధ్యుఁడ యౌను నిక్కముగ బాధ్యత నేరని కారణమ్మునన్ 11.

తే.గీ. మూఢుఁడ వవినయుండవు మూర్ఖుఁడవు ప్ర
గల్భుఁడవు దుర్మతి వతి తీక్ష్ణపు స్వభావుఁ 12.

డ వలఁతి మతివి మఱి క్రూరుఁడ వయ యింద్ర
జిత్తు! బాల్యత నీవు వచింతు విట్లు

తే.గీ. బ్రహ్మ దండ సన్నిభములు బాణములు ర
ఘూత్తముండు విడువ నెవ్వఁ డోపు సమర
మందు నంశుమంతమ్ముల యమ సమాన
ములను గాలదండ సదృశములను నిలువ 13.

తే.గీ. ధన విభూషణ రత్నముల నవనిజను
జేర్చి దివ్యాంబరమ్ములు చిత్ర మణులు
రాముని కొసంగి దేవిని రాజ! సుఖము
వెలయ బ్రతుకుదము వగపు వీడి మనము 14.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ బదునేనవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 16.

నిశ్చల బుద్ధి యైన యా విభీషణుని మాటలు విని యాగ్రహ మంది రావణుండు కాల చోదితుఁ డత్యంత పరుషముగాఁ బల్క నాతఁ డగ్రజుని వీడుటకు నిశ్చయించి నలుగురు రక్కసులతో నెగిరి వీడ్కోలు పలుకుట.

కం. స్థిరమతి విభీషణుని హిత
గిర లట్లు నుడివిన వానిఁ గృతనిశ్చయుఁ దా
నరసి యసురాధిపుఁ డలిగి
పరుషమ్ముగఁ బల్కెఁ గాల వశుఁడై యిట్లున్ 1.

తే.గీ. శత్రువుల తోడ వసియింప శక్య మగును
గ్రుద్ధ ఫణి తోడ నివసింపఁ గోర వచ్చు 2.

మిత్రు భంగిని వచియించు శత్రు తోడ
సెన్న్ఁ డేనియు వసియింపఁ జన్నె తలఁప

ఉ. జ్ఞాతుల శీల మిజ్జగతిఁ జక్కఁగ నేరుదు నేను రాక్షసా!
జ్ఞాతుల దుఃఖ మారసిన జ్ఞాతులు నిత్యము హృష్టు లౌదురే
జ్ఞాతులు భంగ పెట్టుదురు సాధక రాడ్వర ధర్మశీలురన్
జ్ఞాతుల గౌరవింప రిఁక శౌర్యము విద్యలు మించి యున్నచో 3.

తే.గీ. ఒకరి కొక్కరు నిత్యము వికటముగ ము
రియుచు నుంద్రు కష్టమ్ములు రేఁగ మిగుల
నాతతాయిను లడరి దాయాదులు భయ
దులు సుఘోరులు గుంభనాత్ములు భృశముగ 4.

చం. కని మును పాశ హస్త నర కాయముఁ బద్మ వనమ్ము నందు హ
స్తి నిచయ మొక్క శ్లోకమును జెన్నుగఁ బల్కఁగ విన్న దానినిన్
వినుము వచింతుఁ గాంచ మెద భీతిని వహ్నినిఁ బాశ శస్త్ర రా
జి నయిన స్వార్థ పూరితులు చేరిన జ్ఞాతులె భీతి కారకుల్ 5.

ఆ.వె. పట్టుకొనుటకై యుపాయము వచియింత్రు
సందియమ్ము గాన మిందు భయము
లందు నెల్లఁ గష్ట మౌను జ్ఞాతి భయము
తెల్ల మియ్యది జను లెల్లరకును 6.

తే.గీ. గో గణము నందు సంపద గోచరించు
బ్రాహ్మణోత్తముల దమమ్ము పరఁగు చుండు
స్త్రీల యందుఁ జాపల్యము సెలఁగు చుండు
జ్ఞాతుల వలన భయ ముండు శంక లేక 7.

ఉ. లోకులు గౌరవింపఁగ విరోధుల మూర్ధము లందు నుండఁగా
వీఁక వరింప నన్నిటుల విత్తము లింపుగ మిక్కుటమ్ముగన్
నీ కిది కాక సమ్మతము నెవ్వగ మీఱఁగ సౌమ్య! పల్కితే
యీ కటు భాషణమ్ములను హీనము లివ్విధి మత్సరమ్మునన్ 8.

తే.గీ. తామరాకు పైనఁ బడిన తరళ తోయ
బిందు వాకు నంటనియట్టి చంద మింక
శార దాభ్ర వర్ష మిలకుఁ జాలని విధి
నచ్చపుఁ జెలిమి యుండ దనార్యు లందు 9.

తే.గీ. క్రోలుచు మకరందమ్మును బూల నుండి
యొక్కచో నిలువని రీతి మిక్కుటంపు
దప్పి నలి యట్లు నీవును దనరు చుండ
నచ్చపుఁ జెలిమి యుండ దనార్యు లందు 10.

తే.గీ. గడ్డి పూవు నుండి రసము కాంక్ష మీఱఁ
దేనెటీఁగ త్రాగఁ దొడఁగి దానిఁ బొంద
లేక తెల్లఁ బోవు పగిది రిత్త వోవు
నచ్చపుఁ జెలిమి యుండ దనార్యు లందు 11.

తే.గీ. మున్ను నీట మునిఁగి గజము దగ జలక
మాడి తిరిగి తాను దనదు హస్తముననె
దుమ్ము జల్లుకొనఁగ మలినమ్మగు విధి
నచ్చపుఁ జెలిమి యుండ దనార్యు లందు 12.

కం. పరుఁ డెవ్వఁ డైనను నిశా
చర! కులపాంశన! వచింపఁ జపలత్వమునన్
గిర లిట్లు వధింపఁ బడఁగ
నరుగు నిసీ యముని వీటి కాక్షణ మందున్ 13.

కం. పలుకఁ బరుష వాక్యము లి
ట్టు లన్నయె విభీషణుండు డుంకక గదతో
నలువుర రక్షో వరులం
గలసి యెగిరి న్యాయవాది కనలునఁ బలికెన్ 14.

ఉ. అన్నవు నీవు పూజ్యుఁడ విహమ్మునఁ దండ్రి సముండ వౌదువే
యెన్నక యున్న ధర్మమును నిచ్చకు వచ్చిన రీతి నగ్రజా!
నన్నన వచ్చు నైనను ననంతము లిప్పరుషంపుఁ బల్కులన్ 15.

మన్నన సేయఁ జాల నణు మాత్రము నీ యనృతమ్ము లెవ్విధిన్

తే.గీ. విన రకృత బుద్ధులు వశులై వీరు కాల
మునకు నయ వాక్యములు హితమును దలంచి
పలికిన హితుండు దశకంఠ! తలఁతు రహిత
ములని తగ విచారింపక మోహమునను 16.

ఆ.వె. తేనె లొల్కు నట్టి తియ్యని పల్కులు
సెప్పు వార లుందు రెప్పు డైన
నప్రియములు హితము లైనవి చెప్పు వా
రు విను వారు నరుదు భువిని రాజ! 17.

తే.గీ. సర్వ భూతాపహారి విసరఁగ మూరి
చిక్కి కాలు పాశము నందు నక్కట నశి
యింప నున్నట్టి నిన్నుపేక్షింప రాదు
మండెడు గృహమ్ముఁ బగిది నెన్నండు నేని 18.

ఆ.వె. చూడఁ గోర నేను వాడి శరముల జ్వ
లించు నగ్ని వోలు కాంచన సువి
భూషితముల  సమరమునఁ గూలు చుండఁగ
రాక్షసేంద్ర! నిన్ను రాముఁ డేయ 19.

కం. ఘన శూరు లస్త్ర నైపుణు
లును బల్లిదులు నశియింతురు రణాంగణ మం
దు నరులు వశులై కాల
మ్మునకు నిసుక వంతెన విధముగ నసురేంద్రా! 20.

తే.గీ. అన్నగ క్షమింపు మన్న నా యన్న పలుకు
ల హిత మొనగూర్ప రాక్షసుల నగరమ్ము
నిన్ను గాచి కొనుమ రహి నెగడ నుండు
వెడల నిను వీడి పోయెద వీఁక నేను 21.

ఉ. లేరని యెంతుఁ దథ్యముగఁ బ్రీతి హితమ్మును జెప్ప నింపుగా 22.

వీరులు  రాక్షసావళిని భీకర పాపము నాపఁగా సఖుల్
వారక నే వచించితిని పాపపుఁ గార్యము వీడు మంచు నీ
వారయ వక్కటా హితము నగ్రజ! సుంతయు నేమి చెప్పుదున్

కం. రుచియింపవు హిత మొసఁగు సు
రుచిరమ్ములు నా వచనములు నిరోధింపన్
వచియింపఁగ సుహృదులు కా
ల చోదిత గతాయువులు గిర లసుర! వినరే 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ బదునాఱవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 17.

విభీషణుఁడు నలుగురు సహచరులతో రామలక్ష్మణు లున్న చోటునకు రాఁగ సుగ్రీవుఁడు నంగదుఁడు మున్నగువారు శంకింప హనుమంతుఁడు విభీషణుని శంకింపఁ బని లేదని యాతఁడు రాముని గుణములను రావణుని దోషము లెఱుఁగు వాఁడని రాక్షస రాజ్యమును గోరి వచ్చియుండ నోపు నని పలికి నిర్ణయమును  రామునకు  విడుచుట.

కం. రావణుతోఁ బరుషమ్ముగ
నీ విధి యని రావ ణాసురేం ద్రానుజుఁడే
పే వచ్చె నంత రాఘవు
లా వీర వరులు నిలిచిన యచ్చోటునకున్ 1.

చం. పుడమిని నిల్చినట్టి హరి ముఖ్యులు గాంచిరి మేరు శృంగ రూ
పుఁ డగు విభీషణున్ ఘను నభోవర వీథిఁ దటిత్ప్రభాంగు నా
యెడ నిలువంగ నల్వురు ధరించి నివాత మహాయుధమ్ములం
గడు ప్రియ మిత్రు లాతనికిఁ గాంచన భూషిత భీమ విక్రముల్ 2.

తే.గీ. అతని నభ్రాద్రి సన్నిభు నశని సన్ని
భద్యుతుని వరాయుధు వరాభరణ భవ్య
భూషితుని సచత్వార విబుధు నరసి త
లంచె సుగ్రీవుఁ డా కపుల సహితమ్ము 3.

ఆ.వె. ఒక ముహూర్త మాతఁడు కపి నాథుండు చిం
తించి యెడఁదఁ బలికెఁ గాంచి హరుల
ను హనుమంతుఁ గూడి నుడు లుత్తమములు సు
గ్రీవుఁ డెల్లరు విన నీ విధముగ 4.

చం. నలువురఁ గూడి రాక్షసుల నైరృతి ముఖ్యుఁడు సాయుధుండునై
యల యదె వచ్చు చుండె గనుఁ డందఱఁ జంపఁ దలంచి యాత్మలో
వలదిఁక యిందు సంశయము వానర నాథుఁ డనంగ నిట్లు వా
రలు విని పల్కి రంతఁ దరులన్ గిరులన్ వడి సెత్తి యివ్విధిన్ 5.

తే.గీ. వానరోత్తము లారసి ప్లవగ పతిని
నానతిమ్ము సుగ్రీవ! మే మడరి చంప
వారి నల్ప జీవులఁ గూల్ప వసుధ హతుల
శీఘ్రముగ మాకు నంచు వచింప నంత 6.

చం. వననిధి తీర ముత్తరము పన్నుగఁ జేరి విభీషణుండు ని
ల్చినభము నంద ప్రాజ్ఞుఁడు వచించె ఘనస్స్వర మందు గాంచి యా
వనచర వానరేంద్రులను వాక్యము లిట్లు కుబుద్ధి రావణుం
డను నసురుండు రాక్షస గణాధిపుఁ డాతని కేను దమ్ముఁడన్ 7.

తే.గీ. విశ్రుతుఁడ విభీషణుఁ డను పేరు నందు
నన్నచేత సీతా సతి యపహరింపఁ
బడె జటాయు వణంగ వివశయు దీన
యసుర వనితల రక్షణ మందుఁ గలదు 8.

ఉ. కోరితి హేతు వాక్యములఁ గోమలి సీత నొసంగ వేగమే
యా రఘు నాథ రామునకు నన్నను బల్కరు నేను రావణున్ 9.

నేరఁడు కాల చోదితుఁడు నెమ్మి గ్రహింపఁగఁ బథ్య వాక్యముల్
ఘోర రుజార్తి యౌషధము కూర్మి గ్రహింపని భంగి దోఁపఁగన్

ఉ. దార కుమారులన్ విడిచి తన్నర పుంగవు రాము వేఁడగన్
నే రఘు వీరునిన్ శరణు నిర్దయ నింద లిడంగ నగ్రజుం
డారసి నన్ను దాసునిగ నక్కట మించి యగౌరవింపఁగా
మూరిన భక్తి వచ్చితిని బోరన మిత్రుల తోడ రక్తిమై 10.

తే.గీ. అఖిల లోక శరణ్యున కా మహాత్మ
నకు నివేదించుఁడీ రామునకు విభీష
ణుం డరుగుదెంచెఁ దా శరణు నిను గోర
నంచు క్షిప్రముగను నన్ను నాదరించి 11.

కం. విని యా వచనమ్ముల నె
ల్లను సుగ్రీవుండు వేగ లఘువిక్రముఁడే
కని లక్ష్మణు చెంతను రా
ముని సంరంభమున వాక్యము లనియె నిట్లున్ 12.

ఉ. ఓ రఘు నందనా! యిటకు నొక్కఁడు వచ్చె విభీషణుం డన
న్వీరుఁడు రావ ణానుజుఁడు నెయ్యులు నల్వురు వెంట నుండఁగాఁ
గోరఁగ నిన్ను దా శరణు గూఢపు మంత్రము వ్యూహ యానముల్
చారుల శత్రులం దలఁచి చక్కగ వానర భద్ర మెంచుమా 13.

చం. అసురులు కామ రూపులు మహా కపటాత్ము లదృశ్యు లౌదురే
పస గల శూరు లెల్లరును భావ్యము కా దిల వారి నమ్మఁగా
మసలెడు గూఢచారి యగు మానిసి దిండికి ఘోర రాక్షసేం
ద్రు సరస వచ్చె భేదమును దోరముగా మన మధ్యఁ గూర్పఁగా 14.

మత్తకోకిల. లేనిచో స్వయ మెప్పు డైనఁ జరించి నేరఁగ ఛిద్రముం
దాను బుద్ధి యుతుండు నమ్మఁగ దండనం బిడు రాఘవా!
కాననాప్త బలమ్ము సేవక కాయ సైన్యము మౌలమున్
మానకుండ గ్రహింపనౌఁ బగ మంద దం డది త్యాజ్యమౌ 15.

తే.గీ. నైజమున రాక్షసుండు మన రిపున కవ
రజుఁ డితండు స్వయముగ నరవర! రిపు స
మక్షమున నుండి యేతెంచెఁ గక్ష గూడి
యుండు విశ్వసింప నితని నుచిత మగునె 16.

ఆ.వె. అనిపి యుండ నోపు ననుజుని రావణుం
డిటకు నెఱుఁగ వలయు నిట్లు రామ!
వదల రా దితనిని బంధింప నర్హుఁ డ
గును సమర్థు లందు గొప్ప నీవు 17.

ఆ.వె. మాయ తోడఁ బంప మనుజేంద్ర నందన!
వచ్చె నితఁ డిచటకు వధను నెంచి
నమ్మి నీవు నిలువ పమ్మి కాల మరసి
దాఁగి యుండి యంత దనుకఁ దాను 18.

కం. కదిసె ననూహ్యమ్ముగ శ
త్రు దళము నుండి వధియింప దొరకిన వీలే
వదలక శత్రు వులూకం
బదనును గని వాయసమ్ము నణఁచెడు భంగిన్ 19.

చం. స సఖుఁడు తీవ్ర దండమునఁ జంపఁగ నర్హుఁడె యీ విభీషణుం
డసుర గణేంద్రు క్రూరుని నిజానుజుఁ డీతఁడు పల్కి తా సమం
జసముగ నిట్లు వాక్యములు చక్కని వాక్య విదుండు పల్కులం
దసదృశ నైపుణుం గనుచు నా కపి పుంగవుఁ డూనె మౌనమున్ 20.

కం. విని సుగ్రీవుని పలుకులు
ఘన యశుఁ డా రాఘవుండు కని వానరులం
దన ప్రక్కన నిల్చిన వా
రిని హనుమత్ప్రముఖులను బలికె నిబ్బంగిన్ 21.

ఉ. వింటిరి మీర లెల్లరును వీర కపీంద్రుని యర్థ యుక్తముల్
మింటిని నా విభీషణుని మేలుగఁ గాంచి వచింపఁ బల్కులే
యంటిన వేళ కష్ట సమయమ్ములు సన్మతు లాత్మ మిత్రులే 22.

మంటకు నిత్య భాగ్యముల మంతనముల్ వచియింప నొప్పుదుర్

కం. అడుగఁగ నివ్విధి రఘు రా
ముఁడు వినతిఁ దమ దమ భావములు హిత మొసఁగన్
నుడువం జాగిరి వానరు
లడరుచు రాఘువున కంత నానందముగన్ 23.

కం. తెలియని దున్నదె యీ భూ
తలమున నీ కించుకయును ధరణీ నాథా!
వెలయఁగ మన్నన మాపయి
నల యడిగెద వీవు మమ్ము నంబుజ నేత్రా! 24.

ఉ. నీ వతి సత్య నిష్ఠుఁడవు నేర్పరి వౌదు పరీక్షణమ్మునన్
నీవు సుధార్మికుండ వను నిత్యము శూరుఁడవే దృఢం బగున్
నీ విది తోగ్ర విక్రమ మనిన్ రఘునందన! జ్ఞాపకమ్ములన్
నీ వధికుండ వెన్నఁగను నిల్తువు నీ సఖు లందు నిత్యమున్ 25.

తే.గీ. కాన నొక్కరొక్కరు నింపుగా వచింత్రు
నీ సచివులు సమర్థులు నెమ్మి బుద్ధి
మంతులు సకారణమ్ముల నంత దనుక
నిట్లనఁగ నంగదుఁడు వల్కె నిద్ధ బుద్ధి 26.

ఉ. ముందుగ నా విభీషణుని మూరి పరీక్ష యొనర్ప నొప్పెడిం
జందము వల్కె వాక్యములు శత్రు సమీపము నుండి వచ్చుటన్
డెందము నందు సంశయము డిందదు కాంచ విభీషణున్ వెసం
బొందుట భావ్య మెట్లగును భూరిగ నందక నమ్మకమ్మునున్ 27.

తే.గీ. కప్పి నిజ బుద్ధి చరియింత్రు కలుష మతులు
చిక్క నవకాశమే కినిసి ప్రహరింత్రు
చెలఁగు గొప్ప యనర్థము సేర వారి
నర్థము ననర్థము దలంప నర్థ మగును 28.

తే.గీ. దోష మున్న విడువ వలె దోష మధిక 29.

మైన నిశ్శంకను గుణము లత్యధిక మ
డరఁగ గాంచి నంత గ్రహించుట కడు నుత్త
మంబు చక్కఁగఁ జింతింప మనుజ నాథ!

చం. శరభుఁడు నిశ్చయించి యెద సాధ్య మనంగ వచించె నంత ని
గ్గిరలను జార వర్యుఁ బరికింప విభీషణు చిత్త వృత్తమున్
నరవర! పంపఁగా వలెను నైరృతు నైజము శుద్ధ మైనచో
సురుచిర మాతఁ డేఁగి నిజ సూక్ష్మ మతిం గనఁ గార్య మెన్నుమా 30.

చం. పలికెను జాంబవంతుఁడు శుభంపు విచక్షణుఁ డంత శాస్త్రముల్
దలఁచి యదోషవాక్యములు తద్ద గుణావృతముల్ విభీషణుం
డల యరుదెంచ దేశ సమయమ్ము లయుక్తము లైన వేళలోఁ
గలుషుని ద్వేషు రావణు సకాశము నుండియె శంకితుం డగున్ 31.

ఉ. అంతటఁ బల్కె మైందుఁడు నయానయ కోవిదుఁ డివ్విధమ్ము ధీ
మంతుఁడు వాక్య పండితుఁడు మల్లుల శ్రేష్ఠుఁడు హేతు యుక్తముల్
వింతగ రావ ణానుజుఁడు వేగిర మిచ్చట కేఁగుదెంచెనే
చెంతకుఁ జేరి వాని మతిఁ జెన్నుగ నేరఁగ నొప్పుఁ బ్రశ్నలన్ 32.

తే.గీ. అతని భావమ్ము నెఱిఁగి మహాత్మ! దుష్టుఁ
డొ మఱి కాదొ విశదముగ నుచిత రీతి
నప్పుడు దలంచి సేయంగ నొప్పు రామ!
యన హనుమ ప్లవగ వరేణ్యుఁ డంతఁ దివిరి 33.

తే.గీ. హనుమ సంస్కార సంపన్నుఁ డర్థవంత
వచనములు మదురమ్ముగఁ బలికె హరులు
మీరలు బృహస్పతి సములు మేటి బుద్ధి
మంతులం దుత్తము లని నే నెంతు మదిని 34.

కం. వాదనకుఁ గాదు స్పర్ధకుఁ
గాదిఁక నాధిక్యమునకుఁ గాదు నరేంద్రా!
నీదు పని పై న మన్నన
నేఁ దలఁతు వచింప నిట్లు నెమ్మిని రామా! 35.

కం. ఇత్తఱి నర్థానర్థ ని
మిత్తము నీ సచివు లనిన మినుకుల లోనం
జిత్తమున దలఁతుఁ నరవర
సత్తమ! తప్పులు కలవని జరుగవు క్రియలున్ 36.

తే.గీ. కార్య మందు నియోగింపక తెలియంగ
నతని సామర్థ్యము దరమె యట్టు లని త్వ
రపడి కార్య మొసంగుట రామ! దోష
మే యని దలంతు దృఢముగ నే యెడంద 37.

ఉ. చారులఁ బంప నొప్పని విచారము సేసిరి నీదు మంత్రులే
యారయ సంభవం బగునె యయ్యది నేరఁగ వాని బుద్ధినిన్
వార కదేశ కాలముల వచ్చె విభీషణుఁ డంచుఁ జెప్పఁగా
నో రఘు నందనా నుడువ నున్నది యొక్కటి చిత్తగింపుమా 38.

తే.గీ. తగిన చోటగుఁ గాలమ్ముఁ దగినది యగు
నిదియ గుణ దోషములను దా నెడఁద నుభయ
పురుషు లందుఁను జక్కఁగ నరవరేణ్య!
యవ్విభీషణుండు గణింప నంబుజాక్ష! 39.

ఆ.వె. దుష్ట బుద్ధిఁ గాంచ దుష్టు రావణు నందు
నవ్విభీషణుండు నరయ నీదు
విక్రమమ్ము నెల్ల వీరుఁ డతని రాక
యిటకు నతని బుద్ధి కిదియ తగును 40.

చం. అనువుగ గోప్య పూరుషులు నాతనిఁ బ్రశ్నల నేర నొప్పు నం
చనిన సుభాషణమ్ముల విశంక నెలంగ వచింప నాకు నుం
డె నిచట కొన్ని వాక్యములు డెందము నందు బుధుండు పృచ్ఛన
మ్మున నట శంకతో సఖుఁడు బోరన మారును శత్రు భంగినిన్ 41.

తే.గీ. పల్కు లందు నైపుణ్యము పరఁగ కుండఁ
బరుల భావము నైజము వడయ శక్య 42.

మగునె శీఘ్రముగ నెవరి కైన నతఁడు
పలుక నరయ నించుక దుష్ట భావ మేను

ఆ.వె. శఠుఁడు సేర లేఁడు శంక లేని మతిని
స్వస్థతఁ గన నతని వాక్కు లందు
దోష మింత యేని తోఁపకున్న యది నా
కందు వలన లేదు సందియమ్ము 43.

కం. వద నాకారము బలిమిని
నుదరుచుఁ గప్పినను దాఁప నోపఁగ రాదే
మది లోనఁ జెలఁగు భావం
బది నరులకు వివృత మౌచు నడరు ముఖమునన్ 44.

ఆ.వె. కార్య విదుల శ్రేష్ఠ! కాలము దేశముఁ
నెడఁదఁ బరిగణించి యింపుగ నొన
రింప ననుభవమునఁ గృత్యములను క్షిప్ర
మవి ఫలించు నెల్ల నంచితముగ 45.

తే.గీ. నీదు యత్నము రావణుని కడు దుష్ట
వృత్తి వీక్షించి యా వాలి విలయము కపి
ముఖ్యు సుగ్రీవు నభిషేకము గని రాజ్య
మడుగఁ గడఁగి రా మన్నింప నర్హుఁ డగును 46.

కం. మతిమంతుల నుత్తమ! చె
ప్పితి శక్తి కొలంది నేను బిశితాశను స్వ
చ్ఛత నాలకించి మిగిలిన
ది తలంపఁ బ్రమాణ మౌదు స్థిరముగ నీవే 47.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ బదునేడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 18.

ఆంజనేయుని పలుకులు విని రాముఁడు విభీషణుని విడువ లేనని పలుక సుగ్రీవుఁడు మున్ను సమ్మతింప కున్న రాముఁడు కారణములు వివరింప నంగీకరింప విభీషణుఁడు రామునిఁ గూడి యుండుట.

కం. విని వాయుసుతుని మాటలు
ఘనుండు శ్రుతవంతుఁడు రిపుగణ దుర్జయుఁడే
తనర దృఢబుద్ధి రాముఁడు
మనము ప్రసన్నత వహింప మాఱుగఁ బలికెన్ 1.

చం. కలదు విభీషణప్రతి నొకం డెద నాకు వచింప దాని మీ
రలు విన గోరు వాఁడను గరమ్ము శుభమ్మును గోరువారలే
కలిగిన నైన దోషములు గ్రన్నన వచ్చిన మిత్ర భావమే
యలరఁగ నా విభీషణుని నాసురు వీడఁగ రాదు సెవ్విధిన్ 2.

ఉ. తా విని యా గిరావలినిఁ దర్కము సేసి యెడంద నంత సు
గ్రీవుఁడు వానరోత్తముఁడు ప్రీతి తరమ్ములు వల్కె నింపుగా
నీ వచనమ్ము లిట్టులు నరేశ్వర! యీ యసురుండు దుష్టమౌ
భావము నూను వాఁ డయినఁ బాసిన వాఁడును నైన నే మగున్ 3.

తే.గీ. కష్ట కాలమునం దిట్లు కాంచ నన్న
వీడిన విభీషణుఁ డితండు పాడి యగునె
విశ్వసింపఁగ నీతఁడు వీడ కుండు
వాఁడె వ్యసనము లందు నెవరిని నైన 4.

మత్తకోకిల. ఆలకించి మహా కపీశ్వరుఁ డన్న మాటల నన్నిటిన్
నీలవర్ణుఁడు గాంచి యా ధ్వజినిన్ నిజానుజు లక్ష్మణున్
మేలి లక్షణు నవ్వుచుం దగ మేటి సత్యపరాక్రముం
డీ లసద్గిర లింపుగా వచియించె రాముఁడు ప్రీతిమై 5.

తే.గీ. అభ్యసింపక శాస్త్రము లవని నార్య
వృద్ధ జనుల సేవింపక వీర వరుఁడు
ప్లవగ విభుఁడు సుగ్రీవుఁడు వలికి నట్లు
పలుక శక్యము కాదె యెవ్వరికి నైన 6.

ఆ.వె. సూక్ష్మ తరము నిందు సుంతఁ జూతును నేను
రాజ వరుల నెల్ల రమణ నుండు
దాని లౌకికమును గాన వచ్చెడు దాని
విశదముగ వచింప వినుమ వీర! 7.

తే.గీ. స్వకుల జాతులఁ బార్శ్వ దేశ నిలయస్థు
లను బగతురుగఁ జూతు రంచు నుడువఁ బడు
చుండ వింటిమి వ్యసనము లొదవు తఱిని
గాంచి ప్రహరింతు రని వచ్చెఁ గడఁగి యితఁడు 8.

కం. పాప మెఱుంగని వారలు
నీ పరి వారమునఁ బ్రీతి నీక్షింతురు తా
మోపి స్వజనులను బ్రకృతిన్
భూపాలురు గాంత్రు శంకఁ బుణ్యాత్ములనున్ 9.

తే.గీ. ఎట్టి దోషము చెప్పితి విచట నీవు
రిపుల దరినుండి చేరు వారిని గ్రహించు
టందు నట్టిది చెప్పుదు హరివరేణ్య
వినుమ శాస్త్రములఁ గలది విశదముగను 10.

ఆ.వె. అతని కులపు వారమై చనము మనము
కోరి రాజ్య మతఁడు సేరె నసుర
బుధ వరేణ్యులును రిపుల నుంద్రు కాన వి
భీషణుని గ్రహింప వెఱవఁ దగదు 11.

ఆ.వె. నిర్భయముగఁ గలసి నెమ్మిని నుండరు
దాయ లెల్ల నరయఁ దద్ద భీతి 12.

నంది చేసె నసురుఁ డారవమ్ము విభీష
ణుఁడు విభేద మరసి యడుగిడె నిట

తే.గీ. భ్రాత లందఱు నుండరు భరతుఁ బగిది
నందనులు సెల్ల నుండరు నన్ను బోలి
మిత్రు లుండరు నిను బోలి మేదిని సఖ!
గిర లనఁగ రాముఁ డిటుల సుగ్రీవుఁ డంత 13.

తే.గీ. లక్ష్మణునిఁ గూడి త్రుటి లేచి ప్రణతు లొసఁగి
పలికె నిట్లు సుగ్రీవుఁడు పంపె ననుజు
రావణుం డని బంధింప భ్రాత నొప్పు
నంటి క్షమియింపు మోర్వరు లందు ముఖ్య! 14.

చం. అసురులు మోసగాండ్రు సుమి యారయ బుద్ధుల నన్ను పంపఁగా
వెస నరుదెంచెఁ జంపఁగ విభీషణుఁ డుండఁగ విశ్వసించి నీ
వు సఖుఁడ! నిన్ను లక్ష్మణుని బోరన నన్నును దమ్ముఁడే కదా
యసుర విభీషణుండు ఖలుఁ డా దశ కంఠున కో రఘూత్తమా! 15.

ఆ.వె. సచివు లా నలువురి సహిత మేతెంచె న
ని రఘువరుని తోడ నిపుణుఁడు వచ
నమ్ము లందుఁ బలికి యిమ్ముగ వాక్యజ్ఞు
తోడ నూఱకుండెఁ దూర్ణ మంత 16.

ఉ. రాఘవుఁ డాలకించి కపి రాజు వచింపఁ దలంచి యాత్మలో
శ్లాఘిత రీతి నంత ననె సద్వచనమ్ముల నివ్విధమ్ము ను
ల్లాఘుఁడు నైన నేమి మఱి రాక్షసుఁ డెన్నఁగ దుష్టుఁ డైన పే
మోఘము లౌను యత్నములు మూరి యొనర్పఁగ బాధకమ్ములన్ 17.

తే.గీ. యక్ష దానవ సపిశాచ రాక్ష సాళి
నంగుళి కొన చే సెల్లర హత మొనర్తు
నిచ్చగించినను గపీంద్ర! యిద్ధరణి ర
యమున నేను నిశ్చయముగ నడల నేల 18.

ఉ. వింటిమి కాదె పావురము భీతినిఁ దా శరణమ్ముఁ వేఁడినం
గంటకుఁ డైన శత్రువు స్వ కాయపు మాంసము నిచ్చి ప్రోవఁగాఁ
దుంటరి దార హంతకునిఁ దోరము మన్నన నక్కపోతమే
యింటను బూరుషుండ నను నేల వచింప హరీశ్వరా! యిఁకన్ 19.

ఆ.వె. కణ్వ ముని సుతుండు కండు వను మహర్షి
ధర్మనిష్ఠుఁడు మును తద్ద సత్య
వాది చెప్పి నట్టి పరమ గాధను బాడి
నట్టి దాని వినుమ హరివరేణ్య! 20.

ఉ. అంజలి బద్ధుఁ డౌచు నభయమ్మును గోరిన వాని దీనునిన్
భంజన మంతఁ గ్రూరుఁ డని భద్ర మొసంగక చేయ రాదిలన్
మంజుల రీతి శత్రువును మత్తుఁడు నింపుగ రక్షితవ్యులే
యంజస భంగినిన్ శరణ మడ్గఁగఁ బ్రాణము లొడ్డి యైననున్ 21.

ఆ.వె. కలిగి శక్తి స్వయము కామ మోహ భయ కా
రణముల నిజ మెంచ రక్షణ మిడ
కున్న గర్హిత మగు ఘోర మైనట్టి పా
ప మది లోక మందు వానరేంద్ర! 22.

కం. వెడలు నరక్షితుఁడు శరణ
మడిగిన వాఁడు మరణింప నాతని యెదుటం
బడసి యఖిల సుకృతము లా
యడుఁగ బడిన వాని వంత నమరుల పురికిన్ 23.

కం. శర ణార్థుని రక్షింపమి
నరయు నఘము ఘోర మగును యశము నశించున్
హరియించును బల వీర్యము
లరుగ నశక్యము దివికిని హరిగణ నాథా! 24.

ఆ.వె. నిజముల నొనరింతు నేను గండుని వచ
నముల నుత్తమముల నగచరేశ!
ధర్మసంయుతములు దనరించు స్వర్గము 25.

యశము నొసఁగు ఫలము నందఁ జేయు

తే.గీ. నీకు శరణాగతిని నొందు నేను రామ!
యంచు నొక్క మా అడిగిన నభయ మీయ
నాతనికి నాదు వ్రతము భయమ్ము సర్వ
భూతముల నుండి పాపుదు వీత శంక 26.

కం. రానిమ్మాతని శీఘ్రము
వానర పుంగవ! యభయపు వర మొసఁగఁ బడెం
గానిమ్ము విభీషణుఁడొఁ
దా నీఁక రావణుఁ డయినను దప్పక యిటకున్ 27.

చం. విని రఘువీరు మాటలను విస్మయ మంది వచించె స్నేహమే
తనర భృశమ్ము పల్కులు ముదమ్మున సూర్యజుఁ డివ్విధమ్ముగన్
నిను ఘన సత్త్వవంతుని మణిన్ వర లోక మహేశ కోటిలో
జనులు నుతింపఁ బల్క నిటు సత్పథ వర్తన! చిత్ర మెట్లగున్ 28.

చం. సురుచిర మంతరంగమునఁ జొప్పడె నాకు విభీషణుం గనం
బరిపరి రీతులం విబుధు భంగి విశుద్ధుఁడ యంచు బుద్ధియే
పరగెడు నా విభీషణుఁడు ప్రాజ్ఞుఁడు పే మన చెంతఁ దుల్యుఁడై
పరమ సఖిత్వ మందఁ గల వాఁడిఁక రాఘువ వంశ రత్నమా! 29.

కం. విని సుగ్రీవు వచనములు
మనుజేశ్వరుఁ డా హరి యభిమతములు కలిసెన్
ఘను నా విభీషణు గరుఁడు
ని నా పురందరుఁడు నెమ్మినిఁ గలసిన విధిన్ 30.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ

బదునెనిమిదవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 19.

అభయము లభింప విభీషణుఁ డనుచరుల తోడఁ గ్రిందికి దిగి రాముని పాదములపైఁ బడి శరణు వేఁడి రాముఁ డడుగ రావణుని బలాబలముల వివరించుట, రాముఁ డంత లంకా రాజ్యమునకు విభీషణుని రాజుగ లక్ష్మణుని చే నభిషిక్తుఁ జేయించి విభీషణుని మాటల ననుసరించి కడలి నుత్తరింప సముద్రుని వేఁడుటకై దర్భాసనమున నాసీనుఁ డగుట.

కం. పడయ నభయమ్ము నా రా
ముఁ డీయఁగ విభీషణుండు పుడమి మహా ప్రా
జ్ఞుఁడు వంగి కాంచి మది హృ
ష్టుఁ డయి నభము నుండి దిగెను సుహృదుల తోడన్ 1.

తే.గీ. రామ పాదాబ్జముల పయి రయమున పడి
శరణమును వేఁడి మంత్రులు సచివు లా న
లువుర తోడ వచించెఁ బలుకులు ధర్మ
యుక్తములు హర్షదమ్ములు నొప్పిదములు 2.

చం. అనుజుఁడ రావ ణాసురున కాతఁడు నన్నుఁ బరాభవింపఁగా
నిను శరణమ్ము వేఁడ వడి నిత్య శరణ్యుని భూత రాశికిన్
మనమున నిశ్చయించి యనుమాన మొకింతయు లేక వచ్చితిన్
ధనమును లంకనున్ సఖుల దార సుతాదుల వీడి రాఘవా! 3.

తే.గీ. నీదు వశ మిక మనుజేంద్ర! నాదు జీవి
తమ్ము రాజ్యము సర్వ సుఖమ్ము లనఘ!
నా విని యనునయించి యిన కుల వార్ధి
చంద్రుఁ డక్షులఁ ద్రాగెడు చంద మొప్ప 4.

ఆ.వె. చెప్పుమ యసురేంద్ర! యిప్పుడు నిజముగ
రాక్షసుల బల మబలముల నెల్ల
ననఁగ నాలకించి యసుర వర్యుఁడు విభీ
షణుఁడు పలుకఁ దొడఁగెఁ జక్క నిట్లు 5.

మ. ఘనుఁ డా రావణుఁ డెల్ల భూతములకున్ గంధర్వ సర్పాభ్ర గా
మి నికాయమ్మునకే యవధ్యుఁ డగు భూమీ వల్ల భాత్మోద్భవా!
వనజభ్రూణు వరమ్ము లందఁ గనె గర్వం బా దశగ్రీవుఁడే
తనకౌ వీరుఁడు కుంభకర్ణుఁ డనఁగం దమ్ముండు నా కన్నయే 6.

తే.గీ. కుంభకర్ణుఁడు తేజస్వి ఘోర బలుఁడు
శక్ర సన్నిభుం డరయంగ సమర మందు
సేనకు పతి ప్రహస్తుఁడు వానిచేఁ బ
రాజితుఁడు మాణిభద్రుఁడు రజత గిరిని 7.

మ. గురు వర్మంబు నవధ్య మూని మఱియున్ గోధాంగుళిత్రాణమున్
వర వీర్యుం డగు నింద్రజిత్తు సుమహా బాణాసనం బూని సం
గర భూమిన్ నిలుచుం గనంబడక చక్కన్ ప్రేల్చి తా నగ్నికిం
బరులం జంపు నదృశ్యుఁడై చలము దర్పం బేర్పడన్ రాఘవా! 8.

తే.గీ. పార్థివ! మహోదరుఁడు మహాపార్శ్వుఁ డసుర
వరుఁ డకంపనుం డాతని వాహినులకుఁ
బతులు లోకపాల సములు భండనమున
దశ సహస్ర కోటి యసుర దళము వెలుఁగు 9.

తే.గీ. ఘనులు లంకా నివాసులు కామ రూపు
లడర మాంశ మనుజ శోణి తాశనులు సె
లంగి దిక్పాలుర సురల రావణుండు
తూర్ణ మాజి నోడించెను దుష్ట బుద్ధి 10.

కం. విని యప్డు విభీషణుని వ
చనమ్ములు రఘూత్తముండు సక్కఁగ నాలో
చన మొనరిచి యెన్ని మన
మ్ము నందుఁ దాఁ బలికె వచనముల నిట్భంగిన్ 11.

ఆ.వె. నీ పలికిన వన్ని నేను విభీషణ!
తత్త్వముగ నెఱిఁగితి దశముఖుఁ డొన
రించి నట్టి కర్మ సంచయ మెల్లను 12.

విశద రీతి నసుర వీర వరుఁడ!

ఆ.వె. వినుము నా వచనములను విభీషణ! రణ
తలము నందుఁ జెలఁగి దశముఖు వడిఁ
జంపి సప్రహస్తు సహ బాంధవుని రాజుఁ
జేయుదు నిను నిజము చెప్పు చుంటి 13.

కం. చనిన రసాతలమున కేఁ
గినఁ బాతాళమునకు నడుగిడినను వనజా
సను నింట నైన నా చే
త నసువుల విడువఁ బడండు తథ్యం బిదియే 14.

కం. మొగ్గరమున వధియింపక
యెగ్గు లొనర్చు దశకంఠు, నీ నా తమ్ముల్
ముగ్గురి పయి నొట్టు చనను
దగ్గి యయోధ్యకు, ససైన్య తనయ సహితమున్ 15.

తే.గీ. విని పనుల నలయని వాని యినకులేశు
రాముని పలుకులు నిజ శిరమ్ము వంచి
తా నమస్కరించి యసుర ధర్మ నిరతుఁ
డా విభీషణుఁడు దొడఁగె నంతఁ బలుక 16.

ఉ. సాయ మొనర్తు రాక్షసుల సంహరణమ్మున లంక నా మహా
మేయ పురమ్ము మార్కొనఁగ మించుదుఁ బ్రాణము లొడ్డి రాఘవా!
యీ యెడ నీదు వాహినిని నింపుగఁ జేరుదుఁ బోరువాఁడనై
యా యసురప్రవీరుఁ డన నట్టుల రాముఁడు సంతసమ్మునన్ 17.

ఉ. ఆతని నా విభీషణుని నంతటఁ గౌఁగిలిఁ జేర్చి లక్ష్మణుం
బ్రీతినిఁ గాంచి పల్కెఁ దమి వేగమ తెమ్మిట కబ్ధి నీర మీ
వీ తఱిఁ బ్రాజ్ఞు నీతనిని నింపుగ నీ వభిషిక్తుఁ జేయుమా
యాతత రాక్ష సావనికి నాతని తోడఁ బ్రసన్నుఁడం జుమీ 18.

తే.గీ. పలుక నిట్లభిషేకించె నలరి లక్ష్మ 19.

ఋండు రాజుగను విభీషణుఁ గపి ముఖ్యు
లందఱి సమక్షమున రాజు నాజ్ఞ ననుస
రించి యార్వ హర్షమ్మున మించి హరులు

కం. కని రాఘవుని ప్రసాదము
నినదించిరి ఘోర రవము నెమ్మినిఁ బ్లవగుల్
దనరెను సాధువు సాధు వ
ను నుడు లఖిల దిక్కులందును జెవు లదుర్వన్ 20.

ఉ. పావని యా విభీషణునిఁ బ్రాజ్ఞునిఁ గాంచి వచించి రిట్లు సు
గ్రీవుఁడు నిర్వు రెప్పగిదిఁ గీశ సమావృత సైన్య మింపుగా
నీ వన రాశి దాఁట నగు నీవరుణాలయమున్ విభీషణా
నీవ వచింప నర్హుఁడవు నెట్టన క్షోభ్యము కాని దానినిన్ 21.

ఆ.వె. నద నదీపతి యగు నుదధి దాఁటు నుపాయ
మెఱుఁగ కుంటి మిప్పు డెల్లర మిటఁ
బ్లవగ సైన్య మెట్లు బలమునఁ జేరు నా
దక్షిణంపుఁ దీర మక్షయముగ 22.

ఆ.వె. పలుక నిట్లు వారు బదు లిడె ధర్మజ్ఞుఁ
డా విభీషణుఁడు మహాసముద్రు
శరణు వేఁడ నర్హుఁడు రఘురాముఁడు నృవ
రుండు తత్క్షణంబ రుచిరముగను 23.

చం. సగరుఁడు త్రవ్వె సాగరముఁ జారు తరమ్ముగ నప్రమేయముం
దగ నిది నేరి కార్యమును దద్దయుఁ బ్రీతినిఁ సాయ మిత్తఱిన్
మగనికి రాఘవేంద్రునకు మానుగ జేయఁగ నర్హుఁడౌ ననం
గఁ గపి విభుండు నర్కజుఁడు గాంచెను రాఘవునిన్ సలక్ష్మణున్ 24.

తే.గీ. నృపుడు సుగ్రీవుఁడు విపులగ్రీవుఁ డంతఁ
రామునకు విభీషణు పల్కులను వచింపఁ
దొడఁగె సాగరు నుత్తము నడరి శరణ
మడుగుట గుఱిచి సంభ్రమ మడర కరము 25.

తే.గీ. సైజమున ధర్మ శీలుఁడు నరవరుండు
నిపుణుఁడు క్రియల మన్నింప నెమ్మి నంత
నిచ్చగించి సుగ్రీవుని నింక ననుజు
నరసి పలికె రాముడు మందహాస మడర 26.

ఉ. ఈ వచనమ్ము లిట్లనఁగ నింపగుఁ నాకు విభీషణుండు సు
గ్రీవునిఁ గూడి లక్ష్మణ! వరిష్ఠము లౌనని మీకుఁ దోఁచినన్
పే వచియింపుఁ డిప్పుడు విభీషణుఁ డౌ విబుధుండు యోచనం
దీవును దిట్టపే తలఁచి యింపుగ నచ్చిన దింకఁ బల్కుఁడీ 27.

తే.గీ. అంత సుగ్రీవ లక్ష్మణు లప్పలుకల
నాలకించి తనర వినయమ్ము పల్కి
రిట్లు నరసింహ! యీ పల్కు లేల మాకు
సుఖదములు రుచియింపవు సుహృదుఁ డనఁగ 28.

ఆ.వె. లంకఁ జేరఁ దరమె రామ! సేంద్ర సు రాసు
రాళి కైనను వరుణాలయమ్ము
పైనఁ గట్టకుండఁ వంతెనఁ దగు రీతి
నేరి కైన నెంచ నిన కులేంద్ర! 29.

తే.గీ. ఇవ్విభీషణు వచనము లింక నిజము
సేయ నొప్పుఁ దడయఁ గాదు క్షేమ మెన్న
లంకఁ జేర ససేన నీరధిని దాఁట
నా సముద్రు నియోగింప నర్హ మగును 30.

కం. మినుకులు విని రాముఁడు వా
రనంగ ధర్భాసనమున నాసీనుం డ
య్యెను వారిధి తీరమ్మున
ననలము వేది పయినఁ దగ నడరిన భంగిన్ 31.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ బందొమ్మిదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 20.

చారుఁడు శార్దూలుఁ డను రాక్షసుఁడు వానర సైన్యమును జూచి రావణునకుఁ దెలుప రావణుఁడు శుకుఁ డను దూతను సుగ్రీవునకై సందేశముతోఁ బంపఁగా నతఁడు వానరులచే బంధింపఁ బడి రాముని యాదేశమున విడువఁ బడుట.

కం. కనె నట శార్దూలుం డను
ఘన రాక్షసుఁ డా ప్లవంగ గణ సైన్యమ్మున్
వనధి తటి నిలువ సుగ్రీ
వుని కపి నాథు ఘన బాహువుల రక్షితమున్ 1.

ఉ. చారుఁడు రాక్షసేంద్రునకుఁ జాల దురాత్మున కా యనీకముం
దీరుగఁ గాంచి యెల్ల నరుదెంచి రయమ్మునఁ దిర్గి లంకకుం
జేరి వచించె రాజునకుఁ జెన్నుగ వాక్యము లిట్లు కంటి నే
ఘోరము నప్రమేయమును గోఁతుల యెల్గుల సేన నో విభూ 2.

తే.గీ. రెండవ యగాధపుఁ గడలి రీతి పెల్గు
చుండి చేర లంకను నిల్చియుండె దశర
థుని సుతులు సోదరులు రాముఁ డనఁగ లక్ష్మ
ణుండనఁగ సీత మార్గమును బడసి ధృతి 3.

ఆ.వె. ఉత్త మాయుధముల నూని మహా ద్యుతి
సాగరమ్ము సేరి సత్త్వ మడర
నిల్చి రచట బలము నేల నిండి పది యో
జనము లావరించి తనరు చుండె 4.

ఉ. ఏమఱకుండఁ దత్త్వమును నెల్లను రాజ యెఱింగి పంపుమా
క్షేమము నెంచి దూతలను క్షిప్రము రాక్షసు లేఁగి యింపుగా
సామము దాన భేదములఁ జక్క నియోగ మొనర్ప నర్థులే
యా మను జేంద్రు సైన్యమున నంచు వచింప దశాస్యుఁ డంతటన్ 5.

తే.గీ. రావణుండు వ్యగ్రుం డయి రాక్షసాధి
నాథుఁడే నిశ్చయించి మనమ్ము నందు
రక్కసు శుకుఁ డనెడు వానిఁ జక్కఁ గాంచి
యర్థ వేత్తల నుత్తము ననియె నిట్లు 6.

కం. చని వేగమ్ముగ సుగ్రీ
వునిఁ గని శుక! పల్కుమ నుడువుల నిబ్బంగిన్
మన మలరఁగ సందేశ
మ్మును నావచనముల శ్లక్ష్ణముగ నిర్భీతిన్ 7.

ఉ. అంచిత వంశ సంభవుఁడ వారయ ఋక్షర జోత్తముండు నిం
గాంచెను బల్లిదుండ! విను కయ్య మనర్థము నర్థ మిచ్చునే
యెంచఁగ నీకు నించుకయు నింపుగ భాతృ నిభుండ వీవు నా
కెంచిన వానరేశ్వర! యహీన పరాక్రమ! చింత సేయుమా 8.

చం. నర పతి పుత్రు దారను గొనంగ వనమ్మున నేను నీకు వా
నరగణ నాథ! చింతిల మనమ్మున నర్థమె యేఁగు మయ్య నీ
పురమున కింక వానరులు వోవఁగఁ జాలరు లంక కెవ్విధిన్
సురలును దేవగాయనులు చొచ్చిల లే రన నేల వానరుల్ 9.

చం. అసురుఁడు రాక్షసాధిపుని యాజ్ఞను దాల్చి శుకుండు పక్షియై
విసరుచు ఱెక్క లేఁగి వడి విన్మున నిల్చి తరించి వార్ధినిన్
వెసఁ గని వానరేంద్రు నటఁ బేరిమిఁ బల్కఁగ రావ ణోక్తముల్
కసిఁ గపు లంత గెంతిరి ఖగంపు ఛదమ్ములు గోయఁ గొట్టఁగన్ 10.

ఆ.వె. బలిమిఁ బట్టి యెల్ల వానరు లా పక్షి
రక్కసుఁ బ్రహరించి వెక్కసముగ
నాకసమ్ము నుండి యవని పయికిఁ ద్రోయఁ 11.

గూలఁ బడఁగ నంత నేల వాఁడు

తే.గీ. శుకుఁడు పీడింపఁ బడుచును శోక తప్తుఁ
డయి కరమ్ము కాకుత్స్థుని నరసి వేఁడె
దూతను వధింప రెవ్వరు తూర్ణము రఘు
వీర! వీరి నాపు మనుచు భీతి తోడ 12.

కం. తన పతి మతమ్ము నుడువక
తనమతము వచించు దూత తగు వధ కెంచన్
మనుజేంద్ర! యనుక్తములను
వినిపించిన నర్హుఁ డౌను వీర! వధింపన్ 13.

ఆ.వె. రాముఁ డాలకించి రాక్షసుని శుకుని
పక్షి రూప ధారి వాక్యములను
జక్కఁగ ననె నిట్లు శాఖామృగర్షభు
లఁ గని విడుఁడు చంప రాదు వాని 14.

చం. అరయఁగ వాన రాభయము నాకస మందున నిల్చి పక్షముల్
పరఁగఁగ నల్పసాంద్రముగఁ బల్కెను దిర్గి శుకుండు వాక్యముల్
హరివరుఁ గాంచి బల్లిదుఁడ! యారసి రావణు లోక రావణున్
గిరలను నే వచింపఁ బరికించి వచింపుమ నీ మతమ్మునున్ 15.

ఆ.వె. పలికిన శుకుఁ డట్లు వానరర్షభుఁడు సు
గ్రీవుఁడు బలుఁ డాలకించి పలికె
నసురు చారు శుకుని నారసి తూర్ణ మ
దీన సత్త్వుఁ డిట్లు మానితముగ 16.

ఉ. కా విల నాకు మిత్రుఁడవు కా విఁక నర్హుఁడ వీవు జాలికిం
గా వుపకర్త వీవు మఱి కావు ప్రియుండవు నాకు నెంచఁగా
నీ వరి వా రఘూత్తమున కీవు వధార్హుఁడవే సబాంధవం
బీ వసుధం గడంగి వధియింపఁగ నిం దగు వాలి భంగినిన్ 17.

తే.గీ. స సుత బంధు స జాతి సంచయము నిన్ను 18.

నాజి  రజనీచరేశ! రయమునఁ జంపు
వాఁడ లావున నెల్లరఁ గూడి లంక
నెల్ల భస్మము గావింతుఁ దల్లడిల్ల

చం. సకల సురాళి సేంద్ర మయి చక్కఁగఁ గాచిన నేమి రావణా!
సకల గుణాభి రాముని నిశాచర! రాఘవ వీరు చేతఁ బో
వక భవదీయ గాత్ర వర వాయువు లుండెనె దాఁగి తేని ఘు
స్ర కర పథమ్ము సేరినను రాక్షస! చేర రసాతలమ్మునున్ 19.

తే.గీ. హర పదాబ్జము లంటిన హతుఁడ వౌదు
వనుజులను గూడి గంధర్వ హరివ రాసు
ర సపిశాచ గణము లందుఁ ద్రాతలఁ గన
నేను ముల్లోకముల యందు నీకు నసుర! 20.

ఉ. అక్కట వృద్ధుఁ బక్షిని జటాయువుఁ జంపితి వక్షమంబు సూ
యుక్కరి రాము సన్నిధిని నుగ్రుఁడు లక్ష్మణుఁ డైన నుండఁగాఁ
బ్రక్కన భీతి సెందితివి రాక్షస! మూరి గ్రహింప సీతనున్
టక్కరి! నేర వా సతి నెడంద దశాస్య! సరోజలోచనన్ 21.

ఆ.వె. ఎఱుఁగ వకట నీ వహీన బలుని మహా
త్ముని సురలకు నైనఁ బోరునం ద
జేయుని రఘు వరుని నీ యసువులఁ దీయు
వానిని నసురేంద్ర! పరమ పురుషు 22.

ఉ. వాలి కుమారుఁ డంగదుఁడు వాక్యము లంతటఁ బల్కె నివ్విధిన్
మేలుగఁ గీశ సత్తముఁడు మేటి విశారద! దూత కాఁ డితం
డాలము సేయ రాదు మన యందలి సైన్య బలమ్ము లెక్కిడన్
వ్రాలిన చారుఁ డంచు మదిఁ బన్నుగ నెన్నుదు నిశ్చయమ్ముగన్ 23.

ఆ.వె. లంక కేఁగ నీయ రాదు బంధింప న
ర్హుఁ డితఁ డిచట నియ్య దుచిత మంచుఁ
దోఁచు నాకు ననఁగఁ దూర్ణ మెగిరి పట్టి
రతని హరులు రాయఁ డాజ్ఞ నొసఁగ 24.

తే.గీ. కట్ట విలపించు నా విహంగమును దీను
భంగిఁ బీడింప నా చండ వానరులు శు
కుండు దశరథాత్మజుఁ గాంచి ఘోరముగ మ
హాత్ము నెదుట నాక్రోశించె నార్తి నిట్లు 25.

చం. అడఁగెను నాదు ఱెక్క లివి యక్కులఁ బొడ్చిరి మిక్కుటమ్ముగాఁ
బుడమినిఁ బుట్టి నట్టి దినమున్ గతియించెడు రాత్రి మధ్య నేఁ
గడచిన కాల మందును దగం బొనరించిన పాపపుణ్యముల్
వడయుదు వీవు సర్వములఁ బార్థివ! నే మరణింప నిత్తఱిన్ 26.

కం. విని యాతని విలపనములు
కనికరమునఁ జంపఁ డతనిఁ గాకుత్స్థుం డం
త ననె హరులతో విడువుం
డని దూతగ వచ్చె నితఁడు హరివరు లారా! 27.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నిరువదవ సర్గము.

## యుద్ధ కాండము
## సర్గము 21.

రాముం డంతఁ గడలి తీరమున సముద్రున కంజలించి దర్భలు పఱచి బాహువులు దిండ్లు కాఁగఁ
బరుండి యెంత వేడినను సముద్రుఁడు రాకున్న నాగ్రహించి రాముఁడు బాణము విడువ
సాగరములోని జీవ రాసు లెల్లఁ గలంగుట.

ఉ. చక్కఁగ నుంచి దర్భలను సాగర వేలను బ్రాఙ్ముఖుండునై
యక్కడ యంజలించి తగ నబ్ధికి బాహులు పన్నగాభముల్
ప్రక్కన దిండ్లు కాఁగ నరవర్యుఁడు రాముఁడు పవ్వళించెఁ దా 1.

నెక్కటి శత్రు సూదనుఁ డహీన పరాక్రముఁ డంతఁ బ్రీతిమై

చం. మణిమయ కాంచ నాభరణ మౌక్తిక సంయుత దివ్య బాహు భూ
షణ విలసద్భుజమ్ము లవి సల్లలి తాంచిత భవ్య మానినీ
మణులు స్పృశింప యుక్తములు మాటికి మాటికిఁ జంద నాగరుల్
ప్రణతిని పూర్వ మద్దఁబడ రాజితముల్ తరణిప్ర భాభముల్ 2.

ఉ. మున్నది జానకీ సతియె మూర్ధమునున్ శయనమ్మునం దిడన్
మిన్నగ పెర్గి నట్టిది యమేయ బలాన్విత తక్ష కాభముం
జెన్నుగ గంగ నీట నభిషిక్తము నాజి యుగాభమౌను శ
త్రూన్నత మిత్ర శోక పర మొల్లసదం బిట పేల నానెసే 3.

సీ. ఆతని బహు దీర్ఘ హస్తము నారి రాపిడి గట్టిపడినది విరివి గాను
దక్షుని పరిఘాభ దక్షిణ బాహు దండము పేల యాల నడరి యిడినది
తలగడగా మఱి విలసిల్ల రాముఁడు మరణ మేని కడలి తరణ మేని
నేఁ డగు నాకంచు నిశ్చయించి యెడఁద శయనించె సన్ముని సరణి నుండి
తే.గీ. విహిత విధి నప్రమత్తతఁ బృథివి పయిన
నుండ దర్భ తల్పము నందు నుత్తమముగఁ
గడచె రేలు మూడు గొలువఁగా సముద్రు
ధర్మ వత్సలుఁ డంచిత ధర్మ వేది 4.

చం. నియతినిఁ బూజ సేసినను నెమ్మిని రాముఁడు వార్ధి మందుఁడై
భయ మెద లేక యించుకయుఁ బార్థున కీయఁడు దర్శనమ్మునున్
నయనము లెఱ్ఱవాఱఁగ ఘనమ్ముగ రాముఁడు కిన్క నూని కాం
చి యనుజుఁ జెంత లక్ష్మణు వచించె సులక్షణు తోడ నివ్విధిన్ 5.

చం. ఒసగఁడు స్వీయ దర్శనము నుద్ధతి సాగరుఁ డింక నక్కటా
పొసగవు మంచివారి మృదు పూరిత వాక్యము లార్జవంపు టా
పస శమమున్ క్షమాగుణ మవశ్యము నిర్గుణు లందుఁ జూపఁగా
వసుధ ఫలమ్ము లీయ వవి వారి నశక్తులుగాఁ దలంతురే 6.

ఆ.వె. తనను బొగడు కొను నతనిని దుష్టుని ధృష్టు
దండ మెత్తి పేగ దశ దిశలను 7.

బాఱు వానిఁ గాంచి పన్నుగ గౌరవిం
చును జగమ్ము వింటె చోద్యముగను

కం. కలుగదు కీర్తి యశమ్మును
గలుగదు లక్ష్మణ! జయమ్ము కయ్యము లోనం
బలికిన సామ వచనములు
లలితమ్ముగ నెన్నఁ డీ యిల విచారింపన్ 8.

ఉ. కాంచుమ నేఁడు ఘోర విశిఖమ్ముల నేయఁగ నేను లక్ష్మణా!
మించి మహోబ్ధి తోయములు మెండుగ స్రుక్కఁగ భిన్న నక్ర రా
ట్సంచయ మెల్ల చోటులఁ బ్రసారము కాఁగ భృశమ్ము తేలి యీ
యంచిత భీమ సాగరము నార్తిల నిప్పుడు మిక్కుటమ్ముగా 9.

ఆ.వె. భోగి భోగములను ముక్కలు చెక్కలు
కాఁగ భూరి మత్స్య కాయములను
గరుల తొండములను గాంచుమ సౌమిత్రి
నీరరాశి యందు నిండి యుండ 10.

తే.గీ. శంఖ శుక్తికా జాలము సఝష మకర
సంయుత మకరాలయమును శర వరాలి
నేను శోషిల్లఁ జేయుదు నేఁడు భీమ
యుద్ధ మందు వీక్షింపుమ యిద్ధ చరిత 11.

చం. నయముగఁ జూప నే క్షమను నన్నసమర్థునిగాఁ దలంచె నౌ
ర యుదధి యిట్టి వారి కిసి లక్ష్మణ! యోరిమిఁ జూపఁ బాడియే
ప్రియముగ స్వీయ దర్శనము ప్రీతిని వేఁడఁగ నీయఁ డక్కటా
రయమునఁ దెమ్ము వింటిని శరమ్ములఁ బన్నగ సన్నిభమ్ములన్ 12.

తే.గీ. కడలి నెండింతుఁ బదములఁ గపులు సనఁగ
క్షోభ పెట్టుదు వనధి నక్షోభ్య మైన
వేల గల యూర్మిమాలిని విశిఖ పంక్తి
వేగ మొనరింతు మర్యాద వీడు నట్లు 13.

చం. కలఁచెద నిమ్మహార్ణవముఁ గ్రన్నన భీకర దానవాలి సం
కులమును బల్కి యివ్విధము క్రోధ సమాకుల లోచనుండు రా
ట్కుల మణి చాప హస్తుఁడు కడుంగడు కిన్కను ఘోర వహ్ని యు
జ్జ్వలితము వోలెఁ గన్పడెను బార్థ వరేణ్యుఁడు రాముఁ డత్తఱిన్ 14.

తే.గీ. వంచి విల్లు ఘోరమ్ముగ వణఁకఁ జేసి
జగము నుగ్ర శరమ్ముల సత్వరముగ
విడిచె బాణములను రాఘవుఁడు శతక్ర
తువు విడిచి నట్లు వజ్రము దుస్సహమును 15.

ఆ.వె. మండుచు నవి యెల్ల మెండుగ తేజము
నను మహా జవమున నారసముల
నుత్తమములు దూఱె నుదధి జలమ్ములఁ
బన్నగములు వణఁక మిన్నగాను 16.

ఆ.వె. ఘోర మయ్యెఁ గడలి మారుత ధ్వానమ్ము
మిన్ను ముట్ట మకర మీన కంపి
తమ్ము సై కరమ్ము తచ్ఛర సంపాత
వేగమునను దిశలు పిక్కటిల్ల 17.

తే.గీ. అలలు పెల్లుబుకె వడి ముత్యములు శంఖ
ములు తరంగములను గూడి పొర్లు చుండె
ధూమ మయము లయ్యె నలలు తోరముగను
సాగరము భీకరం బయ్యె సత్వరముగ 18.

ఆ.వె. వ్యథితు లైరి బలులు పాతాళ తలవాసు
లెల్ల దానవు లట నింక దీప్త
వదన దీప్త నయన పన్నగ సంచయ
మెల్లఁ జూచు చుండఁ దల్లడిల్లె 19.

తే.గీ. సింధు రాజ భంగమ్ములు చిత్రముగను
నక్ర మకరమ్ములను గూడి నభము ముట్ట
లేచె నువ్వెత్తునను జెలరేఁగి వింధ్య 20.

మందర నిభము లప్పు డమందముగను

తే.గీ. సుళ్లు తిర్గిన భంగ రాసులను భ్రాంత
చిత్త రాక్ష సోరగపు టంచె లవి యెల్ల
పైకి లేచి పడు మొసళ్ల పటల మెల్ల
సంవృతములు కా నగపడె సలిల రాశి 21.

కం. కని యుగ్రు రాఘువుని విం
టిని లక్ష్మణుఁ డంతఁ బట్టి లేవన్ హస్త
మ్మున లేచి వేగ వలదం
చును బల్కెను లాగు చుండఁ జొప్పడ బుసలే 22.

తే.గీ. ఆర్య యిది యెల్ల లేకయె యర్ణవంపుఁ
గార్య మగును జక్కఁగ వీరవర్య! నిన్ను
బోలు వారు చిరము కిన్క బొంద రిట్లు
కనుమ సాధు వృత్తమ్మును గాంచ ఫలము 23.

కం. సుర ఋషులును బ్రహ్మర్షులు
స్వరాధికముల వలదంచు వచియించిరి యె
ల్లరు కష్ట మిది యనుచు నం
తరిక్షమునఁ గాన రాక త్రాసము మీఱన్ 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నిరువది యొకటవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 22.

అంత శ్రీరాముఁడు సముద్రుని తోడ నిన్నిప్పుడు సపాతాళ మెండింతు నని బ్రహ్మాస్త్రమును సంధింప

నాతఁడు ప్రత్యక్షమై ప్రార్థించి నీలుని చే వారధిని కట్టింపుఁడు నాపై నని యంతర్ధానము కాఁగ
వానరుల సాహాయ్యముతో నీలుఁడు సముద్రముపై వంతెన నైదు దినములలోఁ గట్ట నెల్లరు
సంతోషముతోఁ జిందులు వేయుచు దాఁటి యావలి యొడ్డున నిల్చుట.

కం. అంతఁ బలికె రఘు వరుఁ డ
త్యంతము దారుణములు గిర లబ్ధినిఁ గని యెం
డింతు నిను సపాతాళము
సొంతమ్ముగ నర్ణవంబ! యని యుగ్రుండై 1.

తే.గీ. అర్ఘ్య మచ్చర దగ్ధ తోయముల నెండి
యర్ణవమ! నీవు నిహత సత్త్వాలి రేఁగ
నిసుక యెల్లెడలను గాంతు విపుడు నీదు
దర్ప మివ్విధి నణఁగంగఁ దథ్యముగను 2.

ఆ.వె. అంప వాన కురియ నింపుగ నా వింటి
నుండి తెఱపి లేక యెండ నీవు
నడక నేఁగు వారు నగచరు లెల్లరు
సాగరంబ! కనుమ వేఁగి తూఁగి 3.

ఉ. నేరవు నీవు పౌరుషము నిష్ఠను నాదు పరాక్రమమ్మునున్
ఘోరత రాసురాలయ! సుఘోర విచారము నందు దీ విటన్
నా రఘు వంశ వీరుఁ డని నారస మా విలు నందుఁ గూర్చి గం
భీరుఁడు బ్రహ్మదండ నిభ భీమ తరాస్త్రము బ్రహ్మ మెక్కిడెన్ 4.

ఉ. లాగఁగ నారి ఘోరమును రాఘువుఁ డొక్క త్రుటిన్ నభం బహో
నాగము లెల్ల నంతట ఘనమ్ముగఁ దూఁగఁగ వేగ వ్రయ్యునో
నాఁగ స్ఫురింప సంతమము నాలుగు దిక్కులఁ బ్రాకె లోక మం
దా గతి రేఁగెఁ దల్లడిలె నంతఁ దటాక సరోవ రాపగల్ 5.

సీ. శశి సూర్య నక్షత్ర సంచయమ్ము తిరుఁగఁ జాగెను వెన్కకు వేగ మణఁగి
భాస్క రాంశువు లున్న వాయు పథమ్మునఁ జీఁకటి వ్యాపించెఁ జిత్రముగను
వేలవే ఉల్కల వెలిఁగె నభో వీధి యంతరిక్షమ్మున నశని రావ
ములు రేఁగె మిక్కుటముగ దద్దరిల్లంగ నెల్ల మేఘమ్ములు చెల్లచెదరె

తే.గీ. దివ్య మారుతపంక్తులు తీవ్ర గతిని
వీవ సెల్లెడఁ దరు లెల్ల విఱిగి పడెను
మాటి మాటి కెగురు చుండె మబ్బు లెల్లఁ
గదలె గిరులు విఱిగె నా శిఖరము లెల్ల 6.

ఆ.వె. దివిని ముట్టి మబ్బు లవి నిస్వనమ్ముల
తోడ మెఱుపు లొసఁగెఁ దోరముగ న
నల కణమ్ముల నుఱుములు పిక్కటిల్లంగ
దిక్కు లెల్ల నంతఁ గ్రక్కదలఁగ 7.

చం. కనఁబడు నట్టి భూతములు గట్టిగఁ బిడ్గుల వోలెఁ గూయఁగాఁ
గనఁబడ నట్టి వార్చినవి కాఱియ భైరవ నిస్వనమ్ములన్
వనరిన వెల్లఁ దాపమున వారని భీతి సెలంగ నాత్మలన్
కనమట సెట్టి చేష్టలను గ్రమ్ముకొనంగ భయమ్ము తీవ్రమై 8.

తే.గీ. భూతములఁ గూడి యూర్మికా వ్రాతములను
గూడి రాక్ష సోరగములఁ గూడి వేగ
వంత మయ్యె మహా వేగ వార్ధి దాఁటె
వేల యోజనము తృటిని వేఱు చోట 9.

ఆ.వె. తా నతిక్రమించు దాని నద నదీప
తినిఁ జెలంగు దాని వననిధిఁ గని
రాఘవుండు పగతుర వధించు వాఁడు మ
రలఁ డొకింతయును నరర్షభుండు 10.

కం. వనరాశి మధ్య నుండి వ
డి నా సముద్రుండు లేచె డిగ్గన నమ్మే
రు నగమ్ము నుండి యుదయిం
చు నా దివాకరునిఁ బోలుచు నట స్వయముగన్ 11.

మ. ఒసఁగెన్ దర్శన మా సముద్రుఁ డతి దీప్తోగ్రాస్య సర్పమ్ములన్
వసు భూషా విలసచ్ఛరీరమున సద్వైడూర్య సంకాశుఁడై
సు సరోజచ్ఛద సన్నిభేక్షణుఁడు నక్షోభుండు పుష్పౌఘ దా 12.

మ సురాజద్వర మూర్ధ భాసితుఁడు హేమభ్రాజి తాబంధుఁడై

సీ. రక్త మాల్యాంబర రాజి తాంగుఁడు నాత్మ సంజాత రత్న భూషణ విరాజి
తుండు వివిధ ధాతు మండిత హిమవన్నిభుండు కౌస్తుభ నోదరుండు నైన
నొక్కపేట నడుమ నుత్తమ పాటల ప్రభ మెఱయుచు నున్న రత్న మడర
విపు లోరమున సుందరపు భంగి నుత్తుంగ భంగ సమావృత భాసితుండు
తే.గీ. కాలి కానిల సంకుల ఘన రవుండు
సింధు గంగా ముఖ నదులు సేరఁ దోడు
క్షుబ్ధ రాక్షస పన్నగ ఘోర నక్ర
పరివృత వివిధ రూప నిర్జర విభుండు 13.

ఆ.వె. సాగరుండు వచ్చి చయ్యన నామంబు
నుచ్చరించి రాఘవోత్తముఁ గని
బాణ హస్తు నంతఁ బ్రాంజలి భక్తితోఁ
బలికెను వినయమునఁ బలుకు లిట్లు 14.

చం. పుడమియు గాలి యాకసము పూరుష వర్య! జలమ్ము కాంతియుం
దడయక వారి నైజములఁ దప్పక నిల్తురు శాశ్వతమ్ముగం
గడలిని నా స్వభావమె యగాధపు టున్కి చరింప దాఁట వీ
లిడకయె గాధమై యునికి యెంతొ వికారము నాకు రాఘవా! 15.

ఆ.వె. కామము సెలగంగఁ గాదు లోభమ్మునఁ
గాదు రాఘవేంద్ర! కాదు భీతి
నేను వల్కు టిట్లు మాన వాధిప పుత్ర!
లోక నైజ మేను వీఁక నందు 16.

తే.గీ. గ్రాహ నక్రాకుల జలము రామ చంద్ర!
నేను స్తంభింతు నెట్లైన వానరులఁ ద
రింపఁ జేయుదుఁ గపుల బాధింప పేవి
వీలు కల్పింతు రాఘవ! వీరు దాఁట 17.

ఉ. నా విని పల్కె రాఘవుఁడు నైపుణుఁ డస్త్రము లందు మిన్నగా
నో వరుణాలయా వినుమ యుగ్ర మమోఘము యీ శరం బహో 18.

నీవ వచింపుమా యెచట నే విడువంగఁ దలంతువో వడిన్
నా విని సాగరుం డనియె నారసముం గని పల్కు లివ్విధిన్

చం. కలదొక టుత్తరమ్మున నృకాంతుఁడ! నా దగు పుణ్య దేశమే
యిల ద్రుమకుల్య నామమున నింపగు ఖ్యాతిని నీకు నెర్కయొఁ
గలరట నుగ్ర దస్యు లఘు కర్మలు త్రాగుచు నా జలమ్ము బె
స్తలు ప్రముఖుల్ సహింప నయ! స్పర్శను వీడు శరమ్ము నచ్చటన్ 19.

కం. విని సాగరు వాక్యములను
ఘన దీప్త శరమ్ము విడిచెఁ గాకుత్స్థుం డం
త నరర్షభుం డమోఘ
మ్మును జలనిధి పలికిన స్థలమున వేగముగన్ 20.

తే.గీ. పడఁగ వజ్రాశని సమప్రభా శరమ్ము
తత్ప్రదేశమున మరు కాంతార మనఁగ
విశ్రుతమ్మున నినదించెఁ బృథివి బాణ
పీడితంబై యధికముగ బిగ్గరగను 21.

తే.గీ. తోయ ముద్భవించె శరముతో రసా త
లమ్ము నుండి కూప మట నేర్పడెను వ్రణ మ
నంగ విశ్రుతం బయ్యెను బొంగ నుదధి
జలము వోలు నీ రచ్చట సంతతమ్ము 22.

తే.గీ. చీల్చు నట్టి ఘోరధ్వని చెవులు దద్ద
రిల్ల నుద్భవించె నపుడు పెళ్లు మనుచు
బాణపాత వేగమున గర్భమున నున్న
జలము సంపూర్ణ మెండెఁ దత్క్షణము నందు 23.

ఉ. అమ్మరు కాననమ్ము ధర ఖ్యాతినిఁ బొందె విశేష రీతిగా
నిమ్మను జేశ్వరుండు కడు పెల్లను శోషిలఁ జేసి ముల్కితో
నిమ్ముగఁ దా వరం బొసఁగె నింద్ర సమాన పరాక్రముండు రా
గమ్మునఁ బండితోత్తముఁడు క్రన్నన దానికి నివ్విధమ్ముగన్ 24.

తే.గీ. విగత రోగ పశువు లిట వృద్ధి సెంద
సుఫల మూల రసములతో సురుచి రాజ్య
చందన క్షీర యుతము నౌషధ సహితము
బహు గుణముల మరు వనము పరఁగు నంచు 25.

కం. రామ వర దానము వలన
నా మరు కాంతార మడరె నంచిత గతినిన్
భీ మోదరమ్ము మండఁగ
రామునితోఁ బలికె సాగర వరుం డంతన్ 26.

ఉ. ఈతఁడు సౌమ్య చిత్త! నలుఁ డీతఁడు పుత్త్రుఁడు విశ్వకర్మకున్
పే తరి యింప వంతెనను వృక్ష చరుం డిటఁ గట్టు నా పయిం
బ్రీతి నొసంగె నా వరము వీనికిఁ దండ్రి వహింతు వారధిన్
భూతల నాథ నందన! సముం డితఁ డెన్నఁగఁ దండ్రి కిద్ధరన్ 27.

కం. విమ లోదధి యంతర్ధా
న మయ్యె వచియించి యిట్లు నలుఁ డుత్థితుఁడై
సముచితముగాఁ బలికె ని
ట్లు మర్కటశ్రేష్ఠుఁ డా బలుఁడు రామునితో 28.

చం. పలికె నిజమ్ము సాగరుఁడు వంతెన కట్టుదు నాత తాబ్ధిపై
నలవడఁ దండ్రి లావు జగ మందు నరాలికి నొప్పు దండమే
తలఁతును రామ యివ్విధము దానము సాంత్వము నింక నోర్మియున్
వల దకృతజ్ఞు లందు గతి వారిధి యిచ్చెను దండ భీతినిన్ 29.

కం. తనపై వంతెన కట్ట మ
దినిఁ గోరుచు సాగరుండు దృష్టిడి దండ
మ్మున రాఘవున కొసఁగె మి
ట్ట సెంచి చూడంగ నిక్కడ రఘు వరేణ్యా! 30.

తే.గీ. ప్రీతి వరమిచ్చెఁ దల్లికి విశ్వకర్మ
మందర తటిని వాని కుమారుఁడను స
ముండ వానికి స్మృతి సముద్రుం డొసంగె 31.

నడుగమి వచింప కుంటి నే నార్య నీకు

తే.గీ. నే సమర్థుఁడ నిర్మింప నీర రాశి
సేతువును నేఁడ కపు లెల్ల సిద్ధ మగుఁడు
కట్ట నన రాము నానతిఁ గపి వరేణ్యు
లెల్ల వేల సంఖ్యల వని కేఁగి రెలమి 32.

ఆ.వె. శైల సంచయమును శైల సన్నిభులు శా
ఖామృగ గణ పతులు భీమ బలులు
విఱిచి యీడ్చికొనుచు వేగ వచ్చిరి సాగ
రాంకమునకుఁ దివిరి యంద ఱెలమి 33.

తే.గీ. అశ్వకర్ణ సాల ధవ ఘనార్జున కుట
జ తిలక తిమిశ ఘన తాల సప్తపర్ణ
బిల్వ కర్ణికా రాశోక వృక్ష చూత
వంశములఁ బుష్పితమ్ముల వనధి నిండె 34.

ఆ.వె. వేరు లుండ కొన్ని వేరులు లేక కొ
న్నింటిఁ దరుల లేపి వెంట తెచ్చి
రడరి యంత యెల్ల హరు లింద్రు ధ్వజములఁ
బోలు వాని వేగ వేల కెలమి 35.

తే.గీ. తాల తరులు దాడిమ వీరుధమ్ము లింక
నారికేళములును దాంద్ర నగ వరములు
వేప చంద్ర పొగడ చెట్లు వేఱు వేఱు
చోట్ల నుండి తెచ్చిరి హరి శూరు లడరి 36.

చం. శిలలను బర్వతమ్ములను శీఘ్రుమ కుంజర సన్నిభమ్ములన్
బలులు మహా శరీరులును వానర వీర వరుల్ పెకల్చి యా
జలనిధి కంత యంత్రములఁ జక్కఁగ తెచ్చిరి సంభ్రమమ్ము నన్
జలమున వేయ శైలములు సత్పథ మంటి పడెన్ జలమ్ము లే 37.

తే.గీ. కడలి క్షోభించెఁ బడుచుండ గండ్ర శిలలు 38.

మిక్కుటమ్ముగ నప్పు డే ప్రక్క గనిన
మూరి వంద యోజనముల పొడవు సూత్ర
ము నితరులు పట్టి రచ్చట మోదమునను

ఆ.వె. కట్టఁ దొడఁగె నలుఁడు కడలి నద నదీ ప
తి పయినఁ గడు దొడ్డ దిట్ట మైన
వంతెన నట దొడ్డ పనుల వానరులు సా
హాయ్య ముండఁ దనకు నంచితముగ 39.

సీ. దండముల నటఁ గొందఱు పట్టు చుండిరి యన్యులు వందల హరులు వెదకఁ
జాగిరి రాము నాజ్ఞ గిరి మేఘ నిభులు కట్టుచు నుండిరి కాష్టములను
దృణముల సుమ తరు గణముల సేతువు నిర్మింపఁ దొడఁగిరి నెమ్మి హరులు
శైల సన్నిభముల మేలి ఱాల నగ శిఖరముల మోయుచుఁ గానఁ బడిరి
తే.గీ. పరువు లిడుచును శిలలను బఱచు చుండి
పర్వతమ్ములఁ బడవేయ వార్ధి యందు
నుద్భవించెను శబ్దమ్ము లద్భుతముగ
దిక్కు లెల్ల ఘోరమ్ముగఁ బిక్కటిల్ల 40.

చం. తొలి దిన మందుఁ బట్టుదలతోఁ ద్వరితుల్ పదు నాల్గు యోజన
మ్ముల నట వంతెనన్ ఘన కపుల్ మఱి యా నలుఁ గూడి కట్టఁగా
మలి దిన మందుఁ గుంజర సమానులు వింశతి కట్ట యోజన
మ్ము లడరి యేక వింశతి సమోదము మూడవ నాఁడు కట్టఁగా 41.

తే.గీ. యోజనము లిరువది రెంటి నోజఁ గట్ట
నాల్గవ దినమం దేనవ నాఁడు కట్టె
నింపుగ నిరుపై మూటిని నొంపు మీఱ
యోజనమ్ముల నా వాన రోత్కరమ్ము 42.

తే.గీ. నలుఁడు విశ్వ కర్మ సుతుఁడు బలము నందు
ఘనుఁడు శ్రీమంతుఁ డుత్తమ కపి వరుండు
కట్టె గొప్పవంతెనను సాగరము నందు
నెట్లు తండ్రి యడరు వాడొ యట్లు మించి 43.

ఆ.వె. మర్కటుండు నలుఁడు మకరాలయమ్మున
సాగరమ్ము నందుఁ జక్కఁ గట్ట
సేతువు వెలిఁగె సురుచిరముగ నచ్చట
నంబరమున స్వాతి యధ్వ మనఁగ 44.

ఆ.వె. కాంచఁ గోరి దేవ గంధర్వ సిద్ధ మ
హర్షు లద్భుతమును నంత వచ్చి
నిల్చి రుత్సుకు లయి నింగిని నా సమ
యమ్ము నందు నెదల హర్ష మడర 45.

కం. నలసేతువు సుర గంధ
ర్వు లడరి పది యోజనమ్ములు వెడలు పుండన్
లలితమ్ము గ శత యోజన
ములు పొడ వుండఁగ నసాధ్యమును గని రంతన్ 46.

ఉ. గెంతుచు దూఁకుచుం గపులు కేలి నొసంగుచు ఘోర గర్జలన్
సంతస మందు చుండఁగ భృశమ్ముగ భూతము లెల్లఁ గాంచె నా
వింతను రోమహర్షణముఁ బృథ్విని దుష్కర మైన దానినిం
జింతకు నంద రాని దగు శ్రేష్టపు టద్భుత సేతు బంధమున్ 47.

ఆ.వె. వంతెన నటఁ గట్ట బల్లిదమును వేల
కోట్ల సంఖ్యలు ప్లవగులు ముదముగ
సంభ్రమించి యంత సాగర పారము
సేరఁ దొడఁగి రెల్ల శీఘ్రముగను 48.

కం. సుకృతము సు విశాలము శ్రీ
ప్రకటిత సుసమాహితమ్ము రమ్యతరమ్మున్
మకరాలయమునఁ గాంచ న
ది కేశ వీథి వలె వారధి ఘనము దోఁచెన్ 49.

ఆ.వె. కడలి పార మందు గద నూని చేత వి
భీషణుండు వైరి వీరుల నెది
రింప సచివ సహిత మింపుగ నిల్చెను 50.

రాక్షస వరుఁ డెలమి రమ్యముగను

ఉ. భూవరు సత్య విక్రముని ముందఱ రామునిఁ గాంచి పల్కె సు
గ్రీవుఁడు రాఘవా! కపి వరేణ్యుని యీ హను మంతు వీపుపై
ధీవర యెక్కు లక్ష్మణుఁడు దీటుగ నంగదు పైన నెక్కఁగా
నా వర వానరోత్తములు నంబుధిపైన జరింత్రు మోయుచున్ 51.

ఆ.వె. సైన్యమునకు ముందు చాగె శ్రీమంతుఁడు
రాముఁ డంత ధర్మ రతుఁడు ధన్వి
లక్ష్మణు ననుజు శుభ లక్షణుఁ గూడి సు
గ్రీవ సంయుతమ్ము పావనుండు 52.

ఉ. కొందఱు సైన్య మధ్యమునఁ గొందఱు పార్శ్వము లందు వానరుల్
గొందఱు నీట నీఁదుచును గొందఱు నన్య పథమ్ము లందునుం
గొందఱు నింగి మార్గమును గోరి చరించిరి పక్షిరాజు నా
చందము దోఁప వేగముగ సంతస మొప్ప ససంభ్ర మాత్ములై 53.

ఆ.వె. కడలి రేఁగి నట్టి ఘనమైన శబ్దము
మంద మయ్యెఁ గపుల మంద ఘోర
సేన సాగు చుండి చేసిన భీషణ
రవములు సెలరేఁగు నవసరమున 54.

కం. నలు సేతువు పై దాఁటఁ గ
పుల సైన్యము తీర మందు మూలఫలమ్ముల్
జలములు గల దేశమ్మున
నిలిపెను సుగ్రీవుఁ డెడఁద నెమ్మి సెలంగన్ 55.

తే.గీ. చేరి రాముని నమరులు సిద్ధ చార
ణులు మహర్షులు పావన జలము చేతఁ
బ్రీతి నభిషిక్తుఁ జేసిరి యాతతంపు
టద్భుతము దుష్కరము నైన యప్పనిఁ గని 56.

కం. నరదేవ! జయం బయ్యెడు 57.

ధరణి స సాగరము సంతతము కాకుత్స్థ!
నిరతిం దగఁ బాలింపుమ
గిర లాశీర్వచనము లొసఁగిరి యిట్లంగిన్

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నిరువది రెండవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 23.

అనేక నిమిత్తములను గని రాముఁడు తమ్ముని లక్ష్మణునిఁ గౌఁగిలించి యీ శకునములు వానర ఋక్ష రాక్షస వీరుల ఘోర యుద్ధమును సూచించు చున్న వని సైన్యమును దగిన వ్యూహముగా నమర్ప వలె నని లంకపై దండెత్త వలె నని పలుకఁగ సుగ్రీవ విభీషణులతో గూడి వానర సైన్యము లంక కభిముఖమై చనుట.

కం. శకునమ్ములఁ గని రాముఁడు
శకునము లెఱిఁగిన విబుధుఁడు సహజున్మని నుం
చి కవుఁగిలి లోన నంతఁ బ
లికె లక్ష్మణు తోడ నరవరిష్ఠుం డిట్లున్ 1.

తే.గీ. శీత లోదకముల తోడ నాతత ఫల
వంత వనముఁ జేరితి మిప్డు వానర బల
మెల్ల విభజించి వ్యూహము నింపుగ నొన
రింప నర్హము లక్ష్మణ! లీల మనకు 2.

ఆ.వె. ఋక్ష వానర గణ రాక్షస వీరుల
కుఁ బొడచూపు చుండె ఘోర మైన
బాధ లోక నాశ భయము భీమముగఁ గ
న్పట్టు చున్న దిపుడు నాకు ననుజ! 3.

ఉ. వాయువు వీచు చున్నయది పాంశు సమేతము మిక్కుటమ్ముగా
నాయత రీతిఁ గంపనము లారయ వచ్చె ధరాతలమ్ములోఁ
బాయక పే ప్రకంపములు పర్వత పంక్తులఁ గాన వచ్చెనే
యీ యెడఁ గూలెఁ బాదపము లిద్ధర ఘోరము లిచ్చ టచ్చటన్ 4.

కం. ఘోరక్రూర మృగాభ మ
హా రవ మేఘములు శోణి తాకలితమ్ముల్
నీరములు గురియు చున్నవి
క్రూరముగఁ బరుషములై సుఘోరపు రీతిన్ 5.

ఆ.వె. రక్త చందనంపు రమణ సంధ్య తనరు
చుండె దారుణముగ మండు భంగి
నగ్ని మండలమ్ము లాదిత్య గోళమ్ము
నుండి రాలు చుండె మెండుగాను 6.

కం. క్రూర మృగములు విహంగము
లా రవి వీక్షించు చుండి యతి దీనముగన్
వారక యార్చుచు నున్నవి
మూర భయం బెడఁదల ఘనముగ నెల్లెడలన్ 7.

తే.గీ. ఇంచుకయుఁ బ్రకాశమ్ము వహింపకుండ
రాత్రి వేళ చంద్రుండు తారా ధవుండు
తాప మొసఁగు చుండెను జగత్క్షయ మనంగ
నీలి రక్తాంశువుల నూనె నీరజారి 8.

ఆ.వె. మున్నెఱుఁగని యట్టి ముదుగైన చిన్నని
రూప మంది దినకరుండు గాలి
గుడి నగపడు చుండెఁ గడు నీలి మచ్చ నూ
నె విమ లార్కుఁ డనుజ! నింగిలోన 9.

కం. కను మో లక్ష్మణ! నక్ష 10.

త్ర నిచయ మీ ధూళి చేతఁ దద్దయును మఱుం
గునఁ బడెఁ దెలుప యు గాంతం
బని లోకమ్ములకు నెల్ల నాశ్చర్యముగన్

కం. కాకులు డేగలు గ్రద్దలు
వీఁక నెగురు చుండెఁ గ్రింద బీభత్సముగన్
భీకరముగ నక్క లిచటఁ
గూఁక లొసఁగు చుండెఁ గనుమ ఘో రాశుభముల్ 11.

తే.గీ. శైల శూల ఖడ్గమ్ముల నాల మందు
విసరఁ గపి రాక్షస గణమ్ము వసుధ నిండు
మాంస శోణిత కర్దమ మయ మగు నీఁక
భూ తలం బెల్ల సౌమిత్రి! యాతతముగ 12.

ఉ. ఇప్పుడ ముట్టడింప వలె నెల్ల హరీంద్రులఁ గూడి లంకనున్
గొప్ప దతిక్రమింప సుర కోటికి శక్యము కాని దానినిం
జొప్పడ వేగ మింపుగను శూరుఁడు రాఘవుఁ డిట్లు పల్కఁ గా
నప్పురుషోత్తముండు వడి నంతట నా విభుఁ గూడి వానరుల్ 13.

తే.గీ. రావణాసుర పాలిత రమ్య పురము
న కభిముఖముగ సుగ్రీవు నగ చరేంద్రు
నవ్విభీషణుఁ గూడి యా హరి గణమ్ము
కదలె నినదించుచు వధింపఁగ రిపు కోటి 14.

కం. ముద మందె రాముఁ డారసి
యెద వీర హరుల పనులను నింగితముల నిం
క దృఢ మనస్సులను భృశము
కదలంగఁ దనకుఁ బ్రియ మొసఁగఁ గపివరేణ్యుల్ 15.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నిరువది మూడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 24.

లంకను జూచి రాముఁడు లక్ష్మణునితో లంకా నగరమును వర్ణించి సైన్యమును వ్యూహముగా నిలుప నాజ్ఞాపించి బంధింపఁ బడిన శుకుని విడువ సుగ్రీవు నాదేశింప శుకుఁడు రావణునిఁ జేరి వానర సైన్య బలమును వర్ణింప రావణుఁడు స్వీయ బలమును బ్రస్తావించుట.

కం. కపి వీర మహానీక
మ్ముకు పన్నుగ వెలింగెఁ జిత్రముగ వీక్షింపం
గపి రాజుతో శరత్కా
ల పూర్ణిమ వలె శశి తారల సహిత మచటన్ 1.

ఆ.వె. పృథ్వి సంచలించెఁ బీడింపఁ బడి త్రాస
మందెఁ గరము సాగ రాభ వాన
ర సుమహా బలౌఘ రయమున నత్తఱి
నక్కజముగ సకల దిక్కు లందు 2.

ఉ. వేఁగఁగ లంక లోన ఘన భేరులు నింక మృదంగముల్ వడిన్
మ్రోఁగఁగ నాలకించిరి ప్రమోదము నందిరి పుల్కరింపఁగన్
బాగుగ మేను లెల్ల నట వానర వర్యులు సైప కా ధ్వనుల్
వేగమ మించి శబ్దములు పెద్దగఁ జేసిరి యెల్ల రంతటన్ 3.

ఉ. వానర కోటి గర్జలను వారిద నిస్వన సన్నిభమ్ములన్
వీనుల రాక్షసుల్ వినిరి వీరులు దర్పము మీఱ నార్వఁగా
నా నగరమ్ము లంక నట నారసి చిత్రపతాక యుక్తమున్
జానకిఁ జేరె డెందమునఁ జయ్యన రాఘవుఁ డార్తి తోడుతన్ 4.

ఆ.వె. లోహి తాభిభూత రోహిణీ సతి వోలె
సీత దశ వదనుని చేత బంధి
త మృగశాబ లోచన మదిని జానకి
లంక లోన నుండి రగులు చుండు 5.

ఉ. మెచ్చగ నిశ్వసించి రఘు వీరుఁడు రాముఁడు గాంచి లక్ష్మణున్
మెచ్చుచు విశ్వకర్మ నెలమిం బురి నైపుణిఁ గట్టెఁ గాంచుమా
యిచ్చటఁ గొండ పైన నభ మింపుగఁ దాఁకు విధమ్ముగా నహో
హెచ్చు విమాన పంక్తుల రమేశు నభో నిలయమ్ము భంగినిన్ 6.

ఆ.వె. పాండు రాభ్రముల నపార మావృతములై
వెలుఁగు చున్న వనుచుఁ బ్రీతిఁ బల్కె
లంక శోభిలెఁ గడు లక్ష్మణ! పుష్పిత
వనుల చిత్రరథము పగిది నరయ 7.

తే.గీ. వివిధ విహగ సమృద్ధము వితత శుభ వి
రాజితము ఫలపుష్ప విలాసితమ్ము
మత్త విహగ ప్రలీన భ్రమర గణమ్ము
కోకిలాకుల శాఖల గొప్ప పురము 8.

ఆ.వె. విమల వాయు వడరి వీచు పురం బిది
యని వచించి రాముఁ డాజ్ఞ లొసఁగె
సేన నెల్లను విభజింప ననుసరించి
శాస్త్రములను బ్లవఁగ సత్తములకు 9.

చం. హరి బల యుక్త వీర వరుఁ డంగదుఁ డుండ వలెన్ సనీలుఁడై
హరిదళ మధ్య మందు ఘనుఁ డాజిని దుర్జయుఁ డెల్ల వారికిన్
హరిదళ దక్షిణమ్మున మహా బలుఁ డా ఋషభుండు స్వీయ వా
నర బల సంయుతుండు నయి నైపుణుఁ డాజిని నిల్వ నర్హుఁడే 10.

ఆ.వె. ఈ ప్లవంగ సేన కెడమ ప్రక్కన నుండు
గంధ హస్తి నిభుడు గంధమాద
నుండు గొప్ప బల్లిదుండు దుర్ధర్షుండు
వానరప్రవరుఁడు భద్ర గతిని 11.

చం. నిలిచెద సేన కగ్రమున నే నిట లక్ష్మణుఁ గూడి బల్లిదున్
వలసిన నప్రమత్తతను బమ్మి సుషేణుఁడు జాంబవంతుఁడున్ 12.

బలుఁ డగు వేగదర్శి కపి వర్యుఁడు ముగ్గురు సేన కుక్షినిన్
సలలిత రీతిఁ గాచెదరు సంగర వీరులు ఋక్ష ముఖ్యులున్

తే.గీ. వాన రానీకము వెనుక వాన రేశ్వ
రుండు నిలుచు రక్షించుచు మెండుగాను
లోక పశ్చిమార్థమ్ము వరుణుఁడు కరుణ
తోడ రక్షించు భంగిని దుర్జయుండు 13.

ఆ.వె. చక్కఁగ వెలిఁగె నట సమ్యగ్విభక్త వా
నర బలమ్ము ముఖ్య హరి వరేణ్య
రక్షితమ్ము మేఘ రాశితో వెల్గెడు
నాకసమ్ము పగిది నద్భుతముగ 14.

చం. గిరి వర శృంగరాజములఁ గేళులఁ గైకొని వృక్ష రాజముల్
హరి వరు లెల్లఁ జేరిరి మహాసుర రాజ పురమ్ము లంకనున్
దురమునఁ జంపఁ గోరుచును దుర్జయ రాక్షస కోటి సెల్లనున్
గిరి శిఖ రాలి ముష్టులను గీ డొనరింపఁగ సెంచి రాత్మలన్ 15.

తే.గీ. అంతఁ బల్కె మహా తేజుఁ డరసి రాఘ
వుండు సుగ్రీవునిఁ గపీంద్రు దం డిట సు వి
భక్త మయ్యె శుకుని నింక వానరేంద్ర!
విడువ వలయు నని వచింప విని యతండు 16.

చం. విడిచెను రాము నానతిఁ గపివ్రజ నాథుఁడు దూత నా శుకున్
విడివడి యవ్విధిం బ్లవగ పీడితుఁడై శుకుఁ డా రఘూత్తముం
డిడ దయ నాజ్ఞ నార్తుఁ డయి యేఁగెను రావణు చెంత కంతటం
గడు వడి మందహాసమునఁ గాంచి దశాస్యుఁడు పల్కె నివ్విధిన్ 17.

ఉ. ఏ మిది నీదు ఱెక్క లవి యేలనొ కోసిన రీతి నున్నవే
యేమి యనేక మానసుల కీవు వశం బయి నిల్చితయ్య శా
ఖామృగ కోటి కక్కడ శుకా! యనఁగా విని తప్త చిత్తుఁడై
తా మఱి పల్కె వాక్యములు తత్పతి చోదితుఁడై భయమ్మునన్ 18.

తే.గీ. చేరి వడి సాగ రోత్తర తీర మేను
బల్కె నీదు వాక్యములు సాంత్వమునఁ జెప్పి
నట్టి రీతిని మెల్లగ నచ్చముగను
గోపులై చూచి నంతనె ఘోర హరులు 19.

ఆ.వె. పట్టి నన్ను నంతఁ గొట్టఁ దొడంగిరి
ముష్టిఘాతములను గష్ట తరము
ప్రశ్న లిడుట కయ్యె బాధింపఁ జాగిరి
ప్రకృతిఁ దీక్ష్ణు లైన ప్లవగ వరులు 20.

ఆ.వె. సీత దారి నెఱిఁగి శీఘ్ర మేతెంచెఁ గ
బంధ ఖర విరాధ పరమ వీర
హంత రాఘవుండు హరినాథు సుగ్రీవు
గూడి రాక్షసేంద్ర! కోప మూని 21.

తే.గీ. కట్టి వంతెన నింపుగఁ గడలి పైన
దాఁటి యా లవణాంబుధి తత్క్షణమ్ము
త్రోలి రక్కసుల నతఁడు మేలి వింటి
నూని నిలిచె నచట రాక్షసోత్తమ విను 22.

కం. గిరి మేఘ సన్నిభమ్ములు
హరి ఋక్ష సహస్రముల మహా సేన వసుం
ధర నెల్లఁ గప్పి యున్న ద
సురేంద్ర! వీక్షింపఁగఁ గడు జోద్యం బయ్యెన్ 23.

చం. పొసగఁదు వాన రాసుర చమూ యుగళమ్మున కిప్డు సంధి యా
యసురుల కింక దేవతల కత్తఱిఁ గాని విధమ్ము నెంచఁగా
వెస వరణమ్ముఁ జేరెదరు వేగమ చేయుమ కార్య మొక్క టే
ని సమర మిమ్ము లేని యెడ నీరజ లోచన నిమ్ము జానకిన్ 24.

చం. విని శుకు భాషణమ్ములను వెల్గఁగఁ గన్నులు రక్త సిక్తముల్
కనులను గాల్చు భంగి ననెఁ గ్రన్నన రావణుఁ డిట్లు వాక్యముల్
నను సుర దేవయోనులు రణమ్మునఁ దాఁకిన సర్వ లోక భీ 25.

తి నెగడినం గడింది శుక! దేవిని జానకి నీయ నెన్నఁడున్

తే.గీ. ఎప్పు డుఱుకు నా బాణము లప్పురుషుని
రాముని పయి వసంత కాలమ్ము నందుఁ
బుష్పిత ద్రుమముల పయి మూరి మత్త
భృంగములు వాలు భంగిని బెట్టిదముగ 26.

తే.గీ. అంత నా యమ్ములపొదిలో నడరు దీప్త
కార్ముక చ్యుత శరములఁ గాల్చు వాఁడ
రాఘువుని నుల్కలను గుంజరమ్ము ఘోర
మత్త దర్పితముఁ బఱపు మాడ్కిఁ జెలఁగి 27.

కం. తారా గణముల ప్రభలను
నా రవి యుదయించి వేగ హరియించు విధిన్
నే రాము బలము నెల్లను
మూరిన నా బలమున వడిఁ బోకారిచెదన్ 28.

ఉ. నేరక నాదు వేగమును నీరధి తుల్యము నించు కేనియున్
మారుత తుల్య వీర్యమును మానవ మాత్రుఁడు రాఘవుం డనిన్
నేరక చేయ నెంచెను ఫణిప్రవ రాభ శరాళి నాదు తూ
ణీరము నందు నుండుటను నేరక యుద్ధము సేయ వచ్చెనే 29.

సీ. పూర్వ మెఱుఁగఁడు రాముఁడు రణమందు నాదు బలము పరవీర దుర్జయమ్ము
నాదు చాప మను వీణను శర కోణముల సురుచిరమ్ముగ రాగములను
బలికింప నడరుచు వాయింతు జ్యాశబ్దములు వెలువడు ఘోరముగఁ జెలంగి
యార్త గీతములు మహాస్వనము లయి విరాజిల్లు నెల్లెడ రమ్యముగను
తే.గీ. బాణ తల ఘోష లడరంగఁ బరుల వాహి
ని యను రంగస్థలమున మునింగి మించి
వాద్యములను వాయింతు నే భండ నాంగ
ణమున నేరఁడు రాముండు నర సుతుండు 30.

తే.గీ. నన్ను నెదిరింప నా వేయి కన్ను లున్న
యింద్రుఁ డేని మఱి వరుణుఁ డేని స్వయము 31.

యముఁడు వైశ్రవణుం డేని యాజి నగ్ని
నిభ శరమ్ముల శక్యులే నిక్క మెంచ

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నిరువది నాల్గవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 25.

రాముఁ డపూర్వ మైన  రీతి వంతెన కట్టి స సైన్యము సముద్రము దాఁట రావణుఁడు శుక సారణుల నమాత్యులను బిలిచి మారు వేషముల రాముని సేనా బలము నెఱిఁగి రమ్మనిన వారేఁగి మహా వానర సైన్య సత్త్వ మెఱింగి బంధింపఁ బడి రాముఁడు విడువ తిరిగి వచ్చి రావణునకు నివేదించి సీతను రామునకుఁ దిరిగి యిమ్మని బోధించుట.

కం. సబలము  దాఁటంగ నవి
క్లబ మంబుధి రాఘవుండు గని దశముఖుఁ డం
తఁ బిలిచి స్వీయామాత్యుల
ను బలికె శుక సారణుల మినుకు లిప్పగిదిన్ 1.

చం. కపి బల మెల్ల దుస్తరపుఁ గంధిఁ దరించె నపూర్వ రీతినిన్
నృప తనయుండు రాఘవుఁడు నీరధి వారధిఁ గట్టె వింతగా
నిపు డది నమ్మ జాల నెద నెవ్విధి నైన నవశ్య మిత్తఱిం
గపి వర సైన్య వీర్యమును  గ్రన్నన నెన్ను నమాత్య శేఖరుల్! 2.

తే.గీ. చేరి వానర సైన్యము మీ రిరువురు
నేర వలయు శాఖామృగ వీర వరుల
వారి పరిమాణ మింకను బలము నెల్ల
రామ సుగ్రీవ మంత్రుల రమ్య రీతి 3.

ఉ. మూరుదు రెవ్వ రిందు మును ముఖ్యులు వానరు లందు నెవ్వరో
వారధి కట్టి రెప్పగిది వారిధి పైనను వారి రాశినిన్
వారట నిల్పి రెవ్విధినిఁ బార్థ కుమారుని కార్య వీర్యము
ల్నెరగ నొప్పుఁ గైదువులు లీలగ లక్ష్మణు శక్తి యుక్తులున్ 4.

కం. సేనాపతి యెవరు హరి వ
రానీకమ్మునకుఁ దేజ మం దధికులకున్
మానుగ నెఱింగి వేగమ
మీ నైపుణ్యముల రండు మేలుగ నిటకున్ 5.

ఆ.వె. ఆన తీయ నిట్లు హరి రూప ధరు లయి
శుకుఁడు శారణుండు శూర రాక్ష
సులు హరి గణ నాథు బలములోఁ దూఱిరి
వేగ గూఢముగను భీతి లేక 6.

తే.గీ. అరసి యూహింప రానిది హరుల సైన్య
మొడలు గగురుపొడవఁ గరం బడరు నట్టి
దానిని శుక సారణులకుఁ దరము గాక
యుండ లెక్కింప నిల్చిరి దండు నందు 7.

చం. కని రట నా నిశాచరులు కానల వార్ధి తటిన్ గుహా తతిన్
ఘన గిరిశృంగ భాగముల గంతులు వేయుచు నున్న వారి దాఁ
టిన మఱి దాఁటు చుండఁగ వడిం దర ణార్థము నున్న వారిఁ జే
రిన యిఁకఁ జేరు వారినిఁ బరీక్షగ దిట్ట బలమ్ము నింపుగన్ 8.

ఆ.వె. ఆ బ లార్ణవమ్ము నక్షోభ్యమును భీమ
నాదము లొనరించు నగచ రాళిఁ
గాంచి రసురు లచటఁ గన్నులు చెదరంగ
విశ్మయమ్ము వొడువ వెక్కసముగ 9.

తే.గీ. వీరి నరసెఁ దేజస్వి విభీషణుండు
శుకుని నా సారణుని రక్కసులను బట్టి 10.

యిరువురను రఘు రాముని కెఱఁగి యంతఁ
బలికెఁ బ్రచ్ఛన్నులను జూపి వాక్కు లిట్లు

తే.గీ. రాక్షసేంద్రుని మంత్రులు రాఘవ! శుక
సారణులు లంకనుండి యిచటకు వచ్చి
నట్టి చారులు వీరల నరయుమ పర
వీర దమనులు రాక్షస వీర వరులు 11.

కం. కని రాముని వారిద్దఱు
ఘనముగ నార్తు లయి భీతి కదుర నెడఁదలం
దు నశింప నాశ జీవిత
మున నంజలి నిల్చి వచనములు పల్కి రిటుల్ 12.

ఉ. వచ్చితి మార్య యిద్దఱము పంపఁగ మమ్ము దశాస్యుఁ డెన్నఁగా
నిచ్చటి వాన రౌఘు బల మెల్లయు నం చన నాలకించి తాఁ
జెచ్చెఱ రాముఁడే నగుచుఁ జెల్వపు భూత హితార్థి యిట్లనెన్
హెచ్చిన సేన నెల్లఁ గనిరే మము మీ పతి యాజ్ఞ మేరకున్ 13.

తే.గీ. చూచిన సమస్తము చనుఁ డసుర వరేణ్యు
లార! చూడకున్నఁ దిరిగి యరయ వలయు
లేనిచో విభీషణుఁ డింపుగాను మీకుఁ
జూపు వాఁ డఖిలమ్మును జూఁడు డడరి 14.

ఆ.వె. పట్టు వడిన వలదు భయము మీకు బ్రతుకు
కొఱకు దూతఁ జంపఁ గూడ దెన్నఁ
డేని వాఁడు శస్త్ర హీనుఁ డయిన నేరి
కైన ధర్మ మెంచ నవని లోన 15.

కం. విడువుమ విభీషణా! పగ
తుఁడు పంపఁగ వచ్చి రిటకు దూత లుభయులున్
వెడలఁగఁ బ్రచ్ఛన్ను లయిన
నడలఁగ మన కేల నో మహాత్మ! యసురులన్ 16.

చం. కని శుకు నింక సారణు నృకాంతుఁడు రాముఁడు వల్కెఁ గ్రమ్మఱం
జని పురి లంక కిద్దఱును జయ్యన రావణుఁ గాంచి యిట్లు నా
మినుకులఁ బల్కుఁడీ వినఁగ మేలుగ జానకి నే బలమ్ము నెం
చి నయము వీడి తెచ్చితివొ శీఘ్రము చూపుము యా బలం బిఁకన్ 17.

ఆ.వె. స్వీయ సేన తోడఁ జేర బంధువులు య
థేచ్ఛఁ జూపు రాక్షసేశ్వర! నిజ
బల మరయుదు రేపు ధ్వంసితములు కాఁగ
లంక తోరణములు ప్రహరు లెల్ల 18.

తే.గీ. నాదు శర జాలమున నీదు నగర మెల్ల
ధ్వంస మొనరించెదను రే పుదయమ భీమ
కోపము విడుతు బల మూను ఘోర వజ్ర
మసురు లపయి వజ్రి విడుచు నట్టు లసుర! 19.

చం. అనుమతి నీయ వారు జయ యంచును రాఘవు ధర్మవత్సలున్
ఘనముగ వందనమ్ము లిడి క్రన్నన నా శుక సారణుల్ స్తుతిం
చి నగరి కేఁగి లంకకు వచింపఁ దొడంగిరి కాంచి రాక్షసేం
ద్రుని వచనమ్ము లివ్విధము మ్రొక్కి కృతాంజళులై వినమ్రులై 20.

తే.గీ. పట్టువడి విభీషణునిచే వధకు నర్హు
ల మయిన మము ధర్మాత్ముఁడు రాఘవుం డ
ఖండ తేజో మయుఁడు నృవరుండు కరుణ
తో విముక్తులఁ జేసెను దూర్ణము విభు! 21.

సీ. ఒక్క చోట నిలిచి యుగ్రులు పురుషర్షభులు లోకపా లోపములు కృతాస్త్రు
లు నలువురు ఘన శూరులు దృఢ విక్రము లా రాఘవుండు మహా బలుండు
లక్ష్మణుండు ప్లవగ రాజు సుగ్రీవుఁడు వజ్ర నిభుఁడు దైత్య వర్యుఁ డా వి
భీషణుండు ఘనుండు వీరెల్ల రీ లంకను సతోరణమ్ముగను నూకి ప్రహరు
తే.గీ. ల సహితం బుంచఁ గల రితరస్థలములఁ
జోద్యముగ హరు లెల్లరు సూచు చుండ
రాము రూప మాయుధము లరయఁగ లంక
నణఁచుఁ దక్కిన ముగ్గురు నలయ కొకఁడ 22.

కం. హరి సేన రామ లక్ష్మణ
హరివర సుగ్రీవ ఘన కరావన బలవ
త్తరమై భాసిల్లి సు రా
సురులకు దుర్ధర్ష మయ్యెఁ జూడ ధరిత్రిన్ 23.

తే.గీ. వానరధ్వజిని యిపుడు పరమ హర్ష
యుక్తమై రణ మొనరింప నుత్సహించి
యడరు చుండెఁ బగ వలదు పడసి శాంతి
సీత రాముని కీ వలెఁ బ్రీతి తోడ 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నిరువది యేనవ సర్గము.

# యుద్ధ కాండము

# సర్గము 26.

సారణుఁడు పల్కిన మాటలను విని రావణుఁడు సౌధము నెక్కి వానర సైన్యము నెల్లఁ గాంచి యందలి కపి వీరుల నెఱిఁగింప మనిన సారణుఁడు ముఖ్య వానర నేతలను వారి పరాక్రమములను వివరించుట.

కం. విని సారణు హిత వాక్యము
లను నిర్భీతిని వచింప రావణుఁడు దశా
ననుఁ డసురాధీశుఁడు వ
ల్కె నంత బదులుగఁ బరుషపు గిర లిట్టంగిన్ 1.

చం. నను సుర దేవయోనులును నైరృతు లేనియుఁ దాఁక లోక భీ
తి నెగడు గాక జానకిని దేవి నొసంగను విన్ము సారణా!
నిను హరి వీరు లెల్లరును నిర్జితుఁ జేయఁగ బాధ లంది సీ 2.

తను నిడ సాధు వంచు నెదఁ దల్తువు భీతినిఁ దప్త చిత్తతన్

చం. సమరమునన్ జయింపఁ గల శత్రువు లుండిరె నాకు నిద్ధరన్
సమదము పల్కి యిట్లు పరుషమ్ముగ రావణుఁ డంత నెక్కె సౌ
ధమును మహోన్నతమ్ము బహు తాళ సమానముఁ జూడఁ గోరుచున్
హిమ నిభ పాండురమ్ము నసురేంద్రుఁడు శ్రీయుత భాసితుండునున్ 3.

ఉ. చారులఁ గూడి కాంచెను రుషా కలితాత్ముఁడు రావణుం డటన్
నీరధి పర్వ తాటవుల నిండఁగ వానర ఘోర వాహినీ
వారము భూతలమ్మున నపార మగణ్యము సూచి యంతటన్
సారణుఁ గాంచి తా నడిగె సత్వర మివ్విధి సంభ్రమమ్మునన్ 4.

తే.గీ. వానరప్రధానుల శూర వరుల బల్లి
దులను మున్నుండు వారిని దుర్జయులను
యూధపులను సుగ్రీవుఁ డే యుత్తము విను
సారణ! వచింపు మెల్లర సత్వరమ్ము 5.

ఆ.వె. అడుగ రాక్షసేంద్రుఁ డట్లు వానర ముఖ్యు
ల నెఱిగిన కతమున వనచరధ్వ
జిని నడరెడు వీరులను సారణుఁడు కపి
ముఖ్యుల నతి విశదముగ వచించె 6.

సీ. ఎవ్వఁడు లంకకు నెదురుగ మెండుగ గర్జించుచు నిలిచెఁ గలిసి వేలు
వందల యూధప వర్యుల తోడ నెవ్వని భీకరపు ఘోష వలన వేఁగు
చున్నది పురి లంక యన్నగ ప్రాకార తోరణ వనముల తోడఁ గరము
నెవ్వఁ డా శాఖామృగేంద్రుని సుగ్రీవు ఘోర సైన్యమ్మునకు మును నిల్చె
ఆ.వె. నెవ్వ డఖిల వానరేంద్రు సైన్యమునకు
నాయకుండు వాఁడు నగచరుండు
శత్రు భీకరుండు సంగరమున నీల
నామ వీర వరుఁడు భీమ బలుఁడు 7.

సీ. పట్టి బాహువులను గట్టిగఁ ద్రొక్కి నేలను బదమ్ములతో నలరెడు వీరుఁ
డరయుచు లంకా మహా నగరమ్మును రోష విభ్రాజిత లోచనములఁ

గడు విజృంభించుచుఁ గనలు వాఁ డబ్జ కింజల్క సన్నిభుఁ డద్రి సన్నిభుండు
నిజ వాల మిత్తఱి నెమ్మిఁ జఱచు చుండి వాల శబ్దమ్మున వణఁక దిశలు

తే.గీ. చెలఁగు వాఁడు వానర రాజు చేతఁ బ్రీతి
యౌవరాజుగ నభిషిక్తుఁ డైన వాఁడు
హరి వరేణ్యుఁ డంగద నాముఁ డనికి నిన్ను
బిలుచు చున్న వాఁ డసురేంద్ర! బింకముగను 8.

తే.గీ. వాలికి సదృశుఁ డైనట్టి మేలి సుతుఁడు
ప్రియుఁడు సుగ్రీవునకు నెల్ల వేళ లందు
నంగదుఁడ విక్రమించు రామార్థ మడరి
శక్రు కొఱకు నా వరుణుని సన్నిభముగ 9.

తే.గీ. ఈతని మతి నా మారుతి యినకులేంద్రు
హితము గోరువాఁ డరసె వనితను సీత
నపు డనేక వానర నేత లడర వెంట
వచ్చు సబలము మర్దింప వాలి సుతుఁడు 10.

ఆ.వె. అంగదు వెనుకను మహాబల పరివృతుఁ
డయి నిలిచిన వాఁడు హరి వరుండు
నలుఁడు కట్టె వంతెనను నైపుణి సమర
మందు నిల్చు వీరు లందు ఘనుఁడు 11.

సీ. చందులు కోతులు చండవిక్రములు లక్ష లెనిమిదియు సహస్ర యుత కోట్ల
సంఖ్యల వీనినిఁ జక్క ననుసరింత్రు చందన వన వాసు లందఱు రణ
దుర్జయు లొడళులు తోరము బిగియించి గర్జించుచు మురిసి గంతులిడుచు
నఱచుచు నుఱుకుచు నాగ్రహం బుప్పొంగఁ గడు విజృంభించుచుఁ గలియ నలుని

ఆ.వె. నంక మందు నడరు లంకను మర్దింప
నలుఁడు బల్లిదుండు నగచరుండు
స్వీయ సైన్య మట్లు చేరి పరాక్రమిం
పంగఁ జలమున దశవక్త్ర! కరము 12.

చం. చపలుఁడు శ్వేత నామ హరి సత్తముఁ డెల్ల జగమ్ము లందుఁ దా
విపులతరమ్ము విశ్రుతుఁడు పేర్మిఁ గపీంద్రునిఁ గూడి ధీయుతుం 13.

డిపుడు  ప్లవంగ సేన నిట నింపొదవన్ విభజించి మోద మి
చ్చి పెనఁగి వానరావళికి శీఘ్రము పోవును శుక్ల వర్ణుఁడే

సీ. గోమతీ తటిని సంకోచనం బను గిరి వ్యాపించి యుండ రమ్యముగఁ గూడి
నానా నగమ్ముల దానిఁ బాలించును గుముదుఁ డనెడు ప్లవంగముఁడు యూథ
పుండు శత సహస్రముల  సహస్రముల వానరులు గొలువగఁ దనను సభక్తి
సెవ్వీర వరు  వాల మెంతయు దీర్ఘమై యడరు ననేక వర్ణాళిఁ బీత
తే.గీ. తామ్ర సిత వర్ణములను నతం డదీనుఁ
డాగ్రహుఁడు చండ విక్రముఁ డాజిఁ గోరు
నిజ బలమున లంకా పురినిఁ గదిసి వడిఁ
దలఁచు మర్దింప రాక్షసేంద్ర! మది లోన 14.

చం. కపిల తనుండు కేసరి నికాశుఁడు రంభుఁడు దీర్ఘ కేసరుం
డు పఱపు చుండెఁ జూపులు కఠోర విధమ్ముగ లంకఁ గాల్చు న
ట్లు పురము స్వీయ చక్షుల బలుండు వసించును సహ్య శృంగినిం
గపి గిరి కృష్ణ పైన రిపు ఘాతకుఁ డింక సుదర్శనమ్మునన్ 15.

తే.గీ. కోట్లు ముప్పది వానర కోటి యుండఁ
జండ చండ పరాక్రమ శౌర్య వంతు
లెల్లఁ దన వెంటఁ గదలును దల్లడిల్లఁ
జేయ లంకను రంభుఁడు శీఘ్రముగను 16.

సీ. కర్ణము లూపుచుఁ గ్రమ్మర నావలించుచు మరల మరల సుంత భయము
లేక మృత్యువు నందు వీఁక దొలఁగ కాజి నుండి యెన్నండును మెండు కిన్కఁ
గంపించు చుండి వెన్కకుఁ దిర్గి చూచు మహాబలుండు ఘనుండు హరి వరుండు
తోఁక నాడించుచుఁ దోరమ్ము భాసిల్లు వాఁడు నిలుచు లేక భయము సుంత
తే.గీ. శరభుఁ డను వాఁడు సాల్వేయ శైల మందు
యూథపుఁడు లక్ష నలువది యుండ పేలు
బల్లిదులు విహారు లనంగఁ బరఁగు వారు
వాని ననుసరింతురు వీర భటులు రాజ! 17.

సీ. ఆకాశ మందు మేఘాభ మనఁగ నావరింపఁగఁ జుట్టు హరిప్రవరులు
వాసవు నమరుల భంగిని విన్పడ భేరీ రవమ్ములు భీకరముగ

ఘోర శాఖా మృగ వీరవరులు గోర సంగ్రామ మెల్లరు సంగర తల
దుర్జయుండు వసించుఁ దుష్టినిఁ బారియా త్రాద్రినిఁ బనసుఁడు హరివరుండు

తే.గీ. వీని సేబది లక్షల వీరులు హరి
యూధపు లడరి సేవింత్రు యూధపోత్త
ముఁ గడు భక్తి నిరంతరము విభజింపఁ
బడి యనువుగ రాక్షసనాథ వర్య! వినుమ 18.

చం. వినతుఁడు దర్ద రాభ కపి వీరుఁడు స్వీయ చమూ యుతమ్ము ని
ల్చె నట ద్వితీయ సాగరము రీతిని నర్వది లక్ష లుండ వా
హిని హరి యూధపుండు కపు లెల్లరు త్రాగఁ దలంచి నీరముం
గనఁబడు చుండఁ దిర్గుచు సుఖమ్ముగ నుత్తమ మైన యేటినిన్ 19.

తే.గీ. క్రోధనుఁ డను యూధపుఁ డాజి కొఱకు రాజ!
నిన్ను బిలుచు చుండె నడరి సేరు మతని
బలులు విక్రాంతులు ప్లవగ వర్యు లుండ
వెంట భాగింపఁబడి తగ వెక్కసముగ 20.

తే.గీ. స్వబల దర్పితుండు ప్లవగ వరుఁడు గవయ
నాముఁడు తనువుఁ బోషించు నగచరుల గ
ణింపక సతము నెదిరించు నిన్ను తేజ
మందు ఘనుఁడు గైరిక వర్ణ మందు వెలుఁగు 21.

కం. హరి పుంగవు లితనినిఁ గొ
ల్తురు సప్తతి శత సహస్ర దుర్జయు లాజిన్
వర నిజ బలమున లంకా
పురమును మర్దింప డెందమున నాశించున్ 22.

కం. బలు లింకఁ గామ రూపులు
తెలియదు యూధపుల సంఖ్య తెల్లముగను వీ
రు లనేకులు నేతలు ఘో
రులు దుస్సహు లరి భయంకరులు దశవక్త్రా! 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నిరువది యాఱవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 27.

సారణుఁ డింకను వానర సైన్యము లోని యూధపులను వారి పరాక్రమములను రావణున కెఱిఁగించుట.

కం. ఇపు డసు రేంద్రా! చెప్పెద
విపులముగను యూధపులను వీక్షించెడు నా
కపులను బ్రాణమ్ముల నా
నృపతన యార్థము గణింపని జిగీషువులన్ 1.

ఉ. నున్నగ బార లెక్కువగ నోఁచఁగ నెవ్వని తోఁక యెత్తగన్
మిన్నగఁ బీత పాండుర సమేత సితమ్ములు రంగు లుండఁగా
నున్నదొ సేలఁ నీడ్వగను నున్నతి వెల్గుచు సూర్య రశ్మలన్
మన్నన సేయ కట్టి హరి మాన్యుఁడు తా హర నామధేయుఁడే 2.

తే.గీ. యూథపుఁడు ఘోర కర్ముఁడు యోధులు హరు
లాతని ననుసరింతురు భీతి లేక
వందలును వేలు లంకను బట్టణమ్ము
నాక్రమింపఁ దరుల నెత్తి యధిపు భటులు 3.

ఉ. నీరద వర్ణ సన్నిభము నీలపు వర్ణము వారు కాల సౌ
వీర సమాన వర్ణ తను వీరులు సత్య పరాక్రముల్ ఘనుల్
మూరి రసంఖ్యులై కన నమోఘపు నీరధి యన్య పారపుం
దీరున శైల పట్టణ నదీ తటు లందు వసించు ఋక్షముల్ 4.

తే.గీ. దారుణులు ననిర్దేశ్యులు వీర వరులు 5.

నిన్ను నెదిరింప వచ్చుచు నున్న వారు
వీరి మధ్య భీమాక్షుఁడు భీమ దర్శ
నుండు ఋక్షనాథుండు ధూమ్రుండు కలఁడు

ఆ.వె. ఋక్షవంత శృంగి నెలమి వసించును
నర్మదా నదీ వనములు గ్రోలు
నతఁడు యూథపుండు వితత బలాన్వితుం
డరిగణ దమనుండు నసుర వర్య! 6.

చం. కను మటఁ బర్వతాభు నవికారుని ఋక్ష వరేణ్యు ధూమ్రు త
మ్ముని ఘను జాంబవంతుని సముం డతఁ డన్నకు రూప మందు మిం
చును నిజ విక్రమమ్మునను జూడఁగ మార్కొను వాఁడు పెద్ద ల
న్న నమిత గౌరవం బిడు రణమ్మునఁ జండుఁడు యూథ పేశుఁడే 7.

కం. దేవాసుర యుద్ధమ్మున
నా వజ్రి కితండు సాయ మత్యధిక మిడెన్
పే వరములం బడసెను మ
హా వీరుఁడు జాంబవంతుఁ డాశ్చర్యముగన్ 8.

ఉ. ఈతని సైన్య సంచయము లెన్నఁ బిశాచ సరాక్ష సాభముల్
భీతి కరమ్ము లౌఁ బరఁగ వెండ్రుక లంగము లందు మిన్నగా
నాతత మేఘ సన్నిభ శిలావళి నెక్కి గిరీంద్ర శృంగులన్
వీత భయమ్ము మృత్యువున వేగమ లంకను ముంత్రు వైచుచున్ 9.

తే.గీ. విపుల దేహు లనేకులు వీర లగ్ని
సదృశ తేజస్వులు చరింత్రు సంబరమున
నింకను గను మా సంరబ్ధు నెగురు నట్టు
లుండ హరి వరు లరయుచు నున్న వాని 10.

తే.గీ. ఆతఁడు హరీశ్వరుఁడు దంభుఁ డనెడి వాఁడు
యూథపుల కెల్ల నసురేంద్ర! యూథపుండు
విశ్రుత బల సంపన్నుండు వీర వరుఁడు
భక్తిఁ గొల్చు సహస్రాక్షుఁ బ్లవగ వరుఁడు 11.

ఉ. ఆ దరి స్వీయ పార్శ్వమున నందును యోజన దూర శృంగి సం
నాదుఁడు తాత కోతులకు నైపుణి నందును యోజ నోర్ధ్వమున్
మేదిని వీని దేహమును మించిన జంతువు లుండ వెందుఁ దా
నాది నొసంగె శక్రునకు నాజిఁ బరా జయ మంద కుండెసే 12.

ఉ. ఎవ్వని విక్రమం బరయ నింద్రు పరాక్రమ సన్నిభమ్మునౌ
యవ్వర వానరుండు ఘనుఁ డాత్మజుఁ డయ్యెను నగ్ని కింపుగా
నవ్వనితా మతల్లికి వరామర గాయనికిన్ రణమ్ములో
నివ్వసుధన్ సురావళికి నింపుగఁ దోడ్పడు కారణమ్మునన్ 13.

తే.గీ. కథనుఁ డను వానరేంద్రుఁ డకర్థనుండు
యుద్ధముల నుండు జంబూన గేద్ధ మందు
నీదు భ్రాత వైశ్రవణుఁడు నిత్య మలరు
కిన్నర నిషేవితం బగు గిరి వరమున 14.

కం. పరివృతుఁడు వేల కోటుల
హరి వీరుల నితఁడు లంక నసురేంద్రా! కో
రు రయమున ముట్టడింపఁగ
వర నిజ సైన్యమ్ముఁ గూడి పంతము తోడన్ 15.

సీ. తిరుగుచు గంగానదీ తీరమున భాధపెట్టుచుఁ గుంజర బృందమును గ
జేంద్రుల నింక హరీంద్రులఁ బూర్వ వైరమ్ము దలంచి కరమ్ము కినిసి
వానర యూథప వర్యుఁ డరుగుచుండి గిరి గుహల వసించు హరి వరుండు
కరుల నడ్డుచు వన్య తరువుల భంజించుచు నుశీరబీజ విశ్రుత నగమ్ము
తే.గీ. నందు మందర సదృశమ్ము నందు నలరు
దివము నందుండు శక్రుని తీరు తోఁప
నేత పదికోట్ల హరులకు నీతఁ డనిఁ బ్ర
మాదకరుఁడు వానరుఁడు ప్రమాథి యనఁగ 16.

కం. వరబల విక్రమ దృప్తులు
సరి లేనట్టి ఘన బాహుశాళులు ధరలో
హరివీరు ప్రమాథిఁ గొలుచు 17.

నరి దమన కపివరు లెల్ల రసుర వరేణ్యా!

ఉ. గాలికి లేచు మబ్బు వలెఁ గాంచుచు నుంటివి యా ప్రమాథినిం
గ్రాలుచు వానరేంద్రులు తరస్వులు నెల్లరు గంతులేయఁగా
మేలుగ నెల్ల దిక్కులను మేదిని నెఱ్ఱని దుమ్ము లేచెనే
గాలికి వీవ పెక్కసముగం గనుమా యట రాక్షసేశ్వరా! 18.

మ. రణ దుర్భేద్యులు కాల ఘోర ముఖ గోలాంగూళు లత్యుద్ధతుల్
గణముల్ వందలు లక్ష లుండఁగను జక్కం దాఁటిరా సేతువుం
బ్రణమిల్లం దనకున్ గవాక్షుఁ డనఁగన్ రాజన్య! లాంగూలి ప
ట్టణ మీ లంకను ముట్టడింపఁగను గట్టా యుత్సహించుం గడున్ 19.

సీ. ఎక్కడ తుమ్మెద లింపుగ సంచరించుచు నుండు నెక్కడ సుఫల కుసుమ
ములు సంతతము నున్నభూరి వృక్షమ్ము లడరు చుండు రవి యెక్కడ నిజ కాంతి
సన్నిభమ్ము వెలుంగు శైలమ్ము చుట్టు తిరుగు చుండు మృగపక్షులు తమ వర్ణ
ముల దేని కాంతినిఁ బొంది వెలుఁగు చుండు నేప్రస్థముల మును లెల్ల సతము
తే.గీ. వీడ కుందు రెచ్చోటను విరివి సర్వ
కామ ఫలవృక్షములు మాక్షికములు భృశము
వెలయు నట్టి కాంచన గిరి నలరి యుండు
కేశరి హరి ముఖ్యుఁడు ప్లవగేశుఁ డధిప! 20.

సీ. అఱువది వేలు రమ్యము లైన కాంచన శైలమ్ము లుండగఁ జక్క మధ్య
నున్న దీ ఘన పర్వ తోత్తమం బసురాళి మధ్య నీ వున్నట్టి మాడ్కి ననఘ!
యక్కడ వసియింతు రందఱు కపిల తామ్రశ్వేత పింగళ రమ్య ముఖులు
తీక్ష్ణ దంష్ట్రులు కడింది నిశిత నఖ వరాయుధులు చతుర్దంష్ట్రు లుగ్ర సింహ
తే.గీ. సములు వ్యాఘ్ర సన్నిభ దురాసదులు జ్వలితు
లనల నిభము విషాహి తుల్య కపి వరులు
మత్తకరి నిభు లద్రి సమాన నీర
దస్వనులు పింగలాక్షులు తద్ద బలులు 21.

తే.గీ. దీర్ఘ వాలమ్ముల నడరు దిట్ట లెల్ల
భీమ కాయులు నత్యంత వేగ వంతు
లెలమి నిల్చిరి చూచుచు నీ నగరము 22.

లంక మర్దింప నెంచుచు రాక్షసేంద్ర!

చం. శతవలి నామ విశ్రుతుఁడు చక్కగ నిల్చెను వీరి మధ్యలో
రతిని జయమ్మునం దునిచి రమ్య తరమ్ముగఁ గొల్చు సూర్యునిం
బతి యగు వీర లెల్లరకుఁ బన్నుగ నెంచును ముట్టడింపఁగా
నతుల బలమ్ము తోడుత దశానన! స్వీయ పరాక్రమమ్మునన్ 23.

కం. కడు విక్రాంతుఁడు బలవం
తుఁడు నిజ పౌరుషమున విదితుండు మహా శూ
రుఁ డితండు రాముని కొఱకు
నిడు ప్రాణమ్ముల వగవక నెద నసు రేంద్రా! 24.

తే.గీ. ఇంక నితరులు కపి వర్యు లెల్ల రుంద్రు
వింధ్య నగ మందు లెక్కింప వీరిఁ గాదు
తరము మిక్కుటమై యుండ ధర నలఘు ప
రాక్రములె యెల్ల వారలు రాక్షసేంద్ర! 25.

తే.గీ. అందఱు మహా ప్రభావులె యధిపవర్య!
యంద అద్రి సన్నిభ దేహు లరయ రాజ!
యందఱు సమర్థులే పృథ్వి నడరి త్రుటిని
గిరుల తోడ విధ్వంస మొనరుప బలిమి 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నిరువది యేడవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 28.

శుకుఁడు కూడ రావణునకు హనుమతోడ వానర యోధపుల రామ లక్ష్మణ సుగ్రీవ విభీషణుల

పరాక్రమము నెఱిఁగించుట. సంఖ్యలను కోటి నుండి మహౌఘము వఱకు వివరించి వానర సైన్య సంఖ్యను తెలుపుట.

కం. విని సారణు వచనమ్ములు
ఘన కపి సైన్యమ్ముఁ జూపి కాంచి దశాస్యున్
వినయమ్ముతో శుకుఁడు వ
ల్కెను రాక్షసనాథు తోడ గిర లీ రీతిన్ 1.

చం. నిలిచిన వారి నెవ్వరిని నీ వసు రేశ్వర! గాంచు చుంటివో
యలరుచు మత్త కుంజర గణాభము గంగ తటంపు మట్టి చె
ట్టు లనఁగ శీత లాద్రినిఁ గడుంగడు నున్నత సాల పాదప
మ్ముల వలె వారు బల్లిదు లమోఘులు దేవ సమాన విక్రముల్ 2.

తే.గీ. దైత్య దానవ సన్నిభ దార్ఢ్య తనులు
నిరువ దొక వేయి కోటులు నింక వేయి
శంఖములు మఱి శత బృంద సంఖ్యల హరి
పుంగవులు నిల్చి యున్నారు పోరు కొఱకు 3.

ఆ.వె. కామ రూపు లెల్ల కపులు సుగ్రీవు స
చివులు వీరు పుట్టి రవని దేవ
కాయమునకు నింక గంధర్వులకును గి
ష్కింధ నగరి నున్న శ్రేష్ఠ హరులు 4.

ఉ. కాంచుమ మైందునిన్ ద్వివిదుఁ గయ్యమునం దసమాను లిర్వురున్
మించిన దేవరూపులు నమిత్ర వినాశకు లబ్జజుండె యీ
నంచిత రీతి నానతిని నయ్యమృతమ్మును ద్రాగి రిద్దఱుం
బొంచి పురమ్ము లంక నిఁకఁ బోరునఁ గూల్పఁ దలంత్రు శీఘ్రమే 5.

సీ. ఎవ్వఁ డాసీనుఁ డయ్యె మదించిన గజము వోలె నచటఁ గపి పుంగవుఁ గను
చుంటి వీ వసురేంద్ర! క్షోభింపఁ జేయు సముద్రమ్ము నతఁడు కపుండు మున్ను
లంక కేతెంచిన రమణి సీతను నిన్ను నరసిన వాఁడు దాఁ దిరిగి వచ్చెఁ
జూడుమ కేశరి సూనుండు జ్యేష్ఠుండు వాతాత్మజుం డన వఱలు వాఁడ
తే.గీ. యరయు ఖ్యాతిని హనుమంతుఁ డనఁగ నతఁడు 6.

దాఁటె సాగరమ్మును మున్ను మేటి బలుఁడు
కామరూపుఁడు శ్రేష్ఠుఁడు భీమ వేగుఁ
డితఁ డనిలు భంగి ననివార్యుఁ డితఁడు గతిని

చం. కని యుదయించు బాల దిన కాంతుని నాఁకలి మీఱ బాలుఁడీ
హనుమ తినంగ నెంచి వడి నంబర వీథినిఁ జాగె వేగ యో
జనములు మూడు వేలు జవ సత్తముఁ డుద్ధతుఁ డారగింపకు
న్న నెలమిఁ దీర దాఁకలి యనంగఁ దలంచి యెడంద వింతగన్ 7.

ఉ. చేరక దేవ దానవ ఋషిప్రవ రాళికిఁ చేర రాని వాఁ
డౌ రవి నాదితేయు ననిలాత్మజుఁ డంతటఁ గూలెఁ గొండపై
బోరనఁ బూర్వ శైలమున మున్నొక దౌడ రవంత విర్గఁగా
మారుతి నామ మందు హనుమంతుఁడు నయ్యెను గట్టి దౌడలన్ 8.

తే.గీ. ఈతఁ డొక్కఁడ మర్దింప నెంచు లంక
నెల్ల బలిమి నితని బల మింక రూప
మును బ్రభావము వర్ణింపఁ గనము శక్తి
యాప్తుల వలన నేరితి హరిని నిజము 9.

కం. లంక దహించిన యట్టి భ
యంకరుఁ డితఁడు మఱవంగ నగు నెట్టులు నీ
కింకను మండుచు నుండఁగ
వంకల నసురేంద్ర! వీని వానర వీరున్ 10.

మ. కనుమా పద్మ నిభాక్షు వాయు సుతు ప్రక్కన్ నిల్వ నిక్ష్వాకు లం
దున విఖ్యాతుని శూరు నా యతిరథున్ దుర్వారు నెవ్వాని చే
తను గంపింపదు ధర్మ మెన్నడును వేదప్రాజ్ఞు బ్రహ్మాస్త్ర వే
త్తను శక్రాభ పరాక్రమున్ రఘువరున్ ధర్మానురక్తాత్ము నిన్ 11.

తే.గీ. క్రోధ మందు మృత్యు నిభునిఁ ద్రుంచు వాని
గిరుల నింగిని శరములఁ దరుణి నెవని
దార నపహరించితి జనస్థాన మందు
నతఁడు శ్యామ వర్ణుడు రాముఁ డనికిఁ దరలె 12.

ఉ. ప్రక్కన వానికిం బసిడి వర్ణము వాఁడు విశాల వక్షుఁడుం
జక్కని వాఁడు  తామ్ర విలసన్నయనుండు సునీల కేశుఁడున్
మిక్కిలి యుద్ధ నైపుణుఁడు మేటి గణింపఁగఁ బండితాళికిం
బ్రక్కన  రాజ! లక్ష్మణుఁడు రాముని తమ్ముఁడు ప్రాణ తుల్యుఁడే 13.

తే.గీ. దుర్జయుండు విక్రాంతుఁడు దోర్బలుండు
బుద్ధిమంతుండు దక్షిణ భుజుఁడు రాఘ
వున కమిత కోపి యితఁడు వెలి నడయాడు
ప్రాణ మరయంగ  రాజన్య! భ్రాత కెపుడు 14.

కం. రక్షింపఁడు తన జీవిత
మక్షీణ బలుండు రాఘ వార్థమ్ము మహా
లక్షణుఁడు లక్ష్మణుం డో
రక్షః పతి! చంపఁ దలఁచు రాక్షసుల ననిన్ 15.

ఉ. ఎవ్వరు నిల్చె రాఘువున కింపుగ సవ్యపు దిక్కు నందు నా
దవ్వులఁ దా విభీషణుఁడు ధాత్రికి రాజును జేసె రాముఁడే
యవ్వర రాక్ష సాన్వితుని నార్య! పురమ్మున కిద్ధ లంకకుం
జివ్వకు సిద్ధ మయ్యె నట శీఘ్రమ తాఁకఁగ నిన్ను రాడ్వరా! 16.

సీ. నిలిచి రెవ్వ రట ననీకమునకు మధ్యఁ జలియింప నేరని శైల మనఁగ
సర్వ శాఖామృగ సత్తమ నాథుండు నపరాజితుఁ డతఁడు కపి వరుండు
యశ మందుఁ దేజమ్ము నందు బుద్ధిఁ దెలివిఁ బుట్టుక యందును మూరి తాను
వెలిఁగించు వానర వీరుల నెల్లర హిమవన్నగముఁ బోలి  యింపుగ నివ
తే.గీ. సించు గుహరాజ మందుఁ గిష్కింధ యందు
వనతరు విలసితమ్మునఁ జనఁగ రాని
దుర్గ మారణ్యముల మధ్య దొడ్డ ప్లవగ
యూథపులఁ గూడి సుగ్రీవుఁ డుగ్ర రాజు 17.

తే.గీ. పుష్కర శత కాంచన మాల భూరి శోభ
లొసఁగు వానరేశ్వరునకు నుచిత రీతి
దేవ మానవ సంపద తేజరిల్లు 18.

నితని యందు దశగ్రీవ! వితతముగను

కం. మాలను దారను శరమున
వాలినిఁ జంపి యొసఁగె రఘువరుఁ డసురేంద్రా!
నేలను గపి రాజ్యమ్మును
మేలుగ సుగ్రీవున కెలమిని శాశ్వతమున్ 19.

తే.గీ. వంద శత సహస్రమ్ములు పరఁగుఁ గోటి
యన శత సహస్ర కోటుల నంద్రు శంకు
వని శత సహస్ర శంకులు దనరు నింపు
గా మహాశంకు వనఁగఁ బ్రకటితము లయి 20.

సీ. ఆ మహా శంకువు లడరఁగ నూరు వే లొక్క బృంద మగును జక్క బృంద
శత సహస్రమ్ములు సను మహా బృందమై నూరు వే లవి యున్న మూరు నొక్క
పద్మ మనఁగ మఱి వంద వేల్పద్మమ్ము లగు మహా పద్మం బనఁగ మఱియు మ
హా పద్మములు రాక్షసాధిప! నూరు వే లొక్క ఖర్వ మగును లెక్కపెట్ట
తే.గీ. ఖర్వములు లక్ష యొక మహా ఖర్వ మగు స
ముద్ర మగు నవి నూర్వేలు మూర నూరు
వేలు నా సముద్రమ్ములు వెలుఁగు నోఘ
మనఁగ నవి నూరు వేలు మహౌఘ మగును 21.

సీ. సుగ్రీవుఁ డసురేంద్ర! శూర కపీంద్రుఁడు వీరు విభీషణు స్వీయ మంత్రు
లను గూడి నిత్యము ప్లవగ మహా సైన్య మావృతమై యుండ నని నెదిర్ప
నిన్ను నుద్యుక్తుఁడై నిలిచి యున్నాఁడు శత సహస్ర కోటులు దనర శంకు
వులును మహా శంకువులు సెలఁగఁగ వేయి బృందమ్ము లుండఁగ వంద యింక
తే.గీ. నట మహాబృందములు వేయి యడరఁ బద్మ
ము లొక వంద మహాపద్మము లొక వేయి
ఖర్వ ససముద్రములు మహౌఘములు వంద
లవి మహౌఘము లవి కోటి యడర వెంట 22.

తే.గీ. పర సముద్రము భంగిని వఱలు చుండఁ
గని మహారాజ! జ్వలితంపు గ్రహము పగిది
నుద్యమించు జయము వొంద నుత్తమమును 23.

బడయక పరాజయమ్ముఁను బరుల వలన

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నిరువది యెనిమిదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 29.

శుకుని మాటలు విని శుక సారణుల నిందించి రావణుఁడు శార్దూ లాది చారులను రామ లక్ష్మణు లున్న చోటునకుఁ బంప వా రేఁగి విభీషణునిచేఁ బట్టువడి వానరులచే భాధింపఁబడి రాముఁడు దయతో విడిచి పెట్ట లంకకుఁ దిరిగి చేరుట.

కం. శుకుచే వచింపఁ బడిన ఘ
న కపి మహా యూధపులఁ దన యనుజు నా రా
ము కడ విభీషణు రఘు రా
ము కుడి భుజము లక్ష్మణు దశ ముఖుఁ డరసి వగన్ 1.

సీ. ఇంకను నా వానరేంద్రుని సుగ్రీవు భీమ విక్రము మహా వీర్యు నంగ
దుని వజ్రహస్తు పౌత్రుని హనుమంతు విక్రాంతుని ఘను జాంబవంతు దుర్జ
యుని సుషేణునిఁ గుముదుని నీలు నలుఁ బ్లవగర్షభు గవయుని గజుని నింక
మైంద ద్వివిదుల భీమ గవాక్షు శరభుని రాక్షసేంద్రుఁ డరసి రావణుండు
ఆ.వె. కలఁతఁ జెంది కొంత కనలి భృశమ్ముఁగ
వినిన యంత సారణుని మఱి శుకుఁ
బరుష భాషణములు వల్కి నిందించె ఘో
రముగఁ బొందు మీరు రయముగ నని 2.

ఆ.వె. శిరము వాంచి మ్రొక్కి చేతు లెత్తి నిలువ
వారిఁ గాంచి పలికెఁ బరుష వాక్య
ములను రావణుండు తులుచన గద్గద 3.

మునఁ గినిసి భృశమ్ము మన మెరియఁగ

చం. అహితము లిట్లమాత్య వరు లక్కట భృత్యులు నిగ్రహోద్యను
గ్రహ సుసమర్థ రాడ్వరునిఁ గాంచి వచింపఁగ మీకు నొప్పునే
యహితులఁ గీడు సేయ సమ రార్థము వచ్చెడి వారినిన్ స్తుతిం
ప హృది సహింప నెట్లగును బాడియె యిర్వుర కెంచి చూడఁగా 4.

కం. గురు వృద్ధాచార్యుల మీ
రిరువురు సేవించిన యది యెల్ల వృథ యగున్
నరపాల శాస్త్రము గ్రహిం
పరు జ్ఞేయమ్ము నొక యింత పామరుల వలెన్ 5.

ఉ. పట్టువడంగఁ బల్కితిరొ పన్నుగ నేరరొ వారి నెల్లరన్
దట్టపు టజ్ఞతన్ గిరలు తద్ద వచింతురొ యిట్టి మూర్ఖులన్
నెట్టన మిమ్ము మంత్రులను నేను వహించి విచిత్ర రీతి ని
ప్పట్టున మందభాగ్యమునఁ బాలన మెవ్విధిఁ జేయుచుంటినో 6.

కం. పరుషమ్ముగ భాషింపఁగ
గిర లిట్టులు నాయెదుటను గించిద్భయ మె
వ్వరి శాసనమాత్రమ్మునఁ
బరగు శుభాశుభము లెదల వఱలదె మీకున్ 7.

ఆ.వె. అగ్ని ముట్టి పాదపావలి నిలిచిన
నిలుచు గాక ఘోర తలము నందు
రాజున కొనరింప భూజను లించుక
దోషము బ్రతు కింక దుర్లభమ్ము 8.

ఉ. చంపుదు నిట్టి పాపులను శత్రు జనాలిని సంస్తుతింపఁగా
నింపుగఁ దొంటి మేళు లెద నెంచినఁ దగ్గె మదీయ రోషమే
తెంపరులుం గృతఘ్నులును దృష్టి పథమ్మును వీడి పొందు నేఁ
జంపఁ దలంప జ్ఞప్తి నిడి సాయము లీ రొనరింప మున్నెదన్ 9.

కం. పలుకంగ నిట్లు రావణుఁ 10.

డు లజ్జ శుక సారణులు కడు జయధ్వాన
మ్ము లొసఁగి వెడలిరి వందన
ము లొసంగి దశాననునకు బోరన నంతన్

తే.గీ. ఘనునిఁ జెంత నున్న మహోదరుని నరయుచు
రావణుఁ డనియె ననుప వలయును జారు
ల నయ వేత్తల శీఘ్రముగఁ నని వల్లె
యని మహోదరుం డీయఁగ నాజ్ఞ నట్లు 11.

కం. చేరి త్వరితమ్ముగా నా
చారులు వచియించి యంత జయ శబ్దములన్
గారవముగ నంజలు లిడి
నా రావణునకు నిలిచిరి యానతి కొఱకై 12.

ఉ. చారుల నమ్ము వారలను సన్నుత శూరుల నిర్భయాత్ములన్
వారని భక్తి యుక్తులను బన్నుగ రాక్షస నేత రావణుం
డారసి పల్కె వాక్యముల నంతఁ జనుం డిట నుండి గాంచఁగా
నా రఘు రాము యత్నముల నాప్తుల మంత్రుల నున్న వారినిన్ 13.

తే.గీ. ఎట్లు నిదురించు మేల్కొను నెట్లు చేయు
నితరముల నెట్లు నేరి మీరెల్ల నైపు
ణమ్మున నశేషముగ రండు నెమ్మి నిటకుఁ
జారులార! గూఢమ్ముగ సత్వరమ్ము 14.

కం. తెలిసి నిజ చారుల వలనఁ
గలహమ్మున శత్రువులను గదిసి ధరా నా
థులు స్వల్ప యత్నమున విబు
ధు లడరి నిర్జింత్రు శత్రు దుర్జయు లిలలో 15.

ఉ. తూలుచు వారు హర్షమునఁ దూర్ణము నట్టుల యంచుఁ బల్కి శా
ర్దూల వరాఖ్యు ముందు నిడి తోరపు భక్తిఁ బ్రదక్షిణమ్ములన్
మేలుగ రాక్షసేశునకు మీఱి యొసంగి సువేల శృంగికిన్
మ్రోలను రామలక్ష్మణుల బోరన గాంచిరి చారు లెల్లరున్ 16.

తే.గీ. గూఢ రీతిని సుగ్రీవుఁ గూడ నుండ
నా విభీషణునిఁ గనిరి యా బలమ్ము
నరసి విహ్వలు లైరి మహాత్ముఁ డా వి
భీషణుండు వీక్షించెను వీరి నంత 17.

తే.గీ. అచ్చట నసురు లెల్లరు నంతఁ బట్టు
వడిరి యవ్విభీషణునిచే భాగ్య వశమ
యనఁగ శార్దూలుఁ డతి పాపి యంచుఁ బలికె
రాఘువుని తోడ నంతట రాక్షస పతి 18.

ఆ.వె. వానరుల వలనను బాధింపఁ బడి వాఁడు
విడువఁ బడియె రాఘువుఁడు వచింపఁ
గరుణ తోడ నంతఁ బరులు కూడ విడువ
బడిరి యెల్లరు హరి వరుల చేత 19.

కం. చేరిరి యర్దితు లై వడి
వా రెల్లరు లంక కంతఁ బ్లవగుల వలనన్
ఘోరమ్ముగ నిట్టూర్చుచుఁ
జారు లనిశ బాహ్యచరులు క్షణదాచరులున్ 20.

కం. కని చారు లా దశగ్రీ
వునిఁ దెలిపిరి గిరి సువేలపు సమీపము నం
దు నిలిచిన వానర బల
మ్మును రాముని భీమ సైన్యమును విశదముగన్ 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నిరువది తొమ్మిదవ సర్గము.

## యుద్ధ కాండము

# సర్గము 30.

శార్దూలుఁడు చారుండు రావణునకు వానర సైన్యము లోని ముఖ్య యూధపుల నెఱింగించుట.

కం. చరు లెల్ల రంత లంకా
పురపతి కెఱిఁగించి రచలము సువేలముపైఁ
బరగిన యక్షోభ్యం బగు
హరి సైన్యము నెల్ల రాఘు వాధీనమ్ముఁన్ 1.

తే.గీ. ప్రాప్తపు మహా బలమ్మును రాముని విని
చారుల వలన నుద్వేగ మారఁగ మది
లవము శార్దూలు వీక్షించి రావణుండు
పలికె నంత నిబ్బంగిని భాషణములు 2.

కం. మునుపటి వలె నీ వర్ణముఁ
గన మరయఁగ దీను భంగిఁ గన్పింతు విటన్
ఘన రో షామిత్రుల వశ
మునఁ బడితివె నీవు చెపుమ ముందుగ నాకున్ 3.

తే.గీ. అంత రాక్షస శార్దూలుఁ డడుగ నట్లు
పలికె శార్దూలుఁ డించుక యలఁతి యెలుఁగు
న భయ విహ్వాలుం డీ వచనమ్ముల నసు
రేంద్ర! కాలే దలవి గణియింప నాకు 4.

ఉ. వానరు లెల్ల విక్రములు బల్లిదు లారయ రామ రక్షితుల్
కానము మాట లాడఁ దగు కాలము ప్రశ్నల కుత్తరమ్ములం
గానము రక్షితమ్ములు సుఖమ్ముగ మార్గము లెల్ల సంతతం
బా నగ తుల్య యూధప వరావళి చేతను రాక్షసేశ్వరా! 5.

ఉ. చేరిన యంత మాత్రమునఁ జెన్నుగ నేరిరి నన్ను నెద్దియు
న్నేరక మున్న రాక్షసులు నేర్పునఁ బట్టిరి కొట్టి రంతటన్
ఘోరముగాను బల్లిదులు కోఁతులు ముష్టుల దంష్ట్ర జానులన్ 6.

భూరి తలమ్ములన్ భృశము మొత్తిరి త్రిప్పిరి చుట్టు నెల్లెడన్

చం. హరు లటఁ ద్రిప్పి యెల్లెడల నా రఘు రాముని చెంత కంతటన్
విరివిగ నంగకమ్ముల స్రవింపఁగ రక్తము తెచ్చి నిల్పినం
గరుణ వహించి రాముఁడు నృకాంతుఁడు విహ్వలు నన్ను విడ్వఁగాఁ
గరములు మోడ్చి వేఁడ దశకంఠ! సజీవము నిన్ను జేరితిన్ 7.

ఉ. రాముఁడు నింపి సంద్రము శిలా వసుధాధర సంచయమ్ములన్
భీమ రయమ్ము నం గదిసె వీరుఁడు లంకను ద్వారమం దహో
యీ మను జేశ్వరుండు విహగేశ్వరు వ్యూహము పన్ని నిల్చెఁ దా
భీమ వలీముఖధ్వజిని వెంటఁ జరింపఁగ నెంచి యుద్ధమున్ 8.

చం. వెస వరణమ్ముఁ జేరెదరు వేగమ చేయుమ కార్య మొక్క టే
ని సమర మిమ్ము లేని యెడ నీరజ లోచన సీత నిమ్ము మా
నసమునఁ దల్చి యట్టు లన నైరృతి నాథుఁడు గాంచి చారుఁ బ
ల్కె సువచనమ్ము లిట్లు తమకించి దశాననుఁ డాగ్రహమ్ము నన్ 9.

ఉ. సర్వ సురాలి మార్కొనిన సంగర భూమినిఁ గూడి యెల్ల గం
ధర్వుల నింక దానవులఁ దల్లడ మందిన నెల్ల లోకముల్
శర్వరి నీయఁ జంద్రముఖి జానకి నెన్నఁడు పల్కి యివ్విధిన్
గర్వ మెలర్ప రావణుఁడు గ్రమ్మఱ నేరఁ ప్లవంగ ముఖ్యులన్ 10.

తే.గీ. తొడఁగి శోధించితి కద శార్దూల! సేనఁ
జెపుమ హరి శూరు లెవ్వరు చేవ యెట్టి
దిఁకఁ బ్రభావ మెట్టిది వార లెవరి సుతులు
పౌత్రు లెల్లఁ జెపుమ చారవర్య! నిజము 11.

ఉ. నేరఁ నవశ్యమౌ రిపుల నేర్పును వీర్యము సేయ యుద్ధమున్
వారి బ లాబలమ్ములను బన్నుగ నిప్పుడు నే నెఱింగి య
వ్వీరుల మార్కొనం గడు వివేకము తోడుతఁ జింత సేయుదున్
మూరి యనంగ ఱేడు విని పూర్ణము చార వరేణ్యుఁ డిట్లనెన్ 12.

సీ. ఋక్షరజు సుతుం డహీన వీర్యుండు సుగ్రీవుఁ డాజినిఁ బరికింప దుర్జ

యుండు వానర రాడ్వరుండు గద్గదు తనయుండు నా జాంబవంతుండు విశ్రు
తుండు నన్య సుతుం డొకం డాతనిఁ గనుమ యింక గురు తనయుం డెవని పుత్త్రుఁ
డొక్కండ చంపెను రక్కసులను సుషేణుండు ధర్మాత్ముండు మెండుగాను

తే.గీ. వాఁడు ధర్మాత్మజుఁడు వీర్యవంతుఁ డింక
దధిముఖుండు సౌమ్యుఁడు సోమ తనయుఁడు కపి
యింక సుముఖుండు దుర్ముఖుం డింక రాజ!
వేగ దర్శి మృత్యు సములు విధి సృజించె 13.

చం. అనల సుతుండు నీలుఁడు మహాత్ముఁడు సేనకు నెల్ల నాథుఁడే
యనిల సుతుండు దా హనుమ యంచుఁ బ్రసిద్ధుఁ డతండు మేదినిన్
మనుమఁ డతండు శక్రునకు మాన్యుఁడు బల్లిదుఁ డంగదుండు యౌ
వనుఁడు దురాసదుండు కపి వర్యులు నా ద్వివిదుండు మైందుఁడున్ 14.

ఆ.వె. పుత్త్రు లశ్వినులకుఁ బుడమిలో వైవస్వ
తాత్మజులు గజుఁడు గవాక్షుఁడు గవ
యుండు గంధమాదనుండు శరభుఁ డేవు
రు దశకోటి సంఖ్యలు హరి వరులు 15.

కం. శూర వరు లెల్లరు సుర కు
మారులు రణ కాంక్షులు నసమాన బలాఢ్యుల్
వారి నితరుల నుడువ రా
దేరి కశేషమ్ము రాక్షసేంద్రా! వినుమా 16.

సీ. దశరథ తనయుండు తరుణుండు సింహ సంహననుండు దూషణుఁడును ఖరుండు
త్రిశిరుఁ డెవ్వని చేత నశియించి రాతఁ డీ రాముఁ డీతనికి విక్రమము నందు
లే రెన్న సములు ధాత్రిని విరాధ కబంధులు నిహతు లైరి యితని వలనసె
కాలు సన్నిభులు రక్కసులు జనస్థానమునఁ గూలి రెల్లరు మున్ను రాజ!

తే.గీ. లక్ష్మణుండు ధర్మాత్ముఁడు రామ సోద
రుఁడు నరర్షభుం డెవ్వని కడు శిత శర
పథము నంది జీవింపఁడు వాసవుండు
నైన నట్టి వీర వరేణ్యుఁ డతఁడు సుమ్ము 17.

ఆ.వె. వెలుఁగు ఱేని సుతులు శ్వేతుఁడు జ్యోతిర్ము 18.

ఖు లిరువురును వరుణు కొడుకు హేమ
కూటుఁడు కపి వరుఁడు మేటి నలుఁడు విశ్వ
కర్మ కొడుకు నింక కపి వరుండు

తే.గీ. దుర్ధరుఁడు వేగవంతుఁడు తోరపుం బ
రాక్రముఁడు వసు సుతుఁడు కలఁడు విభీష
ణుండు లంకాపురిం గొని యుండె నీదు
భ్రాత రామ హితుఁడు వర రాక్షసుండు 19.

కం. వచియించితి నీకు బలము
నుచిత గతి సువేల గిరిని నున్నది రాజా!
యచిరమ్ము శేష కార్యము
రుచిరమ్ముగఁ జేయ నొప్పుఁ బ్రోవఁగ లంకన్ 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు ముప్పదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 31.

రాముని సైన్యము లంకలో నున్నట్లు చారుల వలన విని రావణుఁడు మంత్రులతో నాలోచించి విద్యుజ్జిహ్వుఁ డను రాక్షసుని పిలిచి యాతనిని మాయచే రాముని తలను విల్లమ్ములను గల్పించి సీతకు చూప మని నిర్దేశించి రాముఁడు చనిపోయి నట్లు సీతను రావణుఁడు భ్రమింపఁ జేయుట.

తే.గీ. చారు లక్షోభ్య సైన్యము సేరె నంచుఁ
దెలుపఁగ సువేల గిరి చెంత నిలిచె నంచు
లంకలో విని రాముని రాకఁ గలఁత
నెంది కొంత రావణుఁడు సూచి సచివులను 1.

చం. పలికెను మంత్రి వర్గమును బన్నుగ మంత్రము లిప్డు సేయఁగా
వలయును బిల్వఁ డంచుఁ దగఁ బార్థుని మాటల నాలకించి య
ట్టు లొనరుపంగ మంత్రులు కడుం గడు శీఘ్రమ వచ్చి రెల్లరున్
వలసిన సంప్రతింపులను  వారినిఁ బంపె నొనర్చి చక్కఁగా 2.

తే.గీ. పంపి దుర్ధర్షుఁ డంత రావణుఁడు నిజ గృ
హమ్ము లోని కరిగెను మహా బలుఁ డగు
నసుర వీరు  విద్యుజ్జిహ్వుఁ డనెడు వానిఁ
బిలిచి గొప్ప మాయావినిఁ బలికె నిట్లు 3.

చం. కొని చని సీత యున్నెడకుఁ గోమలి సీతను మోస పుచ్చ రా
ముని తల విల్లు నమ్ములను మోహ మెలర్పఁగ నీదు మాయ చే
తను గొని నన్ను గాంచు మిటఁ దద్దయు నేర్పున నంచుఁ బల్కఁగా
విని సరె యంచుఁ బల్కఁగను బ్రీతి నొసంగె విభూషణమ్మునున్ 4.

కం. సీతా దర్శన కాంక్షిత
చేతస్త్వరితుండు నంతఁ జేరె నశో కా
తీ తోన్నత వనమును సం
ప్రీతిని రావణుఁ డబలను వీక్షింపంగన్ 5.

మ. కనె రక్షః పతి జానకీ సతిని శోకస్వాంత నద్దీన ని
త్య నిజోద్వేఢ్య రతాంతరంగను నదైన్యార్హాంగనా రత్నమున్
వినతాస్యాబ్జ మహీ తలస్థితను నుద్విగ్నన్ మహీజాతనున్
విను తాశోక వనాసురీ నిచయ సంవీతన్ సతీ సీతనున్ 6.

తే.గీ. పూర్ణ చంద్ర నిభాస్య నంబుద సమావృ
త శశిరేఖా సదృశను వాత రయ సంచ
లిత సుమలతా సమాన కంపితను మంగ
ళార్థ సువిభూష ణాలంకృ తావనిజను 7.

ఆ.వె. హర్ష శోక మగ్న నార్త విలక్షణ
ను నమ రాపగా వినుత గభీర
సుస్థిమితను బలికెఁ జూచి చెంతను బేరు 8.

నుడివి రావణుండు చెడు పలుకులు

ఉ. సంతస మార నిట్టు లనె సాంత్వమునన్ విను జానకీ సతీ!
యంతము నందె నీదు పతి యాజిని నా ఖర హంతకుండు నీ
వింతిరొ యేరి నెంచి నను నెంచవొ యట్టి నరుండు భద్ర! పే
రంతయు ఛిన్నమయ్యె మద మంతయు నీకు నశించె నివ్విధిన్ 9.

చం. వ్యసనము లంది తీ విటుల భార్యవు కమ్మిఁక నాకు జానకీ!
వెస విడు మూఢ బుద్ధి నిఁక బిద్దిన వానిఁ దలంపఁ గార్య మె
ద్ది సతుల కెల్ల నీశ్వరివి దేవివి ప్రీతిని నౌదు వీవయే
కసిడియె నీదు పుణ్య మది గ్రన్ననఁ గూలెను మూర్ఖురాలివే 10.

ఉ. ఘోరము నీదు నాథు వధ క్రూరము వృత్రు వధాభమే చుమీ
నీరధి పారమం దకట నిల్చెను జంపఁ దలంచి నన్ననిన్
సౌరుని వానరేశ్వరుని సంయుత ముత్తర తీర మందు నా
సూరుఁడు సేర నస్త గిరిఁ జుట్టి చెలంగఁ బ్లవంగ సైన్యమే 11.

తే.గీ. దారి నలసిన సేనను జేరి యర్ధ
రాత్రి సుఖ నిద్ర నుండంగఁ బ్రథమ మంత
వారిఁ దగఁ బరీక్షించిరి చారు లింపు
గ జనకాత్మజ! సేరంగఁ గపి బలమ్ము 12.

కం. రామ బలమ్మును రాతిరి
భామ! ప్రహస్తుండు నడపి బలము స్థిరముగన్
పే మడియించె మదాజ్ఞను
రాముం డున్నట్టి చోట లక్ష్మణు తోడన్ 13.

తే.గీ. పరిఘ పట్టి సాయస ఖడ్గ బాణ జాల
చక్ర శూల లసద్దండ శక్తి కూట
ముద్గర నిచయ తోమర ముసల యష్టు
లు విసరి విసరి కూల్చిరి భువిని హరుల 14.

కం. నిదురించిన రాముని శిర 15.

ము( దునిమెను బ్రహస్తు( డతివ! మూరి మహాసిన్
బెదరక ప్రమాథి వారక
యెదు రన్నది లేక యుండ నిచ్చాగతినిన్

తే.గీ. పట్టు వడె విభీషణు(డు వివశత( బాఱి
రెల్ల కపులు లక్ష్మణునితో( దల్లడిల్లి
హనుమ సమసె నసురులచే హనులు విఱుగ
సీత! సుగ్రీవు గ్రీవమ్ము ఛిన్నమయ్యె 16.

తే.గీ. జానువుల లేవ(బోయిన జాంబవంతు(
బట్టిసము లనేకమ్ములు వట్టి గొట్టి
చంపిరి నఱుక( బడిన వృక్షమ్ము భంగి
నింక మైందద్వివిదుల నహీన బలుల 17.

చం. కపు లట నిశ్వసింప(గను గత్తుల( గోసిరి యేడ్చుచుండ(గా
విపులము వానరర్షభులు విస్తృతమై ప్రవహింప రక్తమే
కపులకు మధ్య భాగమున( గ్రన్నన శత్రుల( జంపు జంటకున్
నృపవర నందనా! చెల(గి నేర్పున రాక్షస వీరు లుద్ధతిన్ 18.

చం. పనస నగమ్ము భంగి భువి వానరు( డా పనసుండు వ్రాలి రో
దన మొనరించు చుండెను వ్యథన్ శర జాలమునన్ దరీముఖుం
డు నల(గి గుంటలో( బడెను డుల్ల(గ నా కుముదుండు తేజు(డుం
దనువున నాట బాణములు తద్దయు మూల్గుచు( గూలె( బృథ్విని‌న్ 19.

తే.గీ. నిపతి తాంగదు( డంగదు(డు పలలాశ
నులు తనువును ఖండింప ముక్కలుగ( బరివ్ర
తమ్ము గా(గ గాత్రముల రక్తమ్ము భూమి
పయిన( బడియుండె నంభోజపత్ర నేత్ర! 20.

కం. హరి వరుల( బరుల( ద్రొక్కిం
చిరి నిద్రా వశుల( గరులచే రథములచే
హరి వరములచే భృశముగ
హరి వేగముచే నలి(గెడు నంబుదము వలెన్ 21.

కం. పరు గిడిరి భాధితు లయి య
పర హరి వీరులు భయపడి వారిని వెన్నం
టిరి రక్కసు లేనుఁగుల మృ
గ రాజు తఱిమెడు విధమ్ముగఁ జలం బెసఁగన్ 22.

కం. కొందఱు కడలి మునింగిరి
కొందఱు గగనంపు టండఁ గొనిరి రయమునం
గొందఱు కోఁతుల గతిఁ గొని
బృందము లయి యెక్కి రంత వృక్షాగ్రమ్ముల్ 23.

కం. గిరుల వనమ్ముల నా సా
గర వేల నసురు లనేక కపి వీరులఁ జం
పిరి నిర్దయ శూరులు బె
క్కురా విరూపాక్షు లడరి కువలయ నేత్రా! 24.

చం. అవనిజ నీదు భర్త విను మాజినిఁ గూలె ససైన్య మవ్విధిం
గవియఁగ నా మహా బలము గాంచుమ శీర్షము రక్త సిక్తముం
దవిలిన దుమ్ము తోడ వసుధం బడఁ దెచ్చిన దాని నంచు సీ
త విన వచించె నొక్క వనితం గని రావణుఁ డిట్లు రక్కసిన్ 25.

తే.గీ. వేగ తెమ్ము విద్యుజ్జిహ్వు వెడలి యిటకు
రక్కసునిఁ గ్రూర కర్ముని రామ శిరము
నెవ్వఁ డని నుండి కొనె తెచ్చె నిటకు వాని
ననఁగ దుర్ధర్షుఁ డసుర గణాధిపుండు 26.

ఆ.వె. వేగ వచ్చి యంత వీర విద్యుజ్జిహ్వుఁ
డటకు శిరము విల్లు హస్త మందు
నుండ నిలిచె విభుని దండ నమస్కరిం
చి శిర మంత వాంచి చేతు లెత్తి 27.

తే.గీ. అమ్మహాజిహ్వు రక్కసు నెమ్మి పలికె
రావణుండు విద్యుజ్జిహ్వు నావలఁ గని 28.

సీత ముందుంచు రాముని శిరము వేగ
కాంచు నామె భర్తను దివంగతుని దీన

చం. విని విభు బాషణమ్ములను వేగమ యుంచి శిరమ్ము సీత చెం
త నసుర వర్యుఁ డేఁగె వడిఁ దద్ధనువున్ దశవక్త్రుఁ డంతటన్
ఘనము ప్రసిద్ధ మింపుగ జగమ్ముల దానిని గెంటెఁ గాంచు రా
ముని దిది యంచు సీత కిడ మోహము తద్దయు పెల్లు దానినిన్ 29.

కం. ఇది నీ రాముని కార్ముక
మిది నారినిఁ గూడి యుండ నిచటం గనుమా
సుదతీ! ప్రహస్తుఁ డసురుం
డు దెచ్చె రాముని నిసిం బటుతరుం జంపెన్ 30.

కం. వెస నా విద్యుజ్జిహ్వుఁడు
విసర శిరము రావణుండు వింటినిఁ ద్రోయన్
వసుధా సుతతోఁ బలికెను
వసమ్ము దగఁ గమ్మని దశవక్త్రుఁడు తనకున్ 31.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు ముప్పది యొకటవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 32.

రాముని శిరమును ధనుస్సును వీక్షించి గుర్తించి మిక్కిలి దుఃఖించి సీతాదేవి కైకను దలంచి నిందించి రోదించుట. రావణుఁడు మంత్రులు పిలువ నేఁగి మంతనములు జరిపి యుద్ధమునకు సన్నద్ధుఁ డగుట.

సీ. కని సీత యా శిరమును వర కార్ముకమ్మును హనుమంతుండు ఘనుఁడు నుడివి

నట్టి సుగ్రీవు స్నేహ మరసి నాథు లోచనముల ముఖవర్ణమును సదృశపు
మోమును బతి కేశములను గేశాంత దేశమ్మును దత్శిరో జముల నున్న
చూడామణినిఁ గడు శుభమును మున్నగు గుర్తుల నెల్లను గుఱుతు వట్టి
ఆ.వె. తూర్ణ మవనిజ యెద దుఃఖమ్ము సెలరేఁగ
గొల్లు మనుచు భృశము కుంది యేడ్చి
కురరి వోలెఁ గైకఁ గోమలి నిందింపఁ
దొడఁగె నంతఁ దలఁచి యెడఁద నిట్లు 1.

ఉ. ఈ యిన వంశ నందనుని నివ్విధిఁ గాంచి హతుండు గాఁగఁ గై
కేయి! ముదమ్ము నందు పరికించి ఫలింపఁగ నీదు కోర్కియే
మాయఁగఁ జేసితే కులము మత్సర మూని విరోధశీలినీ
చేయఁగఁ గంటె రాఘవుఁడు చేటు నొకింతయు నీకు నెన్నఁడున్ 2.

ఉ. పంపితి వేల కానలకు వల్కలముల్ ధరియింపఁ జేసి న
న్నంపుచుఁ దోడుగా దశరథాత్మజు నక్కట యంచుఁ బల్కి తాఁ
గంపము నంది వ్రాలె భువి గ్రన్నన సీత యనంటి చెట్టునుం
ద్రుంపఁగఁ గూలు భంగిని సరోరుహలోచన తప్తచిత్తయై 3.

చం. ఒక త్రుటి సీత తేఱుకొని యొప్పుగఁ జేతన మంది యంతటన్
వికల మనమ్మునన్ శిరము వేదన మూర్కొని పంక జాయతా
క్షి కుమిలెఁ బశ్చిమంపు గతిఁ జేరఁగ హా హత నైతి నార్యపు
త్ర! కలికి నైతి నే విధవ రాఘవ! దీర్ఘ భుజా దృఢవ్రతా! 4.

చం. పతి మును నాశ మౌట కిలఁ బత్ని వహించెడు దుర్గుణమ్ములే
కతము లనంగఁ బల్కుదురు కల్ల గుణమ్ములు నీకు ముందుగా
హతుఁడవు నీవు నా యెదుట నంతము గానక యుంటి నిద్ధరన్
సతిని చెలంగి దుర్గుణ వశమ్మున నింకను మంద భాగ్యనై 5.

తే.గీ. అడరి దుఃఖ పరంపర లావహింప
నన్ను శోక సాగర మగ్న నెన్ని కావ
నుద్యమింపఁగ నక్కట యుద్ధ మందు
హతుఁడ వైతి వీవ రఘు కులాగ్రగణ్య! 6.

తే.గీ. అత్త కౌసల్య వాత్సల్య మడరఁ బెంచి
నిన్ను నందను రాఘువ! నేఁడు పుత్ర
హీన యయ్యె వివత్స యౌ ధేనువు వలె
నక్కజమ్ముగ మరణింప నార్య నీవు 7.

ఆ.వె. దీర్ఘ మాయు వంచుఁ దెల్పిరి నీకు ద్వై
వజ్ఞు లపుడు రామ! వట్టి మాట
లవియు నెల్ల నయ్యె నల్ప మయ్యెను గదా
యాయు వరయ వారిజాక్ష! నీకు 8.

కం. తలఁపఁగఁ బ్రాజ్ఞుని ప్రజ్ఞయె
విలయం బయ్యెనొ మహాత్మ! పెన్నిధి వైనన్
లలిత గుణములకుఁ గాలం
బిల నెన్నఁగ భూతములకు నెల్లఁ బ్రభు వగున్ 9.

ఆ.వె. ధర్మవిదుని నిన్ను మర్మము లెఱుఁగు వా
ని వ్యసనముల నెల్ల నేర్పునఁ దొలఁ
గింప మృత్యు వెట్లు చంప నేర్చుఁ బురుష
పుంగవ! పరికింప ముందుగాను 10.

ఆ.వె. కాళ రాత్రి నిన్ను గాకుత్స్థ! క్రూరత్వ
మునను రౌద్రమునను బురుష వర్య!
కౌఁగిలి బిగియించి కమలాక్ష! నా నుండి
కొనిచనెను రయమునఁ గుంద నేను 11.

ఆ.వె. నను దపించు చున్న వనితను వీడి మ
హా భుజ! ప్రియురాలి నా భువిని న
కట నరర్షభ! తమిఁ గౌఁగిలి నిద్రించు
చుంటి వయ్య! నిండఁ గంట నీరు 12.

ఆ.వె. దేని సంతతమ్ము నేను బూజింతు గం
ధమున మాల్యములను దాని నాకుఁ
బ్రియ తరమగు నీదు వింటినిఁ గాంచుమ 13.

స్వర్ణ భూషితమ్ముఁ బార్థి వేంద్ర!

కం. అనఘా మామను దశరథు
ఘను నీదు జనకునిఁ బితృ నికాయము తోడన్
మన మలరఁ గలిసి యుందు వ
ని సేఁ దలంతును నరవర! నిశ్శంక దివిన్ 14.

కం. విడిచితి రాజర్షి కులము
గడు పుణ్య కులమ్మును ఘనకర్మ నిచయముల్
పుడమి నొనర్చిన కతమున
నుడు పథమున మెఱయు దింక నుర్వీనాథా! 15.

చం. నను గన వేల రామ వచనమ్ములు సైనను బల్క వేల బా
లను సహ ధర్మచారిణి నరప్రవరా చిననాఁడు పెండ్లి యా
డిన సతిసే రఘూత్తమ! కడింది విషణ్ణను వెంట నుందు సే
ననితివి నీవు నా కరము నందిన నాఁడు స్మరింపు మింపుగా 16.

చం. కొని చను మయ్య నీ వెనుక గొంకక నన్నిట నేల వీడితే
మనుజుల యందు నుత్తముఁడ మానవ లోకము నుండి యిత్తఱిం
జనితివె యన్య లోకము విచారము నందు నిమగ్నఁ జేసి దా
రను నను ధర్మ మెట్టి దిది రాఘవ! యోచన మాత్మఁ జేయుమా 17.

కం. ఉచితము కల్యాణములకు
నుచితం బాశ్లేషమునకు నొనరింపఁగ సే
శుచి యగు నీ గాత్రమ్ముఁ గ
లఁచి కడు నీడ్చుచుఁ జెలంగుఁ గ్రవ్యాదు లీఁకన్ 18.

కం. అగ్నిష్టోమా దీష్టుల
మగ్నుండవు దక్షిణ లిడి మన్నించితివే
యగ్ని ముఖుల నోఁచ వెటుల
నగ్ని సుసంస్కారమునకు నంభోజాక్షా! 19.

సీ. వెడలిన ముగ్గురు బిడ్డల నొక్కని వచ్చిన లక్ష్మణు నచ్చటఁ గని

కౌసల్య ప్రశ్నింపఁగం బరి తాపం బడరఁగ వినిన నీదు మరణ మింక
మిత్ర బల వధము శత్రు బలమ్ముచేత నిశీథి రాక్షసాధముల చేత
నిద్రించు చుండఁగ నీరజ నేత్ర! నే నుంట రక్షోనాథు నింట డెంద

తే.గీ. మంతఁ బగిలి ముక్కలుగ నా యింతి యింక
నుండ నేరదు పరికింప నుర్విఁ బ్రాణ
ములను గూడి నిక్కమ్ముగ లలన వ్యాకు
లమ్ము సెంది ఘోరమ్ముగ రాఘవేంద్ర! 20.

తే.గీ. ఘోర మీనాలయము దాఁటి గుంట సమసె
నా వలన లలన వలన నరవరుం డ
నఘుఁడు రాముఁడు పార్థివ నందనుండు
నక్కజమ్ముగఁ బద్మ దళాక్షుఁ డకట 21.

తే.గీ. మోహమునఁ బెండ్లి యాడె విమోహి రాముఁ
డు కులపాంశన నన్ను నేరకయు నతని
మృత్యు వనఁగఁ బరఁగితి నే సత్య మెంచ
నార్య పుత్రున కక్కట నక్కజముగ 22.

కం. వారించి యుందు నీయఁగ
నేరికొ గత జన్మ మందు నీసున దానం
బౌరా సర్వాతిథికే
దార నయిన రాఘవునకుఁ దప్పక తలఁపన్ 23.

చం. కలుపుమ భర్తతో సతినిఁ గాంతుని కాయము నందు వేగ న
న్నిలుపుమ రావణాసుర! కనీసపు మేలును గూర్పు భర్త దౌ
తల పయి నా శిరమ్ము నిడు తత్తను వందు మదీయ గాత్రమున్
లలితపు రీతి నుంచు మిఁక రాముని వెంటఁ జరింతు సక్తనై 24.

చం. వల దిఁకఁ బాప జీవితము వాంఛ వహింప ముహూర్త మాత్ర మే
నిల బ్రతుకంగ వింటిని నిజేశులపై ననురక్తిఁ జూపు భా
మలకు విశుద్ధ లోకముల మన్నన లుండు ననంగ విప్ర వ
ర్యు లనఁగఁ దండ్రి వేశ్మమున నుండఁగఁ బూర్వము నేను నెమ్మినిన్ 25.

ఉ. ఆర్తి సుతప్తయై యిటుల నద్ధరణీసుత యాయతాక్షి తా
భర్త శిరమ్ము కార్ముకము పన్నుగఁ గాంచుచు మాటిమాటికిన్
వర్తిల నేడ్చుచుండి కడు వచ్చెను రాక్షసుఁ డొక్కఁ డంజలిన్
భర్తకు రాక్షసేంద్రునకు వందనముల్ దగఁ జేసి యిట్లనెన్ 26.

తే.గీ. విజయ మార్యపుత్రా యని పేర్మి వంద
నమ్ము లిడి ప్రసాదింపఁగ నాథుఁ డంత
విన్నవించెఁ బ్రహస్తుఁడు వేగ మిమ్ము
చూడ మంత్రులతో నున్నవాఁడ యనుచు 27.

ఆ.వె. నన్ను పంపె రాజ సన్నిధికి నృప కా
ర్యమ్ము కలదు ముఖ్య మైన యట్టి
దిపుడు దర్శనమ్ము నృపవర! యీయ నొ
ప్పు నని యన విని దశముఖుఁడు వేగ 28.

ఉ. వీడి యశోక వాటికను వేగమ మంత్రులఁ గాంచి వారితోఁ
బాడిగ మంతనమ్ములను బంక్తి ముఖుం డొనరించి కార్యముల్
వీడక చేయు నట్టి వట విస్తృత రీతిఁ దలంచి చర్చలం
బోఁడిమిఁ జేరి యా సభ నృపుత్రు సెటింగి యొసంగె నాజ్ఞలన్ 29.

కం. రావణుఁ డేఁగిన క్షణమున
నా విల్లుత్తమము తలయు నాశ్చర్యముగన్
వేవేగ మాయ మైనవి
యా వనితా మణి కలంత నడలుచు నుండన్ 30.

చం. సచివుల భీమ విక్రములఁ జక్కఁగ నంతట సంప్రదించి తా
రుచిరముగా దశాననుఁడు రోష మెలర్పఁగ రామ కార్యమై
యచటనె చెంత నిల్చిన బలాధిపులం గని కాల తుల్యుఁడే
వచనము లిట్లు రావణుఁడు పల్కెను రాక్షస నాథుఁ డుద్ధతిన్ 31.

తే.గీ. భేరులను దగ మ్రోయించి వినఁ బడంగ
స్ఫుటముగం గొట్టి ఘన కోణములను బిలువ
వలయు సైన్యమ్ము నుడువంగ వలదు కార 32.

ణమ్ము నేరికి నంచు నానతి నొసంగె

కం. విని యట్టులె యని కైకొని
ఘనులా దూత లడరి బలగమ్మును సమకూ
ర్చి నిజాధీశునకు దశా
ననునకుఁ దెల్పిరి రణ రతునకు వేగముగన్ 33.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు ముప్పది రెండవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 33.

రాక్షస స్త్రీ సరమ యను ప్రియ సఖి సీతను జేరి యూఱడించి రాముఁడు మరణింపలే దని యిది యంతయు రావణుని మాయ యని రాముఁడు సముద్రమునకు దక్షిణ దిక్కున సేనతో విడిసి యున్నవాఁ డని తెలిపి రావణుని యుద్ధములోఁ జంపి నిన్ను గ్రహింపఁ గలవాఁ డని పలుకుట.

కం. మోహిత యగు నా సతి పై
దేహిని నాత్రముగఁ జేరి దేవిని నంతన్
సాహసమున సరమ యసుర
గేహిని వచియించెఁ బ్రియసఖి కడుఁ బ్రియముగన్ 1.

కం. మృదు భాషిణి సీతను బర
మ దుఃఖితను నూఱడించె మైథిలినిఁ దగన్
బెదరఁగ రావణు మాయను
సుదతీ మణిఁ గాంచి వగవ శోకము మీఱన్ 2.

ఉ. రావణు నానతిన్ సరమ రక్షణ మీయఁగ నిల్చె సీతకుం
గావఁ బడంగ నట్లసుర కాంతను గైకొని మిత్రురాలిఁగా 3.

నా వసు ధాత్మసంభవ దయా గుణ యుక్త దృఢవ్రతం దగం
బావని సీతయే బడబ భంగిని దొర్లుచు నుండ నార్తితో

చం. కనియెను జానకిన్ సరమ కాంతను దుఃఖిత నష్ట చేతనం
దనరుచు నంత స్నేహమునఁ దా ననెఁ బ్రీతిని నూఱడిల్లుమా
మనమున వీడుమా భయము మానిని! రావణు మాటలింక నీ
మినుకల వింటి దాఁగి తగ మిన్నున భీరువ! నిర్భయమ్ముగన్ 4.

ఉ. నీ కొఱ కెన్న జీవితము నీరజ నేత్ర! ప్రియమ్ముగా నెదన్
వీఁకను నేల యాత్రముగ వీడె నశోక వనమ్ము రావణుం
డో కమలాక్షి నేరితిఁ గృశోదరి చాటున నేఁగి సర్వముం
దాఁక నశక్యమే యగును దన్నర పుంగవుఁ డుండ నిద్రలో 5.

తే.గీ. వధ మనెడు మాట యన్న దుత్పన్నమౌట
కల్ల పురుషర్షభున కెంచఁ గమల నయన!
రామ రక్షిత వానరుల వధియింప
రాదు శక్ర రక్షిత నిర్జర తతి భంగి 6.

ఉ. ఉర్విని దీర్ఘ వృత్త భుజ యుగ్మము వాఁడు విశాల వక్షుఁడున్
సర్వ ధనుర్ధ రోత్తముఁడు సంహన నాన్విత విక్రముండునున్
గర్వ విహీనుఁడున్ ధర నగణ్య సువిశ్రుతుఁ డెన్నఁగా నయా
ఖర్వ రతుండు రాఘవుఁడు కాంత! సుఖుండు సలక్ష్మణుండునై 7.

తే. సుప్రతాపవంతుఁడు శాస్త్ర సుప్రసిద్ధుఁ
డాత్మ పర రక్షకుండు నిత్యమ్ము రిపు బ
లౌఘ విలయుండు శ్రీమంతుఁ డవనిజా! ని
హతుఁడు కాఁడు రాముండు సత్య మిది నమ్ము 8.

ఆ.వె. కపట బుద్ధితో సకల భూత శత్రువు
మాయ నెఱుఁగు వాఁడు మాయ నేసి
రావణుఁ డిది యెల్ల రౌద్రమ్ము నూని క
ల్పించె మోసగింప నెంచి నిన్ను 9.

తే.గీ. సీత నీ శోక మెల్లను క్షీణ మగును
విరియుఁ గల్యాణములు నీకుఁ బెక్కు లింక
నిన్ను సేవించు శ్రీలక్ష్మి పన్నుగాను
బ్రియముఁ బ్రీతి కరమ్మును వినుము సీత 10.

చం. కడలిని దాఁటి వానర నికాయముతో సహ లక్ష్మణుండు రా
ముఁడు వడిఁ జేరి నిల్చెను సముద్రపు దక్షణ తీర మందు నో
పడఁతిరో నేను గాంచితిని పన్నుగ రక్షితుఁడై బలమ్ములం
బడసి నిజార్థ మింపుగ నవారిత రీతిని జానకీ సతీ! 11.

ఉ. దూతలు పంప రావణుఁడు తూర్ణము పల్కిరి వేగవంతులే
సేతను గాంచి రాఘవుఁడు సేర్పునఁ జేరెను దాఁటి వార్ధిఁ దా
నాతత బాహువిక్రముఁడు నంచిత లంకను నంత రావణుం
డీ తటిఁ గూడి మంత్రులను నెల్ల మునింగెను మంతనమ్ములన్ 12.

తే.గీ. పలుకు చుండ నిట్లు సరమ భాషణములు
సీతతో నుద్యమింపంగ నాత తాసు
రధ్వజిని సెలరేఁగె భైరవముగ రవ
ము లవి వాయింపఁగా దుందుభులు బడియల 13.

తే.గీ. విని మధుర భాషిణి సరమ వినుమ భీరు
వా! యని వచింపఁ దొడఁగె నవనిజ కిట్లు
ఘోర మైన భేరుల ధ్వని నీరదస్వ
న సదృశం బతి గంభీర నాద మతివ! 14.

తే.గీ. ఉద్యమించు చుండిరి ఘోర యుద్ధమునకుఁ
గరుల సమకట్టు చుండిరి యరదములకు
హయములం గూర్చు చుండిరి హర్ష మంద
రౌతు లటఁ బాశ కరులు పరఁగిరి వేలు 15.

చం. కదలెను రాజ మార్గములఁ గాల్బల మెల్లను నిండి దిక్కులం
దుదక మహౌఘు వేగ గమ నోగ్రతఁ బాఱెడు వార్ధి భంగినిం
బదిల మపూర్వ రీతిఁ గనుపట్టు మహా బల మచ్చ టచ్చటన్ 16.

సదమల రీతిఁ బోరునకుఁ జాగుచు నున్నది సంభ్రమమ్ముననన్

ఉ. కాంచుమ వెల్గు శస్త్రములఁ గాంచన భూషిత రాక్ష సౌఘమున్
మించిన చర్మవర్మముల మేలి హయమ్ముల స్యందనమ్ములన్
సంచిత కుంజరమ్ములను ఛాయ లనేకము లట్లు వెల్గఁగా
నంచిత వహ్ని రూపమున నాసె నరణ్యముఁ గాల్చ వేసవిన్ 17.

కం. కను సంభ్రమమునఁ జెలఁగెడు
ఘన రాక్షస వరుల దీర్ఘ కాయుల నెల్లన్
జనకాత్మజ! బల్లిదులను
మనముల హర్షం బడరిన మను జాశనులన్ 18.

తే.గీ. వినుమ యేనుఁగు గంటల ఘన రవమ్ము
వినుమ రథముల చప్పుళ్లఁ బృథ్వి తనయ!
వినుమ హయముల హేషలు వినుమ వాద్య
ఘోషముల నెల్లఁ జెలగంగ ఘోరముగను 19.

ఆ.వె. ఆయుధముల నెత్తి హస్త యుగమ్ముల
నిలిచి నట్టి రక్కసులను రావ
ణానుసరులఁ గనుమ యతివ! సంభ్రమమున
నొడలు గగురుపొడవ నడరు వారి 20.

చం. కలుగును శోక మార్చు సిరి క్రన్నన నీకు విదేహ నందనా!
కలుగు భయమ్ము ఘోరముగఁ గయ్య మొనర్పఁగ రాక్ష సాలికిన్
నళిన దళాక్షుఁ డైన రఘు నందనుఁ డింద్రుఁడు చంపి నట్లు దై
త్యులను బరాక్రముం డసుర యోధుల రావణుఁ జంపి నిం గొనున్ 21.

కం. వెన్నుని శత్రుఘ్నుం డని
జెన్నుగఁ గూడి బలభేది సెలఁగిన రీతిం
బన్నుగ లక్ష్మణు తోడుత
నన్న యనిని విక్రమించు నసుర గణములన్ 22.

కం. వచ్చిన రాముని నీ పతి 23.

పెచ్చని యంకమ్ము నందు వెలయఁగ సీతా!
యిచ్చయె తీరఁగ మురియఁగ
నెచ్చెలి! దర్శింతు నిన్ను నీల్గఁగ రిపులే

కం. విడిచెద వానం దాశ్రువు
లడరి మహోరస్కు నురము నందు ముదమునం
గడు ప్రీతిఁ గౌఁగిలింప మ
గఁడు శోభన! నిన్ను ఘనుఁడు కాకుత్స్థుండే 24.

ఆ.వె. పిఱుఁదు లంటి నట్టి వేణిని జానకి!
పెక్కు నెలల నున్న మిక్కుటంపు
జడ నచిరము మగువ సడలుచు రాముం డ
ధిక బలుండు ప్రీతి దేవి! కదిసి 25.

తే.గీ. ఉదిత పూర్ణ చంద్ర నిభము సుదతి! నీ ప
తి వదన మరసి వీడెదవు వగ పెల్ల
మదిని జానకి!  కుబుసము నుదరి వీడు
పన్నగము భంగి శీఘ్రుంట పద్మ నయన! 26.

కం. అచిరము రావణు రాముం
డు చంపి సమరమున నర్హుఁడు సుఖమ్ములకున్
రుచిరముగ నందు సుఖమును
సుచరిత! నిను గూడి ప్రియను క్షోభింపకుమా 27.

తే.గీ. అమ్మహాత్ముని రాముని నెమ్మిఁ గూడి
సీత! మోద మందఁ గలవు శీఘ్రముగను
వర్షము వలన పంటలఁ బడసి మిగులఁ
బుడమి సంతసించు పగిదిఁ బుడమి తనయ! 28.

కం. గిరి చుట్టును గుఱ్ఱము వలెఁ
దిరుగు దివసకరునిఁ గాంచి దేవీ! భక్తిన్
శరణము వేడుమ సూర్యుం
డరయఁగఁ గారకుఁడ యెల్ల యవనీ ప్రజకున్ 29.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు ముప్పది మూడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 34.

సరమ వాక్యములతో సేద దీరిన జానకి సరమను రావణుని తదుపరి కార్యమును దెలిసికొని తనకుఁ జెప్పు మని వేఁడ సరమ రహస్యముగా రావణుని నిర్ణయము నెఱింగి రామునకు సీత నిమ్మని యెవ్వరు వేఁడినను రావణుఁ డంగీకరింప లేదని యుద్ధమునకు సన్నద్ధుఁ డగు చున్నవాఁడని తెలుపుట.

కం. ఘన సంతప్త నట సరమ
దన సుమధుర వాక్యములను దగ సీతా దే
విని సంతోషపఱచెఁ గా
లిన భూ దేవిని సలిలము లీలం బ్రీతిన్ 1.

చం. హిత మొనరింప నెంచి సఖి కిత్తఱినిన్ సమయజ్ఞ ప్రీతితో
స్మిత సహితమ్ము నా సరమ సీతను గాంచి వచించె నిట్లు నీ
పతి కడ కేఁగి నీ గిరలు వల్కుఁ దలంతును రాఘవేంద్రుఁ గాం
చి తరుణి! యాన తిచ్చిన నశేషముగాఁ గుశలమ్ము గుట్టుగన్ 2.

కం. ఏఁగుచు నుండ గగనమున
నా గరుడుఁడు మారుతియు నిరాధారను న
న్నే గతి నందఁగఁ జాలరు
నా గమనమ్మును దలంప నళినదళాక్షీ! 3.

చం. పలుకఁగ నిట్టు లా సరమ పల్కెను జానకి యాలకించి య
క్కలఁత దొలంగ డెందమునఁ గ్రమ్మఱఁ దియ్యని భాషణమ్ములం 4.

దెలియు సమర్థ వీ వనఁగఁ దెల్లముగా నభ మింక నా రసా
తలమును జేరఁ జేయుమ ముదమ్ముగఁ నొక్క పనిన్ మదర్థమై

కం. స్థిరముగ నీ బుద్ధిఁ బ్రియ మొ
నరింప వలె నన్నదే తనర నా కయి యో
సరమ! తెలియఁ గోరెద నే
ను రాక్షసుం డిపుడు రావణుఁ డొనర్చు పనిన్ 5.

ఉ. క్రూరుఁడు మాయలన్ ఘనుఁడు గూర్చును మోహము శత్రు రావణుం
డారట మాత్మనాకు సుర నానఁగఁ గల్గు విధమ్ము దౌష్ట్యమే
మూరఁగ నిచ్చు బాధలను బొంచి సతమ్ము భయం బొసంగుచున్
ఘోరల రాక్షసీ సతులఁ గోరు నొగుల్పఁగఁ గాచు వేళలన్ 6.

చం. వెఱ పెదఁ దద్భయమ్మునను బేర్చును డెందము నందు శంకయుం
దఱ చగుఁ దల్లడిల్లుదును దద్ద యశోక వనమ్ము నందు నా
కఱిముఱి తక్కు నేరిన దశాననను నిర్ణయ మెల్ల నిత్తఱిన్
వఱలు ననుగ్రహమ్ముగను భామిని యక్కథ నాకుఁ దెల్పఁగా 7.

ఆ.వె. పలుక నట్లు సీత వల్గు భాషిణి పల్కె
సరమ భాష్ప కలిత చారు ముఖము
తుడిచి స్నేహ మడరఁ దూర్ణము చక్కని
భాషణముల ని ట్లవనిజ తోడ 8.

తే.గీ. నీ యభిప్రాయ మెట్లున్నదో యటులనె
యేఁగెద గ్రహించి సీత! నే నింపుగాఁ బ
రుల యభిప్రాయ మెల్ల మరలి రయమ్ము
న నిట కేఁగుదెంచెదఁ జూడు నలిన నేత్ర! 9.

చం. రయమున నేఁగి యిట్టు లని రాక్షసు చెంతకు నంత నాలకిం
చి యసుర నాథు మంత్రములు జెన్నుగ మంత్రుల గూడి చేయఁగా
దయితుల తోడ నిశ్చయము దా విని నిశ్చయపేత్త యెన్నఁగా
వయినము నెల్ల నా సరమ భామకుఁ దెల్పఁగ వచ్చె శీఘ్రమే 10.

ఆ.వె. చేరి యంతఁ గాంచె సీతను సరమ ప
దృ రహితంపు లక్ష్మి కరణి నున్న
కాంతఁ దనదు రాకఁ గాక్షించు చున్నట్టి
దీన సరమ నపుడు దేవి సూచి 11.

ఆ.వె. తిరిగి రాఁగ సరమ తియ్యని పల్కుల
సఖిఁ బరిష్వజించి జానకీ స
తి కడు స్నేహమున నతివ కొసంగె నట నా
సనము గారవమున స్వయముగాను 12.

ఉ. ఇమ్ముగఁ గూరుచుండి వచియింపుమ రావణు నిశ్చయమ్ము నా
కమ్మరొ క్రూర కర్మ తలఁ పంత నిజమ్ముగ నంచుఁ బల్కఁగా
నమ్మగువం దపించు సఖి నారసి చెప్పఁ దొడంగె నిట్లు స
త్యమ్మును మంత్రి సంయుతము నచ్చట రావణుఁ డన్న మాటలన్ 13.

చం. పలికిరి గొప్ప వాక్యములు పన్నుగ నీ దగు మోక్ష ణార్థమై
వలసిన రీతిఁ బ్రీతి దశ వక్త్రుని తల్లి యవిద్ధ నామ స
ల్లలితుఁడు మంత్రి వృద్ధుఁడును రాముని కిమ్మని సత్వరమ్ము మై
థిలిని సగౌరవమ్ము సుదతిన్ రఘు వీరున కంచు జానకీ! 14.

తే.గీ. చాలు నింకఁ దనయ! జనస్థాన మందుఁ
గాంచి నట్టి యద్భుత మది యంచితపు ని
దర్శనము హనుమంతుని దర్శనమ్ము
వార్ధి దాటుట యసురుల వధయుఁ దలఁప 15.

తే.గీ. ఏ నరుం డొనరించు మహిని కుమార!
యంచుఁ దల్లియు మంత్రియు నకట పలుక
పలు విధమ్ముల విత్తమ్ము వదల లేని
యర్థపరు భంగి నిను వీడ ననియె నతఁడు 16.

తే.గీ. ఉత్సహింపఁడు వీడంగ నువిద నిన్ను
జావ కుండ సమర మందు నీ విధి నగ
పడును వాని నిశ్చయ మింక వారిజాక్షి! 17.

మంత్రులను గూడి చేయంగ మంతనములు

చం. నిలిచెను సుస్థిరంపు మతి నివ్విఱ మృత్యు వశుండునై యిటుల్
కలవర మంది యెన్నఁడును గాదు  నిరస్తుఁడు కాక యాజి నో
లలన! త్యజింప నొల్లఁ డెద రాక్షస సంచయ మెల్ల నింకఁ దా
ను లయము నంద కేనియు ఘనుం డసు రేంద్రుఁడు మిన్నకుండుసే 18.

చం. సమరము నందు రాఘవుఁడు చంపి దశాస్యు శరమ్ములన్ వెసం
గమల దళాక్షి  నిం గొని సుఖమ్ముగ నేఁగు నయోధ్య కంచు వా
క్యము లన నిట్టు లా సరమ యంతఁ జెలంగెను శంఖ దుందుభుల్
తుముల రవమ్ములం బుడమి తోరము మున్గఁగఁ గంపనమ్ములన్ 19.

కం. విని వానర సైన్యధ్వను
లను లంకా వాసు లంత రావణ భృత్యుల్
మనములఁ దలఁచిరి  దైన్య
మ్మునఁ గన మని నృపుని దోషమున శ్రేయమ్మున్ 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు ముప్పది నాలుగవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 35.

భేరీ శంఖ నినాదములతో రాముఁడు స సైన్యము లంకను జేర రావణుఁ డా ధ్వనుల నాలకించి తన మంత్రులతోఁ దదుపరి గర్తవ్యము నాలోచించు చుండ మాల్యవంతుఁడు రావణుని మాతామహుని యన్న దుర్నిమిత్తములను బరిగణించి రామునితో సంధిఁ గూర్చికొనుమని సీతను రాఘవున కిమ్మని బోధించుట

కం. కదిసెఁ బర పురంజయుఁ డా 1.

సుదీర్ఘ బాహుం డినకుల సోముఁడు రాముం
డు దిశలలో భేరీ ఘన
నదములు నిండంగ శంఖ నాద సహితముల్

చం. విని యసురేంద్రుఁ డా ధ్వనులఁ బృథ్వి చలింపఁ జెలంగ రావణుం
డనయుఁడు ధ్యాన మగ్నుఁ డయి యంతటఁ బల్కెను గాంచి మంత్రులన్
ఘన బలుఁ డిట్లు క్రూరుఁడు జగమ్ము నొగల్పఁగఁ దా సమర్థుఁడే
మునుకుల నా సభాస్థలము మ్రోగఁగ దూఱక సేరి సెవ్విధిన్ 2.

ఉ. బాగుగ వింటి మీరు నుడువం దగ రాముని విక్రమమ్మునున్
సాగర ముత్తరించుటయు సత్త్వము సెల్లను సేర్తు నింక మీ
వేగము సత్య విక్రమము విగ్రహ మందుఁ దలంచి మీర లీ
లాగున మిన్న కుండుటయు రాముని విక్రమ మాత్మలం దిటన్ 3.

తే.గీ. ఒండొరులను వీక్షించుచు నుండి యనఁగ
నంత మాల్యవంతుం డను నసుర వరుఁడు
విని మహాప్రాజ్ఞుఁడు పలికె జనని తండ్రి
వచనముల నిప్పగిదిని రావణుని తోడ 4.

ఉ. రాజ వరేణ్య! విద్యలను రమ్య తరమ్ముగ నభ్యసించు సే
రా జతఁ డేలు ధర్మమున రాజిలి నిత్యము పెద్ద కాలమే
యోజను స్వీయ శత్రువుల నుంచి వశమ్మున సెన్ని కాలముం
దేజము నూని సంధి సమితిన్ రిపులం దొనరింప నింపుగన్ 5.

కం. తనవారినిఁ బోషింపఁగ
ధన వృద్ధి నొసంగి సంతతమ్ము ముదముగన్
జననాథుం డైశ్వర్య
మ్మును బడయు నమేయముగను బుడమిని రాజా! 6.

ఆ.వె. సంధి యొప్పు రాజ సత్తమునకు హీనుఁ
డయిన సముఁ డయినను నరికి నెంచ
జేనికిం దగ దవమానింపఁ బగవాని
బల్లిదునకు నొప్పు భండనమ్ము 7.

ఉ. రాముని తోడ సంధియ కరం బుచితం బని నా మతంబ యే
భామ గ్రహింప రాఘవుఁడు వచ్చెనొ యా సతి నిమ్ము సీత నా
రామునకున్ విరోధము దలంపకు మాతని తోడ సంధి మే
లౌ మనికిన్ నరోత్తము జయమ్మును గోరుదు రయ్య సంయముల్ 8.

తే.గీ. సకల దేవర్షి గంధర్వ సంచయమ్ము
కూడ రాఘవేంద్రు జయము కోరుచుండు
నజుఁడు సృజియించె సుర లింక నసురు లనఁగ
నధిప! రెండు పక్షమ్ముల నవని లోన 9.

ఆ.వె. ధర్మ మాశ్రయింత్రు నిర్మలాత్ములు సుర
లెల్ల సంతతమ్ము నింక వినుమ
యసురు లాశ్రయింతు రడరి యధర్మమ్ము
నెల్ల వేళలఁ బరికింప రాజ! 10.

ఆ.వె. ధర్మము కబలింప ధరణి నధర్మమ్ము
నది తనరు కృతయుగ మనఁగ మఱి య
ధర్మము కబలింప ధర్మము నది కలి
యుగ మనఁగఁ బరఁగు నుర్వి లోన 11.

కం. చరియింప నీవు జగతినిఁ
వరియింప నధర్మ మణఁచి వర ధర్మమ్ముం
బరు లైరి వీర్య వంతులు
పరికింపంగ మన కన్నఁ బంక్తిగ్రీవా! 12.

ఉ. ఏమఱి నీ వధర్మము నహీనము పెంచితి రాక్షసేంద్ర! వి
న్మా మనలన్ గ్రసింప నది యత్న మొనర్చుచు నున్న దిప్డు స
ర్వామర పక్ష మందు ననయమ్మును ధర్మము వొందె వృద్ధినిన్
నీ మది నిండఁ గోరికల నీ వొన రింప యథేచ్ఛమే బనుల్ 13.

తే.గీ. ఋషుల కగ్ని కల్పుల కెల్ల నెడఁద లందుఁ
బుట్టె నుద్వేగ మాతత మట్టి సన్ము 14.

నుల ప్రభావమ్ము దుస్సహం బిల భరింప
మండు చున్నట్టి యనలమ్ము మాడ్కి నెన్న

చం. ఎలమిని భావి తాత్ములు మునీంద్రులు ధర్మము నాశ్రయింత్రు వా
ర లిల యజింత్రు యజ్ఞములు రక్తిని భిన్నవిధమ్ములన్ హవి
స్సు లడరి వేల్తు రగ్నుల ద్విజుల్ పఠియింతురు బ్రహ్మ ఘోషముల్
కలవర మంది యియ్యసుర కాయము పాఱఁగ నెల్ల దిక్కులన్ 15.

తే.గీ. అగ్ని సన్నిభు లైన సంయముల యింట
నగ్ని హోత్రములఁ జెలంగు నట్టి ధూమ
మెల్ల దిక్కుల వ్యాపించి మెల్ల మెల్ల
గ నసురుల తేజము హరింపఁ గలదు సెలఁగి 16.

ఆ.వె. వారి వారి పుణ్య పట్టణమ్ముల నాచ
రింపఁ దీవ్ర తపము లింపుగ సుదృ
ఢవ్రతు లసురులను దీవ్రముగఁ దపింపఁ
జేయుఁ నా తపము లమేయముగను 17.

మ. వరముం బొందితి దేవ దానవులచే వత్సా! సయక్షాలి యే
మరణం బన్నది లేని యట్టులను సంరంభంబునన్ వీర లా
ర రణార్థమ్మున నేఁగుదెంచఁ గను గోలాంగూల సంఘాతముల్
హరి సంఘంబు మనుష్య పుంగవులు నత్యం తాగ్రహోపేతులై 18.

కం. వచ్చిరి గర్జించుచు వీ
రచ్ఛంపు దృఢ విక్రములు దశానన! కంటే
యిచ్చట నుత్పాతమ్ములు
హెచ్చుగఁ గానఁ బడు చుండె నీక్షింపంగన్ 19.

కం. కను చుంటిని రాక్షస లయ
ము నిట్టి దుశ్శకునముల నపూర్వమ్ముల నే
ననుమానింపక నా మన
మున రావణ! రాక్షసేంద్ర! భూరి బలాఢ్యా! 20.

ఆ.వె. ఘోర నాదము లిడి నీరదమ్ములు భయం
కరము లెల్లడలను గురియు చున్న
వరయ లంక లో దశాస్య! వెచ్చని రక్త
వర్ష మక్కజముగ వారకుండ 21.

తే.గీ. రాల్చు చున్నవి కన్నీరు రాజ! కరులు
కరము రోదించుచును బతాకమ్ము లెల్ల
ధ్వస్త మయి వివర్ణం బయి వఱల కున్న
వి మునుపటి వలెఁ బ్రభలతో వింత గాను 22.

సీ. వ్యాళ గోమాయు గృధ్రాదులు కూయు చున్నవి లంక లో భీమ నాదములను
సంఘములుగఁ గూడి సంతత మింకను నల్లని దేహాలు తెల్లని వగు
దంతము లగపడ నింతులు నవ్వుచు ముందట నిల్చిరి మూరి కలల
మాయము సేయుచు మందిరముల నున్న వెల్ల వాగుచు నుండి యెల్ల రడరి
తే.గీ. బలుల మ్రింగుచు నుండెఁ గుక్కలు గృహముల
ఆవు లందును గాడిద లందు సంతు
ముంగిసలు కను పిల్లల మూషికమ్ము
లందుఁ బులులఁ గూడును బిల్లు లడరి వింత 23.

ఆ.వె. సూకరమ్ము లడరి శునకమ్ములం గూడు
రక్కసులను నరుల నక్కజముగ
కిన్నరు లసురేంద్ర! మిన్నగఁ గూడుచుఁ
జలుపు చుండి రకట సంగమమ్ము 24.

కం. చరియించుచు నున్నవి పా
వురములు తెల్లనివి రక్తపుఁ జరణములతో
స్ఫురియింప నాశన మసుర
వరులకుఁ గాలంపు మహిమ వఱలఁగ నధిపా 25.

తే.గీ. కూయు చున్నవి వింతగ గోరువంక
లిండ్లఁ గిచగిచ శబ్దమ్ము లెల్ల గ్రుచ్చఁ
బడఁగ నోడి కలహ కాంక్ష వఱల నంతఁ
గూలు చున్నవి పుడమిని ఘోరముగను 26.

ఉ. పేచి విహంగ జంతువులు భీకర మేడ్చుచు సూర్యు వైపునం
జూచుచు నున్నవిందుఁ బురుషుండు కరాల విశుద్ధ ముండుఁడుం
జూచుచుఁ గృష్ణ పింగళుఁడు శూర! గృహమ్ముల వేళ వేళలన్
గోచర మయ్యె నింక నిట ఘోర నిమిత్తము లాను చున్నవే 27.

ఉ. రాముని సత్య విక్రముని రావణ! యెంతును విష్ణు వంచుఁ దా
నీ మనుజాకృతిన్ నిలిచె నెవ్వఁడు సేతువు నద్భుతమ్ముగా
నీ మహిఁ గట్టె సంద్రమున నెంచఁగ మానవ మాత్రుఁడే తగన్
క్షేమము నెంచి సంధి నీఁకఁ జేతల సేరి యొనర్పు వానితో 28.

కం. అని గిర లిట్టులు మౌన
మ్ము నూనె నయ్యసుర నాథు ముఖము మనమ్మం
గని మాల్యవంతుఁ డత్తము
ల నుత్తముండును ఘనుఁడు బలమ్మున నంతన్ 29.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు ముప్పది యేనవ సర్గము.

# యుద్ధ కాండము
# సర్గము 36.

మాల్యవంతుని హిత వాక్యములను సైప నోపక రాముని స్తుతించి నందుల కాతని నిందించి సీతను రామున కీయ నని వానర సైన్యముతోఁ గూడి రాముఁడు ప్రాణములతో లంకను వీడ లేఁ డని పల్కి ప్రహస్తాదులను లంకాపురి నాలుగు ద్వారములను రక్షింప నియమించి రావణుఁడు తన యంతఃపురమున కేఁగుట.

కం. విని మాల్యవంతుని హిత వ
చనమ్ములు సహింపఁ డా దశ ముఖుఁడు కాల 1.

మ్మునకు వశుండు నయి కలుష
మనస్కుఁ డసురాధిపతి తమక మెద నిండన్

చం. కనుబొమ పే మొగిడ్చి యధికమ్ముగ నాగ్రహ మంది యుగ్రుఁడై
కనులను ద్రిప్పుచుండి దశ కంఠుఁడు గాంచుచు మాల్యవంతుఁ బ
ల్కెను వచనమ్ము లివ్విధము కీడు వచింప హితంపుఁ జాటునన్
మునుకుల సెట్లు సైతును రిపున్ స్తుతియింపఁగ నిష్ఠురమ్ములన్ 2.

ఉ. మానవ మాత్రు దీనుని సమర్కట సంచయు రాము నొక్కనిం
గానల కంపఁ దండ్రి చను కాంతుని సేరు సమర్థుఁ డంచునున్
మానుగ నెంతు రెవ్వరిఁక మాన్యుని నెంతురు రాక్షసేశ్వరున్
హీనుగ విక్రమమ్ముల నహీనుని దేవభయంకరున్ ననున్ 3.

ఆ.వె. వీర వరుల పైన ద్వేషము చేతనొ
పక్షపాత మూని పరుల పైన
నయినఁ బలుకు దిట్టు లంచు శంకింతును
లేక ప్రోత్సహింప వీఁక నిన్ను 4.

తే.గీ. రిపుల ప్రోత్సాహ ముండక రేఁగి యిట్లు
పరుష వాక్యమ్ము లెవ్వరు పలుక నేర్తు
పదము నందున్న వానితోఁ బ్రభువు తోడ
శాస్త్ర తత్త్వజ్ఞుఁడౌ పురుష వరుఁ డెన్న 5.

ఆ.వె. పద్మ హీన లక్ష్మి వలె నున్న సీతను
దెచ్చి వనము నుండి యిచ్చ మీఱ
నేల నీయ నెంతు నింతిని రామున
కేను భయము వడయు వాని వోలె 6.

ఆ.వె. ప్లవగ కోటి తోడ లక్ష్మణ సుగ్రీవు
ల సహితమ్ము దీను రాముని వెసఁ
గాంచఁ గలవు నీవు కతిపయ దినముల
నా వలన నని మరణమ్ము నంద 7.

కం. సుర లైన నన్ను ద్వంద్వ స
మరమ్మునఁ దలంప లేరు మార్కొన ననఁగా
వర విక్రమునకు నీ భయ
ము రావణున కాజి నెట్లు పుట్టును జెపుమా 8.

తే.గీ. వంగ కుంట యేరి కయిన బ్రద్ద లయిన
రెండు ముక్కలుగా నిట్టు లుండుట సహ
జంపు దోషమ్ము నాది తలంప సహజ
బుద్ధి దురతిక్ర మంబగుఁ బురుషులకును 9.

తే.గీ. కడలిని యదృచ్ఛ వంతెన కట్టిన మఱి
కట్టుఁ గాక రాముం డది యెట్లు లౌను
వింత పరికింప దానికి భీతి నంద
నేల నోపఁ గలఁడు రాక్షసేశ్వరుండు 10.

తే.గీ. దాఁటి రాముం డర్ణవమును మేటి కపుల
సేన తోడఁ బ్రాణము లుండ మేనఁ దాను
మరలఁ జాలండు సత్యమ్ము మాట నొసఁగు
చుంటి వమ్ము కా దిది సూచు చుందు వీవు 11.

కం. పలుకఁగ సంరబ్ధుఁ డిటుల
నలుక నెఱఁగి మాల్యవంతుఁ డా రావణుతోఁ
బలుకం డెద్దియు నెదలో
మొలకెత్తఁగ సిగ్గు తోరముగ నాతనికిన్ 12.

కం. జయ జయ యని దీవన లిడి
రయమ్మున ననుజ్ఞ నీయ రక్షో నాథుం
డె యరిగెను మాల్యవంతుఁడు
నయజ్ఞుఁ డంతఁ దన గృహమునకుఁ జింతితుఁడై 13.

కం. రావణుఁ డంత నమాత్యుల
తో నెసఁ జర్చించి లంక దుర్జయ రీతిం
గావంగ నుచిత రీతిన్ 14.

వేవేగ ముదల లొసంగె వీర వరులకున్

సీ. రక్షింపఁ దూర్పు ద్వారమ్ముఁ బ్రహస్తుని రాక్షస వీరుని రావణుండు
నిలిపె రాక్షస వరేణ్యులు మహాపార్శ్వ మహోదరులను నిల్పె నుదరి కావ
దక్షిణ ద్వారముఁ దనయు నింద్రజితుని మాయావి నిల్పె నమేయ బలునిఁ
బశ్చిమ ద్వారము పరికింపఁ బన్నుగ రక్షః పరివృతము రమ్యముగను
తే.గీ. శుకుని సారణుని నిలిపెఁ జూడ నుత్త
రంపు ద్వారము నడరి రక్షింప నింక
స్వయము నిల్చి వీక్షింతు భృశముగ నంచుఁ
బలికె మంత్రుల తోడ రావణుఁడు ప్రీతి 15.

తే.గీ. రక్కసుని విరూపాక్షుని పెక్కసంపు
బలుని గుల్మ మధ్యమ్మునఁ బలువు రసురు
లడరఁ జెంత నునిచెను మహాపరాక్ర
ముని దశాననుం డంచితముగఁ దలంచి 16.

కం. తలఁచెఁ గృతాంత వశుం డయి
లలితమ్ముగ నిట్లొనర్చి రావణుఁ డెడఁదన్
ఫల మందిన వాఁడ ననుచుఁ
బల లాశనుఁ డప్పుడు దశవక్త్రుం డకటా 17.

కం. పురమునకుఁ బుష్కలమ్ముగ
ను రక్షణం బొనరఁ జేసి నుతు లిడ సచివుల్
పర మాశీర్వచనమ్ముల
నరిగె నిజాంతః పురమున కంత ముదమునన్ 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు ముప్పది యాఱవ సర్గము.

## యుద్ధ కాండము

# సర్గము 37.

శ్రీరాముఁడు సుగ్రీవ లక్ష్మణ విభీషణ హనుమ జ్జాంబవం తాదులతో శత్రు పురమును జేరి తమ కర్తవ్యమును జింతించు చుండ విభీషణుఁడు తన చారుల వలన రావణుని ద్వార రక్ష ణోద్యోగము నెఱిఁగి వివరింప రాముఁడు నాలుగు ద్వారములను ముట్టడింపుఁ డని నీలాంగ దాంజనే యాదులను నియోగించి వ్యూహ మేర్పరుచుట.

చం. నర హరి రాజు లాశుగ సునందనుఁడౌ కపి జాంబవంతుఁడున్
గురు బల ఋక్ష రా జసుర కోటుల మేటి విభీషణుండు సో
దరుఁడగు లక్ష్మణుండు బలదర్పిత వాలిజుఁ డంగదుండునున్
శరభుఁడు వానరుండు ఘన సత్త్వ సుషేణుఁడు జ్ఞాతి యుక్తుఁడున్ 1.

తే.గీ. హరులు మైంద ద్వివిదులు గవాక్ష గజ కు
ముద నల పనసు లరి పురముఁ గదిసి వెస
నిలువ నాలోచనమ్ములఁ దలఁచి లంక
రావణ సుపాలితమును దుర్జయ పురమును 2.

ఆ.వె. సాసు రోర గామ రాలి గంధర్వ దు
ర్జయ నగర వరమ్ము రావణుండు
నిలువ సతము దీనిని జయింప మన కెట్టు
లగును జింత సేయుఁ డనుచు నుండ 3.

ఆ.వె. వార లెల్ల రట్లు పలుకు చుండఁగ రావ
ణానుజుండు వలికె నంత శుద్ధ
వాక్కు లిట్టు లర్థ వంతమ్ము లింపుగ
నా విభీషణుండు కోవిదుండు 4.

తే.గీ. అనల శరభ సంపాతి ప్రఘసు లనంగ
నాదు మంత్రు లరిగి పట్టణమ్ము లంక
కిపుడు తిరిగి వచ్చిరి పరికించి పక్షి
రూపముల యత్నములను శత్రువుల బలము 5.

చం. నుడివెద విన్ము రాఘవ ఘనుండు దశాస్యుఁడు దుష్ట చిత్తుఁడే
యడరి యొనర్చి నట్టి విధ మంతయు నే విని నట్టి రీతి ని
ప్పుడు నిజ మెల్ల నిల్చె నటఁ బూర్వపు ద్వారము నందు నా ప్రహ
స్తుఁడు నిజ సైన్య సంయుతము శూర వరేణ్యుఁడు మానవేశ్వరా! 6.

మ. స మహాపార్శ్వ మహోదరుండు నిలిచెన్ సైన్యమ్ముతో దక్షిణం
పు మహా ద్వారము నందు నింద్రజితుఁ డాముఖ్యుండు రక్షో గణో
త్తమ ధానుష్కుల నిల్చెఁ బశ్చిమపు టా ద్వారమ్ము నందింపుగా
నమరన్ రాక్షస వీర పుంగవుల సాహాయ్యం బమేయంబుగన్ 7.

తే.గీ. పట్ట సాసి ధనుశ్శూల పాణు లింక
ముద్గ రాది నానాయుధ భూషి తేద్ధ
కరులు రావ ణాత్మజుఁ జేరి కాచు చుందు
రాతని నడరి సంతత మసుర వరులు 8.

ఉ. వేల కొలంది రాక్షసులు వెంటఁ జరింపఁగ శస్త్ర పాణులై
తూలుచు సంభ్రమమ్మునను దోర్బల రావణుఁడే స్వయమ్ముగన్
వాలుచుఁ గాచు నుత్తరపు ద్వారము గుల్మపు మధ్యమమ్మునున్
మేలుగ గాచు చుండుఁ దమి మేటి బలుండు విరూప నేత్రుఁడే 9.

కం. ఈ విధి సైన్యము లంకను
గావ నిజామాత్య వరులు గని త్వరితముగన్
భూవర! వచ్చిరి వీరు మ
హా వేగులు నేరి రసుర యత్నము లెల్లన్ 10.

ఉ. వే లిభ రాజు లింకఁ బది వేలు రథమ్ములు మేలి గుఱ్ఱముల్
వే లిరువై పలాశనులు వీరులు కోటికి మించి యుండి రీ
యాలము నందుఁ జంప రతి నాత్మల నిల్పిన వార లెల్లరుం
జాల పరాక్ర మోద్ధతులు స్వామికి నిష్టులు లంక లోపలన్ 11.

తే.గీ. రక్కసునకు నొక్కొకనికి రాజ! గలరు
యుద్ధ మొనరింపఁ నొక లక్ష యోధవరులు
చెంతఁ బరివార మంచు వచించి లంక 12.

వృత్తి తెలిపి విని నది చూపె సచివులను

కం. కని కమలాక్షుని నా రా
ముని రావణ సోదరుండు ముద మొసఁగ వచిం
చెను దిరిగి విభీషణుఁడు వ
చనమ్ము లింక నెఱిఁగింప శత్రు బలమ్మున్ 13.

చం. అఱువది లక్ష లుండ నసు రావలి రావణుఁ డా కుబేరుతోఁ
దఱచుగఁ జేయ యుద్ధమును దాఁ దరలెన్ వెస నప్పు డుద్ధతిన్
వెఱవక వీర్య తేజముల విక్రమ సత్త్వగురుత్వ దర్పుఁడై
వఱలుచు దుర్మనుండు దశ వక్త్రుఁడు తుల్యుల తోడ రాఘవా! 14.

కం. భయపెట్టఁ దలంప నెడఁద
దయార్ద్ర హృది! కుపితుఁ జేయ దగ నిన్నంటిం
బ్రియమే నీ బల మెఱుఁగుదు
వియచ్చరుల నాజి గెలువ వీర వరేణ్యా! 15.

ఆ.వె. స చతురంగ బలము శాఖా మృగ పరివృ
తమ్ము వ్యూహముగ బలమ్ము నుంచి
రావ ణాసురు సమరమ్మున శీఘ్రము
గ వధియింతు వీవు కలఁత తొలఁగ 16.

కం. విని రావ ణావరజుని వ
చనమ్ములను రాఘువుండు శత్రు వధార్థం
బు నరర్షభుండు వల్కె వ
చనమ్ము లిట్లంగి నంత సమరజ్ఞుండే 17.

సీ. అడరి పూర్వ ద్వార మందు నీలుఁ డెదిరించుఁ బ్రహస్తు రక్కసు శూర కపు ల
నేకు లుండఁగఁ జెంత నీ వాలి పుత్రుఁ డంగదుఁడు వానర సేనఁ గలసి కవియు
దక్షిణ ద్వారపుఁ దటిలో మహాపార్శ్వుని మహోదరునిఁ గమనీయముగను
హనుమంతుఁ డీ పవ నాత్మజుం డడరి పశ్చిమపు ద్వారమ్మును జేరి కవియు
ఆ.వె. నప్రమేయ చిత్త హరి వరుండు పగులఁ
గొట్టి ద్వార మడరి బెట్టిదముగ 18.

వానర నిచయమ్ము పన్నుగఁ బరివృత
మై చెలంగు చుండ నసుర వరుల

సీ. దైత్యదానవ మహా తాపస సంఘమ్ముఁ దపియింప నాత్మ సంతసము నందు
వాని క్షుద్రుని వరదాన బలమ్మున గర్వించు వాని లోకమ్ము లాక్ర
మించు వానిఁ బ్రజల మించి బాధించు వాని దశాస్యు రావణు నేను రాక్ష
సేంద్రు స్వయము నశియింపఁ జేయఁ దలంచి యుత్తర ద్వారము నుత్తరించి
ఆ.వె. లక్ష్మణ సహితమ్ము లంకఁ బ్రవేశింతు
నెచ్చటుండు బల సహితము రావ
ణుండు నచట కడరి భండన మొనరింప
ధృతి వహించి యెడఁద దృఢముగాను 19.

ఆ.వె. వాన రేంద్రుఁడు బల వంతుఁడు ఋక్ష రా
డ్వీర్య వంతుఁ డసుర వీర వర వి
భీషణుండు ప్లవగ వీర సైన్యమునకు
మధ్య నిలువ వలయు మాన్య వరులు 20.

తే.గీ. తగదు ధరియింప భండన తలము నందు
హరులకు మనుష్య రూపము హరుల ధ్వజిని
సంజ్ఞయై దనరు మనకు సమర మందుఁ
బ్లవగ రూపమ్ము గుర్తింప స్వజనులఁ దగ 21.

తే.గీ. మాన వాకృతి నేడ్గురు మాత్ర మూని
యుందు మని మేము లక్ష్మణుఁ డుండఁ దోడు
నేను స్వీయ మంత్రుల తోడ నిలిచి నా స
ఖుఁడు విభీషణుం డసుర వరుఁడు నరులుగ 22.

కం. అని యిట్లు కార్య సిద్ధికి
ఘనుఁడు విభీషణునితో నృకాంతుం డంతం
గని రమ్యతర సువేల గి
రిని నారోహింప నెంచె దృఢమతి ప్రీతిన్ 23.

కం. ధర నెల్లఁ గప్పి యా వా 24.

నర సైన్యముతో రఘుపతి నాశము సేయం
గ రిపుల నెంచి దృఢమ్ముగ
మురిసి మహాత్ముఁడు కదిసెను బురమును లంకన్

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు ముప్పది యేడవ సర్గము.

# యుద్ధ కాండము

# సర్గము 38.

రాముఁడు సుగ్రీవ విభీషణులతో సువేల పర్వతమున నా రాత్రి విడియ వలె నని కోరఁగా నెల్లరు పర్వతము నెక్కి లంకా నగర వైభవమును తిలకించుట.

చం. వెనుకను నిల్వ లక్ష్మణుఁడు ప్రీతి వహించి సువేల మెక్కఁగం
గని కపి రాజు నయ్యసుర కాంతు విభీషణు ధర్మ మంత్ర వే
త్తను సఖునిన్ విధిజ్ఞుఁ దగ ధర్మరతుండు వచించె రాముఁ డీ
మినుకుల నంత మెల్లగను మేలుగ నెంచి మృదూక్తు లింపుగన్ 1.

ఆ.వె. ఎక్కుదము గిరీంద్ర మెల్లర మిప్పుడు
ధాతుశత విరాజితమ్ము నిల్వ
నొప్పు రాత్రి యందు నుత్తమంపు సువేల
పర్వతమ్ము నందు సర్వులకును 2.

ఉ. కాంతుము రావ ణాలయము కాలుని సెవ్వఁడు సేర నెంచి నా
కాంతను దొంగిలించెఁ దమకమ్మున నట్టి దురాత్ము నింటినిన్
సుంతయు ధర్మ మెంచఁడొ వసుంధరఁ దల్పఁడొ వంశ వృత్తముల్
వింతఁగ నీచ కార్యము నభీతి నెవం డొనరించె నిర్విధిన్ 3.

తే.గీ. ఎవని పేరు విన్నంతట వృద్ధి సెందు 4.

నాదు కోప మా రాక్షస నాథు నథము
మరణము నవశ్య మింక నే నరయు వాఁడ
రక్కసుల నెల్లరను గూడి రణము నందు

ఆ.వె. ఒక్కఁ డఘు మొనర్ప మిక్కిలి కాల వ
శమున నాతని యపచారమున ని
జ కుల మెల్లఁ గూలు సత్వరమ్ముగ నీచ
బుద్ధి వలన నరయఁ బుడమి లోన 5.

కం. పను వొసఁగి యివ్విధమ్మునఁ
గినుక వొడమ రావణు పయి గిరి నధిరోహిం
చెను జిత్ర సాను సంయుత
మును రాముఁడు వాస మెంచి పురుషోత్తముఁడే 6.

తే.గీ. వెనుక నెక్కె లక్ష్మణుఁడు వింటిని శరముల
సిద్ధపఱచి విక్రమ మూని శీఘ్రముగను
వాని ననుసరించె ససచివ గణము సవి
భీషణుఁ డయి సుగ్రీవుఁడు వేగముగను 7.

కం. హనుమంతుఁ డంగదుఁడు నిం
క నీల మైందద్వివిదులు గజుఁడు గవాక్షుం
డును గవయుండును శరభుం
డును రంభ బనసులు కుముదుఁడును హరుఁ డింకన్ 8.

తే.గీ. గంధమాదనుఁడు ప్లవగ కాంతు లెల్ల
జాంబవంతుఁడును సుషేణ శతబలి ఋష
భ ఘన మతులు దుర్ముఖుఁ డన్య వానరు లతి
శీఘ్ర గాములు జవ మందు శ్రేష్ఠు లంత 9.

ఆ.వె. గిరి సువేల మడరి గిరిచారు లెక్కి ర
సంఖ్యు లపుడు నృవర సత్తముండు
రాముఁ డున్న గిరిని రమ్య సాను విలసి
తమును  మనము లందుఁ బ్రమద మెసఁగ 10.

కం. గిరి వర మదీర్ఘ కాలము
న రయమ్మున నెక్కి యా కొనలను నిలిచి కాం
చిరి యెల్ల దిశలఁ బుర మం
బర మంటు విధమ్ము దనర వానరు లెల్లన్ 11.

కం. పురమును శుభము వరద్వా
ర రాజితము లంక నపుడు ప్రాకార ఘ నా
వరణమ్మును వీక్షించిరి
హరి గణ నాథులు కడింది యసురా వృతమున్ 12.

కం. ప్రాకారమ్ముల నపర
ప్రాకార మనంగ నసుర వరులు నిలువ నీ
లాకారులఁ గనెఁ బ్లవగా
నీకం బాశ్చర్య మడర నెమ్మనములలో 13.

కం. కని యుద్ధ కాంక్షిణుల నట
ఘన రాక్షస వీర వరులఁ గపి వర్యులు ఘో
ర నినాదములను వింతగ
నొనరించిరి రాముఁ డరయు చుండఁగ నంతన్ 14.

ఆ.వె. అంత దినకరుండు నస్తంగతుఁడు కాగ
నెఱ్ఱ నగుచు సంధ్య యింక నణఁగఁ
బూర్ణ చంద్ర కాంతి మూర భృశమ్ముగ
రేయి యరుగుదెంచెఁ బ్రీతి నొసఁగ 15.

తే.గీ. కూడి హరి వాహినీపతిఁ గూర్మి రాఘు
వుఁడు సలక్ష్మణుఁడు విభీషణుఁడు నుతింప
యూధ పాధిపతులు చుట్టి యుండ నా సు
వేల గిరి నిల్చె సుఖముగ వీర వరుఁడు 16.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు ముప్పది యెనిమిదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 39.

రాత్రి నంతయు సువేల పర్వతమునఁ గడపి రామాదులు వానర సైన్యము లంకా పురమున నున్న సుందర వ నోపవనములను దర్శింపఁ గోందఱు త్రికూట గిరిపై నున్న లంక కేఁగి యచటి సౌధములను వేయి స్తంభములతో నలరారు రావణుని భవనమును వీక్షించుట.

కం. కడపి సువేల గిరీంద్రము
కడ నిసి యెల్లను సుఖముగఁ గపి పుంగవు లా
యడవులు రమ్యోపవనము
లడరి కనిరి వీర వర్యు లందఱు లంకన్ 1.

ఆ.వె. సమతలమ్ములు కడు సౌమ్యము లాయత
ములు విశాలములు నపూర్వములును
జూడఁ గన్నుల కతి సుందరములు గాంచ
విస్మయము కలిగెఁ గపి తతి కెల్ల 2.

సీ. చంప కాశోక ససాల తాల సమాకులమ్ము తమాల విలసిత నాగ
మాలా సమేత హింతాల నీ పార్జున సప్తపర్ణ కుసుమ సంచయ యుత
కర్ణికార తిలక కమనీయ పాటల పుష్పితాగ్రద్రుమములు లతా వి
తాన సంవృతములు దనరు లంకా పురి యమరావతీ నిభమై యనేక
తే.గీ. వివిధ దివ్యములను గూడి వెలుఁగు చుండఁ
జిత్ర సుమ పంక్తు లరుణ రుచి మృదు పల్ల
వమ్ములును శాద్వలమ్ములు వఱలు నీల
చిత్ర వనరాజి గాంచిరి సెలఁగి హరులు 3.

తే.గీ. రమ్య తర మగు ఫల పుష్ప రాశి యుండ 4.

గంధ యుక్తమ్ములు తరు నికాయ మందు
మ్రాను లప్పుడు గన్పట్టె మేన భూష
ణమ్ములను ధరియించిన నరుల పగిది

కం. సుమనోజ్ఞము చైత్రరథ ని
భ మచట సర్వర్తుకమ్ము వన వరము సమా
నము శక్రు నందన వనికి
భ్రమర గణాయుతము కాంతుల వెలుఁగు చుండెన్ 5.

కం. బక చాతకమ్ము లహిమా
రకములు నాట్యముల నడరి రమ్యతరముగా
పిక రాజమ్ములు రంజి
ల్లి కూయ విన నయ్యె వన ఝరీ పారములన్ 6.

చం. కపివరు లా వనోపవన కాయముఁ జేరిరి కామ రూపులే
యపరిమితమ్ము మత్తిలిన యండజ పంక్తులు తేనె తిండ్లు కూ
యు పులుగు లన్యముల్ పికము లున్న ద్రుమమ్ములు సారసాలి స
ల్లపితము లుండఁ గన్పడఁ గరమ్ము ముదమ్ము సెలంగ నాత్మలన్ 7.

కం. కదియ మహౌజస్వులు హరు
లుదరి వనములు సుమ గంధయుక్తానిల మం
తఁ దనరి వీఁచెను ముక్కుల
కొదవఁగ నత్యధిక సౌఖ్య ముచితంపు గతిన్ 8.

కం. హరి వీరు లందుఁ గొందఱు
హరి యూథపులు వదలి ప్లవ గానీకమ్మున్
హరిపతి యనుమతి లంకా
పురికిఁ బతాక యుతమునకుఁ బోయిరి కాంచన్ 9.

తే.గీ. విహగ రాజమ్ములను భయపెట్టు చుండి
మించి మృగ గజ రాశి బాధించు చుండి
కంప మొసఁగుచు లంకకుఁ గపి వరేణ్యు
లరిగి రటకు గర్జించుచు నత్యధికము 10.

ఆ.వె. వేగ నేలఁ గాళ్లఁ బీడించు చుండఁగఁ
బ్లవగ వీర వరులు లంక యందు
లేచి నట్టి దుమ్ము రేఁగి చరణముల
నెగసెఁ బైకి మిగుల నెల్ల దిశల 11.

ఆ.వె. భయము వడసి యెదలఁ బాఱిన వా శబ్ద
ములకు నలు దెసలకుఁ గలఁగి యెలుఁగు
బంట్లు సింహములును బందులు దున్నలు
మృగము లేనుఁగులును మేఁత లుడిగి 12.

తే.గీ. ఉన్నత త్రికూట శిఖర మున్నది స్పృశి
యించు దివి ననంగ నొకటి నంచితముగఁ
బూల నిండి యెల్లెడ లందు మేలిమి పసిఁ
డి పగిది చెలఁగు చుండి మండితముగ నిల 13.

తే.గీ. విమలము శత యోజనముల విరివి కలిగి
సుందరం బద్భుత మది బక్షులకు దాఁట
రానిది మది నయిన నెక్క రానిది జను
ల కనఁ గర్మమ్ము లేల దలంప వలయు 14.

తే.గీ. తచ్ఛిఖరమున విలసిల్లెఁ దద్ద పుర వ
రమ్ము లంక రావణ పాలితమ్ము పొడవు
న నిరువది యోజనమ్ములు దనర వెడలు
పున నొక దశ యోజనములు దనరు చుండి 15.

ఉ. ఆ రమణీయ పట్టణము నందు వెలుంగుఁ బసిండి వెండి ప్రా
కారము లింక గోపుర నికాయము పాండుర మేఘ తుల్యముల్
మూరుచు నున్నతమ్ములు నపూర్వము లెల్ల విమాన సౌధముల్
నీరద సన్నిభమ్ము లవి నీరజ నాభుని మధ్య వీథినిన్ 16.

సీ. స్తంభ సహస్ర యుక్తము నయి కైలాస శిఖర సన్నిభముగఁ జేరి నభము
స్పృశియించు రీతి నతిశయించి సుందర ప్రాసాదములచే నలంకృత మయి

రాక్షసేంద్రుని చైత్య రాజము పురమున కాభరణమ్ము నా నడరు చుండ
నిత్యమ్ము రక్షింప నత్యధిక బలులు  వంద మంది యసుర వరులు నిలిచి

తే.గీ. రమ్య కానన పర్వత రాజితమ్ము
తనర నానా విధ విచిత్ర ధాతు వాటి
కలును నానా విధ విహగ గణము లుండ
నడర నానా విధ మృగ సేవ్యంబు నగుచు 17.

తే.గీ. వఱల నానా కుసుమ సుసంపన్న ము నయి
నగర వరము నానా రాక్షస గణ సేవి
తము సమృద్ధమును సిరులం దనరు రాముఁ
డరసె హరుల తోడుత లక్ష్మ ణాగ్రజుండు 18.

కం. కని యా నగరమ్మును దే
వ నగర సన్నిభమును నర వరుఁ డక్కజ మం
దె నలఘు గృహ సంబాధ
మ్మును లక్ష్మణ పూర్వజుండు పురుషోత్తముఁడే 19.

తే.గీ. నూత్న ఘన సంవిధానము రత్న మయము
భవన మాలా విరాజిత పట్టణమ్ము
యంత్ర గణ కవాట చయ ముఖ్య సమలంకృ
తమ్ముఁ గాంచె రాముఁడు కపి ధ్వజిని తోడ 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు ముప్పది తొమ్మిదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 40.

రాముఁడు సుగ్రీవ వానర సమూహములతో సువేల పర్వ తాగ్రము నెక్కి లంకను జూచు చుండ నొక

ద్వార మందు నిల్చిన రావణుని సుగ్రీవుఁడు సూచి తటాలున దుమికి రావణుని పైకి లంఘించి వాని కిరీటమును నేలఁ ద్రోసి ద్వంద్వ యుద్ధ మొనరించి రావణుఁ డలయఁ దిరిగి వానర సేనను జేరుట.

కం. అమ డామడలఁ దనరు వృ
త్తమును సువే లాగ్ర మెక్కె దశరథ సూనుం
డు మలమనికి నేతల తో
డ మఱియు సుగ్రీవుతో దృఢ మనస్కుండై 1.

ఉ. నిలిచి యొకింత ప్రొద్దు కని నెమ్మిని దిక్కుల నెల్ల నత్రికూ
ట లలిత శృంగమం దతి దృఢమ్ముగఁ గట్టఁగ విశ్వకర్మయే
వెలసిన లంక నింపుగను విస్తృత కానన భాసితమ్ముఁ దా
నలరుచు గాంచె రాముఁడు మహా పుర మచ్చెఱు వంది నెమ్మదిన్ 2.

మ. ఘన మా గోపుర మందు నిల్వఁగను రక్షఃకాంతుఁ నా రావణున్
జన దుర్వారుని శ్వేత చామరము లాశ్వాసింపఁ బార్శ్వమ్ములం
గనకచ్ఛత్ర శిరో విరాజితుని రక్తశ్రేష్ఠ గం ధాంగరా
గుని రక్తాభర ణాంగు నీల తనునిన్ ఘోరాభ్ర సంకాశునిన్ 3.

తే.గీ. కాంచ నాంబరు శశ రక్త కాంతి రక్త
వస్త్రు నైరావత విషాణ శస్త్ర కృత కి
ణోరు సంధ్యాత పావృత నీర దాభు
రాక్ష సేంద్రుని లోక విరావణు నట 4.

తే.గీ. చూచు చుండఁగ వానర శూరు లింక
రాఘవుండు సుగ్రీవుఁడు రాక్షసాధ
ముఁ గని యొక్కుమ్మడి కదలి మూరి యెగిరెఁ
గ్రోధ మూర్ఛితుండై వాన రాధినేత 5.

చం. బల జవ సంయుతుండు నయి పర్వత శృంగము నుండి రోష సం
కలిత రయమ్ముతోఁ గపి నికాయ విభుం డపు డుర్కె గోపుర
స్థలమున కంత భీతిలక తా నిలుచుండి ముహూర్త కాలమే
చులుకన సేసి రావణునిఁ జూచి వచించెను నిష్ఠురమ్ముగన్ 6.

తే.గీ. రామ సఖుఁడ సుగ్రీవుఁడ రాఘవేంద్రు
లోక నాథు దాసుండను లోక కంట
క! యిఁక నా నుండి నీవు రాఘవుని తేజ
మడరఁ దప్పించుకొన లేవు పుడమి లోన 7.

ఆ.వె. పలికి యివ్విధమ్ము వానరేశ్వరుఁ డంత
రాక్షసేంద్రు పైకి లంఘణం బొ
నర్చి సంభ్రమించి యార్చి రావణు మకు
టమ్ము లాగి వడిఁ బుడమిని వైచె 8.

ఆ.వె. కాంచి వచ్చుచున్న కపి నాథు నసురేంద్రుఁ
డుదరి పలికె నిట్టు లుగ్రుఁ డగుచు
గ్రీవ హీనుఁడ వగు దీవు సుగ్రీవుఁడ
వు మును నన్నరసిన సమయ మందు 9.

కం. అని లేచి వేగ పడ పై
చెను బాహు యుగమ్మున దశ శీర్షుండు హరిన్
వెనుకనె సుగ్రీవుఁడు లే
చెను గందుక సన్నిభమ్ము చేతుల పైనన్ 10.

ఉ. స్వేదమునం బరస్పరము సిక్కిన గాత్రులు శోణి తార్ద్ర గా
త్రాదులతోఁ బరస్పరము నంతఁ జెలంగఁ బరస్పరమ్ము చే
ష్టాదు లణంగ నంగకము లల్లుకొనంగఁ బరస్పరమ్ము వా
రా దరి పర్ణ శల్మలుల యాకృతి ద్వంద్వ రణప్రమోదులై 11.

తే.గీ. ముష్టి ఘాతాలి తలఘాతములను నిజ క
రాగ్ర తాడ నారత్ని ఘాతాలి తోడ
నిరువురు నసహ్య ఘోర సమర మొనర్చి
రా బలాన్విత హరి రాక్ష సాధిపతులు 12.

కం. ఒనరించి మల్లయుద్ధము
ఘన వేగులు నిలిచిరి చిర కాలము సత్వ
మ్మున గోపుర వేది నడుమ 13.

వినమ్ర దేహులు కదల్చి వింతగఁ బదముల్

కం. పీడించి యొకరి నొక్కరు
తాడనములఁ బెనఁగి నట్టి తనులం గూలన్
గోడకు నగడ్తకు నడుమఁ
బాడిగఁ దగ నిశ్వసించి వా రుత్థితులై 14.

ఆ.వె. ఒక ముహూర్త ముండి యుర్వీతలమ్ము నుం
డి వడి లేచి పట్టును విడువక పె
నఁగుచు బాహుయుగమున నిపుణులు బలసం
యుతులు  సంచరించు చుండి రాజి 15.

తే.గీ. పమ్ము శార్దూల సింహ నిభమ్ము దర్ప
మింక సేనఁగు గున్నల యీడుజోడు
నడరఁ బెనపేసు కొంచును బుడమిఁ గూలి
రంతఁ బోరి పోరి భృశమ్ము హస్తములను 16.

ఆ.వె. యుద్యమించి యిరువు రుద్ధతి వ్యాయామ
శిక్షితు లతి బలులు సెంద రలస
ట నొకయింత యేని తనులఁ ద్రోచి కొనుచు
బహు రణ గతు లందు వఱలి రపుడు 17.

తే.గీ. కరి కర నిభ కరమ్ములఁ గరి సదృశులు
వాన రాసురేంద్రులు ధృతిఁ బూని మండ
ల గతులఁ దిరిగి వారించుచుఁ గదనమ్ము
నిర్వ రొనరించిరి చిరము గర్వ మడర 18.

కం. చేరి యొకరి నొక్కరు తమిఁ
బోరిరి మాంసమ్ము కొఱకుఁ బోరెడు నా మా
ర్జారముల భంగిఁ జెలఁగుచుఁ
దోరమ్ముగ మరల మరలఁ దొలఁగింపఁ బరున్ 19.

సీ. చిత్ర మండల గతు లాత్రతఁ దిరుగుచు వివిధ స్థలమ్ముల వెలయు చుండి

గోమూత్ర గతిఁ దిరుగుచుఁ గదిసి మరలు చుండి ప్రక్కల కేఁగు చుండి చనుచు
వంకరగను దాఁట బాధింపఁ దొడఁగుచు నుఱుకుచుఁ దొలఁగుచుఁ దఱచు తఱచు
వెను దొలఁగి యెదిర్చి పేగ దుముకుచును గెంతుచు విడుచుచు నంతఁ బట్టి
తే.గీ. నిలిచి దృఢముగ రణ మార్గ నిపుణు లిరువు
రట్లు వానరపతి రావణాసురు లట
నొండొరులను జయింప నుద్దండ గతిని
సంచరించిరి చల మూని సత్త్వ మూని 20.

తే.గీ. ఇంత లోన మాయా బల మంతరంగ
మందు నెంచె రక్షఃపతి యందుకొనఁగ
నేరి వానరేంద్రుం డాత్మ మూరి నింగి
కెగిరె నట నిల్చె నసుర వంచింప హరియె 21.

చం. శ్రమ నిడి ప్రాప్త సంగర యశస్వి హరీంద్రుఁడు భండనమ్ములో
నమర విరోధి కట్లు విత తాభ్ర పథమ్మున నర్కసూనుఁడే
సముచిత రీతిగా నెగిరి సత్వర మా హరి సైన్య సన్నిధిం
దమకము మీఱఁ జేరి ఘన దార్ఢ్యుఁడు నిల్చెను రాము చెంతనే 22.

తే.గీ. సవితృ సూనుండు తత్కర్మము వెలయించి
వాయు గతి సన్నిభుఁడు రఘువర నృప సుతు
రణ ముదమ్ము వెంచి ప్లవగ గణ వరాధి
పుల నుతుల నంది సంతసమునఁ జెలంగె 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నలువదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 41.

రాముఁడు సుగ్రీవుని మేనఁ గల గుర్తులను గాంచి కౌఁగిలించికొని రాజుల కిట్టి సాహస కృత్యములు దగ
వని యిక ముందు చేయ వలదని లక్ష్మణునకుఁ దాను గాంచిన దుర్నిత్తములను దెలిపి వానర
యూధపులకు లంక నాలుగు ద్వారములను ముట్టడింప నానతి నొసంగి తాను సౌమిత్రితోఁ గూడి
యుత్తర ద్వారము వద్ద నిలిచి యంగదుని రావణునితోఁ దన వాక్యములుగాఁ బలుక దూతగాఁ బంప
నతఁ డేఁగి రావణునకుఁ దెలుప రావణుఁడు తనను బంధింప నాజ్ఞ నిడ మూఁగిన రక్కసులను ద్రోచి
పై కెగిరి సౌధాగ్రమును వ్రక్కలు సేసి రాముని కడ కేతెంచుట.

కం. కని యా గుర్తులఁ గౌఁగిలి
ఘను సుగ్రీవుని హరిపతిఁ గాకుత్స్థుం డి
ట్లనె లక్ష్మ ణాగ్రజుండు వ
చనమ్ము లుచితమ్ములు నర శార్దూలుండే 1.

చం. అసమ బలాఢ్య! నన్నడుగ కక్కట నీ వొన రించి తిట్టి సా
హసము నరేంద్రు లెన్నడును హర్యధిపా! తెగువం జరింప రెం
దు స బల మిట్లు నన్నునిచి తోరపు సంశయ మందుఁ జేసి తి
య్యసురు విభీషణుం బనిని నౌర యశక్యము సాహసప్రియా! 2.

ఉ. ఈ విధ మింకఁ జేయకు హరీశ్వర! శత్రు నికాయ మర్దనా!
నీ వొక వేళ వొందినను నేరఁగ రాని విపత్తు కార్య మే
మో వన చార! నా కవని నోదరు లందఱి తోడ సీతతో
నావల బొంది తోడుత మహాత్మ! తలంప నిజమ్ము నాత్మలో 3.

చం. మరలక యున్న నీవు హరి మాన్య! తలంచితి మున్న నేరినన్
వరుణ సురేంద్ర సన్నిభము బల్మిని నీ వని నేను రావ ణా
సురు వధియించి యుద్ధమున శూరు సపుత్ర స రథ్య సైన్య భా
సురుని విభీషణున్ నిలిపి సుందర లంకను రాజ పీఠినిన్ 4.

కం. భరతున కొసంగి రాజ్యము
గురుతర మింపుగ నయోధ్య గుణవంతునకున్
హరిపుంగవ దేహమ్మును
ద్వరితమ్ముగ నేఁ ద్యజింపఁ దథ్యముగ నెదన్ 5.

కం. అన విని సుగ్రీవుఁడు రా 6.

మునిఁ గాంచి వచించె నిట్లు భూసుత నీ భా
ర్య నపహరించిన రావణుఁ
గనిన సహింతునె యెఱింగి ఘన నిజ బలమున్

ఆ.వె. శుభగిరలు వలుకఁగ సుగ్రీవుఁడు రుచిర
గ్రీవుఁ డిట్లు మురిసి నృపవరుండు
తద్ద ప్రీతి వానిఁ దా నభినందించి
లక్ష్మివర్ధను గని లక్ష్మణు నసె 7.

ఉ. శీతల వారి నింకఁ గడు శ్రేష్ఠ ఫలమ్ముల నారగింప ని
య్యాతత సేన వ్యూహముగ నంచిత రీతిని నిల్పు మయ్య నే
నీ తఱిఁ గంటి లోక లయ మేర్పడ నున్న విధమ్మునున్ మహా
భీతి కరమ్ము ఋక్ష కపి వీర మహాసుర వీర నాశమున్ 8.

ఉ. గాలులు వీచె గట్టిగను గంపము నందె ధరాతలమ్ము శై
లాలులు కూలు చున్నయవి యద్రి కొనల్ కదలాడు చుండె మే
ఘాలులు ఘోర శబ్దముల నార్చుచు నున్నవి క్రూర జంతు త
జ్జాలము భంగి రక్త కణ జాలము తోడుతఁ దోఁచె వర్షముల్ 9.

ఆ.వె. ఎఱ్ఱ చందనంపు టెఱుపున సంధ్యా స
మయము విఱ్ఱవీఁగె భయము గొలుప
మండు చుండి యగ్ని మండల మాదిత్య
మండలమ్ము నుండి దండ రాలె 10.

కం. దీనస్వరమ్ముల నకట
దీన మృగద్విజము లర్కదేవుని గనుచున్
మానసములు భీతిల్లఁగ
కాననములఁ గూయుచుండెఁ గడు క్రూరముగన్ 11.

కం. నల్లని యెఱ్ఱని కిరణము
లల్లుకొనఁ గొనల జగముల యంతము వోలెం
దల్లడిలఁ జేయు చుండెను
బెల్లుగ రుచి హీనుఁడు శశి వేఁగుచు నిసినిన్ 12.

కం.	కుఱు మచ్చ నలుపు నెఱుపులఁ
గఱకుగఁ బరివేష మొకటి కన్పడు చుండెన్
వెఱపు నొసఁగంగ లక్ష్మణ!
తఱచుగ రవి మండలమునఁ దలఁగిన ప్రభలన్	13.

కం.	కనరావు తార లెల్లను
మునుపటి వలె లక్ష్మణ! జగముల నాశనమున్
మన కెఱిఁగింప నవి దలం
చినవో యను రీతి నిపుడు చిత్రము కనుమా	14.

కం.	కాకులు డేగలు గ్రద్దలు
నాకము నుండి పడుచుండె నక్క లశుభముల్
కూఁకలు ఘోర రవమ్ములు
ప్రాకటముగ వేయుచుండె లక్ష్మణ! కనుమా	15.

చం.	త్వరితము నిండు భూమి యిట వానర రాక్షస వీరు లెల్లరున్
దురమున శైల శూలములు దోర్బల యుక్తము వేయ ఖడ్గముల్
విరివిగ మాంస రక్తముల వెల్లువలం బెను కర్దమమ్ములై
పరగఁగ భీకరమ్ముగను బన్నుగ నెన్నఁగ నీ నిమిత్తముల్	16.

ఉ.	వేగమ లంక దుర్జయము వీటిని రావణ పాలితమ్మునుం
జాగుచు ముట్టడింప వలె సత్త్వ జవమ్ముల నెల్లదిక్కులన్
బాగుగ వీరు లీ ప్లవగ వర్యులు సంవృతులై చెలంగి తా
నీ గతిఁ బల్కి రాముఁడు మహీధర శృంగము నుండి వే దిగెన్	17.

చం.	దిగి కనె స్వీయ సైన్యమును ద్వేష దురాసదమున్ ఘనమ్మునుం
బగతుర నెల్ల మార్కొనఁగ భండన భూమిని నక్కపీంద్రు నిం
పుగ నటఁ గూడి సైన్యమును బోరున కత్తఱిఁ బ్రోత్సహించెఁ దో
పఁగ సమయజ్ఞుఁ డప్పుడు శుభప్రద కాల మెడందఁ జిక్కఁగన్	18.

తే.గీ.	పరివృతుం డయి యమ్మహా బాహుఁ డంత
వానర మహాబలము తోడ బయలు దేరె	19.

లంక కభిముఖముగ ధన్వి రాఘవుండు
నిలిచి ముందు సేనకు నెల్ల నృపసుతుండు

ఉ. భూవరు నా విభీషణుఁడు మోద సమన్వితుఁ డుత్సహించి సు
గ్రీవుఁడు మారుతాత్మజుఁడు రేఁగి భృశమ్ముగ జాంబవంతుఁడుం
జేవ నలుండు లక్ష్మణుఁడు శీఘ్రమ రాముని వెంబడింపఁగా
నీ వసుధాతలమ్ముఁ బసరించుచు నేఁగిరి ఋక్ష వానరుల్ 20.

చం. కొని వెస పర్వతాగ్రములు ఘోర నగమ్ములు కేల వందలన్
ఘనగజ సన్నిభుల్ పరనికాయ నిరోధులు కోఁతు లేఁగఁగాఁ
జని చని జేరి రాపురము శత్రుచయఘ్నులు రామలక్ష్మణుల్
ఘను లచిరమ్ము లంకను సుఖమ్ముగ రావణ పాలితమ్మునున్ 21.

సీ. లలిత పతాక మాల లడరు రమ్యత రోద్యాన వన శోభి తోన్నత పురిఁ
జిత్ర వప్ర చయ భాసితము దుష్ప్రాపము నున్నత బ్రాకార సన్నిలయము
ధర నమర గణ దుర్ధర్షము లంకాపురమ్మును బ్లవగులు రామ వాక్య
చోదితులై కాన నాది నివాసులు రామాజ్ఞ విడిసిరి రణ మొనర్ప
తే.గీ. శైలశృంగ నిభోన్న తాభీల పట్ట
ణోత్తర ద్వారము కదిసి సోదర సహి
తమ్ము రాఘవుం డుత్తమ ధన్వి నిలిచెఁ
దా నిరోధింప రక్షింప ద్వార వరము 22.

ఉ. రామున కన్యుఁ డెవ్వఁ డట రావణ పాలిత మట్టి ద్వారమున్
భీమ పురమ్మునుం గదిసి వీరుఁడు రావణుఁ డుండఁ గాచుచున్
నీమము తోడఁ గావఁగను నిర్జర వైరులు ఘోర రాక్షసుల్
పామర భీతి దాయకము పన్నుగఁ బోర సమర్థుఁడౌ నిలన్ 23.

తే.గీ. కడలిని వరుణుఁ డింపుగఁ గాచు రీతి
దానవులు కాచు నట్లు పాతాల తలము
నసురు లీ లంక రక్షింప నాయుధముల
రావణుండు లంక కొసంగు రక్షణమ్ము 24.

కం. కాంచెను రాముం డాయుధ 25.

సంచయములను గవచములఁ జక్కఁగఁ బగవా
రుంచఁగ ననేక విధముల
మించఁగ  లెక్క కవి యెల్ల మెఱయుచు నచటన్

చం.	నిలిచెను దూర్పు ద్వారమున నీలుఁడు వానర సైన్య నాథుఁడే
లలి నట మైంద తద్ద్వివిదులం దగఁ గూడి పరాక్రముండు వీ
రులు ఋషభుండు నంచిత బలుల్ గవయుండు గవాక్షుఁడున్ గజుం
డల నిలువంగ నంగదుఁడె యానెను ద్వారము దక్షిణమ్మునన్	26.

తే.గీ.	నిలిచె హనుమంతుఁడు వినుత బలుఁడు పశ్చి
మంపు ద్వారమ్ము నందు రక్షింప భృశము
ప్రఘసునిఁ బ్రమాథిని నితర ప్లవగ వీర
వరులఁ గూడి యుత్సాహ మడర నెడంద	27.

ఆ.వె.	గుల్మమునకు నడుమఁ గూర్చుండె సుగ్రీవుఁ
డడరి సర్వ వానరాలి శ్రేష్ఠు
లుండఁ జుట్టి మారు తోపమ గరు డోప
మ జవ యుతులు  ప్లవగ మాన్య విభుఁడు	28.

ఆ.వె.	ఉగ్ర వానరు లట సుగ్రీవుఁ డున్నట్టి
చోట ముప్పదాఱు కోటుల పర
మప్రసిద్ధ వీరు లప్రమత్తు లయి పీ
డించుచు నిలిచిరి సమంచితముగ	29.

తే.గీ.	లక్ష్మణుఁడు విభీషణుఁ గూడి రాము నాజ్ఞ
హరుల ద్వారము ద్వారము నందు నిలిపెఁ
గోటి కోటిని నొక్కొక్క చోట మేటి
వీరులను దత్క్షణంబ యపార బలుల	30.

తే.గీ.	రాముని కెడమ ప్రక్కన భీమ సేన
నడుమ సుగ్రీవు తోడుత నడరి జాంబ
వంతుఁ డనతి దూరమ్మున బహు బలమ్ము
వెంట నుండఁగ నిల్చెను వీర వరుఁడు	31.

ఆ.వె. వ్యాఘ్రముల విధమ్ము వానర శార్దూలు
లడర దంష్ట్ర లెల్ల హస్తముల ధ
రించి తరుల శైల శృంగముల మురిసి
నిలిచిరి సమరమ్ముఁ దలఁచి యెదల 32.

ఉ. అందఱు వక్ర వాల ధరు లందఱు దంష్ట్ర నఖాయు ధోగ్రులే
యందఱు చిత్ర ఘోర వికటాంగులె యందఱు వింతవక్త్రులే
కొందఱు వీర్య మందు దశ కుంజర తుల్యులు దల్ప వందకుం
గొందఱు వేయి నాగములకున్ సరి కొందఱు విక్రమమ్మునన్ 33.

ఆ.వె. కొంద ఱుండి రందుఁ గుంజరౌఘు బల స
న్నిభులు కొంద ఱెంచ నిభు లిఁక శత
గుణమునకు నితరులు కొందఱు బలమున
నప్రమేయు లగుదు రా ప్లవగులు 34.

ఆ.వె. అద్భుతమ్ము నింక నక్కజం బయ్యెను
వాన రౌఘు మచట వ్రాలఁ గూడి
యెగిరి వచ్చు మిడుతల గమిని మించి నిం
డంగ నెల్ల దిశ లభంగముగను 35.

కం. నిండెను గగనం బెల్లను
నిండెను వసుధా తలంబు నిల్చిన కపులన్
దండకు వచ్చెడు దర్పో
ద్ధండత వానర మహా వితానము చేతన్ 36.

కం. శత లక్షలె యొక్కొక్కరు
రతి ఋక్ష వనౌకసులు పురద్వారము లం
దితరు లనిఁ జేయఁ బెక్కురు
మతిమంతులు నిల్చిరపు డమంద బలాఢ్యుల్ 37.

చం. గిరి వర మెల్ల చుట్టి పరికించి సమంతతఁ గోట్ల సంఖ్యలన్
బురమును ముట్టడింపఁగ సమోదము బల్లిదు లైన యట్టి యా 38.

హరివరు లెల్ల  వృక్షముల హస్తములం దిడి  గాలి కైనను౦
జొరఁబడ రాని పట్టణము నొచ్చిరి శీఘ్రమ యుత్సహించుచున్

చం. సలలిత మేఘ సన్నిభులు శక్ర సమాన పరాక్రముల్ హరుల్
కలఁత నొసంగ రాక్షసులు కాంచఁగ విస్మయ మంది రెల్లరుం
జెలఁగెను ఘోర శబ్దములు సేయఁ బ్లవంగులు వార్ధి భిన్న తో
య లసిత నాద సన్నిభము లంతట రావణు లంక లోపలన్ 39.

ఆ.వె. లంక యెల్ల వణఁకె రావమ్ములు సెలంగ
వరణ తోరణ చయ వన నికాయ
కానన గిరి యుతము కపి ఋక్ష సంచయ
ముత్సహించి చెలఁగు చుండ నపుడు 40.

తే.గీ. రామలక్ష్మణ సుగ్రీవ రక్షితమ్ము
వాన రానీక మత్తఅి భండనమ్ముఁ
జేర నమ రాసురులకు దర్శింప రాని
దయ్యె దుర్ధర్ష మయ్యెను దథ్యముగను 41.

చం. నిలిపి స్వ సైన్య మవ్విధము నెమ్మి నమాత్యుల సంప్రదించి వే
విలయము సేయ రాక్షసుల  ద్వేషులఁ దాఁ గ్రమయోగ కార్య వే
త్త లలి విభీష ణానుమతి ధర్మము క్షాత్రము నెంచి యంగదుం
బిలిచి వచించె వాలి సుతుఁ బేర్మిని రాముఁడు బల్కు లివ్విధిన్ 42.

తే.గీ. వేగ తనరింపఁ దదుపరి స్వీయ కార్య
మంగద! యుఱికి లంకకు నరసి రావ
ణుని గతైశ్వర్యు మందభాగ్యుని నలయక
పలుకు నావచనమ్ములు భయము వీడి 43.

తే.గీ. రోయ నమర గంధర్వాప్సరో జనులకు
నాగ యక్ష సంయమి ధరా నాథుల కొన
రించితి వఘము మోహము మించ మూర్ఖ
త నిఁక నణఁగు గర్వ మిపుడు తాత వరము 44.

తే.గీ.	దండమూని నిల్చితి లంక ద్వార మందు
భార్య నపహరింపంగ నే బాధితుండ
బ్రహ్మ వర బల దర్పమ్ము రాక్షసాధ
మ! నశియించుఁ బూర్ణమ్ము దశానన వెస 45.

కం.	సురలు మునులు రాజర్షులు
నరుగు పదవి కీవు చనుదు హతుఁడ వయి మహా
సుర వేగమ నా చే నె
ల్ల రేఁగు చోటునకు నింక రాక్షస కనుమా 46.

తే.గీ.	ఏ బలము మాయ నట నూని యింతి సీత
నపహరించితి వో రాక్షసాధమ! దశ
వక్త్ర! నా నుండి వానిఁ జూప వలయుఁ గలు
షాత్మ! కడు ధైర్య వంతుండ వైన నీవు 47.

ఆ.వె.	సీత నొసఁగి నాకు శీఘ్రమ శరణ మ
డుగక యున్న నీవు విగత రాక్ష
స మొనరింతు ధరను జంపి నాదు నిశిత
శర పరంపరలను శంక లేక 48.

ఉ.	చేరెను రాక్షసోత్తముఁడు చెన్నుగ నన్ను విభీషణుండు దా
మూరిన ధర్మ చిత్తుఁ డిఁకఁ బొందును లంకను శ్రీ యుతమ్మునుం
దోరముగా నకంటకముఁ దూర్ణ మధర్మ రతుండు రాజ్యమున్
వారక కోలు వోవు నిలఁ బాప మనస్కుఁడు మూర్ఖ సంగతిన్ 49.

ఆ.వె.	అలవి కాదు నీకు నాత్మ జయింపక
యొక్క క్షణము కూడ నుర్వి లోన
రాజ్య మనుభ వింప రావణ! చరియింప
కున్న ధర్మ గతిని సెన్నఁ డేని 50.

ఆ.వె.	శౌర్య మూని లేక సమరమ్ము నొనరింపు
ధృతి వహించి నా నిశిత శరాలి
సమసి రణము నందుఁ జక్కఁ బునీతుఁడ 51.

వగుదు నిశ్చయముగ నంత నసుర!

కం. ఏఁగిన ముల్లోకమ్ములు
సాగి మనో జవము నూని శకునము వోలెన్
నా గతి కెదురైన బ్రతికి
యే గతి రాలేవు తిరిగి యిది నిశ్చయమే 52.

తే.గీ. ఆచరింపు ముత్తర సత్క్రియలను జూడు
లంక నింపుగ రావణ యింక నిచట
నీదు జీవితం బెల్లను నాదు వశము
సుమ్ము రాముఁ డిట్లన వాలి సూనుఁడంత 53.

ఆ.వె. అగ్ని మూర్తి వోలె నంగదుం డక్లిష్ట
కర్మ రాము గిరలు కపి వరుండు
విని నభమున కెగిరి వేగమ క్షణమందు
రాక్షసేంద్రు మందిరమ్ము గాంచె 54.

చం. గృహమునఁ గాంచె రావణునిఁ దృప్తుని మంత్రులఁ గూడియుండఁగాఁ
దహతహ లేక యంగదుఁడు దగ్గఱ నిల్చెను వహ్ని సన్నిభుం
డు హరి వరుండు రాముని నుడుల్ వచియించె యథాతథమ్ముగా
సహనము తోడ నెల్లరకుఁ జక్కఁగఁ దన్నెఱిఁగించి ముందుగన్ 55.

ఉ. దూతను గోశ లేంద్రునకుఁ దూలక కర్మము లూను వానికిం
బ్రీతి వచించు రామునకుఁ బేరిమి పుత్రుఁడ నేను వాలికిన్
నాతికిఁ దార కంగదుఁడ నన్విని యుందువు మున్ను రాఘవుం
డీ తఱిఁ బిల్చెఁ బోరునకు హీనుఁడ! చూపుమ పౌరుషమ్మునున్ 56.

తే.గీ. సుతుల మంత్రుల బాంధవ తతులఁ గూడి
నిన్ను జంపు వాఁడ ననిని నీవు సావ
మూడు లోకములు భయము వీడి బ్రతుకు
నింక భద్రము వాటిల్ల నెల్ల దిశల 57.

తే.గీ. దేవ దానవ గంధర్వ దివ్య భోగి 58.

రాక్ష సాలికి శత్రువు రావణుండ!
నీవు కంటకుండవు సంపి నిన్ను నుద్ధ
రింతు వారి నెల్ల జనులు సంతసిల్ల

ఆ.వె. గౌరవించి సీతఁ గ్రన్నన నీ వీయ
కున్న నమ్రుఁడ వయి నిన్ను జంప
గనె విభీషణునకుఁ గలుగు నైశ్వర్య మె
ల్ల దశ కంఠ! నీదు లంక తోడ 59.

కం. పరుషమ్ముగ నిట్లు వలుక
హరి వర్యుఁడు కినుకకు వశుఁ డయ్యె నట నిశా
చర గణ నాథుండు భృశ
మ్ము రావణుండు విని నంత మోహము సెలఁగన్ 60.

ఉ. పట్టుఁడు మందబుద్ధి పెస వానరునిన్ వధియింపుఁ డంచు న
ప్పట్టున రక్తలోచనుఁడు పల్కెను రావణుఁ డాగ్రహమ్మునన్
నెట్టనఁ దా సహాయుల ననేకులఁ బల్మఱు గాంచి యంతటం
బట్టిరి నల్వు రంగదుని వహ్ని సమాన నిజప్ర భాసురుల్ 61.

తే.గీ. పట్ట నిచ్చి తారేయుఁడు దిట్ట తనము
సూప వారి ఘోరుల రక్కసులను దనను
బాహువులఁ జుట్టి పట్టఁగ వారు పక్షి
భంగి కొండఁ బోలెడు నింటి పైకి నెగిరె 62.

చం. ఎగిరిన యట్టి వేగమున నెల్లరు రక్కసు లాకసమ్ము నుం
డి గుబులు తోడఁ గూలిరి వడిం గను చుండఁగ రావణుం డటం
బగతుని వేశ్మ శృంగమును వాలి కుమారుఁడు గాంచి యున్నతం
పు గిరి నిభమ్ముఁ బాదములు మోపిన మాత్రమ యక్కజమ్ముగన్ 63.

తే.గీ. పెల్లున విఱిగెఁ జూడఁగఁ దల్లడిల్లి
యా దశగ్రీవుఁడు మును వజ్రాయుధుండు
శీత శైల శృంగమ్మును నాతతముగఁ
గూల్చిన పగిది తోఁపఁగ ఘోరముగను 64.

తే.గీ. విఱిచి ప్రాసాద శిఖరము వీరుఁ డంగ
దుండు నిజ నామమును బల్కి వెండి దుస్స
హమ్ముగ నఱచి వానరుం డాకసమ్ము
న కెగిరెను బల్లిదుండు క్షణమ్ము లోన 65.

కం. భీతి నొసంగి యసురులకుఁ
బ్రీతి నొసఁగ వానరులకు వేగముగఁ గపి
వ్రాతమునకు నడుమ నిలిచె
భూతల నాథుండు రాఘువు సరస నంతన్ 66.

ఆ.వె. సౌధభంగమునకుఁ జాల కినిసి రావ
ణుండు స్వీయ నాశ మొండు నాత్మఁ
దలఁచి నిశ్వసించెఁ దద్ద యుద్విగ్నుఁడై
రాక్షసేశ్వరుండు నాక్షణమున 67.

ఆ.వె. పరివృతుండయి రఘు వరుఁ డనేక హరుల
నంద భరితులను నినాద విలసి
తులను జంప శత్రువుల నెదఁ గాంక్షించి
కదలె నుత్సహించి కయ్యమునకు 68.

ఉ. పూర్వము వాన రాధిపుఁడు మూరి యొసంగ ననుజ్ఞఁ గావఁగాఁ
బర్వత కూట సన్నిభుఁడు వానర పుంగవుఁ డా సుషేణుఁడే
సర్వ కపిప్రవీర గణ సక్తుఁడు ద్వారము లెల్లఁ దిర్గుచుం
బర్విడెఁ దోఁపఁ జంద్రునిగఁ బన్నుగఁ దారల మధ్య దిర్గఁగన్ 69.

తే.గీ. వంద యక్షౌహిణుల మించు వానర వర
సైన్యమును గాంచి దాఁటఁగ సాగరమును
నిలువ లంకను గొందఱు నివ్వెఱ పడఁ
గొంద అసురులు భయపడఁ గొంద ఱింక 70.

తే.గీ. పొంది రత్యంత హర్షమ్ము పోరునకును
నిండఁ బ్రాకార పరిఘలు మెండుగ హరి 71.

వరులు దీనులై రసురులు వడసి భయము
చేసి రెల్ల రాహాకార చేష్ట లపుడు

తే.గీ. కపు లగపడ నన్యంపుఁ బ్రాకారము వలె
రగులఁ గోలాహల మసుర రాజధాని
నాయుధము లూని చరియించి రసురులు లయ
కాల మారుతమ్ము పగిది నేల నిండి 72.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నలువది యొకటవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 42.

రాక్షసులు రావణ మందిరమున కేఁగి రాముఁడు వానర సేన తోడ లంకను ముట్టడించె నని నివేదింప రావణుఁడు ప్రాసాదము నెక్కి యక్షయ వానర సైన్యమును జూడఁగ, రాఘవుఁడు శత్రువుల కోటను ధ్వంసమొనర్ప నాజ్ఞ నొసఁగ రావణుఁడు వారిని మార్కొన మని రాక్షస సేన కనుజ్ఞ నొసఁగ ఘోర వానర రాక్షస యుద్ధ మారంభ మగుట.

కం. చని రావణ మందిరమున
కు నసుర పుంగవులు విభునకు నివేదింపం
గ నరాధీశుఁడు రాముఁడు
ఘన వానర సేన తోడఁ గవియుట లంకన్ 1.

కం. విని నగర నిరోధమ్మును
జనింపఁ గ్రోధము ద్విగుణము చయ్యన నంతం
దన భవనం బధిరోహిం
చె నిశాచర నాథుఁ డార్త చిత్తుం డగుచున్ 2.

చం. ప్లవగ గణావృతమ్ము నిజ లంక సశైల వనమ్ముఁ గాంచె నం
త వెఱపు వుట్ట రావణుఁడు దారుణ వీరులు యుద్ధకాంక్షులై
భువిని నసంఖ్యలం జెలఁగఁ బూర్ణము పింగళ వర్ణ మేర్పడం
గ విలయ మెట్లు సేయ నగుఁ గ్రన్నన నంచుఁ దలంచు చాత్మలో 3.

చం. సుచిరము చింత సేసి యటఁ జొప్పడ ధైర్యము డెంద మందుఁ జూ
చుచు విక చాక్షుఁడై నిలిచె శూరుని రాముని నింక సైన్యముం
బ్రచురము కాఁగఁ జాగుచును రాఘవుఁడుం గనె సైన్య సంయుతం
బచట సహర్ష మెల్లెడ మహాసుర సంచయ గుప్త లంకనున్ 4.

చం. అరయఁగ రంగు రంగుల ధ్వజాన్య పతాక విరాజితమ్ము లం
క రమణి సీతఁ జేరె మదిఁ గాంతను రాముఁడు తప్త చిత్తతం
గరము కృశించి రక్కసులు గాఱియపెట్టఁ దపించి పండుసే
ధర మృగ శాబలోచన సుదారుణ మంచుఁ దలంచి జానకిన్ 5.

ఉ. పీడిత జానకీ సతినిఁ బేర్మిఁ దలంచి రఘూద్వహుండు దాఁ
బాడిగ ధర్మ మానసుఁడు పంచెను వానర యోధ వర్యులన్
దాడి యొనర్ప రక్కసుల దండు పయిన్ వెస నంత సెల్లరం
గూడి ప్లవంగు లుద్ధతిని ఘోర రవమ్ము లొనర్చి రాజికై 6.

తే.గీ. రాము నక్లిష్ట కర్ము గిరల ముదమ్ము
నంది లంకా గిరి వర శృంగావళులను
స్వీయ ముష్టి ఘాతమ్ముల విఱిచెద మని
తలఁచి రెల్ల రంత హరి యూధపు లెడఁదల 7.

మత్తకోకిల. ఎత్తి పర్వత ఘోర శృంగము లింకఁ ద్రుంచి తరూత్తముల్
సత్త జాటుచు నిల్చిరా హరి సత్తముల్ వివిధమ్ములం
దత్తఱంబునఁ జూచు చుండఁగఁ దప్త రాక్షస నాథుఁడే
యుత్తమమ్ముగ వ్యూహమై హరి యోధు లేఁగిరి లంకకున్ 8.

తే.గీ. సాల తాల శిలాయుధ శౌర్య వంతు
లంతఁ ద్యక్త జీవితులు రామార్థ మెంచఁ
దామ్ర వక్త్ర హేమ సదృశ తనులు సాగి 9.

రెల్ల ముట్టడింపఁగ లంక సెల్ల వేగ

చం. తరువులఁ బర్వతాగ్రములఁ దద్ద సెలంగుచు స్వీయ ముష్టులన్
హరి వరు లిండ్ల కొప్పులను నత్యధి కోన్నత తోరణమ్ములన్
విరివిగఁ గూల్చి రెల్లెడల వేగమ పూడ్చిరి కందకమ్ములన్
వర జల రాసులం బఱచి పాంశు తృణాగమ శృంగ కాష్ఠముల్ 10.

ఉ. వేలు కపిప్రవీరు లట పెర్గుచుఁ గోటులు వంద కోటులున్
మేలుగ లంక కుర్కిరి యమేయ పరాక్రము లన్యు లుక్కునం
గూలిచి రభ్ర సౌధములు గోపుర పంక్తులు తోరణమ్ములుం
జాల చెలంగి వానరులు శత్రు వినాశన సక్త చిత్తులై 11.

కం. మించి దుముకుచు సెగిరి గ
ర్జించుచు లంకకుఁ బఱువిడిరి మదేభ సముల్
చంచన్మతులు వెసం బూ
రించుచు ధ్వనులు దిశలన్ హరివరు లడరుచున్ 12.

చం. జయ మగు సత్త్వ రామునకుఁ జారు బలాఢ్యుఁడు లక్ష్మణుండునున్
జయుఁ డగు రామ రక్షితుఁడు సౌరి జయించును వానరేంద్రుఁడే
భయదము లిట్లు గర్జ లిడి వానర పుంగవు లుర్కి రెల్లరున్
రయమున లంకలోఁ బ్రహరులం ద్రుటి వీరులు కామరూపులే 13.

తే.గీ. వీరబాహు సుబాహులు ధీర నలుఁడు
వానర వరుండు ప్రాకార వరము నాక్ర
మించి రెల్లరు మించి పీడించి దాని
నంతలో శిబిరం బట సంతరించె 14.

తే.గీ. నిలిచెఁ గుముదుండు పదికోట్ల బలులు హరులు
చుట్టి యుండ బల్లిదుని నప్పట్టు నందుఁ
దూర్పు ద్వారముఁ గాచుచు నేర్పు మీఱ
గెలువ నిచ్ఛగించు హరి వరులను గూడి 15.

కం. వానికిఁ దోడుగ నిల్చిరి 16.

వానరులను గూడి ప్రసభ పనసులు ఘనులౌ
వానర యూధప వర్యు ల
హీన పరాక్రము లిరువురు కృతనిశ్చయులై

కం. ఇరువది కోట్ల హరులతో
హరి వీరుండు శతబలి వరాఖ్యుఁడు వడిఁ దా
నరుదెంచి నిలిచెఁ జక్కగ
నరయుచు దక్షిణపు ద్వార మత్యధికముగన్ 17.

ఆ.వె. షష్టి కోటి వీర శాఖామృ గావృతుం
డయి సుషేణుఁ డపుడు హరి వరుండు
పశ్చిమంపు ద్వారవర మందు నిలిచెఁ దా
రా జనకుఁడు సమర రక్తి నూని 18.

తే.గీ. చేరి యుత్తర ద్వారమ్ము చెంత నడరి
యుండ సౌమిత్రి సుగ్రీవుఁ డండ నుండ
వానరేంద్రుండు రాముండు బల్లిదుండు
నిలిచె నాక్రమించి నలిన నేత్రుఁ డలుక 19.

ఆ.వె. అనుసరింపఁ గోటి హరులు గోలాంగూలుఁ
డా గవాక్షుఁ డతి భయదుఁడు దీర్ఘ
కాయుఁడు నిలిచెను నృకాంతుని రాముని
చెంత సేరి ధైర్యవంతుఁ డంత 20.

తే.గీ. భీమ వేగ వద్భల్లూక వితతి ఘనుఁడు
రిపు నిబర్హణుం డంత నావృతుఁ డయి యొక
కోటి హరి వీర వర్యుల మేటి ధూమ్రుఁ
డడరి నిలిచె రాముని చెంత నంచితముగ 21.

ఆ.వె. సత్త్వవంతుఁ డంత సన్నద్ధుఁడు విభీష
ణుండు స్వీయ సచివు లుండ నుదరి
గదను జేత నూని కాకుత్స్థుఁ డున్నట్టి
చోటు గని నిలిచె నసుర వరుండు 22.

కం. పరువు లిడుచు సెల్లెడలను
హరి వాహిని నరయు చుండి రా గజ గవయుల్
శరభ గవాక్షులు నింక స
మర తల శూరుండు  గంధమాదనుఁడు తమిన్ 23.

చం. కినుకను నంత రావణుఁడు క్షిప్ర మొసంగె నసుజ్ఞ నాజికై
ఘను లసురప్రవీరులకుఁ గాంతుఁడు రాక్షస కోటి కెల్లనున్
విని పతి భాషణమ్ములను వీరులు రావణు నాస్య ముక్తముల్
నినదము లెల్ల ఘోరముగ నెమ్మి నొనర్చిరి యెల్ల రక్కసుల్ 24.

ఆ.వె. భేరు లంత మ్రోగెఁ బెల్లుగఁ జంద్ర స
న్నిభ తలములఁ బాఁద నిష్క కాష్ఠ
ములను  సకల రాక్షసు లనేక శంఖ నా
దములు సెలఁగె నూఁద నమర రిపులు 25.

చం. అసురులు నీల దేహు లట నర్జున శంఖము లూన నత్తఱిన్
లసిత తటిల్లతా కలిత రాజత భాస బలాక యుక్త మే
ఘ సదృశ ముండి రెల్లరును గ్రమ్మిరి రావణ చోది తాత్ము లం
త్య సమయ మందుఁ బెల్లుబుకు నంబుధి సన్నిభులై చెలంగుచున్ 26.

ఉ. వానర సైన్య నాదములు పర్వత సాను స కందరమ్ములన్
మానక నిండె నా మలయ మాన్య నగమ్మున శంఖ దుందుభుల్
వీనులు నిండ మ్రోగినవి పృథ్విని నింగిని సాగరమ్మునన్
ధ్వానము మారు మ్రోగినది వారక చేయఁగ సింహనాదముల్ 27.

తే.గీ. కరుల బృంహితమ్ములు  హయ వరము లొసఁగు
హేషితమ్ములు  నేమి నిర్ఘోషము లర
దము లొసఁగ నసుర గణ పదముల నిస్వ
నములు మారు మ్రోగె ధరా వనధి నభముల 28.

మత్తకోకిల. ఇంత లోన సుఘోర సంగర మీ పురమ్మున లంకలో
సంతరించెఁ బ్లవంగ సేనకు శౌర్య రాక్షస కోటి క 29.

త్యంత భీకర దేవ దైత్యగ ణాహవమ్మును  బోలి యొ
క్కింత పూర్వము పోరి నట్టిది యిట్టిదే యన నత్తఱిన్

తే.గీ. పలికి స్వీయ విక్రమములు వానరులను
దీప్తము లగు గదల తోడఁ దీవ్ర తర ప
రశ్వధమ్ముల శక్తి శూలముల నాయు
ధముల నసురులు బాఁదిరి దారుణముగ 30.

తే.గీ. వానరులు మహా వీరులు భండనమున
రాక్షసులఁ గొట్టి రను చుండి రాముఁ డతి బ
లుఁడు జయించు జయించు బలుండు లక్ష్మ
ణుఁడు జయించు సుగ్రీవ విభుఁడును నంచు 31.

ఆ.వె. రాజ! గెలువు మంచు రతిఁ బల్కి తమ తమ
పేళ్ల నుడివి తరులఁ బెద్ద తనులు
పర్వతాగ్రములను బండ్లను గోళ్లను
గొట్టి రసురుల నతి ఘోర హరులు 32.

తే.గీ. నిలిచి ప్రాకారముల రక్కసులును భీమ
దర్శనులు వేగ నేలపైఁ దనరి నట్టి
వానరుల శూలముల భిందిపాలములను
గొట్టి సమయింపఁ జాగిరి ఘోరముగను 33.

తే.గీ. వానరులు గూడఁ గోపమ్ము నూని కరము
పుడమి నున్న వార లెగిరి తడయకుండ
నేలఁ గూల్చిరి యసురుల నిలిచి యుండ
వారు ప్రాకారముల పైనఁ బంత మూని 34.

కం. అక్కజ మయ్యెను దుములం
బక్కపి రాక్షస గణ రణ మప్పుడు నిండన్
వెక్కసముగఁ బంకముతోఁ
బ్రక్కలు మాంసమ్ముల రుధిరమ్ముల తోడన్ 35.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నలువది రెండవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 43.

వానర రాక్షస సేనల మధ్య యుద్ధము దారుణము కాఁగ రాక్షస వానర ముఖ్య వీరు లొండొరులఁ దలపడి ఘోరముగ సమర మొనర్ప రక్తపు టేరులు పాఱఁగ నసుర ముఖ్యులు కొందఱు మరణింప మఱి కొందఱు సూర్యాస్తమయము దనుక పేచి మించిన యుత్సాహముతో నాజికి గుమి గూడుట.

కం. పూనిన మహాత్ముల మహా
వానర వర్యుల యసురుల భండన మంతం
గానఁగ బల కోపమ్ముల
నూన సుదారుణ మయిన దనూహ్య విధముగా 1.

ఉ. కాంచన భూషితాశ్వములఁ గ్రాలు ధ్వజమ్ముల నగ్ని కీలలన్
మించి దినేశ్వరప్రభల మీఱు రథమ్ముల రమ్య కంచు కో
దంచిత రాక్షసోత్తములు వ్యాఘ్ర సమానులు భీమ కర్ములే
యెంచి జయమ్ము రావణున కేఁగిరి దిక్కులు నిండ నార్చుచున్ 2.

ఉ. గొప్ప ప్లవంగ సైన్యము సుఘోరము కూడఁ జెలంగి యత్తఱిం
జొప్పడి నట్టి రోషమునఁ జూచి జిగీషువు శత్రు సేన నిం
పొప్పఁగఁ బర్వు లెత్తినది యుగ్రత మార్కొనఁ గామరూపులం
దప్పక రూపు మాపఁగను దత్క్షణ మా రిపు వీర వర్యులన్ 3.

తే.గీ. రక్కసులకు నక్కపులకు వెక్కసముగ
నంతఁ బర్వ నొక్క రొకరి జెంత కంత
రంగముల సంతరింపఁ జలమ్ము ద్వంద్వ
యుద్ధ మత్తఱి వర్తిల్లె నుగ్రముగను 4.

తే.గీ. త్ర్యంబకు నెదిర్చి నట్టి యంధకునిఁ బోలె
నంగదుని వాలి పుత్త్రుని సంగరమున
నమిత తేజస్వి యింద్రజి త్తసుర వీరుఁ
డుద్యమించి యెదిర్చె మహోగ్రముగను 5.

ఆ.వె. దురము నందు సతము దుర్మర్షణుండు సం
పాతి యా ప్రజంఘుఁ బడసి పోరె
జంబుమాలినిఁ గని సత్త్వవంతుఁడు హను
మంతుఁ డడరి పోరెఁ బంత మెసఁగ 6.

ఆ.వె. రావ ణానుజుండు రణతీక్ష్ణ వేగ వి
భీషణుండు మదిని రోష మడర
మిక్కుటముగఁ గలసి మిత్రఘ్ను రిపు వీరు
సమర మందుఁ బోరు సలిపెఁ జెలఁగి 7.

ఆ.వె. గజుఁడు గొప్ప బలుఁడు కయ్య మొనర్చెను
దపను నసురుఁ గూడి తద్ద సెలఁగి
నీలుఁ డా నికుంభు నాలమునఁ గలసి
సంగర మొనరించె శౌర్య మడర 8.

ఆ.వె. ప్రఘసుఁ గూడె నాజి వానరేంద్రుండు సు
గ్రీవుఁ డసుర వరుని శ్రీయుతుండు
లక్ష్మణుండు గలసె రామానుజుఁడు విరూ
పాక్షు నసుర వర్యు నంక మందు 9.

తే.గీ. అగ్నికేతువు దుస్సహుఁ డగ్ని నిభుఁడు
రశ్మికేతువు భీకర రాక్షసుండు
యజ్ఞ కోప సుప్తఘ్నులు నార్యు రాము
నంక మందు మార్కొనిరి మహాత్ము నడరి 10.

ఆ.వె. వజ్రముష్టి యసుర వరుఁడు మైందుని తోడు
త నశనిప్రభుండు తనర ద్వివిదు 11.

హరి వరేణ్యుఁ గూడి యసురద్వయము కపి
ద్వయము తోడ నాహవ మొనరించె

తే.గీ. వీరుఁడు ప్రతపనుం డతి ఘోరుఁ డతఁడు
రాక్షసుఁడు భండనమున దుర్జయుఁడు వేగ
వంతుఁడు నలునితో శౌర్యవంతు తోడ
సమర మొనరింప సమకట్టె నమిత బలుఁడు 12.

కం. బలవంతుఁడు ధర్మ తనయుఁ
డిల విశ్రుతుఁడే సుషేణుఁ డింపుగఁ దా నా
వలి విద్యున్మాలిం గని
తలపడె వర వానరుండు తత్క్షణ మనిలో 13.

చం. ఇతరులు భీమ వానరు లనేకులు రాక్షసవీర వర్యులం
దితరుల ద్వంద్వయుద్ధము ననేకుల గూడి యొనర్ప నుగ్రులై
వితతము రోమహర్షణము భీకరమై తుములంబు నయ్యె నా
తత మసురాలికిం గపుల దండున కంత జిగీషు కోటికిన్ 14.

తే.గీ. జుట్టు గడ్డియై గుమిగూడె శూర వాన
రాసు రాలి గాత్రమ్ముల నక్కజముగ
మేనులను గూడి పాఱె నమేయముగను
బొంగి రక్తపు టేరులు పుడమి నపుడు 15.

చం. దురమున నింద్రజిత్తు గదతోఁ బ్రహరించెను రోసి యంగదుం
బరఁగఁగ వజ్రి వజ్రమున భంగిని వీరుని శత్రు సూదనున్
గురు జవ వంతుఁ డంగదుఁడు గొట్టె రథమ్ము సువర్ణ గాత్రమున్
హరి వరుఁ డశ్వ సారథుల నాజిని శీఘ్రము క్రుద్ధ చిత్తుఁడై 16.

తే.గీ. కొట్ట మూడమ్ములఁ బ్రజంఘుఁ డిట్టలముగ
నాజి సంపాతి నాత్మలో నలుక వొడమ
దిట్టయై యంత సంపాతి చెట్టు నశ్వ
కర్ణ మూని కొట్టి వధించెఁ గనలి వాని 17.

చం. ఉరమునఁ గొట్టి మారుతిని నుగ్రుఁడు తేరున నున్న శక్తితోఁ
ద్వర నని జంబుమాలి కడు బల్లిదుఁ డా హనుమంతుఁ డుగ్రుఁడై
యరదము నెక్కి యంత నిజ హస్త తలమ్మున మూరి బాదఁగా
సురరిపు తోడ నా రథము చోద్యముగా ధరఁ గూలె నంతటన్ 18.

తే.గీ. అఱచుచుఁ బ్రతపనుఁడు దూఁకె నడరి నలుని
పైన ఘోర రాక్షసుఁ డనివార్యముగను
శీఘ్ర మంత నలుఁడు హరి శేఖరుండు
వాని చక్షువులను బీఁకె నూని కినుక 19.

కం. గిరి శృంగమ్మున ముష్టిని
హరి వీరుండు సెలఁగి గజుఁ డసురప్రవరున్
సుర దుర్జయు నా తపనుని
దురమునఁ బ్రహరించి చంపె దోర్బలుఁ డలుకన్ 20.

తే.గీ. హస్త లాఘవ మున్నట్టి యా ప్రఘసుఁడు
తీక్ష్ణ శరముల తోడ భేదింపఁ దనువు
సేన మ్రింగు పగిదిఁ జూచు వానిఁ జంపె
నరఁటి చెట్టుతో సుగ్రీవుఁ డా హరిపతి 21.

కం. పీడించి విరూపాక్షుని
వీడక శర వర్షమునను భీమాసురునిన్
వాఁడి యగు నొక్క బాణము
తోడ ఘనుఁడు లక్ష్మణుండు దురమునఁ జంపెన్ 22.

తే.గీ. అగ్నికేతువు మిత్రఘ్నుయజ్ఞకోపు
లింక రశ్మికేతు వొసంగ సంకటములు
నల్వురి శిరములం ద్రుంచె నాలు గనల
శిఖలఁ బోలు నమ్ముల రాముఁ డఖిల విదుఁడు 23.

తే.గీ. ముష్టితో మైందుఁ డా వజ్రముష్టిఁ జంపె
రణము నందు నేలం గూల్చె రథము తోడ
నశ్వముల తోడ వింతగ నవనిఁ గూలు 24.

పట్టణంపుఁ బ్రాకారము పగిది తోఁప

ఉ. నీలుని నల్ల కజ్జలపు నిగ్గున పెల్గెడు మేని వానినిన్
మేలి శరమ్ములం బదును మించ భృశమ్ముగ వేసి దీక్ష్ణముల్
లీలగ నా నికుంభుఁడు హరిన్ వెసఁ జీల్చెను గిన్క సూర్యుఁ డ
భ్రాలిని స్వీయ ఘోర కిర ణాలి విదుల్చు విధమ్ము తోఁపగన్ 25.

ఉ. ఇంకను జేతి నేర్పున హరీంద్రు నికుంభుఁడు వంద ముల్కు లా
యంకము నందు వేసి కడు నంకిలి పెట్టిన రోసి నీలుడుం
గొంకక తేరుచక్రమునఁ గొట్టి నికుంభు శిరమ్ము ద్రుంచి తాఁ
బొంకము తోడ సారథిని మూర్ధ విహీనునిఁ జేసె శీఘ్రమే 26.

చం. అసురులు చూచు చుండఁగ మహాశని వజ్ర సమాన సంగముం
డసమ బలుండు నౌ ద్వివిదుఁ డా యశనిప్రభుఁ గొండ కొమ్ముతో
వెస నటఁ గొట్ట నాతనిని భీమ కపీంద్రుని వృక్ష యోధునిన్
విసరి యనేక బాణములు విద్ధునిఁ జేసె నతండు కిన్కమై 27.

తే.గీ. బాణ ఘాతార్తి ద్వివిదుండు వానరుండు
క్రోధ మూర్ఛితుం డంతట ఘోర సాల
పాదపమ్ము నూని యశని ప్రభునిఁ గొట్టి
చంపె సారథి యుత మంత సమర కేళి 28.

సీ. అరదము నందున్న యసుర విద్యున్మాలి కాంచన భూషిత ఖర శరముల
బాధించి వానర వర్యు సుషేణుని నవ్వుచుఁ బల్కెఁబు నాద మొసఁగఁ
గని వాని రథ మందు ఘనగిరి శృంగము నెత్తి కొట్టి సుషేణుఁ డిట్టలముగఁ
బడఁ ద్రోచె రథమును బుడమి పైన వెస విద్యున్మాలి నేర్పున నూని గదను
తే.గీ. నేల నిలువ సుషేణుఁడు మేలి ఱాయి
నెత్తి పర్విడఁ గిన్కతో నత్తెఱంగుఁ
గని యసుర కొట్ట లెక్కింపక శిల నంత
వైచె రక్కసు నురమున వానరుండు 29.

ఆ.వె. తగుల ఱాయి గుండె పగుల విద్యున్మాలి
ప్రాణములను వీడి వసుధ పైనఁ 30.

గూలె నక్కజముగ ఘోర నిశాచరుం
డయ్యవసరమున మహా రణమున

కం. శూరుల వానర యోధుల
శూరులు రజనీచరులు వసుధఁ దలపడఁగన్
వారని చలమున మర్దితు
లైరి హరుల చే సురార్ది తాసురుల వలెన్ 31.

సీ. గదలు భల్లమ్ములు ఖడ్గ తోమర శక్తి పట్టిస స్యందన వారువములు
చక్రాక్ష యుగదండ సంచయమ్ములు చెదర విఱిఁగి వానర రాక్షస గణ
మణఁగి యెల్లెడల మహా ఘోర గతినిఁ గన్పట్టె నప్పుడు నిండ భండన తల
మెల్లఁ దిరుగ నక్క లెల్ల సెలంగి మిక్కుటముగ వింతగఁ గూఁత లిడుచు
తే.గీ. దేవ దానవ యుద్ధము తీరు సెలఁగి
వాన రాసుర రణ మందు మేను లెగిరెఁ
దలలు లేక యా తుములమ్ము తద్ద దారు
ణ మయి కన్పట్టె నత్తఱి నల్దెసలను 32.

కం. తాడితు లయి దారుణముగ
పేఁడుచు సూర్యాస్తమయము భీమాసురులే
కూడి నిలిచిరి తిరిగి పో
రాడ రుధిర సిక్త తనులు హరి వీరులతో 33.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నలువది మూడవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 44.

వానర రాక్షసులు పోరుచుండ రాత్రి కాఁగ యుద్ధము కొనసాగుచుండ నంగదుఁ డింద్రజిత్తు నోడింప

నతఁడు మాయమై యదృశ్య రూపమున రామలక్ష్మణులను నాగ పాశముచే బంధించుట.

కం. అవిరళము వోరుచుండఁ ద
మి వాన రాసుర బలం బమేయం బట్లున్
రవి పశ్చిమాద్రి కేఁగం
గ విరిసె నిసి యంత నసు నికాయఘ్నుంటై 1.

కం. వైరము పరస్పర మడర
ఘోరులకుం దమ జయమ్ముగోరు హరులకున్
వీరాసురులకు నిశలోఁ
బోరాటం బయ్యె నపు డమోఘముగ నటన్ 2.

చం. అరయఁగ నీవు రక్కసుఁడ వంచును వానర వీర వర్యులున్
హరివియె నీవ యంచు వెస నత్తఱి రాక్షస వీరు లంత నొ
క్కరి నొకరుండు చీఁకటినిఁ గయ్యము నందు వధించి మీఱఁగా
బరుగిడు దీవ యెక్కడికిఁ బాఱకు చంపుమ చీల్పు మంచునున్ 3.

ఉ. రేఁగిన విల్లు శబ్దములు రేయి నొనర్పఁగ ఘోర యుద్ధమే
యాఁగక కాల గాత్రముల నభ్రపుఁ ద్రాణము లూన రక్కసుల్
రేఁగిన యట్టి చీఁకటిని లీలగఁ గన్పడి రెల్ల రత్తఱిం
జాగఁగ దీపి తౌషధి విశాల నగావృత పర్వ తాభులై 4.

తే.గీ. దాఁట శక్యము కా నట్టి తమము నందుఁ
గ్రోధ మూర్చితు లసురులు ఘోర వేగ
మూని తివిరి భక్షించుచు వానరులను
దుమికి రెల్లరు వారిపైఁ దోరముగను 5.

ఉ. వానరు లాగ్రహమ్మునను బల్లిదు లార్చుచు భీకరమ్ముగం
గానన వాసులే దుమికి కాంచన భూషిత ఘోటకమ్ములన్
పే నలి చేసి రగ్ని వలె వెల్గు పతాకములం జెలంగి యా
సేన మహాసు రావలినిఁ జీల్చుచు క్షోభిలఁ జేసి రుద్ధతిన్ 6.

తే.గీ. క్రోధ మూర్చితులై వెసఁ గుంజరములఁ 7.

గుంజ రారోహులను రథకోటి ధ్వజ వి
రాజితమును లాగిరి పండ్ల నాజిఁ జెలఁగి
కఱచి రుగ్రులై ఘోరముగ హరి వరులు

ఉ. చంపిరి రామ లక్ష్మణులు సర్ప సమాన శరాలిచే ననిం
బెంపు వహించి రాక్షసుల వీక్షకు నందిన నంద కున్ననున్
నింపెను దుమ్ము రేఁగ రథనేముల గుఱ్ఱపు డెక్కలన్ ధరన్
గుంపుల కన్నులం జెవుల ఘోర రణమ్ము సెలంగ నత్తఱిన్ 8.

ఆ.వె. రణము సాగఁ బాఱె రక్తము లేరులై
యంక ణాంగణమ్ము నందు ఘోర
ముగను రోమ హర్షణ గతి సెలఁగ వాన
రాసుర గణ వీరు లడరు చుండి 9.

కం. భేరీ మృదంగ పణవ మ
హా రవములు శంఖ నిస్వ నాదులు చక్రా
పార రవ మిశ్రితము లయి
ఘోరాద్భుత భంగి నాజిఁ గొనసాగె వెసన్ 10.

కం. సకిలించెడి గుఱ్ఱమ్ముల
వికలప్రాణాసుర గణ వృక్షచర సమూ
హకృత మహా స్వనముల నిం
డి కదన మతి ఘోర మయ్యె డెందము లద్రువన్ 11.

చం. హత హరి ముఖ్యులన్ హత మహాద్రి ని భాసుర కామ రూపులం
బతిత కుఠార శక్తి ముఖ భల్ల వితాన మహాయుధాలితో
నతిఘు సుమోపహార కలి తాంక తలం బట దుర్నివేశమై
సతత మవేద్యమై తనరె స్రావిత శోణిత కర్దమంబుతో 12.

కం. దురతిక్రమం బయి నిఖిల
ధరా జనిత భూతములకుఁ దథ్యముగను ద
ద్ధరి రాక్షస గణ నాశన
కర మయ్యెను గాలరాత్రిగాఁ దన్నిశయే 13.

చం. ఘనశర వృష్టి రాక్షస నికాయము పే కురియించి రాత్రి నా
మనుజ వరేణ్యు రాఘువుని మార్కొన సంతస మంది రాఁగ వ
చ్చు నసుర వీర గర్జ లవి సూడఁగ జీవ లయంపు వేళలో
వనధి యొనర్చు శబ్దముల భంగి వినంబడె దారుణమ్ముగన్ 14.

తే.గీ. వారిలో నార్గురం గని వాడి శరము
లాఱు వేసి కొట్టె దశరథాత్మజుండు
నిమిష మాత్రము నందుఁ గినిసి నిశా చ
రులను వహ్ని శిఖా సమముల ఘనుండు 15.

తే.గీ. యజ్ఞ శత్రు దుర్ధర్షుని నసుర వర్యు
లుభయులను మహాపార్శ్వ మహోదరులను
వజ్ర దంష్ట్రు మహాకాయు బలు లగు శుక
సారణుల నార్గుర నొగుల్ప శరము లేసి 16.

ఆ.వె. మనుజ వరు శరములు మర్మావయవముల
నాట రణము వీడి మేటి రక్క
సులు పరువు లిడఁగ నసువులు మిగిలిన వా
రైరి వార లెల్ల రార్తి సెంది 17.

కం. ఒక్క నిమిషమున రాముం
డక్కజముగ దిశల నా మహారథుఁ డంతం
జక్కఁగ విమలము లొనరిచె
నెక్కటి వీరుం డనల నిభేద్ధ శరములన్ 18.

తే.గీ. రాముని కెదురు నిల్చిన రాక్షసు లిత
రులు సమీపించి వీరు లనలముఁ జొచ్చు
మిడుతల పగిది నెల్లరు మడిసిరి పెస
రామ నామాగ్ని తాపము రగుల భృశము 19.

కం. బంగరు పుంఖపు టమ్ములు
నింగిని మఱి నేల నిండ నిసి యప్పుడు కాం 20.

చంగ శరత్కాల నిశా
భంగి స ఖద్యోతము కనఁబడెఁ జిత్రముగన్

ఉ. ఘోరతరంబు కన్పడెను ఘోషములన్ హరి రాక్ష సావళుల్
మూరి యొనర్పఁ దిర్గి నిసి పుట్టగ శబ్దము లట్లు దిక్కులన్
దారుణ రీతి వర్ధిలఁగఁ దద్ద త్రికూట గిరీంద్ర మత్తఱిన్
వారక మాట లాడు విధిఁ బన్నుగఁ దోఁచె స కందరం బటన్ 21.

కం. గోలాంగూలులు చీకఁటిఁ
బోలు మహాకాయులు భుజముల నసురాలిన్
వ్రాలి రయమ్మునఁ గౌఁగిలి
మేలుగ భక్షించి రాజి మీఱి బలమునన్ 22.

ఉ. అంగదుఁ డాజి శత్రువుల నంతము సేయఁ దలంచి వచ్చి యా
సంగర మందు నింద్రజితు సారథి నింకను వారువమ్ములం
జంగున దాఁటి కొట్టిన భృశమ్ముగ దారుణ మయ్యెఁ గయ్యమే
క్రుంగఁగ నశ్వ సారథులు కూబరి వీడెను మేఘనాదుఁడే 23.

తే.గీ. రథము వీడి యదృశ్యుఁడై రావణి తొలఁ
గంగఁ దత్కర్మముం గని యంగదుఁ డొన
రింపఁ బూజార్హు సుర ముని లింపుగ నుతి
యించి రా రాఘవులు స్తుతియించి రతని 24.

ఉ. సేరిన వార లింద్రజితునిన్ ఘనుఁ బ్రాభవ మందు నందఱున్
వీరుఁడు నోడ నంగదుని భీమ బలమ్మునఁ గాంచి తుష్టులై
మూరిరి యాప్లవంగులు ప్రమోదులు మెచ్చిరి సాధు సాధు వం
చా రణధీరు వానర గణాధిపుఁ డింక విభీషణుండునున్ 25.

ఆ.వె. ఓడి యింద్రజిత్తు దాఁడి సేయగ నంగ
దుండు సమర భీషణుండు వాలి
పుత్రుఁ డాజి లోన నాత్రమ్ము మీఱఁగఁ
గ్రోధ మూనె నంత ఘోరముగను 26.

తే.గీ. అంత రాముఁడు వల్కెను హరుల తోడ
నిలుఁడు సుగ్రీవు చెంత మీరలు విధాతృ
వరము చేత బాధించు నసురుఁడు దాఁగి
యోర్వ వలయు నాకు నిట మీ రుండ సనిని 27.

ఆ.వె. మాయ మైన పాపి యబ్జజ దత్త వ
ర బల దర్పితుండు రావణి రణ
కర్కశుండు భీమ కాయుండు క్రోధ మూ
ర్ఛితుఁ డశని నిభ శర తతినిఁ గురిసె 28.

ఆ.వె. రామ లక్ష్మణులను రాక్షసుండు కినిసి
ఘోర నాగ మయ సుఘోర నిశిత
శరము లంతఁ జొనిపి సర్వ గాత్రము లందు
నొవ్వఁ జేసెఁ జలము నివ్వటిల్ల 29.

చం. మునుఁగఁగ రామ లక్ష్మణులు మోహమునం దొనరించి యట్టులం
గనఁబడ కుండ లోకులకుఁ గ్రన్నన రావణి కూటయోధి క
ట్టెను శర బంధనమ్మునఁ ద్రుటిం బరమాత్ముల రాఘవేంద్రులం
గనిరి మహాహి బాణములఁ గట్టు వడం గపు లెల్ల వారినిన్ 30.

కం. కనఁబడి రాక్షస రాడ్వర
తనయుఁడు బాధింప లేక తనరిచి మాయన్
ఘన రాజ నందనులఁ గ
ట్టెను భ్రాతల బంధమునఁ గరిన చిత్తుండై 31.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నలువది నాల్గవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 45.

ఇంద్రజిత్తును గనుగొన రాముఁడు పదిమంది వానరయూధపులను బంప మేఘనాదుఁడు వారిని శర జాలముల నడ్డగించి రామలక్ష్మణుల ననేక నిశిత బాణముల రక్తము లొల్కు నట్లు బాధింప వారు విగత సంజ్ఞులై పడియుండ నందఱు శోకించుట.

కం. వెతకుచు నరి మార్గమ్మును
ప్రతాపవంతుండు వనిచె రాజాత్మజుఁ డా
వితత బలుఁడు రాముఁడు హరి
పతులం బది మంది వీర వర్యుల నంతన్ 1.

చం. పర దమనుండు రాఘవుఁడు పంపె సుషేణు సుతద్వయమ్మునున్
హరివరు వాలినందనుని నంగదు మారుతి బల్లిదుండు నా
శరభుని వీరు నా ద్వివిదు సానుత లాఖ్యు మహా బలున్ హరీ
శ్వరు ఋష భాంసకూటు ఋషభప్రవరుం గపి నేత నీలునిన్ 2.

ఆ.వె. వారు పంత మూని పాదపమ్ముల నెత్తి
భీమములను మించి విన్ను న కెగి
రి వెస నెల్లరును బరీక్షింపఁ దొడఁగిరి
యెల్ల దిక్కు లందు నుల్లసిల్లి 3.

తే.గీ. వేగవంతులౌ వారల వేగ మెల్ల
వేగతర శర జాలము వేగ పఱపి
యస్త్ర వేత్త యస్త్ర గరిమ నంత రావ
ణాత్మజుఁ డడరి వారించె నాకసమున 4.

కం. హరు లత్యుత్తమ వేగులు
శరఘాత తనులు కనరు నిశా సమయములో
ఖరు నసురుని మేఘావృత
కరు దినకరు భంగి నపుడు గగనం బందున్ 5.

ఉ. రావణి యుద్ధ జైత్రుఁడు శరమ్ములు నింపె నిరంతరమ్ముగా
భూవర నందనద్వయ వపుః ప్రవరమ్ములఁ జీల్ప మర్మముల్ 6.

వావిరి రామలక్ష్మణులు పన్నగ సన్నిభ బాణ పూర్ణు లై
రా వర రాక్షసుం డలిగి యంగములం జొనుపంగ నెల్లెడన్

తే.గీ. గాయముల నుండి కాఱె నమేయముగను
రక్త ముభయులకును రామలక్ష్మణులకు
వారు కన్పట్టి రప్పుడు పరమ శూర
వరులు పుష్పిత కింశుక తరుల వోలె 7.

ఉ. కాటుక ముద్ద నాఁబరఁగు కాయము వాఁడు కటాక్ష రక్తుఁడై
మేటి బలుం డదృశ్యుఁ డయి మించిన దర్పము తోడఁ నిట్లనెం
జాటున రామలక్ష్మణుల క్షాత్రవ వీరులఁ గాంచి భ్రాతలన్
మాటలు రావణాత్మజుఁడు మానవ వర్యుల తోడ నుగ్రుఁడై 8.

ఆ.వె. కనఁబడ కొనరింపఁ గయ్యమ్ము గాంచ న
శక్తుఁ డౌను నన్ను శక్రుఁ డమర
పతియుఁ జేరుట కనఁ బలుక నేల తిరిగి
మిమ్ము నింక భండనమ్ము నందు 9.

తే.గీ. రాపులుఁగు ఱెక్కలు గల శరమ్ము లేసి
రామ లక్ష్మణు లార! యీ భీమ రోష
కలిత చిత్తుఁడు పంపును గాలు నింటి
కిపుడు మిమ్ము రయమ్మున నెలమిఁ జెలఁగి 10.

చం. పలుకుచు రామ లక్ష్మణుల భ్రాతల సన్నుత ధర్మవేత్తలన్
ములికుల నేసి తీవ్రముగఁ బూరుష వర్యుల నొవ్వఁ జేసెఁ దాఁ
గులికెను మిక్కుటమ్ముగను ఘోరతరమ్ముగఁ జేసె నాదముల్
తొలఁగక తిర్గి తిర్గి వెసఁ దూపులు నాటెను చాచి వింటినిన్ 11.

ఆ.వె. మర్మముల గణించి మర్మజ్ఞుఁ డసురుండు
రామ లక్ష్మణుల విరామ మొసఁగ
కుండ నిశిత శరము లుప్పొంగి నాటించి
గాయ పఱచి యార్చెఁ గర్కశముగ 12.

కం. శర బంధమ్మున బద్ధు ల
యి రామ లక్ష్మణులు వీరు లిరువురు సమ రాం
తరమున నొక్క నిమిషమున
నరయ నశక్యు లయి రమ్మహా ధానుష్కుల్ 13.

ఉ. దారిత సర్వ గాత్రు లయి తద్ద కృశించి శరావృ తాంగులై
వీరులు వింత నంత బలభిత్తుని రజ్జు విముక్త కేతువున్
వారలు వోలి కంపము లవారిత రీతి సెలంగ నేలపై
ధారుణి నేలు వారలును దాళక కూలిరి విద్ధ మర్ములై 14.

తే.గీ. వీర భూమిఁ బరుండిన వీరుల శర
జాల మున్న దేహుల క్షతజమ్ము కాఱు
నార్తుల తనుల లే దొక్క యంగుళమ్ము
నక్షతం బభంధ మభిన్న మైన నరయ 15.

తే.గీ. అట్టు లాపాద మస్తక మార్తి నొసఁగఁ
గ్రూర రాక్షసుం డనిఁ దాను గోరు రూప
మూను వాఁడు రక్తము కాఱె నూట వోలె
రాఘవుల కటఁ దీవ్ర తరముగఁ దనుల 16.

కం. మును రాముఁడు నేలం బడెఁ
దను మర్మమ్ముల శరములు తాఁకఁగఁ గ్రోధ
మ్మున నింద్రజిత్తు వేయఁగ
మును శక్ర విజేత తివిరి పోరున మాయన్ 17.

తే.గీ. పసిడి పొన్నుల ముల్కుల పదను టమ్ము
ల నఱ ముల్కుల బల్లెముల నడుగునకుఁ
గదలు నమ్ముల లేగ సింగపుఁ బలుల ము
లికులఁ జురకత్తి ముల్కుల రేఁగె నసుర 18.

ఆ.వె. వీరశయన మందు వీడ నారి పిడికి
లి సడలంగ నంతఁ బసిడి వింటి
మూడు వంపు లుండ మూరు దాని వదలి 19.

రాముఁడు పడియుండె రాజ సుతుఁడు

కం. విల్లు పడిన పిదప పుడమి
నల్లనఁ బడ రాముఁడు పురుషాగ్రణి యట్లుం
దల్లడిలి లక్ష్మణుఁడు గని
యుల్లమున నిరాశఁ జెందె నుసురుల నూనన్ 20.

కం. రాముఁ గమలపత్రాక్షుని
భీమ శరావలి నిబద్ధుఁ బృథ్విని బడఁగా
సౌమిత్రి గాంచి యన్నను
దా మిక్కిలి యార్తి నొందెఁ బ్రాసాత్ముండై 21.

కం. హరులును రాఘవు నారసి
కరము తపించుచుఁ గనులను గన్నీ రొలుకన్
నరవృషభుఁ దలంచుచు నే
డ్చిరి ఘోరమ్ముగ భయపడి డెందము లందున్ 22.

కం. శర బద్ధుల వీరశయన
నిరతుల రాఘవులఁ జేరి నివ్వెఱ తోడన్
హరు లాంజనేయ ముఖు లం
దిరి యెదల విషాదము కడు తీవ్రముగ నటన్ 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నలువది యేనవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 46.

మూర్ఛిల్లిన రామలక్ష్మణులను గాంచి వానరులు దుఃఖించుట, యింద్రజిత్తు మిగిలిన వానర

ముఖ్యులను బాధింప సుగ్రీవునకు విభీషణుఁడు ధైర్యము చెప్పుట, తండ్రికి మేఘనాదుఁడు
రామలక్ష్మణులను వధించితి నని యెఱిగింప రావణుఁడు కుమారుని నభినందించుట.

కం. నేలను నింగినిఁ గాంచుచు
నాలమున శరావృతుల మహా వీరుల నా
సాలావృక వరులు గనిరి
వ్రాలిన సోదరుల రామలక్ష్మణుల వెతన్ 1.

కం. కడు వర్షించి శమించిన
యొడయుని దేవేంద్రు పగిది నుగ్రపుఁ బనినిం
దడయక ముగింప రావణి
యడరి విభీషణుఁడు వచ్చె హరి నాథునితో 2.

ఆ.వె. రాఘువులకునై విలాపించిరి హరులు
మైందుఁడు ద్వివిదుండు మఱియు నా సు
షేణుఁడు కుముదుండు సేరి యంగద హను
మంతులను జెలఁగఁ గలంత యెదల 3.

సీ. నిశ్చేష్టులను మంద నిశ్వాసులను రక్త సిక్తుల మార్గణ శ్రేణి తప్త
చిత్తుల శరతల్ప సేవిత సుప్తుల సర్ప నిశ్వసనుల స్రావి తాస్ర
గంచిత దేహుల నభ్రధ్వ జాభుల వీర శయన సుప్త వీర వరుల
రాఘువ వరుల నల్పతర చేష్టుల భాష్పనయన యూధప వృత నర వృషభుల
తే.గీ. భాష్పలోచనులు ధరణీపతిత వీర
వర్యులను గాంచి వానర వర్యు లెల్ల
రంతఁ దప్త చిత్తు లయిరి యాతుధాన
వర్యుని విభీషణుని తోడ ధైర్య మణఁగ 4.

కం. హరులు నిరీక్షించుచు నం
తరిక్షమున దిక్కు లెల్లఁ దన్మాయావిం
బరు రావణాత్మజునిఁ గాం
చ రెక్కడను విస్మయంబు సంధిల్లంగన్ 5.

ఆ.వె. మాయ దాఁగి నట్టి మాయావి నగ్రజ 6.

పుత్త్రుఁ గాంచె నెదుట మూరి యుండ
వెలయ మాయ యా విభీషణుం డప్రతి
మ నిజ కర్మ రాశి మసలు వాని

ఆ.వె. ఆజి సంతతమ్ము నప్రతిద్వంద్వు నం
తర్హితుఁ డయిన వర దాన మహిమఁ
గనె విభీషణుండు ఘనుఁడు తేజమ్మున
యశము విక్రమముల నతని నంత 7.

కం. నిజ కర్మము వీక్షించి మ
నుజ వర్యుల సుప్తులఁ గని నొచ్చిన వారిన్
నిజ సైన్యమ్మున కీయ మ
నుజాశనుఁడు సంతసమ్మును బలికె నిట్లున్ 8.

కం. భ్రాత లగు రామ లక్ష్మణు
లాతత బలులు ఖర దూష ణాద్యసుర మహా
ఘాతుకులు చచ్చి రిట నా
చేతను బాణమ్ముల సునిశితముల చేతన్ 9.

కం. నా శర సంచయ దుస్సహ
పాశముఁ దప్పింప సుర తపస్వు లసుర సం
ఘేశు లశక్యు లనిన వల
దే శంక మనమ్ము లందు నెవ్వరి కైనన్ 10.

ఉ. ఎవ్వని కారణమ్మున స్పృశింపవు తల్పముఁ దండ్రి గాత్రముల్
నెవ్వగఁ జింత సేయుచును నిత్యము నుండును రాత్రు లార్తితో
నొవ్వుల మూడుజాములు ఘనుం డగు నా జనకుండు వేచునో
యెవ్వని చేత లంక తపియించు నదీ క్రియ వానకారునన్ 11.

తే.గీ. అవ్వ రానర్థమును మూల హరము నంద
ఱికిని శమియింపఁ జేసితి సుకర రీతి
రామలక్ష్మణుల హరుల భీమ విక్ర
మమ్ము నిష్ఫలము శరదభ్రమ్ము పగిది 12.

కం. పలికి యసురాలితో ని
ట్టులు సూచుచు నున్న కపి పటుతర మహా వీ
రుల నెల్లర రావణి క
ట్టలుకం గొట్టెను గరినపు టమ్ముల తోడన్ 13.

ఆ.వె. నీలు నంతఁ దాఁ గినిసి తొమ్మిదింటను
మైందు నింక ద్వివిదుఁ దొందరగను
మూడు మూడు బాణములు రిపుఘ్నుఁడు వేసి
గాఢముగఁ గరమ్ము కలఁత వెట్టె 14.

తే.గీ. అమ్మహేష్వాసుఁ డు గని ఋక్షాధి నేత
జాంబవంతుఁ బీడించె వక్షమ్ము నందు
నాటి యమ్మును హనుమంతు మేటి వేగ
వంతు నురమున నాటెను బది శరములు 15.

తే.గీ. రెండు రెండమ్ము లేసి యుద్దండ విక్ర
ముల శరభ గవాక్షుల రణమున నసుర వ
రుఁడు మహావేగ వంతుఁడు రోషమూని
దారుణముగ బాధించె నింద్రవిజయుండు 16.

కం. గోలాంగూలేశ్వరునిన్
వాలి తనయు నంగదు బహు బాణమ్ములతో
నాలమ్మున బాధించెను
జాల త్వరిత మానసుఁ డయి శక్రద్విషుఁడే 17.

ఉ. వానర కోటి కంకమున బాణము లగ్నిశిఖా నిభమ్ములన్
మేనుల నాటి బాధల నమేయ మొసంగి బలాఢ్యుఁ డంతటం
దా నొనరించె ఘోరముగ ధ్వానము నవ్వుచు దీర్ఘ బాహుఁడే
వానరు లుండఁ ద్రాసమునఁ బల్కెను రావణి యిట్లు వాక్యముల్ 18.

ఉ. నా శర పాశ బద్ధులు రణమ్మున రక్కసులార! చూడుఁడీ
నాశిత రామలక్ష్మణుల నా విని కైతవ యోధు లెల్ల లం 19.

కేశ కుమార రత్నపు టహీన కృతమ్ము ముదం బొసంగ సం
కాశము నందు నిల్చి నర కాంతులఁ గాంచిరి విశ్మయమ్మునన్

ఆ.వె. ఘోర నాద మంత నీర దాభ మొనర్చి
రందఱు రఘువరుఁడు హతుఁడ యంచుఁ
దలఁచి మానసములఁ దద్ద పూజించిరి
మేఘనాదు నపుడు మేటి బలుని 20.

చం. కదలక తీయ కూపిరినిఁ గన్పడ నిద్దఱు రామలక్ష్మణుల్
వదరక నేలపై మృతులె పార్థివ సూనులు నాఁ దలంచి తా
మదిఁ గడు సంతసించి యరి మర్దనుఁ డంతట నింద్రజిత్తు పే
ముదము నొసంగి రక్కసుల మూఁకకుఁ జొచ్చెఁ బురమ్ము లంకనున్ 21.

తే.గీ. రామ లక్ష్మణుల నుభయుల నరయంగ
నట్లు శరములతోనిండ నవయవములు
భయము వడసె సుగ్రీవుఁడు వానరేంద్రుఁ
డతనిఁ దప్పు విభీషణుఁ డరసి యంత 22.

తే.గీ. పలికెఁ గాంచి సుగ్రీవుని వలదు భయము
వానరేంద్ర! యాపుమ నీదు భాష్పవేగ
మింక యుద్ధము లిట్లుండు నెంచి చూడ
నిశ్చయమ్ముగాదు జయము నేరు మయ్య 23.

ఆ.వె. భాగ్య మున్న మనకు వానర గణనాథ!
మోహము నశియించు భూరి వీర్య
లకు మహాత్ము లయిన రామలక్ష్మణులకు
నచిర మిపుడు వంత నందఁ దగదు 24.

ఆ.వె. సుస్థిరుఁడవు కమ్ము సుగ్రీవ! ధృతి నూని
నన్ను నీ యనాథు నగచరేంద్ర!
చక్కఁ జేయు మట్లు సత్య ధర్మాభిర
క్తులకు మరణ భయము దోఁపకుండు 25.

మ. క్షమ మీఱంగ విభీషణుండు తగఁ బ్రక్షాళించె సుగ్రీవు నే
త్రములం గ్లిన్న కరమ్ములం బలికి తద్వాక్యంబు లబ్భంగినిన్
విమ లాంభస్సుల నుచ్చరించి జపముల్ పే తుడ్చె నేత్రమ్ము లిం
క ముఖం బెల్లను గాలయుక్తములు వాక్యమ్ముల్ వచించెం దమిన్ 26.

తే.గీ. ఇట్లసంభ్రమమ్మున వానరేంద్ర! కలఁత
సెంద సమయమ్ము కా దిది స్నేహ మెక్కు
వైన నయ్య దీ సమయమ్ము నందుఁ దప్పు
కార్య! మరణమ్మునకు హేతు వగును జుమ్ము 27.

ఆ.వె. కాన డెంద మందుఁ గలఁత వహింపకు
సర్వకార్య లయము సర్వులకును
రామ రక్షితంపుఁ బ్లవగ సైన్యమ్మున
కు హిత మెడఁద సెంచుమ హరి నాథ! 28.

చం. కపివర! సంజ్ఞ నంద నగు కాలము దన్కను రాఘవేంద్రులన్
నృపజులఁ గావ నొప్పు నిట నెమ్మి వహించిన సంజ్ఞతోడ వా
ర పరఁగి విక్రమమ్మున మహాత్ములు భీతిఁ దొలంగఁ జేయఁగా
నపుడు సెలంగ నోపుదురు త్యాజ్యము దుఃఖము నిశ్చయమ్ముగన్ 29.

తే.గీ. రాముని కిది దలంప నల్పమ్ము సుమ్ము
ఱేడు రాముండు మరణించు వాఁడు కాదు
కాంతి వీడదు రాముని సుంత యైనఁ
దూలఁ బ్రాణము లీ కాంతి దుర్లభమ్ము 30.

తే.గీ. ఊఱడించుకొనుమ నిన్ను మీఱి నీవ
యూఱడింపు మీ సైన్యమ్ము నుత్తమముగ
నేను నాయత్తపఱచెద నీదు సేన
నెల్ల నంచితమ్ముగ వానరేంద్ర! తిరిగి 31.

కం. విప్పారిన కన్నులతో
నుప్పొంగిన భీతి తోడ నొక్కరి కొకరుం
జెప్పుచు నుంటిరి గాథల 32.

నిప్పట్టునఁ జెవుల వాన రేశ్వర! హరులే

చం. బలమును నుత్సహింపఁ జను వానిని నన్నటఁ గాంచి భీతితో
వెలవెలఁ బోయి పర్వు లిడు వీరుల వానర వర్యులన్ వెసన్
నలిఁగిన దండ వీడు గతి  నైపుణ మొప్పఁగ భీతి వీడుచుం
జెలఁగెడు భంగి నుంచఁ దగు శీఘ్రమ  యిప్పుడు వానరోత్తమా! 33.

తే.గీ. ఊఱడించి సుగ్రీవు హర్యుత్తముని వి
భీషణుఁడు రాక్షసేంద్రుఁడు  భీతిఁ బాఱు
వాన రానీకముఁ దిరిగి భయము తొలఁగ
నూఱడించెను దగ భాషణోత్తమముల 34.

చం. త్వరితుఁడు నింద్రజిత్తు చని వాహిని తోడఁ బురమ్ము లంకకున్
గురు దశకంఠుఁ గాంచి వెసఁ గూరిమి మీఱ నమస్కరించి తాఁ
గరములు మోడ్చి చెప్పెఁ బ్రియ గాథను దండ్రికి రామలక్ష్మణుల్
దురమునఁ గూలి రంచుఁ దన తూపుల ధాటికి సంతసం బిడన్ 35.

ఉ. దిగ్గున లేచి రావణుఁడు ధీరునిఁ గౌఁగిలిఁ జేర్చి పుత్రునిన్
వెగ్గలమై చెలంగ రహి ప్రీతిని మూర్కొన వాని మూర్ధమున్
దగ్గఱ నుండ రాక్షసులు దండ్రి వచింపు మనంగ రాఘవుల్
మ్రగ్గి శరాలి బంధమున వ్రాలిన తీరు వచించెఁ బుత్రుఁడే 36.

తే.గీ. విని మహారథు మాటలు వీడి రామ
జనిత భయము చిత్తమున హర్షమ్ము నిండ
నిష్ప్రభులు నిశ్చలులు గాఁగ నృవరులు సుతుఁ
బొగడె రావణుఁ డానంద పూర్ణ గిరల 37.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నలువది యాఱవ సర్గము.

## యుద్ధ కాండము

# సర్గము 47.

ఇంద్రజిత్తు కృతార్థుఁ డయి లంక కేఁగ వానరర్షభులు రాముని పరివేష్టించి కాపాడు చుండ రావణుని
యాజ్ఞతో రాక్షస స్త్రీలు త్రిజట సహితము సీతను యుద్ధభూమికిఁ గొనిపోవ సీత మూర్ఛఁ బడి
యున్న రామలక్ష్మణులను జూచి మిక్కిలి విలపించుట.

కం. చన లంకకు రావణ నం
దనుఁడు కృతార్థుం డయి వెసఁ దప్తస్వాంతుల్
వనచర వృషభులు కాకు
త్స్థుని రక్షించిరి సుపరివృతు లయి కలంతన్ 1.

సీ. హనుమంతుఁడు సుషేణుఁ డంగదుండు కుముదుండు నలుండు నీలుండు పనస ఋషభ
కపులు సానుప్రస్థ గవయ గవాక్ష శరభ గంధమాదన ప్లవగ సుందు
లును రంభ శతబలులును జాంబవంతుండు పృథు వింక వానర వీర వరులు
వ్యూఢములను గూడి యుదరి సంసిద్ధులై పాదపమ్ముల నెత్తి పార్శ్వములను
తే.గీ. బైన క్రిందును దిశ లెల్లఁ బర్యవేక్ష
ణమ్ము సేయుచు నిల్చి తృణమ్ము కదలి
నను దలంచుచు రక్కసుం డని యెడఁదల
నప్రమత్తులై యుండిరి యార్తి తోడ 2.

ఆ.వె. రావణుండు కూడఁ బ్రమదమ్ము సెలగంగ
పంపి యింద్రజిత్తుఁ బనిచె సీతఁ
గాచు నట్టి యసుర కాంతలఁ గాంచంగఁ
దన్ను దత్‌క్షణంబ యున్న పగిది 3.

ఉ. రావణు నాజ్ఞఁ దాలిచి శిరమ్మున శీఘ్రము రాక్ష సాంగనల్
రావణుఁ జేర నా త్రిజట రాఁ దమ వెంటను సంభ్రమమ్ముతో
రావణుఁ డంత హర్షమున రక్కసులం గని పల్కె వారితో
నీ వచనమ్ము లెల్ల రిపు డేఁగి వచింపుఁడు సీతతో నిటుల్ 4.

తే.గీ. నిహతు లైరి రాఘువు లాజిని నిపుఁ డింద్ర
జిత్తు చేత నని వచించి సీతను గొని 5.

బొండు వెసఁ బుష్పక విమానమున హతులను
రామ లక్ష్మణులను జూపి రండు వేగ

ఆ.వె. ఎవని యాశ్రయమ్ము నెంచి గర్వం బూని
యీ రమా మణి నను జేర రాదొ
యాతఁ డీమె భర్త యనుజుతో మరణించె
భండన తల మందుఁ బార్థివుండు 6.

ఉ. శంక దొలంగ త్రాస మది సన్నగిలంగ నపేక్ష లేక నా
యంకము సేరు నింక జన కాత్మజ భూషిత సర్వ గాత్రయై
యంకము నందుఁ గూలఁ బతి యాశ నశింప నన్య మార్గయై
పంకజ నేత్ర తా మరలి వచ్చు స్వయమ్ముగ నన్ను జేరఁగన్ 7.

ఆ.వె. అట్టి వాతని గిర లాలకించి దురాత్మ
రావ ణోక్తములను రాక్ష సాంగ
న లటులె యని పలికి నడచిరి పుష్పక
మున్న చోటునకుఁ బ్రసన్న లగుచు 8.

తే.గీ. పుష్పక విమానమును దెచ్చి పూని రాక్ష
సేంద్రు నానతి రక్కసు లెల్ల రంత
మైథిలి నశోక వని నున్న మగువఁ గదిసి
పతి విచార నెక్కించిరి భద్రముగను 9.

కం. ధరణిజ నెక్కించి త్రిజట
యు రాఁగఁ బుష్పకము నందు నువిదలు జూపం
గ రణతల మందుఁ బడియు
న్న రామ లక్ష్మణుల వెసఁ జనఁ దొడఁగి రంతన్ 10.

ఉ. రావణుఁ డంతఁ బట్టణము లంకను జేసెఁ బతాక యుక్తమై
వావిరి వెల్గు నట్టులను బన్నుగఁ జాటఁగఁ జేసె రాఘవుల్
భూవర పుత్రు లిర్వురును బోరునఁ గూలిరి యింద్రజిత్తుచే
నా వినఁ బౌరు లందఱు మనమ్ముల సంతస మంద మిక్కిలిన్ 11.

కం. చని సీత విమానమ్మునఁ
గనెం ద్రిజట సంయుతమ్ము కపి సైన్యం బె
ల్లనుఁ బడి యుండఁగ యుద్ధా
వని హృదయ విదారకముగ వైదేహి యటన్ 12.

కం. ఘన ముదితు లైన పిశితా
శనులను వీక్షించె నచట శాఖామృగముల్
మునిఁగి విచారమున నిలువఁ
గనె నా రాఘవుల చెంతఁ గలఁత సెలంగన్ 13.

చం. కనె శర తల్ప సుప్తుల నృకాంతుల రాముని నింక లక్ష్మణున్
సునిశిత బాణ పీడితుల శూరుల ఖండిత సంజ్ఞులన్ నివృ
త్త నిజ నివాతులన్ విశిఖ దారిత దేహుల ముక్త చాప హ
స్త నృవరులన్ శరేద్ధ వసుధా తల పాతితులన్ ఘనార్తయై 14.

తే.గీ. భృశము శోకించె దుఃఖార్త వీరులు పురు
షర్షభులు భ్రాతలు ననల సంభవద్య
య నిభులు శర తల్పులు నళినాక్షు లట్టు
లుండ నిద్ర జానకి జాలి యొదవ నపుడు 15.

కం. అనవద్యాంగి యసిత నయ
న నాథు నిఁక లక్ష్మణుఁ గని నర వృషభులు దు
మ్మున దొర్లుచుండ నప్పగి
దిని విలపించెను ధరణిజ దీనతరముగన్ 16.

కం. దేవ సదృశ ప్రభావుల
నా వర సోదరుల నెంచి హతులని యుభయుల్
తా వగపు మీఱ నశ్రుల
నీ వాక్యమ్ము లనె సీత హీనస్వరయై 17.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నలువది యేడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 48.

రామలక్ష్మణులను నిహతులుగ నెంచి సీత యార్తితో నేడ్చుచు జాలిగఁ బలవరించు చుండఁ ద్రిజట యోదార్చి రామలక్ష్మణులు మరణింప లేదని కారణములతో సీతకు నమ్మకము కలిగించి తిరిగి యశోక వనమునకుఁ గొనిపోవుట.

కం. పతిని నిహతుఁ గని లక్ష్మణు
నతి బలునిం గూడను జన కాత్మజ శోకా
ర్త తరుణి జాలిగఁ జెలఁగఁ గ
లఁత భృశముగ డెందమున విలాపించెఁ గడున్ 1.

తే.గీ. అవిధవను బుత్రవతి నౌదు నంచుఁ బల్కి
నట్టి లాక్షణికుల మాట యిట్టులు హతుఁ
డైన రాముండు వమ్ము కా నకట గాంచ
జ్ఞాను లనృత వాదు లయి రీ సమయ మందు 2.

తే.గీ. యజ్ఞ యాగాదు లొనరించి నట్టి వాని
పట్టమహిషి  నగుదు నంచుఁ బల్కినట్టి
వారు రాముఁడు మరణింప  వంత సెలఁగ
జ్ఞాను లనృత వాదు లయి రీ సమయ మందు 3.

ఆ.వె. వీర పార్థివ వర దారలందుఁ బతి పూ
జిత నగు సతి నని వచించి యున్న
యట్టి వార లెల్ల హతుఁడు కా రాముండు
జ్ఞాను లనృత వాదులై నెగడిరి 4.

తే.గీ. ద్విజులు కార్తాంతికులు నేరు వినుచు నుండఁ
బల్కినారలొ సౌభాగ్యవతిని నంచు
వార లందఱు రాముఁడు వడయ మృతిని
జ్ఞాను లనృత వాదు లనుచు నేను దలఁతు 5.

చం. చరణము లందుఁ బద్మములు చక్కఁగ నిట్టివి యున్న నాతులే
వర కుల జాత లెల్లఁ దగ పట్టపు రాణులునై చెలంగరే
పరఁగుచుఁ జక్రవర్తు లగు భర్తల తోడుత నాదు దేహ మం
దరయ నభాగ్య నా విధవలౌ సతు లందలి లక్షణమ్ములన్ 6.

తే.గీ. ఎట్టి లక్షణములు స్త్రీల కెల్లఁ జెప్పఁ
బడునో పద్మాదిగాఁ గల్గు పరమ చిహ్న
ము లవి యెల్ల నా కింక రిత్త లయినవి హ
తుండు గాఁగ నా భర్త రాముండు నేఁడు 7.

ఉ. కేశము లెల్ల సన్నములు కృత్స్నము నల్లగ నుండు నింపుగా
లేశము నాదు కన్బొమలు రెండును గూడవు గుండ్ర పిక్క లా
దేశము రోమహీన మగుఁ దెల్లని దంతము లుండు స్వచ్ఛ సం
కాశము నింక సాంద్రతను గాంచఁగ నాదు శరీర చిహ్నముల్ 8.

చం. నొసలును నేత్ర హస్తములు నున్నని గుండ్ర నఖమ్ము లంఘ్రులున్
సు సమము లూరువుల్ మఱియు సుందర గుల్ఫము లింక వ్రేళ్లు నా
దు సురుచిరమ్ములౌ చనులు దొడ్డవి యిర్కుఁ గొనల్ నిమగ్నముల్
పస గల నాభి లోతుగను వక్షము పార్శ్వము లుండుఁ బుష్టిగా 9.

చం. వపువు సువర్ణ మా మణి నిభం బగు రోమము లౌ మృదూత్తముల్
స్వపదము లూను ద్వాదశ విభాగములన్ నిలుచుండ నింపుగాఁ
విపుల సులక్షణమ్ములను వెల్గు నటంచు వచింత్రు నన్ను నె
ల్లపుడును హస్త పాదముల రాజిలు నా యవ ధాన్య చిహ్నముల్ 10.

తే.గీ. వ్రేళ్ల సందు లగపడవు వెలయు పాణి
పాదము లరయ సురుచిర వర్ణములను
నన్ను మందస్మితగఁ దగ నెన్ని రెల్ల
నిపుణు లైన కన్యా లాక్షణికులు మునుపు 11.

తే.గీ. ఆధిరా జ్యాభిషిక్త నం చనిరి ద్విజులు
నన్ను భర్త సంయుతముగ మిన్నగా నె 12.

ఱుంగు దైవజ్ఞు లప్పుడు భంగ మయ్యె
నిప్పు డది యెల్లఁ బతి కూల నివ్విధమ్ము

మ. తనరన్ ధైర్యము భ్రాత లిర్వురు జనస్థానమ్ము శోధించి నా
చను వృత్తాంత మెఱింగి దాఁటి వనధిం జక్కంగ నక్షోభ్యమున్
ఘను లాశ్చర్యము దోఁప గోష్పదమునం గాకుత్స్థులే మున్గిరే
యని దుర్దాంతులునౌ ధనుర్ధరులు శస్త్రాస్త్రప్రవీణుల్ కటా 13.

కం. కలవే ఘోరత రాస్త్ర
మ్ములు వాయవ్యమ్ము సైంద్రమును వారుణముం
బలు బ్రహ్మశి రోఽగ్నివ రా
ఖ్య లసత్పర మాస్త్రములు మహాత్ముల చెంతన్ 14.

చం. కనఁబడ కుండ మాయ వరఁగంగ రణమ్మున వాస వోప మో
గ్ర నరుల రామ లక్ష్మణులఁ గాంత ననాథను గాచు వారిఁ జం
పె నసురుఁ డట్లు కాని యెడ వీరుని దృష్టి పథమ్ము నందు రాఁ
జనఁ గల వాఁడె ప్రాణముల శత్రువు మానస తుల్య వేగియున్ 15.

తే.గీ. కాలమున కెద్ది భారము నేలఁ బడె స
లక్ష్మణుండు సై రాముండు రణము నందుఁ
గూల్పఁబడి యక్కజమ్ముగ నల్పు గతిఁ గృ
తాంతుఁ డిల దుర్జయుండు నిరంతరమ్ము 16.

ఉ. అత్తను దీనురాలిఁ గని యాత్మఁ దపించెడు నట్టి భంగి నే
నిత్తఱిఁ జింత సేయను నరేంద్రుని రాముని గూర్చి యింక వీ
ర్యోత్తము లక్ష్మణుం గుఱిచి యుర్వి సుతన్ నను గూర్చి యైన నా
యుత్తమురాలు నా జనని నుంచి మనమ్మున నైన నార్తినిన్ 17.

ఆ.వె. నిత్య మెదురు చూచు నెరవేర్చి వ్రతమును
రాఁగ నెప్పు డే నరయుదు సీత
నమ్మహారథ వరుఁ డైన లక్ష్మణుని రా
ముని సహితము నంచు వనరు చుండి 18.

చం. అడలుచు నున్న జానకిని నా త్రిజటా సతి గాంచి పల్కె నీ
వడలకు మమ్మ నీ పతి మహాత్ముఁడు రాఘవుఁ డున్న వాఁడ యి
ప్పుడమిని నెంచఁ బ్రాణములఁ బూరుష వర్యుఁడు భ్రాత తోడుతన్
నుడివెదఁ గారణమ్ములను నొవ్వకు మమ్మ సమంచితమ్ములన్ 19.

కం. మరణించినచో విభుఁ డనిఁ
బరికించిన యోధ వరుల వదనమ్ములలో
నరయము కోపం బేనియు
నరుసం బేనియు నొకింత యవనిజ! వినుమా 20.

కం. నిను మోయ దీ విమానము
విను మిది పుష్పక మనంగ విఖ్యాతంబై
తనరును దివ్యం బియ్యది
కను మూసిన రాఘవు లిటఁ గయ్యము నందున్ 21.

ఆ.వె. ముఖ్య నాయకుండు పోరున మరణింప
సేన తిరుగు యత్న హీన ముత్స
హింప కుండఁ గర్ణ హీన మైన తరణి
జలము నందు తిరుగు చందముగను 22.

తే.గీ. దీనురాల! యెవ్వరి నేను దెలుపు చుంటి
నీకు వారిఁ గాకుత్స్థుల వీఁక నిచటఁ
గాక యుద్విఘ్న మింతయు నీ కపి వర
సేన రక్షించు చున్నది చేరి చుట్టు 23.

ఉ. నమ్మక ముంచుమా యెడఁద నా వచనమ్ములఁ గాంచుమా నిమి
త్తమ్ముల నీ శుభమ్ములను దా రిటఁ గారు హతుల్ రఘూత్తముల్
నెమ్మి వహింపు స్నేహ మది నివ్వటిలంగ వచించు చుంటి నే
నమ్మరొ! యాడ లే దనృత మన్నది మున్ను వచింప నెన్నఁడున్ 24.

తే.గీ. నీదు శీల చరిత్రలు నాదు మనము
సూఱ కొన్నవి మైథిలి! సురలు సేంద్రు
లసురులు నశక్యు లోడింప నని నృవరుల 25.

వారి రూ పట్లు దర్శించి పల్కు చుంటి

ఆ.వె. ముల్కులు తగులంగ మూర్ఛిల్లి పడినట్టి
వీరి విడువ లేదు వీర వరులఁ
గాంతి సుంత యేని వింత వీక్షింపుమ
యంతరంగ మందు వంత వీడి 26.

కం. పురుషుల కాయువు చెల్లిన
మరణింప ముఖమ్ము లందు మాయం బయి కాం
తి రయమునఁ జూచుట కహో
పరమ వికారముగ నుండుఁ బరికింపంగన్ 27.

ఆ.వె. మోహ మింక శోకమును బాధ సెల్లను
రమణి వీడు రామ లక్ష్మణుల కొ
లకు మనమ్ములో జనక నందన! యశక్య
మౌను విగత జీవు లౌట వారు 28.

ఆ.వె. అట్లె యగును గాక యంచు నంజలి తోడఁ
బలికె నంతఁ ద్రిజట పల్కు లాల
కించి సీత క్షమ వహించి సుర సుతాభ
కుదురుపడఁగ మనము కొంత తనకు 29.

కం. మరలించి మనోజవ సదృ
శ రయ విమానమును ద్రిజట చయ్యన నంతం
దరుణీ మణి దీనాత్మను
ధరణిజ లంకా నగరికిఁ దఱలిచెఁ బ్రీతిన్ 30.

కం. పరమ విమానము త్రిజటయు
ధరణిజ దిగినంత సీత తఱలింపఁ బడెన్
సురుచిరపు టశోక వని క
సుర కాంతలచే రయమున సుడివడు చుండన్ 31.

కం. కని చింతించి నృవర నం 32.

దనుల విచారించె భృశము ధరణిజ నానా
ఘన తరు షండము మనుజా
శన నాథ విహార భూమి సని నిలువంగన్

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నలువది యెనిమిదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 49.

మూర్ఛ నుండి తేఱుకొనిన రాముఁడు గతాసుఁ డయి పడియున్న లక్ష్మణునిఁ జూచి దుఃఖముతో విలపించి ప్రాణములను వీడ నెంచి వానరుల నందఱను దమ తమ యిండ్లకు వెడలుఁ డని పల్కుట.

మ. శరబంధమ్మున నున్న దాశరథు లస్రస్రావ సిక్తాంగులై
ధర నిద్రించుచు నిశ్వసింపఁగ మహాదర్వీక రాభమ్ముగా
హరి వర్యుల్ సుమహా బలప్రవరు లత్యం తార్తి సుగ్రీవుతోఁ
బరివేష్టించి విచార మగ్ను లయి తత్పార్శ్వమ్మునన్ నిల్వఁగా 1.

మత్తకోకిల. అంతలోనఁ గడింది వీరుఁడు నైన రాముఁడు లేచె న
త్యంత సుస్థిరుఁ డైన యట్టి నరాగ్రగణ్యుఁడు వీర్య ధీ
మంతుఁ డైన బలుండు గావున మార్గణమ్ములు కట్టినన్
వంత నందెను జూచి నంత నిపాతి తానుజు లక్ష్మణున్ 2.

కం. దీనాస్యునిఁ గృశియింపగ
మేను భృశమ్ము రుధిరమ్ము మించి స్రవింపం
దా నేలం బడి యుండఁగ
వాని నరసి తమ్ము నన్న వగచెను బాధన్ 3.

తే.గీ. సీతతో నింకఁ బని యొద్ది సేయ నాకు
కార్య మెయ్యది జీవింపఁ గాంచ నాకుఁ
నిర్జితుండు గా సౌమిత్రి నేఁడు నేలఁ
జూచు చుంటిని శయనింప నోలి యాజి 4.

ఆ.వె. దొరకును వెదకంగఁ దిరిగి సీతను బోలు
నతివ మర్త్య లోక మందుఁ గాని
లక్ష్మణునకు సముని భ్రాత సచివు నాజి
శక్య మౌనె పడయ జగతి లోన 5.

ఆ.వె. ప్రాణములు విడుతు నవని సుమిత్రానంద
వర్ధనుండు ప్రేత భావము వడ
సినఁ దడయక యింక వనచరు లెల్లరు
సూచు చుండ నేను శోక హతుఁడ 6.

తే.గీ. ఏమని వచింతుఁ గౌసల్య కేను గదిసి
మాత నింక కైకేయి కంబకును నకట
యేమి సెప్ప నేర్తు సుమిత్ర నెట్లు చూచు
వాఁడఁ బుత్ర దర్శన వాంఛ వగచు జనని 7.

కం. వెడలిన సౌమిత్రి విడిచి
వడఁక కురరివోలె మాత వగతో రోదిం
చెడు నామెఁ గనఁబడక తన
యుఁ డుండ నోదార్తు నెట్టు లుచిత విధముగన్ 8.

ఆ.వె. ఏఁగి నపుడు వెంట రాఁగ వచ్చు నపుడు
వానిఁ గొనక నేను బట్టణమున
కరిగి యయ్యశస్వి భరతుని శత్రుఘ్నుఁ
గాంచి యెప్పగిది వచించు వాఁడ 9.

కం. నింద లిడ సుమిత్రా సతి
డెందమున సహింపఁ గడు కఠిన మసువుల నే
నింద త్యజింతును జీవిత 10.

మం దాసయె లేదు నాకు నగచరు లారా!

తే.గీ. ఛీ! యనార్యుఁడఁ బాపపుఁ జెయ్యుల నొన
రించు వాఁడ నక్కట శయనించు చుండె
లక్ష్మణుండు శరముల తల్పమున నా వ
లననె పతితుం డయి యసువులను ద్యజించి 11.

కం. నన్నాశ్వాసింప సతము
మిన్నగ భాషించు నీవు మీఱఁగ వెతయే
నన్నరసి గతాసుఁడ వయి
యన్న! యిపుడు పలుక నేర వకటా నుడులే 12.

ఉ. ఎవ్వని చేత రక్కసు లనేకులు యుద్ధమునన్ గతాసు లై
రవ్వర వీర! నీవు నిపు డచ్చటనే విశిఖాలిఁ గూలితే
యివ్విధి బాణ జాలమున నిచ్చట రక్త పరిప్లుతుండవై
నివ్వటిలంగ నస్త గతునిన్ రవినిం దగఁ బోలియుంటివే 13.

తే.గీ. ములుకు లంట మర్మస్థానములను బలుక
లేక యున్న నించుక యైన నీ కనుల నె
ఱుపుఁ దనము చెప్పుచున్నది యిపుడు వీని
రుజను దెల్లముగను నా కనుజు కలంత 14.

చం. వనమున కేగు నత్తఱిఁ బ్రభాయుతుఁ డెట్టుల వెంట వచ్చెనో
యనుజుఁడు నేను నట్టులఁ బ్రయాణము సేయుదు వాని వెంటఁ గా
లుని నిలయమ్ముఁ జేరఁగను ద్రుంగెను లక్ష్మణుఁ డిట్టు లీ యవ
స్థ నిట ననార్య నావలనఁ జారు తరేష్టుఁడు బంధుకోటికిన్ 15.

తే.గీ. నాకు నిత్య మనువ్రతుఁడై కదలెడి
వాఁ డితండు కినిసి యైనఁ బలుక నప్రి
యమ్ము లెన్నఁడేనియుఁ బరుషమ్ములు విన
నేర లక్ష్మణుఁ డనుజుండు వీర వరుఁడు 16.

ఉ. ఎక్కుడు కార్తవీర్యునకు నెవ్వఁడు బాణము లైదు వందలం 17.

జక్కఁగ వేయు వేగముగఁ జయ్యన నొక్క ప్రయత్న మందుఁ దా
నుక్కున లక్ష్మణుండు విశిఖోగ్రము లేయఁగ నస్త్ర రాజులున్
మిక్కిలి నైపుణుం డిల సుమిత్రకుఁ బుత్రుఁడు శక్తివంతుఁడున్

ఆ.వె. ఏ మహాత్ముఁ డనిమిషేశు నస్త్రమ్ములఁ
దన ఘనాస్త్రముల వలన నశింపఁ
జేయు నతఁడు నేఁ డుచిత శయ నార్హుఁడు
పుడమిని శయనించె నడగి యాజి 18.

ఆ.వె. రక్కసులకు నెల్ల రాజుగ నే విభీ
షణుని నకట సేయ జాల నైతిఁ
బలికి నట్టి రిక్త వచనాలి బాధించు
న న్నసంశయమ్ము మిన్నగాను 19.

ఉ. ఈ విఁక నిమ్ముహూర్తముననే చన నర్హుఁడ వౌదు తిర్గి సు
గ్రీవ! యెఱింగి రావణుఁడు రేఁగి బలమ్మునఁ బాఱఁ జేయు నే
నీ వెను వెంట నుండమిని నీల నలాంగద వాహినీ యుతం
బీ వనధిం దరించి చను మిష్ట జనావలి తోడ వారధిన్ 20.

సీ. హనుమంతుఁ డొనరించె నత్యద్భుతంపుఁ గార్యము దుష్కరం బది యన్యులకును
సంతసించితిని ఋక్షపతి గోలాంగూల రాజ కార్యమ్ము నరసి రణమున
నంగదుఁ డొనరించె సంగర మింపుగ మైందద్వివిదులు సంపాతి కేస
రు లతి ఘోరమ్ముగ సలిపిరి యుద్ధమ్ము గవయ గవాక్షులు గజ శరభులు
తే.గీ. నన్య హరివీరు లొనరించి రాజి నా కొ
ఱ కయి త్యక్త జీవితులు వెఱవక సుంత
దైవము నరులు సుగ్రీవ! తలఁచి చూడ
దాఁట గలరె యెన్నఁ డయిన మేటి వీర! 21.

తే.గీ. మంచి మది యున్న సఖునకు నంచితముగ
నేది శక్య మగునొ దాని నెల్లఁ జేసి
తీవు ధర్మ భీరు వయి సుగ్రీవ! శత్రు
సంచయ దమన యిచ్చటఁ జక్కఁగాను 22.

ఉ. చేసిరి మిత్ర కార్యమును జెన్నుగ వానర వర్యులార! మీ
రీ సమయమ్మునం జనుఁడి యెల్లరు నింక యథేష్ట రీతి యా
వాసము లెల్లఁ జేర నని పల్కఁగ వానరు లెల్ల రామునిన్
గాసిలు వాని గాంచి వెతఁ గన్నుల నీరు స్రవింప నిల్వఁగా 23.

ఆ.వె. ఇంత లోన సేన సెల్ల నిలిపి విభీ
షణుఁడు వచ్చె గదను జక్కఁ గేల
నూని యెందు రాముఁ డుండె నచ్చోటికిఁ
గాంచఁగ శరతల్ప గతుల నపుడు 24.

కం. నల్లని కాటుక వలె విల
సిల్లు విభీషణునిఁ గాంచి శీఘ్రము రాగం
దల్లడిలుచుఁ బరువు లిడిరి
యెల్ల హరులు రావణి యని యెంచి యెడఁదలన్ 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నలువది తొమ్మిదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 50.

వచ్చిన విభీషణుని నింద్రజిత్తుగా భావించి కపిసైన్యము కలవరము సెంద సుగ్రీవుని యాజ్ఞతో జాంబవంతుఁడు సేన నూఱడింపఁ బడియున్న రామలక్ష్మణులను గాంచి విభీషణుఁడు కలఁత సెంద సుగ్రీవుఁ డూఱడించు చుండ గరుత్మంతుని రాకతో రాఘవుల నాగపాశము వీడఁగ వానరు లెల్ల సంతోషించుట.

కం. అంత మహాతేజుఁడు బల
వంతుఁడు హరి రాజు పలికె వ్యథితం బయ్యెన్
వింత హరి సైన్య మేలనొ 1.

వంతం బెను గాలి నావ వలె ఘోరముగన్

ఉ. నా విని పల్కె వాలి వర నందనుఁ డంగదుఁ డివ్విధమ్ము సు
గ్రీవుని తోడ నంతఁ బరికించుట లేదె శరార్త వీరులన్
నీ విట రామలక్ష్మణుల నెత్తురు వొల్కుచు నిద్ర నుండగా
భూవర పుత్రు లిద్దఱను ముల్కుల శయ్య పయిన్ మహాత్ములన్ 2.

ఆ.వె. వానరేంద్రుఁ డంతఁ బలికె నందను నంగ
దుఁ గని తలఁప నేను విగత కార
ణం బిది యని ఘన భయం బెడందల నుంట
కారణం బగుఁ గలకలమునకును 3.

చం. అరయఁగ భీత చిత్తులరు త్యక్త నిజాయుధు లీ ప్లవంగముల్
విరిసిన యట్టి కన్నులను వేగము గా నిటఁ బాఱుచుండిరే
కరము భయమ్మునం జెదరి కల్గదు సిగ్గొక యింత వెన్కఁ జూ
డరు చను చుండి రొండొరుల లాగుచు దాఁటుచుఁ బడ్డ వారినిన్ 4.

తే.గీ. అచట కరుదెంచె నంతట నవ్విభీష
ణుఁడు గదా పాణి సుగ్రీవు నొడయుఁ గాంచి
వృద్ధి నొంద నాశీస్సులు ప్రీతి నొసఁగె
రాఘవునకును దేజస్వి రాక్షసుండు 5.

ఉ. పావను నవ్విభీషణుని వానర భీషణు రాక గాంచి సు
గ్రీవుఁడు జాంబవంతుఁ గని ఋక్ష గణేశ్వరు నమ్మహాత్మునిన్
రావణి యంచుఁ బాఱిరి దలంచి భయమ్మున నెల్ల వానరుల్
వే వచియించి వచ్చెను విభీషణుఁడే యని నిల్పుమా యనెన్ 6.

చం. విని హరినాథు మాటలను వేగమ వానర సేన నెల్లనుం
జని తగ ఋక్ష పార్థివుఁడు శాంతిలఁ జేసెను జాంబవంతుఁ డు
ల్కునఁ బరువెట్టు వారికి నిరోధ మొనర్చి మరల్చె నంతటన్
వనచరు లెల్ల నిర్భయము వచ్చిరి గాంచుచు నా విభీషణున్ 7.

చం. కదిసి విభీషణుండు శరగాత్రుల రాముని నింక లక్ష్మణున్ 8.

మది కనినంత మిక్కుటము మ్రందఁ గడున్ వ్యథితుండు నయ్యె యే
కదలిక గాంచ కా యసుర కాంతుఁడు ధర్మ రతుండు తప్పుఁడై
యుదకపుఁ జేత నేత్రముల నొత్తుచుఁ దా విలపించె నివ్విధిన్

తే.గీ. యోధ వరులు విక్రాంతులు నొంది రిటుల
సత్త్వ సంపన్ను లియ్యవస్థ నసుర నిచ
యమ్ముచేఁ గూట యోధులు పమ్మ సమర
మందు రాఘవు లిచ్చట కుందు చుండి 9.

తే.గీ. భ్రాత పుత్రు దుష్పుత్రుచే నీతి హీన
చిత్తు వలనఁ గపట బుద్ధి చేత వీరు
లు ఋజు విక్రములు చలితులుగ నొనర్పఁ
బడిరి రాక్షస మాయచే బెడిదముగను 10.

ఆ.వె. కొట్టఁబడి శరముల బెట్టిదమ్ముగఁ గాఱ
నెత్తు రొడళు లందు నిదుర నుండ
వసుధ వీరు ముండ్ల పందుల భంగినిఁ
దోఁచు చుండి రరయ దుర్జయు లని 11.

చం. ఎలమిఁ బ్రతిష్ఠ గోరితిని నెవ్వరి వీర్యము నాశ్రయించి నే
విలయము నంద వార లిటఁ బృథ్విపయిన్ నిదురించి యున్నవా
ర లకట మానవర్షభులు రాఘవు లే బ్రతి కున్ననున్ విప
త్తుల హత రాజ్య లాభమునఁ దూఱ రిపుం డగుఁ బ్రాప్త కాముఁడే 12.

తే.గీ. ప్రతిన తీరిన వాఁడయ్యె రావణుం డ
ని విలపించు చుండంగఁ గని హరి రాజ
వరుఁడు సుగ్రీవుఁడు కడింది బలుఁడు కౌఁగి
లించికొని విభీషణుని వచించె నిట్లు 13.

ఉ. పొందెద వీవు రాజ్యమును బొందఁడు కోరిక రావణుండు నే
సందియ మిందు లేదు సుతు సైతము మోహము రామలక్ష్మణుల్
డెందము నందు వీడెదరు లేవి వధింతురు బంధు యుక్త మా
నిందితుఁ డైన రావణు ననిన్ రుజ కిర్వురు కాదు పీడితుల్ 14.

తే.గీ. ఊఱడించి విశ్వాసము నుచిత రీతి
నొసఁగి యవ్విభీషణునకు నుండఁ దనదు
మామ పార్శ్వమున సుషేణుఁ డేమఱక వ
చించె నిట్లు సుగ్రీవుఁడు  గాంచి యపుడు 15.

తే.గీ. సంజ్ఞ వడసిన రామలక్ష్మణుల నరి ద
మనులఁ గొనిపొమ్ము కిష్కింధకు నృవరులను
శూర హరిగణములఁ గూడి క్రూరు రావ
ణాసురునిఁ జంపి సగణమ్ము నాజి నేను 16.

ఆ.వె. మైథిలి వెసఁ దెత్తు మానితముగ లంక
నుండి యా పురందరుండు పోయి
నట్టి రాజ్య మెల్ల నరసి నట్టి పగిది
ననిన విని సుషేణుఁ డనియె నిట్లు 17.

చం. నడవఁగ దేవ దానవ రణం బది ఘోరతరమ్ము దారుణం
బడరుచు శస్త్ర విత్సురల నస్త్రవి దాసుర కోటి కొట్టగం
బడిన విసంజ్ఞ నార్తులకు బాధ బృహస్పతి తీర్చె విద్యచే
విడుతలు పెక్కు లోషధులఁ బేరిమి వేగము మంత్ర వాక్కులన్ 18.

తే.గీ. విగత జీవుల బ్రతికించె వింత నట్టి
యౌషధమ్ములఁ దేవలె హరివరేణ్యు
లరిగి సంపాతి పనసాదు లతి రయమునఁ
బాల సంద్రమున కడరి త్వరితముగను 19.

ఆ.వె. శైల తటము లందు సంజీవకరణి వి
శల్య లుండు భేషజముల నెఱుఁగు
వార లీ ప్లవగులు భవ్యౌషధమ్ముల
దేవ నిర్మితములు దివ్యములును 20.

చం. అమృతముఁ జిల్కి రెండుఁ దొలి యట్టి సముద్రములో సురాలి జం
ద్ర మనఁగ నింక ద్రోణ మన రాజిలు పర్వత యుగ్మ ముంచ శై 21.

లములఁ జెలంగు నోషధులు రాజ! మరుత్సుతుఁ డేగ నొప్పు వే
గమ హనుమంతుఁ డత్యధిక కాయుఁడు ధీరుఁడు వేగవంతుఁడున్

చం. మెఱపుల తోడ మేఘములు మీఱఁగ వాయువు వీచె నంతలోఁ
దఱచుగఁ జిమ్మఁ దోయము లుదాకర మందు ధరాధరమ్ములన్
వెఱ పిడ నూఁపు నట్లు లనిపింపఁగ ఱెక్కల గాలికిం దరుల్
విఱిగి మునుంగ ద్వీపములఁ బెర్గిన వెల్ల జలమ్ములో వెసన్ 22.

తే.గీ. పన్నగము లెల్ల భీతిల్లె మిన్నగ నట
నచట నున్న యాదస్సులు నహులు నెల్లఁ
దూఱె నంతఁ బారావార తోయ రాశి
వేగముగ పాఱె తద్దయు వెఱపు సెలఁగ 23.

కం. కని రా ముహూర్తమున గరు
డుని వానరు లా వినత కొడుకు నగ్ని వలెం
గన లెడు వాని మహా వీ
ర్యుని నాశ్చర్యముగ నప్పు డుత్సాహమునన్ 24.

కం. శర బద్ధులు బలవంతు ల
గు రామలక్ష్మణుల నటులఁ గూల్చిన వగు నా
యురగమ్ములు బంధనమున
గరుడుం గని రాఁగఁ బాఱెఁ గ్రన్నన భీతిన్ 25.

ఉ. అంత స్పృశించి రాఘవుల నా గరుడుండు స్తుతించి తాను ధీ
మంతులఁ జేతులన్ నిమిరె మానుష వర్యుల యాననమ్ములం
గాంతినిఁ జంద్ర తుల్యములఁ గశ్యప నందనుఁ డట్లు తాఁకఁగా
వింతగ మానె గాయములు వెల్గెను నున్నగ వారి కాయముల్ 26.

తే.గీ. పెరిగినవి రెండు రెట్లుగ వీరి తేజ
ము బల ముత్సాహ మా వీర్యము స్మృతి బుద్ధి
సుప్రదర్శన మోజయు సుగుణములును
జక్కఁ గాకుత్స్థులకు మానుషర్షభులకు 27.

ఆ.వె.	వారిని గరుడుండు వాసవోపములను
దిట్ట యైన వాఁడు తేజ మందుఁ
గౌఁగి లించుకొనియెఁ గాకుత్స్థులను రాముఁ
డంత సంతసించి యనియె నిట్లు 28.

ఉ.	పాటున నున్న యిద్దఱము పన్నుగ రావణి దత్త మాపదన్
దాఁటితి మెల్ల నీకరుణఁ దద్ద బలమ్మును బూర్వ రీతినిం
బాటిలఁ జేసి తీ విటకు వచ్చిన నా జనకుం బితామహున్
మేటి బలుండ! గాంచు గతి   మిక్కిలి నే నెద హర్ష మందితిన్ 29.

ఉ.	ఎవ్వర వీవు రూపమున నింపుగ నుంటివి దివ్యమాల లం
దివ్వర దివ్య భూషలను నివ్విమలాంబర ధారివై కడున్
నివ్వటిలంగ లేప్యములు నెమ్మినిఁ గన్పడు చుంటి వయ్య! నీ
విప్వివరమ్ములం జెపుమ యెల్లను  మాకు సవిస్తరమ్ముగా 30.

తే.గీ.	పైన తేయుఁడు తేజస్వి బల్లిదుండు
పలికె వాక్యమ్ము లిట్లంగి పక్షిరాజు
కనులు విప్పార హర్షమ్ము దనర మిగుల
నంతఁ బ్రీతాత్ముఁడై నలినాక్షు  నరసి 31.

ఆ.వె.	నీకుఁ బ్రియ సఖుండఁ గాకుత్స్థ! నే గరు
త్మంతుఁడను వెలుపల  మసలు ప్రాణ
మేను నీకు మీకు నే నొనరింప సా
యమ్ము వచ్చినాఁడఁ జుమ్ము వేగ 32.

తే.గీ.	అసురు లమ్మహా వీర్యులు నైన వాన
రులు మహా బలు లయిన సురలు శతక్ర
తువును గంధర్వులను గూడి తొలఁగఁ జేయ
లేరు శరబంధనమ్మును దారుణమును 33.

తే.గీ.	చేసె మాయా బలమ్మునఁ జెలఁగి యింద్ర
జిత్తు క్రూర కర్ముఁడు దీని శిత దశనలు
వీరు విష నాగు లగు కాద్రవేయు లసుర 34.

మాయ శర రూపములఁ బట్టి రీయెడ మిము

చం. నరవర భాగ్యవంతుఁడవు న్యాయ మెఱింగిన వాఁడ వీవు స్వీ
య రిపు వినాశకుం డగు మహాత్ముని లక్ష్మణు తోడ నాజిలో
నరయగ  రాఘు వోద్వహుఁడ! యంచిత సత్యపరాక్రముండ! నేఁ
ద్వరిత మెఱింగి మీ చరిత వచ్చితి స్నేహము నెంచి ప్రీతినిన్ 35.

తే.గీ. విడువఁ బడి రిర్వురును ఘోర విశిఖ బంధ
నమ్ము నుండి మీ కింక నిత్యమ్ము నప్ర
మత్తత యగు కర్తవ్యమ్ము మనుజ వర్యు
లార! కూట యోధు లసురు లాజి లోన 36.

కం. బలమగు నార్జవమే శూ
రులకును బరిశుద్ధ భావ రోచిస్సులకున్
బలవంతులార! మీ కన
ఘులార! కాకుత్స్థులార! గురుతర మనిలో 37.

తే.గీ. కారు విశ్వాసనీయులు కయ్యమందు
రామ!  రాక్షసులు నిరంతరమ్ము వక్ర
బుద్ధు లనుటకీ వృత్తాంతము తగ నగు ని
దర్శనం బని యప్పక్షి ధవుఁడు పలికి 38.

తే.గీ. కౌఁగిలించి రాము ననుజ్ఞుఁ గరము ప్రీతి
నడుగఁ దొడఁగె సఖ! రిపుల కయిన వత్స
లుండ వొసగు మనుజ్ఞ ఘనుండ! నేఁ జ
నెద యథా సుఖం బని వేఁడి ముదము తోడ 39.

ఆ.వె. కౌతుకమ్ము వలదు కాకుత్స్థ! మిత్రత్వ
మెట్టి దంచుఁ గోరు నట్టి నీకుఁ
గర్మము నొనరింపఁ గయ్యమ్ము నందు స
ఖిత్వ మెఱుకపడును సత్వరమ్ము 40.

తే.గీ. లంకను రఘువీర! శర జాలమ్ము తోడ 41.

బాల వృద్ధులు మాత్రము బ్రతుకు రీతిఁ
జేయు వాఁడవు రావణుఁ జీల్చి రిపుని
సీతను గ్రహింతువు కరము ప్రీతి తోడ

ఉ. పేరిమి పల్కి శీఘ్రతర విక్రముఁ డిట్లు సుపర్ణుఁ డింపుగా
నా రఘువీర పుంగవుని నట్టు లరోగునిఁ జేసి యమ్మహా
వీరులు సూచుచుండఁగఁ గపిప్రవరుల్ దమిఁ దాఁ బ్రదక్షిణం
బారసి రాముఁ జేసి రతి నక్కునఁ జేర్చి చరించె నింగినిన్ 42.

తే.గీ. పవను భంగిని వెడలు సుపర్ణుఁ గాంచి
రోగ హీనులై నట్టి పురుష వరేణ్యు
లఁ గని సింహనాదములు సెలంగఁ జేసి
రంతఁ గపి యూధపులు తోఁక లద్రువ నెల్ల 43.

తే.గీ. మున్నటి వలె నఱచుచుఁ గపులు మృదంగ
ములను మొత్తిరి మ్రోయించి రలరి దుందు
భులను జెలఁగి యూదిరి శంఖములను సంత
సమ్ము డెందమ్ముల భృశము సంతరింప 44.

తే.గీ. చఱచి చఱచి జబ్బలు సాల సంచయాయు
ధులు మహా కపి వీరులు ద్రుమము లెత్తి
వివిధముల వంద లింకను వేల కొలఁది
నిలిచి రచట విక్రాంతులు కలఁత వీడి 45.

తే.గీ. విడుచుచు సుఘోర నాదము లడరి మిగుల
నసురులను భయపెట్టుచు నత్యధికము
యుద్ధ కాములు వానరు లుగ్రు లగుచుఁ
జేరి రంత లంకా పుర ద్వారములను 46.

కం. వానర రవములు భీమము
లై నెగడె నపుడు వినంగ నట భయదము లై
కానఁగ నుష్ణాంత ఘున
ధ్వానము భంగి నిసి యం దవారిత రీతిన్ 47.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నేఁబదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 51.

వానరుల ఘోర శబ్దములను రాక్షసుల తోడ రావణుఁడు విని రామలక్ష్మణులు బ్రతికి యున్నట్టు లెఱింగి వారిని వానర సైన్య మెల్లను జంప ధూమ్రాక్షునిఁ బంప నాతఁడు యుద్ధమునకు సనేన వెడలుచు దుర్నిమిత్తములను గని విషణ్ణుఁ డగుట.

కం. వినె రావణుండు రక్కసు
లను గూడి కడింది కూఁకలఁ జెలంగుచు ను
న్న నగచరుల తేజస్వుల
ధ్వనులను  ఘోరముల నెల్ల దశముఖుఁ డంతన్ 1.

తే.గీ. సాంద్ర గంభీర నిర్ఘోష సంయుత నిన
దముల నాలకించి యతఁడు తద్ద సెలఁగ
నంత మంత్రుల మధ్య దశాననుండు
పలికె వచనమ్ము లిబ్బంగిఁ బార్థివుండు 2.

ఉ. పుట్టెను మిక్కుటమ్ముగను మోదము సందియ మిందుఁ గాన మి
ప్పట్టున మేఘ నాదముల పాటిగ వానరు లార్చుచుండగాఁ
దట్టుచు నుండె డెందమున ధ్వానము లెల్లెడ రేఁగ సంద్రమే
గట్టిగఁ గంపితంబు నయి కన్పడు చుండెను జూచు చుండగా 3.

ఉ. కట్టఁగ రామలక్ష్మణులఁ గాండ సమూహము రేఁగ నక్కటా
బెట్టిదముల్ నినాదములు పెల్లుగఁ బుట్టి యెడంద శంకయే
పుట్టుచు నున్న దిప్పు డని ముఖ్యుల మంత్రుల తోడఁ బల్కి య 4.

ప్పట్టునఁ జెంత నున్న తన వారినిఁ గాంచి వచించె నిట్టులన్

చం. తెలిసి కొనుండు సంతస మతీతము కోఁతుల కేల కల్గెనో
తలఁపఁగ శోక కాలమునఁ దద్దయు వింత యనంగ నంత వా
రలు విని యట్లె యంచు వెస రాక్షసు లెక్కిరి చుట్టు గోడలన్
విలసిల రామలక్ష్మణుల వీడఁగ బంధము గాంచి రత్తఱిన్ 5.

తే.గీ. కనిరి సుగ్రీవ పాలితమ్మును బ్లవంగ
సైన్య మెల్లను జెలఁగ నుత్సాహమున వి
షాద మందిరి గాంచి రాక్షసులు కరము
దిగిరి ప్రాకారము సెదల వగపు నిండ 6.

చం. కదిసిరి తప్త చిత్తు లయి కాంతి విహీన నిజాస్యులై వెసన్
విదితము సేసి రప్రియము భీతిని భాషణ వేత్త లిట్టు లం
త దశముఖున్ విభుం గని సుదారుణ సాయక బద్ధ రాఘువుల్
కుదురుగఁ బాశ ముక్త ఘన కుంజర సన్నిభు లైరి ముక్తులై 7.

తే.గీ. ఇంద్ర జిత్తు శరముల బంధింపఁ బడిన
వారు కదలని భుజముల వారు సమర
తలము నందుఁ గనఁబడిరి ములుకుల చెఱ
తొలఁగ గజ సన్నిభ పరాక్రములు నృవరులు 8.

కం. విని వారి మాటలు దశ వ
దనుండు బల్లిదుఁడు క్రోధ తాపాన్వితుఁ డ
య్యెను దూర్ణమ్ము ముఖము ల
య్యె నప్పుడు వివర్ణములుగ నేఁపు సెలంగన్ 9.

చం. శరములఁ బన్న గాభముల సద్వర సంయుత భాసితమ్ము లి
ద్ధ రవి సమాన తేజముల దాఁట నశక్యము లైన వానిచేఁ
గరము మథింప నింద్రజియె కట్టు వడంగ విముక్తు లైన నా
దు రిపులు గాంతు నా బలము తోరము సంశయ మందు నున్నటుల్ 10.

ఆ.వె. మున్ను సమర మందుఁ జెన్నుగ నా రిపు 11.

కోటి జీవములను గొన్న శరము
లిపుడు నిష్ఫలము లయి నిలిచె నక్కట
వాసుకి సదృశప్రభ లవి యెల్ల

కం. అని యిట్లు నిశ్వసించుచుఁ
గినిసి మహా పన్నగము పగిది ధూమ్రాక్షుం
గని రక్కసుల నడుమ నసు
రునిఁ బల్కె వచనము లిట్లు రోషము మీఱన్ 12.

తే.గీ. భీమ విక్రముండవు నీవు వీర రాక్ష
సుల మహా సైన్యముం గొని శూర! యేఁగు
మ వడి వానరులను గూడి నృవర వర్యు
రాఘువుని వధింపఁగ సత్వరమ్ము సెలఁగి 13.

చం. అన నసురేంద్రుఁ డిట్లు విని యాతని కంత నమస్కరించి ధూ
మ్ర నయనుఁ డాత్మ సంతసము రాజిల వీడి నృపాలయమ్ము పే
చని తగ దాఁటి ద్వారమును సైన్యపు నేతను గాంచి పల్కె సే
నను ద్వరితమ్ము సేయు మని నాకు రణార్థికి నేల జా గిటన్ 14.

ఆ.వె. తూర్ణము బల నేత ధూమ్రాక్షు మాటల
నాలకించి రావ ణాజ్ఞ నడరి
యంత సైన్య మెల్ల నాయత్త పఱచె శీ
ఘ్రమ బలానుగుండు రమ్యముగను 15.

ఉ. గంటల నంతఁ గట్టుకొని గ్రన్నన రక్కసు లెల్ల బల్లిదుల్
మింటిని నంట నార్చుచు నమేయ ముదమ్మున విఱ్ఱవీఁగుచున్
వెంటఁ జరింపఁ జుట్టుకొని వీరులు వచ్చిరి ధూమ్ర లోచనుం
గంటికి ఘోర రూపు లయి కయ్య మొనర్ప సుసంభ్రమమ్మునన్ 16.

ఉ. ఆయుధ హస్త రాక్షసులు నంచిత ముద్గర శూలపాణు లిం
కాయస సుప్రభా ముసల హస్తులు దండ గదా కరుల్ వ రా
మేయ పరశ్వథమ్ములను మించిన హస్తులు భల్ల పాశముల్
మోయు సుహస్తులుం బరిఘ భూషితు లింక సభిందిపాలురున్ 17.

తే.గీ. మేఘముల భంగి నార్చుచు మేటి బలులు
ఘోర విక్రములు కవచ ధారులు ధ్వజ
భూషిత సువర్ణ జాల సంపూరిత రథ
ముల బహువదన ఖర యుతములఁ దరలఁగ 18.

తే.గీ. కొంద అతి శీఘ్రగాము లగు హయముల ప
యి నితరులు మత్త కరుల పయి వెడలంగఁ
బులులఁ బోలు నైరృత పుంగవులు వెస సనఁ
దొడఁగిరి రణ భూమి కపుడు దుస్సహముగ 19.

ఆ.వె. ఖరము వంటి యెలుఁగు గలవాఁడు ధూమ్రాక్షుఁ
డెక్కె రథము నంతఁ జెక్క మృగము
సింగము తలలను బసిండి నగల వెలిఁ
గెడు ఖరములు లాగ నడరు బండి 20.

కం. వెడలె నతఁడు ధూమ్రాక్షుఁడు
పడమటి ద్వారమ్ము నుండి పావని హనుమం
తుఁడు నున్న చోటు నుండియె
వడి వడి యసు రావృతుఁ డయి వఱలఁగ నగవుల్ 21.

కం. వారించె నింగి నిల్చిన
క్రూర విహంగమ్ము లేఁగ ఘో రాసురునిం
దా రథ వరమున నుండఁగ
మూరుచు ఖరములు వడిఁ బెను మ్రోతల లాగన్ 22.

ఆ.వె. వ్రాలె భీకరంపు గ్రద్ద రథాగ్రము
నందు గుములు కట్టి యంత నెగిరి
చేరె ధ్వజము ముందుఁ జెలఁగి రాబందులు
పుడమిఁ బడె రుధిరపు మొండె మపుడు 23.

ఆ.వె. వింత స్వరము తోడ భీమ ధూమ్రాక్షు స
మీప మందు నింక నాప కుండ 24.

రక్త వర్షము వడె దిక్తటమ్ములఁ జలి
యించె భృశము భూమి యెల్ల నంత

కం. వీవం దొడంగె నెదురుగ
నా వాయువు పిడుగుఁ బోలు నట్టి స్వనము నం
దే వెలుఁగు లేక నల్దిశ
లావృతమై చీకఁటి యట నలమఁగ నుండెన్ 25.

చం. పొడమిన దుర్నిమిత్తముల మొత్తములన్ సు భయావహమ్ము ల
ట్లడరఁగ రాక్ష సావలికి నాతఁడు రాక్షస నేత గాంచఁగా
బెడిదపు దుఃఖ మందె నతి భీతి సెలంగ నెడంద నంతటన్
నడచుచు ముందు మోహమును నైరృతు లెల్లరు పొంది రత్తఱిన్ 26.

తే.గీ. గాంచె నచ్చట ధూమ్రాక్షుఁ డంచి తాసు
ర నిచ యావృతుండై సమర రత చిత్తుఁ
డబ్బలుఁడు రామ పాలితం బగు మహౌఘు
కల్పముఁ బ్లవగ సేన ననల్ప బలము 27.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నేఁబది యొకటవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 52.

ధూమ్రాక్షుని నాయకత్వమున రాక్షసులకు వానర సైన్యమునకు ఘోర యుద్ధము జరుగఁగా నందు రాక్షసులు వానరులు ననేకులు మరణింప హనుమంతునిచే ధూమ్రాక్షుఁడు హతుఁ డగుట.

కం. కని ధూమ్రాక్షుఁ గదియు వా
నిని భీమ పరాక్రము నట నినదించిరి యె 1.

ల్ల నగచరు లంత సంతస
మున యుద్ధ రతాత్ముులు భృశముగ వీరవరుల్

తే.గీ. సంకుల సమరం బప్పుడు సంతరిల్లె
హరి నిశాచర వీరు లొకరిని నొకరు
కొట్టు చుండంగఁ బాదప ఘోర శూల
ముద్గరమ్ముల మిన్నగ మూరి మూరి 2.

చం. అసురుల చేత వానరులు నప్పరిఘమ్ములచేఁ ద్రిశూల ప
ట్టిసములచే నశింపఁగ వడిన్ సమరమ్మున వానరాళి చే
త సమసి రంత రక్కసులు దారుణ పాదప ఘాతులై వెసం
గసి చెలఁగంగ రాక్షసులు కాండము లేయఁగఁ గూలి రా హరుల్ 3.

తే.గీ. కూట ముద్గర గదలను ఘోరతరము
కొట్టి చీల్చిన నసురులు కుందియు బల
వంతులు భయమ్ము సెందక వాన వర్యు
లలిగి కర్మము లొనరించి రద్భుతముగ 4.

చం. శర చయ దారి తాంగులును శస్త్ర స శూలవిదారి తాంగులున్
హరి వరు లశ్మ పాదప చయమ్ముల నూని బలాన్వితుల్ వెసం
గరములఁ బల్కి నామములు కయ్యము నందుఁ జెలంగి యార్చి కొ
ట్టిరి కని నంత రాక్షసుల తీవి సెలంగ సుదారుణమ్ముగన్ 5.

కం. వానర రాక్షస యుద్ధము
నానా విధ శిలల నింక నానా తరులం
గానఁగ నక్కజ మయ్యె న
హీనంబై ఘోర తర మయి భయావహమై 6.

తే.గీ. గెలుపున వెలుంగు నా వానరుల కరముల
నలిఁగి రసురులు కొంద ఱాననముల రుధి
రమ్ము క్రక్కిరి కొందఱు రక్కసు లని
వెక్కసమ్ముగ నెత్తురు పీల్చు వారు 7.

తే.గీ. రక్కసులు గొందఱికి వారి ప్రక్క లెల్లఁ
జీల్పఁ బడ్డవి కొందఱు చెట్లఁ బ్రోగు
లైరి కొందఱు సున్నము లైరి ఱాళ్లఁ
బండ్ల నింకఁ గొందఱు సీల్పఁ బడిరి యాజి 8.

తే.గీ. విఱిగిన ధ్వజములఁ బడిన వీర ఖడ్గ
ములను గూలినవౌ రథములఁ బతితులు
కా నిశాచరు లప్పుడు కలఁత సెంది
రాజి లోన కొంద ఱసురు లాత్మ లందు 9.

ఉ. కోఁతులు పైవ బల్లిదులు కొండల ముక్కలు భండనమ్మునన్
జాతి గజమ్ము లద్రి వర సన్నిభముల్ ధరఁ గూలఁ దూలుచున్
రౌతులఁ గూడి గుఱ్ఱములు వ్రాలఁగఁ దూర్ణము నిండె నంత నీ
భూతల మెల్లఁ గీర్ణ మయి ప్రోవుల తోడుత భీకరమ్ముగా 10.

తే.గీ. ఎగిరి యెగిరి వేగమ్ముగ నెల్ల హరులు
సమర విక్రాంతు లంతఁ దీక్ష్ణ తరము లగు
నిజ నఖమ్ములఁ బగవారినిఁ గని గీరు
చుండిరి ముఖముల నసుర శూర వరుల 11.

ఆ.వె. కూలి రవని మీద ఘోర రాక్షసు లంత
రంగు లాననముల రగిలి మార
జుట్టు చిక్కులు వడ శోణిత గంధమ్ము
చేత మోహితు లయి చేవ తఱుఁగ 12.

చం. పరువిడ నన్య రాక్షసులు భైరవ క్రుద్ధులు వానరాళిపైఁ
గర తలముల్ మహాశని నికాశము లెత్తి రయమ్ము మీఱఁగా
నరయుచు వేగ వంతముగ నా హరి యూథపు లంత ముష్టులం
జరణము లింక దంతముల సాల వరమ్ముల మోది రెల్లరన్ 13.

ఆ.వె. కాంచి పాఱ బలము కలఁగి ధూమ్రాక్షుఁడు
రాక్షసర్షభుండు రణము చేయు
వాన రోత్తములను బలిమిని సమయింపఁ 14.

దొడఁగె రోష మూని దోర్బలుండు

ఉ. వానరు లందు కొంద ఱనిఁ బ్రాసములం బ్రహరింపఁ గాఱ నా
మేనులఁ నుండి శోణితము మేదినిఁ గూలిరి శోలి యన్యులా
వానరు లింక భూమి పయి వ్రాలిరి ముద్గర ఘాతులై వెసన్
వానరు లన్యు లా పరిఘ పట్టిస ముఖ్య వరాయుధమ్ములన్ 15.

తే.గీ. తడిసి నెత్తుటఁ గొందఱు ధరణిఁ గూల
వాన రానీక మందు నపారముగను
దఱుమఁ గ్రుద్ధ రాక్షసు లని వెఱచి పాఱఁ
గనఁబడని వార లితరులు కయ్య మందు 16.

తే.గీ. ఒక్క ప్రక్క నిద్రించిరి ముక్కలుగను
గుండె లవియంగ  గొందఱు ఘోరముగఁ ద్రి
శూలములఁ జీల్పఁ బ్రేవులు నేల వ్రాల
గూలి రన్యులు గొందఱు తూలి తూలి 17.

కం. వానర రాక్షస సంకుల
మైన మహా రణము ఘోర మయ్యె ద్రుమ శిలా
నానా శస్త్ర సమాకుల
మై నినదమ్ములు సెలంగ  నత్యధికముగన్ 18.

తే.గీ. వింటి నారుల చప్పుళ్లు వెలయఁ దీఁగ
ల మధుర రవము లయి హిక్క లమరఁ దాల
ము లయి మంద వచనములు మూర గీత
ములుగ యుద్ధ సంగీతము వెలసె నపుడు 19.

ఉ. కక్ష వహించి నవ్వుచును గయ్యమునం గపి సేనఁ ద్రోలె ధూ
మ్రాక్షుఁడు నాల్గు దిక్కులకు నమ్ముల వృష్టిని నాంజనేయుఁ డా
దక్షుఁడు సేసి వీక్షణము దానిని నర్దిత సేన నవ్విధిన్
రూక్షత నెత్తి పెద్ద శిలఁ గ్రుద్ధుఁడు మార్కొనెఁ గ్రూర రాక్షసున్ 20.

తే.గీ. కినిసి రెట్టింపు తామ్రాక్షుఁ డనిల సుతుఁడు 21.

పితృ సమాన పరాక్రముఁ డతుల బలుఁడు
కాంచి ధూమ్రాక్షు రథమును మించి పైచె
నమ్మహా శిల నరదమ్ము నందు వేగ

కం. కని వచ్చెడు నా ఱాతినిఁ
గొని సంభ్రమమున నసురుఁడు ఘోరపు గదఁ జ
య్యన నుఱికి తనదు స్యందన
ము నుండి చక్కఁగ నిలిచెను భూతలము పయిన్ 22.

ఆ.వె. చక్ర కూబర హయ సధ్వజ స శరాస
నములఁ గూల్చి రథము నంత నమ్మ
హా శిల పడె నప్పు డవని పై వేగము
గ విసరంగ నడరి కపి వరుండు 23.

చం. అరదముఁ జేసి ముక్కలుగ నవ్విధి మారుతి బోదె కొమ్మలం
బరఁగెడు వృక్షరాజముల బల్మిని రాక్షస వీర హింసనున్
విరివిగఁ జేయ రక్కసులు వీత శిరమ్ములఁ గాఱ నెత్తురే
ధరణినిఁ గూలి రంతఁ దరు తాడిత గాత్రులు మ్రగ్గి రన్యులున్ 24.

కం. అసురుల బలమ్మును దఱిమి
వెస గిరి శిఖరం బొకండు పెద్ద కరములం
బొసఁగం జేసి కొనుచు న
య్యసురుని ధూమ్రాక్షు నంత నని మార్కొనియెన్ 25.

తే.గీ. కాంచి వచ్చెడు హనుమంతుఁ గపి వరేణ్యు
నెదురు పర్విడె నార్చుచు నుదరి విక్ర
ముండు గద నెత్తి కడు దర్పితుండు వేగ
మడర ధూమ్రాక్షుఁ డాగ్రహం బంది యంత 26.

ఆ.వె. కంటకమ్ము లున్న గదను గోపించిన
ట్టి హనుమంతు నతి కఠినపు మస్త
కమ్మున వెస మొత్తె పమ్మి ధూమ్రాక్షుఁడు
కోపమునఁ  జలించి ఘోరముగను 27.

చం. తగిలిన భీమ వేగమునఁ దద్గద వాయు బలుండు దాని విం
తగ గణి యింప కించుకయుఁ దద్దయుఁ బెద్ద శిలన్ శిరమ్ముపైఁ
బగఁ గొని వైచె మధ్యమునఁ బర్వత సన్నిభ మంత రావ ణా
నుగుఁడు చలింప గాత్రములు నోయుచుఁ గూలె ధరాతలమ్మునన్ 28.

కం. మరణింపఁగ ధూమ్రాక్షుం
డరసి నిహత శేషు లసురు లంతట లంకా
పురమునకు వధ్య మానులు
హరి గణములచే వెడలిరి యడలి రయమునన్ 29.

తే.గీ. చంపి శత్రులఁ బాఱించి సద్యశస్వి
యాజి రక్తపు టేరుల నాంజనేయుఁ
డలసి సుంత పూజింపఁగ హరులు దనను
ముదము నందె నెదఁ బవన పుత్రుఁ డపుడు 30.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నేఁబది రెండవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 53.

ధూమ్రాక్షుని మరణము నాలకించి రావణుఁడు క్రుద్ధుండై వజ్రదంష్ట్రుఁ డను క్రూర రాక్షసుని రామ లక్ష్మణ సుగ్రీవులను ససేన వధింప నాదేశింప నతఁడు నంగదఁ డున్న దక్షిణ ద్వారము నుండి వెడలి వాన రానీకముతో ఘోర యుద్ధము సేయుట.

కం. విని ధూమ్రాక్షుని మరణము
కినుక సెలఁగ నిశ్వసించి కెరలిన సర్పం
బన నుష్ణమ్ముగ రావణుఁ 1.

డనెఁ గ్రూరుని వజ్రదంష్ట్రు నారసి యసురున్

తే.గీ. వెడలు మీవు ససైన్యము వీర! చంపు
మడరి దాశరథిని రాము నాజి లోన
వానరులను సుగ్రీవుని వడి నని పలు
కంగఁ గ్రోధమూర్ఛిత దశకంఠుఁ డంత 2.

చం. అన విని పల్కి యట్లె యని యా యసురేంద్రుని తోడ ఘోర మా
యను నిపుణుండు రాక్షస బలావృతుఁడై వెస వజ్రదంష్ట్రుఁడుం
జనె హయ కుంజ రోష్ట్ర ఖర సంయుత చిత్ర పతాక భూషితే
ద్ధ నిజ శతాంగ సంయుతము తద్ధయు ధీరత సంభ్రమమ్ము నన్ 3.

తే.గీ. గురు విచిత్ర కేయూర మకుట విభూషి
తుండునై తనుత్రాణము తూర్ణము ధరి
యించి ధనువుం గొని త్వరిత మంచితమును
వెడలఁ దొడఁగె రయమ్ము న వీర వరుఁడు 4.

కం. సపతా కాలంకృత రథ
మపుడు పసిడి మయము నంత నతి దీప్తమ్మున్
విపులపు భక్తిం గదిసి త
దుపరిఁ బ్రదక్షిణ మొనర్చియు సముద మెక్కెన్ 5.

సీ. చేతి కట్టిలు పెను చిల్లకోలలు నున్నని వగు రోకళ్లును లవుణు లింక
విల్లులు నీటెలు పెన్నడ్డ కత్తులు కత్తులు గొడ్డళ్లు ఖడ్గములును
జక్ర గ దాదిగ శస్త్రము లూని కాల్బంట్లు కదలి రంతఁ బవరమునకుఁ
జిత్ర వస్త్రమ్ముల నాత్రమ్ముగను దీప్త రాక్షస పుంగవ వ్రాత మెలమి
తే.గీ. మత్త గజ రాజముల నెక్కి నుత్తమములఁ
బర్వతములు చలించు నట్లుర్వి నడవ
వార లెక్కిన గజములు భండనమున
నేర్పరులు లక్షణమ్ముల నెగడు బలులు 6.

చం. తరలెడు రాక్షసధ్వజిని తద్ద వెలింగెను వర్షకాల స
త్వర జని తాభ్ర సన్నిభము దాల్పఁ దటిత్తు సగర్జనమ్మునున్ 7.

వర కపి వీరుఁ డంగదుఁడు పన్నుగ నిల్చిన యట్టి ద్వార మం
ద రణ నిమిత్త మేఁగిరి యతంద్రిత రాక్షస వీరు లెల్లరున్

చం. బల మది యేఁగు చుండ నశుభమ్ములు వుట్టెను మిక్కుటమ్ముగా
నిలఁ బడె నుల్క లంత ఘన హీన నభమ్మున నుండి యింక న
క్కలు భయదంపుఁ గూఁతలను గక్కుచు మంటలు గూసె నష్టు వ్యా
కులముగ రాక్షసక్షయము ఘోరముఁ దెల్ప మృగమ్ము లార్వఁగా 8.

తే.గీ. తొట్రు వడి తూలి రరుగంగఁ దోర మసుర
వీరు లపుడు దారుణముగ వీని నరసి
వజ్రదంష్ట్రుఁ డుత్పాత నివహము లూని
ధృతినిఁ దేజస్వి చనె రణ రతిని బలుఁడు 9.

కం. హరులు జిత కాశు లారసి
తరలెడి రాక్షస బలమును దత్క్షణమునఁ జే
సిరి నాదమ్ములు ముదము త
నర నిండ దశదిశ లెల్ల నగచర వీరుల్ 10.

తే.గీ. అంత వర్తిల్లెఁ దుములంపు హరుల రక్క
సుల మహాయుద్ధమే యొండొరుల వధింప
నెంచు భీమ రూపుల మధ్య మించి నట్టి
ఘోరుల నడుమఁ జెలఁగుచు దారుణముగ 11.

ఆ.వె. రాగ నుత్సహించి రణమునఁ దెగినట్టి
కంఠ గాత్రములను గాఱు నెత్రు
తడిసి నట్టి సర్వ తను భాగముల ధరఁ
గూలి రయ్యిరు గడ ఘోరముగను 12.

చం. పదపడి యన్యులుం బరిఘ పాణులు శూరులు వైచి రెన్నియో
బెదరక శస్త్ర రాజములు పెన్కకుఁ దిర్గని వారు కయ్య మం
దుదరుచుఁ జెట్లఁ బెన్శిలల యుద్ధ తలమ్మున శస్త్ర శబ్దముల్
హృదయ విదారకమ్ములు ననేకము లత్తఱి రేఁగె ఘోరముల్ 13.

ఆ.వె. చక్ర ఘోష లింక శంఖ భేరీ మృదం
గముల ఘోర నిస్వనములు భీమ
చాప నర్దనములు వ్యాపింప నెల్లెడ
ధ్వనుల ఘోర మయ్యెఁ బ్రధన మపుడు 14.

ఉ. కొందఱు వీడి యస్త్రముల ఘోరులు సేసిరి బాహు యుద్ధమే
యం దఱచేతులం దరుల నంఘ్రుల ముష్టుల భీమ జానులం
గొందఱు భగ్న దేహు లయి కొందఱు నల్గఁగ ఱాల్ల వానరుల్
సిందులు వేయఁ గూలిరి విశేషముగా నసురేంద్రు లార్చుచున్ 15.

కం. శర పంక్తి వజ్రదంష్ట్రుఁడు
హరుల కొసఁగెఁ ద్రాస మంత నాజి భృశముగం
దిరుగుచు స్థిరముగ బాశము
ధరియించిన యంతకుఁ డనఁ దత్ప్రళయమునన్ 16.

కం. బలవంతులు నానాస్త్ర వి
దులు నానా ప్రహరణముల దురమున హరులన్
బలిమిం జంపిరి రాక్షసు
లలుకన్ మూర్చితులు నంత నత్యధికముగన్ 17.

కం. ద్విగుణీకృత కోపమ్మునఁ
దెగ నఱకెను వాలి సుతుఁడు ధృతి రక్కసులన్
జగతిఁ బ్రళయమ్మున ననలు
ని గతి నుదరి యంగదుండు నిర్భీతుండై 18.

చం. అసుర గణమ్ము నెల్ల ఘనుఁ డంగదుఁ డెత్తి మహా ద్రుమమ్ములన్
వెస హరి వీరుఁ డాగ్రహపు వెల్లువ జంపెను క్షుద్ర జన్ములం
గసి సమయించు కేసరి నికాశము శక్ర నిభుండు సేసె హిం
స సమర మందు నుగ్రుఁడు భృశమ్ముగ రక్త విలోచనుండునై 19.

ఆ.వె. కొట్ట నంగదుండు క్రూర భీమాసురు
లచటఁ దెగిన తలల నవనిఁ గూలి
రపుడు నఱకఁ బడిన యట్టి పాదపముల 20.

భంగిఁ దత్క్షణంబ భండనమున

తే.గీ. పుడమి భీతికరం బయ్యెఁ బడఁగఁ దేరు
లింక చిత్రధ్వజమ్ములు సెల్ల గుఱ్ఱ
ములు గపుల రాక్షసుల తనువులు రుధిరము
నందు మునిఁగి నిండుగ నెల్ల నందు నిందు 21.

కం. హారముల వస్త్రములఁ గే
యూరమ్ముల ఛత్రములను నుర్వి రణమునన్
శారద రాత్రి వలె వెలిఁగె
నారయ నప్పుడు కడింది యక్కజ మెసఁగన్ 22.

కం. గాలికి నల్లాడెడు మే
ఘాలి కరణి నంగదుని మహా ప్లవగుని ధీ
శాలి మహా వేగమునకుఁ
దాళం జాల కసు రాలి తద్ద చలించెన్ 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నేఁబది మూడవ సర్గము.

# యుద్ధ కాండము

# సర్గము 54.

రాక్షస బలక్షీణము నంగదుని బలమును గాంచి కోపావిష్టుఁడై వజ్రదంష్ట్రుఁడు వానరులపై బాణ వృష్టి కురిసి వేధింప నంగదుఁ డాతనితో ఘోరముగ యుద్ధ మొనర్చి కత్తితో వజ్రదంష్ట్రుని తల నఱికి చంపుట.

కం. కని స్వబల నాశ మంగదు
ఘన బలవర్ధనము రోష కలితుం డయ్యెన్ 1.

ఘన బలుఁడు వజ్రదంష్ట్రుఁడు
ధనువును వజ్రప్ర భాతతచ్ఛవి సెత్తెన్

ఆ.వె. అంతఁ జూచి వింటి నా వజ్ర దంష్ట్రుఁడు
వానర పటలమ్ము పైనఁ గినిసి
యమ్ముల పెను వృష్టి నిమ్ముగఁ గురియించెఁ
గ్రూర రాక్షసుండు ఘోరముగను 2.

తే.గీ. రథముల పయి వచ్చిన యట్టి రాక్షసప్ర
ముఖులు నానాయుధమ్ములఁ బోరు సల్ప
వానరప్రవరులు శూర వరులు కూడి
శిలల నూని యెల్లెడలను జేసి రాజి 3.

ఉ. వేల కొలంది శస్త్రములు వేసిరి యుద్ధము నందు రక్కసుల్
కూలఁ బ్లవంగ శూరవర కోటిపయిం దమకమ్ము మీఱఁగా
వీలుగ వృక్ష శైలములు వేసిరి ఱాళ్లను రాక్షసాలిపై
నాలము నందు మత్త చది రాభులు వానర వర్యు లుగ్రులై 4.

కం. అని మరలని యనిఁ జేసెడు
ఘన శూరాసుర గణములు గదనము నందుం
దనరి చెలరేఁగఁ బంత
మ్మున వర్తిల్లె నట యుద్ధము సుఘోరముగన్ 5.

ఉ. కొందఱు వాన రాసురులఁ గోయఁ బడంగ శిరమ్ము లంఘ్రులున్
సుందర హస్తరాజములు శూలవిదారిత దేహముల్ స్వజం
బందు మునుంగ నార్తు లయి యంక తలమ్మునఁ గంకగృధ్రముల్
సిందులు వేయ నక్కలును జేరి ధరన్ నిదురించి రత్తఱిన్ 6.

చం. ఎగిరెను మొండెముల్ పిఱికి కీయ భయమ్ము భృశమ్ము నేలపైఁ
దెగిన శిరమ్ములుం గరుల దేహము లింక భుజమ్ములం బ్లవం
గ గణము లాసు రావళియు క్ష్మాతల మందుఁ జలించి సోలె విం
తగ రణ భూమి నెల్లెడలఁ దద్దయు భీతి నొసంగఁ గాంచినన్ 7.

ఆ.వె. కొట్టఁ బడుచు నుండఁ గోఁతుల మూఁకచే
భగ్న మయ్యెఁ జూడ వజ్రదంష్ట్రుఁ
డసురుల బల మెల్ల నంకమ్ము నందు వీ
క్షించి వారి నట్లు మించఁ గినుక 8.

ఆ.వె. క్రోధమూర్ఛితుండు ఘోర ధనువు నూని
వజ్రదంష్ట్రుఁ డాజి పరమ విక్ర
ముం డడరి ప్రవేశము నొనరించె సమర
మందుఁ ద్రాస మొసఁగె హరుల కెల్ల 9.

తే.గీ. కంకపత్ర శరముల వంకరగ చనని
వానిఁ బఱపి విక్రాంతుఁడు వజ్రదంష్ట్రుఁ
డేవు రెనమండ్రు దొమ్మండ్రు నేడ్గు రనఁగ
వానర వరుల బాధించెఁ బరమ కోపి 10.

కం. శర దారిత నిజ గాత్రులు
గురుభయ కంపితులు ప్లవగ కోటులు భీతిం
బరువులు వెట్టుచు నంగదు
హరివీరునిఁ జేరి రజుని నరయు ప్రజ వలెన్ 11.

ఆ.వె. భీతిఁ బాఱు హరుల వీక్షించి వాలి సు
తుండు నంగదుండు మెం డగు కిను
క సెలగంగఁ దన్నుఁ గాంచు చున్నట్టి యా
వజ్రదంష్ట్రుఁ జూచె వానరుండు 12.

తే.గీ. అలుక నంగద వజ్రదంష్ట్రులు సెలంగి
పోరుచును హరిమత్తేభముల విధము ప
రస్పరము  సంచరించిరి రణము నందు
నిద్దఱు పరమ క్రుద్ధులు తద్ద ధృతిని 13.

తే.గీ. అంత హరి కుమారుని లక్ష యమ్ములను న
నల శిఖాభమ్ములను గని నగచరేంద్రు
మర్మ దేశమ్ములఁ దగులం బఱపె నాగ్ర 14.

హం బడర వజ్రదంష్ట్రుఁడు సంబరమున

ఉ. కాఱఁగ రక్త మంగములఁ గ్రన్నన నంగదుఁ డమ్మహా బలుం
డాఱి యొకింత విక్రముఁడె యంత గ్రహించి కడింది వృక్షమున్
మీఱుచు వజ్రదంష్ట్రు పయి మిన్నఁగ వైచె బలమ్ము తోడుతం
బాఱెడు దాని రాక్షసుఁడు వ్రక్కలు సేయఁగ భూమిపైఁ బడెన్ 15.

కం. కని వజ్రదంష్ట్రు విక్రమ
ము నంత నొక్క గిరి నెత్తి బోరన విసరెన్
ఘనుఁడా యంగదుఁ డార్చెను
నినదమ్ములు నిండ దిశలు నెమ్మి సెలంగన్ 16.

ఆ.వె. వచ్చు నట్టి ఱాతి వజ్రదంష్ట్రుం డార
సి వెస స్వీయ గదను జేత నూని
బెదరకుండఁ దా నరదము నుండి యెగిరి
నిలిచెఁ బుడమి పైనఁ గలఁత లేక 17.

ఆ.వె. అంగదుండు విసరి నట్టి యా శిల యేఁగి
సమర భూమి నందుఁ జక్రముల నొ
గను హయముల నరద మును నెల్ల ముక్కలు
సేసె నంతఁ గదలి శీఘ్రముగను 18.

చం. అపరపుఁ బెద్ద కొండకొన నంతటఁ గైకొని వృక్ష యుక్తముం
గపివరుఁ డంత వాని తలకాయ పయిన్ విసరెన్ రయమ్మునన్
విపులపు ఱాతి దెబ్బ గద వీఁగఁగ గొంచును వజ్రదంష్ట్రుఁడే
యపుడు స్రవింప నెత్రు సమయం బొక యింత వగర్చి మూర్ఛిలెన్ 19.

ఆ.వె. పడసి సంజ్ఞ నడరి వజ్రదంష్ట్రుఁడు గద
తోడఁ గొట్టె నంతఁ దోరముగను
వక్ష మందు నిలువ వాలిపుత్రునిఁ గాంచి
రోష తామ్ర వర్ణ లోచనుండు 20.

కం. వదలి యపు డసుర వీరుం 21.

డుదరి తనదు గదను ముష్టి యుద్ధ మొనర్పం
గ౹ దొడంగె౹ బరస్పరము బె
డిదముగ౹ గొట్టుకొని రా తటిని హర్యసురుల్

తే.గీ. రుధిరము స్రవించు తనువుల నధికముగ జ
నించిన యలసట సెలంగ మించి నిలువ
వార లంగారక బుధుల వలె నిరువురు
తో౹చి రప్పుడు వీక్షింప దురము నందు 22.

తే.గీ. పరమ తేజస్వి యంగదు౹ డురుతరంపు
విటపి బహు పుష్ప ఫలసమావృతమును బెక
లించి నిలువ వృషభచర్మ సంచితంపు
ఖడ్గము గ్రహించె వెలయంగ గంట లసుర 23.

ఆ.వె. చిత్ర గతుల వార లాత్రముగ౹ దిరుగు
చుండి జయము గోరు చుండి యొకరి
నొకరు కొట్టు చుండిరి కపి రాక్షస వీరు
లిర్వు రార్చు చుండి రిద్ధ బలులు 24.

తే.గీ. నేల నాన౹గ మోకాళ్లు చాల నొవ్వ
నాజి లోన గాయము లవయవము లందు
రే౹గ౹ బుష్పిత కింశుక వృక్ష యుగ్మ
ము పగిది వెలింగి రిరువురు నపుడు వింత 25.

ఉ. ఒక్క నిమేష మాత్రమున నుక్కున నంగదు౹ డంత నుగ్రు౹డై
యెక్కటి వానరప్రవరు౹ డేపున దండ హతోరగమ్ము నా౹
జక్క౹గ లేచి కన్నులు భృశమ్ముగ మండుచు నుండ౹ దోమ౹గా
మిక్కిలి వెల్గు ఖడ్గమున మేటి నిశాటు శిరమ్ము ద్రుంచినన్ 26.

తే.గీ. రక్త మందు౹ దడిసిన గాత్రముల వాని
తద్ద తిరుగు చున్నట్టి నేత్రముల వాని
మానుషాదుని శుభమగు మస్తకమ్ము
వడెను వెస రెండు ముక్కలై పుడమి పైన 27.

తే.గీ. హతుని వజ్రదంష్ట్రు నరసి యడుచు చుండ
హరులు భయ విహ్వాలు లయి యయ్యసురు లెల్ల
రడలుచు విచార ముఖులు నిజాస్యములను
వాంచి సిగ్గున లంకకుఁ బాఱి రంత 28.

కం. ముద మందె సురావృతుఁ డై
న దివిజ గణ నాథు భంగి నగచర సహితుం
డు దివస్పతి సమ ఘనుఁ డం
గదుఁడు మహాబలుఁడు చంపి కర్కశు నసురున్ 29.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నేఁబది నాలుగవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 55.

వజ్రదంష్ట్రుని మరణమును విని రావణుఁ డకంపనుఁ డను రాక్షస నేతను యుద్ధమున కంప
నాతఁడు సైన్యముతోఁ దరలు చుండ ననేక దుర్నిమిత్తములను గని గణింపక చన వానర రాక్షసుల
నడుమ నల కుముద మైందులు విజృంభింప ఘోర యుద్ధము జరుగుట.

కం. అని వజ్రదంష్ట్రు నా వా
లి నందనుఁడు సంపుట విని రేఁగిన కినుకం
దన దరి నంజలి నున్న బ
ల నేతఁ గని యంత నిట్లు రావణుఁ డనియెన్ 1.

తే.గీ. శీఘ్ర మేఁగ వలయును విశేష విక్ర
ము లెదిరింప నశక్యులు ముందు నడవ
వీర వరుఁ డకంపనుఁడు ప్రవీణుఁ డస్త్ర 2.

శస్త్ర విద్యలం దెల్లను సత్వరమ్ము

ఉ. ఈతఁడు శాస్త రక్షకుఁడు నింపగు సేతయు సత్తముం డనిం
బ్రీతినిఁ గోరు నా కెపుడు పెల్లుగ సంపద యుద్ధ కాంక్షియుం
జేతల నెగ్గు రాఘవులఁ జేవను వానర నాథు భీక రా
రాతులఁ జంపు వానరుల రాక్షస వర్యుఁ డసంశయమ్ముగన్ 3.

ఆ.వె. రావ ణాజ్ఞ నూని లఘు విక్రముం డకం
పనుఁడు గొప్ప బలుఁడు బలము నెల్ల
సిద్ధ పఱచె నంత శీఘ్రము భీమాక్ష
భీమ దర్శనులును వెడలి రడరి 4.

ఆ.వె. రాక్షస ప్రముఖులు ప్రహరణమ్ములు గొని
వివిధములు గదలిరి వీర వర్యు
లయ్యకంపనుఁడు బలాధ్యకుఁ డడరి ప్రే
రేప నుత్సహించి కోపగించి 5.

చం. అరదము నెక్కి కాఁపఁ బడి నట్టి పసిండి నలంకరించి న
ట్టి రథము మేఘ వర్ణుఁడు వడిన్ ఘన సన్నిభ కంఠ సుస్వరుం
డురుతర మేఘ సన్నిభుఁడు నుద్ధతి రాక్షస వీర సంవృతుం
డరుగఁ దొడంగె వేగముగ నంత నకంపనుఁ డుత్సహించుచున్ 6.

చం. సురలు నశక్యు లౌదు రనిఁ జూడ నకంపనుఁ డందఁ గంపముల్
పరగఁగ సూర్య సన్నిభము పన్నుగఁ దేజము నందు నాతఁడే
పరుగిడు చుండఁ దేరున నపార బలుండు తటాన వాజులే
యరదము లాగు చుండ నట నందెను దైన్యము లబ్బురమ్ముగన్ 7.

ఉ. ఆతని యెడ్మ కన్న దిరె నంక రతాత్మునకున్ వివర్ణమై
యా తత మాస్య ముండె పెస నయ్యెను వాని స్వరమ్ము గద్గదం
బా తఱి దుర్దినం బగుచు నా సుదినమ్ము సెలంగె వీవఁగా
వాతము ఘోరమై యఱచెఁ బక్షి మృగమ్ములు భీకరమ్ముగా 8.

చం. కదలె గణింప కింతయును గన్పడు చుండఁగ దుర్నిమిత్తముల్ 9.

బెదరక సింహ సన్నిభము పెద్ద భుజమ్ముల వ్యాఘ్ర విక్రముం
డుదుటున నేఁగఁ జాగెను మహోగ్రత రేఁగె రవమ్ము లబ్ధి యే
యదురఁగ ఘోర రాక్షసులు నార్బటి పెన్కను వచ్చుచుండఁగన్

ఆ.వె. భండన మొనరింప వచ్చు వారల ధ్వను
లాలకింప భయము హరి మహా చ
మువున కబ్బెను మనముల నంత ద్రుమరాజ
శైల హేతులకును జాల నపుడు 10.

తే.గీ. రామ రావణులకు నయి ప్రాణములను
వీడు హరి రాక్షస పరమ వీరుల కపు
డయ్యె రౌద్రతరం బైన యట్టి యుద్ధ
మందు నెల్లరు శూరు లనల్ప బలులు 11.

కం. గిరి సదృశు లెల్ల రొకరి నొ
కరు నోడింపంగ నెంచు ఘనులా యసురుల్
హరులును ఘోరతరంపు స
మరమం దతి శీఘ్రముగను మాత్సర్యమునన్ 12.

తే.గీ. ఆర్చుచున్న బల్లిదుల మహా ధ్వను లని
లోన విన్పట్టు చున్నవి రోష సంయు
తమ్ము గర్జించు చుండంగఁ దద్ద సెలఁగి
ఘోరముగఁ గపి రాక్షస వీరు లెల్ల 13.

చం. అరుణ నిభమ్ముగా రజ మనల్పము రేఁగెను రేప రాక్షసుల్
హరులును దిక్కు లన్నిటను వ్యాప్తము కాఁగ భృశమ్ము నత్తఱిన్
విరివిగ దుమ్ము కప్పఁగను వెల్లని పట్టు పరిచ్ఛదం బనన్
దురమునఁ గాన రొండొరుల దుర్జయు లా హరు లింక రాక్షసుల్ 14.

కం. టెక్కెం బైనను నక్కట
టెక్కపుఁ గంట మయినను దడిగ యైన హయం
బక్కడ యాయుధ మేనియు
నెక్కటి తేరు నగపడదె యెందు రజమునన్ 15.

కం. వినిపించును ఘోరమ్ముగ
ధ్వను లట పర్విడెడు నార్చు వారలు సేయం
గ నజిముఖి సంగరమ్మునఁ
గనంబడవు రూపములు ప్రకటముగ నకటా 16.

ఆ.వె. ఘోర మయ్యె నకట కోపించి చంపిరి
హరులు తమము నందు హరి వరులను
రాక్షస వరు లలిగి రాక్షస వీరుల
నా తిమిరము నందు నక్కజముగ 17.

కం. పరులను దమవారిని వా
నర రాక్షసులు వధియించినఁ బుడమి యయ్యెన్
విరివిగ రుధి రార్ద్రమ్ముగ
బురదయె మైపూఁత యయ్యెఁ బుడమికిఁ గాంచన్ 18.

ఆ.వె. రుధిర ధారఁ దొలఁగ నధికంపు దుమ్మెల్ల
భూమి యపుడు నిండెఁ బూర్ణముగను
శవములఁ దనువులను సంకీర్ణము లయి వి
రివిగ నెల్లెడఁ జెదరి పడియుండ 19.

కం. తరుల శిలలన్ గదా తో
మర పరిఘప్రాసములను మల్లులు నసురుల్
కర మలిగి యొండొరులఁ జం
పిరి యోజస్సడర నాజి భీకర లీలన్ 20.

తే.గీ. భీమ కర్ములు గిరి నిభ వీర హరులు
పరిఘ సన్నిభ బాహువుల రణమునొన
రించుచు నడరి రాక్షస సంచయమ్ము
నాజిఁ జెలరేఁగి వధియించి రాగ్రహమున 21.

కం. కరములఁ బ్రాసలు నీఁకఁ దో
మరమ్ములు ధరించి కడు నమర్షము తోడన్ 22.

హరి వీరుల నని సమయిం
చిరి రాక్షస వర్యు లంత శిత శస్త్రములన్

ఆ.వె. క్రుద్ధుఁ డయి కడింది ఘోర రాక్షస గణ
సేన కధిపతి యని సేయు చుండి
హర్ష మొసఁగు చుండె నసురులకు నకంప
నుండు విక్రములకు మెండుగ నట 23.

ఆ.వె. హరివరులు నసురుల నాయుధమ్ములు లాగి
యాక్రమించి బలిమి నశ్మ వృక్ష
సంచయమ్ము నూని చంపఁ దొడంగిరి
యాగ్రహమ్ము మీఱ నాజి లోన 24.

ఉ. తోరపు వేగ మంతఁ గుముదుండు నలుండును మైందుఁ డాజిలో
మూరుచుఁ జూపి రా హరులు ముప్వురు కోపము నూని మిక్కిలిన్
దారుణ మైన రక్కసుల దండున వారలు పాదపమ్ములన్
ఘోరపు హింస నెల్లఁ గడు గ్రుద్ధతఁ జేసిరి మించి లీలఁగా 25.

కం. నానా వి ధాయుధమ్ముల
వానరు లా ముప్వు రంత బాధించిరి యా
సేనా గత రాక్షసులను
మానక యెల్లరను దత్సమర మందు ధృతిన్ 26.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నేఁబది యేనవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 56.

వానర వీరుల ఘోర కర్మము నారసి యకంపనుండు క్రోధమూర్ఛితుఁడై ధనుర్బాణములఁ
గ్రూరముగా వానర వధ సేయుచుండ హనుమంతుఁ డెదిర్చి మహాయుద్ధమున వృక్షరాజముచే
నకంపనుని హతమార్ప రాక్షసులు భీతిని లంకకుఁ బాఱుట.

కం. కని వానర సత్త్వము ల
ట్లొనరించిన గొప్ప దైన యుద్ధమ్మును గి
న్కను బూని భృశమ్ముగ నా
ఘన వీరుఁ డకంపనుండు  కరినాత్ముండై 1.

ఆ.వె. క్రోధ మూర్ఛితుండు ఘోర కార్ముకముఁ గ
దల్చుచుఁ బగవారి దారుణంపుఁ
గర్మ మరసి యంతఁ గాంచి తనదు సార
థిని వచించెఁ దమి వచనము లిట్లు 2.

చం. నడపుము వేగ సారథి! రణమ్మున రాక్షస కోటి వానరుల్
తడఁబడఁ జంపు చుంటిరి రథం బటకుం దగ భీమకాయు లా
యడవిఁ జరించు బల్లిదులు నాగ్రహ మూని భృశమ్ము త్రుళ్లుచుం
గడఁకను నిల్చిరే యెదుటఁ గండులు చెట్టులు గాఁగ శస్త్రముల్ 3.

ఉ. చంపఁ దలంతు యుద్ధమున శ్లాఘితు లంచుఁ దలంచు వారినిం
దెంపున నెల్ల రక్కసులఁ దీవ్ర తరమ్ముగ బాధపెట్టుచుం
గంపము లేక నిల్చు హరి కాయము నెల్ల ననంగఁ దోలఁగా
నింపగు నంప కోల లట  సేయుచు దూఁకె నతండు వారిపై 4.

తే.గీ. వడిగల తురంగ వరములు బలిమి లాగు
నరద మందు రథికు లందు వర రథికుని
యా యకంపను నెదుటను హరులు నిల్వ
కున్న నకట పోరుటఁ జెప్ప నొప్పునెట్లు 5.

చం. అసురుని యా యకంపనుని యమ్ముల ధాటికి నోర్వఁ జాలకే
వెస హరు లెల్ల పర్విడిరి వీరిని మృత్యువుఁ జేరు వారి నా
యసుర విఘాతులం గని మహాత్ముఁడు జ్ఞాతుల నాంజనేయుఁ డం
త సరస కేఁగుదెంచె వడిఁ దద్ద బలాఢ్యుఁడు సంభ్రమమ్మునన్ 6.

తే.గీ. అమ్మహా ప్లవంగునిఁ గని యంత హరి వ
రేణ్యు లెల్లరు గుమికూడిరి ధృతిఁ జుట్టు
ముట్టి రింపుగ వీరులు మూరిరి బల
మందు బల్లిదునిం జేర నంద అపుడు 7.

కం. గిరి సన్నిభు హనుమంతుని
సరసఁ గని యకంపనుండు శరవర్షమ్మున్
గిరిభిద్ధారాపాతము
కరణిం గురియించె నంతఁ గపి సత్తముపై 8.

కం. లెక్కింపక బాణౌఘం
బక్కపి రయముగ నిజాంగ మందుఁ బడంగన్
జక్కాడఁ దలంచె నెడఁద
నుక్కడర నకంపను బర మోద్రేకమునన్ 9.

ఉ. నవ్వుచు నంత వాయు వర నందనుఁ డున్నత తేజుఁ డుద్ధతిన్
రివ్వునఁ బాఱె రాక్షస వరేణ్యుని చెంతకుఁ గంప మందఁగా
నివ్వసుధా తలమ్ము ప్లవ గేశ్వరుఁ డార్వఁగ నయ్యెఁ దేజ మం
దవ్వర వీరు రూప మపు డగ్ని నిభమ్ము దురాసదమ్మునున్ 10.

తే.గీ. తన్నెఱిఁగి నిరాయుధునిగ నన్నగ చరుఁ
డాగ్రహించి మిక్కుటముగ నాంజనేయఁ
డంతఁ బెకలించె నొక్క మహాద్రి హరి వ
రేణ్యుఁడు రయమ్మున మహా గిరి సదృశుండు 11.

కం. ఏక కరమ్మున దానిని
వీఁకం దాల్చి వడిఁ ద్రిప్పెఁ బృథ్వీధరముం
గూఁకలు వేయుచు నిండఁగ
నాకాశం బెల్ల నంత నత్యుగ్రుండై 12.

కం. మును నముచి పైన స్వీ యా
శనితో దూఁకిన నగారి చందం బొప్పన్ 13.

హనుమంతుఁ డకంపను గని
ఘనాసురు దరికిఁ బరు విడెఁ గపి రాజంతన్

కం. కని యెత్తిన గిరి శృంగము
ఘనుం డకంపనుఁడు వేగ కడు దూరం బం
దునె యర్ధచంద్ర బాణ
మ్మున ముక్కలు సేసె దానిఁ బొడి పొడి కాఁగన్ 14.

చం. గిరి వర శృంగ మట్లు పరికించి నభమ్మున నుండి కూలఁగా
శరవర భగ్నమై ధర రుషా కలితాత్ముఁడు వాయు నందనుం
డురుతర వృక్ష రాజము మహోన్నత మంతట నశ్వకర్ణమున్
గిరి నిభముం బెకల్చి వెస గిఱ్ఱునఁ ద్రిప్పెను నిల్చి నేలపై 15.

ఉ. అంతట గొప్ప బోదియ గలట్టిది మ్రానును బట్టి పాఱుచున్
వింతగ వ్రక్కలై నిలువఁ బృథ్వియె మ్రాకులు గాఁగ భగ్నముల్
దంతుల నెల్లఁ గూల్చుచు రథమ్ముల రౌతుల మావటీఁడులన్
గెంతుచుఁ జంపె రాక్షసులఁ గేళి విధమ్మునఁ గాలిబంటులన్ 16.

ఆ.వె. అంతక నిభుని హనుమంతునిఁ గ్రుద్ధునిఁ
జెట్టు కరము నందుఁ జెలఁగు వానిఁ
బ్రాణ హారినిఁ గని పరువులు పెట్టిరి
రాక్షసులు దిశలకు రణము వీడి 17.

ఉ. వచ్చెడు క్రుద్ధ వాయుజుని భండన మం దసు రాళికిన్ భయం
బిచ్చెడు వాని గాంచి ఘన వీరుఁ డకంపనుఁ డార్త చిత్తుఁడై
యెచ్చుగ నార్చి యంత నిశితేద్ధ చతుర్దశ సాయకమ్ములన్
గ్రుచ్చెఁ బ్లవంగ వీరు మెయిఁ గ్రూరుఁడు మారుతి కీయ బాధనున్ 18.

ఆ.వె. బలము వాడియుఁ గల బాణ జాలమ్మున
నంతఁ గనఁ బడె హనుమంతుఁ డపుడు
తరులు మొలచి నట్టి గిరి భంగి వింతగఁ
బరమ దీర్ఘ తనుఁడు బల్లిదుండు 19.

కం. విరిసిన యశోక వృక్షము
కరణిం బొగ లేని యగ్ని కరణిం గన్ప
ట్టె రణమ్మున నమ్మారుతి
శరములు భాసిల్ల దేహ సంపాతములై 20.

ఆ.వె. అన్య వృక్ష మొకటి హనుమంతుఁడు పెకల్చి
వేగ మష్డు పెంచి వీరవరు న
కంపను తల పైన గాఢ తరమ్ముగఁ
గొట్టె సత్వరితము ఘోరముగను 21.

తే.గీ. కొట్ట నట్లు మహాత్ముఁడు క్రుద్ధుఁ డయి న
గమ్ము చేత భృశమ్ముగఁ గపి వరేణ్యుఁ
డంత వీరుఁ డకంపనుం డసుర వర్యుఁ
డవనిపైఁ గూలె మరణించె నా క్షణమున 22.

చం. కని ధరఁ గూల నవ్విధి నకంపను రక్కసు లెల్ల  రాక్షసేం
ద్రుని వ్యధి తాత్ము లైరి కనఁ దోరపు భూతల కంప మందు నూఁ
గు నగ వితాన సన్నిభము ఘోర భయమ్మున నోడి లంకకున్
ఘన కపు లంతఁ ద్రోలఁ దము గ్రన్ననఁ బాఱిరి వీడి శస్త్రముల్ 23.

తే.గీ. వీడ కేశములు విఱుఁగ విరివి మదులు
సంభ్రమ మడర  నోడంగ సమర మందుఁ
గాఱఁ జెమటలు శ్వాసలు మీఱ మరల
మరల వెన్కకుఁ జూచుచు మరలి రెల్ల 24.

ఆ.వె. ఒకరి నొకరు నంత నొరసికొనుచు మూఢు
లై కరమ్ము  మనము లందు భీతి
ముప్పిరిగొనఁ జొచ్చి రప్పుడు రక్కసు
లెల్ల లంక నుఱికి తల్లడిలుచు 25.

కం. చన లంక కెల్ల యసురులు
ఘనులు మహా బలులు కూడి కపివరు లెల్లన్
హనుమంతునిఁ బూజింప ర 26.

హి నొంది యెద మారుతి నుతియించెను వారిన్

కం. విజయప్రకాశులు హరులు
సృజియించిరి గర్జనములు సేరి ముదమునన్
నిజ బల యుక్తమ్ముగ నసు
ర జనమ్ముల నీడ్చి రసువులం గనఁబడఁగన్ 27.

తే.గీ. వీర శోభను వెల్గెను ఘోర రాక్ష
సుల వధించి మహాకపి శూర వరుఁడు
మారుతి రిపునాశకుని భీమతర దైత్యు
వెల్లువ బలిని నణఁచిన విష్ణుఁ బోలి 28.

కం. సుర గణము స్వయమ్ముగ నిం
క రాముఁడును లక్ష్మణుండు ఘన బలుఁడు నుతిం
చిరి ప్లవగులు సుగ్రీవుఁడు
హరి పతియు విభీషణుండు హనుమను బ్రీతిన్ 29.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నేఁబది యాఱవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 57.

అకంపనుని మరణం బెఱింగి రావణుఁడు కినిసి యొకింత దీనుఁడునై ప్రహస్తుని, రాక్షస సేనాపతిని యుద్ధమునకుఁ బంప నాతఁడు తరలుచుండ దుర్నిమిత్తములు వొడసిన నేఁగ వానర సేన శిలా వృక్షములను గైకొని యుద్ధమునకు సన్నద్ధ మగుట.

కం. అరసి యకంపను వధ మం
త రావణుఁడు కోప మూని దైన్యము దోఁపం 1.

గ రవంత నిజామాత్యుల
నరయుచుఁ జింతించెను సమయ మొకింత యెదన్

చం. ఒక పరి రావణుం డెడఁద నొక్క ముహూర్తము సేసి చింతనున్
సకలము సంప్రదించియు భృశమ్ముగ మంత్రుల తోడఁ దాను పే
గ కనఁ దలంచి యా యుదయ కాలము నందుఁ బురమ్ము లంకలో
వికల మనమ్మునం జనియె స్వీయ సమున్నత గుల్మ మత్తఱిన్ 2.

కం. కాంచెను రాక్షస గుప్తము
నంచిత సైన్యావృతమ్ము నలరఁ బతాకా
సంచయ వృతధ్వజమ్ములు
మించిన ప్రభలన్ వెలుంగు మేటి నగరమున్ 3.

చం. పుర మది ముట్టడింపఁ బడఁ బూర్ణముగాఁ గని రాక్షసేంద్రుఁ డు
గ్ర రుష యెడంద రేఁగ ఘన కాయుఁ బ్రహస్తుని యుద్ధ కోవిదున్
సరసనఁ గాంచి యాత్మ హిత సంవృత వాక్యము లిట్లు పల్కె సం
గర నిపుణా! నిబద్ధ పురిఁ గావఁగఁ గాంచను భండ నాన్యమున్ 4.

ఉ. పీడిత మీ పురమ్ము విడిపించెడు భారము మోయ నేనునుం
జూడఁగఁ గుంభకర్ణుఁడును శూరుఁడ వీవు చమూవిభుండ వా
వాఁడి మగండు నింద్రజి దపార బలుండు నికుంభుఁ డేనియుం
బాడిగ నౌదు మెల్లరము భద్ర సమర్థుల మెంచి చూచినన్ 5.

ఉ. కావున నేఁగు మీవు బలకాయము తోడఁ గపీంద్రు లున్న యా
తావున కింపుగా జయము తథ్యముగాఁ గొన సత్వరమ్ముగన్
పే విని నీదు నిర్ణయము భీతిఁ జలింతురు విన్న నాదముల్
వోవుదు రెల్లఁ బాఱి వెసఁ బోరును వీడుచు నార్వ రక్కసుల్ 6.

తే.గీ. నిలకడ నెఱుంగని యశిక్షకు లగు చంచ
ల హృదయులు వానరులు నీదు రవము ఘోర
మైన దాని విని సహింప రా మృగ పతి
గర్జనము విన్న గజముల కరణి వినుమ 7.

ఆ.వె. బలము పాఱ నెల్ల వశ మగు రాముఁడు
లక్ష్మణ సహితమ్ముగ రణము నందు
వశము తప్పి నీకుఁ బార్థివుండు నిరాశ్ర
యుండు నై ప్రహస్త! దండు లేక 8.

తే.గీ. సంశయంపు టాపదయె నిస్సంశయంపు
టాపదకు మేలు ప్రతికూలమైనను నను
కూలమైనను నీ వెంచు మేలు మనకు
దాని వచియింపుమా ప్రహస్త! యిట నాకు 9.

చం. పలుకఁగ నిట్లు రావణుఁడు వాహిని భర్త ప్రహస్తుఁ డిట్లు పే
పలికెను రాక్షసేంద్రునకుఁ బన్నుగ శుక్రుఁడు పల్కి నట్టులం
బలుకులు రావ ణాసురుని వాక్కుల కుత్తర మంచితమ్ముగా
సలలిత రీతి మున్ను తగఁ జర్చ ఘటిల్లెను మంత్రి యుక్తమై 10.

తే.గీ. నిపుణులు పరస్పరము మంత్రు లపుడు జింత
సేయ మనకు వివాదముఁ జేకుఱె నట
సీత నొసఁగ మేలని వచించితిని యీాయ
కున్న వీక్షించితిమి ఘోర యుద్ధ మపుడె 11.

తే.గీ. నిత్య మాయా సమయముల నేను దాన
ములను గౌరవమున నీదు పూజ లంది
తిని తగిన సాంత్వ వచనములను మ ఱేల
సేయ కుందు నీ కార్యము క్షేమ మెంచి 12.

కం. ధన పుత్ర దార లింకను
గన నా జీవితము నైనఁ గా దసురేంద్రా!
యని రక్షణీయ మెవ్విధిఁ
గనుమా వేల్చెదను నాదు కాయము నీకై 13.

కం. పలికి చమూపతి యివ్విధి
లలితమ్ముగ రాజు తోడ రావణు తోడం
బలికె బలాధ్యక్షులఁ గని 14.

నిలువ సరసన గిర లిట్లు నిర్ద్వంద్వముగన్

చం. కొనకొని తెండు రాక్షసుల గొప్ప బలమ్మును నాకు శీఘ్రమే
చని కని వేయఁగా నశని సన్నిభ బాణ రయమ్ము చేతఁ గూ
లిన రిపు వీరు లంకమున లెస్సగఁ దృప్తిలు సర్వ మాంస భో
జన విహగమ్ము లిద్ధ వన చారులు నేఁడిట యుద్ధభూమిలో 15.

కం. విని యాతని వాక్యమ్ములు
ఘన సేనాధ్యక్షులు బల గర్వితు లంతం
జని యసుర బలము నసురేం
ద్రుని మందిరమున నిలిపిరి తూర్ణము నెమ్మిన్ 16.

కం. ఒక్క ముహూర్తమ్మునసే
యెక్కటి లంకా పుర మది యెల్లను నిండెన్
రక్కసులు వివిధ హేతుల
గ్రక్కున గుమికూడ మత్త గజముల భంగిన్ 17.

ఉ. తోరముగా హుతాశనునిఁ దుష్టునిఁ జేసి నమస్కరింపఁగా
మూరిన భక్తిఁ బాఋలకు మోయుచు నాజ్య సుగంధవాసనల్
మారుత మంత వీచె నట మంత్రిత మాలల నూని రింపుగా
బోరున కెల్లఁ గూర్చికొని పొంగుచు రాక్షస వీరు లెల్లరున్ 18.

ఆ.వె. ధనువులు కవచములు ధరియించి నట్టి యా
రక్కసు లసురేంద్రు రావణు విభుఁ
గాంచుచు నెగిరి వెస నంచితముగఁ బ్రహ
స్తునిఁ గదిసి నిలిచిరి చుట్టు నంత 19.

చం. కొని యసురేంద్రు నానతిని ఘోరపు భేరిని మ్రోగఁ జేసి యె
క్కె నరద మంచితమ్ము హయ కీలిత ముత్తమ సూత యుక్త మిం
క ననువుగా నొనర్చినది కాంతుల భాస్కర చంద్ర తుల్యమున్
వినుకలి కంటి టెక్కెమును వీర వరుండు ప్రహస్తుఁ డంతటన్ 20.

తే.గీ. మేఘ నిభఘోష విలసిల్లు మేటి రథము 21.

గొప్పనొగను వెలుఁగుదానిఁ గూడ రక్ష
సెలఁగు దానిఁ బసిడి జాలము లలరంగ
శోభ నవ్విన యట్లుండ శూరుఁ డెక్కె

ఆ.వె. దుందుభిస్వనములు తూర్ణము చెలరేఁగె
వాద్య రవము లెల్ల వసుధ నిండ
శంఖ రవము లడరఁ జనుచుండ లంక నుం
డి చమువు పతి వడివడి వినిపించె 22.

చం. అసురులు భీమరూపులు మహాంగులు సేయుచు ఘోర శబ్దముల్
వెసఁ జనఁ జాగి రెల్లరును వేగముగా ధ్వజినీశు ముందఱన్
స్వ సచివు లైన కుంభహను సత్త్వ సమున్నత తన్నరాంతకుల్
విసవిస నా మహా రవుఁడు వీరుఁ బ్రహస్తుని వెంబడింపఁగా 23.

ఉ. ఘోర తరంపు వ్యూఢమును గూడి బలమ్మును హస్తి యూథ నా
సీర నిభమ్ము నంత నతి శీఘ్రము చాగఁ దొడంగెఁ బూర్వ ది
గ్ద్వారము నుండి సాగర నిభమ్ముగఁ బాఱ బలమ్ము క్రుద్ధుఁడై
దారుణ రీతి నంతకు విధమ్ము ప్రహస్తుఁడు దుస్సహమ్ముగన్ 24.

చం. వెడలెడు ఘోర శబ్దములు భీకర రాక్షసు లార్చు శబ్దముల్
వడ చెవు లందు లంక ఘన పట్టణ మందలి సర్వ భూతముల్
తడఁబడి చేసె నంత వికృతంపు స్వరమ్ములు రక్త మాంసముల్
కుడిచెడు పక్షులుం దిరిగె గుండ్రముగా నపసవ్య మత్తఱిన్ 25.

తే.గీ. మబ్బు లవి లేని నింగిని నబ్బురముగ
రథము చుట్టు నా పక్షులు రచ్చఁ దిరుగ
దొడఁగె నక్కలు కక్కుచు నడలి మంట
ల నరవఁ దొడంగె గాలి వీచెను బరుషము 26.

తే.గీ. ఉల్క లంతరిక్షము నుండి యూడఁదొడఁగె
గ్రహము లొండొరులఁ దగిలి ప్రభల నుడిగె
మబ్బులు స్రవించె నెత్తురు మానుషాదు
రథము పైఁ దడిపె భటుల రవము లెసఁగ 27.

ఆ.వె. దక్షిణంపు దిశ వదన ముంచి గ్రద్ద యొ
కండు టెక్కెము పయిఁ గాళ్ల నూని
రెండు ప్రక్కలకుఁ దిరిగి కూయు చుండి హ
రించెఁ నసుర కాంతి సంచయమ్ము 28.

కం. సమరమున కేఁగుచుండఁ బ
లు మార్లు మునికోల జాఱెఁ ద్రోల హరుల హ
స్తము నుండి సారథికి సూ
త మహా కుల జాతునకు నుత హయజ్ఞునకున్ 29.

తే.గీ. ఏ ప్రభ సుదుర్లభం బయి యేఁగు నపుడు
వెల్గు చుండు నయ్య దిపుడు వింతగ లయ
మయ్యెఁ నమ్ముహూర్తమ్మున నశ్వములును
సమ తలమ్మునఁ జలియించె సంభ్రమమున 30.

కం. కని ప్రఖ్యాత గుణ నిచయ
ఘన పౌరుషు నా ప్రహస్తుఁ గదలంగ రణ
మ్మునకు వివి ధాయుధము లూ
నిన కపి సేన పెస మార్కొనె పరువు లిడుచున్ 31.

తే.గీ. చీల్ప వృక్షమ్ములను గురు శిలలు ఘోర
ములు ధరింపఁ గరమ్ముల నలుక తోడ
హరి వరేణ్యులు జనియించె నంత ధ్వనులు
తుములముగ భీకరమ్ముగ సమర మందు 32.

ఉ. కేకలు పెట్ట రక్కసులు కేలిని నార్చుచు నుండ వానరుల్
మూఁకలు రెండు సంతసము పొంగఁగ విన్పడె ఘోర నాదముల్
ప్రాకట వేగ వంతులు కరమ్ము సమర్థులు పే పరస్పరం
బా కలిఁ జంప కోరి కడు నార్చుచుఁ బిల్చుచు నుండఁ గ్రుద్ధులై 33.

కం. హరి సైన్యమ్మును జొచ్చె న
సురుఁడు ప్రహస్తుఁడు కుబుద్ధి చూఱకొన జయ 34.

మ్ము రయమ్ము మీఱ శలభ ము
దరి మరణేచ్ఛ ననలమ్ము దరి చను నట్లున్

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నేఁబది యేడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 58.

ప్రహస్తునిఁ గూడి రాక్షసులు వానర సేనతో యుద్ధము చేయుచుండఁ గపి రాక్షస వీరు లనేక మంది మరణించుట, నీలుఁడు ప్రహస్తుని మార్కొని ఘోర యుద్ధమున వానిని మహా శిలను మహా వేగముగ దలపై విసరి హతమార్చుట.

కం. వెడలెడు ప్రహస్తుఁ గని రా
ముఁ డరిందముఁడు సమ రోద్యమునిఁ బలికెన్ న
వ్వడరఁగ విభీషణునితో
నుడువుల నిప్పగిదిఁ దాఁ గనుఁగొని కెలఁకునన్ 1.

తే.గీ. ఎవ్వరీ మహా కాయుఁడు రివ్వునఁ జను
దెంచు చుండె మహాబల సంచయమున
నితని బల పౌరుషమ్ములు నెట్టి వగు ని
శాచరుని వీరు నుడువుమ సమధిక భుజ! 2.

చం. విని యనె రాము వాక్కులు విభీషణుఁ డీతఁడు సైన్య భర్త యీ
ఘనుఁడు ప్రహస్త నాముఁడు నఖండ దశాస్యుని సేన లోన నీ
తని కగు మూడువంతులు ప్రధానుఁడు రాక్షసుఁ డస్త్ర విజ్ఞుఁడున్
వినుత పరాక్రముండు ఘన వీర్య విరాజితుఁ డిద్ధ శూరుఁడున్ 3.

ఉ. అంతఁ బ్లవంగ సేన బల మందు ఘనమ్ము ప్రహస్త రోష భా 4.

స్వంతము గర్జితమ్ము కనె వచ్చెడు దీర్ఘ శరీరు విక్రమున్
బంతము తోడ గర్జ లిడ భైరవ రాక్షస సంవృతాసురుం
జెంతకు రాఁ బ్రహస్తుని నశేష బలాన్వితు యుద్ధభూమిలో

తే.గీ. కపుల పైనుఱుకు విజయము పడయంగ
సెంచు నసురుల కరముల నింపుగ విల
సిల్లె ముసల ఖడ్గ శర ఋష్టి పరిఘు సగ
దా పరశు భల్ల శూలేద్ధ ధనువు లింక 5.

తే.గీ. వెలయ శక్త్యాదులు కపులు వీర వరులు
పుష్పిత తరులు శిలలు విపుల ధరాధ
రమ్ములు గొనిరి యంత దీర్ఘమ్ము లడరి
యుద్ధ కాములు వానరు లుగ్రు లగుచు 6.

ఉ. వా రట నొక్క రొక్కరిని భండన మందు నెదుర్కొనంగ వే
నారసముల్ కురింపఁగ ఘనమ్ముగఁ గుర్యఁగ శైల వృష్టినిన్
ఘోర రణమ్ము వర్తిలఁగఁ గ్రూరులు రాక్షసు లా ప్లవంగులన్
వారక రాక్ష సావళిని వానర వీరులు చంపి రుద్ధతిన్ 7.

ఉ. కొంద అహో మథింపఁబడ ఘోరపు శూల వరమ్ములం దెగం
గొందఱు ఘోర శస్త్రములఁ గొందఱు ఘాతులు ముద్గరమ్ములం
గొందఱు గండ్ర గొడ్డళులఁ గొట్టఁ బడంగను బాసి యూపిరిం
గొందఱు గూలఁ గొందఱికి ఘోర శరమ్ములు కోసె గుండెలన్ 8.

ఆ.వె. భువినిఁ బడిరి రెండు ముక్కలై కొందఱు
ఖడ్గములఁ జలించి కపి వరేణ్యు
లసుర వరుల చేత హరుల ప్రక్కలు దారి
తములు కాఁ బరులు పుడమినిఁ బడిరి 9.

చం. అసుర సమూహ మేనియు మహాగ్రహ వానర కోటి చేత వృ
క్ష సమితి శైల శృంగములఁ జయ్యనఁ బీడితమై భృశమ్ముగా
వసుధను గూలె నెల్లెడల వజ్ర సమాన తలవ్రజమ్ములం
బస గల ముష్టి హస్తముల పాటున రక్తము గ్రక్కి రాసురుల్ 10.

తే.గీ. చీల్పఁ బడ నేత్ర ముఖములు శీఘ్రమ పడ
నార్త నాదములఁ దుముల మయ్యె ధ్వనులు
సింహ నాదము లొనరింపఁ జేవ హరులు
రాక్షసులును మిక్కుటముగ నాక్షణమున 11.

కం. వీరుల మార్గమునఁ జనుచు
ఘోరు లసురులుం బ్లవగులు క్రుద్ధు లయి కడుం
గ్రూరు లభీతినిఁ జేసిరి
దారుణ కర్మములు కనులఁ దద్ద గిఱుపుచున్ 12.

తే.గీ. సచివులు ప్రహస్తునకు ననిఁ జంపఁ దొడఁగి
రంత వానర వరుల నరాంతకుండు
కుంభహను మహానాదులు ఘోరుఁ డా స
మున్నతుండు రిపు బలమ్ము సన్నగిల్ల 13.

కం. ద్వివిదుండు వారిలో నొక
ని వధించెను గొండ కొనఁ గని విసరి ఘన పా
టవమున నరాంతకుని నెదు
రు వచ్చు ప్లవగులను జంప రోషాత్ముండై 14.

కం. కపి దుర్ముఖుండు పెకలిం
చి పెద్ద వృక్షమ్ము నంత క్షిప్ర సుహస్తున్
విపరీత బలు సమున్నతు
విపులమ్ముగ నలుఁగఁ గొట్టి వే సమయించెన్ 15.

కం. కినిసి కడు జాంబవంతుఁడు
ఘన శిలఁ దేజస్వి యెత్తి ఘన వేగమునం
గని యసురు మహానాదుని
ఘన వక్షస్థలమునఁ బడఁగ విసరె సమయన్ 16.

కం. హరి వరు తారుని మార్కొని
వర వీరుఁడు కుంభహనువు భండన మందున్ 17.

హరి చేతఁ గోలుపోయెను
గురుతర తరువున నసువులు కొట్టఁ బడంగన్

ఉ. ఆ పని సైపఁ జాలక ప్రహస్తుఁడు స్యందన మెక్కి వింటినిం
గోపము మీఱ నూని వధ ఘోర తరమ్ముగఁ జేసెఁ బోరులో
రూ పడఁచెం బ్లవంగులను గ్రూరత క్షోభిత సాగరమ్మునం
దాఁపఁగ రాని శబ్దముల నాకృతి ఘోషలు రేఁగె సేనలన్ 18.

ఆ.వె. ప్రళయ కాల మందుఁ బ్రభవించు నిస్వన
మ్ముల పగిదిని ధ్వనులు పుట్టె రెండు
సేనల నడుమను విశేషమ్ముగాఁ బోరు
చుండ హర్యసురులు యుద్ధ మందు 19.

కం. రణ దుర్దముండు రాక్షసుఁ
డణఁచె శరౌఘమ్ము చేత హరి యూధపులన్
క్షణమునఁ గోపమ్ము సెలఁగ
రణ భూమిఁ బ్రహస్తుఁడు సుకరమ్ముగ నంతన్ 20.

కం. వానర రాక్షస వీరుల
మేనుల వ్యాప్తం బయి యట మేదిని యెల్లం
గానఁగ నయ్యె నపుడు సుమ
హా నగము లచట పఱచిన యట్టి విధమునన్ 21.

ఆ.వె. రక్త ధార లట్లు ప్రబలు చుండంగ వె
లుంగు చుండె భూమి సంగరమున
మాధవమ్ము నందు మంచిగఁ బూసిన
మోదుగుల వెలుంగు పుడమి వోలె 22.

సీ. హరివీర ధారా మహాతీరమును ఖండి తాయుధ జాల మహా ద్రుమమ్ము
రక్తౌఘ నామ నీరమ్మును యమ వార్ధి గామిని సంఛిన్న కాయ శీర్ష
మీనము నంగ వితాన శాద్వలము యకృత్ప్లిహ పంకముఁ గీర్ణ తాంత్ర
శైవలమ్మును గృధ్ర సంచయ హంసవ్ర జావృత కాలపృష్ఠాంబుజమ్ము
తే.గీ. ధవళ మేద స్సుఫేనా వృతమును నార 23.

ణి నిభ నిస్వనమ్ము‌ను బాప జన సుదుస్త
రమ్ము యుద్ధమ్ము నా నది రాక్షస హరి
వరులు దాఁటిరి గజ యూధపమ్ము భంగి

తే.గీ. అంత నీలుఁడు వీక్షించె నమ్ముల సృజి
యించు వాని రథస్థుని నెల్ల హరుల
వేగ చంపు వానిఁ బ్రహస్తు వేగ వంతు
నసుర సేనాపతి నపుడు హరి వరుండు 24.

చం. బలిమిని వీచు వాయువు నభమ్మునఁ దోయద సంచయమ్ముపైఁ
దలపడు భంగి నీలు హరుఁ దాఁ గని మార్కొని వచ్చు చుండఁగా
నిలిచి రథమ్ము నందు ధ్వజినీ పతి వేగ ప్రహస్తుఁ డుర్కొ నా
కలనున నీలు పై రథము కన్పడ భాస్కర వర్ణ తుల్యమై 25.

కం. విలుకాండ్ర శ్రేష్ఠుఁ డాజిని
బలముగ లాగి ఘన ధనువు బాణము లేసెం
జెలఁగి ప్రహస్తుఁడు నీలుని
బలవంతుని పైనఁ గినిసి బలపతి యంతన్ 26.

కం. నీలునిఁ జేరి విశిఖములు
వీలుగ వేయం దనువును భేదించి వెసన్
రాలెను భువిఁ బన్నగములఁ
బోలి రయమున నెదఁ గోపము కరము రేఁగన్ 27.

చం. శరముల నగ్ని తుల్యములఁ జాల తపించి శితాస్త్ర ఘాతుఁడై
హరి వరుఁ డాగ్రహుం డయి ప్రహస్తుని దుర్జయు వచ్చువానినిం
దరువుఁ బెకల్చి ఘోరముగఁ దాడితుఁ జేసెఁ బరాక్రముండు వా
నర బల భర్త నీలుఁ డని నైరృత నాథుని విక్రమమ్మునన్ 28.

ఆ.వె. అర్దితుం డయి యటు లాగ్రహించి నినదిం
చుచు భృశమ్ము నసుర శూరుఁ డంప
వానను గురియించెఁ బ్లవగ చమూపతి
పైన మిక్కుటముగ మేన నాట 29.

ఉ. కాండము లాఁపగా నలవి గాక ప్రహస్తుఁడు దుష్ట చిత్తుఁడే
మెండుగ పేయఁ గైకొనె నిమీలిత నేత్రుఁడు నీలుఁ డత్తజిన్
దండిగ కుర్యు వర్షమును దాళు శరత్తున నెద్దు భంగి నీ
లుండు సహించె వానర వరుండు శరావలి మూసి కన్నులన్ 30.

ఉ. కోపము నూని యమ్ములకు ఘోర నగమ్మును నంత సాలమున్
పే పెకలించి రక్కసుని పేగులఁ జంపెను గొట్టి వానరుం
డేపునఁ ద్రుంచెఁ గార్ముకము నెంతొ బలమ్మున నార్చెఁ బల్మఱుల్
కోప విలగ్న మానసుఁడు కుందక నీలుఁడు బల్లిదుం డనిన్ 31.

కం. ధనువు నశింపఁ జమూ పతి
తన ముసలమ్మును గొని యరదమ్ము దిగె పెసన్
ఘనుఁ డు ప్రహస్తుఁడు రోష
మ్మున రాక్షస వీరుఁ డంతఁ బుడమిని నిలిచెన్ 32.

తే.గీ. వా రిరువు రాత్త వైరులు వాహినీ ప
తులు తరస్వినులు రుధిరాంగులు నిలిచిరి
ఘోరముగ మదము స్రవించు కుంజరమ్ము
ల పగిది హరి వరేణ్యుఁడు రాక్షసుండు 33.

మ. అతి తీక్ష్ణమ్ములు దంష్ట్రముల్ పెలయ సింహవ్యాఘ్ర సంకాశు లా
యత బాహ ద్వయు లొక్క రొక్కరిని సింహవ్యాఘ్ర చేష్టా సముల్
వితతం బిద్దఱు రాసికొంచు జయమున్ వీక్షింప నుత్సాహులై
నుత వీరుల్ సమ రానివర్తులు ససందోహమ్ము పోరాడుచున్ 34.

కం. అంత నుదరి ముసలముఁ బ్రా
ణాంతకముఁ బ్రహస్తుఁడు గొని యడిచెన్ రణ వి
క్రాంతుఁడు నీలుని నుదుటం
బంతమ్మునఁ గాఔ నెత్రు వానర పతికిన్ 35.

తే.గీ. రక్త సిక్తాంగముల వానర గణ నాథుఁ
డంతఁ గొని మహావృక్షమ్ము నాగ్రహమ్ము 36.

సెలఁగ భృశముగ విసిరెను శీఘ్రము వడి
నా ప్రహస్తుని వక్షమ్ము నందుఁ దాఁక

ఉ. తాడనముం గణింపకయె తద్ద బలమ్మున నా ప్రహస్తుఁడుం
బాడిగ గొంచు రోకలినిఁ బర్విడ బల్లిదు నీలు వైపు దా
వాడి మగండు గాంచి యట వానిని వచ్చుచు నుండ వానరుం
డోడక సుంత నీలుఁడు మ హోన్నత మైన శిలన్ వెసం గొసెన్ 37.

తే.గీ. అంత యుద్ధాభిలాషిని నాజి ముసల
శస్త్రుని ప్రహస్తుని నరసి శైల ఖండ
మును విసరె నీలుఁ డుగ్రుత మూర్ధ మందుఁ
దగులఁ దూర్ణము బలముగ దారుణముగ 38.

ఉ. నీల విముక్త ఘోర శిల నిర్గతమై వడి పెక్కు భంగులం
జీలిచె నా ప్రహస్తు ఘన శీర్షము ఘోరతరమ్ముగా భువిం
గూలెను బోవఁ బ్రాణములు కూల బలమ్ము గతింప శోభయుం
దూల నిజేంద్రియమ్ములును ద్రుంపఁగ మూలము వృక్ష భంగినిన్ 39.

ఆ.వె. పగుల నట్లు శిరము మిగుల ప్రహస్తుని
తల మఱియును వాని తనువు నుండి
కాఱెను రుధిరము నగమ్మున సెలయేరు
పాఱు పగిది నపుడు వారకుండ 40.

ఆ.వె. పడఁ బ్రహస్తుఁ డాజి వానర వర్యుఁడౌ
నీలు చేఁ గదల్ప వీలు కాని
యసుర బల మెడఁదల హర్షమ్ము నశియింపఁ
బాఱె లంక కంత భయము కదుర 41.

ఆ.వె. నిలువఁ జాల కుండె నిహతుండు కా వాహి
నీశుఁ డసుర సేన యెల్ల నాజి
విఱుగ నానకట్ట వేగ జేరి నిలువ
జాల నట్టి నీటి సరణి దోఁప 42.

చం. రణమునఁ గూల నాయకుఁడు రాక్షస వీరులు యత్న హీనులై
క్షణమున రాక్షసేంద్రుని నికాయముఁ జేరిరి ధ్యాన మూకు లం
గణమున నిల్చి శోక వర కంధి మునింగి విసంజ్ఞు లన్న దా
రుణ గతి నిల్చి రెల్ల యసురుల్ దశ వక్త్రునిఁ జూడ నెంచుచున్ 43.

కం. బలవంతుఁడు విజయం బది
కలుగన్ నీలుఁడు సుకృతపుఁ గర్మము చేతం
బలు రీతులం బొగడఁ బడి
గలసి రఘూత్తముల ముదిత కపి వరుఁ డయ్యెన్ 44.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నేఁబది యెనిమిదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 59.

ప్రహస్తుని మరణమ్మును విని నిరాశుం డయి రావణుఁడు స్వయముగా నింద్రజిత్తు మొదలుగాఁ గల రాక్షస ముఖ్యులతో యుద్ధమున కేఁగి నీల సుగ్రీవ లక్ష్మణ హనుమంతుల తోడ ఘోర యుద్ధము సలిపి రాముని నెదుర్కొని పరాజయము నంది దీనుండై లంకకు మరలుట.

కం. ఆలమున నసుర సేనా
పాలకుఁడు హతుండు గాఁగ ప్లవగ వరుండౌ
నీలుని చే సాయుధ మీ
నాలయ నిభ వేగ సేన యడలుచుఁ బాఱెన్ 1.

చం అసుర మహాచమూ పతి లయమ్మును దెల్పిరి యగ్నిసూనుచే
వెసఁ జని రాక్షసాధిపతి భీకర రోష వశుండు గాఁగ ర
క్కసులు మునింగె నంత దశకంఠుఁడు చింతను నాలకించి య
క్కసున వచించె యూధపులఁ గాంచి బలారి సురాలితో వలెన్ 2.

తే.గీ. సానుచర సకుంజరు నాదు సైన్య పాలు
నింద్రబల సూదనుని సమయించె నెవ్వఁ
డట్టి పగతు నుపేక్షింప నెట్టి పగిది
నుచిత కార్యమ్ము కా దెంచ సచివు లార! 3.

కం. నశియింపఁ జేయ శత్రుల
భృశమ్ము గైకొన విజయము కృత్స్నము చను వాఁ
డ శుభముగ స్వయమ్ముగ సమ
ర శీర్షమున కద్భుతంపు రణము నొనర్పన్ 4.

చం. ఘన శిత మార్గ ణౌఘములఁ గాల్చెద వానర సేన నెల్ల నేఁ
డనయుల రామలక్ష్మణుల నాజి వనమ్మును మండు టగ్ని కా
ల్చు నటుల వానరవ్రజపు శోణిత ధారల భూమి నింపుగాఁ
దనియఁగఁ జేయు వాఁడ వితతమ్ముగ నేను బరాక్రమమ్మునన్ 5.

ఉ. ఎక్కెను బల్కి యిప్పగిది నెంతయు వెల్గు రథమ్ము నంతటం
జక్కని పైన గుఱ్ఱముల సంతతి కట్టిన స్యందనమ్మునున్
రక్కస మందకుం బతి సురప్రభు శత్రువు రావణుండు తే
రక్కడ నంగ కాంతుల మయం బయి రాజిలు చుండ నుద్ధతిన్ 6.

ఉ. తప్పెట లింక దుందుభులు దద్దరిలంగఁ జెలంగ శంఖముల్
గొప్పగ జబ్బలం జఱవ ఘోరపు టార్పులు సింహనాదముల్
తప్పక రేఁగ స్తోత్రములఁ దన్ను నుతింప శుభమ్ముఁ గోరి పే
యప్పల లాశ నాధిపతి యప్పుడు  చాగఁ దొడంగె నుగ్రుఁడై 7.

ఉ. మూఁగుచు రాక్షసాధిపతి ముఖ్యుని నీల ఘనాభ రూపులుం
జాగిరి మాంసభోజనులు జ్వాలి నిభాయత దీప్త నేత్రులున్
వేగమ రాక్షసుల్ విభుని వెంటఁ జరింప దశాననుం డటం
జాగెను భూతరాశి వృత శర్వు సురేశు నిభమ్ము వెల్గుచున్ 8.

కం. వెడలి నగరి నుండి రయం
బడర దశాస్యుండు గాంచె హరి సైన్యమ్ముం 9.

గడలి మొగులుఁ బోలు ధ్వనులఁ
గడు మించు శిలా ఘన తరు కర భాసితమున్

తే.గీ. కాంచి రాక్షసానీక ముగ్రప్రచండ
ము భుజగేంద్ర బాహుండు రాముండు శస్త్ర
ధరుల శ్రేష్ఠు విభీషణు నరసి పలికెఁ
బ్లవగ సేనాను గతుఁడు సైశ్వర్య యుతుఁడు 10.

తే.గీ. వివిధ వర పతాకధ్వజ విలసితమ్ము
ప్రాస శూలాసి నానాస్త్ర భాసితమ్ము
సైన్యము మహేంద్ర నిభ నాగ సంయుత మిది
యెవ్వరిది యకంప్యము భీరు హీన బలము 11.

కం. విని రాముని వాక్యము లిం
ద్ర నిభ పరాక్రముఁడు తెలిపె రాముని కంతన్
ఘనుఁడు విభీషణుఁ డా యసు
ర నికాయ మహా బలమును రఘు వీరునకున్ 12.

తే.గీ. ఎవ్వరా గజస్కంధమ్ము నెక్కి శిరము
నూపు చున్న దాని మహాత్ముఁ డుత్సహించి
వచ్చు చున్నాఁడొ వాఁ డకంపనుఁ డనంగ
నేరు ముదితార్క తామ్రాస్యుని ఘును నసురు 13.

తే.గీ. నిలిచి మృగకేతు రథ మందు వెలయు వాఁడు
శక్ర సమ ధను వూపుచు శద్రి భంగి
నుగ్ర వివృత దంష్ట్రమ్ముల నున్న వాఁ డ
తండ యింద్రజిత్తు వరప్రధానుఁ డార్య! 14.

తే.గీ. ఎవ్వఁ డుదరి వింధ్యాస్త మహేంద్ర కల్పుఁ
డరుగుదెంచు చుండెను ధన్వి యతి రథుండు
వీరుఁ డతఁ డతికాయుఁడు వింటి నున్న
తమ్ము నూపుచు ఘనదేహి తనరి ధ్వజిని 15.

తే.గీ. అప్పుడ యుదయించిన యట్టి యంబు జాప్త
వర్ణ తామ్ర నయనముల వాఁడు కుంజ
రమ్ము ఘంటా రవమ్ములు పమ్మ నెక్కి
నార్చు వాఁడు మహోదరుఁ డసుర వరుఁడు 16.

ఆ.వె. ఛవుల ప్రాస నెత్తి సంధ్యాభ్ర గిరి కాంతు
లలరు వాఁడు కాంచ నాభరణ స
హిత తురగ వరమ్ము నెక్కి యరుగుదెంచు
నసురుఁడే పిశాచుఁ డశని వేగి 17.

ఆ.వె. మెఱపు వంటి వాడి మేటి శూలము నూని
కింక రాశని రయ కీర్తితమ్ము
గిరి నిభప్రకాశ వర వృష భారోహుఁ
డతఁడె వర యశస్వి యగు త్రిశిరుఁడు 18.

తే.గీ. జలద తను  పృథువ్యూఢ సుజాత వక్షుఁ
డసుర వరుఁడు పన్నగ కేతు వడరు వాఁడు
ధనువు సారించి యరుదెంచు ఘనుఁడు కుంభ
నాముఁడు సమాహితుండు రణమ్మునందు 19.

తే.గీ. పరిఘనుం దప్త గాంచన వజ్ర జుష్ట
మును సధూమ దీప్తమ్మును గొనిన వాఁడు
నాత తోగ్ర రక్షో బల కేతు సన్ని
భుఁడు నికుంభుఁ డపూర్వ కర్ముం డతండు 20.

తే.గీ. అరద మందుఁ జాపాసి శరౌఘు జుష్ట
ము సపతాక పావక రూపమున నిలిచి వె
లింగెడు నుదగ్ర రూప ఘనాంగుఁ డాతఁ
డద్రి శృంగ యోధుండు నరాంతకుండు 21.

సీ. ఆజి తలమ్మున వ్యాఘ్రోష్ట్ర నాగేంద్ర హయ మృగాస్య సువివృ తాక్ష భూత
రాసులఁ గూడి విరాజిల్లు నెవ్వఁడు నానా విధ సుఘోర నాద రూప
భూతమ్ముల నెవండు వోరున నమరుల దర్ప మడంచు నతఁడు శశి సిత

సదృశంపు ఛత్రము సన్నని యూఁచల నలరార విలసిల్లు నతఁడు రాక్ష
ఆ.వె. సాధిపతి మహాత్ముఁ డఖిల భూతావృత
రుద్రు భంగి నట వెలుఁగుచు నుండె
నక్కిరీటి కుండ లాస్యుఁడు వింధ్య న
గ వర సదృశ భీమ కాయుఁ డతఁడు 22.

తే.గీ. ఇంద్ర వైవస్వతుల దర్ప మెల్ల నణఁచి
నట్టి వీరుండు రక్షోగ ణాధిపుండు
రావణుండు వెలుఁగు చుండు రవి సమాన
మని విభీషణుఁ డన రాముఁ డాలకించి
ఆ.వె. బదు లొసంగె శాత్రవ దమనునకు విభీ
షణునకు నృవరుండు శత్రు దమను
న కతి దీప్తుఁ డౌర! ప్రకటిత తేజస్వి
రాక్ష సాధిపుండు రావణుండు 23.

తే.గీ. రశ్మి భాసితుం డసురుండు రావణుండు
చూడ శక్యమ్ము కాని తేజోయుతుండు
భాను సదృశమ్ము సువ్యక్త మైన రూప
మున నితం డక్కజమ్ముగఁ దనరు చుండె 24.

ఉ. ఎవ్విధి రాక్షసేంద్రు తను వెల్ల విరాజిలి చుండెఁ గాంచఁగా
నవ్విధి దేవ దానవుల యంగము లెల్ల వెలుంగఁ గాంచమే
యెవ్వరిఁ గాంచినన్ ఘన గిరీంద్ర సమానులె శైలయోధులే
యివ్వర రావ ణానుచరు లెల్లరు దీప్త మహాస్త్ర ధారులే 25.

చం. ఘనముగ రాక్షసాధిపతి కాలుని భంగి వెలుంగు చుండె భూ
త నిచయ ముగ్ర దర్శనులు దార్ఢ్యశరీరులు చుట్టి తన్ను పే
చన రణ మం దదృష్టమునఁ జక్కఁగ వచ్చెను నాదు దృష్టికిం
గినుకను నేఁడు వీడెదను గేళి విదేహ సుతార్థ జాతమున్ 26.

కం. వచియించి రాముఁ డివ్విధి
యచిరమ్ము ధనువు గ్రహించి యనుజుం డుండన్
రుచిరముగఁ జెంత నిలిచె సు 27.

రుచిరంపు శరమ్ము నూని రుష వీరుఁ డటన్

ఉ. ఆ వర రాక్ష సావలిని నారసి రావణుఁ డిట్లు పల్కె ర
క్షోవరుఁ డంత ద్వార గృహ గోపుర మార్గము లందు నిల్వుఁడీ
చేవను వీడి సంశయము చేరి సుఖమ్ముగఁ జొచ్చి లంకలో
నీ విధి మిమ్ము గూడికొని యేఁ జనుదెంచినఁ గాంచి వానరుల్ 28.

తే.గీ. శూన్యమును ఛిద్రమును లంకఁ జూచి చక్క
ని యవకాశమ్మును మథింత్రు రయమునఁ బురి
నెల్లరకు దుర్జయమ్మును దల్లడిల్లఁ
బ్లవగు లందఱు నిత్తురు బాధ లడరి 29.

చం. వదలి వెసన్ నిశాచరుల వారలు వే చన నూని యాజ్ఞనుం
దదుపరి వానరౌఘమును దద్ద కలంచె దశాస్యుఁ డుద్ధతిం
గదలచుఁ బెద్ద చేఁప వడి గర్వ బలోన్నతి సాగరౌఘముం
వదలక తాఁ గలంచు విధి వారక క్రోధ సమేతుఁడై యనిన్ 30.

ఉ. వచ్చెడు రాక్షసేంద్రుఁ గని బాణ సమేత ధనుస్సు తోడుతం
జెచ్చెర వాన రాధిపతి చేఁగొని శృంగ వరమ్ము పర్విడెన్
హెచ్చిన యాగ్రహమ్మున నహీన పరాక్రముఁ డద్దశాస్యు పై
పిచ్చ సెలంగ డెందమున వే వధియింపఁగ సంభ్రమమ్మునన్ 31.

చం. విసరెను శైల శృంగమును వృక్ష ససాను తలమ్ము నంత ర
క్కసుని పయిం గపీశ్వరుఁడు గ్రన్ననఁ గాంచి దశాననుం డహో
పసిఁడి మయంపు పుంఖముల బాణ గణమ్ములఁ ద్రుంచె దానినిన్
వెసఁ జెలరేఁగి రావణుఁడు భీతి నెడంద వహింప కింతయున్ 32.

చం. బలిసిన కొండ సెత్తములు పాదప పంక్తులు నున్న శృంగమే
పలు శకలమ్ములై పుడమి వ్రాల మహాహి సమాన బాణముం
దులితము ఘోర కాలునకుఁ దూర్ణము రాక్షస నాథుఁ డేసె నా
జ్వలన నిభమ్ము నగ్ని కణ జాలము వానర భర్తఁ జంపఁగన్ 33.

తే.గీ. అనల శక్రాశని సదృశ మైన శరము 34.

రావణ కర ముక్తము వానర పతిఁ జేరి
త్రుటిని భేదించె నంగముఁ బటిమ గుహుఁడు
క్రౌంచ గిరిని భేదించిన గతిని మున్ను

ఉ. కూలెను సాయ కార్తుఁ డయి కుంభినిపై వెస వీత సంజ్ఞుఁడై
వాలి సహోదరుం డఖిల వానర నాథుఁడు గాంచి వానినిన్
నేలను గూల రాక్షసులు నెమ్మి సెలంగ భృశం బెడందలన్
మేలని యార్చి రెల్లరును మేటి బలాఢ్యులు విఱ్ఱవీఁగుచున్ 35.

తే.గీ. అంత గవయ గవాక్షులు నా సుషేణుఁ
డు ఋషభుండు జ్యోతిర్ముఖుఁడు నలుఁ డద్రి
వరములఁ బెకలించి వివృద్ధ వపులు దూఁకి
రెల్ల రసురేంద్రు పైపున కిద్ధ బలులు 36.

ఉ. వారి ప్రహార జాలమును వ్యర్థ మొనర్చెను రావణుం డనిన్
నారసముల్ దగం బఱపి నైరృత నాథుఁడు వాడి ముల్కులన్
వీరుఁడు వానరేంద్రులను వేసి మహాధన చిత్ర పుంఖముల్
ఘోరము లెల్లఁ జీల్చె వెసఁ గూలఁగఁ బృథ్వి శితాంబకమ్ములన్ 37.

కం. త్రిదశారి బాణజాలము
న దారితు లయి భృశముగ వనచరప్రవరుల్
కదలం జాలక పుడమిని
నొదుగ నసుర కపుల నొంచె నుగ్ర శరములన్ 38.

తే.గీ. శరములం గప్పఁ బడ హరి సైన్య మగ్ర్య
వీరు లవనిఁ గూలఁగ నార్చి విద్ధులై శ
రమ్ముల శరణ్యు రాముని నిమ్ముగ శర
ణమ్ము వేఁడిరి హరులు భయమ్ము కదుర 39.

ఆ.వె. అంత రాఘవుఁడు మహాత్ముఁడు ధన్వి విం
టినిఁ గొని వెసఁ దాను జనుచు నుండఁ
గాంచి లక్ష్మణుండు కరములు మోడ్చి మ
హార్థ యుక్త గిరల నన్న కనియె 40.

ఉ. చాలుదు విద్దురాత్ము రభసమ్ముగఁ జంపఁగ నార్య నీవు నే
నాలము నందుఁ జంపెద దశాననను నీచు ననుజ్ఞ నిమ్మనన్
మేలుగ లక్ష్మి వర్ధనుఁడు మేటి బలాఢ్యుఁడు లక్ష్మణుండు దా
లాలనఁ బల్కె వాక్యములు రాముఁడు సత్య పరాక్రముం డిటుల్ 41.

చం. వెడలుము ధీర! యత్నపర వీరుఁడవై సమరం బొనర్పఁగాఁ
దడయక రావణాసురుఁడు ధాత్రిని నద్భుత విక్రముండు వీ
రుఁడు రణ దుర్జయుం డితని రోషము నూనిన ముజ్జగమ్ములం
దడరి సహింపఁ జాలిన మహాత్ముని గాంచ నసాధ్యమే యగున్ 42.

ఉ. నేరుమ వాని లోపములు నీ యబలమ్మును గాంచి యింపుగాఁ
దీరుగ నిన్ను నీవు కడు దిట్టపు వింటిని స్వీయ చక్షులన్
మూరి సతమ్ము కాచికొను పోరునఁ జక్క సమాహితుండవై
వీర వరేణ్య! నాఁ బలుకఁ బ్రీతిని రాముఁడు తమ్ముఁ డంతటన్ 43.

తే.గీ. లక్ష్మణుఁడు పరిరంభించి రాఘు వేంద్రు
నంత నర్చించి కైమోడ్పు లాచరించి
యుద్ధ మొనరింప సౌమిత్రి యుత్సహించి
చాగె నరి భయంకరుఁ డంత సమరమునకు 44.

మ. కనియెన్ లక్ష్మణుఁ డాజి రావణుని రక్షశ్శ్రేణికిన్ నాయకున్
కన దుద్యద్ధన దీప్త కార్ముకు మహా కాళింగ హస్తాభ పా
ణి నికాయున్ శర వృష్టి మగ్న కపి గంధేభవ్రజున్ భిన్న దే
హ నిరస్తాంగ నికాయ వానర సు ఘోరానీకునిన్ ఘోరునిన్ 45.

తే.గీ. కని మహాతేజుఁ డా దశకంఠుని హను
మంతుఁడు మరుత్తనయుఁ డట మాన్పి విశిఖ
జాల మెల్ల రావణు దెస గేళి నుఱికి
చేరి తేరు పల్కెను గుడి చేతి నెత్తి 46.

ఆ.వె. త్రాస మీయ నాజి రావణున కతఁడు
వలికె సురల దానవ గణ యక్ష 47.

గణముల నసుర తతి గంధర్వుల వలన
భయము లేదు కలదు వాన రాళి

ఆ.వె. పంచశాఖ లుండ వఱలు నా కుడి చేయి
నీదు తనువు నందు నెగడు చుండ
దీర్ఘ కాలము భవదీయ జీవాత్మ దా
ని విలయమ్ము సేయు నేఁడు చూడు 48.

కం. విని మారుతి వచనమ్ములు
కను లెఱ్ఱఁ బడంగఁ గిన్క గాఢక్రోధ
మ్మున భీమ విక్రముఁడు దా
ననియె నసుర నాథుఁ డిట్టు లతి పరుషముగన్ 49.

ఆ.వె. శంక వీడి కొట్టు సత్వరమ్ముగఁ గీర్తి
నందు మీవు స్థిరము నరసి దాని
వానర! నిను వేగ నేను నాశన మొన
రింతు వీర్య మెఱఁగి చింత లేక 50.

కం. విని రావణేరితములు వ
చనములు హనుమంతుఁ డనియె స్మరియింపుమ నే
మును కొట్టిన నీ తనయుఁ డ
గు నక్షుని మనమున నంచుఁ గ్రోధాత్ముండై 51.

కం. అనఁగ విని మహా తేజుఁడు
తన తలమునఁ గొట్టె మారుత తనయు వక్ష
మ్మున రాక్షసేంద్రుఁడు దశా
ననుండు రావణుఁ డలిగి ఘనమ్ముగ నంతన్ 52.

కం. కరతల ఘాత రయమ్మున
మరుత్సుతుండు వణఁకి పలుమాఱులు కరమున్
స్థిరుఁడై ముహూర్త కాలము
న రావణు నిజ కరతలమున నడరి కొట్టెన్ 53.

ఆ.వె. అంతఁ గొట్టఁ బడఁగ నాంజనేయుని చేత
నట్టు లాజి నమ్మహోత్ము చేత
దశవదనుఁడు వణఁకె ధరణి కంపింప న
చలము కదలు నట్టి చంద మొప్ప 54.

కం. తల తాడితు రావణుని ము
నులు సిద్ధు లసురులతో ఘనులు సురలు ప్లవం
గులు నా ఘోర సమరమున
నెలుంగు లొనరించి రెల్ల రీక్షించి వెఱన్ 55.

ఉ. రావణుఁ డూఱడిల్లి వెస రాక్షస నాథుఁడు పల్కె నివ్విధిం
జేవను శ్లాఘనీయుఁడవు చెన్నగు నా రిపుఁ డౌదు వీ వనం
దా వచియించె వాయుజుఁడు తద్దయు సిగ్గు సెలంగ నిట్లు ఛీ
యేవ నొసంగు నా బలిమి యింకను జీవము లుండ నీ కిటుల్ 56.

కం. వాగెద వేలనొ దుర్మతి
యాగక కొట్టు మొక తూరి యడిచిన నంతన్
వేగమ నిను నా ముష్టియె
చాగం జేయు యమపురికి సంశయ మేలా 57.

కం. దక్షిణపు ముష్టినిఁ గినిసి
రాక్షస పతి యెత్తి వానర వరుని గిరలం
గక్ష సెలఁగఁ నా యెఱ్ఱని
యక్షు లడరఁ గొట్టె నురము నందు ననిలజున్ 58.

చం. కని హనుమంతు విహ్వలునిఁ గంపితుఁ బల్మఱు వక్ష ఘాతునిన్
ఘన బలు నట్టు లయ్యసుర కాంతుఁడు నిల్చి రథమ్ము నందుఁ జా
గె నతిరథుండు నీలుఁ బరికించి రయమ్మున మర్మభేదులం
గనలి కురించెఁ బన్నగ నికాశ శరమ్ములు సైన్య నేతపై 59.

తే.గీ. నీలునిఁ గపి చమూపతిని వెలిఁగింప
దీప్త నారాచ పంక్తుల ధీరుఁ డా ప్ర
తాపవంతుం డని దశవదనుఁడు నీలుఁ 60.

డంత నొక చేతఁ గొని పర్వతాగ్రము వెస

చం. విసరెను రాక్షసేంద్రు పయి వేగమ యంతట వాయుజుండు లే
చి సురుచిరమ్ముగం దెలివిఁ జెంది మనస్వి రణాభిలాషి చూ
చి సమర మందు నీలు హరి శేఖరుఁ గూడి చెలంగు చున్న రా
క్షస విభుఁ బల్కె నన్య రణ సక్తుని మార్కొనఁ బాడి కాదు నాన్ 61.

కం. శరముల నేడిట శృంగము
ను రావణుఁడు తీక్ష్ణముల ఘనుఁడు ముక్కలు సే
య రయమ్మున నేలం గూ
లె రవమ్ము లెసఁగఁ గపులు నిరీక్షింపఁ ద్రుటిన్ 62.

కం. పగిలి గిరి శృంగ మవనిఁ బ
డఁ గని చమూపతి కనలె నెడఁదఁ పర దమనుం
డగు నీలుం డంత భృశ
మ్ముగఁ గాలానల నికాశము సమర భూమిన్ 63.

తే.గీ. అంత నీలుఁ డాజి విసరె నశ్వకర్ణ
సాల చూ తాది నా నాన్య సాల జాల
మును సుపుష్పితమ్ములఁ గోపమునఁ జెలంగి
రాక్షసేంద్రుని పై వానరప్రవరుఁడు 64.

కం. ఆతఁడు మార్కొని రయమున
నా తరు పంక్తి నఱకెను శితాంబక ధారా
పాతమ్మున ఘోర శర
వ్రాతమ్మునఁ గప్పె రోసి పావకి నంతన్ 65.

కం. కురియఁ బడ శరౌఘమ్మున
హరి పతి మేఘమ్ము భంగి నతి బలుఁడంతన్
గురు నిజ తనువుఁ గుఱుచగ నొ
నరిచి నిలిచె టెక్కెము పయి నగచరుఁ డెలమిన్ 66.

కం. కని పావకాత్మజుని ధ్వజ 67.

మునకుఁ జివర నుండఁ గోపమున వెస మండెన్
ఘనుఁడా దశవక్త్రుం డఱ
చెను నీలుండు భృశముగ విచిత్రధ్వనులన్

కం. నిలచి పతా కాగ్రమ్మున
జ్వలత్కిరీ టాగ్రమునను జాపాగ్రమునన్
విలసిల్లు చుండ నీలుఁడు
కలిగె వెఱఁగు రాఘవులకుఁ గాలి సుతునకున్ 68.

చం. హరివరు లాఘవమ్ముఁ గని యచ్చెరు వందెను రాక్షసేంద్రుఁడే
విరివిగ మండు టస్త్రమును వేగమ యా యనలాస్త్ర రాజముం
గరమునఁ దాల్చఁ దత్తఱము కల్గఁగ నీలుని వేగ మారయన్
మురియుచు నార్చి రారసి రిపున్ హరి వీరులు లబ్ధ లక్ష్యులై 69.

కం. వానరుల ఘోషను వినఁగ
మానసమున సంభ్రమమ్ము మానక రేఁగం
దా నెద్ది యేని చేయఁగ
లేని గతిని నయ్యసుర వరేణ్యుఁడు నిలిచెన్ 70.

కం. కసి నాగ్నే యాస్త్రమ్మును
వెస సంధించి శరమునఁ గపివరేణ్యుని నీ
లు సమీక్షించి యట ధ్వజ
మ్ము సివర రావణుఁడు వాక్యము లనియె నిట్లున్ 71.

ఆ.వె. రావణుండు పలికె రాక్షసేశ్వరుఁడు తే
జస్వి మాయఁ గూడి చక్క నైన
లాఘవమునఁ గపివర! తనరు చున్నావు
మిక్కుటముగ నిచట నక్కజముగ 72.

ఆ.వె. చేవ గలిగె నేని నీవ రక్షించుకొ
నుమ బలిమిని నిన్ను సమర మందు
నూను చుంటి వీవు వానర! వివిధ రూ
పము లనేకములను వ్యర్థముగను 73.

ఉ. పేయఁగ నేను బాణమును పేగమ కూర్చుచు నస్త్రరాజముం
దీయును నీదు ప్రాణములు ధీరతఁ గాచిన నీవు వాని నం
చా యసురేంద్రుఁ డంతట మహాస్త్రము బాణవరమ్ము నందు సం
ధాయక మింపుగాఁ దనరఁ దా నొనరించి కపీంద్రుఁ గొట్టఁగా 74.

ఆ.పె. అస్త్ర యుక్త బాణ మా నీలు ఔమ్మునఁ
దగుల మండుచు భృశముగ ధరా త
లమునఁ గూలె నంతఁ బ్లవగ సేనాపతి
దారుణముగఁ గనలి తత్క్షణమ్ము 75.

ఆ.పె. తండ్రి మహిమ తోడఁ దనదు తేజమ్మున
వీడక యసువులను  వీర వరుఁడు
భూమి పైనఁ గూలె మోఁకాళు లానంగ
వ్రాల వానిఁ గాంచి లక్ష్మణుండు 76.

ఉ. ఆరసి మూర్ఛ నందిన మహా కపిసైన్య పతిన్ దశాననుం
డా రణ కౌతుకుండు రథ మందు మహాభ్ర ర వాభ మందుఁ దాఁ
జేరఁగ నంత లక్ష్మణుని శీఘ్రమ పర్విడి యుద్ధ భూమిలో
వీరుని నాపి యుద్ధతిని వింటిని మండుచుఁ దట్టి నిల్వఁగా 77.

చం. పొడగని యప్రమేయ ధనువున్ పెసఁ దట్టుచు నున్న రావణుం
గడు బలవంతుఁ డిట్టు లనెఁ గ్రన్ననఁ బల్కులు లక్ష్మణుండు  వీ
రుఁ డడరి యో నిశాటగణ లోకపతీ! తగదే యెదిర్ప దం
డడిఁ గని నీకు వానరుల ధైర్యముతో నను దాఁకఁ జాగుమా 78.

ఆ.పె. వాడి నారి మ్రోత గూడిన యాతని
గిరల నెల్ల నాలకించి రాజు
సరస కేఁగి యంత సౌమిత్రితో సరో
ష మసుర వరుఁ డనె వచనము లిట్లు 79.

ఉ. దైవ వశమ్ము చేత నుచితమ్ముగ వచ్చితి నాదు దృష్టికిం
బోవఁగ నంత కాలయము ముందుగ నో విపరీత బుద్ధి! యో 80.

భూవర పుత్ర! నా శర సమూహముచే వ్యథితుండ వై వెసం
బోవుదు వీ క్షణమ్ము ననె పోరునఁ గూలఁగ మృత్యు శాలకున్

చం. అతనికిఁ జెప్పె విశ్మయము నందక గర్జితుఁ గాంచి రావణున్
శిత ఘన దంష్టు లక్ష్మణుఁడు చెప్పరు గొప్పలు రాజ! ధీరులే
యతి కలుషాత్ము లన్ ఘనుఁడ! యాత్మ బలమ్ము వచింతు వేల నా
తతముగ నేను నేరుదును ద్వద్బల వీర్య పరాక్రమమ్ములన్ 81.

ఉ. ఉంటిని నే ధనుశ్శరము లూని రణాంతర భూమి నిచ్చటం
గంటివె నీ ప్రతాపమును గాంచెద రమ్మిక వాఁగు దూరకే
మంట సెలంగఁ గోపమున మానుష భోజనుఁ డేడు బాణముల్
వింటినిఁ గూర్చి వేసెఁ గని వేగమ లక్ష్మణుపై సుపుంఖముల్ 82.

ఉ. కాంచన పుంఖ బాణములఁ గ్రన్నన వానిని లక్ష్మణుం డహో
త్రుంచెను వాడి యంచులను రోష పరీత మనస్కుఁడై యనిం
గాంచి నికృత్త బాణముల ఖండిత భోగ ఫణీంద్ర తుల్యముల్
మించి దశాననుండు రుష మేటి శితాన్య శరమ్ము లేయఁగా 83.

ఉ. రావణు బాణ పంక్తులను లక్ష్మణుఁ డింపుగఁ గూల్చె నన్నిటిం
జేవ క్షురార్ధ చందిర విశేష శిఖోన్నత కర్ణి భల్లముల్
వావిరి రామ సోదరుఁడు పన్నుగ వేసి యనార్తుఁ డయ్యెడన్
రావణుఁ డందె విస్మయము లక్ష్మణు వేగము గాంచి యత్తఱిన్ 84.

కం. కని స్వీయ మోఘ బాణము
లను ద్రిదశారి సునిశిత శరములఁ తిరిగి వే
సెను రావణుండు సౌమి
త్రినిం గని యనేకములను దీవ్రతరముగన్ 85.

తే.గీ. లక్ష్మణుఁడు గూడ బాణమ్ముల నశని నిభ
ముల మహేంద్ర నిభుఁడు చాపమునఁ బ్రకాశ
వంతములు గూర్చి వేసెను వడి వధింప
రాక్షసేంద్రు శితాగ్రములను జెలంగి 86.

ఉ. వానినిఁ జేసి ముక్కలుగ బాణ పరంపర రాక్షసప్రభుం
డా నలినాసనుం డిడిన నమ్మును నగ్ని నిభమ్ము నంత రా
మానుజు ఫాల భాగమును నారసి వేసెను వేసి నంతటన్
దానికిఁ దాఁ జలించె వితతమ్ముగఁ జాపము సుంత జాఱఁగా 87.

తే.గీ. రావణ శరార్తుఁ డంతట లక్ష్మణుండు
వడసి సంజ్ఞను రఘువీర వరుఁడు కష్ట
మడర యత్నించి యా త్రిదశారి భీమ
చాపమును ద్రుంచె భీకర శరము నేసి 88.

తే.గీ. భగ్న చాపుని నిశితాగ్ర బాణములను
వేసి మూడింటిఁ గొట్ట నా వీర వరుఁడు
దాశరథి రావణుఁడు శరార్త తనుఁ డటఁ జ
లించి పడసెఁ గష్టమునఁ దిరిగి తెలివిని 89.

చం. తునిసిన విల్లు వాఁడు మఱి తూపున నార్తిని నున్న వాఁడు మే
నున రుధిరమ్ము కాఱెడు ఘనుండును మేఁ దడియంగఁ గ్రొవ్వునం
గినిసిన వాఁడు శక్తి యుత కీర్తిత రావణుఁ డంత శక్తినిం
గొనె నలి నాసనుం డిడిన ఘోరపు టాయుధముం గరమ్మునన్ 90.

ఉ. ధూమము లేని యగ్ని వలెఁ దోఁచెడు శక్తిని శక్తిమంతమున్
భీమపు భీతి నీయఁగఁ గపిప్రవ రాలికి మండు దానినిన్
భీమ బలుండు రావణుఁడు వేగముగా విసరెన్ బలమ్ముతో
భీమ పరాక్రముం డయిన వీరుని లక్ష్మణుపై రణమ్మునన్ 91.

తే.గీ. అస్త్ర యుత బాణముల భరతానుజుండు
వచ్చు శక్తినిం గొట్టెను మెచ్చక యన
లాభ శరముల శక్తి భుజాంతరమునఁ
గడు విశాల మైనట్టి వక్షమునఁ దూఱె 92.

చం. వెలిఁగెను వ్రాలి భూమి పయి విస్తృత శక్తి యుతుండు శక్తిచే
బలముగ ఘాతుఁ డైనను నపార పరాక్రమ లక్ష్మణుండు వి
హ్వలుఁ గని రావణుండు దశవక్త్రుఁడు వేగమ చేరి చెంతకున్ 93.

బల నిజ బాహు యుగ్మమునఁ బన్నుగఁ బట్టి తొడంగె నెత్తఁగా

తే.గీ. హిమ నగమ్మును మందర మేని మేరు
పర్వతమును ముజ్జగముల సర్వ దేవ
తలను గూడి శక్తి యుతుఁ డెత్తంగ నట్టి
రావణుం డెత్త లేకుండె లక్ష్మణు నట 94.

ఆ.వె. బ్రాహ్మ్య శక్తి చేత లక్ష్మణుం డనిఁ గొట్టఁ
బడిన వక్ష మందు బెడిదముగను
దలఁచె నంత నెడఁదఁ దన్ను నూహింప లే
నట్టి విష్ణు భాగ మంచు నపుడు 95.

ఆ.వె. దేవ కంటకుండు రావణుం డంత దా
నవుల దర్ప మడచు నలిననాభు
నంశు లక్ష్మణుని నరావతారుఁ గదల్ప
లేక బాహువుల నిలిచె నతండు 96.

తే.గీ. వాయు సుతుఁ డంతఁ బరుగున వచ్చి కోప
మూని భృశముగ రావణు మూరి కొట్టె
వజ్ర సన్నిభ ముష్టిని వక్ష మందుఁ
బడఁగఁ గంపించి మోకాళ్లఁ బుడమి పైన 97.

చం. చెవులను నాస్య నేత్రములఁ జిక్కని రక్తము కాఱెఁ దూలుచున్
వివశత నిశ్చలుండు నయి వీరుఁడు కూలఁ బడెన్ రథమ్ముపైఁ
దివిరిన నిల్వ లేక యిఁకఁ దేరఁగ మూర్ఛ విసంజ్ఞ రాక్షస
ప్రవరుఁడు ముష్టి ఘాతమున వానిని నవ్విధి గాంచి వానరుల్ 98.

ఆ.వె. ఋషులు సాసుర సుర లెల్ల రా భీమ వి
క్రముని రావణుఁ గని రణము నందుఁ
భీకరధ్వనులను వీఁక నొనర్చిరి
యంబరమ్ము నంట నంత వింత 99.

చం. కొని చనె వాయునందనుఁడు కూర్మిని లక్ష్మణు స్వీయ బాహులన్ 100.

వనరుచు రావణార్తుని నపార బలున్ రఘు రాము చెంత కం
త నిజ రిపువ్రజమ్మునకుఁ దద్ద యకంప్యుఁడు నయ్యె వాయు నం
దనునకు భార హీనముగఁ దద్ద సఖిత్వము భక్తి యుండుటన్

కం. ఘను సౌమిత్రి జయించి పె
స నరిగి దశకంఠ ముక్త శక్తి విడిచి శ
త్రుని లక్ష్మణు ధీరునిఁ జే
రె నా రథస్థానమును దిరిగి భద్రముగన్ 101.

కం. ఘన తేజస్వి దశాననుఁ
డును సంజ్ఞను బడసి వీరుఁడు మహా సమర
మ్మున నంతఁ గొని మహద్ధను
వును గైకొనె శిత శరములు పుంఖ లసితముల్ 102.

కం. తలఁపఁగఁ దన్నూహింపఁగ
నలవియె కాని హరిభాగ మని రిపు దమనుం
డిల లక్ష్మణుండు శల్య
మ్ములు తొలఁగ నరోగి యయ్యెఁ బూర్ణము నంతన్ 103.

కం. కని వానర సైన్యమ్మున
ఘన వీరులు కూల నాజిఁ గాకుత్స్థుం డం
త నసుర నాథుని దశ వ
క్త్రుని చెంతకుఁ బర్విడె వడి రోషాత్ముండై 104.

ఉ. అంత సమీప మేఁగి యనిలాత్మజుఁ డా రఘు వీరు తోడ నీ
వంతము సేయ రాక్షసుని నాజిని నెక్కుమ నాదు వీపు ధీ
మంతుని వైనతేయు పయి మాధవుఁ డెక్కిన భంగి నంచుఁ దా
నెంతయొ భక్తిఁ బల్కఁగ నరేంద్రుఁడు రాముఁడు సంతసమ్మునన్ 105.

తే.గీ. ఆలకించి వాయు తనయుఁ డన్న మాట
లంత మనుజాధిపుఁడు హనుమంతుని ఘన
పృష్ఠ మపు డధిరోహించి పెస వర రథ
మందు నున్న రావణుఁ గాంచె నాజి లోన 106.

ఆ.వె. రావ ణాసురుఁ గని రాముఁడు తేజస్వి
వేగ దూఁకె నంత వీఁక వాని
పైకి విష్ణువు మును వైరోచనుని పైకి
నాయుధమ్ము నెత్తి యరుగు నట్లు 107.

చం. ఘనముగఁ జేసి జ్యా రవము కాంతుఁడు వజ్రము నల్లు నట్టు లా
యినకుల వార్ధి పూర్ణశశి యిమ్ముగఁ బల్కె గభీర వాక్కులం
గని యిటు లాఁగు మాఁగు దశకంఠ! నిశాచర! చేసి యప్రియ
మ్ము నిటుల నాకు నందుదువు మోక్షము నెచ్చటి కేఁగి యెవ్విధిన్ 108.

తే.గీ. యమ రవీంద్ర వైశ్వానర కమల జాత
శంకరుల కడ కేఁగిన సత్వరము ద
శ దిశల కరిగిన నిఁక మోక్షమ్ము నంద
లేవు నా నుండి రావణ! నీవు నేఁడు 109.

ఉ. ఎవ్వరు నీదు శక్తిఁ దపియించి ధరం బడె నేఁ డతం డహో
నివ్వెఱ లేచి మృత్యు వగు నీ కసురేంద్ర! సపుత్ర పౌత్రమున్
రివ్వున నీ చతుర్దశ బలీయ నిశాచరులా జనస్థలిన్
నొవ్వుచు కూలి రే శిఖుల నుగ్గయి యయ్యవి యీ శరమ్ములే 110.

తే.గీ. ఉత్త మాయుధ ధారులు నుగ్ర రూపు
లౌ జనస్థాన వాసులు నధిక బలులు
కూలి రెల్ల మదీయ శరాలి రాక్ష
సర్షభ ముహూర్త మాత్రమ సంగరమున 111.

మ. విని యా రాముని మాట లెల్లను మహా వేగోగ్రు రక్షో విభుం
డనిలాత్మోద్భవుఁ గాంచి మున్ను గల స్వీయాసూయ నెల్లం దలం
చిన క్రోధమ్మున ఘోర దీప్త శిఖలన్ శీఘ్రుంబ కాలాగ్ని మిం
చిన నారాచము లేసి మోయ నృవరుం జీల్చెన్ వరాంగమ్ములన్ 112.

ఆ.వె. రాక్ష సేంద్రు నా శరమ్ముల పీడితుం
డయిన స్వీయ తేజ మడరు హనుమ 113.

మారుతాత్మజుండు మరల పెరిగెఁ దేజ
మందు మిక్కుటముగ నక్కజముగ

కం. ఘన తేజుం డా రాముఁడు
కని రావణ సాయ కార్తుఁ గపి శార్దూలున్
ఘన రోషావేశుం డ
య్యెను సమ రాంతరము నందు నీక్షింప హరుల్ 114.

తే.గీ. భగ్న మొనరించె నిశితాగ్ర బాణ పంక్తి
నంతఁ గదిసి కాకుత్స్థుండు స్యందనము స
చక్ర సపతాక సధ్వజ చ్ఛత్ర హయ స
సారథి స శూల ఖడ్గ సాశనిఁ జెలంగి 115.

ఆ.వె. అంత దేవ రిపు భుజాంతరమ్మున సువి
శాల రమ్య రూప జాత మందు
వజ్ర సన్నిభ శర వరమునఁ గొట్టె వ
జ్రమున వజ్రి మేరు శైలముఁ గ్రియ 116.

ఉ. ఎవ్వరు వజ్ర పాతమున నింక మహాశని పాత మందునున్
నొవ్వఁడొ కంప మందఁడొ యనూహ్యము రామ శ రాభిఘాతుఁడై
యవ్వర రాక్ష సేంద్రుఁడు మహాహవ మందుఁ జలించె నార్తుఁడై
నివ్వెఱ వీడెఁ జాపమును నిర్జయుఁ డైనను శక్తి హీనుఁడై 117.

తే.గీ. కాంచి విహ్వలు రావణు నంచితమ్ము
గ వెలుఁగు మహార్ధ చంద్ర సుకాండ మూని
దాని చే నర్క వర్ణికఁ దనరు వాని
మకుటమును జీల్చెను రఘురామ విభుఁ డడరి 118.

తే.గీ. విషము లేని సర్పము భంగి వెలుఁగు లేని
తఱిఁగిన కిరణ రాసులఁ దపను భంగి
సిరి చెడఁగఁ గిరీ టాదులు శిథిలము లయి
యున్న యసురేంద్రు తోడ నరోత్తముఁ డనె 119.

ఉ. చేసితి దొడ్డ కార్యమును జేసితి నన్ను గపిప్రవీర హీ
నాసమ దుఃఖ తప్తునిగ నా కరణమ్మున డస్సితీవు ని
న్నా సమవర్తి గేహమున కంపఁ దలంపను మచ్చరమ్ములన్
వీసము భీతి లేక చను వేగ నిశాచర నాథ! లంకకున్ 120.

ఆ.వె. ఏఁగు మనుమతింప నెలమి నీ వూఱడి
ల్లి నిసి రథ ధనువులఁ గొని బలమున
రమ్ము చూతు వీవు రథమున నిలిచి నా
బలము నెల్ల నసుర వర్య! యాజి 121.

తే.గీ. అన విని హత దర్పానంద హత నిజాశ్వ
సూత విశిఖార్త ఖండిత జాతరూప
మకుటుఁ డంతఁ బ్రవేశించె వికల మాన
సుండు నయి లంక కసుర విభుండు వేగ 122.

కం. ఏఁగ రజనీ చరుఁడు పురి
కా గతి నమరారి లంక కంత నొనర్చెన్
వేగ విశల్యులుగఁ గపుల
నా గురుబల లక్ష్మణుని నరాధిపుఁ డనిలో 123.

తే.గీ. ఓడ నింద్రారి వీక్షించి యుత్సహించి
ముదము నందిరి యమరులు భూత రాశి
గూడి యసురులు వార్ధుల గూడి దిశలు
నహులు భూ జల చరులు ననల్పముగను 124.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నేఁబది తొమ్మిదవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 60.

శ్రీరాముని చేతిలోఁ బరాజయ మంది రావణుఁడు లంక కేఁగి నిద్రలో నున్న కుంభకర్ణుని లేపి తన వద్దకు రమ్మని చెప్పుఁ డని రాక్షసుల నాజ్ఞాపింప వా రేఁగి కుంభకర్ణుని నతి కష్టమున లేపఁగ నాతఁడు రావణునిఁ జూడ వచ్చు చున్న వానరు లెల్ల వానిఁ గాంచి భీతిల్లుట.

కం. కలఁగె నిజేంద్రియములు చే
ర లంకకు దశాననుండు రామ శర భయం
బలవడ నార్తుఁ డయి భృశము
విలయము కా దర్ప మెల్ల విలపించె నెదన్ 1.

చం. కరి మృగ రాజు చేత భుజగప్రవరుం డల వైనతేయుచేఁ
బెరుఁగక యోడి నట్లసుర వీరుఁడు రాముని కోడె వానివౌ
శరముల బ్రహ్మదండ నిభ సాయక కోటిఁ దటిన్నిభప్రభా
సురుచిర వర్ణ తుల్యముల స్రుక్కి స్మరింపఁగ రావణుం డెదన్ 2.

తే.గీ. పసిడి మయమైన పరమ దివ్యంపు టాస
నమ్ము నాశ్రయించి పలికె నుమ్మలించి
గాంచి రాక్షసులను దశకంఠుఁ డిట్లు
వాక్యములు రాక్షసేంద్రుఁడు వంతతోడ 3.

ఉ. చేసిన నా తపం బది యశేషము పూర్ణము వ్యర్థ మయ్యెనే
నే సముడన్ బలారికిని నే నిట మర్త్యున కోడి యుంటిఁ బ
ద్మాసనుఁ డన్న భాషణము లక్కట చేరెను నన్ను మానవ
త్రాసము కల్గు నీకు నిల రావణ! యన్నవి సత్య మైనవే 4.

తే.గీ. దేవ దానవ గంధర్వ పావ నోర
గాసుర గణ యక్షాది నికాయమున న
వధ్యతను బొంది యుంటిని బ్రహ్మ నడుగ
లేదు నే న రావధ్యం బనాదరమున 5.

ఉ. పుట్టును నాదు వంశమునఁ బుత్రులు మంత్రులు నశ్వ సూతులున్
గట్టి బలమ్ము గూడ నిను గాలుని యింటికిఁ బంపు వాఁడు దా 6.

నెట్టన నంచు పూర్వమ యనెన్ ఘనుఁ డా యనరణ్యుఁడే ననుం
దిట్టుచు వంశదుష్ట! కుమతీ! యసురాధమ! యంచుఁ గిన్కతో

తే.గీ. విదిత మయ్యె నతఁడు రఘు వీరుఁ డైన
నరుఁడు రాముఁ డని యిపుడు నాకు దాశ
రథి యనంగ  యిక్ష్వాకు గిరలు స్మరింపఁ
గ ననరణ్యు వాక్యమ్ములు మనము నందు 7.

కం. శపియింపఁ బడితి వేదవ
తి పడతిచే నామె యవమతి యయి కినియఁగా
నపు డే నామెయె సీతగ
నృపునకు జనకునకుఁ బుట్టె నిరుపమ భూతిన్ 8.

ఆ.వె. ఉమయు రంభయు వరుణోద్భవా నందీశ్వ
రులు నుడివిరి యెట్లు రోష మూని
యట్లు ప్రాప్త మయ్యె నక్కట నాకిప్డు
ఋషుల మాట లేల రిత్తవి యగు 9.

ఉ. మీర లెఱింగి శాపములు మిన్నగ యత్నము సేయ నర్హులే
వీరులు రాజ వీథులను వేగమ గోపుర మూర్ధ పంక్తులన్
వారక నిల్వగా వలెను బన్నుగ రాక్షస వర్యు లెల్లరున్
ధీరుని కుంభకర్ణుఁ గని దేవ సదానవ దర్ప హంతకున్ 10.

తే.గీ. అప్రతిమ గభీరుని జలజాసన ఘన
శాప తప్తుని సుప్తునిఁ జక్క లేప
వలయు నని నెఱిఁగి తన యపజయ మా ప్ర
హస్తు నిధన మాదేశించె నసుర వరుల 11.

కం. తగ రక్షింపుఁడు ద్వారము
లఁ గలసి ప్రాకారములను రయమున నెక్కుం
డు గురుతర నిద్రు లేపుఁడి
యగణిత బలు కుంభకర్ణు నంచిత రీతిన్ 12.

తే.గీ. ఏ డెనిమిది తొమ్మిది లేక పొడిగఁ బది
సెలలు నిద్రించు సుఖముగఁ గలఁత లేక
కుంభకర్ణుఁ డకట కాల కుంఠిత నిజ
చేతనుం డసుర వరుండు చిత్రముగను 13.

కం. అనుమతి గైకొని నిద్రిం
చెను దొమ్మిది దినములు గడచెను నేఁటికి నా
ఘన బలునిఁ గుంభకర్ణుని
ననిద్రుఁ జేయుఁడు వెసఁ జని యసురప్రవరుల్! 14.

తే.గీ. సర్వ రాక్షసశ్రేష్ఠుండు సంపఁ గలఁడు
కుంభకర్ణుండు క్షిప్రమ్ము ఘోర వాన
రులను రాజకుమారులఁ గలను లోనఁ
జెలఁగి యమ్మహాబాహుండు చింత లేక 15.

చం. సమరమునం బతాకుఁ డగు సర్వ మహాసురు లందు ముఖ్యుఁడే
సమదము కుంభకర్ణుఁడు భృశమ్ముగ మూఢుఁడు నిద్రవోవు ని
త్యము మఱి గ్రామ సౌఖ్యములఁ దద్దయుఁ బ్రీతి వహించు చుండుఁ దా
సమరము లందు దుర్జయుఁడు శత్రు భయంకరుఁ డిద్ధ తేజుఁడున్ 16.

ఉ. లేవఁగఁ గుంభకర్ణుఁడు వరిష్ఠుఁడు రామ పరాజితుండు గా
నీ వర ఘోర యుద్ధమున సెంతయు నార్తి వహించి నట్టి యీ
రావణు శోక మంత మగు భ్రాతయె సాయము కష్ట వేళలోఁ
జేవను శక్ర తుల్యుఁ డయి చేయని చో నతఁ డేల నా కహో 17.

చం. విని దశకంఠు వాక్యములు వీరులు మాంస సరక్త భోజనుల్
చని వెసఁ గుంభకర్ణు సువిశాల గృహమ్మున కంత సెల్లరుం
గొని వర గంధమాల్యములు కుంభశతమ్ములు భోజనమ్ములం
దనరఁగ యోజ నాయతము ద్వారమునుం గని చేరి రింపుగన్ 18.

చం. అసురులు కుంభకర్ణుని గుహాంతర మార్తవ గంధ వాహినిన్
వెసఁ జని కుంభకర్ణు ఘన వీరుని శ్వాసకుఁ దూలు చుండఁగాఁ
బస చెడి గట్టి యత్నములఁ బన్నుగ నిల్చి ప్రవేశ మింపుగా 19.

నెసక మెసంగఁ జేసి రపు డెల్లరు కాంచన రత్న వేదికన్

తే.గీ. రమ్య శుభ గుహ లోపల రాక్షసప్ర
వరు వికృత సుప్తుఁ బాతిత పర్వతాభు
భీమ విక్రముఁ గాంచిరి వీరవర్యుఁ
గుంభకర్ణు నెల్లరు మేలుకొలుపఁ దొడఁగి 20.

సీ. ఊర్ధ్వ రోమ విలసి తోన్నతాంగుని మహాశీవిష మన నిశ్వసించు వాని
శ్వాసచేఁ జలియించు వాని నిద్ర నడరు వానిని భీషణ మైన విక్ర
మము వానిఁ బాతాల సమ వక్త్రు భీమ నాసాపుటు వర తల్ప సర్వ గాత్రు
మేదో రుధిర గంధు మిత్ర వర్ణ కిరీటు నైరృత వ్యాఘ్రుని వీరవర్యుఁ
తే.గీ. గాంచ నాంగదు శత్రుఘ్ను ఘనునిఁ గుంభ
కర్ణుఁ గని యుంచి రట భూత కాయములను
మేరు సన్నిభ రాసుల మించి తృప్తి
నొసఁగ మృగ మహిష స వరా హోత్కరములు 21.

ఆ.వె. అన్నరాసు లింక నస్ర కుంభమ్ములు
వివిధ మాంసములును విరివి నుంచి
రుదరి కుంభకర్ణు నెదుట సురారులు
పూసి రంత గంధములు తనువున 22.

కం. చూపిరి వాసన మాలల
నేపుగ దివ్యముల మించి హిత గంధములన్
ధూపమ్ములు గంధమ్ములు
నాపక తనరించి యార్చి రభ్రధ్వనులన్ 23.

కం. పూరించిరి శంఖమ్ములు
మూరి శశాంక సదృశములు బోరన నెల్లర్
వారఁగ నోర్పు నినదములు
ఘోరముగాఁ జేసి రంత క్షోణి చలింపన్ 24.

కం. అఱచిరి యసురులు లేపఁగఁ
జఱచిరి కరములు కరము నిశాచర ముఖ్యుం 25.

దఱచుగఁ జేసిరి శబ్దము
లఱిముఱి నా కుంభకర్ణు నంకము నందున్

కం. ఉరు భేరీ శంఖప్రణ
వ రవమ్ములు మ్రోగుచుండఁ బాఱి దిశలకున్
ధరఁ గూలె నభో ద్విజములు
కరముల చప్పట్లు సింహ గర్జనలు వినన్ 26.

కం. అయిన సుసుప్తుఁడు లేవఁ డ
భయుం డసుర వర్యుఁ డా రవములు సెలఁగినన్
రయమున రక్కసు లినుప గు
దియలు గదా ముసలములను ధృతి నూని యటన్ 27.

ఆ.వె. కొట్టిరి యుర మందుఁ గ్రూర రాక్షసులు గ
దలను శైల శృంగములను ముద్గ
రముల ముష్టుల ముసలముల నుగ్రమ్ములఁ
గుంభకర్ణు సుప్తు ఘోరముగను 28.

తే.గీ. నిలువ లేకుండి రా బల్లిదు లసుర వరు
లెల్ల కుంభకర్ణుండు శ్వాసింప వెడలు
వాత రయమునకు నెదుట నాతత దృఢ
త నిలిచి తివిరి మ్రోయించిరి నినదములు 29.

తే.గీ. శంఖ భేరీ పణవ కుంభ సహ మృదంగ
వాద్య శబ్దమ్ము లడరఁ గంపనము లింక
దశ సహస్రాసురులు మూఁగి తన్ను లేప
నఱచినను గొట్టినను లేవఁ డంజ నాంగి 30.

ఉ. ఎప్పుడు కుంభకర్ణుని మహా బలు మేల్కొనఁ జేయ కుండిరో
యప్పుడు గట్టి యత్నమున కందఱుఁ బాల్పడి రంత వింతగాఁ
జొప్పడ నెక్కి త్రొక్కుటకు శూరులు దండ క శాంకుశమ్ములం
జప్పునఁ గొట్టి రశ్వ ఖర జాంఘిక కుంజర సంచయమ్మునున్ 31.

తే.గీ. ఉదరి మ్రోయించిరి సశక్తి యుగ్ర భేరు
లను మృదంగ శంఖములను ఘన శరీరుఁ
గొట్టి రంగముల నడరి గట్టి కఱ్ఱ
ల గద లింక ముద్గర ముసలముల రాడ్ల 32.

ఆ.వె. నిండె నెల్ల లంక మెండుగఁ గొండ ల
రణ్యములను గూడి ప్రబలి నట్టి
ఘోర నాదములను గుంభకర్ణుఁ డయిన
లేవ లేదు వీడ లేదు నిద్ర 33.

తే.గీ. తప్త కాంచన కోణ సంతతుల వేయి
భేరుల నిలువ నెల్లెడ దారుణముగఁ
నొక్క సారి మ్రోయించిరి మిక్కుటముగ
దిక్కులెల్ల నక్కజముగఁ బిక్కటిలఁగ 34.

ఆ.వె. అయిన లేవ కున్న నతి నిద్రుఁ డా శాప
వశుఁడు నిద్ర నుండి పరమ రోష
మునకు వశ్యు లైరి ఘనముగ రాక్షస
వర్యు లెల్ల రపుడు పంతమూని 35.

కం. భీమ పరాక్రము లంతట
సామము వీడి తలపడిరి సక్రోధులునై
ధీమతు లన్యులు లేపఁగ
భీమ పరాక్రమముఁ జూప భీ మాసురుపై 36.

ఉ. కొందఱు గొట్ట భేరులను గొందఱు సేసిరి గొప్ప నాదముల్
గొందఱు జుట్టు లాగఁగను గొందఱు గొర్కిరి వాని కర్ణముల్
గొందఱు వోసి రా చెవులఁ గుండల నీటిని వంద లైన యా
మందుఁడు నిద్రకున్ వశుఁడు మానఁడు నిద్రను గుంభకర్ణుఁడే 37.

కం. బల సంపన్నులు ముద్గర
ములు కూటము లూని హస్తముల రాక్షసు ల
న్యులు మూర్ధమ్మున గాత్ర 38.

మ్ముల వక్షస్స్థలము నందు మొత్తిరి బలిమిన్

ఆ.వె. కట్టఁ ద్రాళ్ల చేత గట్టిగ నైనను
గొట్టినను శతఘ్ని కోటి చేత
నెల్లెడలను దాను దల్లడిల్లఁడు మహా
కాయుఁ డకట లేవఁ డా యసురుఁడు 39.

తే.గీ. వేయి యేనుంగు లంతట వీరు గాత్ర
రాశిఁ బర్వు లిడంగ స్పర్శమ్ము నెఱిఁగి
కుంభకర్ణుండు వింత మేల్కొనియె నంత
నావులించుచు క్షుద్బాధ నణఁగ నిద్ర 40.

తే.గీ. పడిన మీద పర్వతశృంగ పాదపములు
తనువు పై ప్రహారమ్ములు తగుల మిగులఁ
జింత సేయక యాఁకలి చేతఁ జెడిన
నిద్ర జృంభించి తా మేల్కొనెను దటాన 41.

తే.గీ. చాఁచుచుఁ గరము లహి భోగ సన్నిభమ్ము
లచల సదృశమ్ములు జిత మహాశని బల
ములను బడ బాభ నిజ వక్త్రముం దెఱచుచు
నావులించె వికృతముగ నసుర వరుఁడు 42.

ఆ.వె. ఆవులించు చున్న నాతని ముఖము పా
తాల సన్నిభమ్ము తనరె నపుడు
మేరు శృంగ మందుఁ దీరుగ నుదయించు
కాంతిమంతుని దినకరుని భంగి 43.

కం. గిరి నుండి వీచు వాయువు
కరణిం దోఁచె నసురుండు గాలి విడువఁగా
గురు బలుఁ డట నిట్టూర్చుచుఁ
గరమ్ము జృంభింప లేచి ఘున వేగముగా 44.

ఉ. లేచిన కుంభకర్ణుని గరిష్ఠపు రూపము గాంచ నత్తఱిం 45.

దోఁచెఁ దపాంత వర్షిత సుతోయద తుల్యము కప్వాయుక్తముం
దోఁచెను దీప్త సర్వజన దుస్సహ వహ్ని తటిన్నికాశమై
లోచన యుగ్మ మత్తటి విలోల మహోగ్రహ సన్నిభమ్ముగా

ఉ. చూపఁగ నెల్ల రాతనికిఁ జొప్పడ నచ్చట భక్ష్యరాశితో
నా పెను పందు లింక మహి షావలి గ్రన్నన నారగించెఁ దా
నేపునఁ గుంభకర్ణుఁ డసురేంద్రుఁడు మేదము మాంస రక్తముల్
త్రేఁపుల నానె మద్యములు లీలగఁ ద్రాగెను వింతఁ గుంభముల్ 46.

కం. తనిసె నతండని యెఱిఁగి పె
స నరిగి చెంతకును వాంచి చక్కఁగ శిరముల్
ఘను లా నిశాచరులు చు
ట్టును జేరిరి మ్రొక్కి రప్పుడు వినమ్రులునై 47.

కం. కనె వారిం గలుషిత లో
చనుండు నిద్రా వశమున సగమే విరియం
గను లంత దిశల నెల్లం
గని పలికెను వారి తోడ ఘనుఁ డిబ్బంగిన్ 48.

ఉ. మీ వలనన్ సుషుప్తి చెడ మేల్కొలుపం బడితిం గతం బహో
పే వచియింపుఁ డగ్రజుఁడు విక్రముఁడుం గుశలుండె సర్వ ర
క్షో వరుఁ డింక యే భయము కొంచెము నైనను లేక యుండెనే
యీ వర లంక యందు మది నెంచెద నన్య భయమ్ము నిచ్చటన్ 49.

ఆ.వె. తద్భయమ్ము నెలఁగఁ దద్ద కారణ మది
యగును నన్ను లేప విగత భీతి
నేల మేల్కొలుపఁగ నిబ్బంగి సాహసిం
ప నగు మీకు నసుర వర్యు లార! 50.

చం. రయమున నేఁడు వాపెదను రాక్షస రాజ భయమ్ము నంతయున్
నయన సహస్రు నైనను రణమ్మునఁ గూల్చెద నగ్ని నార్పుదున్
దయ నను నన్న యల్పపుఁ గతమ్మును గాంచిన లేప నొల్లఁ డు
న్నయటుల లేపఁ గారణము నైరృత వర్యులు నాకుఁ జెప్పుఁడీ 51.

తే.గీ. పలుక సంరబ్ధుఁ డిట్లరివ్రజ దమనుఁడు
కుంభకర్ణుఁ డంత దశవక్త్రు సచివుండు
పలికె యూపాక్షుఁ డంజలి నిలిచి మ్రొక్కి
వినయ మొప్పంగఁ జక్క వచనము లిట్లు 52.

ఉ. లేదిటఁ గాంచఁగా మనకు లేశము దేవ కృతంపు భీతియే
వేదన నీయఁగాఁ గలిగె భీతియె మర్త్య కృతమ్ము ఘోరమై
కా దిఁక దైత్య దానవ నికాయ భయమ్ము సమమ్ము గాంచఁగా
వాదన లేల మానవు నపార భయమ్మున కెన్న రాణ్మణీ! 53.

ఉ. వానర వర్యు లెల్లరును బర్వత రూపులు చుట్టు ముట్టఁగా
నీ నగరమ్ము లంకను ననేకులు సీతను దొంగిలింపఁగా
నూని నరుండు కోపమును నుగ్రుఁడు రాముఁ డొసంగె భీతినిన్
వానర సంయుతమ్ము దశవక్త్రున కిప్పుడు రాక్షసేశ్వరా! 54.

ఆ.వె. వానరుం డొకండు భస్మము చేసె లం
క మును బట్టణమ్ముఁ గొమరు నక్షుఁ
గుంజ రానుయాత్ర కోటితోఁ గూల్చెను
సంగరమ్ము నందుఁ జాల రేఁగి 55.

తే.గీ. స్వయము పౌలస్త్యుఁ డసు రాధిపతియు నమర
కంటకుండు రణమున నర్క ఘన కాంతి
సముని రాఘవేంద్రునిచేతఁ జనుమ యంచు
నన విముక్తుండు నయ్యె దశాననుండు 56.

తే.గీ. ఎవరు దేవ దైత్యగణ దానవ వరుల వ
లన నటులఁ జేయఁ బడ లేదొ మనుజు వలన
నతఁడు చేయఁ బడె నకట యసుర నాథుఁ
డవనిఁ బ్రాణ సంశయము నుండి విడువఁ బడె 57.

కం. విని యూపాక్షు వచనముల
నని నన్న పరాభవమ్ము నక్షులు విప్పా 58.

ర నరసి యా యూపాక్షుని
ఘు నాసురుం డనియెఁ గుంభకర్ణుం డంతన్

కం. హరి సైన్యమ్ము సలక్ష్మణ
సరాఘువము నేఁడ నెగ్గి సమర తలములో
నరయుదు యూపాక్షా! నే
ను రాక్షసేంద్రుఁ జని యా ఘనుని హర్షమునన్ 59.

ఆ.వె. రక్కసులను హరుల రక్త మాంసమ్ములఁ
దృష్టి పఱతు నిపుడు తృప్తి నేను
ద్రాఁగు వాఁడ స్వయము రామలక్ష్మణుల ర
క్తమ్ము నసురు లెల్లఁ గాంచు చుండ 60.

కం. అన నిట్లు గర్వమునఁ గిను
క నెగడ దోషమ్ము కుంభకర్ణుఁడు విని తా
ననియె మహోదరుఁడు కరము
లను మోడ్చి వచనముల నసుర వరుం డిట్లున్ 61.

ఉ. రావణు మాట లెల్ల విని రమ్యముగా గుణ దోష తర్కమున్
నీ వొనరించి దీర్ఘ భుజ! నీవ జయింతువు వెండి శత్రులన్
నా విని కుంభకర్ణుఁ డెద నైరృతు వాక్యము లాదరించి ర
క్షో వరు లావరింపఁ దను శూరుఁడు బల్లిదుఁ డేఁగఁ జాగఁగా 62.

కం. ఘోర సుషుప్తిం దనరెడు
వీరుని భీమాక్షు భీమ విక్రము నసురుల్
వారక మేలుకొలిపి వా
రా రావణు చెంత కేఁగి రతి వేగముగన్ 63.

కం. చేరి దశగ్రీవుని ర
క్షో రాజు మహాసనుని నసుర వరు లెల్లన్
గౌరవముగ బద్ధాంజలు
లై రయమునఁ బల్కి రంత నానందముగన్ 64.

తే.గీ. లేపఁ బడెఁ గుంభకర్ణుఁడు ప్రియసహోద
రుండు రాక్షసేశ్వర! యా ఘనుండు సంగ
రమున కేఁగఁ గాంక్షింతువొ సముచిత మిట
నతని వీక్షింప నెంతువొ యాజ్ఞ నిడుమ 65.

చం. అన విని సంతసమ్మున దశాననుఁ డారసి రాఁగ వారినిం
గన నిట నిచ్చగింతు దృఢ కాయుని భ్రాతను గుంభకర్ణునిన్
ఘనముగ సత్కరించి కొని క్రన్నన రండన నాలకించి పే
చని వచియించి యట్లె యని చక్కఁగఁ బల్కిరి కుంభకర్ణుతో 66.

చం. రయమున నిన్ను సర్వ వర రాక్షస శ్రేష్ఠుఁడు నెమ్మిఁ గాంచఁ గో
రి యనిపె నార్య! మమ్ములను బ్రీతి నొసంగుమ యన్న కేఁగి పే
గ యనఁగఁ గుంభకర్ణుఁ డతి కాయుఁడు దుర్జయుఁ డన్న యాజ్ఞనున్
నయముగ నేరి యట్లె యని నైరృత వర్యుఁడు వీడి శయ్యనున్ 67.

తే.గీ. వదన మంతఁ బ్రక్షాళించి పన్నుగ నొన
రించి స్నానమ్ము భూషల నంచితముగ
నూని దప్పి తీరఁగఁ నంతఁ బానమును బ
లమ్ము వొందఁ దెండనె సత్వరమ్ము గాను 68.

ఉ. రావణు నాజ్ఞఁ దేర పెస రాక్షస వర్యులు మద్యకుంభముల్
పే వివి ధాన్న భక్ష్యములు ప్రీతినిఁ దా ద్విసహస్ర కుంభముల్
వావిరి నారగించి తమిఁ బన్నుగ నేఁగఁ దొడంగె మత్తుఁడై
చేవను దేజముం బడసి శీఘ్రము యంతటఁ గించి దుగ్రుఁడై 69.

తే.గీ. కోప మూని భృశమ్ముగఁ గుంభకర్ణుఁ
డరుగు చుండి కాలాంతక యమ నిభుండు
నన్న భవనమ్మునకు రాక్ష సావృతుఁ డయి
పదములఁ జలింపఁ జేసెను వసుధ నెల్ల 70.

తే.గీ. రాజ వీధినిఁ దన తనుప్రభలను వెలిఁ
గించుచు రవి యవని వెలిఁగించు భంగి
నరిగె నంజలి మాలల నన్న దరికి 71.

సెలమి బ్రహ్మ వీటికి నేఁగు నింద్రు వోలె

తే.గీ. రాజ మార్గమునం దమిత్ర గణ ఘాతిఁ
గాంచి యప్రమేయు గిరిశృంగ నిభునిం ద
టాలున హరు లుండఁగ బయట నిజ యూధ
పాలురను గూడి నిల్చిరి భయము తోడ 72.

తే.గీ. కొంద ఱేఁగిరి శరణమ్ము గోరి యా శ
రణ్యు రాముని దరికిఁ గలంతఁ గొంద
అవని గూలిరి మఱి కొంద ఱార్తిఁ బడిరి
కొంద అంత దిక్కుల కేఁగి రందు నిందు 73.

కం. గిరిశృంగ కల్పు రాక్షసుఁ
గిరీటి రవిఁ దాఁకు రీతిఁ గెరలం బ్రభలన్
హరు లరసి యద్భుతమ్ముగఁ
బెరిఁగిన వానిఁ బరువిడిరి భీతి దిశలకున్ 74.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నఱువదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 61.

రాముఁడు కుంభకర్ణునిఁ జూచి విభీషణునితో నీ మహా కాయుఁ డెవరని యడుగ నాతఁడు విశ్రవసుని పుత్త్రుఁ డని కుంభకర్ణుఁ డను మహా వీరుఁ డని తెలిపి యాతనికి బ్రహ్మ యొసఁగిన శాపమును విభీషణుఁడు వివరింప రాముని యాజ్ఞతో నీలుఁడు వానర వీరు లెల్లరను శిలాయుధములతో వ్యూహముగా నమర్చుట.

కం. కనె నంత రాముఁడు కిరీ 1.

టిని భీమ శరీరు నా కఠినతర వజ్రా
భుని౯ గుంభకర్ణుని మహా
ద్రి నిభాకారుని నసుర వరేణ్యుని నచటన్

తే.గీ. అసుర పూర్వ మా కాశము నాక్రమించి
నట్టి విభుఁడు నారాయణుఁ డట్టి విధ మ
డరఁగ ధను వూన రాముఁడు హరుల చమువు
తిరిగి పాఱె ఘన సదృశు నరసి భీతి 2.

తే.గీ. కాంచ నాంగద భూషణుఁ గపి చమూహ
మరసి పాఱంగ వీక్షించి యసురు వర్ధ
మాను నవ్విధి రాముఁడు తా నగు మొగ
మడరఁ బలికె విభీషణు నరసి యిట్లు 3.

చం. గిరి నిభుఁ డీ కిరీటి హరి కీర్ణ విలోచనుఁ డెవ్వఁ డిమ్మహా
పురమున లంక యం దితఁడు మూరి చరింపఁ గనంబడున్ భువిం
బరమ పతాక సన్నిభము పన్నుగ నొక్కఁడు పాఱి రెవ్వనిన్
హరు లిటఁ గాంచి భీతిని మహాఘన సాశని తుల్య వీరునిన్ 4.

ఉ. నాకు వచింపుమా యెవఁ డనన్య శరీరుఁ డతండు రక్కసుం
డా కనఁ బూర్వ మా విధపు టద్భుత జీవి మహాసురుండొ యే
కైక బలుండు నా నన మహాత్ముఁడు రాఘవుఁ డా విభీషణుం
డా కృతకర్ము నశ్రముని నారసి పల్కెను బ్రాజ్ఞుఁ డివ్విధిన్ 5.

ఉ. ఎవ్వని చేత నోడిరి సురేంద్రుఁడు నర్కసుతుండు యుద్ధ మం
దెవ్వనిఁ గాంచె విశ్రవసుఁ డిద్ధర నాతఁడు కుంభకర్ణుఁడే
యెవ్వరు లేరు రక్కసుల నీతని మించిన భీమ కాయులే
యెవ్వరుఁ దూఁగ రీతనికి నెన్నఁ బ్రతాపము నందు లంకలో 6.

మ. అనిలో నోడిరి దేవ దానవులు మాంసాహార రక్షో వరుల్
ఘన గంధర్వులు నింక యక్ష భుజగగ్రామమ్ము విద్యాధరుల్
కనువిన్కల్ రఘు వీర! ఘోరముగ సంగ్రామమ్మునన్ భగ్నముల్
కన వేవేలుగఁ గుంభకర్ణుని నశక్యం బౌను నిర్జింపఁగా 7.

ఆ.వె. శూరుఁ గుంభకర్ణు శూల పాణిని విరూ
పాక్షు ననిమిషులు మహాంగు గెలువ
జాలక  రణ మందుఁ గాలుఁ డనుచు మోహ
మంది తలఁచి రెడఁద లందు భీతి 8.

ఆ.వె. ప్రకృతిని నితఁడు బల వంతుఁడు తేజస్వి
ఘోర విగ్రహుండు కుంభకర్ణుఁ
డన్య రాక్షస వరు లందఱు వర దాన
బల సమన్వితులు నృవర వరేణ్య! 9.

కం. జనియించిన నాఁ డాఁకలిఁ
దిన నీతఁ డనేకములను దిట్టతనమునన్
ఘన సత్త్వముల సహస్రము
లను భయ తప్తు లయి రెల్ల ప్రజలు నరవరా! 10.

కం. శరణం బర్థించిరి వా
రరిగి మహేంద్రుని నుడివిరి యార్తిని నెల్లం
గర మలిగి శక్రుఁ డంత వి
సరి కొట్ట బెడిదముగా నశని వేగముగన్ 11.

ఆ.వె. వజ్రఘాతమున నృవర! కుంభకర్ణుఁడు
భృశముగాఁ జలించె బెడిదముగ న
ఱచెను గోపమున వెఱచిరి తిరిగి ప్రజ
లెల్ల రవము నాలకించి నంత 12.

చం. కినిసి భృశమ్ము బల్లిదుఁడు కేలిని వెల్లగజంపు దంతముం
గని వెసఁ గుంభకర్ణుఁ డటఁ గ్రన్న నఁ గైఁ బెకలించి గొట్టె నిం
ద్రు నురము నందు ఘోరముగఁ దూలెను వాసవుఁ డార్తి తోడ మం
డెను సుర లింక దానవులు డిందిరి యార్తి మహర్షి యుక్తులై 13.

ఆ.వె. ప్రజలఁ గూడి యేఁగి బలసూదనుఁడు బ్రహ్మ
యుండు టెంకి కంత నుగ్రు కుంభ 14.

కర్ణు దుష్ట బుద్ధి కడఁగి ప్రజలఁ దిను
ట సురల నెదిరించుటయు వచించి

ఉ. అంతియ కాక తాపస వరాశ్రమ నాశము ఘోర రీతి నా
యింతుల దొంగిలించుటయు నివ్విధిఁ దిన్నఁ బ్రజాళి సంతతం
బంత మగున్ జగంబు పెస నంచు వచింపఁగ నాలకించి తాఁ
జింతిలి ధాత రాక్షసుల శీఘ్రముగాఁ బిలిపించెఁ జెంతకున్ 15.

ఉ. వచ్చిన వారి యందుఁ గని పంకజ గర్భుఁడు కుంభకర్ణునిం
జెచ్చెఱఁ ద్రాస మందె నెద శీఘ్రమ తేఱి వచించె వానితో
హెచ్చుగ లోక నాశనమె యేర్పడ విశ్రవసుండు జన్మ నీ
కిచ్చెను జచ్చి నట్టు లసురేంద్ర! సుసుప్తుఁడ వౌదు వందుకే 16.

ఆ.వె. నేఁటి నుండి యనఁగ నీరజ గర్భుఁడు
గూలె నెదుట నంతఁ దూలి భృశము
కుంభకర్ణుఁ డడర ఘోర నిద్ర కలఁత
నెంది రావణుఁడు వచించె నిట్లు 17.

తే.గీ. ఫల మొసంగు తఱిఁ బసిడి పాదపమ్ము
నఱక న్యాయ మగునె నీదు నప్త నిట్లు
నీవ శపియింపఁగాఁ దగునే ప్రజాప
తి! కరుణ వహింప కొక యింత యకట కినిసి 18.

తే.గీ. రిత్త కానేర వెన్నఁడు సత్తు నరయ
నీదు వచనమ్ము లెట్బంగి నిదుర నుండు
నితఁడు తప్పక సమయమ్ము నింపుగ రచి
యింపు మెలఁకువ నిద్రల కెలమి నీవు 19.

ఉ. రావణుఁ డట్లనంగ గిరలన్ విని పల్కె స్వయంభువుం డిటుల్
రావణ! యాఱు మాసములు రక్కసుఁ డింపుగ నిద్ర నుండఁగాఁ
జేవ దివంబ యొక్కటినిఁ జెన్నుగ మేల్కొని యుండు నివ్విధిం
బావకు భంగి నాఁకలిని వాయిని విప్పి భుజించు లోకముల్ 20.

ఉ. ఆపద నంది యివ్విధి దశాస్యుఁడు నీదు పరాక్ర మార్తినిన్
లేపెను గుంభకర్ణు నృవరేణ్య! భయమ్మున నేఁడు లేచి వాఁ
డేపున మ్రింగు వానరుల నెల్లర నా శిబిరమ్ము వీడి పే
పే పరు పెట్టి కాంచఁగనె వీనిని వానరు లెల్లఁ బాఱఁగా 21.

ఆ.వె. సంగరమ్ము నందుఁ జాలి హరులు వీని
నెట్టు లాప శక్యు లిట్టి క్రుద్ధు
యంత్ర మిదియె లేపి రనఁగ నెఱింగి వీ
డఁ గలరు వెఱ వా రెడంద లందు 22.

తే.గీ. సుముఖులను జేయ వానర శూర వరుల
నిట్లు నుడువ విభీషణుఁ డెల్ల నాల
కించి చక్కఁగ నీలు వీక్షించి యా చ
మూ పతినిఁ బల్కె నిట్లు రాముండు గిరలు 23.

చం. నిలుపుమ యేఁగి సైన్యమును నీల! ప్లవంగ వరేణ్య!!పావకా!
లలితపు వ్యూహ మేర్పఱచి లంకను వీథుల నింక ద్వార సే
తుల వెస నాక్రమించుచును దోరపుఁ బాదప శైలశృంగముల్
శిలలను బ్రోగు చేసి వెసఁ జెన్నుగ సాయుధులై చరింపుఁడీ 24.

కం. విని రామాజ్ఞఁ బ్లవంగ బ
ల నాథుఁ డా  నీలుఁ డంతఁ బ్లవగప్రవరుం
డు నగచర సేన శాసిం
చె నవ్విధి నరోత్తముండు చెప్పిన రీతిన్ 25.

కం. గిరి సన్నిభులు గవాక్షుఁడు
శరభుం డంగదుఁడు హనుమ శైలాగ్రములం
గరముల గ్రహించి పే చే
రిరి ద్వార సమీపమునకు లీలా గతినిన్ 26.

కం. విని యా రాఘువ వాక్యము
లను హరి వీరులు జయేచ్ఛ రాక్షస సేనన్
ఘన పాదపమ్ములం గై 27.

కొని బాధింపఁ దొడఁగిరి సుఘోరముగ ధృతిన్

కం. తరు గిరి హస్త విరాజిత
హరిసేన యట విలసిల్లె నత్యుగ్రంబై
గిరి సన్నిధి నలరారెడు
పర మాంభోధర నిభమ్ము పరికింపంగన్ 28.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నఱువది యొకటవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 62.

కుంభకర్ణుఁ డంత రావణు మందిరమున కేఁగి కర్తవ్య మేమి యని యన్న రావణుని నడుగ నాతఁడు రాముని వలని భయమును వివరించి ససైన్య మేఁగి శత్రు సైన్యము నెల్ల నాశనము సేయు మని కోరుట.

కం. వడి నా రాక్షస శార్దూ
లుఁడు నిద్రా మద మహాసురుండు మహా వీ
ర్యుఁడు విక్రముండు సంపద
నడరెడు నా రాజ మార్గ మందుం దరలన్ 1.

ఆ.వె. వెంట చనఁ దొడఁగిరి వేల కొలంది రా
క్షసులు కుంభకర్ణు సమర దుర్జ
యు వెనుకను వడి వడి భవన పంక్తుల నుండి
కుసుమ వర్ష మపుడు గురిసె విరివి 2.

చం. కనెఁ జని యర్క సన్నిభము కాంతులు వెల్గు సువర్ణ జాలముల్
దనరు విశాల రమ్యతర దర్శన రాక్షస రాజ వేశ్మమున్ 3.

ఘనమునఁ దూఱు భాస్కర నికాశము సేరి నివేశ రాజముం
గనె నట నాసనస్థు దశకంఠు స్వయంభువు శక్రు రీతిగన్

కం. చని రక్షో గణ యుక్తము
గను రాక్షస రాజ వర నికాయము కాల్దో
యిని ఘనుఁడు కుంభకర్ణుం
డు నేలఁ గంపింపఁ జేసె డుల్లఁగ నసురుల్ 4.

ఉ. చేరి నిజాగ్ర జాలయము శీఘ్రము కక్ష్యలు దాఁటి గాంచె గం
భీరముగాఁ గలంత మది వేదన సెందగఁ బుష్పకమ్మునన్
వీరుఁడు కూరుచుండఁ గని వేగమ రావణుఁ డాతనిం దనుం
జేరఁగ లేచి సోదరునిఁ జెంతకు రాఁ బనిచెన్ ముదమ్మునన్ 5.

తే.గీ. అంతఁ బర్యంక మందున్న యన్నకుఁ జర
ణమ్ము లంటి మ్రొక్కి సభక్తిఁ గ్రమ్మఱ నడి
గెఁ దన కిప్పట్టు నందుఁ జేయఁ దగు కార్య
మెద్ది యని కుంభకర్ణుఁ డహీన బలుఁడు 6.

చం. అనుజునిఁ గౌఁగిలించికొనె నంతట లేచి దశాననుండు వా
ని నెలమి సంస్తుతింపఁగ ననేక విధమ్ములఁ గుంభకర్ణుఁ డం
త నలరి యుత్త మాసనము దత్తము నెమ్మి నలంకరించి తా
ననియె సరోష నేత్రుఁ డయి యగ్రజు గాంచి బలుండు వాక్యముల్ 7.

ఆ.వె. ఏల యాదరమున మేలుకొలుపఁ బడ
తి నొకొ నిద్ర నుండి తివిరి నేను
బలుకు మెవరి వలన భయము కలిగె నీకు
నెవఁ డగును దెలుపుమ శవము నేఁడు 8.

ఆ.వె. కుంభకర్ణుఁ గాంచి క్రుద్ధుని రావణుఁ
డాగ్రహమున నక్షు లరుణ వర్ణ
మూనఁ దిరుగుచు వడి యూని రోషమ్మును
బలికె నంత నిట్లు వాక్యములను 9.

తే.గీ. నిదురఁ జిరకాల ముంటివి నీ వెఱుంగ
విచట నో మహా బల! రాముఁ డిన కులుండు
నా కొనర్చి నట్టి భయము వీఁక దాఁటి
కడలి సుగ్రీవుతోఁ గుల మడఁప దొడఁగె 10.

కం. తరియించి వారధి పయిన
హరులు కదిసి యేక వాన రార్ణవముం జే
సిరి వనముల నుపవనముల
పురవర మీ లంకఁ జూడుము సుఘోరమ్మున్ 11.

తే.గీ. ముఖ్య రాక్షసులు పడిరి పోరు నందు
హరులచే నాజి వీక్షింప హరుల క్షయము
నెప్పగిది నేను వానరు లెవ్వ రేని
మున్ను సంగరముల నోడి పోవ నెఱుఁగ 12.

తే.గీ. ఇట్టు లుత్పన్న మయ్యెను దట్టముగ భ
యము మహాబల! పగఱ లయ మొనరింపు
వేగ నేఁడు రక్షింపుమ వీర! లేపఁ
బడితి విందు నిమిత్తము భ్రాత! నీవు 13.

ఆ.వె. సర్వ కోశ మిపుడు ఖర్వ మయిన వాని
నాదుకొనుమ నన్ను ననుజ వర్య!
బాల వృద్ధ శేష పరమ పురము లంకఁ
గావు మయ్య నేఁడు నీవ తగుదు 14.

కం. అనుజా! యగ్రజు కొఱకై
ఘనతర మీ దుష్కరంపుఁ గర్మము వీరా!
యొనరింపుమ నే మున్నెవ
రి నిట్లు నర్థింప నెఱుఁగ రిపుగణ దమనా! 15.

తే.గీ. స్నేహ మధికమ్ము నీ యందు నీ పయినిఁ జె
లంగుఁ బేర్మి సురాసుర సంగరమ్ము
లందు నెదిరించి దేవాసు రావళిని జ 16.

యించి తీవు పెక్కు తడవ లంచితముగ

ఆ.వె. రాక్షసోత్తమ! యవలంబింపుమా వీర్య
మడరి భూత రాసు లందు నీకు
సములు గాన రా రనిమిషారి! భీమ ప
రాక్రమ! వసుధాతలమ్ము నందు 17.

కం. సమరప్రియ బంధుప్రియ
మమప్రియ హితములఁ దగ నమర జేయుమ తే
జమున రిపులం దఱుముమ వ
ర మారుతము శార దాభ్ర రాశి వలె ననిన్ 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నఱువది రెండవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 63.

కుంభకర్ణుఁ డగ్రజుని విలాపములను విని బిగ్గరగ నవ్వుచుఁ దొలుత నాతని నధర్మ కార్యములకు విభీషణుని వంటి హితుల మాటలు వినమికిని నిందించి పిదప సమరోత్సాహుఁడై శత్రువులను నిర్జింతు నని యాశ్వాసించుట.

కం. విని రాక్షస రాడ్వరు విల
పనములు పరమార్తి తోడఁ బలుకఁగ నట్లున్
ఘనుఁ డంతఁ గుంభకర్ణుఁడు
దన యగ్రజు తోడఁ బలికెఁ దద్దయు నగుచున్ 1.

ఉ. చూచితి మెట్టి దోషమును జొప్పడ మంత్ర విచార మప్పుడుం
దోఁచెను నీకు నయ్యది హితుల్ వచియింపఁగ నాలకింపమిన్ 2.

వే చను రీతి దుర్గతికి భీకర దుష్కృత కార్య మగ్నులే
నీచ మహోఘ కర్మనకు నీ కిటఁ బాప ఫలమ్ము సేకురెన్

ఆ.వె. చింత సేయ లేదు సుంత మహారాజ!
మున్న వీర్య దర్పము సెలరేఁగఁ
గలుగఁ బోవు నట్టి కార్య ఫలమ్ములు
తలఁప కుంటి వకట దారుణములు 3.

తే.గీ. ఎవ్వ రైశ్వర్య మదమున నిలఁ దదుపరి
కార్యములు మున్ను తొల్లిటి కార్యములను
బిదప నొనరించు చుందురో వినుమ వారు
నేరరు న యానయమ్ములు నెమ్మనముల 4.

కం. విపరీతమ్ముగ నొనరిం
చు పనులు దేశ సమయములు చూడక యిలలో
నపవిత్రు లొసఁగు నాజ్య
మ్ము పగిది వీక్షింప వ్యర్థములె యసురేంద్రా! 5.

తే.గీ. మంత్రులను సంప్రదించి సన్మంత్రములను
బడసి యెవ్వ రొనర్చును బుడమి మూడు
కార్యముల నైదు విధముల నార్య! యతఁడు
నడచు వాఁడు దలంప సన్మార్గములను
[కర్మములు: ఉత్తమము, మధ్యమము, నధమము; ఐదు విధములు: ఉపాయము, వృద్ధి, దేశకాల పరిగణనము,
ఆపదలకుఁ బ్రతిక్రియ, కార్యసిద్ధి] 6.

తే.గీ. శాస్త్ర రీతిని నే రాజు సమయ మింపు
గ నొనరింపఁ దలంచును దనదు బుద్ధి
చేత సుహృదయు లింక సచివుల తోడఁ
దగ విచారించు నాతండు తథ్యముగను 7.

ఆ.వె. కర్మము లొనరించి ధర్మార్థ కామము
ల నొకటి యొకటిగ నయినను మూడు
గలిపి యైన లేక గలిపి రెండెంటిని
నరసి కాలము నరుఁ డనుభవించు 8.

కం. వినిన నెఱుంగఁడొ రాజై
నను రాజనకు సదృశుఁ డయినను దా శ్రేష్ఠ
మ్మును వాని యందు రాజ! య
తని శాస్త్రజ్ఞాన మెల్లఁ దలఁపఁగ వృథయే 9.

చం. సముదము మంత్రి వర్యుల విచారము గైకొని సామ దాన భే
దములు పరాక్రమమ్ము వసుధం దగు ధర్మము లర్థ కామముల్
సమయము లెంచి యోగములు చక్కని పైదు నయానయమ్ములన్
సముచిత మెన్ని కార్యములు సల్పిన నారయఁ డెట్టి యాపదల్ 10.

కం. తన హితము నెంచి ధీ బల
మున జీవించు సచివుల సముచి తార్థజ్ఞా
లిని సంప్రదించి కార్యము
లొనర్పఁ దగు రాజ వర్య! యుత్తమ రీతిన్ 11.

ఉ. నేరక శాస్త్ర భావములు నెమ్మి వచింపుఁ డనంగ మంత్రముల్
మూరఁగ నాత్మ జంతువుల బుద్ధియె పూరుషు లెల్లఁ బల్కరే
వారి ప్రగల్భముల్ ధన మపారము గోరెడి వారి శాస్త్రముల్
నేరని వారి మాటలను నిర్ణయ మెన్నఁడు రాదు సేయఁగన్ 12.

ఆ.వె. అహితమును హితంపు టాకారమున మొండి
తనము చేతఁ బలుకఁ దనరు చుండ్రు
కార్య నాశకులు తగరు మంత్రములకు వా
రలను దూర ముంచ వలయు సతము 13.

కం. పతి నాశము గోరుచుఁ బం
డితు లగు రిపుల సహితము కడిఁది విపరీత
మ్ము దనరు కార్యమ్ముల దు
ర్మతు లయి చేయింత్రు వీఁక మంత్రులు రాజా! 14.

ఆ.వె. లంచము గొను మంత్రి సంచయము వ్యవహా
రముల నేర వలయు రాజు తనకు 15.

మిత్రు లనఁ బరగు నమిత్రుల నెల్లర
మంత్ర నిర్ణయపు సమయము లందు

ఆ.వె. చపలుఁ డైన రాజు సత్వరముగఁ జేయ
ఛిద్రము లరసి విలసిల్లెదరు ప
రులు విహంగ రాజములు క్రౌంచ పర్వత
రంధ్ర మందుఁ బగిది రాజ వర్య! 16.

ఆ.వె. ఎవరు రిపుల నాదరింపక రక్షించు
కొనడొ తను నతండు గుఱి యగును న
నర్థములకు వెసఁ దనదు స్థానమును గోలు
పోవు నిశ్చయముగఁ జేవ తఱుఁగ 17.

కం. అనుజుఁడు మున్ను నుడివె దా
నినిఁ జేయుమ యదియె మనకు నిశ్చయ హితమై
తనరుం గాని యెడల నీ
వొనరింపుమ నచ్చి నట్టి దొప్పుగ నింకన్ 18.

చం. విని కను బొమ్మలన్ ముడిఁచి భీషణ కోపము నూని రావణుం
డనియెను గుంభకర్ణుఁ గని యక్కట మాన్యపు టొజ్జ వోలె బో
ధన మిడ నుత్సహింతువు వృథాశ్రమ నేల వచింతు వాక్యముల్
గొనకొని కాలయుక్తములు గూరిమిఁ జేయుట నీకు నర్హమౌ 19.

ఉ. మానస మంద మోహమును మానుగ వీర్యము నాశ్రయింపఁగా
నూనిన భ్రాంతిఁ బాటిల నయుక్తము వ్యర్థము తిర్గి పల్కఁగా
దానిని నిప్డు సేయఁ దగు దానిఁ దలంచిన నొప్పు నీకు నే
రేని గతింప దాని నిఁక నెన్నరు పోయిన దౌ గతం బిఁకన్ 20.

తే.గీ. స్నేహ మున్నచో నా పయి నీకు విక్ర
మం బడరిన నా కార్యము మదిఁ దలంచి
తేని కర్తవ్య మని చేవ నూని నాదు
దుష్కృతమ్మును సరిచేయఁ దొడర వలయు 21.

ఆ.వె. ఆదుకొందు రెవ్వఁ డాపన్ను దీనుని
నాతఁడ సుహృదుండు నగును దలఁపఁ
జక్క దుర్నయునకు సాహాయ్య మొనరింప
నాతఁడ తన బంధు వగును జుమ్మి 22.

కం. పలుకఁగ నట్లు ధృతి వచన
ములు దారుణముల నసుర విభుండు వినఁగఁ దా
నలిగె నని కుంభకర్ణుఁడు
తెలిసికొని మృదువుగఁ బలికెఁ దిన్నని గిరలన్ 23.

చం. కలఁగిన చిత్తు నగ్రజునిఁ గాంచి భృశమ్ముగ నూఱడించుచుం
బలికెను గుంభకర్ణుఁ డట భ్రాత యరిందమ! యాలకింపుమా
కలఁతను నీదు రోషమును గ్రన్నన వీడి వహింపు స్వస్థతన్
వలదిఁకఁ దాప మింతయును బన్నుగ నేను మనంగ నీ కిటుల్ 24.

ఆ.వె. ఎవనికై తపింతు వీవు వాని వధింతు
నేఁడ యెట్టి స్థితిని నిల్చి యున్న
నీవు భ్రాత వగుట నెగడ బంధుత్వము
తలఁచి చెప్పితిని హితమ్ము నిట్లు 25.

ఉ. పన్నుగ నిట్టి కాలమున బంధువు మిత్రుఁడు సేయ నొప్పెడిన్
ఛిన్నము సేయు కార్యమును జేరి స్వశత్రుల నే నొనర్పఁగాఁ
గ్రన్ననఁ చూడు మింపుగను రాముఁడు నా వలనన్ హతుండు గా
మిన్నగఁ బాఱు వానరుల మేటి రణమ్మున భీతి నగ్రజా! 26.

కం. నా తెచ్చిన రామ శిరము
నాతత బాహు! కని యుండు మానందముగన్
సీత మహా దుఃఖిత యగు
నా తల వీక్షించి నంత నగ్రజ! వినుమా 27.

కం. చూతురు గాక ధరా తల
పాతిత రామునిఁ బ్రియముగఁ బల లాశను లా
వీత నిజ బాంధవులు నా 28.

రాతి నిధనముఁ గని నంత రాక్షస వర్యా!

ఆ.వె. శత్రులు హతమార్ప సమరమ్ము నందు బం
ధువులఁ గలఁత రేఁగఁ దోరముగను
శోక మగ్ను లయ్యసురుల యశ్రువులఁ దు
డిచెద నేఁడు నేను రుచిరముగను 29.

ఆ.వె. నేఁడు సమర మందు నిహతుఁ డై నట్టి సు
గ్రీవు నద్రి నిభు వికీర్ణు స రవి
తోయ దాభుఁ గనుమ తూర్ణము ప్లవ గేశ్వ
రు నసు రేంద్ర! హర్షమునఁ జెలంగి 30.

ఆ.వె. ఇయ్యసురుల చేత నింక నా చేతను
ననఘు! కావఁ బడగ నత్యధికము
గ వ్యథఁ జెంద నేలఁ గాకుత్స్థు వధియింప
నిచ్చగించు వార లిచటఁ దనర 31.

ఆ.వె. నన్ను జంపి కాని నిన్ను వధింప న
శక్యుఁడు రఘు వంశ సత్తముండు
దాని కెన్నఁడు కలఁత వహింప మదిలోన
నేను రాక్షసేంద్ర! నెమ్మి నుండు 32.

తే.గీ. నను యథేచ్ఛ నాజ్ఞాపింపు మనఘు యిప్పు
డో పరంతప! యన్యు లయుక్తులు పను
పఁ బడఁగ నతులవిక్రమ! భండనమున
కరుల నశియింపఁ జేయుదు నరిగి నేను 33.

చం. సమరము నందుఁ గూల్చెదను శక్ర యమాగ్ని మరుత్తులుం గుబే
ర మకర వాహ నాదులు పరాక్రమ వంతు లెదిర్చినన్ మహీ
ధ్రమునకు సాటి నాఁ బరగు దార్ఢ్య శరీరుని శూల హస్తునిన్
సమదము కూయు నన్ను గని శక్రుఁడు భీతిలుఁ దీక్ష్ణ దంష్ట్రునిన్ 34.

కం. లేక మఱి శస్త్ర మెట్టిది 35.

నా కడ లేకున్న బలమున రిపు వరుల నే
వీఁకను మర్దింప నెదుట
నాకు బ్రతుక నెంచు పరుఁ గనఁ గలమె సమితిన్

తే.గీ. కాదు గదను శక్తి నయినఁ గాదు కత్తిఁ
గాదు నిశిత శరములను గాదు హస్త
యుగము చేత వజ్రి నయిన యుద్ధ మందుఁ
జంపు వాఁడ నే నూని రోషమ్ము భృశము 36.

ఆ.వె. నాదు ముష్టి వేగ మా దురమున రాఘ
వుండు సైచె నేని పుష్క రౌఘ
మంత నేను విడువ నడరి త్రాగును వాని
యరుణ రుధిర మెల్ల నాస మీఱ 37.

ఆ.వె. చింత తోడ నార్తిఁ జెందంగ నేల నే
నుండ రాక్షసేంద్ర! యుదరి నేను
నీదు రిపుల నెల్ల నీఱు సేయఁ దరలు
వాఁడ నీదు పంపు వడసి నేఁడ 38.

తే.గీ. రాముని వలని నీదు ఘోర భయ మింక
వీడ వలయు రాముని మహా వీర్యు లక్ష్మ
ణునిఁ గపివరు సుగ్రీవుని హనుమ నెవఁడు
కాల్చె లంక నయ్యసురఘ్ను గడఁగి కూల్తు 39.

కం. కలిగిన యట్టి మహోగ్రపుఁ
గలనున భక్షింతు హరి నికాయము నెల్లన్
విలసిల్లఁ జేయ నెంచెద
నిలను విశేషంపు యశము నెలమిని నీకున్ 40.

ఆ.వె. ఇంద్రుని వలని భయ మింక స్వయంభువు
వలని భయము నైనఁ గలఁత యేల
రాత్రి చీఁకటి వెస రవి భంగిఁ బాపెద
నే నలుగ నమరలు నేలఁ బడరె 41.

తే.గీ. యముని సమయింతు భక్షింతు నగ్నిఁ గినిసి
కూల్తు నాదిత్యుఁ దారలఁ గూడి నేల
నింద్రుఁ జంపుదు నంభోధి నెల్లఁ ద్రాగు
దు గిరులఁ బొడి సేయుదును జీల్తుఁ బుడమి వడి 42.

చం. కనెదురు దీర్ఘ కాలము సుఖమ్ముగఁ బండిన కుంభకర్ణు చే
వను దిను చుండ భూతములఁ బన్నుగ నెల్లరు నేఁ డహో దివ
మ్మును సరి పోదు నాకు నిటఁ బూర్ణము తిన్నను గుక్షి నిండదే
తనివియుఁ దీర దింతయును దారుణ కాయున కెంత మెక్కినన్ 43.

తే.గీ. భండనమ్మున నా సత్త్వ వంతు రాఘ
వేంద్రుఁ జంపి సుఖార్థున కిత్తు సుఖము
రామ లక్ష్మణుల వధించి భీమ బలులు
ప్లవగ యోధుల భక్షింతు రణము నందు 44.

తే.గీ. తనరి క్రీడింపు మసురేంద్ర! త్రాగు మింక
మద్య మొనరింపుమ పనుల మాని చింత
నేను బంప రామునిఁ గాలుని గృహమునకు
వశ యగుఁ జిరకాలము సీత వనజ నయన 45.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నఱువది మూడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 64.

కుంభకర్ణుని మాటల నాలకించి మహోదరుఁడు సమ్మతింపక పోరునకు నొంటరిగాఁ జనఁ దగ దని పలికి రావణునకు యుద్ధము సేయకయే లబ్ధినిఁ బొందు మార్గమును జెప్పుట.

కం. విని యమ్మహా బలుని దీ
ర్ఘ నిజాంగుని బాహుశాలి గర్వోక్తులు వ
ల్కె నిటుల మహోదరుండు వ
చనమ్ములను గుంభకర్ణు సత్వ మెఱిఁగియున్ 1.

తే.గీ. కుంభకర్ణ! పుట్టితి మంచి కులము నందు
నైనను బ్రగల్భుఁడవు గర్వి వకట ప్రాకృ
తు వలెఁ గన్పింతు వెఱుఁగవు వివరముగను
జేయఁ దగిన కార్యమ్ముల నే యెడలను 2.

ఉ. నేరఁడె రాక్షసేశ్వరుఁడు నీతిని నయ్యవినీతి నైననుం
దీరుగఁ గుంభకర్ణ! కడు దిట్టతనమ్మున బాలకుండవే
కోరెదు పల్క గర్వమున ఘోరముగాఁ దన స్థాన వృద్ధులన్
వీరుఁ డెఱుంగఁడే పరుల వృద్ధిని స్థానము దేశ కాలముల్ 3.

ఉ. వృద్ధుల సేవ నెప్పు డొనరింపని వాఁడు బలాన్వితుండునున్
బుద్ధినిఁ బ్రాకృతుండు నగు పూరుషుఁ డెయ్యది సేయఁ జాలఁడో
బుద్ధి గలట్టి వాఁ డెవఁడు పూనును జేయ ధరాతలమ్మునన్
శ్రద్ధ వహించి యట్టి పని రాక్షస పుంగవ యెంచి చూచినన్ 4.

చం. ఘనముగ ధర్మ మర్థమును గామము కల్గును వేఱు వేఱుగా
నని వచియింతు వాని మఱి యర్థము సేసికొనంగ నున్నదే
తనరుచు నొక్క లక్షణము దాని నిరూపణ మేర్పడంగఁ గాం
చ నగునె కుంభకర్ణ! కడు చక్కని దున్న వచింపు మింపుగా 5.

చం. పను లిల సాధనమ్ము లగుఁ బన్నుగఁ బొంద ఫలమ్ము లెల్లనుం
గనఁ గడు పాపకర్మములు కల్గఁగ జేయును దత్ఫలమ్ములం
దనరఁగఁ జేయు సంపదల ధర్మము నర్థము నిచ్చు కర్మముల్
పను లితరమ్ము లైన నిడు బాప మధర్మ మనర్థ కర్మముల్ 6.

తే.గీ. పురుషుఁ డైహిక లౌకిక పరతఁ జేయుఁ
గర్మములను గల్యాణద కర్మములఁ బ 7.

డయును గామ్య ఫలమ్ము లడరుచుఁ గామ
మందు లగ్నము కాఁగ నెడంద కరము

ఆ.వె. మదిఁ దలంచి చేసె మన రాజు సమ్మతిం
చితిమి మనము గూడఁ జేయ శత్రు
వందు సాహసమ్ము నడరి దానిం దొలఁ
గింపఁ బడునది యిట సెద్ది యగును 8.

ఉ. ఒక్కడ వాజి కేఁగుటకు యుక్త మటం చని నట్టి కారణం
బిక్కడ నేల తప్పిదమొ యింపుగ చెప్పెద నెంత చెడ్డదో
యక్కడ నా జనస్థలి మహాసురు లెందరొ వానిచే బలుల్
చక్కడఁగంగ నొక్కఁడవు చాలుదు వెట్లు జయింప రాఘవున్ 9.

కం. మున్ను జనస్థానమ్మున
నన్నరవరు చేత నోడి యసురు లసేకుల్
మిన్నంటిన భీతిని లం
కన్నగరమ్మున వసింపఁ గనవే వారిన్ 10.

ఆ.వె. సింహ సన్నిభు నర శేఖరుఁ గ్రుద్ధుని
దాశరథిని రాముఁ దద్ద నిద్ర
నున్న సర్పము వలె నున్న వానిఁ దెలిసి
యేల లేప వలతు విపుడు నీవు 11.

తే.గీ. తేజమున జ్వలింప సత మతి రుష నున్నఁ
జేర రానట్టి వానిని వీరు మృత్యు
భంగి సహియింపఁ జాలని వానిఁ జేర
నర్హు లెవ్వరు రణ మందు నా రఘువరు 12.

తే.గీ. రిపుని నెదిరింప నెంచిన నిపుడు సంశ
యమునఁ బడును సర్వమ్ము మహా బలుండ!
యొక్కఁ డరుగఁ దలంచుట యక్కట రుచి
యింప దెన్నండు నా మది కింత యేని 13.

ఆ.వె. క్షీణ బలుఁ డెవఁడు త్యజింపఁ దనదు జీవి
తమ్ము సమ్మతించి తరలు వృద్ధి
జెంది నట్టి వాని చెంతకు వశుఁడు కా
నకట మూర్ఖు పగిది నాజి లోన 14.

కం. నరు లందు సములు లే రె
వ్వరికి సముం డెవఁడు శక్ర వహ్నుల కిల నో
వర రాక్షస! యేల రణ మొ
నరింపఁగాఁ దలఁతు వట్టి నర వర్యునితో 15.

చం. త్వరపడు కుంభకర్ణుఁ గని పల్కి యటుల్ గిర లంత నా మహో
దరుఁ డసురేంద్రు రావణుని దారుణ కర్ముని లోకరావణుం
దిరిగి వచించెఁ గాంచి నిరతిన్ ఘన రాక్షస కోటి మధ్యలోఁ
దరుణినిఁ బొంది జానకినిఁ దద్ద విలంబన మేల సేసెదో 16.

ఉ. కోరిన సీత యౌ వశము కోమలి సేర సమీప మింపుగా
మూరె నుపాయ మొక్క టెద బుద్ధి రుచించిన నాలకింపుమా
వీర వరేణ్య లేవు రతి వేగమ రామ వధార్థ మేఁగి రిం
పారఁగ నంచుఁ జాటుమ దశాస్య! పురమ్మున లంక లోపలన్ 17.

ఆ.వె. చని త్వరగ ద్విజిహ్వ సంప్రోద కుంభక
ర్ణులు మఱియు వితర్దనుఁడును నేను
బరుల నని జయింపఁ బని లే దుపాయము
నకు రిపులె జయించిన నసురేంద్ర! 18.

తే.గీ. కయ్యము నొనరించిన మేము కడఁగి మదిఁ ద
లఁచిన దొనరింతుము మనిన రామ నామ
ములు గల సెలల నిజ తనువులను జీల్చి
కొని తడిసి నెత్తుటను వత్తు మనఘ! యిటకు 19.

ఆ.వె. వ్రాల నీ పదముల భక్షింపఁ బడిరి యా
రామలక్ష్మణు లని రాక్ష సేంద్ర!
కోరిన విడి మాకు కుంజ రాంసమునఁ జా 20.

టింపు పురము నందు నింపుగ నది

తే.గీ. హతుఁడు రాముఁడు లక్ష్మణు ననుజుఁ గూడి
యంచుఁ బ్రీతుని భంగి నీ వరినిషూద
న! యయి భృత్యుల కిమ్ము ఘనముగ భోగ
ములను బరివారమును గోరికలను జెలఁగి 21.

ఉ. ఈ వలె వస్త్ర మాల్యముల నిచ్చటి వీరుల కెల్ల లేప్యముల్
త్రావుమ సంతసమ్మునను రాడ్వర! నీవును మద్యమింపుగన్
వావిరి రామ లక్ష్మణుల భక్షణ మెల్లరు నేర వ్యాప్తమౌ
నీ వసురేంద్ర! గోప్యముగ నేర్పున సీతను నూఱడింపుమా 22.

తే.గీ. ఆస జూప వలె ధన ధాన్యాదుల మణు
ల వనితా మణికిం గోర్కెల నమితముగఁ
గపటపు టుపాయ మడర వగపున సీత
యిష్టపడకయు వశ యగు నష్ట నాథ 23.

ఆ.వె. సుందరుఁ డగు భర్త మ్రందె నని యెఱింగి
మది నిరాశఁ జెంది మానినీ ల
ఘుత్వమున ధరణిజ సత్వర మరుదెంచు
నీవశమున కింక నీరజాక్షి 24.

ఆ.వె. పెరిగినది సుఖములు విరియ మున్ను సుఖార్హ
దుఃఖ తప్త కాఁగఁ దోరముగ ని
పు డెడఁద నెఱిఁగి సుఖము లడరు నీ వశ
మందు నంచుఁ గదియు నవనిజ నిను 25.

ఉ. చక్కఁగ డెంద మందు సువిచారము సేసి యిటన్ వచించితిం
జిక్కఁగ నీ యుపాయము నృశేఖరు రాముని్ఁ జూచి నంతటన్
వెక్కసమై యనర్థ తతి పేగమ కల్గును గొప్పలాభముల్
దక్కు నయుద్ధ మంద సుఖదమ్ములు వీడుమ యుత్సుకమ్మునున్ 26.

తే.గీ. ఎవఁ డనష్ట సైన్యమ్మున నెట్టి సంశ 27.

యమును గాంచక చేయక యాజి పరుల
గెల్చు నట్టి రాజు వడయు కీర్తి పుణ్య
ము సిరిఁ జిరకాలము విరివి నసుర నాథ!

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నఱువది నాలుగవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 65.

మహోదరుని యనుచితపు టాలోచనకు నిందించి రావణునితోఁ దాను యుద్ధమున రాముని వధింతునని పలుక రావణుఁడు సంతసించి యనేకాభరణముల నొసఁగి కుంభకర్ణుని యుద్ధమునకుఁ బంపఁ దరలు చుండ దుర్నిమిత్తములు కనఁబడినను గణింపక నతఁడు రణమున కేఁగు చుండ వానరు లాతనిఁ గాంచి భయభ్రాంతు లగుట.

కం. అన విని మహోదరునిఁ గిను
కను నిందించి యసురేంద్రుఁ గని యగ్రజునిన్
ఘనుఁ గుంభకర్ణుఁడు వచిం
చెను వాక్యము లిట్లు ప్రీతిఁ జింత తొలంగన్ 1.

చం. తుడిచెద నీ భయమ్ము నని దుష్ట మనస్కునిఁ జంపి రామునిన్
మడియఁగ వైర మెల్లయును మాన్య! సుఖమ్ముగ నుండు గర్జతో
నడరరు భ్రాత!నిర్జలపు టభ్రము భంగిని వీర వర్యు లె
న్నఁడు విను నాదు గర్జన మనంతర మాజి నొనర్పఁ గార్యమున్ 2.

ఆ.వె. తమ్ముఁ బొగడుకొనఁగఁ దాము సహింపరు
శూరు లెన్నఁ డయినఁ జుమ్ము తెలుప
కుండఁగ నొనరింత్రు మెండుగ దుష్కర్మ 3.

ములను వారు నిరతమును జెలంగి

కం. రుచియించు మహోదర! నీ
వచనములు భయస్థునకు నపగత మతునకున్
రుచిరముగఁ బండితునిగఁ ద
లఁచు రాజున కెన్న మదికిఁ బ్రమదం బొసఁగన్ 4.

ఉ. కాంతుని వెంటఁ బోవుచును గాపురుషుల్ ప్రియ వాదు లెప్పుడున్
సాంతము నిన్ను బోలు పురు షాదులు సేసిరి కార్య హానినిన్
వింతగ రాజ శేష మయి పెల్లెను లంకయె మిత్ర చిహ్నమై
యంతము కాఁగఁ గోశము బలాహుతిఁ జేసిరి చేరి చెంతకున్ 5.

ఉ. ఏఁగెద నేఁడు యుద్ధమున కెల్ల విపక్షుల నుత్తరింపఁగా
వేగ సమమ్ము సేయ నిజ విక్రమ సంపద దుష్టనీతిసే
యీగతి మీ రొనర్చినది యింపుగ నా ననఁ గుంభకర్ణుఁడే
బాగుగ రాక్షసాధిపుఁడు వల్కెను నవ్వుచు నిట్లు వాక్యముల్ 6.

ఉ. రామ భయమ్ము చేత నెదఁ ద్రాసము నందె మహోదరుండు సం
గ్రామము సేయ నొల్ల డిట రామునితో రణ కౌశ లాగ్రణీ!
యేమియు లేదు సందియ మొకింతయు స్నేహ బలమ్ము లందు నా
కీ మహి లోన నీకు సరి యెవ్వఁడు లేఁడు గణించి చూచినన్ 7.

తే.గీ. రిపుల వధియించి జయ మంద నిపుడు కుంభ
కర్ణ! యేఁగుమ నిదురింపఁ గడఁగి నిన్ను
లేపితిమి శత్రుల వధింప రిపుగణఘ్న!
యసురుల కిది గొప్ప సమయ మగును వీర! 8.

ఆ.వె. కాన నేఁగి శూల మూని పాశ ధరాంత
కు వలె వానరులను గ్రూర రాజ
పుత్రుల రవి సన్నిభులను భక్షింపుమ
కుంభకర్ణ! చెలఁగి ఘోర రూప! 9.

ఆ.వె. అరసి నీదు రూప మడలి పాఱెదరు వా 10.

నరులు దిక్కులకును నరవరు లగు
రామ లక్ష్మణులకు బ్రద్ద లగును హృద
యమ్ము లసుర వర్య! యరయ నిన్ను

కం. అని కుంభకర్ణు తోడ వ
చనమ్ము లిట్లసుర పతి దశగ్రీవుఁడు ద
ల్చెను దాను బునర్జన్మ
మ్ము సెత్తి నట్టుల నెడంద ముద మేపారన్ 11.

కం. తెలియంగఁ గుంభకర్ణుని
బలము పరాక్రమము రాజు పరఁగె ముదమునన్
లలి తామల శీతాంశుని
వలె విమల మనస్కుఁడు దశవక్త్రుం డంతన్ 12.

కం. అన రాజు కుంభకర్ణుఁడు
విని ముదమున యోధుఁడు చన పెస బలుఁడు దొడం
గె నినుప శూలమ్మును గాం
చన భూషితమున్ గ్రహించి సమరము సేయన్ 13.

మ. ఘన శక్రాశని సన్నిభమ్మును దృఢాంగశ్రేష్ఠ భారమ్మునుం
దన శూలమ్మును దేవ దానవ స గంధర్వాహి యక్షఘ్నముం
గన దంగార సమప్రభా యుతము రక్తద్యోత తేజస్స్రజ
మ్మును శత్రువ్రజ శోణితమ్ముఁ గొని సంబోధించి రక్షఃపతిన్ 14.

ఆ.వె. పలికెఁ గుంభకర్ణుఁడు లలిత వాక్యము
లిట్టు లేఁగు వాఁడ నేకతమున
బల మిచట నలయక నిలుచును గాక భ
క్షింతు నాఁకలిఁ గినిసి హరి వరుల 15.

చం. పలికిన కుంభకర్ణు విని పల్కెను రావణుఁ డిట్లు వాక్యముల్
బలమును గూడి యేఁగఁ దగుఁ బన్నుగ ముద్గర శూలపాణులే
యలరఁ బ్లవంగు లెల్లరు మహాత్ములు శూరులు ధైర్యవంతులే
పలులను జీల్తురే కన విపక్షుని నొంటరినిం బ్రమత్తునిన్ 16.

ఆ.వె.	కావున పెడలు మని కీవు స సైన్యము
రక్కసుల కపితుల రణము నందు
శత్రు పక్ష మరసి చంపు మని మణిహా
ర మనుజునకు లేచి రక్తిఁ గట్టె 17.

ఉ.	అంతట నంగుళీయకము లంగద భూషణ సంచయమ్ము దే
వాంతకుఁ డా దశాననుఁడు హర్షముతో శశి తుల్య హారముల్
చెంతకుఁ జేరి కట్టెను విశేష మహాత్మున కిద్ధ శౌర్య ధీ
మంతునకున్ సుగంధ యుత మాలల నీఁ బనిచెన్ భటావలిన్ 18.

ఆ.వె.	కుండలములఁ జెవుల మండితములఁ జేయఁ
గుంభకర్ణుఁ డడరె గొప్ప చెవులఁ
గాంచ నాంగదములఁ గనక కేయూర భూ
షణముల సు హుతాగ్ని సరణి ఘనుఁడు 19.

కం.	మొల నల్లని సూత్రం బది
వెలయ నమృతముం బడయఁగ వేల్పులు నసురుల్
కలసి భుజంగముఁ గట్టఁగ
నలరిన మందరము పగిది నగపడె నతఁడే 20.

తే.గీ.	కట్టుకొను చుండ నాతఁడు కాంచన కవ
చము నభేద్య మస్త్రములకు సైపఁజాలు
భారము నిజప్రకాశ దీప్తమును సంధ్య
యందలి సమేఘ పర్వత మనఁగ వెలిఁగె 21.

ఆ.వె.	సకల గాత్ర శుద్ధ సర్వాభరణ భూషి
తుండు శూల హస్త మండితుం డ
సుర వరుండు తనరెఁ బరమ నారాయణు
పగిది ముప్పదములు వడయు నపుడు 22.

తే.గీ.	కౌఁగిలించి యగ్రజునిఁ జక్కఁగఁ బ్రదక్షి
ణమ్ము సేసి తలను వంచి నతుల నొసఁగి 23.

కుంభకర్ణుఁడు చనఁ జాగె ఘోర కాయుఁ
డడరి భండనమ్మునకు మహా బలుండు

కం. చను వానికి సుమహా కా
యునకు మహా బలునకును మహోగ్రార్భటికిన్
ఘనునకు నాశీర్వచనము
ల నొసంగి ప్రశస్తముగను రావణుఁ డనిపెన్ 24.

ఉ. మ్రోగఁగ శంఖ దుందుభులు మూరి వరాయుధ సైన్య యుక్తమై
యా గజ ఘోటకమ్ములును స్యందనముల్ ఘన సన్నిభార్భటుల్
వేగ చరింపఁగా నసుర వీరులు తోడుగఁ దేరుకాండ్రు నో
ద్వేగము నా రథిప్రవరు వెంటఁ జరించిరి రావ ణాజ్ఞనున్ 25.

తే.గీ. ఘోరుని మహా బలాఢ్యునిఁ గుంభకర్ణు
ననుసరించిరి యెల్లరు నహి వరోష్ట్ర
ముల ఖర తురగ మృగ రాజముల మృగముల
నిభముల ద్విజముల నధిరోహించి వేగ 26.

చం. వెడలెను ఛత్ర రాజితుఁడు వీరుఁడు శోణిత గంధ మత్తుఁడున్
వడి శిత శూలపాణి బలవంతుఁడు ఘోర మదోత్కటుండు పూ
జడు లలరింపఁగాఁ గురియ శత్రువు దానవ దేవ కోటికిం
గడఁకను గుంభకర్ణుఁ డతి కాయుఁడు శత్రు వధార్థ ముద్ధతిన్ 27.

కం. అసురు లనేకులు వాని న
నుసరించిరి కాలిబంట్లును మహా సారుల్
వెస బలులు మహాస్వన రా
క్షసులు భయంకరులు శస్త్రకర భీమాక్షుల్ 28.

తే.గీ. రక్త నేత్రులు ఘన శరీర భయ దాకృ
తులు వినీలాంజన నిభులు దుస్సహ శిత
శూల ఖడ్గ పరిఘ భిందిపాల ముసల
తాళ పరశు గదా ద్యాయుధముల నూని 29.

ఉ. దారుణ ఘోర దర్శనము దా ధరియించి మఱొక్క దేహమున్
శూరుఁడు కుంభకర్ణుఁడు విశుద్ధ శతాంబక ఘోర కాయుఁడై
మూరుచు నాఱు వందల సమున్నత బాణ మహోన్నతుండునై
మేరు నగాభుఁ డక్షు లవి మీఱఁగఁ జక్ర నిభమ్ము నేఁగుచున్ 30.

తే.గీ. చేరి యసురుల దీర్ఘ శరీరుఁ డంత
దగ్ధ శైలాభుఁడు ఘన వక్త్ర విలసితుఁడు
కుంభకర్ణుఁడు వలికెను ఘోరముగ న
గుచు మహా రౌద్రుఁ డివ్విధి వచనములను 31.

కం. వానర ముఖ్యుల యూధము
నే నేఁ డిచట విభజించి యింపుగ రుషతో
పే నిర్దహింతు మిడుతల
నా నిప్పు దహించు భంగి నలరుచుఁ గనుఁడీ 32.

కం. వనచారుల తప్పింతయుఁ
గనఁ జాలను నా కొనర్పఁ గపిజాతి తలం
ప నలంకారమ మన పుర
వనముల విహరింప నలరి భద్రం బెసఁగన్ 33.

ఆ.వె. పురము ముట్టడింప మూలము లక్ష్మణుఁ
గూడి రాముఁ డరయఁ గూల్ప నతనిఁ
గూలు నెల్ల వానిఁ గూల్తు నే విక్రమిం
చి రణ మందు నేఁడు శీఘ్రముగను 34.

తే.గీ. పలుకఁ గుంభకర్ణుం డిట్లు పలుకు లలిగి
రాక్షసులు సంభ్రమించి ఘోరంపు ధ్వనులు
సేసి రెల్లరు సెలరేఁగి చిత్రముగఁ బ
యోధి నెల్లను గంపింప నొప్పు నట్లు 35.

ఆ.వె. పెడలు చుండ నట్లు కడఁగి ధీమంతుఁడు
దుర్నిమిత్తము లటఁ దూర్ణము కని
పించె నెల్లెడలను మించి యపుడు ఘోర 36.

రూపములు మహాసురు కను గవకు

కం. జలదము లుల్కాశని యుత
ములు వుట్టె ఖరారుణములు బోరన నచటన్
ధరణి స సాగర వనముల
గురుతరము చలించె నంతఁ గొండల తోడన్ 37.

కం. పిక్కటిల దెసలు కూసెను
నక్కలు జ్వాలా కబల కనన్ముఖములతో
నక్కజముగ విహగమ్ములు
నిక్కి తిరిగె గుండ్రముగను సెఱి భిన్నముగన్ 38.

ఆ.వె. వ్రాలె గ్రద్ద పెడలఁ బథమం దతని శూల
ము పయిన నెడమ భుజము మఱి యెడమ
కన్ను జూచు చుండఁ గంపించినవి కుంభ
కర్ణునకు భృశమ్ముగ రణ మతికి 39.

తే.గీ. పడెను మండుచు నట నుల్క బెడిదపు ధ్వనిఁ
దొలఁగె నాదిత్యు స్వీయ ప్రభ లవి యెల్ల
వీవఁ డప్పుడు వాయువు వింత సుఖ క
రముగ నుంత యేని యరుగ రాక్షసుండు 40.

చం. కనినను దన్నిమిత్తముల గర్వి గణింపక రోమహర్షముల్
చనఁ దొడఁగెం గృతాంతుని వశమ్మున నక్కట కుంభకర్ణుఁ డా
ఘన తనుఁ డంతఁ బాదములఁ గ్రన్ననఁ బర్వత సన్నిభుండు గో
డను వెస దాఁటి యా ప్రహరి డగ్గఱి గాంచె రణాంగణమ్మునన్ 41.

తే.గీ. అభ్ర నిభ వాన రానీక మద్భుతమ్ము
నచట వానరులును గాంచి యద్రి సన్ని
భాసురుని దిశలకుఁ బాఱి రడలి యంత
గాలికిఁ జెదరు నట్టి మేఘముల భంగి 42.

తే.గీ. తత్ప్రచండ వానర సేన తద్ద భీతిఁ 43.

బర్వెడ దిశల కంబుద వ్రాత రీతిఁ
గుంభకర్ణుఁడు వీక్షించి ఘోర రీతి
నఱచెఁ బల్మఱు ఘన నిభుఁ డభ్రము వలె

కం. విని యా ఘోర నినాదము
ఘన నిభమును గూలిరి ధరఁ గపి పుంగవు లం
త నఱుకఁగ మూలములు గూ
లు నట్టి సాల తరుల వలె లోలాత్ములునై 44.

కం. పరిఘ కర కుంభకర్ణుం
డరి వధ కొఱ కేఁగ నమ్మహాత్ముం డొసఁగెం
గరము భయము హరులకుఁ గిం
కర దండ ధరు వలెఁ బ్రళయ కాలము నందున్ 45.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నఱువది యేనవ సర్గము.

# యుద్ధ కాండము
## సర్గము 66.

కుంభకర్ణుని మహాకాయునిఁ జూచి వానరులు భయమునఁ బాఱ నంగదుఁ డీయ ధైర్యమును దిరిగి వచ్చి భీకరముగ నఱచుచు వానరులను సంహరించు చుండఁ గుంభకర్ణునకు భయపడి పాఱి తిరిగి యంగదుని ప్రోత్సాహమున యుద్ధ సన్నద్ధు లగుట.

కం. గిరి శృంగ సన్ని భాంగుఁ డ
సురుండు లంఘించి ప్రహరి శూరుండు వెసం
బురి వీడి కుంభకర్ణుఁడు
తరలి మహా బలుఁడు సమర తలమున కట్లున్ 1.

ఆ.వె. నెగ్గు పగిది నెల్ల నిర్ఘాతములఁ గూల్చు
కరణి గిరి వరములఁ గడలి లోఁ బ్ర
తిధ్వను లడరంగ దిట్టముగ నఱచెఁ
గుంభకర్ణుఁ డంత ఘోరముగను 2.

చం. సురపతి కైన నా వరుణ సూర్య కుమారుల కైనఁ జంపఁగా
నరయఁ దరమ్ము గాని యమ రారిని నారసి భీమ నేత్రునిం
దురమునఁ గుంభకర్ణు రణ దుర్జయు వానర వర్యు లంతటం
బరఁగఁగ భీతి డెందములఁ బాఱిరి దిక్కుల కెల్ల బేలలై 3.

ఉ. వానరు లట్లు పాఱగను బార్థివ నందనుఁ డంగదుండు దా
నా నల నీలులం గుముదు నంత గవాక్షని గాంచి వీరులన్
మానుగ నిట్లు పల్కెను సమంచిత రీతిని సంభ్రమమ్ము నన్
మీ నయ వంశ మెన్న కయు మీఱ భయం బెట కేఁగు వారలో 4.

ఆ.వె. విస్మరించి స్వీయ వీర్యమ్ము లెల్లను
బేల లగుచు నకట యేల పాఱఁ
దిరిగి రం డసువులఁ దీపి యేల భయ మొ
సంగు బొమ్మయె యిది చాల దనికి 5.

ఉ. చంపెద మింక రాక్షసుల చక్కని బొమ్మను విక్రమమ్ము నం
దెంపున లేవ దీని నిట ధీరత వర్ధిలఁ దిర్గి రం డనం
బంపునఁ దేఱి కష్టమున వానరు లంతటఁ గూడికొంచు వా
రింపుగ నూని వృక్షముల నెల్లరు వచ్చిరి సేయ యుద్ధమున్ 6.

చం. మరలి కడింది క్రుద్ధు లయి మల్లులు సత్వర మంత మత్త కుం
జరముల భంగిఁ గొట్టిరి భృశమ్ముగ రాక్షసుఁ గుంభకర్ణునిన్
వర గిరి శృంగ రాజములఁ బాదప ఘోర శిలాశతమ్ములన్
హరి వరు లట్లు కొట్టిన మహాసురుఁ డింత చలింపఁ డుద్ధతిన్ 7.

చం. తనువును బుష్పితాగ్ర సహితమ్ములు ప్రూనులు దాఁకి నేలఁ గూ
లినవి శిలా చయమ్ములును లీలగ భగ్నములై య వెల్ల నం
త నసుర వీరుఁ డల్గి వితతమ్ముగ వానర సైన్య మెల్లనున్ 8.

వనమును గాల్చు నింగిలము భంగి దహించెను ఘోర యత్నుఁడై

చం. తడిసి కరమ్ము రక్తమున ధాత్రినిఁ గూల్పఁ బడంగ వానరుల్
పడి వసుధా తలమ్మునను బండిరి యెఱ్ఱని పూల తోఁ గనం
బడు ఘన భూరుహమ్ముల నిభమ్ముగఁ గొందఱు గొంద ఱింకఁ బ
ర్విడి రటఁ వెన్కఁ జూడకయె యింకను నన్యులు కూలి రబ్ధిలో 9.

ఉ. కొందఱు నింగినిం గదియఁ గొందఱు సంద్రము వచ్చినట్టి యా
చందము వేగ దాఁటగను జంపఁ బడంగఁ బ్లవంగ వీరులే
కొందఱు నిమ్న భాగముల గుట్టలఁ గుందుచు నాశ్రయింపఁగాఁ
గొందఱు ఋక్ష పుంగవులు గొండలఁ జెట్టుల నెక్కి రార్తితో 10.

తే.గీ. మునిఁగిరి వనధిఁ గొందఱు చని గుహలకు
దాఁగి రన్యులు పాఱిరి వేగ పరులు
నిలువఁ జాలరు కొందఱు నేలఁ బడి రి
తరులు నిద్రింప మృతుల విధం బపరులు 11.

ఉ. వానరు లట్లు వాఱఁ గని భగ్న మనస్కుల నంగదుం డనెన్
వానర వర్యులార! నిలువం దగు వే మరలుండు యుద్ధమున్
మానుగఁ జేయు వారలము మానక యోడిన భూమి పైన మీ
కే నరయన్ స్థలమ్మును మఱేల గణింతురు స్వీయ జీవముల్ 12.

తే.గీ. పరిహసింతురు భార్యలు పరువు లెత్త
వీడి యాయుధములు మిమ్ము వీరులార!
యడ్డులేని పరాక్రమ మడర గతియు
మీ కది సుజీవితుల కెన్న మృత్యు సమము 13.

చం. పరమ సుదీర్ఘ వంశమున వానర వర్యుల రింపుగా జనిం
చి రగిలి భీతి నెచ్చటకు జేరఁ దలంతురు ప్రాకృ తాత్ములౌ
హరుల నిభమ్ము పాఱిన ననార్యులె యౌదురు వీడ వీర్యముం
బరుల సమీపమం దనిన పల్కులు నేఁ డెట కేఁగె బీరముల్ 14.

తే.గీ. ఛీ యనంబడు భీరువు జీవితమున 15.

నిందలె వినంబడును గాదె నిత్య మిలను
సత్పురుషులు చరించెడు చక్కని గతి
నేఁగ వలయు వీడుఁడు భయ మెల్ల నింక

కం. శయనింత మల్ప జీవుల
మయి మరణించి పుడమి పయి నధమపు భట సం
చయమున కందని దగు న
ట్టి యజ జగం బరయుదము వడిం గపు లారా! 16.

ఆ.వె. చంపి శత్రువులను జక్కని కీర్తి గ
డింత మంక మందు నంత మయిన
నాజి రిపుల చేత ననుభవింతము వీర
లోక భోగములను వీఁక నేఁగి 17.

తే.గీ. కాంచి కాకుత్స్థు నాజి జీవించి యుండ
నేరఁ డా కుంభకర్ణుఁడు నెగడు చున్న
యట్టి మంటను జేరిన యట్టి మిడుత
భంగి నసురుఁడు వానర వర్యులార! 18.

తే.గీ. ఒక్కనికి నోడి రణమున కుద్యమించు
మనము రక్షింపుకొన నెంచి మన యసువుల
నకట యివ్విధిఁ బాఱిన యశము నాశ
నమ్ము గాదె తలఁచి చూడ నెమ్మనముల 19.

చం. పలుకఁగ నంగదం డిటుల వానర పుంగవు లాలకించి యా
విలసిత కాంచ నాంగదుని వీరు లనంగ ననర్థముల్ గిరల్
పలికిరి యిట్లు పాఱుచును వారలు సాలును గుంభకర్ణుతో
నిల రణ మింక నిల్వఁ దగ దిచ్చట నింపులు మాకుఁ బ్రాణముల్ 20.

ఆ.వె. మాటల నని యింత మాత్రమ యెల్లరు
గాంచి కుంభకర్ణుఁ గదియు వాని
భీము భీమ నేత్రు భీతిఁ బాఱఁ దొడంగి
రెల్ల దిశలకుఁ గపు లెల్ల రంత 21.

తే.గీ. పరుగిడెడు కపి వీరులు వాలి సుతుని
చేత నూఱడింపఁ బడి విశేష యుక్తి
వచనముల చేత మరలిరి ప్రమద మంది
నిలిచి రంగదు డొసఁగు నాజ్ఞలను బడయ 22.

తే.గీ. ఋషభ శరభ మైందులు ధూమ్రుఁ డింక నీల
కుముద పనస ద్వివిద గవాక్షులు సుషేణ
రంభ తార వాయు సుతులు రణము కొఱకుఁ
ద్వరిత గతి నభిముఖు లైరి తిరిగి ధృతిని 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నఱువది యాఱవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 67.

కుంభకర్ణుఁడు ఘోర యుద్ధము సేసి యనేక వానరులను సంహరించి విక్రమించి ద్వివి దాంగద నీల సుగ్రీవ హనుమల్లక్ష్మణులతోఁ బోరి రాముని మార్కొన రాముఁడు వాని బాహు ద్వయమును శీర్షమును ఘోరాస్త్రముల భేదింపఁ గుంభకర్ణుఁడు మరణించుట.

కం. విని యంగదు వచనమ్ములు
ఘన కాయులు నిష్ఠ నూని కద నాకాంక్షుల్
వనచరు లెల్లరు మరలిరి
ఘన విక్రమవంతు లంతఁ గయ్య మొనర్పన్ 1.

చం. పెరిఁగిన వీర్య మున్న కపి వీరులు బల్లిదుఁ డైన యంగదుం
డు రణ నిమిత్త మాడిన కడుంగడు యుక్తము లైన మాటలం
బెరిఁగిన విక్రమమ్మునను బెంపు వహింప ముదమ్ము యుద్ధమున్ 2.

మరణ సునిశ్చి తాత్ము లయి మానుగఁ జేసిరి త్యక్త జీవితుల్

ఉ. ఊని కరమ్ములం దరులు నున్నత శైల శిఖాగ్రముల్ ధృతిన్
వానరు లంతఁ బర్విడిరి పన్నుగ మార్కొనఁ గుంభకర్ణునిం
దాను గదన్ ధరించి యమ దండ నిభమ్మును గుంభకర్ణుఁడే
వానర కోటినిం దఱిమె బాఁదుచుఁ గిన్కను ధర్షణమ్ములన్ 3.

తే.గీ. చిమ్మ దిక్కులకు నసుర శేఖరుండు
వీర్యుఁడు సుమహాకాయుఁడు పృథ్విఁ బడిరి
యేడు నెనిమిది వందలు నింక వేలు
చెల్లచెదరి కొట్టఁబడఁగ నెల్ల కపులు 4.

తే.గీ. పదుగు రెనమండ్రఁ బదునార్గురఁ దనరి యిరు
వండ్ర ముప్పండ్రఁ జేఁబట్టి వఱలి నమలి
మ్రింగు చుండి పన్నగులను మ్రింగు గరుడి
వోలెఁ బర్వెత్తుచుండెఁ దా నాల మందు 5.

ఆ.వె. ఊఱడిల్లి వాన రోత్తము లతికష్ట
మున నలుదెసలఁ గల ఘనులు కూడి
తరు గిరి వరములు వితతముగఁ గైకొని
యడరి నిలిచి రంత నాజి లోన 6.

చం. గిరిఁ బెకలించి యున్నతముఁ గేళిని నా ద్వివిదుండు పర్విడెన్
హరిగణ ముఖ్యుఁ డంత విత తాద్రి నిభుం గని కుంభకర్ణునిన్
గురు ఘన సన్ని భాసురునిఁ గోపమునన్ విసరెన్ శిలన్ వెసన్
గురు శిల సేర కాతనినిఁ గూలెను వాని యనీక సన్నిధిన్ 7.

తే.గీ. అశ్వ కుంజర రథముల నమ్మహా శి
లాగ్రము వెస మర్దింపఁగ నన్య మొకటి
యితర రాక్షస పుంగవ తతినిఁ ద్రుటిని
నలఁగఁ జేసె మిక్కుటముగఁ గలఁగ సేన 8.

కం. పెను ఱాతి ఘాతమునఁ గూ 9.

లిన హయ సారథ్యసురుల శ్రేణి సమర మ
య్యెను రక్తక్లిన్న మ్ముగఁ
గన నత్తఱి ఘోరముగను గపి కృత మడరన్

కం. నినదించుచు ఘోరమ్ముగ
నని రథికు లసురులు నిజ శరావళినిఁ బ్లవం
గ నిచయ మూర్ధమ్ముల నె
ల్ల నంత ఖండించిరి యమ రాట్సదృశులునై 10.

కం. వానరులు నమ్మహాత్ములు
నేనుంగుల నుష్ట్రముల ననేక హయములన్
మానక తేరుల నసురుల
పే నలఁగఁగఁ జేసి రాజి వీర్యోద్ధతినిన్ 11.

కం. హనుమంతుఁడు గిరి శృంగము
లను శిలలను వివిధ తరువులను గురియించెన్
ఘను కుంభకర్ణు శిరమున
వినువీథి నిలిచి ప్లవంగ వీరుం డంతన్ 12.

ఉ. ఆ గిరి శృంగ సంచయము నంతను శూలము చేత ఖండముల్
గాఁగ నొనర్చి దీర్ఘతర కర్ణుఁడు శూరుఁడు కుంభకర్ణుఁడే
వేగము ఘోర వృక్షములఁ బెద్ద బలాఢ్యుఁడు తుంచె నన్నిటిం
దాఁ గొని శూల మా హరుల దండును మార్కొనఁ బాఱె నుగ్రుఁడై 13.

చం. హనుమయుఁ గుంభకర్ణుఁ గని యవ్విధి వచ్చెడు వాని నంత ని
ల్చెను సముఖమ్ము నందు గిరి శృంగము గైకొని కుంభకర్ణుఁ గొ
ట్టె నడరి మీఱఁ గోపము పటిష్ఠపు దేహము వానిఁ గొట్టినం
దను వది రక్త మేదములఁ దద్ద మునుంగఁ జలించె యాతుపే 14.

తే.గీ. మీఱి కుంభకర్ణుం డంత మెఱుపు తెఱఁగు
మండు శూలమ్ము గైకొని మండు కొమ్ము
దనరు గిరిఁ బోలు వాఁడు గొట్టె నురమున హ
నుమను శక్తిచేఁ గ్రౌంచమును గుహుని గతి 15.

కం. ఘన శూల భిన్న వక్షుఁడు
హనుమంతుఁడు విహ్వలుఁ డయి యస్ర ముఖముతో
నినదించెను లయ కాల
మ్మున మేఘపు టురుముల స్వనముల తుల్యముగన్ 16.

తే.గీ. సంతసిల్లిరి రాక్షసు లంత నార్చి
రరసి వ్యథితుని హనుమను హరులు సెంది
యార్తి భయ పీడితు లయి యయ్యసుర వీరు
నుండి పాఱిరి విరమించి భండనమ్ము 17.

ఉ. నీలుఁడు నిల్పి సైన్యమును నేర్పున వానర యూథపుండు పే
శైల వరాగ్రముం బెఱికి చక్కఁగ వైచెను గుంభకర్ణుపై
నాలము నందు ధీమతి తదద్రి శిఖం గని కొట్ట ముష్టినిన్
శైలము ముక్క లయ్యె వెస క్షోణినిఁ గూలె స విస్ఫులింగమై 18.

తే.గీ. ఋషభ శరభ నీల గవాక్షు లింక గంధ
మాదనుండు వారేవురు మర్కటర్ష
భులు సెలంగి పర్వులిడిరి యలుకఁ గుంభ
కర్ణు మార్కొన ఘోర రాక్షసుని దెసకు 19.

ఆ.వె. తరుల గిరుల హస్తతల పాద ముష్టుల
నమ్మహా బల హరు లంద అడరి
క్రుద్ధు లయి కరమ్ము కుంభకర్ణునిఁ గొట్టి
రెల్ల దెసల నుండి యేఁగుదెంచి 20.

ఆ.వె. స్పర్శ వోలె నెఱిఁగి సంఘాతములఁ గుంభ
కర్ణుఁ డింత యేని కలఁగ కుండి
వేగ వంతు ఋషభుఁ గౌఁగిలించి కొనియె
బాహు యుగము చేత బల్లిదుండు 21.

ఆ.వె. ఘోర పీడన మిడఁ గుంభకర్ణుని భుజ
యుగ్మ మంత వాన రోత్తముండు 22.

భీమ ఋషభుఁ డకట వెడల రక్తము నిజ
ముఖము నుండి కూలెఁ బుడమి పైన

తే.గీ. శరభు ముష్టిని మోఁకాలు సాచి నీలు
హరి గవాక్షుని నఱచేత నసుర వరుఁడు
గంధమాదను బదములఁ గయ్య మందుఁ
గొట్టె నింద్రారి క్రుద్ధుఁడు ఘోరముగను 23.

కం. ఒసఁగిన తాడనములఁ గర
ము సెలఁగ మోహమ్ము రక్తము స్రవింపంగన్
వెసఁ గూలిరి హరులు ధర న
లసి నఱకినఁ గింశుకమ్ముల పగిది నంతన్ 24.

చం. పడిన హరిప్రవీరులు ప్లవంగులు వేలకొలంది యాజిలో
నడరి మహాత్ము లంతట మహాసురు మార్కొనఁ గుంభకర్ణునిం
దడయక యుర్కి కొర్కిరి స్వదంతములన్ గిరి సన్ని భాంగునిన్
బెడిదముగం గుభృత్సదృశ వీరులు బల్లిదు లెక్కి గాత్రమున్ 25.

ఉ. గోరుల దంత హేతులను ఘోరుని ముష్టుల నింక జానులం
గ్రూరునిఁ గుంభకర్ణుని సరోషము వానరు లార్తుఁ జేయఁగా
నారయ వాన రావలిని నాతఁడు పర్వత సన్నిభుండు దే
వారి వెలింగె నత్తఱి నిజాంగ రు హాగమ పర్వ తాభుఁడై 26.

ఉ. కై కవఁ బట్టి వానర నికాయముఁ గ్రుద్ధత నారగింపఁగా
వీఁకఁ దొడంగె సర్పముల వే తిను వానిని వైనతేయుఁ దా
నా కడఁ బోలి యంతట మహా బలవంతుని యాననం బధో
లోకము వీడి యేఁగిరి హరుల్ శ్రవణమ్ముల ఘ్రాణ వీథినిన్ 27.

తే.గీ. వానరులను భక్షింపఁగఁ బర్వత సదృ
శుండు దలఁచి డెందమ్మున మెండుగ విఱి
చె హరి వరుల నెల్లరఁ గినిసి కర మసుర
వర్యుఁ డా కుంభ కర్ణుఁ డవార్య బలుఁడు 28.

కం. ధర నెల్లఁ జేసి మాంస రు
ధిర సంక్లిన్నముగ నసుర ధీరుఁడు బలిమిం
జరియించెను గా లానలు
కరణి ఘనుం డంది మూర్ఛ కపి సైన్యమునన్ 29.

ఆ.వె. వజ్ర హస్తు శక్రు భంగిని పాశ హ
స్తాంతక సదృశము మహా బలుండు
కుంభకర్ణుఁ డాజి ఘోర నిశిత శూల
హస్తుఁ డపుడు వెల్గె నద్భుతముగ 30.

తే.గీ. ఎండిన యడవులను గ్రీష్మ ఋతువు నందుఁ
గాల్చు నట్టి పావకు భంగిఁ గాల్చె నసుర
వరుఁడు కుంభకర్ణుఁ డలిగి వానర వర
సైన్యము నపుడు కోపాగ్ని సంచరించి 31.

తే.గీ. అఱచిరి వికృత స్వరముల హరులు నిహత
యూథులు విగత నాయకు లుగ్ర రాక్ష
సార్తులు సుభీత చిత్తులు నడలి చంపఁ
బడ శరణు జొచ్చి రా రఘు వరునిఁ గదిసి 32.

చం. హరులను వజ్ర హస్త తన యాత్మజుఁ డంగదుఁ డంతఁ గాంచి తాఁ
బరుగిడెఁ గుంభకర్ణు దెస వారు రణమ్మున నోడ నార్చుచున్
వర గిరి శృంగ మొక్కటిఁ బ్లవంగ వరేణ్యుఁడు భీతిలంగ నా
సుర తతి పైచె మూర్ధమున సూటిగఁ జూచుచుఁ గుంభకర్ణునిన్ 33.

చం. తలఁ దగులంగఁ బర్వతము దారుణ బాధకు నోర్చుచున్ హుతా
నలు వలె మండి ఘోరముగ నైరృతుఁ డింద్ర రిపుండు రేఁగఁ బే
రలుక రయమ్మునం గపుని యంగదు నల్గిన వాని దిక్కు సె
ల్గ లలి యెడందఁ బర్విడెను రాక్షసుఁ డార్చుచు బెట్టిదమ్ముగన్ 34.

తే.గీ. త్రాస మొసఁగుచు వానర వ్రాతమునకుఁ
గుంభకర్ణుఁడు నినదించి ఘోరముగను
పైచె నంగదు పయి మహా బలుఁడు శూల 35.

మంత రోషమ్ము సెలరేఁగ నాత్మ లోన

ఆ.వె. వచ్చు నట్టి శూల వరమును వీక్షించి
యంగదుండు యుద్ధ మందు నిపుణుఁ
డంత లాఘవమున వింతగఁ దప్పించు
కొనియె నేర్పు తోడ ఘన బలుండు 36.

ఉ. కొట్టెఁ దలమ్మునం గినిసి ఘోర త రోరము నందు రక్కసుం
గిట్టి తదంగదుండు పరికించి బలమ్ముగఁ గుంభకర్ణుఁడే
కొట్టిన సొమ్మసిల్లి రణ కోవిదుఁ డింపుగఁ దేఱి ముష్టినిం
గొట్టె బిగించి యంగదునిఁ గూలె నతండు విసంజ్ఞ నేలపై 37.

ఆ.వె. పడఁగఁ దొలఁగ సంజ్ఞ ప్లవగ శార్దూలుండు
నేల పైనఁ దనదు శూలమును గ్ర
హించి చేరె నంతఁ గాంచి సుగ్రీవునిఁ
గుంభకర్ణుఁడు పరుగు పరుగునను 38.

ఉ. వచ్చెడు కుంభకర్ణుఁ గని వానర నాథుఁడు పర్వతాగ్రముం
జెచ్చెరఁ బట్టి గెంతుచును జేరెను బర్విడి కుంభకర్ణునిం
గ్రచ్చఱఁ గుంభకర్ణుఁడును గాంచి కపీంద్రుని సమ్ముఖమ్మునన్
విచ్చుచు సర్వ గాత్రములు వీరుఁడు నిల్చెను విఱ్ఱవీఁగుచున్ 39.

తే.గీ. వానరుల రక్త మంటిన మేని వాని
హరుల మూఁకను భక్షించి నట్టి వానిఁ
గట్టెదుట నిలిచిన కుంభకర్ణుఁ గాంచి
పలికె సుగ్రీవుఁ డివ్విధి భాషణములు 40.

చం. ఇలఁ బడ వేసితే కపుల నెల్లరఁ జేసితి దుష్కరమ్మునుం
జెలఁగి ధ్వజమ్ముఁ దింటివె యశేష యశమ్మును బొంది తౌర యి
ట్టుల మఱి యేల ప్రాకృతుల డుల్లఁగఁ జేయు తలంపు వీడుమా
కలఁగక సైఁపు మీ గిరినిఁ గాయముఁ దాఁకఁగ వీఁక రాక్షసా! 41.

ఉ. నా విని కుంభకర్ణుఁడు ఘనమ్ముగ ధైర్య సమన్వితమ్ము సు 42.

గ్రీవుఁ డనంగ నిట్టు లనెఁ గిన్కు వహించి మఱేల వాఁగెదో
నీ వరయం బ్రజాపతికి  నెయ్యపుఁ బౌత్రుఁడవే ప్లవంగమా!
యా వర వీరు ఋక్షరజు నాత్మ భవుండవు విక్రముండపై

ఆ.వె. ఆలకించి యంత నాకుంభ కర్ణుని
గిరలు సుందరంపు గ్రీవుఁ డద్రి
వరము విసరె వేగ హరిపతి సుగ్రీవుఁ
డది తగిలె నురమున నసుర పతికి 43.

తే.గీ. ముక్క లయ్యెను దూర్ణమ రక్కసుని వి
శాల వక్షమ్ము దాఁకి యా శైల శృంగ
మరసి  దాని విషాదమ్ము నంద హరులు
మురిసి యఱచిరి రాక్షస వరులు సెలఁగి 44.

కం. కినిసి గిరి శృంగ ఘాత
మ్మునకు నసురుఁ డంతఁ గోపమునఁ దెఱచుచు నో
టినిఁ బట్టి నిశిత శూల మ
శని నిభము విసరె హరీశుఁ జంప రయమునన్ 45.

తే.గీ. క్షిప్ర మెగిరి పట్టి విఱిచె నప్రమత్తుఁ
డై యనిల తనూజుం డంత వేయఁ గుంభ
కర్ణుఁ డట్లు శూలమ్మును  గనక దామ
యుతము నిశితమ్ము దోర్బల యుతుఁడు  హనుమ 46.

తే.గీ. వేయి పుట్టులు బరువున్న యాయసంపు
టీటె మోఁకాలిపై నిడి యిట్టె విఱువ
గాలిపట్టి ఘనమ్మును గాంచి వాన
రర్షభులు క్షిప్ర మందిరి హర్ష మెదల 47.

తే.గీ. శోక మగ్ను లయిరి రాక్షసులు భృశమ్ము
భగ్న శూలము వీక్షించి వానర వర
సైన్య మెల్ల దిశల నుండి సంతసమున
వచ్చి నినదించి పూజించెఁ బవన సుతుని 48.

చం. అని నసు రాధినాథుఁడు మహాత్ముఁడు గాంచి ప్రభగ్న శూలముం
గొని వెస లంక నున్నపెను కొండఁ గనంబడు శృంగ మంతఁ గొ
ట్టెను బ్లవ గాధినాథునిఁ గడింది బలమ్మున భాను సూనుఁ డా
ఘనుఁడు వినష్ట సంజ్ఞుఁ డయి గ్రన్ననఁ గూలెను దూఁగి నేలపై 49.

తే.గీ. రక్కసు లఱచిరి మురిసి మిక్కుటముగఁ
గదిసి ఘోర వీర్యునిఁ బ్లవంగ పతిఁ గుంభ
కర్ణుఁడు గ్రహించి సుగ్రీవుఁ గరములఁ గొని
పోయె ఘోరానిలుండు మబ్బును గొను క్రియ 50.

చం. వెలిఁగెను గుంభకర్ణుఁడు సుభీమ తనుండు మహా ఘనాభు న
ట్టులఁ గొని పోవు చుండఁగఁ బటుత్వమునం గపి కోటి నాథునిన్
సలలిత మేరు సన్నిభుఁడు సక్కఁగ నుచ్ఛ్రిత శృంగ యుక్త సం
చల దభిరామ మేరు గిరి సన్నిభమై యసురప్రభుం డటన్ 51.

కం. చనె వీరుఁ డెత్తికొని పొగ
డ నసుర వీరులు తనను నడరుచుం గపినా
థుని గ్రహణ మరసి త్రిదశులు
నినదింపఁగ నచ్చెరువున నెమ్మిని వినుచున్ 52.

తే.గీ. ఇంద్ర సన్నిభుఁ గొని వానరేంద్రు నంత
నింద్ర సమ వీర్యుఁడు దలంచె నితఁడు నిహతుఁ
డైన రాముని తోడుత వానర బల
మెల్ల సమసి నట్లని మది నింద్ర రిపుఁడు 53.

ఉ. వానర సేన నట్లు గని పర్విడు చుండఁగ నిందు నందునున్
వానర నాథు నవ్విధము పట్టి చనంగను గుంభకర్ణుఁడే
వానర వర్యుఁ డా హనుమ పన్నుగ ధీమతి దల్చె నిట్టులన్
నే నొనరింప నే పనిని నెమ్మి సెలంగు నొనర్తు న్యాయ్యమున్ 54.

ఉ. శైల శరీర మూని వెసఁ జంపుదు నాజిని రాక్షసాధముం
గూలఁగఁ గుంభకర్ణుఁడు సుఘోరపు ముష్టిని బల్లిదుండు కా 55.

లాలయ మాశ్రయింపఁ బ్లవగాధిపుఁ డంత విముక్తుఁ డైనచో
మేలుగ నేల లాడుదురు మేటి ప్లవంగులు హర్ష వార్ధినిన్

తే.గీ. అయిన నితఁడు సమర్థుఁడ యమర పన్న
గాసు రాదుల బంధితుఁ డైన స్వయము
గ విడి పించుకొనంగ శంకఁ గన నిందు
శైల ఘాతమునఁ గృశించె సంజ్ఞ సుంత 56.

ఆ.వె. తెలివి నెల్లఁ బడసి చెలువముగ ముహూర్త
కాల మందుఁ దనకుఁ గపి వరులకు
నేది హితమొ దాని నింపుగఁ జేయఁ గ
లం డితండు లేచి ప్లవగ విభుఁడు 57.

ఆ.వె. హానికర మగును మహాత్ముని కీర్తికిఁ
నప్రియమ్ము నగును క్షిప్ర మేను
ముక్తుఁ జేయ బంధమున నుండి వాన రా
ధిపుని సత్త్వవంతు ధీర వరుని 58.

ఆ.వె. కాన వేచి యుందుఁ గాల మొకింత కో
రి విభు విక్రమమ్ము తివిరి చెదరి
నట్టి ప్లవగ సేన నాశ్వసింపఁ దొడంగు
వాఁడ నంత దనుక భద్ర గతిని 59.

కం. హనుమంతుఁ డిట్లు చింతిం
చి నెమ్మనము నందుఁ గపుల శ్రేష్ఠుఁడు హరి సే
నను స్థిరముగ నిలుపం జా
గెను దిరిగి సమగ్ర ముచిత గిరలం బ్రీతిన్ 60.

ఉ. చేరెను లంక యయ్యసుర శేఖరుఁ డంత హరీంద్రుఁ గొంచు నా
వీర వరేణ్యుఁడుం గదల వీథుల నిండ్లను గోపురమ్ములం
బౌరులు నిల్చి పుష్పచయ వర్షమునుం గురియించుచుం దమిన్
గారవ మొప్ప లాజలు సుగంధము లింపుగఁ జల్లుచుండఁగా 61.

తే.గీ. లాజ గంధోదకమ్ముల రాజ గతుల
చల్లఁదనమున హరిరాజు సంజ్ఞ నంది
యమ్మహాబలుండు దలంచె నరసి వీథిఁ
బల్మఱు నసురు భుజముపై వఱలు చుండి 62.

తే.గీ. పట్టు వడఁగ నే నకట యిప్పట్టు నందుఁ
జేయు నట్టి కార్యం బెద్ది చింత సేసి
యెయ్యది ప్రియము కపులకు హితము నగునొ
నయ్య దొనరింతు నింపుగ నడరి యిపుడు 63.

చం. తలఁచి ప్లవంగ రా జిటులఁ దద్బలసూదను శత్రు నంత గో
రుల నిశితమ్ములం జెవుల రూపునడంచి రదమ్ములన్ పెసం
బలుమఱు కొర్కి నాసికను బాద యుగమ్మునఁ బార్శ్వ యుగ్మముల్
గలవర మందఁ జీల్చి ఘన కాయుని నార్తునిఁ జేసెఁ గ్రుద్ధుఁడై 64.

తే.గీ. కుంభకర్ణుండు హృత కర్ణ ఘోర నాసి
కుండు నఖ దంత సువిదారితుండు శోణి
తార్ద్ర గాత్రుండు కుపితుండు హరి వరేణ్యుఁ
బుడమిపై వైచి పీడించె నడుగులఁ బగ 65.

ఆ.వె. భీమ బలుని చేతఁ బృథ్విని నలుపఁ బ
డు నసురగణ ఘాతుఁడు జవ మూని
బంతి వోలె నెగిరి యంత సుగ్రీవుఁడు
సేరె రాఘు వేంద్రు చెంత కలరి 66.

కం. విగత నసా కర్ణమ్ముల
నగపడె నా కుంభకర్ణుఁ డప్పుడు సెలయే
ళ్ల గములతో గిరి వలె రుధి
ర గాత్రుఁడు మహా బలుం డరయు వారలకున్ 67.

ఉ. ఆతఁడు భీమ రూపుఁడు మహాంగుఁడు గక్కఁగ శోణి తార్ద్రుఁడే
యాతత మస్త్రముం గినుక నంచిత కాల మయాంజ నాభుఁడై
యా తటి సంధ్యయం దడరు నభ్రము భంగిని వెల్గె వింతగన్ 68.

పే తలఁచెన్ రణమ్మునకు వీరుఁడు పోవ మనమ్ములో ధృతిన్

తే.గీ. ఏఁగ సుగ్రీవుఁడు సుర రాజేంద్ర రిపుఁడు
కుంభకర్ణుండు రణమునకుఁ జనెఁ దిరిగి
యాయుధ విహీనుఁడ నని తా నాత్మ నెఱిఁగి
రౌద్రుఁడు గొనె ఘోరపు ముద్గరమ్ము నంత 69.

కం. పురమును వీడి మహాత్ముఁ డ
సురుండు భక్షించెఁ బ్లవగ శూరుల నాజిం
బరఁగి యుగాంతమునఁ బ్రజా
లి రయమ్మునఁ గాల్చు వహ్ని లీలఁ జెలఁగుచున్ 70.

తే.గీ. ఆఁకలి రుధిర మాంస రతాత్ముఁ డాజిఁ
జేరి వానర సైన్యమ్ము మూర మోహ
మసుర ఋక్ష ప్లవగ పిశా చాలిఁ దినఁ దొ
డంగెను యుగాంత మృత్యు వడరు విధమ్ము 71.

కం. ఒకరి నిరువురను ముగ్గుర
నిఁకఁ బెను సంఖ్యలను హస్త మేకమ్మునఁ బ
ట్టి కపుల రాక్షసులను గూ
డి కినిసి వక్త్రమ్ములో వడి వడిం జొనిపెన్ 72.

ఉ. కాఱఁగ రక్త మేదములు కాయము నుండి మహీధ్రమౌళులన్
మీఱుచుఁ గొట్టు చుండఁగను మేటి కపుల్ తిన వారి నాతఁడే
బాఱిరి రాఘవేంద్రు దెస వానరు లెల్లరు భక్ష ణార్తులై
తూఱి దళమ్ముఁ బర్విడెను దోరము తించును గుంభకర్ణుఁడే 73.

ఆ.వె. ఏడ్గుర నెనమండ్ర నిరువండ్ర ముప్పండ్ర
నూర్గుర నసురుల ఘనుండు కుంభ
కర్ణుఁ డడరి పట్టి కరములఁ బర్విడు
చుండె నాజి మ్రింగు చుండి హరుల 74.

తే.గీ. అంత మేదో వపా శోణి తార్ద్ర గాత్రుఁ 75.

డసుర వరుఁడు శ్రవణముల యందుఁ జిక్క
నాంత్ర మాల సుతీక్ష్ణ దంష్ట్రుండు కురిసె
శూల వర్షమ్మును యుగాంత కాలు వోలె

తే.గీ. అంత సౌమిత్రి శత్రు బలార్దనుండు
సేసె యుద్ధమ్ము క్రుద్ధుఁడై చేవ మీఱఁ
బర పురంజయుం డపు డేడు శరము లేసెఁ
గుంభకర్ణుపై నమ్ములు గురిసె నింక 76.

తే.గీ. అసుర నిశ్శేష మొనరించె నార్తి సెంది
యస్త్ర జాలము నంతట నలిగి కరము
బల్లిదుఁడు సుమిత్రానంద వర్ధనుండు
నింపెఁ గనక మయ కవచం బంప గమిని 77.

తే.గీ. పీడ్య మానుఁడై శరముల వెలిఁగెఁ గుంభ
కర్ణుఁ డభ్ర మగ్న ప్రభాకరుని కరణి
స్వర్ణ మయ భూషణమ్ముల వాఁడు నల్ల
కాటుకను బోలు నట్టి యంగమ్ము వాఁడు 78.

కం. కని రాక్షసుండు లక్ష్మణు
ననియె ననాదరమున గిర లభ్ర నిభ మహా
స్వనముల నీ వభయము ని
ల్వ నా యెదుటఁ దెలిసె నీ పరాక్రమ మెల్లన్ 79.

ఉ. అంతకుఁ గష్టహీనముగ నాజి జయించెడు నాదు చెంతఁ గా
లాంతకు భంగి హేతువుల నంచిత మూని చెలంగు వానితో
సుంత భయమ్ము లేక యతి శూరత నిల్చితి యుద్ధ మీయఁగా
నెంతయొ పూజ కర్హుఁడ వహీన పరాక్రమ! నాకు లక్ష్మణా! 80.

చం. అమరులఁ గూడి వెల్ల గజ మంచిత మెక్కి రణమ్ము నందు ని
ల్వ మును నెఱుంగ నోపఁ డల వాసవుఁ డేనియు నా సమీప మం
దు మనుజ వీర! నిన్ను గనఁ దోరపు విక్రమ వంతు నిట్లు మో
ద మడరె నా కనుజ్ఞ నిడు తత్క్షణ మేఁగ నెదిర్ప రామునిన్ 81.

తే.గీ. చెలఁగ వీర్య బలోత్సాహములు రణమున
నీకు లక్ష్మణ! మురిసితి నేను రాము
నొక్కని వధింప నెంతు నా యొక్కఁడు మర
ణింప హేతు లెల్ల రంచుఁ దలంప నగును 82.

ఆ.వె. నర వరుండు నణఁగ నా చేతఁ దక్కిన
వారు ధైర్య మూని వీరులు నిలి
చిన రణమున నాదు సేన చేతన వధి
యింపఁ జేయు వాఁడ నింక నేను 83.

కం. పలికిన నడరఁగఁ దనదు స్తు
తులు రాక్షసుఁ డాలకించి దుర్వాక్యములం
బలికెను సౌమిత్రి గిర లి
టుల నవ్వడరంగ వీరుఁడు నిజాస్యమునన్ 84.

చం. పడసిన పౌరుషమ్మునను బల్కెద వెవ్విధి శక్ర ముఖ్యులుం
గడఁగి సహింపఁ జాల రని కయ్యమునం దది యెల్ల సత్యమే
యెడఁదఁ దలంప నన్య గతి నిప్పుడ దృష్టము నీదు విక్రమం
బడరిన దెల్ల దాశరథి యద్రి నిభం బిట నిల్చెఁ గాంచుమా 85.

ఉ. మేటి మహాత్ము లక్ష్మణు నమేయ బలాఢ్యు గణింప కంతటన్
దాఁటి సుమిత్ర పట్టి నని దాశరథిం గని కుంభకర్ణుఁ డా
రాట మొకింత నందక పరాక్రమ వంతుఁడు పర్విడెన్ వెసం
బాటవ మొప్ప మేదిని యవారిత రీతినిఁ గంప మందఁగా 86.

ఉ. కూరిచి రౌద్ర మస్త్రమును ఘోరము నమ్ముల రాముఁ డంతటన్
వీరుని కుంభకర్ణు నెద భేదిల వేయఁగ బాణ ఘాతికిన్
నోరిని నిప్పు రవ్వ లవి నొవ్వ కరమ్ము బయల్పడెన్ మహా
దారుణ రీతిఁ గ్రుద్ధుఁ డయి దాడి యొనర్పఁగ వచ్చు వానికిన్ 87.

ఆ.వె. రామ బాణ తప్త రాక్షసుం డఱచుచు
ఘోరముగఁ బరువిడెఁ గుంభకర్ణుఁ 88.

డాగ్రహమ్ము నూని హరుల నెల్లం బాఱఁ
జేయు చుండి యని నమేయ బలుఁడు

చం. విరివి నురమ్ములో నెమలి పింఛపు టమ్ములు నాఁట చేతిలోఁ
బరఁగు గదాయుధంబు ధరపైఁ బడె జాఱె మహాయుధమ్ములున్
ధర పయిఁ గూల శేషములు దాను నిరాయుధుఁ డంచు నేరుచుం
గరముల ముష్టి ఘాతములఁ గయ్య మొనర్చెను ఘోర రీతిగన్ 89.

కం. శర విద్ధాంగుఁడు తడియ రు
ధిరమ్మును భృశముగ నసుర ధీరుఁడు కార్చెన్
గిరి సెలయేళ్ల స్రవించెడు
కరణినిఁ గాయమ్ము నుండి కదనము నందున్ 90.

ఆ.వె. తీవ్ర కోపమున రుధిరమున మూర్ఛితుం
డై ప్లవగుల నింక నసుర వరులఁ
నారగించుచు నసు రాధినాథుఁడు పరు
గిడుచు నుండె నాజి వడి వడిగను 91.

చం. గిరి వర శృంగ మొక్కటినిఁ గేల గ్రహించి పరాక్ర మొద్ధతిన్
నరవరుఁ దాఁక రాఘువుని నైర్రుత పుంగవుఁ డంత పైచెఁ దా
నరసి గిరీంద్ర శృంగము మహాత్ముఁడు దాఁకక మున్న రాముఁడే
శరముల నేడిటన్ విఱిచె సత్వర మూని ధనుస్సు నింపుగా 92.

తే.గీ. రాముఁ డంత ధర్మాత్ముఁడు భీమ శృంగ
మును బసిడి యమ్ముల నొనర్చె ముక్కలుగను
బుడమిఁ గూలుచు నాశృంగము పడి రెండు
నూర్ల హరులపై ధర పైకి నూఁకె వారి 93.

తే.గీ. పరి పరి విధములఁ దలంచి వడి వధింప
నసురు ధర్మాత్ముఁడు వలికె నగ్రజుఁ గని
లక్ష్మణుం డిట్లు మద మీయ రక్త గంధ
మెఱుఁగఁడు దనవారిఁ బరుల నియ్యసురుఁడు 94.

తే.గీ. రాజ! తిను చున్న వాఁ డెల్లర సెఱుఁగక యు
చిత మగు నితనిపై కెక్కి శీఘ్రమ హరు
లెల్ల నిలువ యూధప ముఖ్యు లెల్ల రన్ని
దిశల నితనిఁ జుట్టి తనర ధృతి వహించి 95.

ఆ.వె. అట్లొనర్ప భార మధికమ్ము గాఁగ దు
ర్మతి ధరాతలమునఁ బ్రాకుచుండి
ప్లవగు లన్యుల నిఁక వధియింప నేరఁడు
రాక్ష సేంద్రుఁ డాజి రాఘవేంద్ర! 96.

కం. విని రాకుమారు ధీమం
తుని వచనమ్ములు కడింది తోషమున హరుల్
ఘనదేహుఁ గుంభకర్ణునిఁ
గని యధిరోహించి రంతఁ గ్రన్నన ధీరుల్ 97.

కం. ఎక్కిన వానర గణమున్
మిక్కిలి రయమున విదుల్చె మించిన కినుకన్
గ్రక్కున రక్కసుఁ డరయఁగ
నక్కరి పాలకుని దుష్ట హస్తి విధమునన్ 98.

చం. కని పడి నట్టి వానరులఁ గాయము నుండి రఘూద్వహుండు వా
ని నెఱిఁగి రోష యుక్తుఁ డని నెమ్మది రక్కసుఁ గుంభకర్ణునిం
గను లరుణమ్ము దాల్పఁ దన కన్నులఁ గాల్చు విధమ్ము క్రుద్ధతం
గని పరువెత్తె హర్ష మొసఁగం గపి కోటికి వేగ తద్దిశన్ 99.

తే.గీ. సుదృఢమైన నారి గలట్టి సురుచిర ధను
వూని కనక మయమ్మును భుజగ కల్ప
మును నిబద్ధ తూణాంబక మూర్తి యుఱికె
నాశ్వసించుచు రాముఁడు హరుల నెల్ల 100.

తే.గీ. లక్ష్మ ణానుచరుండు సప్లవగ పరమ
దుర్జయుండు బలాఢ్యుండు దురము నందుఁ
గదలి కాంచెఁ గిరీటి రక్త తను రక్త 101.

నయనుఁ గుంభకర్ణు రిపు గణఘ్ను బలుని

సీ. మత్త కుంజర నిభామర్షు విద్రావిత హరికోటిఁ గ్రుద్ధుని హరినికాయ
మార్గణ రతుని సమస్త రాక్షస గణావృతు వింధ్య మందరాభ తనుఁ గాంచ
నాంగద భూషణు నస్ర సుస్రావి తాస్యుని వర్ష కాల పయోధర సదృ
శోత్థితు రాక్షస యోధవర్యుని వానరానీక మర్దను నంతక నిభు

తే.గీ. రక్త సిక్త శ్రవణముల రసన నాకు
వానిఁ గుంభకర్ణుని ఘోర వహ్ని భంగి
నడరు వాని వీక్షించి మహాత్ముఁ డంతఁ
జఱచెఁ గార్ముకమును రామచంద్రుఁ డడరి 102.

కం. వినిన ధనుర్ఘోషను సై
ప నొల్లక యసుర వరుండు పర్విడె నంతన్
మనుజేంద్రు మార్కొనంగ ర
ఘునాథ పుంగవుని మీఱఁ గోప మెడందన్ 103.

కం. కని వాతోద్ధత మేఘ ని
భుని ఫణిరాజ సమ బాహు భూధర సదృశున్
ఘన రాక్షసు నుఱుకు నతని
ననెఁ బల్కులు కుంభకర్ణు నా రాముఁ డిటుల్ 104.

తే.గీ. రమ్ము రాక్షస! మది విచారమ్ము వలదు
నిలిచితి ధనువు ధరియించి నెమ్మి నిచట
రాక్ష సాంతకునిగ నన్నరయుమ యొక ము
హూర్తమున విచేతనుఁడవై వర్తిలుదువు 105.

కం. నవ్వెను రాముఁ డని యెఱిఁగి
యవ్వర రక్షః పతి వికృ తాభిరుతములన్
దవ్వులకుఁ దఱిమి హరులను
నొవ్వక రాఘవునితో ఘనుం డనె గిరలన్ 106.

తే.గీ. హరుల హృదులు పగులు రీతి నా యుఱుములఁ
బోలు మాటల రాఘవ! వాలి గాను 107.

ఖర కబంధ విరా ధాద్యసురులు గాను
గాను మారీచుఁడను గుంభకర్ణుఁడ ననె

కం. కను నా ముద్గరమును న
ల్లని యినుమునఁ బరిఢవిల్ల రణమున నసురుల్
మును దేవతలును నా చే
తను దీని వలన విజితులు దారుణ రీతిన్ 108.

మ. చెవులున్ ముక్కును నాకు లేవని మదిం జింతించుచున్ నన్నుగౌ
రవ దృష్టిం గన నీ వనర్హుఁడవె యల్పంబైన క్షోభిల్ల నా
కివి లేకున్నను జూపు నీ బలము నో యిక్ష్వాకు శార్దూల! నా
దు వవో భాగము లందు దానిఁ గని నిం దూర్ణమ్ము భక్షించెదన్ 109.

చం. అన విని కుంభకర్ణుని మహాసురు వాక్యము లంతఁ బుంఖముల్
దనరెడు తీవ్ర మార్గణ వితానము గుప్పెను రాముఁ డైననున్
వనరఁడు కుంభకర్ణుఁ డట బాధ వహింపఁడు దాఁక వజ్ర పా
త నిభము దేహమున్ సుర వితాన రిపుం డతి విస్మయమ్ముగన్ 110.

తే.గీ. సాల తరు లే శరమ్ములఁ గూలె నపుడు
వాలి యే మార్గణమ్మున నేలఁ గూలె
నవియె వజ్ర నిభాంగుని నసురుఁ గుంభ
కర్ణు బాధింప నేర వకట రవంత 111.

ఆ.వె. వారి ధార పగిది వపువునఁ ద్రాగుచు
బాణ ధార నెల్ల వాస వారి
గొట్టి రామ బాణ ఘోర వేగమ్మును
ముద్గరంపు వేగమునఁ జెలంగి 112.

తే.గీ. ఉగ్ర వేగ ముద్గరము సమగ్ర రక్త
సిక్త విద్రావి తామర శ్రేణిఁ ద్రిప్పి
యుగ్ర వేగమును దఱిమె నగ్ర వాన
రప్రవర సేన నెల్లను రణము నందు 113.

కం. విసరఁగ వాయువ్యాస్త్రము
నసురుని పయి రాఘవుండు హస్త వరం బం
త స ముద్గరమ్ము తెగినం
బస చెడి యార్చె నసురుండు ధ్వను లంట దివిన్ 114.

తే.గీ. రామ బాణ నికృత్తము రాక్ష సేంద్రు
బాహు వద్రి శృంగాభము ప్లవగ సైన్య
ము పయిఁ గూలఁగ వేగ సముద్గరమ్ము
వానరు లనేకులు విగత ప్రాణు లయిరి 115.

తే.గీ. భగ్న హత శేష వానర వ్రాత మంతఁ
భ్రాంత మాశ్రయించి వఱల వగపు పీడి
తాంగు లపుడు వీక్షింపఁ దొడంగిరి నర
వీర రాక్ష సేంద్రు లొనర్చు ఘోర రణము 116.

కం. తెగిన కరమ్మున నిశితా
సిఁ గూలిన గిరీంద్రము వలెఁ జెలఁగి కరమునన్
నగము బెకలించి ఘనముఁ బ
రుగిడె నసుర నాథుఁడు నృవరు దెసకుఁ గినుకన్ 117.

కం. ఆ కరము స తాళ తరువుఁ
గాకోదర సన్నిభమ్ము ఖండించె వెసన్
వీఁక వ రైంద్రాస్త్రమ్మును
గాకుత్స్థుఁడు వేసి చిత్ర కాంచన మయమున్ 118.

ఆ.వె. పడెను బుడమి పైనఁ బర్వత సదృశుండు
తెగిన భుజముల వడిఁ దిరుగుచు నిటు
నటుఁ దరుల గిరులను బటుతర శిలల వా
నరులఁ గొట్టె ఘనుఁ డసుర గణమును 119.

ఆ.వె. చూచి రాఘవుం డసురుని విగత బాహు
నరుగు దెంచు వాని నర్ధ చంద్ర
మార్గణద్వయమున మాన వోత్తముఁడు ఖం 120.

డించెఁ బాదములను మించి కినుక

కం. పడిన వసురు పాదమ్ములు
పుడమి దిశోపదిశలు గిరి భూరి బిలమ్ముల్
గడలియు లంకయుఁ బ్లవగుల
బెడిదపు టసురుల బలములు బిట్టు ధ్వనింపన్ 121.

తే.గీ. తెగిన నిజ పాద భుజములఁ దెఱచి నోరు
జ్వలిత బడబా ముఖాభము సత్వరమ్ము
పర్విడెను రాఘవేంద్రుని వైపు నింగిఁ
జంద్రుని పయికి రాహువు సరణి నసుర 122.

తే.గీ. నింపె రాముఁ డయ్యసురేంద్రుని ముఖము నిశి
తాగ్ర శరముల హేమ పుంఖావృతముల
నిండ బాణముల ముఖము నేర కాడ
నెట్టి గిర లఱచి నొలసె బెట్టిదముగ 123.

చం. కొని రఘు రాముఁ డర్క రుచి కోటి సమప్రభ నబ్జయోని దం
డ నిభముఁ గాలపాశ సు విడంబన మైంద్ర మహాస్త్ర యోగముం
గనక మయేద్ధ పుంఖమును గాండము మారుత తుల్య వేగముం
గన దశనిప్రభా రయముఁ గ్రన్నన వైచె నిశాచరేంద్రుపై 124.

చం. విడువడి రామ బాహువుల పెల్లఁగఁ జేయుచు దిక్కు లన్నిటిన్
వెడలెను శక్ర వజ్ర సమ భీకర బాణము ధూమహీనమై
యడరెడు వహ్ని తుల్య మయి యద్రి ని భాసురు శీర్ష మంతటం
గడు వడిఁ ద్రుంచె వృత్రు సుర కాంతుఁడు శక్రుఁడు ద్రుంచి నట్టులన్ 125.

తే.గీ. గుండ్ర దంష్ట్రలు సంచలత్కుండలములు
వెలయు కుంభకర్ణు శిరము వెలిఁగె నిశిని
నుద్భవిల్లి పునర్వసు వుండఁ జంద్రుఁ
బోలి బాణ ఘాతమ్మున భువినిఁ గూల 126.

ఉ. కూలెను గుంభకర్ణుని సుఘోర శిరం బచలేంద్ర తుల్యమే 127.

సేలను మార్గ వేశ్మములు నిర్మిత గోపుర సాల రాజముల్
వ్రాలఁగ దొర్లి జేరి యసురప్రవరుండు హిమాద్రి తుల్యుఁడే
తూలఁగ మీన నక్రములు తోయధి వేగమ దాఁకె భూమినిన్

తే.గీ. అమర భూదేవ శత్రువు సమర మందుఁ
గూలఁ బాఱెను వానర కోటి భూమి
భూధరమ్ములు కదలాడె మురిసి దేవ
త లధికముగఁ జేసిరి నినదమ్ము లడరి 128.

తే.గీ. చేరి నభము హర్షించిరి యా రఘూత్త
ముని పరాక్రమమును గాంచి మునులు దేవ
ఋషులు సుర గుహ్యక సుపర్ణు లెల్ల భూత
ములు సయక్ష గంధర్వ ఫణు లమితముగ 129.

కం. భూరి మనస్విని మరణం
బారసి  రాఘవునిఁ గని దశాస్యుని బంధుల్
మూరిన వ్యథతో నఱచిరి
పారీంద్రము నారసిన ద్విపమ్ముల భంగిన్ 130.

కం. దివిలో రాహు ముఖచ్యుత
రవి తమము నడంచి నిల్చి రాజిల్లు నటుల్
భువిఁ జంపి కుంభకర్ణుని
నృవరుఁడు హరిసేన మధ్య నెగడె ముదమునన్ 131.

తే.గీ. సంతసించిరి వానరు లంతమంద
భీమ బలుఁ డసుర వరుండు విరిసి నట్టి
పద్మములఁ బోలు వదనులు భక్తిఁ బూజ
లిడిరి యా దురాసదునకు నిన కులునకు 132.

కం. సమ రాజేయుని రాక్షసు
నమర దమను గుంభకర్ణు నని సమయింపం
గ మనుజ శార్దూలుం డం
దె ముదము నెద వృత్రజిత్తు దేవ పతి వలెన్ 133.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నఱువది యేడవ  సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 68.

రాముఁడు యుద్ధములోఁ గుంభకర్ణుని వధించె నని రాక్షసులు నివేదింప రావణుఁడు మూర్ఛిల్లి కొంత తడవునకుఁ దేఱి యనేక విధముల విలపించుచు విభీషణుని మాటలను సమ్మతింప నందులకు విచారించుట.

కం. కని కుంభకర్ణు మరణ
మ్మును నృవరుని రాముని కరముల ఘోరమ్ముం
జని రాక్షసులు వచించిరి
వనరుచు నసురపతికి దశ వక్త్రున కిటులన్ 1.

ఉ. రాజ వరేణ్య! ఘోర సమరమ్మునఁ గాల నిభుండునై మహా
తేజుఁడు కుంభకర్ణుఁడు రతిం దిని కోఁతులఁ బర్విడంగఁ దా
నోజను జేసి సేన నసు రోత్తముఁ డందెను గాలకర్మమున్
రాజిలి రామ తేజమున భ్రాత యడంగెను రాక్షసేశ్వరా! 2.

తే.గీ. విక్రమింప రాఘవ బాణ పీడితుండు
కడలిఁ దూఱె మై సగము తెగఁ జెవులింక
ముక్కు శిరము లంకాద్వారము నిలుపంగ
దావ దగ్ధ తరు వన  ముద్ద యయి నిలిచె 3.

కం. విని భ్రాత కుంభకర్ణుం
డని మరణించె నని రాక్షసాధిపుఁ డంతన్
వనరుచు భృశమ్ము మూర్ఛ 4.

ల్లెను గూలెను రావణుండు క్లేశం బడరన్

ఆ.వె. ధీర వరులు త్రిశిర దేవాంతక నరాంత
కాతికాయు లా మహాసురులు పి
తృవ్యు మరణము విని సువ్యగ్రులై శోక
మున వగవఁ దొడఁగిరి ముమ్మరముగ 5.

ఆ.వె. భ్రాతయె మరణింప రాముని చేత న
క్లిష్ట కర్మ వలన నష్ట చేత
ను లయి ఘోర రాక్షసులు మహోదర మహా
పార్శ్వులు మునిఁగిరి వివశత నార్తి 6.

చం. తెలివి వహించి కష్టమున ధీరుఁడు రాక్షస పుంగవుండు భా
తృ లయ ఘనార్త రావణుఁడు దీనుఁడునై విలపించె నో మహా
బల! రిపు దర్పనాశకుఁడ! భ్రాతను నిర్దయఁ గుంభకర్ణ! నీ
విలఁ దృజియించి యా యముని యింటికి నేఁగితె దైవ వశ్యతన్ 7.

ఉ. ఎక్కడి కేఁగి తీ వకట యెంతయొ వేఁచి నిజారి సైన్యమున్
ముక్కలు గా నొనర్పకయె మున్నిట బంధుల నాదు దుఃఖముం
జక్కఁగ నాదు దక్షిణ భుజమ్ముగ వేని దలంచి భీతి నే
స్రుక్క సురాసు రావలికి నోలగ నయ్యది లేను నే నిఁకన్ 8.

తే.గీ. దేవ దానవ దర్పఘ్ను! నీవు సముఁడ
వెంచఁ గాలాగ్ని రుద్రుల కంచితముగ
నెట్టు లోడితి వా రాఘవేంద్రున కక
ట సమరమ్మున ఘన వీరుఁడ వయి వింత 9.

ఆ.వె. వజ్ర ఘాత మయిన వ్యసన మీయ దెపుడు
నీకు నట్టి వీర నీవు రామ
బాణ ఘాతమున నవని శయనించితి
వేల ఘోరముగ నహీన వీర్య! 10.

కం. గగనమ్మున నిలిచి మునుల 11.

ను గూడి ముద మూని యెదలను భృశమ్ముగ దే
వ గణమ్ములు నినదించు న
నిఁ గూల వీక్షించి నిన్ను నిర్దయ ననుజా!

కం. ధ్రువ మరయ లబ్ధ లక్ష్యులు
ప్లవగులు దుర్గముల నింక ద్వారములను లం
క పెఱవక యడరి పెస సె
క్కు వార లగుదురు కరమ్ము కులుకుచు సెదలన్ 12.

కం. పని యేమి నాకు రాజ్య
మ్మున నిఁక వైదేహితో నిపుడు పని యే ముం
డును నాకుఁ గుంభకర్ణుఁడె
నను వీడ నశించె బ్రతుకునఁ దగుల మెల్లన్ 13.

కం. అనుజునిఁ జంపిన వానిని
నని నే వధియింప కున్న నా రాఘువునిం
గన వ్యర్థము జీవిత మె
ల్లను మరణము శ్రేయ మగును భ్రాతా! నాకున్ 14.

ఆ.వె. నేఁడ యేఁగు వాఁడ నేఁ దమ్ముఁ డున్న చో
టునకు విడిచి యింక ననుజ వరుల
నొక్క క్షణ మయినను నిక్కము మన నిచ్చ
గింప నిట్టు లెద నశింప శాంతి 15.

తే.గీ. నన్ను మున్నపకార మొనర్చి నట్టి
వానిఁ గని నవ్వరె సురలు భ్రాత! కుంభ
కర్ణ! మరణింప నీ విట్లు కయ్య మందు
నెట్లు నే నింద్రుని జయింతు నింక నకట 16.

తే.గీ. తనర నజ్ఞాన మెద లోన విన నపుడు వి
భీషణు మహాత్ము నుచితంపు భాషణములు
సేరె యవియె నన్నిపుడు విచార మడర
నకట చెప్పిన విధముగ ననుజ! యెల్ల 17.

ఆ.వె. కూలిన తఱి నుండి కుంభకర్ణ ప్రహ
స్తులు విభీషణుండు పలికి నట్టి
వాక్కు లొసఁగు చున్న వక్కట సిగ్గును
దారుణముగ నాకుఁ దలఁచి నంత 18.

కం. ఘన ధర్మాత్ము విభీషణు
ని నిందితునిఁ జేసి నట్టి నేఁ దత్ఫలమున్
మనమును బాధించెడు దా
నినిఁ బొందితి నివ్విధముగ నెట్టనఁ గట్టా 19.

కం. అనుజుని యింద్రు జయించిన
ఘను మరణము నాలకించి కడు వ్యథితుండై
మనము కలంగఁ బలు విధము
లను విలపించి వెసఁ గూలె రావణుఁ డంతన్ 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నఱువది యెనిమిదవ సర్గము.

# యుద్ధ కాండము
## సర్గము 69.

విలపించుచున్న రావణునితోఁ ద్రిశిరుఁడు ప్రాకృతిని వలె నిట్లు వగవఁ దగ దని యుద్ధమునకుఁ దా నేఁగెద నని పలుక నరాంతక దేవాంత కాతికాయులు నట్లు వచింప వారిని మహోదర మహా పార్శ్వులు తోడుండఁ బంపిన ఘోర యుద్ధములో నరాంతకుఁ డంగదుని చేత వధింపఁ బడుట.

కం. విలపింప రావణుండు కు
టిలాత్ముఁ డడర నెద నడజడి త్రిశిరుఁ డంతం
బలికె విని యిట్లు వచన 1.

మ్ములు పరితప్తాత్ము నరసి పుత్రుండు తగన్

తే.గీ. మధ్యముం డన్నదమ్ముల మా పితృవ్యుఁ
డతి బలుఁడు మహా వీరుండు హతుఁడు గాఁగఁ
జెలఁగి రణ మందు రాజన్య! చింతిలుదురె
నిన్ను బోలెడు సజ్జను లెన్నఁ డేని 2.

ఉ. చాలుదు వీవు ముజ్జగము సైపఁగ రాక్షస నాథ! యిట్లు నీ
వేల తపింతు వాత్మఁ దలపించుచుఁ బ్రాకృతుఁ దమ్మి చూలియే
లాలన నీ కొసంగెను ఖరవ్రజ మేఘ నిభస్వనధ్వజిన్
మేలుగఁ ద్రాణ శక్తులను మేటి ధనుస్సును సాయకమ్ములన్ 3.

చం. పలుమఱు లస్త్ర హీనముగ ధ్వంసము సేసితి దేవ దాన వా
వలిని సహాయు ధావలినిఁ బార్థివ! యర్థుఁడవే వధింపఁగా
బలమున రాఘు వోద్వహునిఁ బన్నుగ నిల్వుమ యేఁగి యాజికిం
జలమున నీదు శత్రువుల జంపెదఁ బోలుచు వైనతేయునిన్ 4.

తే.గీ. శంబరునిఁ జంపినట్టి యా శక్రు పగిది
నరకుఁ జంపిన వెన్నుని కరణి నేను
నేఁడు చంపఁగ రణమందు నిహతుఁ డయి నృ
వరుఁడు రాముఁడు శయనించు ధరణి పైన 5.

కం. బాలుని త్రిశిరుని మాటలు
మే లిడు నవి యాలకించి మించి తలంచెం
దా లయమై పుట్టి నటులఁ
గాల వశుఁడు రావణుండు కౌణపుఁ డెదలో 6.

ఆ.వె. త్రిశిరుని గిరలు విని దేవాంతక నరాంత
కాతి కాయుఁలు సమ రాంగణమున
కేఁగ నుత్సహించి రెల్లరు ముదమున
నన్నదమ్ము లంత నసుర వరులు 7.

ఉ. నే నన నేను నంచును ధ్వనించుచు నత్తఱి నైరృతర్షభుల్ 8.

సూనులు రాక్షసేంద్రునకు శూరులు శక్ర సమానులున్ నభో
యానులు మాయ లందు ఘనులౌ సుర దర్ప నిహంత లెల్లఁ గ
య్యాన నజేయు లెల్లరు మహా బల దర్పితులున్ యశస్వులున్

తే.గీ. దేవ గంధర్వ కిన్నర దివ్య సర్ప
గణము లెదిరింప నోడని ఘనులు నస్త్ర
విదులు యుద్ధ విశారద వీర వరులు
లబ్ధ వరులు స్వీయప్రవర విదు లెల్ల 9.

తే.గీ. అట్టి రిపు బల మర్దను లర్క తుల్య
తేజు లుండఁ జుట్టి సుతులు రాజు రావ
ణుండు వెలిఁగె వాసవు వేని యండ నుండి
రమరు లసురఘ్నులు వృతులై యతనిఁ బోలి 10.

చం. సుతులను గౌఁగిలించికొని సుందర భూష లొసంగి దీవనల్
వితత మొసంగి పంపెఁ దమి వీరుల భండన భూమి కింపుగా
సతతము పుత్ర రక్షణము సంగర భూమి నొసంగ భ్రాతలన్
వితత బలాఢ్యులం బనిపె వీర వరేణ్యుల యుద్ధ మత్తులన్ 11.

కం. అత్తఱి యుద్ధోన్మత్తుఁడు
మత్తుఁడు ఘన కాయులు రిపు మర్దనునకు రా
జోత్తమున కనుజులు నతు లు
దాత్తముగ నొసఁగి చనిరి ప్రదక్షిణములతో 12.

తే.గీ. అలఁది సర్వౌషధమ్ముల నంగముల స
గంధ మీ యార్వు రసుర పుంగవులు యుద్ధ
కాంక్షిణులు మహా వీర్యులు కదలి సమర
రంగమున కేఁగఁ దొడఁగిరి రాజు నాజ్ఞ 13.

ఆ.వె. త్రిశిరసుఁ డతి కాయ దేవాంతక నరాంత
కులు మహోదరుండు నలరి వెంట
నసుర వరుఁడు నమ్మహాపార్శ్వుఁడును రాఁగఁ
గాలచోదితు లయి కదలి రెల్ల 14.

మ. అనివా ర్యేభము నీల మేఘ సదృశం బైరావ తామ్నా యమున్
మును దా నెక్కి మహోదరుండు సన సంపూర్ణాయుధుండై వెలిం
గెను దోలంగ సుదర్శ నాఖ్య గజముం గేలీ విధం బస్త శృం
గిని఼ గన్పట్టు దినేశు సన్ని భము వీక్షింపంగ భూషావలిన్ 15.

చం. త్రిశిరసు఼ డశ్వ రాజములు తేరున఼ గట్టగ సాయుధమ్ము నన్
భృశముగ భూషితుండు నయి వీరు఼డు రావణ సూను఼ డెక్కి వె
ల్గె శర ధనుర్ధరుండు గిరి రే఼గిన మేఘ సవిద్యుదుల్క సేం
ద్ర శర వరాస నాభముగ రాక్షస వర్యు఼డు గాంచ నత్తఱిన్ 16.

కం. మూడు తలలపై నమరిన
మూడు కిరీటమ్ము ల రథమున భాసిల్లెన్
మూడు తలల త్రిశిరసు఼ డా
మూడు పసిడి కొనల శీత భూధరము వలెన్ 17.

తే.గీ. అంత తేజస్వి యతికాయు఼ డసుర నాథ
పుత్రకుం డధి రోహించె భూరి రథము
మేటి విలుకాండ్ర నక్షము మేలి చక్ర
ములు సుకూబరముల తోడ మూరు దాని 18.

తే.గీ. చాప తూణీరములు ప్రాస స పరి ఘాసి
సంచయమ్ము లు నిండంగ స్యందనమున఼
గాంచన కిరీట భూషలు మించి వెలు఼గ
నత఼డు వెల్గెడు మేరువు గతి వెలింగె 19.

కం. అరదము నందు వెలింగె న
సుర పతి సూనుండు నయ్యసుర గణవృతు఼డై
సుర సంచ యావృతు఼ డశని
కరు఼ డింద్రు఼డు వెల్గు రీతి఼ గమనీయముగన్ 20.

ఉ. ఎక్కె నరాంతకుండు తుర గేంద్రము వేలుపు తేజి తుల్యమున్
మిక్కిలి వేగవంతమును మేటి హయమ్ము మనోజవమ్ము నుం 21.

జక్క ధరించి ప్రాసమును సన్నిభ ముల్కల కెంచ సర్పభు
క్కెక్కిన శక్తి నూనిన యహీనుని  స్కందుని భంగి వెల్గుచున్

ఉ. అంత గ్రహింపఁగాఁ బరిఘ నంచిత వజ్ర విభూషణమ్ము దే
వాంతకుఁ డద్రి దోర్యుగము నందు వహించిన యట్టి యా రమా
కాంతుని  విష్ణు శార్యమునఁ గన్పడు చుండె మహాసురుండు కా
లాంతక సన్నిభుండు సమ రాంగణ మందు నజేయుఁ డుగ్రుఁడున్ 22.

కం. గదఁ గైకొని బలవంతుం
డుదరి మహాపార్శ్వుఁ డమ్మహోన్నత తనుఁ డ
ప్డు దురమునఁ గుబేరుఁడు ఘన
గదా కరుడు వెలుఁగు రీతిగ వెలింగె నటన్ 23.

చం. రతిఁ జని రా మహాత్ములు పురం బమరావతి నుండి యేఁగు దే
వతలను బోలి రాక్షసులు వారణ ఘోటక మేఘ నిస్వన
ప్రతి వర చక్రపాదముల వచ్చిరి వారల వెన్క నింపుగా
వితత వరాయుధమ్ములను వీర వరేణ్యులు సంభ్రమించుచున్ 24.

కం. వెలిఁగిరి రవిప్రభలతో
విలసిల్లి కుమార వరులు వినువీథి గ్రహ
మ్ములఁ బోలుచును గిరీట
మ్ముల శ్రీమంతు లరుగ రణమునకు మహాత్ముల్ 25.

ఆ.వె. అసురు లూని నట్టి యమల వస్త్రావళి
శార దాభ్ర నిభము మూరు చుండ
నంబరమ్ము నందు హంసావళి పగిది
వెలుఁగు చుండెఁ గాంచ వింతగాను 26.

చం. మరణము నైన శత్రు చయ మారణ మైనను నిశ్చయంబుగా
సుర రిపు లాత్మలం దలఁచి చొచ్చిరి వీరులు సంగ రార్థు లా
ర్చిరి యొనరించి గర్జలను శీఘ్రము వేసిరి సాయకమ్ములన్
దురమున యుద్ధ దుర్మదులు దుర్జయు లెల్ల మహాత్ము లుగ్రులై 27.

తే.గీ. సింహ గర్జల జప్పట్లచేఁ జలించె
భూతలం బెల్ల రాక్షస వ్రాత మాజిఁ
జెలఁగి యొనరింప నంబర తలము పగులు
రీతి నప్పుడు గన్పట్టె నాతతముగ 28.

చం. చని కని రంత రాక్షసులు సంతస మంది మహా బలాఢ్యులే
ఘన కపి సైన్య మెల్లను నగమ్ముల ఱాళ్ల వహింపఁ బాణులం
గనిరి హరీంద్రు లాసురులఁ గాల ఘనాభ శరీరులం దురం
గ నిచయ మత్త నాగ రథ కాయము మ్రోగఁగఁ గింకిణీ ధ్వనుల్ 29.

ఆ.వె. ఉద్య తాయు ధాసు రోత్తములఁ బ్రదీప్త
వహ్ని రవి సదృశులఁ బరివృ తాసు
రప్రవర విరాజులను సమరోత్సాహు
ల నరసి హరి సేన కినిసి యంత 30.

ఉ. వారిని లబ్ధ లక్ష్యులు ప్లవంగులు గాంచి సముద్య తాద్రులై
ఘోర తరస్వరమ్ములను గూసిరి బల్లిదు లుగ్ర రీతినిన్
మూరి ప్రతిధ్వనించిరి యమోఘముగాను సహింప నోప కా
వీరులు సేయ రాక్షసులు భీకర నాదము లాగ్రహమ్మునన్ 31.

తే.గీ. వానరేంద్రుల రేఁగిన పరమ హర్ష
యుక్త నినదమ్ములను సైప నోపక యసు
రేంద్రులు మహా బలు లఱచి రెల్లరును మ
హోగ్రముగ యుద్ధ మొనరింప నుద్యమించి 32.

ఆ.వె. రక్కసుల బలమునఁ బ్లవగ యూథపులు సొ
చ్చి పెస నెత్తి శైల శిఖరములు
వెలిఁగి రపుడు శృంగముల తోడ నద్రి రా
జముల భంగిఁ జెలఁగి సంగరమున 33.

ఉ. కొందఱు సేరి యంబరము కొందఱు వానరు లుర్వి నిల్చి కే
లం దరు శైల జాలమును రమ్య తరమ్ముగ నూని పోరఁగా
నందఱు వాన రాసుర మహా సమరం బటఁ గాంచ ఘోరపుం 34.

జందము దోఁచె భీకరము సంకులమై ధర రక్తసిక్తమై

ఆ.వె. శైల తరు శిలా నిచయ వర్షము కురియిం
చిరి ప్లవంగ వరులు చిత్రముగను
బాణ జాలములను వారింపఁ బడియును
భీమ విక్రము లని వీర వరులు 35.

ఆ.వె. చేసిరి రణ మందు సింహ నాదమ్ములు
వానరు లసురులును వానరులు శి
లల నసుర వరులను జెలఁగి భస్మము సేసి
రాగ్రహమ్ము మీఱ నుగ్రు లగుచు 36.

చం. అడిచిన ఘోర రీతిఁ గవచాభరణావృత యాతుధానులం
గడఁగి ప్లవంగ వీరు లలుకన్ రథ చారుల హస్తి వాజులం
దడరెడు ఘోర రాక్షసుల నాసురు లద్రి శిఖావృతాంగులై
పడ వర ముష్టిఘాతములు పైకి వెసం గను గుడ్లురా భువిన్ 37.

ఆ.వె. కూలి రెల్ల రంతఁ తూలి యఱచిరి ఘో
రముగఁ దాడితు లయి ప్లవగ వీర
వరుల చేత నసుర వరులు దీనమ్ముగ
సంగరమున బాధి తాంగు లగుచు 38.

తే.గీ. అంత రాక్షస వీరు లా హరి వరేణ్యు
ల నిజ శూలాసి ముద్గర ప్రాస శక్తి
ముఖ మహాయుధమ్ముల తోడ మూరి యాజిఁ
గొట్టి పడవైచిరి పుడమి ఘోరముగను 39.

కం. పడవైచి రొకరి నొక్కరు
నెడఁదల నెంచి విజయమ్ము నెల్లరు తనువుల్
తడియంగ రక్త ధారలఁ
గడు వానర రాక్షసులు జగడమున నలుకన్ 40.

ఆ.వె. గిరుల ఖడ్గముల విసర నపుడు హరి రా 41.

క్షసులు చలము నూని వసుధ యొక్క
క్షణమున రుధిరమ్ము స్రవియింప శోణి తా
వృత మయి కనుపట్టె విరివిగాను

తే.గీ. నేల యెల్ల నిండె నపుడు వ్రాలఁ బ్లవగ
మర్దితులు రాక్షసులు రణ మదులు పడిన
వారు పడుచున్న వారలు భగ్న శూలు
లంగములఁ జేసి రద్భుత మైన రణము 42.

ఉ. వానర కోటి వానరుల వారక కొట్టఁగ నైరృతర్షభుల్
మానక రాక్ష సావలిని మర్దన మాసుర కోటి చేతనే
వానరు లాజిఁ జేయఁగను వారక చేసిరి లాగి శస్త్రముల్
వానరులున్ శిలల్ గొనుచు భండన మాసురు లెల్ల నత్తఱిన్ 43.

ఆ.వె. శైల శూల ఘోర శస్త్రమ్ములఁ బరస్ప
రమ్ము కొట్టుకొనిరి ప్లవగ రాక్ష
సప్రవరులు వీఁక క్షిప్రమ్ము సేసిరి
సింహనాదములు విశేషముగను 44.

ఆ.వె. ఛిన్న కవచ చర్మ సన్నుత రాక్షసు
లాజిఁ గూలి రంత హరుల చేతఁ
బాఱెను రుధిరమ్ము పాదప రస సార
సన్నిభమ్ము నచట మిన్నగాను 45.

తే.గీ. కొండ అని వానరేంద్రులు కొట్టి రరద
ము నరదమ్ముచే వారణముఁ బెఱ వార
ణమ్ము చేత గుఱ్ఱమును గుఱ్ఱమ్ము చేత
బెట్టిదమ్ముగఁ జెలరేఁగి వీర వరులు 46.

తే.గీ. బల్లెముల నర్ధ చంద్రేద్ధ బాణములను
దల్లడిల్లక వానరేంద్ర చ్యుత తరు
శైల శృంగమ్ముల ఘన రాక్షస వరేణ్యు
లాజి ముక్కలు సేసిరి యడరి కరము 47.

తే.గీ. చెదర గిరులు వృక్షమ్ములు ఛిన్నము లయి
నిహత వాన రాసురులు ననేకు లుండ
వ్రాలి యెల్లెడల నపుడు నేల యయ్యె
దుర్గమం బెల్ల వారికిఁ దోరముగను 48.

చం. భయమును వీడి చల్పఁగను భండన మట్టు లదీన సత్వు లా
జయ యుత హర్ష దర్పితులు సంచిత ఘోర త రాయు ధాసు రా
లి యెదలఁ గంప మందఁగ స లీల జరింపఁగ నా ప్లవంగ సం
చయము ముదమ్ముతో నసుర సంతతి కూలుచు నుండ ధాత్రినిన్ 49.

తే.గీ. దేవతలు మహర్షులు నా ముదావహ సమ
రమ్ముఁ గని నినదించిరి సెమ్మి సెల్ల
నంత మారుత నిభవేగ మశ్వమును న
రాంతకుం డెక్కి తూఱెను హరుల సేన 50.

చం. వెసఁ జని తీక్ష్ణ శక్తిఁ గొని వీరుఁడు మీనము వార్ధిఁ జొచ్చు రీ
తి సమద మా నరాంతకుఁడు ద్రెంచెఁ బ్లవంగుల నేడు వందలం
బస క్షణ మందు ఘోరముగ వానర సైన్యముఁ గొట్టె వాసవా
రి సుడివడంగ నాజిని హరివ్రజ మెల్లను మిక్కుటమ్ముగన్ 51.

తే.గీ. అశ్వ పృష్ఠమం దలరు నరాంతకుఁ గని
రపుడు విద్యాధరులును మహర్షులు చరి
యించు చుండ నతఁడు వానరేంద్రుల ఘన
సేన లోన విజృంభించి చిత్ర గతుల 52.

కం. అరయఁ బడు వారి మార్గము
గిరి నిభ దేహప్లవగ వికీర్ణము కాఁగం
బరగెను గాంచఁగ మాంస రు
ధిర కర్దమ సంకులపుఁ బృథివియై త్రుటిలో 53.

ఆ.వె. విక్రమింపఁగ హరి వీరవర్యులు మూరి
యెంతు రాత్మ లందు నంత లోనఁ 54.

దా నతిక్రమించి తద్ద నరాంతకుం
డడరి వారి నెల్ల నణఁచు చుండె

ఉ. వానర సేనఁ గాల్చె నట వహ్ని వనమ్ములఁ గాల్చు రీతినిన్
వానరు లెత్త శైలములఁ బాదప పంక్తినిఁ బ్రాసఁ గూల్చె వ
జ్రాన నశించి నట్టి ఘన శైల వరమ్ముల భంగి తిర్గుచుం
దా న ఖి లాశలం దనిలు దారిని వర్షపుఁ గాలమం దనిన్ 55.

తే.గీ. పలుకఁ గదలంగ భీతిని నిలువఁ జాల
కుండిరి కపు లేరు నరాంతకుండు లేచి
న నిలిచిన పెడలిన నెల్లర నతి దారు
ణముగ బాధించు చుండె రణమ్ము నందు 56.

కం. ఒక్కనిచే రవి నిభుచే
నక్కపి సైన్యంబు ప్రాస నణఁగి పుడమిపై
నుక్కు చెడి కూలు చుండెను
పెక్కస మయి పల్వురకును పెలయ నొకండే 57.

తే.గీ. వజ్ర ఘాత సన్నిభ మైన ప్రాస పాత
మోర్వ లేకయె వానర పర్వ మెల్ల
భీతి నార్చెను దిక్కులు పిక్కటిల్ల
దుస్సహంపు స్వనమ్ములు దూలుచు నని 58.

కం. పెలిగెఁ బడెడు వానర వీ
రుల రూపము లశని భిన్న రుచి రాద్రి శిఖా
వలిఁ బోలి రణాంగణమున
వలీముఖులు పోరు చుండఁ బంతము తోడన్ 59.

ఆ.పె. కుంభకర్ణు చేత ఘోరముగ మును గూ
లిన ప్లవగ వరులును లేచి క్షేమ
మరసి చేరి వాన రాధిపు సుగ్రీవు
చెంత నిలిచి రెల్ల రంత నాజి 60.

ఉ. ఆ వల నా నరాంతక భయార్తిత వానర సేనఁ గాంచె సు
గ్రీవుఁడు వాఱ దిక్కులకు రేఁగ భయమ్ము కరమ్ము చూచి తా
నీ వలఁ గాంచెఁ బ్రాస కరు నింపుగ గుఱ్ఱముపై నరాంతకుం
జేవను వచ్చు చుండగను జెచ్చెఱ రాక్షస వీరుఁ గ్రుద్ధునిన్ 61.

ఆ.వె. అంతట హరివీరు నంగదు శక్ర స
న్నిభ పరాక్రమునిఁ గని ఘన దేజుఁ
డిట్లనెఁ బ్లవగ పతి యీ యశ్వ వీరుఁడు
క్షోభ నొసఁగు చుండెఁ గోపిఁ గనుమ 62.

తే.గీ. వీర వర్య యేఁగి యితని వేగ ప్రాణ
హీనుఁ జేయుమ నా విని వాన రేంద్రు
పల్కు లంగదుఁడు ఘనాభ వానర వర
సేన నుండి యెగిరెఁ జిత్రభాను భంగి 63.

చం. గిరి నిభుఁ డంగదుండు వెలిఁగెం గన కాంగదుఁ డద్రి సన్నిభం
బురుతర చిత్ర ధాతు చయ యుక్తము వానర కోటి నుత్తముం
డరయ నిరాయుధుండు స్వ నఖావలి దంష్ట్రవ రాయుధుండు దా
నరసి నరాంతకుం గదిసి యంత వచించెను వాలిజుం డిటుల్ 64.

చం. పనివడి యేమి చేయుదువు పామర వానర కోటి రాక్షసా!
ఘనుఁడవు నిల్చి యిచ్చటను గ్రన్నన వజ్ర నిభంపుఁ బ్రాసముం
నను గని నాదు వక్షమున నాఁటఁగఁ జేయుమ చూతు నీ బల
మ్మన విని రేఁగ రోషము నరాంతకుఁ డోష్ఠము పండ్లు కొర్కుచున్ 65.

ఉ. ఆతఁడు నిశ్వసించి పర మాహి విధమ్ముగఁ జేరి యంగదుం
జేత గ్రహించి ప్రాసమును జెన్నుగ వెల్గెడు దాని పైవఁగా
నాతత వక్ష మందుఁ బడ నయ్యది తాఁకఁగ వజ్ర కల్పముం
బాతిత మయ్యె భూమి పయి భగ్నము గా నట హర్యరమ్ము నన్ 66.

తే.గీ. కని గరుడి చేతఁ గొట్టఁ బడిన ఫణీంద్రుఁ
బోలు బల మున్న ప్రాసయె పుడమిఁ బడఁగ
విఱిఁగి యఱచేయి వడి యెత్తి వీరుఁ డంగ 67.

దుండు కొట్టెఁ బగుల వాని తురగ శిరము

ఆ.వె. విఱుఁగ దౌడ యింక వెలికి రాఁ గనుగుడ్లు
తలయుఁ బగులఁగఁ దల తాడనమున
నాలుక వెడలంగ నగ నిభ తురగమ్ము
సోలి సత్వరమ్ము నేలఁ గూలె 68.

కం. కినిసి కని హత నిజాశ్వ
మ్ము నరాంతకుఁ డెత్తి ఘోర ముష్టిని వెసఁ గొ
ట్టెను ఘోరమ్ముగ వాలి సు
తుని మూర్ధమ్మున ఘనుండు దోర్బల మందున్ 69.

తే.గీ. సడల పిడికిలి దెబ్బకు వడిఁ దన తల
కాఱ నుష్ణంపు రుధిరమ్ము కపివరుఁడు చ
లించి పల్మఱు మోహము కొంచె మంది
తెలివి నంది విస్మితుఁడునై చెలఁగి యంత 70.

కం. గిరి శృంగ తుల్య ముష్టిని
గురు మృత్యు సమాన వేగిఁ గొట్టె నురమునన్
హరి వరుఁ డంగదుఁ డంతన్
నరాంతకుని ఘోర రీతి నర భోజనునిన్ 71.

ఉ. కూలెను ముష్టి ఘాతమున ఘోర నరాంతకుఁ డంత భూమిపై
జ్వాలల నోటఁ గ్రక్కుచును స్రావము కా రుధిరమ్ము స్వీయ గా
త్రాలిని వజ్ర ఘాతమున వ్రాలిన శైలము భంగి దోఁపఁగా
మేలుగ నంత రిక్షమున మేటి దివౌకసు లార్వ వానరుల్ 72.

కం. చేసెను దుష్కర కర్మము
వాసిగ రాఘవున కీయఁ బర మానందం
బా సమయమ్మున నంగదుఁ
డే సమ రోత్సాహి యయ్యె నింపుగ మరలన్ 73.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నఱువది తొమ్మిదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 70.

నరాంతకుని మరణము వీక్షించి మహోగ్రులై ఘోరముగ యుద్ధము సేసి యనేక వానరులను జంపి త్రిమూర్ధ దేవాంతకులు హనుమంతుని చేత మహోదరుఁడు నీలుని చేత మహాపార్శ్వుఁడు ఋషభుని చేత వధింపఁ బడుట.

కం. కని యనుజు నరాంతకుని మృ
తి నసుర వర్యులు త్రిమూర్ధ దేవాంతకు లం
త నఱచి రనిఁ బౌలస్త్యుఁ డ
గు నా మహోదరునిఁ గూడి ఘోరార్తులునై 1.

ఉ. అంత మహోదరుం డలుక నభ్ర నికాశ గజేంద్ర మెక్కి ధీ
మంతుని వాలి నందనుని మార్కొనఁ బర్విడె విక్రముండు దే
వాంతకుఁ డుర్కె భ్రాతృ మర ణార్తిని నంగదు దిక్కు సంజ్వర
స్వాంతుఁడు దీప్తపుం బరిఘఁ బాణిఁ ధరించి మహోగ్రుఁ డుద్ధతిన్ 2.

తే.గీ. రథము నాదిత్య తేజోవిరాజితమ్ముఁ
బరమ వాజి యుక్తమ్ముఁ ద్రిశిరసుఁ డెక్కి
రాక్ష సాగ్రగణ్యుం డుగ్రుఁ డాక్షణమున
నంగదు దెస కుఱికె ఘోర సంగరమున 3.

కం. కని యా ముగ్వుర నైరృతు
లను సుర దర్పఘ్నుల బెదరక సుంతైనన్
ఘన విట పావృత పాదప
ము నంగదుండు పెకలించి బోరన నంతన్ 4.

తే.గీ. విసరె దేవాంతకుని పయి వీరుఁ డంగ
దుండు వృక్షమ్ము ఘన శాఖ లుండ నంత
వాలి సుతుఁడు దీప్తాశనిఁ గేళి లీల
శక్రుఁడు విసరిన పగిది సంభ్రమించి 5.

చం. అరసి నగమ్ము నా త్రిశిరుఁ డంతట సర్పనిభాంబకమ్ములం
బరఁగఁగఁ జేసె ముక్కలుగ భగ్న నగమ్మును వీరుఁ డంగదుం
డరసి కురించె గెంతి వడి నక్షయ పాదప శైల వర్షమున్
శరములఁ ద్రుంచె వానిఁ గసి శౌర్యమునం ద్రిశిరుండు వేగియై 6.

ఆ.వె. పాదపములఁ ద్రుంచెఁ బరిఘాగ్రమున మహో
దరుఁడు సాయకములు విరివిగఁ గురి
యించుచుఁ బరువెత్తె మించి త్రిశిరసుఁ డం
గదుని దెసకు నలిగి కర మసురుఁడు 7.

కం. కరిపై నేఁగి మహోదరుఁ
డరి నా వాలి తనయుని మహా కపిఁ గొట్టెన్
గురుతర వజ్ర సదృశ తో
మరమ్మున నురమ్మునం దమర్షం బెసఁగన్ 8.

కం. దేవాంతకుఁడు పరిఘతో
నా వాలి కుమారుఁ గదిసి యడిచి భృశముగన్
వేవేగ మరలె నంగదుఁ
డా వీరులు మువ్వు రెదుర నడలఁడు మదిలో 9.

తే.గీ. పెంచి వేగవంతుఁడు నిజ వేగ మంత
దుర్జయుం డంగదుఁడు తనదు కరతలము
నెత్తి కొట్టె దేవాంతకు నిభ వరంపు
శిరము పైనను బర్వెత్తి శీఘ్రముగను 10.

కం. హరివరుఁ డంగదుఁ డడిచినఁ
గరి రాజు కనులు ధరపయిఁ గ్రన్ననఁ గూలం
గ రణమున వారణం బఱ 11.

చి రివ్వునఁ బడెం బుడమినిఁ జేతన మణఁగన్

కం. కరి హస్తము లాగి బలుఁడు
వర వాలి సుతుండు వేగ బాఁదెను గినుకం
బరువిడి దేవాంతకుని స
మర తలమున బెట్టిదముగ మనుజాశనునిన్ 12.

ఉ. అంత నతండు విహ్వలుఁడునై యనిలమ్మునఁ దూఁగు వృక్షమున్
వింతగఁ బోలి రక్తమును వీరుఁడు లత్తుక రంగు నుండ దే
వాంతకుఁ డోడి కార్చెఁ గడు నత్యధికం బగు యత్నమూని తా
నంతటఁ దేఱి యంగదుని నా పరిఘుం గొని కొట్టె బల్మినిన్ 13.

కం. కూలెను మోకా ళ్లానఁగ
నేలఁ బరిఘము తగుల భృశ నిష్ఠుర గతినిన్
వాలి కుమారుండు తిరిగి
వే లేచి యెగిరెను బయికి వీరుం డంతన్ 14.

ఉ. చూచి కపీంద్రునిం ద్రిశిరసుం డెగురంగ నజిహ్మగమ్ములం
జూచి ధనుస్సు ముమ్ములికిఁ జక్కఁగ వేసె లలాట లక్ష్యుఁడై
వేచిన నట్లు ముప్పురును వీరుని నంగదు నాంజనేయుఁడుం
జూచి ఘనుండు నీలుఁడును శూరులు చేరిరి వారి మార్కొనన్ 15.

చం. విసరెను నీలుఁ డద్రి శిఖ భీమము నంతఁ ద్రిమూర్ధుపై వెసన్
విసరఁగ బాణ పంక్తులను భిన్నము సేయఁగ దాని వేగ రా
క్షసపతి సూనుఁ డగ్నికణ జాలములం బడె ధాత్రి నంత సం
తసమున నిర్జరాంతకుఁడు తత్పరిఘుం గొని కాంచి మారుతిన్ 16.

కం. దేవాంతకుఁ డుర్క నరసి
యా వచ్చెడు నసురుని ననిలాత్మజుఁ డంతన్
వేవేగ యుఱికి కొట్టె మ
హా వజ్ర నికాశ ముష్టి నాతని తలపై 17.

కం. శిరమునఁ గొట్టి మహా బల 18.

హరిప్రవీరుండు మారుతాత్మజుఁ డసురున్
గురుతర నాదమ్మున దు
ర్భర గతిఁ గంపింపఁ జేసె రాక్షస కోటిన్

కం. తల ముక్కలు గా ముష్టినిఁ
బలువరుస కనులును రాల వసుధన్ రసయున్
వెలువడ రాక్షస సూనుం
డిల దేవాంతకుఁడు గూలె నేఁగఁగ నసువుల్ 19.

తే.గీ. ఉర్వి రాక్షస యోధ ముఖ్యుండు గూల
నాజి నిర్జర గణ రిపుం డరసి యా త్రి
మూర్ధుఁ డుగ్రుండునై కిన్క మూర నీలు
వక్ష మందుఁ గురిసె నంప వాన నంత 20.

చం. కినిసి మహోదరుండు దమకించి నగాభము కుంజరమ్ము పై
న నగ వరమ్ము మందరమునన్ రవి చందము వెల్గి బాణ పం
క్తిని హరి నీలు వక్షమున దిట్టముగాఁ గురియించెఁ గొండ పై
నను సబలారి చాపము ఘనమ్ము నిభమ్ము తటిత్తు తోడుతన్ 21.

తే.గీ. ఆ శరప్రవాహము చేత నార్తిఁ జెంద
నంగములు గపి సేనాని హరి వరుండు
స్తంభితుం డయ్యె నమ్మహోదరుని వలన
బల్లిదుని చేష్టితమ్మునఁ దల్లడిల్లి 22.

కం. హరి పాలుఁ డంది సంజ్ఞను
గిరిని స తరుషండ మెత్తి కేళీ లీలన్
శిరము పయిఁ గొట్టెను మహో
దరు నసురుని నీలుఁ డడరి తద్ద బలమునన్ 23.

కం. గిరి పాత భగ్నుఁడై నిజ
కరి మర్దనుఁడై పుడమిని గతజీవి మహో
దరుఁడు వెసం గూలెన్ గిరి
వరమ్ము వజ్రమ్ము చేతఁ బడు చందమునన్ 24.

చం. కని పిన తండ్రిఁ జంపుటను గయ్యమునం ద్రిశిరుండు కార్ముక
మ్మును గొని మారుతాత్మజుని మూరఁగఁ గోపము తీక్ష్ణ బాణ పం
క్తి నిగుడఁ జేసి కొట్టఁగను దిట్టపుఁ గొండ కొనన్ గ్రహించి పై
చెను హనుమంతుఁ డా శిఖను జీల్చె శరమ్ముల నా త్రిమూర్ధుఁడే 25.

ఉ. శృంగము రిత్త వోవఁ గపి శేఖరుఁ డంత ద్రుమంపు వర్షమున్
భంగ విహీన మా హనుమ పర్వఁగ రావణ సూను పైన నా
నింగిని వృక్ష వర్షమును సెట్టన వచ్చెడు దానిఁ గాంచి ఘో
రాంగుఁడు ద్రుంచి యార్చె నిశి తాంబక వృష్టిఁ ద్రిమూర్ధుఁ డుగ్రుఁడై 26.

తే.గీ. ఎగిరి హనుమంతుఁ డసురు తురగముఁ గృద్ధుఁ
డై నఖములతోఁ జీల్చె సింహమ్ము కరిని
భంగి నంతఁ ద్రిశిరసుండు పన్నుగఁ గొని
శక్తి హనుమ పై వైచెను శమను పగిది 27.

కం. దివి నుండి వచ్చు నా యు
ల్క వలె నడరు శక్తినిఁ దగులక మున్న మహా
ప్లవగుం డా హనుమంతుం
డు విఱిచి యంత నఱచెం గఠోరముగ వెసన్ 28.

కం. వీక్షించి భగ్న శక్తిని
నక్షయ మగు హర్ష మంది హరివరులు భృశం
బా క్షణమున నినదించిరి
రక్షో గణము వగవఁగ జలద నిభ మాజిన్ 29.

చం. త్రిశిరసుఁ డెత్తి ఖడ్గమును రేయిచరుండు రణాంతరమ్మునన్
భృశముగఁ గొట్టె వాయు సుతు భీమ తరోరము నందుఁ గొట్ట నా
యశని నికాశ ఘాతమున కంతఁ జలింపక వాయుసూనుఁ డా
త్రిశిరునిఁ గొట్టె వక్షమున ధీరుఁడు హస్త తలమ్ముచే వెసన్ 30.

తే.గీ. ఆయుధము జాఱ మారుతి హస్త తల వి
ఘాతమున నా త్రిమూర్ధుఁడు వీత సంజ్ఞఁ 31.

గూలె నేలఁ బడిన కత్తిఁ గొని మహాక
పి హనుమ యఱచె నసురులు భీతిలంగ

ఆ.వె. సైప నోపక ధ్వని నా పడ్డ త్రిశిరుండు
లేచి కొట్టె ముష్టి రేఁగఁ గినుక
యనిల సుతుని ఘాతమునకు నలిగి కిరీ
టమున నసురు నయ్యనుమఁడు పట్టి 32.

తే.గీ. అసురు శిరముల మూటినిఁ బసిడి మకుట
ముల సకుండలముల శితపు టసి చేతఁ
గినిసి భేదించె మారుతి ఘనునిఁ ద్వష్ట
సూను శక్రుఁడు ఖండించు చొప్పు దోఁప 33.

తే.గీ. దీప్త వహ్ని నిభాక్షుల దీర్ఘతమ ని
జేంద్రియములఁ ద్రిశిరు తల లిలను మూడు
వడెను భాస్కరాధ్వము నుండి పడెడు తార
లనఁగ భూ తలమ్మున నంత నక్కజముగ 34.

తే.గీ. దేవ శత్రువు మరణింపఁ ద్రిశిరసుండు
హనుమ విక్రమమున నాజి హరులు ముదము
న నఱచిరి భూమి చలియించె నైరృత వరు
లెల్లఁ బాఱి రెల్లెడలను దల్లడిల్లి 35.

తే.గీ. త్రిశిరసు మఱి మహోదరు ధీర వరుల
యంత మింక దుర్జయులు దేవాంతకుఁడు న
రాంతకుఁడు మరణింపఁగ నరసి రణము
నందు మత్తుఁడు కోపించి యసుర వరుఁడు 36.

మ. కొని జ్వాలావృత దీప్త ఘోర గద నాక్రుద్ధుండు సర్వాయస
మ్మును జాంబూనద పట్ట సంవృతము సంపూర్ణాస్ర ఫేనామిష
మ్మును దీప్తాంగము శత్రు శోణిత మయమ్మున్ రక్త మాలావృత
మ్మును నైరావత సార్వభౌమ భయదమ్మున్ భీత పద్మేభమున్ 37.

తే.గీ. అలిగి శుభము తేజో జ్వలితాగ్ర మసుర
వరుఁడు పట్టి మహాపార్శ్వుఁడు రణ కామి
హరుల మార్కొనఁ బర్విడె నయ్యుగాంత
వహ్ని భంగి మండుచు భయావహముగ నని 38.

తే.గీ. ఋషభుఁ డెగిరి వేగమ వానరేంద్రుఁ డడరి
రాక్షసవరు మత్తానీకు రణము నందుఁ
గాంచి దుమికి సమీపించి యంచితముగ
నంత వెస రావణానుజు చెంత నిలిచె 39.

చం. నిలువఁగ వానరోత్తముఁడు నిర్భయ మాత్మ సమీప మందుఁ బే
రలుకను గొట్ట వక్షమున నాసురుఁ డా గద తోడ వజ్ర క
ల్ప లస దమోఘ దండమున వానర వర్యుఁడు భిన్నవక్షుఁడై
చలిత తనుండు కార్చెను వెసం గడు రక్తము వీత సంజ్ఞుఁడై 40.

చం. తెలివి వహించి వానరుఁడు దీర్ఘత రావసరమ్మునం దగం
గలఁగి చలింప నోష్ఠములు గాంచెను మత్తుని వేగ వంతుఁడై
యలిగి సమీప మేఁగి యసురాధముఁ గొట్టెను స్వీయ ముష్టితో
బలముగ శైల సన్నిభుఁడు వక్షమునన్ ఋష భాఖ్యుఁ డుగ్రుఁడై 41.

తే.గీ. అంత వేరు తెగిన వృక్ష మనఁగ నసుర
నేలపై రక్త సిక్తుఁడు గూలఁ గాంచి
వాని గద యమ దండము వంటి దాని
వేగ కైకొని వానర వీరుఁ డార్చె 42.

ఆ.వె. పడి మృతు వలెఁ గొంత తడవు తేఱి సురారి
సందె నందు మబ్బు సరణి దేహ
వారి రాజ సూను వానర వర్యునిఁ
గొట్టె బల్లిదుండు ఘోరముగను 43.

తే.గీ. మూర్ఛిలి పుడమిఁ గూలి యపుడు ముహూర్త
మందు లేచి సంజ్ఞ వడసి హరి వరుండు
రక్కసుని యద్రి కల్పఘోర గద వెస గ్ర 44.

హించి పైచి కొట్టెను రాక్షసేంద్రు నంత

ఆ.వె. యజ్ఞ దేవ భూసు రారి రౌద్రు ఘన దే
హమ్ముఁ గదిసి యంత నా గద యుర
ముఁ బగులంగఁ జేయ నపుడు కాఱెను రక్త
మద్రి ధాతు నీర మగపడు గతి 45.

ఆ.వె. వజ్ర నిహత నగము భంగిఁ బుడమిఁ గూల
తనదు గద నసువులు సనఁగ రాక్ష
సుండు పాఱి రంత సుర రిపు లెల్లరు
బీతి రేఁగ వారి కాతతముగ 46.

తే.గీ. రావ ణానుజుఁ డట్లు మరణము నంద
నర్ణ వాభ రాక్షస సేన యాయుధములు
వీడి కేవలమ్ముఁ బ్రతుక వీత పార
వనధి నిభముగఁ బాఱెను వంత తోడ 47.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు డెబ్బదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 71.

తన సోదరులు, పినతండ్రు లిద్దఱు యుద్ధమున మరణించుటఁ గాంచి కోపమున రావ ణాత్మజుఁ డతికాయుఁడు సమరమునఁ బ్రవేశించి వానర యోధులు విసరిన శైల వృక్షముల నెల్లఁ ద్రుటి భగ్నము గావించి రాముని పైపునకు నుగ్రుఁడై దూసుకొని వచ్చుచుండ లక్ష్మణుఁడు వీక్షించి మహోగ్రుఁడై వానితో ఘోర యుద్ధ మొనరించి చివరకు వధించుట.

చం. తుములము రోమ హర్షణము తోరము వ్యాకుల మైన స్వీయ సై 1.

న్యముఁ గని శక్ర విక్రములు నాత్మ సహోదరు లాజిఁ గూలఁగాఁ
దమ పినతండ్రు లిర్వురును దండ్రికి భ్రాతలు గూలఁ జేసి యు
ద్ధము నతికాయుఁ డంత సుర దానవ దర్ప నిహంత యుగ్రుఁడై

కం. ఘన తేజస్వి విధాతృ వ
ర నైరృతుఁడు వేయి సూర్యుల గణము వలె పె
ల్లు నరదము నెక్కి శక్రా
రి నగచరుల మార్కొనఁ జెలరేఁగి పరువిడెన్ 2.

చం. ధనువును మృష్ట కుండలుఁడు తద్ద బలుండు కిరీటి యంతఁ గే
లను భయదమ్ముగాఁ జఱచి రాక్షసుఁ డాత్మ వరాఖ్యఁ బల్కుచున్
ఘనుఁ డని నార్చి భీమముగఁ గాఱియపెట్టెను జ్యా రవమ్ము చే
తను నిజ సింహనాదమునఁ దద్దయుఁ బేరున వాన రాలినిన్ 3.

ఆ.వె. కాంచి వాని హరులు ఘన కాయ మాహాత్మ్య
మును భయార్తులు నయి మనము లందు
నెంచి కుంభకర్ణుఁ డేతెంచె లేచి య
ని కదిసి రొకరి నొకరు కడు భీతి 4.

తే.గీ. విష్ణునిఁ ద్రివిక్రమునిఁ బోలు వీరు రూప
మారసి భయము తోడుత హరి వరు లటు
నిటు పరువులిడఁగ నితరు లేఁగి వెస శ
రణ్యు లక్ష్మణాగ్రజుని శరణ మడిగిరి 5.

మ. కని యచ్చో నతికాయు దూరమున నా కాకుత్స్థుఁ డద్ర్యాభునిన్
నినదింపన్ ఘన సన్నిభం బసురునిన్ నీరేజ పత్రాక్షుఁ డం
త ని జానీకము నూఱడించి తగ స్వాంతం బందు నాశ్చర్యమే
తనరం బల్కె విభీషణుం గని మహా ధానుష్కుఁ డీ రీతినిన్ 6.

ఉ. ఎవ్వఁడు శైల సన్నిభుఁడు నీతఁడు ధన్వి హరీక్షణుండునున్
నివ్వెఱ వేయి గుఱ్ఱముల నెక్కెడు స్యందన రాజ మందుఁ దా
నవ్వర శూల ముద్గరము లంకుశ మాయుధ కోటి ప్రాసమున్
నివ్వటిలంగఁ దోమరము నిల్పె సభూత మహేశు భంగినిన్ 7.

కం. మృత్యువు నాలుకఁ బోలుచు
నత్యధికము రథము నందు నమరగ శక్తుల్
ప్రత్యయ శంపాభ్రము వలె
సత్యముగ వెలుంగు చుండె స్యందన మందున్ 8.

ఆ.వె. సిద్ధ చాపములు పసిడి పృష్ఠములఁ బ్రకా
శించు చుండఁగ వెలిఁగించు చున్న
వతని స్యందనమును వితతముగను నింగి
నింద్ర చాపము వెలిఁగించు పగిది 9.

తే.గీ. అసుర శార్దూలుఁడు రథికు లందు మేటి
దినకర ప్రభల నడరు తేరున నరు
దెంచు చుండె రాహు ధ్వజుఁ డంచిత రవి
కిరణ నిభ శరముల వెలిఁగించి దిశల 10.

కం. ఘన నిభ సన్నాద మసుర
ఘనుండు మువ్వంపు విల్లు కమనీయమునుం
గనక విభూషిత మూనఁగఁ
గనిపించెను శక్ర ధనువు కరణి వెలుఁగుచున్ 11.

కం. టెక్కెమ్ము కోడిపీఁటయు
టెక్కెపుఁ గంటం బడరఁ గడింది రథమునం
బిక్కటిల ఘన నిభ రవం
బెక్కిరి సారథులు నల్వు రింపుగఁ గనుమా 12.

తే.గీ. వెలయు చున్న విరువది యమ్ముల పొదు లర
దమ్ము నందు ఘోరపుఁ గార్ముకమ్ములు పది
పసిడి వర్ణపు నారులు పరఁగు చున్న
వెనిమిది యరయ నచ్చట నిద్ధ చరిత! 13.

ఆ.వె. నలు కయి పొడువు పిడి గలిగి యుండఁగఁ బ్రక్క
లింపుగ వెలుగంగ నింకఁ దెల్ల 14.

ముగను బది కరముల పొడువుతోఁ గత్తుల
జత రథమ్ము నందు సరస నమరె

సీ. మెడలోన నింపుగ మెఱయ సెఱ్ఱని త్రాడు నల్లని మేనున నుల్లసిల్లి
కాలుని భంగి వక్త్ర మడర మేఘమ్ము నందున్న నాదిత్యు చందమునను
బసిడి యంగదముల బాహు యుగ్మ మడర నెత్తైన కొన లున్న హిమగిరి వలె
శోభిల్లి యాస్యము సురుచిర కుండలద్వయముతోఁ జెలరేఁగి తద్ద వెలుఁగ
తే.గీ. శైల నిభుఁడు పునర్వసు చంద్రు సరణి
వెలుఁగు వాఁ డరుదెంచెను వీరుఁ డితఁ డె
వం డెవనిఁ గని హరు లెల్లఁ బాఱి రడలి
చెప్పుమ  మహాభుజ! యసుర శ్రేష్ఠు గుఱిచి 15.

తే.గీ. అడుగ రాజ పుత్రుఁడు రాముఁ డమిత తేజుఁ
డట్లు తేజస్వి రాముని కంత నవ్వి
భీషణుం డెఱిగించెను  వీరుని యతి
కాయుని గుఱించి విశదముగ నిటు లపుడు 16.

చం. పనులను రాక్ష సాధిపుఁడు వైశ్రవ ణానుజుఁ డుత్సహించు నా
తని తనయుండు సన్నిభుఁడు తండ్రికి సంగర మందు వృద్ధ సే
వి నిరత మస్త్ర కోవిదుఁడు వీర వరుం డతి కాయ నాముఁ డి
ద్ధ నిగమ ధారి సంతతము తద్దశ వక్త్రునిఁ గొల్చుఁ బ్రీతిమై 17.

చం. వినుతుఁడు ఖడ్గ విద్యలను వింటిని నాగ తురంగ చాలన
మ్మున మఱి సామ భేదముల మూరును దాన నయమ్ము లందు నీ
తని ఘన బాహు వీర్యమునఁ దద్ద సుఖమ్ముగ నుండు లంకలో
జన తతి ధాన్యమాలినికి సంభవ మందె నితండు రాఘువా! 18.

కం. సేవించి బ్రహ్మను బడసె
నీ వీరుం డస్త్ర రాజి నింపుగ రిపు సే
నా వీరుల సమరమ్మునఁ
దా వధియించెను జెలంగి ధ్యాన విమలుఁడై 19.

ఆ.వె. బ్రహ్మచేఁ బడసె నవధ్యత్వము సు రాసు 20.

రుల వలన మహాసురుండు కవచ
మింక నీ యరదము నిన నిభము వెలుంగు
దాని నతఁడు ఘోర తపము వలన

కం. సురలును దానవులు నశిం
చి రాజి వందల కొలంది చిక్కి యితనికిన్
వర యక్షులు నశియించి ర
లరుచున్ రక్షింపఁ బడిరి రాక్షసు లెల్లన్ 21.

ఉ. ధీమతి యింద్రు వజ్రమును ధీరత నెవ్వఁడు సేసె వ్యర్థ ము
ద్దాముని ఘోరపాశమును దారుణ రీతినిఁ గొట్టెఁ గోలలన్
రామ! దశాస్య నందనుఁడు వ్రాలె నతం డతి కాయుఁ డుగ్రుఁడై
యీ మనుజాశనర్షభుఁ డహీనుఁడు నిర్జర దానవఘ్నుఁడున్ 22.

ఆ.వె. యత్నము నొనరింపుమా నరపుంగవ!
క్షిప్ర మతని నాపఁ జెన్నుగ నని
వానర వర బలము దా నమ్ముల నశింపఁ
జేయక మును వారి జాయ తాక్ష! 23.

కం. అంత నతికాయుఁ డతి బల
వంతుఁడు నొచ్చి హరిసేనఁ బన్నుగ నా ధీ
మంతుండు సఱచి ధనువుం
బంతమున నఱచెఁ జెలంగి పలుమఱు లాజిన్ 24.

చం. అరదము నందు భీకర మహాంగుని నా రథికప్రవీరునిన్
హరి వరు లమ్మహాత్ము లని నారసి వానర మంత్రు లత్తఱిన్
శరభుఁడు నీల మైందులును సత్వర మా ద్వివిదుండు నింకనున్
హరి వరుఁ డైన నా కుముదుఁ డాసురు మార్కొన నుర్కి యంతటన్ 25.

ఉ. పాదప పర్వ తాగ్రములు పైవఁగ నయ్యతికాయుఁ దాఁకఁగాఁ
దా దరి రాక మున్నెఁ గని తత్క్షణ మభ్ర వ్ర తాంబకమ్ములన్
పే ధృతిఁ ద్రుంచె నస్త్ర చయ వేత్తల మేటి వరిష్ఠ తేజుఁడున్
వేదన పాలుచేసెఁ గపి వీరుల నాయస బాణ పంక్తులన్ 26.

ఆ.వె. శరచ యార్దితు లయి శాఖామృగులు భిన్న
గాత్రు లాజిని నతికాయుని నెది
రింపఁ జాల రైరి కంపించి రెల్లరు
నయ్యసురుని ధాటి నాఁప లేక 27.

తే.గీ. యౌవన మదమ్మునఁ జెలఁగి యయ్యసుర వ
రుండు భయపెట్టె నవ్వానరుల బలమ్ముఁ
గ్రుద్ధుఁ డయి భృశమ్ముగ నాజి ఘోరముగను
సింహము మృగయూథమ్మును జేయు పగిది 28.

ఉ. కొట్టక యుద్ధ దూరులను గొంచెము నైనఁ బ్లవంగ వీరులన్
నెట్టన నేఁగి రాముని మనీషి సమీపము రాక్షసావలిన్
దిట్ట స చాప తూణముల ధీరుఁడు వల్కెను దర్ప వాక్కు ల
ప్పట్టున నిట్లు రాఘువుని పార్థ వరేణ్యునితో మదమ్మునన్ 29.

చం. నిలిచితి బాణ చాపముల నే నరదమ్మున రాఘవేంద్ర! నేఁ
గలఁబడి చేయఁ బ్రాకృతులఁ గయ్యము నెన్నఁడు నుత్సహించుచుం
గలహ మొసంగు యుద్ధ మొసఁగం దగు శక్తియె చాలినంతగాఁ
గలిగిన వాఁడు నేఁ డడరి క్రన్నన నాకుఁ బరాక్రమమ్మునన్ 30.

కం. విని వాని వాక్యములు కి
న్క నూని సౌమిత్రి రిపు వినాశకుఁడు సహిం
ప నశక్తుండై లేచి వె
స నగుచు నిల్చెను గ్రహించి చాప వరమ్మున్ 31.

చం. తడయక యంత నమ్ములపొదం గల బాణము వేగ లాగి వీ
రుఁ డడరి లక్ష్మణుం డెడఁద రోషము మీఱఁగ సంభ్రమించుచున్
వడి నతికాయు ముందు నిలువం జని జ్యా ధ్వని సేసి నింపె నా
కడలిని భూ నభో దిశలఁ గ్రన్ననఁ ద్రాసము నంద రక్కసుల్ 32.

కం. అసురాధి పాత్మజుఁడు భయ
పు సుమిత్రా తనయు చాపపు మహా ధ్వని న 33.

ల్దెస నాక్రమింప విని పె
క్కసముగ విస్మయము నందె ఘన వీర్యుఁ డెదన్

కం. అతికాయుం డత్యంత కు
పితుఁ డయి యుత్థితుని మనుజ వీర వరేణ్యున్
వితత బలు లక్ష్మణుఁ గని ని
శిత బాణమ్మును గ్రహించి చేరి యిటు లనెన్ 34.

కం. బాలుఁడవే విక్రమమున
మేలుగ నేర్పరివి కావు మేటి బలుని న
న్నేల యెదిరింప నెంచెదు
కాల సదృశు లక్ష్మణ! వెసఁ గదలి వెడలుమా 35.

ఆ.వె. నాదు కర విముక్త నారాచముల వేగ
మును సహింప నోపరు నగవర మ
గు హిమవంతుఁ డైన మహి యైనఁ దోరంపు
గగన మైన నిక్కముగను వింటె 36.

ఉ. ఏలను మేలుకొల్పఁ దమకింతు సుషుప్తపుఁ గాల వహ్ని నిన్
బాలక! వీడు చాపమును బ్రాణము లిచ్చుట మన్నిమిత్తమై
కూలఁగ నీకు లేక నిలు కోరనిచో వెనుదిర్గుటం బసం
దూలఁగ నీదు ప్రాణములు తూర్ణమ యేఁగెదు కాలు నింటికిన్ 37.

చం. కను మిట నాదు తీక్ష్ణతర కాండములన్ రిపు దర్పహంతలం
త్రినయను మార్గ ణాభములఁ గృత్స్నము కాంచన భూషితమ్ములన్
వినుమివి సర్ప తుల్యములు వేగమ త్రాగును నీదు రక్తమున్
వని మృగరాజు దూఁకి మదవారణ రక్తము త్రాగు రీతినిన్ 38.

ఆ.వె. పలికి యిట్లు వింటి బాణము సంధించి
న యతికాయుని వచనముల నాల
కించి దర్ప రోష సంచితములను సౌ
మిత్రి కినిసి పలికె మేటి గిరలు 39.

ఉ. వాఁగినఁ గారు సజ్జనులు వాక్యము లీయ విలన్ మహత్త్వమున్
బాగుగ నూని బాణములు పాఱక ధన్విని మించి నిల్చితిన్
వేగమ చూపు నీ బలము వీరుఁడ వైన దురాత్మ పోరునన్
వాఁగఁగ నీ వనర్థుఁడవు పన్నుగఁ గర్మము లందుఁ జూపుమా 40.

తే.గీ. పౌరుషము కల్గి యున్నసె శూరుఁ డందు
రాయుధములతో ధన్వివి యరద మందు
నుంటివి పరాక్రమముఁ జూపు వింటె శరము
ల నయిన వరాస్త్రముల నైన రాక్షసేంద్ర! 41.

తే.గీ. నీ శిరమును నిశిత శర నిచయము నిటఁ
బఱిపి పడవైతు పెస నేల పైన నేను
గాల సంపక్వ మైనట్టి తాళ ఫలము
గాలి శీఘ్రమ పడవైచు కరణి దోఁప 42.

కం. శరము లవి దప్త కాంచన
వర భూషితములు మదీయ పాణిచ్యుతముల్
శర శల్యమ్ముల నీదు రు
ధిరము నలరి త్రాగఁ గలవు తృప్తి నొసంగన్ 43.

తే.గీ. బాలుఁ డీతఁ డనుచుఁ గించపఱుపఁ దగదు
బాలుఁడో వృద్ధుఁడో మృత్యు భంగి నన్ను
నాజి నెఱుఁగుమ బాలుండు నైన విష్ణు
వాక్ర మింపఁడె లోకత్రయమ్ము మూటి 44.

కం. విని లక్ష్మణు వచనమ్ములు
ఘనార్థ వంతమ్ము లుచిత కారణ యుతముల్
కినిసి యతికాయుఁ డంతం
గొనె నత్యుత్తమము తీక్ష్ణ ఘోర శరమ్మున్ 45.

కం. చనుదెంచిరి విద్యాధర
ముని గుహ్యక దేవ దైత్య భూత చయాదుల్
ఘనులు మహాత్ములు యుద్ధ 46.

మ్మును వీక్షింపంగఁ దమి నభో వీథి వెసన్

తే.గీ. అంత నతికాయుఁడు కినిసి యమ్ము చాప
మందు సంధించి కుదియించు నట్లు నింగి
వేయ లక్ష్మణుని పయి నా వీరుఁ డరసి
యర్ధ చంద్ర శరమ్మున నణఁచె దాని 47.

ఆ.వె. తాడి తాహి వోలె వాడి శరము భగ్న
మైనఁ గాంచి కినిసి యయ్యతి తనుఁ
డైదు ఘోర తరపు టమ్ములు సంధించి
వైచె నంత నసుర వర్యుఁ డడరి 48.

తే.గీ. తన్ను దాఁకక మున్నయె యన్నరప్ర
వరుఁడు భరతానుజుండు నా శరముల నిజ
నిశిత శర పంక్తినిం ద్రుంచి భృశముగ జ్వలి
యించు బాణమ్ము నంత గ్రహించి వేగ 49.

ఆ.వె. ఉత్తమంపు వింటి నుగ్రుఁడై సంధించి
లక్ష్మణుండు శత్రు లయుఁడు లాగి
బెట్టిదమ్ముగ వెస విడిచె నా సాయక
మ్ము నతికాయు పైనఁ బోరు నందు 50.

కం. ఆకర్ణాంతము వంగిన
వౌ కనుపుల నడరు నట్టి యంబకమును దా
వీఁక విడిచె లాగి సుమి
త్రా కాంతా సుతుఁడు నుదుటఁ దాఁక నసురునిన్ 51.

ఆ.వె. దిగ లలాట మందుఁ దీక్ష్ణ శరము భీమ
రాక్షసునకుఁ దడిసి రక్త మందుఁ
జూడఁగ నగపడెను జోద్యముగ నపుడు
శైల మందు నున్న సర్పము వలె 52.

తే.గీ. రాక్షసుండు కంపించెను లక్ష్మణ శర 53.

పీడుతుండునై రణ మందు బెట్టిదముగ
రుద్రు బాణ ఘాతమునకు భద్ర జాత
ఘోర త్రిపుర గోపురపుఁ దూఁగుఁ దలపింప

చం. ఘన బలుఁ డంతఁ దేజి శర ఘాతముచే నరి! శ్లాఘనీయుఁ డై
తని యని చింత సేసి యెద నాసురుఁ డాతని తోడ సాధు వం
చును జరియించె దీర్ఘపు భుజం డరదమ్మును బట్టి యానన
మ్మును నధికమ్ముగాఁ దెఱచి భూరి భుజమ్ములు వంచి యంతటన్ 54.

తే.గీ. బలము నూని లక్ష్మణుఁ గాంచి పట్టు పట్టి
యొకటి మూడైదు మఱి యేడు నుత్సహించి
రాక్షసుండు బల్లిదుఁడు శరమ్ము లంత
వేగమ గ్రహించి సంధించి లాగి విడిచె 55.

చం. శరములు హేమ పుంఖములు చండత రార్క నిభమ్ము లంత నం
బరమును గాల తుల్యములు భైరవ రాక్షసు విల్లు వీడి స
త్వర మొనరింప దీప్తముగ వాని నభీతిని లక్ష్మణుండు దు
ర్భర నిశి తోగ్ర బాణముల రామ సహోదరుఁ డాజిఁ ద్రుంచినన్ 56.

ఉ. భగ్నము లైన నవ్విధము బాణము లెల్ల సురారి రోష సం
మగ్నుఁడు రావ ణాత్మజుఁడు మత్సర చిత్తుఁడు పే గ్రహించి కా
లాగ్ని నిభాంబకమ్ము విలు నందుఁ దగన్ సమకూర్చి జొమ్మునన్
లగ్నమునౌ విధమ్ముగను లక్ష్మణు నారసి పైచె పైచినన్ 57.

కం. అతికాయు శరముచేఁ దా
డితుఁ డయి నిజ వక్షమునఁ గడిఁది కార్చెను శో
ణిత మత్తఱి మత్త గజము
వితతముగ మదమును గార్చు విధ మటఁ దోఁపన్ 58.

ఆ.వె. లాగి యా శరమును లక్ష్మణుండు విశల్యుఁ
డై శరమ్ము నొండు నంతట నన
లాస్త్రమున ఘనముగ నాతఁడు సంధింప
నది జ్వలింపఁ జేసె నా ధనువును 59.

కం. అతికాయుఁ డంత శరము త్వ
రితుఁడు పసిడి పుంఖముఁ జెలరేఁగి భుజంగ
ప్రతి బాణము గొని దినకర
విత తాస్త్రము తోడఁ గూర్చె విజయం బందన్ 60.

తే.గీ. కాల దండమును విసరు కాలుఁ బోలి
లక్ష్మణుఁ డని నాగ్నేయాస్త్ర రాజిత శర
ము జ్వలిత మతికాయుని పైన మూరి విడువ
నసుర సూర్యాస్త్ర మతి రౌద్ర మంత విడిచె 61.

తే.గీ. ప్రభల మండు టంచుల రెండు బాణ వరము
లాకసమ్మున నొండొంటి నాగ్రహించి
నట్టి సర్పద్వయము భంగి బెట్టిదముగఁ
గొట్టుకొను చుండి దహియించి కూలె నవని 62.

కం. జ్వాల లణఁగ భస్మమ్ములు
రాల వెలుఁగ వా పరమ శరద్వంద్వమ్ముల్
కాలుచు నుండియు నుంతయు
నేలం గూలి వెలుఁగంగ నేరవు గాంచన్ 63.

ఆ.వె. త్వాష్ట్ర మనెడు నస్త్ర వరము నైషీకము
నాసురుఁ డతి కాయుఁ డడరి వేసె
సత్వరమ్ము దాని సౌమిత్రి యైంద్రాస్త్ర
మున నడంచె వీర్యమునఁ జెలంగి 64.

ఆ.వె. లయము కాఁ గినిసి దురమున నైషీకము
రావణాత్మజుఁడు శరమ్ము నందు
యామ్య మనెడు నస్త్ర మంత సంధించి క్షి
ప్రమ్ము వేయ రాము తమ్ముని పయి 65.

తే.గీ. వేసి యస్త్రము వాయువ్య మా సుమిత్ర
పట్టి యడఁచి యామ్యమ్మును వర్ష ధారఁ 66.

గురియు మేఘమ్ము భంగినిఁ గురిసెను శర
ధార నతికాయుని పయి నా వీరుఁ డలిగి

కం. కూలిన వవి యంచులు తెగ
నేలను జేరి యతికాయుని కవచమును వ
జ్రాలంకృతమ్ముఁ జీల్పం
జాలక వజ్ర సదృశమ్ము సంగర భూమిన్ 67.

తే.గీ. రిత్తవోవ వానిని గాంచి యత్తఱిఁ గురి
యించె శర సహస్రమ్ముల నిప్పరఘ్నుఁ
డా శరౌఘ మభేద్యంపు టసురు కవచ
మహిమ బాధింప వసుర కుమారు సుంత 68.

తే.గీ. అతి బలుఁ డతికాయుఁడు శరౌ ఘావ్యధుండు
పన్న గాకార శరమును బఱపి కొట్ట
లక్ష్మణుని మర్మ దేశములను ముహూర్త
కాలము విసంజ్ఞుఁ డయ్యె రాఘవు ననుజుఁడు 69.

ఆ.వె. శత్రు తాపనుండు సౌమిత్రి తేఱి నా
లుగు నిశిత శరమ్ములు పఱపుచు హ
యముల సారథిని ధ్వజమును ముక్కలు సేసి
సత్వరము గ్రహించి శర గణమ్ము 70.

తే.గీ. అంత గుఱి చూచి యతికాయు నంచితముగ
విడిచె నా బాణము లసుర వీరుని వధి
యింప నెంచి సంభ్రమ మెద నించు కైన
లేక సౌమిత్రి సెలరేఁగి వీఁక నాజి 71.

ఆ.వె. అయిన నరవరుండు నసుర సత్తముని బా
ధింపఁ జాల కుండె నంప గముల
సమర మందు నంత సరస కేతెంచి వా
యువు వచించె రఘు కులోత్తముఁ గని 72.

చం. విను మిది బ్రహ్మదత్త వర వీరుఁ డ వధ్య నివాత సంవృతుం
డని ఘను బ్రహ్మనామ పరమాస్త్రము చే వధియింప నొప్పు నీ
తని నిత రాస్త్రముల్ కవచు దార్ఢ్య వధింప ననర్హముల్ సుమీ
యన విని లక్ష్మణుండు త్రిదశాధిప సన్నిభ వీర్యుఁ డంతటన్ 73.

ఉ. కైకొని బాణ రాజమును గాండపు టగ్రము నందుఁ గూర్చెఁ దా
వీఁకను బ్రహ్మ మస్త్ర మతి వేగము గూర్ప వరాస్త్ర రాజమున్
నాకము సూర్య చంద్రులును నాలుగు దిక్కులు భూ గ్రహమ్ములుం
గాఁక సెలంగ భీతిలుచుఁ గంపము లందిన వెల్ల నత్తఱిన్ 74.

తే.గీ. శరము బ్రహ్మాస్త్ర యుక్తమ్ము స వరపుంఖ
మంత యమదూత కల్పము నమర నాథ
శత్రు సూనునిపై వేసె సంగరమున
వజ్ర కల్పము సౌమిత్రి వజ్రి నిభుఁడు 75.

తే.గీ. లక్ష్మణ కరచ్యుత మమోఘ రయము సజ్వ
లనము వజ్ర సంయుతము చిత్రతర పుంఖ
మరుగుదెంచు చుండ రణము నందు శరము
సాయ కానేకముల నతికాయుఁ డడిచె 76.

తే.గీ. బాణము సుపర్ణవేగము పార్శ్వ మేఁగు
దెంచె నతికాయునకు నంత మించి మండు
మృత్యు కాలు నిభము దాని మేటి కర్ముఁ
డడిచె ఋష్టి గదా కుఠా రాదుల నని 77.

తే.గీ. వ్యర్థ మొనరించి యత్యద్భు తాకృతుల వె
లుంగు నాయుధములను జెలంగి శరము
స మకుటం బతి కాయుని సత్త్వవంతు
శిరము వెసఁ బట్టి హరియించె దురము నందు 78.

కం. పతితం బయ్యెను శర పీ
డిత తచ్ఛిరము సమకుటము డిగ్గన నిల నా
తత హిమవన్నగ శృంగము 79.

పతితం బై నట్టి భంగి భండన మందున్

ఆ.వె. భూషణమ్ము లెల్ల భువినిఁ జెల్లచెదరఁ
బడ్డ వానిఁ గాంచి దొడ్డ వగపు
నందిరి హత శేషు లన్నిశాచరు లాత్మ
ల నతి కాయుని నసురప్రవరుని 80.

కం. పరమ విషణ్ణ వదనులై
స్వరములు వికృతములు గాఁగఁ బలలాశను లం
త రణశ్ర మార్త దీనులు
విరివి నొనర్చిరి కలంగి భీతిన్ ధ్వనులన్ 81.

కం. హత నాయకు లతి భీతులు
హతాశులు నిశాచరులు పురాభిముఖులు సై
ధృతి హీనులు నలు దెసలు త్వ
రిత గతి నేఁగిరి పరుగిడి రిత్తగ నంతన్ 82.

కం. వికచాంబుజ సదృశాస్యులు
నకలంక ముదాన్వితులు మహా సత్త్వు లనే
క కపులు లక్ష్మణు నిహతుం
డు కాఁగ బల్లిదుఁ డగు రిపుఁడు కొలిచి రెలమిన్ 83.

ఆ.వె. అతి బలు నతికాయు నభ్ర సన్నిభుఁ జంపి
సమర మందు నంత సంతసించి
ప్లవగ పూజితుండు లక్ష్మణుండు కదిసె
నన్న రాఘవేంద్రు మన్నన వెస 84.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు డెబ్బది యొకటవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 72.

రావణుఁ డతికాయుని మరణమ్మును విని యుద్వేగుఁడై పరి పరి విధముల విలపించి లంకా నగర
రక్ష ణార్థము రాక్షసుల నప్రమత్తులై యుండుఁ డని యాజ్ఞాపించి యంతఃపురమున కేఁగి
చింతాక్రాంతుం డగుట.

కం. విని యతికాయుని మరణము
ఘన తేజుని లక్ష్మణు ఘన కాండ విఘాత
మ్మున రావణుఁ డుద్వేగ
మ్మ నంది వచియించె దీనముగ వచనమ్ముల్ 1.

సీ. ధన్వి ధూమ్రాక్షుండు ధానుష్క సంచయ శ్రేష్ఠుండు ఘనుఁ డమర్షి భయదుం డ
కంపనుం డా కుంభకర్ణుండు దుర్భేద్యుఁడౌ ప్రహస్తుండు బలాఢ్యు లెల్ల
రాక్షస వీరులు రణ కాంక్షులు నపరాజితులు నిరంతర జిత విమతులు
హతులైరి యక్లిష్ట వితత కర్ముని చేత రాముని చేత ఘోర రణ మందు
తే.గీ. రక్కసులు మహాకాయులు పెక్కు రస్త్ర
నిపుణులు మహాత్ము లన్యులు నీల్గి రెల్ల
శూరు లక్కజముగ నర వీరు మార్కొ
నంగఁ జాలక పోరుచు సంగరమున 2.

ఉ. భ్రాతలు బంధ మొందియు శరమ్ముల దత్త వరాంబకమ్ములన్
నా తనయుండు పేయ నుత నైజ బలుం డగు నింద్రజిత్తుచే
నే తఱి నా సు రాసురుల కెయ్య దశక్యము యక్ష కోటికిన్
సైతము దేవ గాయక భుజంగ యుతమ్ము తొలంగఁ జేయఁగా 3.

ఆ.వె. ముక్తు లైరి యకట భూవరు లా రామ
లక్ష్మణులు ప్రభావ రయ మడరెనొ
మాయ చేత నైన మంచిగ మోహింపఁ
జేసియో యెఱుంగఁ జిత్ర మరయ 4.

కం. ఏయే యోధులఁ బంపితి
సే యుద్ధమ్మునకు సమర నిర్జయుల నహో
యా యా రాక్షసులు నిహతు
లై యవనిం గూలి రెల్ల హరి వీరులచే 5.

కం. కనఁ జాల నిప్పు డే నా
తని నెవ్వఁడు రాఘపేంద్రుఁ దమ్మునితో నిం
కను సుగ్రీవ విభీషణు
లను సేన వధింప శక్తి రాజిలు వానిన్ 6.

కం. నృవరుఁడు మహా బలుఁ డహో
యెవని పరాక్రమము చేత నీల్గి రసుర వీ
ర వరులు కాకుత్స్థుం డ
స్త్ర వర సుసంపన్నుఁడు రఘు రాముం డవనిన్ 7.

తే.గీ. అప్రమత్తత నెల్లెడ సుప్రసిద్ధ
గుల్మము పుర వరమ్మును గుప్త వనము
నా యశోకము రక్షింప నర్హ మగును
సీత యున్నట్టి దేశము నాతతముగ 8.

ఆ.వె. ఎక్కె డెక్కడ బల మెల్లఁ దనరు చుండు
నక్క డక్కడ మన కాగమన గ
మనము లింపుగాను మాటి మాటికి తెలి
య వలయును విసంశయముగ నింక 9.

కం. మీ మీ బలముల తోడుత
క్షేమమ్ముగ నెల్లెడ నిలిచి యరయఁ దగు శా
ఖామృగ సంచారమ్ముల
నో మానిసి దిండులార! యుత్సాహమునన్ 10.

తే.గీ. హరుల నేరి నుపేక్షింప నర్హ మెన్నఁ
డైనఁ గా దుదయమున సాయమున నైన
నర్ధ రాత్రి నైనను వారు యత్నము నొన 11.

రించినను వచ్చు చున్న నిలిచినఁ గనుఁడు

కం. విని లంకాధిపు వాక్యము
ల నెల్ల బల్లిదులు ఘోర రాక్షసు లబ్బం
గి నిలిచిరి యథోక్తమ్ముగ
ను నిశాచర రాడ్వరుని పనుపు నూని తమిన్ 12.

ఆ.వె. రాక్ష సాధిపుండు రావణుం డట్టు లా
దేశముల నొసంగి దీనుఁడై భృ
శమ్ము ఘోర దుఃఖ సంతప్తుఁడై చనె
స్వీయ నిలయమునకు శీఘ్రముగను 13.

కం. జ్వలియింప దీప్త గోపా
నలము నిశాచర విభుండు నందన దుఃఖా
నల తప్తాత్ముఁడు నిట్టూ
ర్పు లుష్ణములు విడిచెఁ బల్మరుఁ గుములుచు నెదన్ 14.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు డెబ్బది రెండవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 73.

పుత్రుల సోదరుల మరణ వార్త నాలకించి శోకించుచున్న తండ్రినిఁ గాంచి యింద్రజి త్తూఱడించి రామ లక్ష్మణులను వానర సైన్యమును యుద్ధమున వధించెద నని పలికి సమర భూమి నదృశ్యుఁడై ఘోర శర వర్షమున బ్రహ్మాస్త్రమున బాధింప వానరులు రామలక్ష్మణులు మూర్ఛిల్లుట.

కం. హత శేషు లసురు లేఁగి త్వ
రితము దశాస్యునకుఁ జెప్పిరి త్రిశిరు తోడన్ 1.

హతు లాజిని దేవాంతకుఁ
డతికాయుఁడు రాక్షస వరు లని శోకార్తుల్

తే.గీ. క్షిప్ర మాలకింపఁగ మృతి సెంది నట్లు
రాజు సంపద్విరాజుఁడు భ్రాతల నిజ
సుతులఁ గన్నీరు నిండ నక్షులను ఘోర
తరము చింతించి ధ్యాన ముద్రను మునింగె 2.

ఉ. దీనుని రాక్షసేశ్వరుని ధీరుఁడు శోకము నందు మున్గఁగా
సూనుఁడు రాక్షసేంద్రునకుఁ జూచి మహా రథుఁ డివ్విధం బనెన్
మానుమ తండ్రి మోహము కుమారుఁడ నేనిటఁ జెంత నుండఁగాఁ
గానమె యింద్రజిచ్చర నికాయ విఘాతు స జీవ ముండఁగా 3.

ఉ. కాంచుమ రామ లక్ష్మణులఁ గాయ వికీర్ణుల నేఁడు మచ్ఛిలీ
సంచయ ఘోర పాతమున క్ష్మాతల మందు శయింప నింపుగాఁ
బంచన హీన జీవు లయి బాణము లంగము లందు నుండఁగా
నించుక కాంచ సందియము నిందు నెడందను నైరృతేశ్వరా! 4.

చం. స్థిరముగ నాలకింపుమ ప్రతిజ్ఞ మదీయము దైవ పౌరు షా
త్త రుచిర మింపు కొల్ప నెద దారుణ మార్గణ సంచయమ్మునన్
నరులను రామ లక్ష్మణుల నైపుణిఁ దృప్తిలఁ జేయు వాఁడ నేఁ
డరయుమ యింద్రజిత్తుని మహా బల సంపద రాక్ష సేశ్వరా! 5.

తే.గీ. చూతు రిప్పుడు రాజ! నీ సూను విక్ర
మమ్ము నింద్ర వైవస్వత మాధ వాన
లాశ్వి సాధ్య చంద్రార్క మిత్రాదులు బలి
యజ్ఞవాటి విష్ణుని భంగి నాజి నడర 6.

చం. అని వచనమ్ము లిట్లు త్రిదశారి దశాస్యు ననుజ్ఞ నంది యా
ఘన బలుఁ డెక్కెఁ దేరును సుఖమ్ముగ లాగఁగ గొప్ప గాడిదల్
చన వెస గాలి వేగమున సంగర మెచ్చట నుండె నట్టి చో
టునకు మహేంద్రు స్యందన పటుత్వ రథమ్మున గొప్పతేజుఁడై 7.

చం. వెడలు మహోత్కు వెంటఁ బెను విల్లుల నూని యనేకు లాసురుల్
కడు ముద మంది బల్లిదులు కయ్య మొనర్పఁ దొడంగి రేఁగఁగా
వడి వడి కొంద ఱేనుఁగుల పైనను వాజుల పైనఁ కొందఱుం
దడయక వ్యాఘ్ర వృశ్చిక వితాన ఖరోష్ట్ర భుజంగ వాహనుల్ 8.

తే.గీ. శ్వాప దాఖనిక బిడాల జంబుక మృగ
రాజ కాక మయూర మరాళ వాహ
ను లసుర వరేణ్యు లాయుధములు ధరించి
ప్రాస ముద్గర నిస్త్రింశ పరశు గదల 9.

తే.గీ. నెఱి భుశుండి యష్టులు శతఘ్ని పరి ఘాదు
లూని విక్రములు వొగడు చుండ త్రిదశ
రిపుఁడు శంఖ రవములు భేరీ ధ్వను లడ
రంగఁ గదలఁగ సంగర రంగమునకు 10.

ఆ.వె. శంఖ చంద్ర వర్ణ సన్నిభ చ్ఛత్రమ్ము
తోడ వెలిఁగె శత్రు దుర్జయుండు
పూర్ణ చంద్ర యుత నభో వీథి భంగిని
నింద్రజిత్తు రాక్షసేంద్ర సుతుఁడు 11.

కం. చారుతర చామరమ్ముల
భూరి విభూషితముల వర భూషితుఁ డంతన్
వీరుఁడు వీవఁ బడె ధను
ర్ధారులలో ముఖ్యుఁ డసుర రాజ సుతుఁ డటన్ 12.

కం. కని తరలు వానిఁ దనయుని
ఘన సై న్యావృతునిఁ బంక్తి కంఠుండు వచిం
చెను శ్రీమంతుఁడు రక్షో
ధినాయకుఁడు రావణుండు ధృతితో నిట్లున్ 13.

తే.గీ. పుత్ర! యప్రతిరథుఁడ వీవు జిత దేవ
పతివి మనుజుఁ దలప నేల పార్థుఁ డప్ర
ధృష్యుఁ డనిఁ గాఁడు చంపుదు ధీర! రాము 14.

ని నన జనకు దీవనలఁ గొనియె నతండు

కం. రవి నిభ తేజుం డప్రతి
మ వీర్యుఁ డింద్రారి యసుర మాన్యుఁడు తరలం
గ వెలిఁగె లంకా నగరము
దివి వోలె దినకర దివ్య తేజము తోడన్ 15.

ఉ. చేరి త దాహ వాంగణము చెన్నుగ నిల్పి రథమ్ము చుట్టునున్
వైరి జనాంతకుం డసుర వర్యుల నగ్ని నిభప్రభాంగుఁ డం
గారము మంత్రవాచ్యములఁ గొణుప వీరుఁడు వేల్చె భక్తినిన్
హార పటీర లాజ వర హవ్య సమర్పణ కార్య సంతతిన్ 16.

తే.గీ. ఔల్లు గడ్డి శస్త్రములు పఱిచి యినుప స్రు
వమ్ము తోమర మెఱ్ఱ వస్త్రమ్మును గొని
యగ్ని వెలిఁగింప నల్లని దైన మేఁక
జీవములఁ బట్టె నసురుండు శీఘ్రముగను 17.

కం. ఒక్కుమ్మడి నట మంటలు
సక్కఁగ పొగ లేక లేచి సమిధల నంతన్
వెక్కస మగు జయ చిహ్నము
లక్కజముగను బొడచూపె ననలము నందున్ 18.

కం. సుడులు తిరుగు జ్వాలలను బ
సిఁడి చాయల వెలుఁగు వహ్ని చిత్రమ్ముగఁ దా
వడి లేచి స్వయమ్ముగ హవిఁ
బడసెను దమిఁ బావకుండు పరమ ప్రీతిన్ 19.

తే.గీ. అంత నింద్రారి రప్పించి యద్భు తాస్త్ర
వరము బ్రహ్మాస్త్రమును దనదు రథమును ధ
నుస్సు మంత్రింప నింపుగను బరమాస్త్ర
మంత్రముల నింద్రజిత్తా సమయము నందు 20.

ఆ.వె. అస్త్ర వరము నసురుఁ డట్టు లాహ్వానించు 21.

చుండ నగ్ని వేల్చు చుండ నపుడు
నభము సూర్య చంద్ర నక్షత్రముల గ్రహ
ములను గూడి వణఁకె విలయ గతిని

తే.గీ. ఇంద్ర సదృశప్రభావుఁడు నిద్ధ పావ
కాభ దీప్త తేజుఁడు మాయ మయ్యె వేల్చి
యగ్నిఁ జాప బాణాసి రథాశ్వ సూత
సహిత మాకాశ మందు నసదృశ బలుఁడు 22.

ఉ. అంత పతాక సధ్వజ రథాశ్వ సమావృత రాక్ష సోగ్ర దు
ర్దాంత బలమ్ము సాగె నినదమ్ము లొనర్చుచుఁ జేయ యుద్ధముం
బంతము నూని బాణముల వానర వీరులఁ దోమ రాంకు శా
త్యంత శితమ్ములం జెలఁగి యందఱిఁ గొట్టిరి యాజి రక్కసుల్ 23.

చం. రతిఁ గని యా నిశాచరుల రావణి క్రుద్ధుఁడు వల్క నివ్విధిన్
వితత ముదమ్ము నంది హరి వీరుల గెల్వఁగఁ బోరు సల్పుఁడీ
పతి గిర లాలకించి శర వర్షమునుం గురియించి రా ప్లవం
గ తతినిఁ గాంచి యార్చుచును గయ్యము నందు భయంకరమ్ముగన్ 24.

కం. తా నింద్రజిత్తు సమరము
లోనసురులఁ గూడి వానరులఁ గొట్టెను నా
నా నాళీక ముసల శ
ల్యానేకమ్ముల గదా ప్రహారముల తోడన్ 25.

కం. ఘన తాడితులై సంగర
మున సాలాయుదులు హరు లపుడు ద్రుమ వర్ష
మ్మును శైలవర్షము నసుర
ఘను రావణిపైఁ గురిసిరి గ్రన్ననఁ గినుకన్ 26.

చం. ప్లవగుల నింద్రజిత్తు గని వారక క్రుద్ధుఁడు బల్లిదుండు వీ
ర వరుఁడు రావణాత్మజుఁడు వ్రయ్య నొనర్చెను గాత్ర రాశినిన్
బవరము నందు నొక్క శిత బాణ వరమ్మున నేడ్గు రేవురన్
నవ కపి సంచయమ్ము పెస నాశ మొనర్చె నెలర్ప రక్కసుల్ 27.

తే.గీ. సూర్య సంకాశ శరము లసుర వరుండు
వేసి స్వర్ణ భూషితముల నా సమర సు
దుర్జయుండు బాధించెను దోరముగను
వానరప్రవరుల నెల్ల వాస వారి 28.

తే.గీ. వారు తెగి నట్టి మేనుల బాణ జాల
పీడితులు కపి వీరులు వీత నిశ్చ
యులు పుడమిఁ గూలి రపు డార్తి సెలఁగ సురల
చే నసురు లాజిఁ గూలిన చెన్ను దోఁప 29.

కం. శరముల నాదిత్యచ్యుత
కిరణ నిభమ్ములఁ దపింపఁ గెరలుచు ఘో రా
సురుఁ డింద్రజిత్తు వెస వా
న రర్షభులు వాని మార్కొన దుమికి రాజిన్ 30.

తే.గీ. అంత నెల్ల వానరులు నిజాంగములు తె
గఁ దెలివి నశింపఁ దడిసి రక్తమ్ము నందుఁ
గలఁతఁ బాఱ రామార్థము పొలిసి రాజిఁ
బెనఁగి మరలక పరులు సూపి దిట వార్చి 31.

ఉ. వానరు లద్రి శృంగములఁ బాదప ఘోర శిలాచయమ్ములన్
వాన కురింప నింద్రజితుపై వృతులై సమరమ్ము నందు న
వ్వానను బ్రాణ నాశకము భగ్నము సేసె నిశాచరుండు తే
జానఁ జెలంగి రావణి యశక్యుఁడు గెల్వ రణాన సేరికిన్ 32.

తే.గీ. అంత నగ్ని సన్నిభముల నంబకముల
సర్ప నిభములఁ గపి సేన దర్ప మడఁచి
పదునెనిమిది శరమ్ముల బాదె గంధ
మాదనునిఁ దొమ్మిదిట నలు మసల నవల 33.

ఉ. మైందుని నేడు బాణములు మర్మ విదారము లేసి గొట్టి తా
నంది శరమ్ము లైదు గజు నంతట మొత్తి నిశాచరుండు పే 34.

కుందఁగ జాంబవంతుఁ డని ఘోర దశాంబక ఘాతుఁ జేసి యా
క్రందులఁ జేసె నంతఁ గపి కాంతుని నంగదు వాడి ముల్కులన్

తే.గీ. నీలు ముప్పది యమ్ములఁ గూలఁ జేసి
ఋషభు ద్వివిదుని దత్త వరేద్ధ మార్గ
ణమ్ముల నడిచి కిన్క రణమ్ము నందుఁ
బ్రాణములు లేని వారిగ వారిఁ జేసె 35.

తే.గీ. అన్యులను గూడఁ గినిసి ముఖ్య ప్లవగుల
నమ్ముల ననేకములను గాలాగ్ని వోలె
నాజిఁ బీడించె మథియించె హరుల సేన
నర్క నిభ శీఘ్ర గాముల నంబకముల 36.

కం. శర జాల పీడితమ్ము రు
ధిరోక్షితమ్ము హరి సేన దీనమ్మును గాం
చి రహి సెలంగ హృది నిశా
చరుండు సంప్రీతుఁ డయ్యె సమరం బందున్ 37.

చం. తిరిగి శరాస్త్ర వర్షమును దిట్ట తనమ్మున నింద్రజిత్తు వా
నర వర సేనపైఁ గురిసె నైరృత నాథ కుమారుఁ డాజి భీ
కరముగ నొంచె వానరులఁ గన్పడ కేరికి వీడి సైన్యమున్
గురు తర నీల వారిదము కుర్యు విధమ్ముగ గుప్పి బాణముల్ 38.

తే.గీ. రావణి శర సంచయ వికీర్ణ నిజ తనులు
హరులు మాయా విమోహులు నఱచి వికృత
ముగ పడిరి ధరాధర సన్నిభు లవని పయి
వజ్రి వజ్రాభిఘాత పర్వతముల వలె 39.

ఆ.వె. వానర వర సేన లోనఁ వాడి శర సం
చయము మాత్ర మరయఁ జాలి రసుర
వీరు నింద్ర జిత్తు ఘోర మాయా మయుఁ
గాంచఁ జాల రైరి యించు కేని 40.

తే.గీ. అతుల తేజస్వి రక్షోஉధిపతి మహాత్ముఁ
డంత దిక్కుల నింపె శితాగ్ర శరము
లర్క కాంతి సన్నిభముల నడరి వేసి
వాన రేంద్రుల బాధించె భండనమున 41.

తే.గీ. శూల ఖడ్గ పరశ్వథ జాల మగ్ని
దీప్తములు నిప్పురవ్వలు తేటపడగ
మంటలు జ్వలించు చుండఁగ మర్కట వర
సేన పైనఁ గురిసె నింద్రజిత్తు సెలఁగి 42.

కం. జ్వల నాభ శక్ర జిచ్చర
ముల నవ్విధిఁ గొట్టఁ బడఁగఁ బోరునఁ బ్లవగ
మ్ములు వికసించిన కింశుక
ముల వలె యోధులు వెలిఁగి రపుడు చిత్రముగన్ 43.

కం. కదియుచు నొక్కరి నొకరు ని
నదించుచు వికృత రవముల నగచరు లాజిన్
విదళితులై రావణిచేఁ
గదల నశక్యు లయి పడిరి క్ష్మాతల మందున్ 44.

ఆ.వె. కాంచు చుండ నింగిఁ గపి వీరు లన్యులు
కొంద ఱకు లందు ఘోర సాయ
కములు దాఁక నొచ్చి కదిసి యొండొరులను
బతితు లైరి పుడమి పైనఁ గలఁగి 45.

సీ. హనుమంతు సుగ్రీవు నంగదు గంధమాదను జాంబవంతు మైందుని ద్వివిదుని
వేగదర్శి సుషేణు నా గవాక్షుని గవయుని నీలుఁ గేసరిని నలుని హరి
లోముని విద్యుదంష్ట్రుని జ్యోతి ముఖుని సూర్యాననుు దధిముఖు హరుని పావ
కాక్షునిఁ గుముదుని హరి గజు గోముఖుఁ బ్లవగుల నెల్ల మంత్ర యుత మింద్ర
తే.గీ. జిత్తు బాధించి ప్రాస నిశిత శర తతి
శూల పరమాయుధమ్ముల నాల మందు
గదలచే రఘురాము లక్ష్మణుని తోడ
భాస్కరాంశు నిభ శిఖుల బడలఁ జేసె 46.

కం. పర మాద్భుత సంపద్రఘు
వరుఁ డమ్ముల వాన మునిఁగి వసుధాధర ని
ర్ఝర ధారా సదృశమున బె
దరక నలుగడఁ గని పలికెఁ దమ్ముని తోడన్ 47.

ఉ. రావణి యాశ్రయించి యిట బ్రహ్మ వరాస్త్రము నింద్ర శత్రువే
యీ వర వానరధ్వజిని నిత్తఱిఁ గూల్చి మహోగ్ర సైన్యముం
జేవ సెలంగ బాణముల ఛిన్నము సేయుచు నున్నవాఁ డహో
దేవ రిపుం డనిన్ మనల దిట్టతనమ్మునఁ గంటె లక్ష్మణా! 48.

తే.గీ. ఉద్య తాస్త్రుఁ డీ యింద్రజిత్తుగ్రుఁ డాజి
బ్రహ్మ వరదత్త వీరుఁడు రణము నందుఁ
గనఁ బడని వీని గెల్వ శక్య మగు సెట్లు
మనకుఁ జింతింప వలయు లక్ష్మణ! భృశముగ 49.

ఆ.వె. ఎవ్వరు విభుఁ డగునో యీ యస్త్ర రాజము
న కతఁడు సుర వరుఁడు నలినజుఁడు స్వ
యంభువుం డచింత్యుఁ డంచుఁ దలఁతు బాణ
పాతము సహియింప వలయు మనకు 50.

ఉ. వానినిఁ గప్పనిమ్మసుర వర్యుని సాయక వృష్టిచే ఘనున్
వానర రాజ సైన్య మని భాసిల కున్నది యగ్ర శూర సం
తానము గూలఁ దా నరసి ధాత్రిఁ బడన్ మనలన్ నివృత్తులం
గానక హర్ష రోషములు గ్రమ్మఱు లంక కజేయుఁ డై వెసన్ 51.

తే.గీ. అంత నింద్రజి దస్త్ర చయార్తు లైరి
వారు రామ లక్ష్మణులు బవరము నందు
మిక్కుటముగ బాధించి యమేయ బలుఁడు
శక్ర జిత్తఱచె ననిలో సంతసమున 52.

తే.గీ. భృశము పీడించి వానర వీర సేన
నింక రామలక్ష్మణులను నంక మందుఁ 53.

బొగడ నసురులు దశకంఠు పురము సొచ్చి
జనకున కెఱిఁగించె మురిసి తనదు జయము

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు డెబ్బది మూడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 74.

రామలక్ష్మణుల సహితము వానర సైన్య మింద్రజిత్తుని యస్త్రములకు మూర్ఛిల్ల సుగ్రీవ నీలాంగద జాంబవంతులకు దిక్కు తోఁపకున్న విభీషణుఁ డూఱడింప జాంబవంతుని యాదేశానుసారము హనుమంతుఁడు హిమాలయమున కేఁగి దివ్యౌషధము లున్న పర్వతమును దీసికొని రాఁగ నౌషధముల వాసన సోఁకఁగా నెల్లరు స్వాస్థ్యము లందుట.

కం. వా రనిఁ బీడింపఁ బడఁగ
ఘోరముగఁ బ్లవంగ సేన గూలెను మూర్ఛన్
సేర రట జాంబవంతుఁడు
సౌరియు నీ లాంగదులును జలుపఁ దగు పనుల్ 1.

తే.గీ. అంత విబుధుల శ్రేష్ఠుండు వంత మునిఁగి
నట్టి వానర రాజ సైన్యమ్ము నెల్లఁ
గాంచి యవ్విభీషణుఁడు సమంచిత వచ
నముల నూఱడించెఁ దమి వానర వరులను 2.

ఉ. ఆర్య కుమారు లిద్దఱు స్వయంభువు వాక్యము లాదరించి యాం
తర్యము లందు నెంచి వశతం దగ దుఃఖితు లైరి రాఘవుల్
శౌర్య ధనాఢ్యు లివ్విధము శక్రజి దుగ్ర త రాస్త్ర ఘాతులై
కార్యము కాదు భీతిలఁగఁ గాలము కాదు విషాద మందఁగన్ 3.

చం. ఒసఁగెను బ్రహ్మ యాతనికి నుత్తమ బ్రాహ్మ మమోఘ వేగమున్
విసరఁగ నా మహాస్త్రమును వీరుల నుత్తముఁ డింద్రజిత్తనిం
బస చెడి నట్లు వ్రాలఁగను బార్థ కుమారులు గౌరవమ్ము నూ
ని సమయమే తలంప నిది సెవ్వగ నందఁగ మీకు నివ్విధిన్ 4.

తే.గీ. అంత ధీమంతుఁ డైనట్టి హనుమ లేచి
మున్ను మన్నించి బ్రహ్మాస్త్రమును విభీష
ణు వచనమ్ముల నాలకించి వెసఁ బల్కె
రాక్షసేంద్రునితో నిట్లు రమ్యముగను 5.

తే.గీ. ఎవ్వ రెవ్వ రస్త్రమ్ముల నొవ్వి యుండి
రసువులు వహించి వారిని నాశ్వసింత
మసుర వర్య! యన నిసిని నయ్యిరువురు
నూని కాగడాలు పెదకి రుత్సహించి 6.

ఉ. చూచిరి నేల నిర్వురును శోణిత మూత్ర విసర్జితప్లవం
గాచితమున్ విఖండిత వరాంగుళి వాల పదోరు హస్తముల్
కాఁచుల తోడ గ్రీవములు గాత్రము లచ్చట నుండ గుట్ట లు
గ్రాచల తుల్య వానర మహా నిచయంబును వ్రాలి యుండఁగా 7.

కం. సమ రావని వీక్షించిరి
గముల్లై పడ దీప్త శస్త్ర కాం డావలినిన్
విమలాత్ముఁ డసుర వర్యుఁడు
సమీరణ సుతుం డఖిల దిశలను దిరుగుచున్ 8.

ఉ. పావని యవ్విభీషణుఁడు వాలికుమారు గవాక్షు నీలు సు
గ్రీవు సుషేణు మైందుఁ బరికించిరి సద్వివిదున్ నలున్ పెతన్
ధీవరు నాహుకున్ శరభు ధీరుఁడు నాపన సాఖ్యుఁ గార్య స
ద్యో విదు గంధమాదనుని జ్యోతిము ఖాఖ్యుని వేగదర్శినిన్ 9.

తే.గీ. బ్రహ్మ వల్ల భాస్త్రమ్మునఁ బగటి యైద
వ దగు భాగ శేషమ్మున బల్లిదులు ప్ల
వగులు కో ట్లఱువది యేడ్గురు గతి యించి 10.

రాజిలో దారుణమ్ముగ నసురు చేత

కం. హనుమ విభీషణు తోడఁ జ
ని నిశిత తర సాగరౌఘ నిభ బాణములం
దనువులు కూలిన బలమునఁ
గన వెదకెను జాంబవంతుఁ గపి వరుఁడు తమిన్ 11.

చం. ముసలితనమ్ము మీఱఁగను ముల్కులు వందలు బాధ నీయఁగాఁ
బస సెడ బ్రహ్మ నందనుఁడు పావకు భంగి శమింప వృద్ధుఁడే
వెసఁ గని యా పులస్త్యు కడు పేరిమి సూనుఁడు సేరి చెంతకున్
మసలక పల్కె వాక్యములు మన్నన తోడుత నిర్వ్యథమ్ముగన్ 12.

తే.గీ. ఆర్య! తీక్ష్ణ శిఖుల ఋక్ష వర్య! ధ్వంసి
తములు గావుగా నీదు ప్రాణము లన విని
యవ్విభీషణు పల్కుల నతఁడు కష్ట
తరముగా నుచ్చరించుచు గిరలు వలికె 13.

కం. విని వీర! నీదు స్వరమును
నిను గుర్తించితిని యసుర నిచయశ్రేష్ఠా!
కనఁ జాలను బీడింపఁగ
సునిశిత శర జాలము నను సుంతయు కనులన్ 14.

తే.గీ. ఎవనిఁ గని యంజనా సతి యింక వాయు
వును సుపుత్ర యుతు లయిరి పుణ్య చరితు
లట్టి హనుమంతుఁ డసురేంద్ర! యసువు లూని
కలఁడె వానర శ్రేష్ఠుండు కదన మందు 15.

కం. విని జాంబవంతు వాక్యము
ల నడిగెను విభీషణుండు రఘు నందనులన్
ఘనుల నడగ కిట్లేలను
హనుమంతు నడిగెద వంచు నాశ్చర్యముగన్ 16.

ఉ. వానర రాజు నందయిన వాలి కుమారుని యందు నైననున్ 17.

మానవ నాథు నందయిన మానిన నీ దగు స్నేహ మెల్లనున్
వానర ముఖ్యుఁడౌ హనుమ పైఁ గురియించెద వక్కజమ్ముగన్
మానక యేల చెప్పు మయ మారుతి నెన్నెడు కారణమ్మునున్

కం. ఆ రాక్షసు పల్కులు విని
యా ఋక్ష పతి వచియించె నాతని కిట్లున్
మారుతి నేల యడిగితినొ
నైరృత వర! యాలకింపు నా వచనములన్ 18.

ఉ. మారుతి యున్న జీవముల మల్లుల సైన్యము సంపఁ బడ్డ ని
ర్ధారుణిఁ జావ నట్లగు నతండు నశించిన జీవ మున్ననున్
నేరుమ కూలి నట్టులనె నిక్కము నెంచినఁ దుల్యుఁ డగ్నికిన్
మారుత వేగ సన్నిభుఁడు మంచిగ నున్న వహింతు మాశలన్ 19.

ఉ. అంత సమీప మేఁగి వినయమ్మునఁ బాదము లంటి మ్రొక్కె ధీ
మంతుఁడు జాంబవంతునకు మారుత సూనుఁడు జాంబవంతుఁడే
సంతస మంతరంగమున జాదు కొనంగఁ దలంచెఁ దిర్గి తా
వింతగఁ బుట్టి నట్లు కపి వీరుని మాటలు సోఁక వీనులన్ 20.

ఆ.వె. అంత జాంబవంతుఁ డా హరి వీరుని
తోడఁ బల్కె నిట్లు దోర్బలుండ!
రమ్ము వేగ వానరర్షభ! కావ న
ర్హుఁడవు నీవు వానరోత్కరమును 21.

ఉ. శూర వరేణ్య! విక్రమము సూపగఁ జాలుదు వీవ వీరికిన్
వీరులఁ గాంచ నన్యులను వీరికి యుక్త సఖుండ వీ విటన్
మూరి చెలంగఁ గాల మిది బోరన నీకుఁ బ్లవంగ సత్తమా!
వీరి కొసంగుమా ముదము వృక్ష చరాలికి ఋక్ష కోటికిన్ 22.

కం. హరి వీర విశల్యులుగ నొ
నరింపుమ రఘూత్తములను నరపుంగవులన్
శర జాల సాదితుల పే
గ రామలక్ష్మణులను రథిక వరోత్తములన్ 23.

తే.గీ. కడలి పైపైనఁ జరియించి కపి వరేణ్య!
పర్వతశ్రేష్ఠ మా హిమవన్నగమును
జేరి యుగ్ర ఋషభముఁ బసిండి నగముఁ
గనుమ కైలాస శిఖరమ్మును నరి దమన! 24.

తే.గీ. కాంతు వచట సర్వౌషధి కలిత సుంద
రౌషధి నగ వరమ్మును ననుపమప్ర
భల వెలుంగు దాని శిఖరముల నడుమను
వాయు నందన! వానర వర్య! యందు 25.

ఆ.వె. మూర్ధ సంభవములు ముఖ్యౌషధులు నాల్గు
దీప్తములు దగ దశ దిశలను వెలి
గించు చుండు నిత్య మంచితముగ నంజ
నా కుమార! యేఁగి వీఁకఁ గనుమ 26.

తే.గీ. అడరఁగ మృత సంజీవని యన విశల్య
కరణి యనఁగ నింక సువర్ణ కరణి యనఁగఁ
గపివరోత్తమ! సంధాన కరణి యనఁగ
నాలు గోషధుల గ్రహించి వ్రాలు మిచట 27.

ఆ.వె. ఊఱడింపు హరుల నుసురు లొసఁగి యన
జాంబవంతు నా వచనములు విన
ఘోర బలము చేతఁ బూరింపఁ బడెఁ గపి
యుదక రయము చేత నుదధి వోలె 28.

కం. పర్వత తటాగ్ర మందు న
ఖర్వ బలుండు నిలిచి ఘన కపి పీడింపం
బర్వతమును దా రెండవ
పర్వతము పగిది స్ఫురించె వాతాత్మజుఁడే 29.

చం. అదుమఁ బడంగ శైలము మహాకపి పాదములన్ భృశమ్ముగా
నదరి భరింప లేక వెస నంతటఁ గ్రుంగెను విస్మయమ్ముగం 30.

బదపడి రాలి నేలను ద్రుమమ్ములు మండెను వేగ ధాటికిం
గదలుచుఁ బీడనమ్మునను గ్రన్నన భగ్నము లయ్యె శృంగముల్

చం. హరివరుఁ డొత్తఁగా విఱిఁగి నట్టి శిలా ద్రుమ రాజి యున్న యా
ధర చలియించు చుండ వితతమ్ముగ శైలము నందు నిల్వఁగా
హరుల కశక్య మయ్యెఁ గడు నత్తఱి రేయిని లంక భగ్న గో
పురముల నూఁగు ద్వారములఁ బొల్చె సభీతి నటించు భంగినిన్ 31.

ఆ.వె. శైల సన్నిభుండు శైలము నట్లు పీ
డించి వాయుజుండు మించి పుడమి
సార్ణవమ్ము నెల్ల నాంజనేయుండు చ
లింపఁ జేసె హరి వరేణ్యుఁ డపుడు 32.

సీ. ఆ త్రికూట నగము నందున్న మలయ పర్వతము మేరు నగ నిభమ్ము మంద
రాభము ప్రస్రవ ణాకుల నానా ద్రుమ లతా విలసితమ్ము నలిన కువల
యాలంకృతమ్ము నిత్యామర గంధర్వ విద్యాధర మునీంద్ర వితతి సేవి
తం బప్సరో వనితా నిషేవిత మఱువది యోజనముల యెత్తది కనఁబడ
తే.గీ. నెక్కె నానా మృగ విహార ణోద్ధ కంద
రమ్ము నాకుల పడఁగఁ గరమ్ము కిన్న
ర జన యక్ష గంధర్వ లభ్ర సదృశుండు
పెంచె దేహము హనుమంతుఁ డంచితముగ 33.

తే.గీ. చరణ యుగ్మమ్మున నదిమి శైల వరము
బడబ ముఖముఁ బోలు ముఖము వాయుజుండు
తెఱచి నినదించె మానిసి దిండు లడలఁ
గదలఁ జాల రసురులు లంకాపురమున 34.

కం. కడలికి నమస్కరించుచు
నెడంద గురు విక్రముం డహిత వీర తపుం
డడరి రఘువీరు పనికై
వెడల సమాహితుఁడు నయ్యె వేగిరపడుచున్ 35.

తే.గీ. ఘణి నికాశ వాలము నెత్తి వంచి నడుము 36.

చెవుల నిక్కించి బడబా రుచిర ముఖాభ
నిజ ముఖమ్ముఁ దెఱచి యంత నింగి కెగిరెఁ
జండ వేగమ్మునఁ బ్లవగ సత్తముండు

తే.గీ. ప్లవగు బా హూరు వేగమ్ము లాగ నెగిరి
శైల తరుశిలా ప్రాకృత నీలకములు
వాని ననుసరించి తరలి వార్ధి జలము
నందుఁ గూలె వేగము క్షీణ మైన కతన 37.

ఆ.వె. చాచి భుజగ భోగ సన్నిభ భుజములు
సర్ప శత్రు వీర్య సన్నిభుండు
హిమ గిరికిఁ దొడంగె నేఁగంగఁ దన వైపు
దిశల లాగు చున్న తీరు దోఁప 38.

తే.గీ. చూచుచుఁ గడలిని నలల సుడు లలరెడు
దాని జల సత్త్వములు దిర్గు దానిఁ ద్వరిత
గతిని నేఁగఁ దొడంగె మారుత సుతుండు
హరి కర విముక్త చక్రము కరణి నడరి 39.

కం. గిరులను బక్షి గణమ్ముల
సరోవరముల నదుల జన సముదాయములం
బురములఁ జెఱువులఁ గాంచుచు
నరిగెను బితృ తుల్య వేగుఁ డంబర వీథిన్ 40.

కం. శ్రమ లేక పితృ నిభ పరా
క్రముండు హనుమంతుఁ డేఁగె రవి మార్గమునన్
గమకించి వీరులం దు
త్తముండు త్వరితముగ ననిల తనయుఁడు గిరికిన్ 41.

కం. హరి శార్దూలుఁడు మారుతి
యరిగెను మారుత జవమున నాశల నెల్లన్
విరివిగ నింపి రవమ్ముల
స్మరించి యెద జాంబవంతు మాటల నెల్లన్ 42.

చం. వడిఁ జని యంతఁ గాంచె హిమవంతము మారుతి భీమ వేగవం
తుఁడు బహు కందరమ్ము సిత తోయద సంచయ సన్నిభమ్ము న
య్యెడ శిఖరావృతమ్ము విమ లేద్ధ జలస్రవ నిర్ఝ రాద్రి వీ
రుఁడు హరి శైలరాజము విరోధి జనఘ్నుఁడు సుంద రాద్రినిన్ 43.

తే.గీ. తాఁ జని వెస నానావృక్ష రాజితం బ
తిప్రవృద్ధ ఘోర శిఖర మప్రతిమము
సుర ఋషి నిషేవతమ్మును సుంద రాశ్ర
మ సువిరాజితమ్ము గనె హిమ నగవరము 44.

ఉ. కాంచెను బ్రహ్మకోశమును గాంచెను వెండి నగమ్ము రుద్రుఁ డే
తెంచి నిజాంబకమ్ములను దించిన చోటు హయాననస్థలిం
గాంచెను శక్రు నాలయము గాంచెను బ్రహ్మ శిరమ్ము దీప్తముం
గాంచెను సూర్య కింకరులఁ గాంచెను వైశ్రవ ణాలయమ్మునున్ 45.

తే.గీ. కాంచె వజ్రాలయమ్మును గాంచె సూర్య
బంధనమ్ముఁ బ్రభాకర ప్రభను శంక
ర వర కార్ముకమ్మును గాంచె బ్రహ్మదేవు
పీఠ మరసెఁ గాంచె ధర నాభి స్థలమ్ము 46.

తే.గీ. కాంచెఁ గైలాస శైలము గాంచె హిమ శి
లలను గాంచె నా ఋషభ పర్వతము గాంచెఁ
గాంచన నగ వరమ్మును గాంచె నోష
ధి గణ దీప్త సర్వౌషధి నగ వరమ్ము 47.

ఉ. వాసవ దూత నందనుఁడు వహ్ని నికాయ లసద్రుచిప్రభా
భాసము గాంచి విస్మయము పన్నుగ నంది నెడంద శైల మం
దాసఁ జరించి యోషధుల నాత్రమునన్ వెదకం దొడంగెఁ దా
నాసల నెల్ల నోషధి మహాద్రిని మించఁగ వేయి యామడల్ 48.

ఆ.వె. తమ్ముఁ గోరు వారు తరలి రంచు నెఱింగి
పర్వతమ్ము నందుఁ బరఁగు దివ్య 49.

ము లగు నోషధి వరములు మాయ మైనవి
కాన రాక యుండెఁ గపి వరునకు

ఆ.వె. అవ్విధమ్ముగఁ బర మౌషధుల నరయ
కున్నఁ గినిసి యంత నుగ్రుఁడై క
రమ్ము వలికె హనుమ యమ్మహాత్ముఁడు జ్వలి
తాగ్ని సన్ని భాక్షుఁ డద్రి తోడ 50.

కం. దయఁ జూప వేల రాముని
పయిఁ బర్వత రాజ!నాదు బాహుల భగ్నం
బయి కూలఁ గాంచ నెంతువె
భయంకరముగ నని కిన్క వాయుజుఁ డంతన్ 51.

తే.గీ. అంత స తరు సనాగ గజాలిఁ గూడి
పసిడి ధాతువులను గూడి భగ్న భీమ
కూటములఁ బ్రజ్వలిత సాను కోటిఁ బట్టి
పర్వతమ్మును బెకలించి వాత సుతుఁడు 52.

కం. పెకలిచి గిరి నింగి కెగిరి
సుకరముగ జగమ్ము లసుర సుర సంఘాత
మ్ము కలంగ స్తుతింప ఖచరు
లు కపి గరుడు వేగమున గురు బలుం డేఁగెన్ 53.

కం. కొని భాస్క రాభ శిఖరము
చని భాస్కర పథమున రవి సరస వెలిఁగె భా
ను నిభాని లాత్మజుం డటఁ
గన రెండవ భాస్కరుఁ డనఁగ నిజప్రభలన్ 54.

కం. గిరితో గంధవ హాత్మజుఁ
డురు వేగమునఁ జనుచుండ నుగ్రానలపుం
టరినిన్ సహస్ర ధార న
డరి యూనిన విష్ణు వన నడరెను భృశముగన్ 55.

తే.గీ. వాని వీక్షించి యఱచిరి ప్లవగు లెల్ల
వారిఁ గని యార్చె నెద ముదమార హనుమ
వీర లిట్లార్వ లంకలో వీర వర్యు
లాలకించి యఱచిరి భయావహముగ 56.

ఆ.వె. అమ్మహోత్ముఁ డంత నాశైల వరమునఁ
బ్లవగ సేన మధ్యఁ బన్నుగ దిగి
వందనమ్ముఁ జేసి వానరోత్తములకు
కౌఁగిలించెను దశకంఠు ననుజు 57.

తే.గీ. అమ్మహౌషధ గంధమ్ము నన్నరేంద్ర
సూను లిర్వు రాఘ్రాణించి చోద్యముగ వి
శల్యు లైరి యవ్వానర సత్తములును
లేచి రన్యు లెల్లరును దెలివి వహించి 58.

తే.గీ. క్షణమున నిహతు లైనట్టి కపి వరేణ్యు
లెల్ల వ్రణము లణఁగ రుజ లెల్లఁ దొలఁగ
నోషధుల వాసన వలన నుర్వి నుండి
లేచి రెల్లరు నిద్రించి లేచి నట్లు 59.

ఉ. వానర ఘోర రాక్షసుల భండన మైన దినమ్ము నుండియున్
వానర కోటి ధాటికి నవారిత రీతిని నాజి లంకలో
మేనులు గూల రక్కసుల మీన మహాలయ మందుఁ ద్రోసి రా
మానిసి దిండ్లు రావణుఁడు మానము నెంచి యొసంగ నాజ్ఞనున్ 60.

కం. హరి గంధవ హాత్మజుఁ డా
గిరిఁ దిరిగి హిమాద్రి నుంచి కేళీ లీలన్
మరలి రయమ్మునఁ జేరెను
నరేంద్రు రాముని సరస మన మలర నంతన్ 61.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు డెబ్బది నాలుగవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 75.

సుగ్రీవుఁ డంత హనుమంతునితో లంకా నగరము దహింప నాజ్ఞాపింప వానరు లెల్లరు కాగడాలతో నా పురమును దహింప రావణుఁ డాగ్రహించి కుంభ నికుంభులను రాక్షస సేనతోఁ బంప వానర రాక్షసుల మధ్య ఘోర యుద్ధము జరుగుట.

కం. హరిపతి సుగ్రీవుఁ డలిగి
గురు తేజం డర్థ వచన కోవిదుఁ డంతన్
మరు దాత్మజుండు నేరఁగ
గిర లింపుగ నిట్లెదఁ బరికించి వచించెన్ 1.

తే.గీ. కుంభకర్ణుండు సూనులు గూల నాజి
రావణుం డీయఁ జాలఁడు రణము నింక
కాగడాలు గ్రహించి వేగమున మించు
బల్లిదులు హరు లీ లంక పైపు పాఱి 2.

తే.గీ. సింహ సంకాశు లెల్లరు సేరి రావ
ణాలయమ్మును గాల్పఁగ నరుగ నొప్పు
నన విని హరులు దినకరుఁ డస్తమింప
నిశిని నుల్కల తోడఁ జనిరి నగరికి 3.

చం. కరములఁ గాగడా లడర గ్రన్నన దిక్కులఁ బర్వు లెత్తుచున్
హరి వరు లాక్రమింపఁగ మహాసురు లారసి దేశ రక్షకుల్
పరువిడి రెల్ల భీతిలి యపారము ఘోర విరూప లోచనుల్
మురిసి కరమ్ము డెందములఁ బోవు నిశాచర కోటిఁ గాంచుచున్ 4.

తే.గీ. గోపురమ్ముల వీథుల గొందు లందు
నట్టడుల నింక వేశ్మమ్ము లందు నగ్ని
నుంచి రసుర వీరుల గృహ సంచయములఁ
బర్వ తాభ సౌధమ్ములు నుర్విఁ గూలె 5.

చం. అగరులు మంచి గంధములు నచ్చట మౌక్తిక రత్నవజ్రముల్
పగడము లున్ని బట్టలును బాండు దుకూలము పట్టు బట్టలున్
నగలు మహాయుధమ్ములు ఘనమ్ముగఁ గాలిన వెల్ల భాండముల్
సు గజ గళాభ్ర భూషలును సుందర వాజి పరిచ్ఛదమ్ములున్ 6.

తే.గీ. అరదపుఁ దొడుగులు కరుల యశ్వముల క
వచము లా డాలులు భట కవచము లింక
ఖడ్గ తోమ రాంకుశ బాణ కార్ముకములు
శక్తులును నారు లెల్ల భశ్మమ్ము లయ్యె 7.

తే.గీ. అగ్ని దహియించె రోమజ వ్యాఘ్రజ వర
వాల జాండజములఁ బెక్కు మేలి ముత్య
ముల మణుల నస్త్ర సంచయముల విచిత్ర
వివిధ గృహముల గృహగర్ధి వేశ్మములను 8.

చం. కనక విచిత్ర వర్మ ధర కమ్ర వరాంబర దామ ధారులన్
ఘన మద సక్త చిత్తుల నఖర్వ సురా చలితాక్షులన్ దహిం
చెను రిపు జాత రోషులను స్వీయ కళత్ర దుకూల హస్తులన్
సునిశిత శూల ఖడ్గ కర శూరుల భీమ గదా ధ రాదులన్ 9.

ఉ. త్రాగెడు వారి నింక తిను రక్కసులన్ నిదురించు వారినిన్
బాగుగ శయ్య లందుఁ బ్రియ భామల తోడుత నింక భీతితో
వేగమ పుత్ర యుక్తముగ వేదన మీఱఁగఁ బాఱు వారినిం
గాఁగఁగఁ జేసె లంకఁ గల కౌణప సంతతి మండి మాటికిన్ 10.

తే.గీ. అర్ధ చంద్ర చంద్రాకార వర్ధనములు
సారవంత మహార్ఘ వేశ్మములు చిత్ర
కాంచన గవాక్ష తల్పయుక్తమ్ములు మణి
విద్రుమ విలసితమ్ములు విన్ను నంటి 11.

ఆ.వె. వెలయఁ గ్రౌంచ బర్హి వీణా నినాద భూ
షణ గణ రవములును సంతరింప 12.

శైల సన్నిభముల సౌధ రాజమ్ముల
సెల్ల నగ్ని కాల్చె సెల్ల దిశల

కం. అన లావృత తోరణములు
ఘనమ్ముగ వెలింగె నపుడు కనలుచు ఘర్మ
మ్ము న వర్షిల్లెడు సౌదా
మనీ సహిత మేఘ పంక్తి మాడ్కిని఼ గాంచన్ 13.

కం. అన లావృత సౌధమ్ము ల
వని఼ గూలెను జూచు చుండ వజ్రి నిశిత వ
జ్ర నిపాతమ్మున఼ గూలిన
ఘన గిరి శిఖరమ్ముల వలె఼ గ్రన్నన లంకన్ 14.

తే.గీ. ఇండ్ల నిదురించు చున్నట్టి యింతు లెల్ల
నొంటి నున్నట్టి నగలెల్ల నూడ఼ గాలు
చుండి యార్తి హా హా యని సుదతు లార్చి
రంత నుచ్చస్వరమ్ముల నడలు మీఱ 15.

తే.గీ. కాలు చున్నట్టి వవి యెల్ల఼ గాంచ నిల్చి
కరము దూరమ్ము నుండి ప్రకాశితమ్ము
లై కనం బడె నంత దీప్తౌషధ యుత
హిమగిరి శిఖరముల భంగి సెల్లరకును 16.

ఆ.వె. జ్వాలల జ్వలియించు సౌధ శృంగమ్ములు
రాత్రిని఼ గనిపించె లంక లోప
ల వికసించి నట్టి రమ్య కింశుక వృక్ష
సంచయమ్ము పగిది మించి ప్రభల 17.

తే.గీ. కుంజ రాధ్యక్ష వర ముక్త కుంజరములు
ముక్త ఘోటక సంచయమ్ములును సంచ
రింప నిటునటు లంకాపురి యగపడెను
బ్రళయ వేళ భ్రాంతగ్రాహ వనధి భంగి 18.

ఆ.వె. ఒక్కెడ గజము గని చక్క విడువఁ బడ్డ
యశ్వ రాజము సెద నడలి పాఱ
నొక్క చోటఁ గాంచి యొక్క భీత గజము
నశ్వము వెసఁ బాఱె నడలి యెడఁద 19.

ఆ.వె. మండు చుండ లంక మెండుగ నత్తఱి
నడరఁగఁ బ్రతి బింబ మప్పు లందు
నర్ణవమ్ము దోఁచె నరుణ వర్ణమ్మున
వెక్కసముగ నగ్ని పిక్కటిల్ల 20.

కం. హరి వీర దగ్ధ లంకా
పుర మొక్క ముహూర్త కాలమున దీప్త వసుం
ధర భంగి మారినది దు
ర్భరప్రళయ వేళ యం దవారిత రీతిన్ 21.

ఆ.వె. ధూమ యుక్త వహ్ని ఘోరమ్ముగ దహింప
నార్చి నట్టి రాక్ష సాంగనా స్వ
నమ్ములు శత యోజనమ్ముల దూరమ్ము
దనుక వినఁ బడినవి దారుణములు 22.

కం. సమ రాభిలాషులు హరులు
దుమికిరి మండెడు తనువులతో వెలి కరుదెం
చు మహాసుర వీరుల పయిఁ
దమక మతిశయింప సెదలఁ దత్‌క్షణ మలుకన్ 23.

ఆ.వె. వాన రాసురప్రవరుల యుద్ఘోషమ్ము
నిండి దశ దిశలను నేల నింక
సాగరమ్ము నెల్ల సత్వరమ్ము బ్రతిధ్వ
నింపఁ జేసెఁ జెలఁగఁ గంపనములు 24.

చం. ఇరువురు రామ లక్ష్మణు లహీన బలాఢ్యులు హీన శల్యులై
కరములఁ గార్ముకమ్ములను గ్రన్ననఁ గైకొని రెన్న కెట్టి తొం
దర సెద లందుఁ జాపమును దద్దయు లాగిన రాముఁ డంతటన్ 25.

గురుతర శబ్ద మేర్పడెను ఘోర భయమ్ము వహింప రక్కసుల్

కం. వింటిని మ్రోయింప గగన
మంట రవమ్ము రఘు వీరుఁ డాగమ మయ మా
వింటిని ధరియించిన ము
క్కంటి పగిది తోఁచె మనుజ కాంతుఁడు వింతన్ 26.

కం. ఘన వానర ఘోషమ్ము వి
నిన రక్కసులు నొనరింప నిస్వనములు రేఁ
గిన మిక్కుటమ్ముగను రా
ముని జ్యా ధ్వని మించె రెంటిఁ బురమున వినఁగన్ 27.

తే.గీ. వాన రోద్ఘోషిత ఘన నిస్వనము లింక
రాక్షసు లొనరించిన యట్టి రావములును
రాఘవేంద్రు జ్యా శబ్దం బమోఘము దశ
దిశలు నిండెను మూడును దిట్టముగను 28.

ఉ. రామ శరాసనోద్గత శరమ్ములఁ దత్పుర గోపురం బహో
భీమము ముక్కలై పడెను భృథ్విని దీ టది వెండి కొండకున్
రాముని ఘోర బాణముల రాక్షసు లారసి మేడ లందు సం
గ్రామ నిమిత్త సన్నహన కార్యములం జెలరేఁగి రెల్లరున్ 29.

కం. కన నా రాతిరి యుద్ధము
న నిరతి సెలఁగంగ సింహ నాదము లొనరిం
చు నసుర వీరులకుఁ బ్రళయ
పు నిసి యనంగ నెద లందు స్ఫురియించె నహో 30.

ఉ. దండన యున్న ద్వారములు దప్పక చేరి రణం బొనర్పుఁడీ
రండని వానరాధిపుఁడు గ్రన్నన నాజ్ఞ నొసంగి పల్కె నే
రుండియు గుమ్మ మందుఁ దమి యుద్ధ మొనర్పక యున్న నిల్చి యా
తం డగు రాజ దూషకుఁడు దండన మందు నసంశయమ్ముగన్ 31.

ఆ.వె. మందు చున్న దివ్వె లుండ హస్తమ్ముల 32.

ద్వారముల సరసన వఱలు చుండఁ
బ్లవగ ముఖ్యు లంత వారి యందు నలుక
మూరె రావణునకు ఘోరముగను

ఆ.వె. వ్యాకులమ్ము నందె నన్ని దిక్కులు దశ
కంఠుఁ డావులింప గాత్ర పంక్తి
నంత రుద్ర కోప మావహించిన విధ
మగపడె నరయంగ నలుక నూన 33.

చం. కుల ఘన కీర్తి వర్ధనులఁ గుంభ నికుంభులఁ గుంబకర్ణు సూ
నులను స రాక్ష సావలి ఘనుండు రణమ్మున కంపె రావణుం
డలుక వహించి కంపన వరాఖ్యుఁ బ్రజంఘుని శోణితాక్షునిన్
బలుఁ డగు యూపలోచనునిఁ బన్నుగఁ దోడుగ నుంచి వారికిన్ 34.

ఆ.వె. ఉగ్రుఁ డనుమతించె యూపాక్ష ముఖ్యుల
సింహనాదములను జేసి చనుఁడు
రాక్షసవరు లార! రణమున కెల్ల ర
నుచు వచించి పొగడి యుచిత రీతి 35.

కం. జ్వలి తాయుధముల తోడఁ గ
దలి రావణ చోదితు లయి త్వరితమ్ముగ వా
రలు మాటిమాటికి నినద
ము లొనర్చుచు లంక నుండి పోయిరి పోరన్ 36.

తే.గీ. రక్కసుల స్వర్ణ భూషల ప్రభలు స్వీయ
కాంతు లింకఁ బ్లవగుల యంగారకమ్ము
లపుడు వెలుఁగుల నెల్లెడ నాకసమ్ము
నందు నింపిన వింపుగ నక్కజముగ 37.

కం. తారా నాథుని కాంతులు
తారా గణ కాంతు లింకఁ దత్సైన్యాలం
కారముల జ్వలిత కాంతులు
మూర నభో వీథి యెల్లఁ బొంగె వెలుఁగులన్ 38.

ఆ.వె. చంద్ర కాంతి గ్రహ నిచయ కాంతి భూషణ
పంక్తి కాంతి సర్వ వాన రాసు
రాప్రమేయ బలము నత్యధికమ్ముగ
వెలుఁగఁ జేసె నెల్లెడలను వింత 39.

కం. అర కాలిన గృహ కాంతులు
పరఁగు జలము తోడఁ జలిత భంగమ్ముల సా
గరము ప్రకాశించె నపుడు
తిరిగి నిరీక్షింప నత్యధికముగ నిసిలో 40.

సీ. ధ్వజ పతాకమ్ములు దనరంగ నుత్త మాసి పరస్వధమ్ములు సెలఁగు చుండ
భీమాశ్వ రథ వర వేదండ రాజితమ్ము పదాతి సంకులమ్ము ఘన దీప్త
శూల గదా కరవాల తోమర కార్ముకప్రాస గణ సుప్రకాశితమ్ము
రాక్షస గణ సైన్య మక్షీణము సకింకిణీ శత నాదిత నినద బలము
తే.గీ. కనఁబడెఁ గన కాంగదములఁ గదలు గొడ్డ
ళుల శర సహిత కార్ముకముల మహాయు
ధములఁ జందన మాల్య మద్య వర గంధ
మారుతమున నసుర వర్య మహిత బలము 41.

కం. కని వచ్చిన బలము జల ధ
ర నిస్వనము రాక్షస పటల సమావృతమున్
ఘనము దురాసదముఁ జలిం
చి నినాదమ్ములు ప్లవంగ సేన యొనర్చెన్ 42.

తే.గీ. తిరిగి యా రాక్షస బలం బతి రయ మొప్ప
నుఱికె శత్రు సేన పయికి నుగ్రముగను
బావకుని పైకి నుద్ధతిఁ బర్వు లెత్తు
పతగ రాశి పగిది నంత భండనమున 43.

కం. పరిఘులు వజ్రాయుధములు
కరముల రంజిల్లు చుండఁ గర మసుర బల
మ్ము రణ తలమ్మునఁ గాంచఁగ 44.

విరివిగ శోభిల్లు చుండె వీరుల తోడన్

కం. హరి పుంగవు లున్మత్తుల
కరణి సమర కాంక్షు లెగిరి కయ్యము నందుం
దరు పర్వత ముష్టులఁ గొ
ట్టి రంత రక్కసులఁ గడు వడి సరోషులునై 45.

ఆ.వె. అసురు లట్లె వచ్చు హరి వీరులం గని
భీమ కాయు లంత విక్రమించి
శిత శరమ్ము లేసి శిరముల ఖండించి
రాగ్రహించి త్రుటిని నవనిఁ గూల 46.

తే.గీ. దంత దంశిత కర్ణులు వంత తోడ
ముష్టి ఘాత విఖండిత మూర్ధు లింక
ఘన శిలా చయ నిర్భిన్న కాయు లసుర
వీరులు చరించి రాజిని ఘోరముగను 47.

ఉ. అవ్విధి ఘోర రూపులు మహాసుర వర్యులు వానరావళిన్
నొవ్వఁగఁ దీక్ష్ణ ఖడ్గము లనూహ్య విధమ్ముగ దించి చంపఁగా
నెవ్వఁడు కొట్టె వానిఁ బరుఁడే వెసఁ గొట్టఁగ నెట్టు వానినిం
ద్రెవ్వఁగ నెట్టె నన్యుఁ డొరుఁ దిట్టిన గొర్కిన నట్లె యయ్యెడిన్ 48.

ఆ.వె. కొట్టు మనఁగ నదిగోఁ గొట్టు చున్నాఁ డని
కొట్టు చుంటి నంచు నిట్టు లేల
శ్రమపడెదవు నిలువ రాదె యనుచు నొండొ
రులు వచింపఁ జాగె పలుకు లచట 49.

తే.గీ. శస్త్రములు వ్యర్థములు గాఁగ సజ్జ లణఁగ
నెత్తి నట్టి ప్రాసలతోడఁ గత్తు లింక
శూలములు యష్టు లడరంగ నాల మందుఁ
బ్రబలె వానర రాక్షస భండనమ్ము 50.

ఆ.వె. చంప నసురు లాజి శాఖామృగులను బ 51.

దుండ్ర సేద్గురఁ బగ తోడఁ జెలఁగి
రక్కసులను వానర వరు లడఁచిరి ప
దుండ్ర సేద్గుర నని దూఁకి దూఁకి

కం. రాలఁగఁ గేశాంబరములు
గూలఁగఁ గవచధ్వజములు క్రుంగఁగ ఘో రా
భీ లాసుర సైన్యమ్మును
లీలం జుట్టి నిలిచిరి వలీముఖ వీరుల్ 52.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు డెబ్బది యేనవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 76.

వానర రాక్షస మహా యుద్ధములో నంగదునిచేఁ గంపన ప్రజంఘులు, ద్వివిదునిచే శోణితాక్షుఁడు మైందునిచే యూపాక్షుఁడు సుగ్రీవునిచేఁ గుంభుఁడు నిహతు లగుట.

కం. వీర జనక్షయ సంకుల
ఘోర రణము వర్తిలంగఁ గోపించి కడున్
శూరుం డంగదుఁడు కదిసె
ఘోరునిఁ గంపను రణోత్సుకుఁ డసుర వీరున్ 1.

కం. అంగదునిఁ బిలిచి డెందము
నం గినిసి కరమ్ము కంపన మహాసుర సే
నాంగ విభుఁడు మును గదతో
నంగదుఁ గొట్టఁ జలియించె హరివరుఁ డార్తిన్ 2.

తే.గీ. సంజ్ఞను బడసి తేజస్వి శైల శృంగ 3.

మును విసరె నంగదుండు రిపు వరు పైన
నర్దితుం డయి కంపనుం డవనిఁ గూలె
హతునిఁ గంపను గని శోణితాక్షుఁ డాజి

చం. కదిసెను దేరుపైఁ బ్లవగ కాంతుని నంగదు వీత భీతినిం
బదను శరమ్ము లేసి వెస బాధ నొసంగెను మేనుఁ జీల్పఁగన్
విదులిచెఁ గాల వహ్ని నిభ విగ్రహ వత్స రదాభ బాణముల్
పదపడి శల్య కర్ణి సవిపాఠము లింక క్షుర క్షురప్రముల్ 4.

తే.గీ. బాణ విద్ధుఁ డంగదుఁ డంత వాలి సుతుఁడు
సుప్రతాపవంతుఁడు మహా శూరుఁ డడరి
బల్లిదుండు మర్దించెను వాని వింటి
నమ్ముల రథమ్మును భృశ బలమ్ము నూని 5.

ఆ.వె. కత్తి డాలు నంతఁ గైకొని శోణితా
క్షుండు పైకి నెగురఁ గ్రుద్ధుఁడై క
రమ్ము శంక వీడి రయము మీఱ నెగిరి
యంగదుఁ డసి లాగి యఱచె నంత 6.

ఆ.వె. లాగి వాని భుజ పలకము పై యజ్ఞోప
వీత గతినిఁ గోసె నాతతముగ
నంగదుండు నసురు నసితోడ శత్రు ల
పరుల పయికి నుఱికెఁ బట్టి కత్తి 7.

శా. యూపాక్షుండు ప్రజంఘు తోడుతను యుద్ధోత్సాహి యేతెంచె నా
కోపావేశుఁడు స్యందనమ్మునఁ బ్లవంగుం దాఁక నయ్యంగదుం
దోఁపంగన్ ససి శోణితాక్షుఁడును పే దూఁకెన్ గదా హస్తుఁ డా
టోపస్వాంతుఁడు కాంచ నాంగదుఁడు విడ్డూరమ్ముగా వానిపై 8.

తే.గీ. శోణితాక్ష ప్రజంఘుల శూర వరుల
నడుమఁ గపి పుంగవుఁడు దోఁచె నడరి పూర్ణ
చంద్రు వోలె విశా ఖాఖ్యఁ జనెడు తార
ల నడుమ నలరు చుండఁగఁ గనుల కపుడు 9.

తే.గీ. తలఁచి రక్షింప నంగదు నిలిచి రంత
ద్వివిద మైందు లతని చెంత  వీర వరులు
గాంచుచు పరస్పర మెదుర్పఁగఁ దగి నట్టి
శత్రుపక్ష వీరులను దత్సమర మందు 10.

ఉ. పెగ్గల మైన గాత్రముల వీరులు రాక్షసు లూని ఖడ్గముల్
డగ్గఱి ఘోరముల్ గదలు డాళుల తోడుత సంభ్రమమ్మునన్
ముగ్గురు రాక్షసేశ్వరులు పోరు నొనర్పఁగ  భీకరమ్ముగన్
ముగ్గురు వాన రోత్తముల ముందుఁ జెలంగె రణమ్ము ఘోరమై 11.

ఉ. వారు గ్రహించి వృక్షములు వానర వర్యులు కిన్క పైవఁగా
మూరి ప్రజంఘుఁ డన్నిటిని ముక్కలు సేసె వహించి ఖడ్గమున్
దారుణ శైల పాదప వితానము పర్వ రథాశ్వ కోటిపై
నారసి యూపనేత్రుఁడు మహాసురుఁ డమ్ములఁ ద్రుంచె వానినిన్ 12.

ఉ. ద్రూనులఁ గైఁ బెకల్చి వెస మైందుఁడు నా ద్వివిదుండు పైవఁగా
వానిని శోణితాక్షుఁ డని భగ్న ము సేసె గదాయుధమ్మునన్
మానుగ మధ్య విక్రముఁ డమర్షము తోడఁ బ్రజంఘుఁ డుద్ధతిన్
వానర రాజ నందనుని పజ్జకుఁ బర్విడె ఖడ్గ హస్తుఁడై 13.

చం. తన దెస వచ్చు వానిఁ గని తత్క్షణ మంగదుఁ డశ్వకర్ణమున్
ఘన తరు పెత్తి బల్లిదుఁడు గ్రన్నఁ గొట్టెను వానరేంద్రుఁడే
ఘన నిజ ముష్టిఁ గొట్టెను సఖడ్గ మహాసుర బాహు దండమున్
వనరఁగ రక్కసుండు కరవాలము గూలెను నేలపై వెసన్ 14.

చం. కని భువిఁ గూల స్వీయ శిత ఖడ్గము నా ముస లాభ మవ్విధ
మ్మున బిగియించి వజ్ర నిభ ముష్టి ప్రజంఘుఁడు బల్లిదుండు గొ
ట్టె నొసలు పైన గట్టిగ వడిం గపి వర్యునిఁ గొట్ట సంచలిం
చె నొక ముహూర్త కాలము నశింపఁగ సంజ్ఞ యొకింత యంతటన్ 15.

తే.గీ. పడసి సంజ్ఞను దేజస్వి వాలి సుతుఁడు
సుప్రతాపవంతుఁడు కడు చోద్యముగఁ బ్ర 16.

జంఘు రక్కసు శిరమును జఱచి ముష్టి
పేరు చేసె దేహము నుండి వీర వరుఁడు

ఉ. అక్షుల నిండ నశ్రులు తదంకమునం బినతండ్రి గూల యూ
పాక్షుఁడు డిగ్గి స్యందనము నందెను ఖడ్గము వీర పుంగవుం
డా క్షయ బాణ సంచయుఁడు నట్లరు దెంచుచు నుండ వేగ యూ
పాక్షుఁ బ్లవంగుఁ డా ద్వివిదుఁ డారసి గొట్టి బలుండు ఱొమ్మునన్ 17.

తే.గీ. పట్టె వానిని గట్టిగఁ బట్ట భ్రాత
నరసి శోణితాక్షుండు మహాబలుండు
ద్వివిదు గదతోడఁ గొట్టెను బృథుతరంపు
వక్ష మందు నుగ్రుండునై వానరేంద్రు 18.

కం. చలియించి గదా ఘాతుఁడు
తెలివిం గొని ద్వివిదుఁ డంతఁ దిరిగి కపి మహా
బలుఁ డెత్తిన గదఁ గైకొనె
బలిమి నసురు నుండి వేగవంతుం డంతన్ 19.

కం. హరి యూధపుండు మైందుం
డురమున యూపాక్షుఁ గొట్టె నుగ్ర తరంబౌ
కర తలమున వీర వరుఁ డ
సుర పుంగవుఁ గదిసి ద్వివిదు శూరత్వమునన్ 20.

తే.గీ. శోణితాక్ష యూపాక్షులు శూర వరులు
సెలఁగి మైందద్వివిదులతోఁ జేసి రంత
ఘోర యుద్ధమ్ము బలిమి లాగుచు వెసఁ బెక
లించుచు నతి తీవ్రమ్ముగ సంచరించి 21.

చం. ద్వివిదుఁడు శోణితాక్షు ఘన వీరుని గిరి ముఖమ్మునన్ నఖా
లి వెస ధరాతలమ్మునను లీలఁగఁ ద్రోసి నలంగఁ జేయఁగాఁ
గవియుచు యూపలోచనునిఁ గ్రన్నన మైందుఁడు నొవ్వఁజేయ బా
హువుల భృశమ్ము గూలె నసురోత్తముఁ డత్తఱి సంగరావనిన్ 22.

కం. వీర వరు లట్లు నిహతులు
కా రాక్షస సైన్య మంతఁ గదలెను భీతిం
జేరంగఁ గుంభకర్ణ కు
మారుం డున్నట్టి చోటు మన సెంచి వెసన్ 23.

ఉ. వచ్చెడు రాక్షస ధ్వజినిఁ బన్నుగ నారసి కుంభుఁ డింపుగా
నచ్చట నూఱడించి పరమాద్భుత కర్మము సంగరమ్మునన్
మెచ్చ భటాలి సేసెఁ గని మేటి బలాఢ్యులు వీర రాక్షసుల్
చచ్చిన శేష సైన్యమును సాధిత లక్ష్యుల వానరేంద్రులన్ 24.

ఆ.వె. ధనువు వెస గ్రహించి ధానుష్కు లందు శ్రే
ష్ఠుండు కుంభుఁ డసుర శూర పుంగ
వుండు విడిచెను శర తండము తను దార
ణముల నహి నిభముల సమర మందు 25.

కం. ఆతని బాణ సహిత ధను
వా తఱి శంపా లతా యు తైరావత సై
జాతత రుచి ధను వది ద్యో
జాతం బపరేంద్ర చాప సరణినిఁ దోఁచెన్ 26.

తే.గీ. పసిడి పొన్నుల తోడుతఁ బత్ర వసన
ముల నలరు నమ్ములను గర్ణము వఱకు వెస
లాగి గొట్టెను ద్వివిదుని రాక్షసుండు
కుంభకర్ణాత్మజుఁ డనిలో ఘోరముగను 27.

కం. శరఘాతమ్మున ద్వివిదుఁడు
చరణమ్ములు దడఁబడంగ శాఖామృగ రా
డ్వరుఁ డద్రి కూట సదృశుఁడు
ధరఁ గూలెను విహ్వలుఁ డయి తద్దయు నంతన్ 28.

తే.గీ. మహిఁ బడంగ ఘోరాజిని మైందుఁ డరసి
తమ్ముని మహా శిలను బట్టి త్వరితముగఁ బ
రువిడి కుంభుని పయి పైవ రుచిర శరము 29.

లైదు వేసి ముక్కలు సేసె నసుర వరుఁడు

కం. ద్వివి దాగ్రజు నన్య శరము
న విషాహి నిభమున నురమునం గొట్టె ఘనుం
డు వెసం దగ సంధించి హ
రి వీరు నా కుంభుఁ డంత రేఁగిన కినుకన్ 30.

తే.గీ. ప్రేటునకుఁ గపి యూధప శ్రేష్ఠుఁ డంత
మైందుఁడు తగుల మర్మము లందు మూర్ఛ
నంది నేలపైఁ గూలఁగ నంగదుండు
మర్దితులఁ గాంచి తన మేనమామల నని 31.

కం. త్వరితమ్ముగఁ బరువెత్తె న
సుర వర్యుని కుంభు దెసకు శూరుం డుద్య
ద్గురు కార్ముక కరుఁడై నిలు
వ రణమ్మున నంగదుండు ప్లవగుం డలుకన్ 32.

చం. ఇనుప శరమ్ము లైదిట హరీంద్రుని మూడిట తీక్ష్ణ బాణ పం
క్తిని గజరాజుఁ దోమర గతిన్ వెసఁ గొట్టెను గుంభుఁ డంగదుం
గనక విభూషి తాంబక నికాయమునన్ నిశి తేద్ధ ధారలం
గినుకను దా ననేకములఁ గృత్స్నము నొవ్వ శరీర మత్తఱిన్ 33.

కం. కంపింప డంగదుం డని
నొంప శరమ్ములు కపుల ఘనుం డంతట వ
ర్షింపఁగఁ జేసె శిరమ్మున
నింపుగ శిలలను దరువుల నెల్ల నసురుపై 34.

చం. శిలలను జేసె వ్రక్కలుగఁ జీల్చెను ముల్కులఁ బాదపమ్ములన్
లలి నట నంగ దేరితములం బలలాశన నందనుండు శ్రీ
విలసితుఁ డుల్కలం గరిని విద్ధము సేయు గతిం బ్లవంగు భ్రూ
వుల పయి వేసి బాణములు వోరున నొంచెను దూఁకు నంగదున్ 35.

ఉ. కాఱఁగ రక్త మక్షులను గప్పి గరమ్ముల వాని నింపుగాఁ 36.

బాఱి సమీప పాదపముఁ బట్టి కరమ్ముల నొక్కి ఱొమ్మునం
దేఱి యొకింత వంగి  కడు దిట్ట సకాండము శక్ర కేతువున్
మీఱిన మందరాభమును మిన్నగ వైచెఁ బెకల్చి కుంభుపై

ఆ.వె. అసురు లరయు చుండ నంగ దారణ శిత
శరము లేడు వేసి దరువుఁ జీల్చెఁ
గుంభుఁ డంగదుండు ఘోరంపు టార్తినిఁ
గూలెఁ దెలివి లేక నేల పైన 37.

కం. క్షీణించు వనధి వలె న
క్షీణ బలుని నంగదుఁ గపిశేఖర వర్యున్
బా ణార్తు నా ప్లవంగ
శ్రేణులు రామునకుఁ దెలిపిరి యితరు లంతన్ 38.

కం. కని యార్తుని వాలి సుతుఁ గ
దనమ్మున రఘూద్వహుండు త్వరితమ్ముగఁ బం
చెను జాంబవన్ముఖప్లవ
గ నాయకుల నంగదు ననిఁ గావఁగ నంతన్ 39.

తే.గీ. అగ్ర వానర శార్దూలు రాగ్రహించి
రామ శాసన బద్ధులై రాక్షస వరు
కుంభుని పయి నుద్యత కార్ముకుని పయి కురి
కిరి రణాంగణమ్మునఁ దమకించి యెల్ల 40.

ఆ.వె. తరుల శిలల నూని కరములఁ గన్నులె
ఱ్ఱవడఁ గోపమునఁ దఱచుగ రక్ష
ణమ్ము నీయ నెంచి నెమ్మి నంగదునకు
వానరర్షభు లటఁ బాఱి రాజి 41.

ఆ.వె. జాంబవత్సుషేణులుం బర దమనుండు
వేగదర్శి కుంభు వీర వర్యు
మార్కొనంగ నా సమర మందు పరుగు లి
డిరి  బ్లవంగ వరులు కరము కినిసి 42.

కం. పరుగున వచ్చెడు వానర
వరులను బల్లిదుల నాపె బాణౌఘమునన్
గిరిచే వారింపఁ బడెడు
శరనిధి వలెఁ గుంభుఁ డడరి శౌర్యోద్ధతినిన్ 43.

ఆ.వె. బాణ పంక్తి నంత వానరేంద్రులు దాఁటఁ
జాల రైరి యేరు వేల దాఁటఁ
జాల నట్టి కడలి చందమ్ముగ మహాత్మ
లక్కజముగ సమర మందు నపుడు 44.

తే.గీ. అంత నమ్ముల వానచే హరి గణములు
నొవ్వఁ గాంచి సుగ్రీవుఁడు రివ్వున నని
దూఁకె వెనుక నంగదు నుంచి వీఁకఁ గుంభు
పయికి మృగరాజు కరి పైకిఁ బాఱు పగిది 45.

చం. పెకలిచి శైల రాజములు వృక్ష సమూహము లశ్వకర్ణముల్
సు కపి గణేశుఁ డన్యముల సూర్య సుతుండు బలుండు పైవఁగా
వికలము సేసె నా యసుర వీరుఁడు కుంభుఁడు వృక్ష వృష్టి నం
బకములు వేసి తీక్ష్ణములు వ్యాప్తములన్ దివి దుస్సహమ్ములన్ 46.

తే.గీ. చక్కని గుఱి తోడ నిశిత శరము లేసి
కుంభకర్ణాత్మజుఁడు సీల్ప ఘోరముగఁ ద
రులు శతఘ్నుల పగిది వెలుంగు చుండెఁ
బీడ్యమానమ్ములై యట వింత గొలుప 47.

తే.గీ. భిన్న మైనట్టి పాదప వృష్టిఁ గాంచి
వంత జెందఁడు మది లోన సుంత వాన
రాధిపుండు శ్రీమంతుఁడు నర్క నంద
నుండు సుగ్రీవుఁడు కినిసి మెండుగాను 48.

చం. శరముల నొచ్చు చుండియు భృశమ్ము రయమ్మున లాగి యమ్మహా
సురు ఘన కార్ముకమ్ము కపి శూరుఁడు భగ్నము సేసె బల్మినిన్ 49.

సుర విభు చాప సన్నిభముఁ జోద్యపుఁ గర్మ మొనర్చి గెంతి యి
గ్గిర లనె నంతఁ గుంభుఁ బరికించి విశీర్ణ రదేభ సన్నిభున్

చం. వినుతము నీదు తేజు శర వేగ నిభం బగు నద్భుతమ్మునున్
ఘనుఁడ! నికుంభ సోదరుఁడ! గాంచఁ బ్రభావము నందు సన్నుతిన్
ఘన దశకంఠ తుల్యుఁడవు కల్గితి తండ్రికిఁ దగ్గ పట్టిపై
విను వనధీశ వాసవ కుబేర మహాబలి తత్సు తాభుఁడా 50.

చం. ఘనభుజు నిన్ను శూలధరుఁ గార్ముక హస్తుని శత్రు మర్దనా!
యనిముషు లైన మించఁ దగ రాజి జితేంద్రియు శోక రాశి భం
గినిఁ దగ విక్రమింపు పరికింపఁగ నే నిట నీదు చేతలం
గొని వర పంక్తి రావణుఁడు ఘోర బలమ్మున నీదు తండ్రియున్ 51.

తే.గీ. సైచు చున్నా రసుర సుర సంచయమును
సముఁడ వింద్రజిత్తున కీవు చాపమందు
దశ ముఖునకు సముఁడవు ప్రతాప మందు
రక్కసుల మేటివి బల పరాక్రమముల 52.

కం. మన మధ్య తనరు సమర
మ్మున ఘోర విమర్దనమ్ము భూతమ్ములు నేఁ
డు నిలిచి చూడఁ గలవు శ
క్రునకును శంబరున కైన ఘో రాజి వలెన్ 53.

కం. చేసితి వసమాన చేష్టలు సూపితి
వస్త్ర కౌశలమ్ము హరివరేణ్యు
లను బరాక్రములను రణమునఁ గూల్చితి
వీ వనేకుల నసురేంద్ర! వినుమ 54.

తే.గీ. అలసి యున్న వానినిఁ జంపె నన్న నింద
కడలి చంపఁ జాలను నిన్ను నంక మందు
సుంత విశ్రాంతి గైకొని చూడు మసుర
వర్య! సంగరమ్మున నాదు బలము నెల్ల 55.

కం. అవమాన యుక్త సుగ్రీ
వ వచనముల గౌరవింపఁ బడ నాజ్యమ్ముం
దివిరి హుతము సేసిన వ
హ్ని విధిఁ బెఱిగె నతని  తేజ మెల్ల రయమునన్ 56.

తే.గీ. అంతఁ గుంభుఁడు సుగ్రీవుఁ బంత మూని
పట్టి బాహుల సమ్మద వారణద్వ
యమ్ము భంగి నిట్టూర్చుచు నప్పు డొండొ
రులు నొరసి కొనుచు శరీరములఁ బెనఁగిరి 57.

కం. శ్రమియింప భృశమ్ముగ స్వీ
య ముఖమ్ముల ధూమ సంయు తానల మంతం
గ్రమముగ విడువం బడె నా
సమ రావని ఘోర రాక్షస హరి వరులచే 58.

ఆ.వె. క్రుంగె నేల వారి ఘోర చరణ పీడ
నముల సంగ రాంగణమున భృశము
కలఁగె నంతఁ గడలి కల్లోలములు ఘూర్ణి
తములు గాఁగఁ గంపనములు సెలఁగ 59.

కం. హరి నాథుఁడు సుగ్రీవుఁడు
కరముల నెత్తి వెసఁ గుంభుఁ గడలిని పైచెం
గరము కినిసి చూపించెను
శరనిధి భూభాగ మంత సత్త్వం బడరన్ 60.

కం. పడఁ గుంభుఁడు జలరాశిని
వడి వ్యాపించెను సుఘోర పాథోనిధి యె
ల్లెడలం దక్కజముగ నపు
డడరుచు ఘన వింధ్య మంద రాద్రుల భంగిన్ 61.

ఉ. తా వెస గెంతి కుంభుఁడు పతద్వరమో యన ముష్టిఁ గొట్టె సు
గ్రీవుని వక్ష మందుఁ జెలరేఁగి భృశమ్ముగఁ జేరి చెంతకున్
వావిరి యైన ప్రేటునకు వ్రక్కలు నయ్యెను బొందళమ్ము ధా 62.

రా విధ మంత కాఱినది రక్తమె యస్థులు మ్రోగె ముష్టినిన్

ఆ.వె. మెఱుపు లుద్భవించె మించిన ముష్టి వే
గమున కంత వజ్ర ఘాతమునకు
మేరు పర్వతమున మూరి జ్వా లావలి
వుట్టి నట్లు దోఃప బెట్టిదముగ 63.

ఉ. కొట్టఁబడంగ నట్టు లతి ఘోరముగం గపి వర్యుఁ డంతటన్
బెట్టిద మైన ముష్టి నతి వేగముగన్ బిగియించి కాంతు లం
దిట్టలమై సహస్ర కిరణేశ్వరు కాంతికిఁ దోఃపఁ గట్టిగాఁ
గొట్టెను వజ్ర కల్పమునఁ గుంభు నురమ్మున విక్రమమ్మునన్ 64.

ఆ.వె. విహ్వలుఁడు నయి భృశ పీడితుం డా కుంభుఁ
డంత జ్వాల లెల్ల నణఁగి నట్టి
నగ్ని వోలెఁ గూలె నవని నా ముష్టి ఘా
తమ్మున నసురుండు సొమ్మసిల్లి 65.

కం. పిడికిలి పోటున కాతఁడు
వుడమిం గూలె వెస నసుర పుంగవుఁ డంతం
గడు వెలుఁగు లోహి తాంగుఁడు
నుడు మార్గము నుండి కూలు నోజ యదృచ్ఛన్ 66.

కం. పడు కుంభుని రూప మపుడు
పిడికిలి విఱిఁగిన నురమున వీక్షింపంగా
నడరెను హరుచేఁ గొట్టం
బడి నట్టి గవాంపతి వలె బవరము నందున్ 67.

కం. మరణింప విక్రమునిచే
హరి వర్యుని చేతఁ గుంభుఁ డసురేంద్రుండే
ధర స గిరి వనము వణఁకె న
సురులం దధికం బెడఁదలఁ జొచ్చెను భయమే 68.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు డెబ్బది యాఱవ సర్గము.

# యుద్ధ కాండము

# సర్గము 77.

అగ్రజుఁడు కుంభుఁడు సుగ్రీవునిచే నిహతుఁడు గాఁగఁ గ్రుద్ధుఁడై నికుంభుఁడు ఘోర యుద్ధము సేయఁగా హనుమంతుఁడు వాని నెదిర్చి వధించుట.

కం. కని సుగ్రీవుని చేఁ గూ
లిన యన్నను గుంభు నంత రేఁగిన కోప
మ్మున వానరేంద్రుని దహిం
చు నట్టుల నికుంభుఁ డాజిఁ జూచెను రవిజున్ 1.

చం. కొని వెస నా నికుంభుఁ డనిఁ గూర్పఁగ నింపుగఁ బుష్పమాలలం
గనక విభూషితమ్ముఁ బరిఘున్ మణి విద్రుమ భూషితమ్ము కా
ల నిజ క రేద్ధ దండ నిభ రమ్య మహేంద్ర నగాగ్ర తుల్యముం
గనఁ బడ నైదు ప్రే ళ్లడరి గంధ యుతమ్ముగ ధీరుఁ డంతటన్ 2.

తే.గీ. రాక్షస భయ నాశనము సంక్రందనధ్వ
జ సదృశమ్మును దేజస్వి చక్కఁ బట్టి
భీమ విక్రముఁ డాస్యము వితతముగఁ దె
ఱచి నికుంభుఁడు రణమం దఱచె భృశమ్ము 3.

తే.గీ. ఉరమునం బతకమ్ము కేయూరములు భు
జముల నగల మాలలఁ గుండలములఁ జిత్ర
ముల వెలిఁగె నికుంభుం డుఱుములు మెఱపులు
శక్ర ధను వున్న మేఘంపు సరణి నపుడు 4.

తే.గీ. స్వీయ పరిఘాగ్ర భంజిత వాయు సంయు 5.

తాసమ గ్రంథి సధ్వని భాసమాన
ధూమ హీన పావకు భంగి నా మహాత్ముఁ
డు వెలిఁగె నికుంభుఁ డతి బలుండు ఘనుఁ డచట

తే.గీ. అసురు పరిఘు తిరుగుచుండ విసవిస నల
కాపుర మమరావతి లోక గణము గ్రహము
లు శశి తారలు నభ మెల్ల దిశలు దిరుగు
చందమునఁ దోఁచె నపు డక్కజమ్ము వొడమ 6.

ఉ. చేరఁగ రాని దయ్యెను విశేషముగా జ్వలియింప నంతపుం
దీరున రేఁగ నా పరిఘు దీప్త విభూషణ కాంతి తోడ దే
వారి నికుంభ నామ సుమహాగ్ని యుగాంత మహాన లాభమై
ఘోరపు టింధనం బయి నికుంభుని రోషము వెల్గ సేరికిన్ 7.

కం. అసురులు వానరు లేరును
బస లేక కదలక నిల్వ భయ విహ్వాళులై
వెస ఱొమ్మును విచ్చి నిలిచె
నసురుని బలవంతు చెంత హనుమంతుఁ డనిన్ 8.

ఆ.వె. పరిఘు సన్నిభ నిజ బాహుల సూర్య ప్ర
భా సదృశ పరిఘును బల్లిదుఁడు ని
కుంభుఁ డంత వైచె ఘోరముగఁ దగుల
వక్ష మందుఁ బ్లవగ వర్యు నరసి 9.

కం. స్థిర మగు హనుమ విశాలపు
టురముం దాఁకి పరిఘు యసు రోత్తముఁ డుగ్రుం
డరయ నయి వంద ముక్కలు
ధరఁ జెదరె శ తోల్కల వలెఁ దారాధ్వమునన్ 10.

కం. చలియించెఁ బరిఘు యట్లు త
గుల హనుమంతుఁడు కడింది కుంభిని కదలం
జలియించెడు కొండ పగిది
బలవంతుఁడు వాయు సుతుఁడు ప్లవగుం డాజిన్ 11.

చం. అసురుని చేతఁ గొట్టఁబడి యక్కపి వర్యుఁడు బల్మి ముష్టినిన్
వెస బిగియించి గట్టిగను వీరుఁడు వేగమ యెత్తి కొట్టె న
య్యసురు నికుంభు ఱొమ్ము పయి నంజని పుత్రుఁడు వేగవంతుఁ డ
య్యసమ బలాన్వితుండు పరమాద్భుత తేజుఁడు వాయు తుల్యుఁడున్ 12.

ఆ.వె. ముష్టి దెబ్బ కసురు బొందడమ్ము వగిలి
కాఱె రక్త మంత గాత్ర వరము
నుండి మిక్కుటముగ మెండుగ మెఱపులు
మేఘ రాశి లోన మెఱయు నట్లు 13.

తే.గీ. కడు చలించెను దన్ముష్టి ఘాతమునకు
నా నికుంభుఁ డసుర వర్యుఁ డంత నంది
స్వస్థతను బట్టి హనుమంతు సత్త్వవంతు
నమ్మహాకపిఁ బయి కెత్తె నడరి కినిసి 14.

కం. కని హనుమంతుని నెత్తఁ బ
డ నికుంభునిచే నసురు లడరు చుండి కడున్
జను లా లంకా వాసులు
ధ్వను లొనరించిరి ముదమ్ము వడసి ఘనముగన్ 15.

తే.గీ. రక్కసుఁడు కొని చనుచున్న నక్కపి వరుఁ
డంత ముష్టి నసురుఁ గొట్టి యశని కల్ప
మున ననిల తనయుం డప్డు దనకుఁ దా వి
ముక్తుఁడై యుఱికి హనుమ పుడమి పైకి 16.

కం. పీడించె నికుంభు నసురు
గాడుపు పట్టి ధరఁ గూల్చి కపివర్యుఁడు తో
డ్తోడ యెగిరి పైకి నలిపెఁ
బాడిగఁ బడి ఱొమ్ము పైన వానినిఁ గినుకన్ 17.

ఆ.వె. పట్టి నిజ కరముల గట్టిగఁ ద్రిప్పి మె
డ నలుక సెలగంగ హనుమ యసురు 18.

శిరమును టెకలించె హరి వీరుఁ డార్వ భై
రవముగ నట నార్తి రాక్షసుండు

తే.గీ. అట్లఱచుచు నశింపఁగ నాంజనేయు
ని కరముల నికుంభుఁడు రామునికిని రాక్ష
సేంద్రు సూనునకుఁ జెలంగ నిరువురకు భృ
శంపు రోష మయ్యెను ఘోర సంగరమ్ము 19.

తే.గీ. ఆ నికుంభు జీవుఁడు సన నట్లు తొలఁగి
ప్లవగు లఱచిరి నిండెను ధ్వనులు దిశల
నుర్వి కంపించె నాకసం బూడి పడెను
భయము సెలరేఁగె రాక్షస బలము నందు 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు డెబ్బది యేడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 78.

కుంభ నికుంభుల మరణము విని రావణుఁడు కోపోద్రిక్తుఁ డయి రామలక్ష్మణులను వానర సహితము సంప ఖరసుతుని మకరాక్షుని యుద్ధమునకుఁ బంప నతఁడు వోడఁ జూపు దుర్నిమిత్తములను గణింపక యుద్ధ భూమి కరుగుట.

కం. విని కుంభ నికుంభుల చా
వును బర మామర్ష మెడఁదఁ బొడమ దశాస్యుం
డనలము భంగిని జ్వలియిం
చెను రావణుఁ డసుర విభుఁడు చింత సెలంగన్ 1.

తే.గీ. క్రోధ శోక మూర్ఛితుఁ డసురుండు ఖరుని 2.

పుత్రు మకరాక్షుని నసుర పుంగవుఁ గని
యా విశాలాక్షుఁ బురికొల్పె నంత రావ
ణుండు రాక్షస కోటి నాథుండు బలుని

చం. వెడలుమ పుత్ర! నా ముదలఁ బేర్మి వహించి బలమ్ము తోడ నీ
వడరి రణమ్మునం జెలఁగి యక్కపి వీరుల తోడ రామునిం
గడు వడిఁ జంపు లక్ష్మణు నఖండ పరాక్రమ! నా వచింప నా
తఁడు విని శూరమానియె ముదం బెద మీఱఁగ నట్టులే యనెన్ 3.

ఉ. వందన మాచరించి కడు భక్తిఁ బ్రదక్షిణ మంతఁ జేసి తా
డెంద మెలర్ప రాజునకు డిగ్గన శుభ్రపు టింటి నుండి పే
యంది దశాస్యు నానతిని నమ్మకరాక్షుఁడు జాగి తత్తటం
బందు బలాధినాథుఁ గని పల్కెను వాక్యము లిట్టు లుద్ధతిన్ 4.

తే.గీ. క్షిప్రము గొనితెమ్ము రథమ్ము సేన నెల్లఁ
ద్వరిత గతి సమకట్టుమ పన్నుగ నన
విని బలాధ్యక్షుఁ డసురుండు వేగ తెచ్చెఁ
దేరు నసుర బలమ్మును మూరి యంత 5.

ఆ.వె. చేసి యరదమునకు శీఘ్రతరముగఁ బ్ర
దక్షిణమ్మును మకరాక్షుఁ డెక్కి
సూతునిఁ బురికొల్పె నాతఁడు వేగమ
రథముఁ దోలు మంచు రణ రతుండు 6.

చం. అరయుచు నెల్ల రక్కసుల నాతఁ డనెన్ మకరాక్షుఁ డిట్లు పే
తరలుఁడు నాకు ముందటను దక్షణ మెల్లరు రాక్షసేంద్రుచే
దురమున రామలక్ష్మణులఁ దూర్ణము చంపఁగ నాజ్ఞ నందితిన్
శరములు వేసి రాఘవుల సొరిని వానర కోటిఁ జంపుదున్ 7.

కం. హరి సైన్యమ్మును గాల్చెద
ఖర శూల నిపాతమున సుకరముగ నాజిం
గర మెండిన కట్టెను వ
హ్ని రయమ్మునఁ గాల్చు పగిది నెగడి రణమునన్ 8.

కం. విని మకరాక్షుని వచనము
లు నిశాచరు లాయుధమ్ములు మెఱయు చుండన్
ఘను లఱచుచు మత్త గజము
లన వెస మకరాక్షు ముందు నరిగిరి భయదుల్ 9.

తే.గీ. కామ రూపు లెల్లరును బింగళ నయనులు
ఘోర దంష్ట్రులు రాక్షస వీర వరులు
ధ్వస్త కేశులు బహు దీర్ఘ తను లెడఁదల
మురిసి మ్రోయించిరి వణఁకఁ బుడమి యెల్ల 10.

ఆ.వె. వేల కొలఁది శంఖ భేరులఁ జెలఁగిన
శబ్దములను జఱవ జబ్బల నొన
రింప గర్జ లపుడు రేఁగె ఘోరమ్ముగ
ధ్వనులు సమర భూమి దద్దఱిల్లె 11.

ఆ.వె. సారథి ములుకోల జాఱె నక్కజముగ
రక్కసుని ధ్వజమ్ము రాలె నేల
నంత దైవ ఘటన నాకస్మికముగఁ గ
య్యమునకు మకరాక్షుఁ డరుగు చుండ 12.

తే.గీ. తేరు లాగు గుఱ్ఱమ్ములు దీనముగ బ
లము నశింపఁ దడఁబడఁ జరణము లశ్రు
లక్షు లందు స్రవింపఁగ నక్కజముగఁ
గదలు చున్నవి యత్తఱిఁ గష్టముగను 13.

ఆ.వె. రౌద్రుఁడు మకరాక్షుఁ డద్రి నిభుఁడు దుర్మ
తి పయనించుచుండఁ దీవ్రముగను
దారుణముగ వీచె మారుత మావృత
మై పరాగమునఁ దదవసరమున 14.

కం. కని యా నిమిత్తములు పే
చని రెల్ల గణింప కసుర సత్తము లంతన్ 15.

మనుజర్షభు లున్న యెడకు
ఘను నా మకరాక్షుఁ గూడి కదనమ్మునకున్

తే.గీ. దున్న మొగు లేనుఁగుల సరితూఁగు రంగు
ల మెయి లున్న వా రసి గదలఁ బలు మారు
లార్త గాత్రులు నేను నే నని రణ నిపు
ణు లసురు లఱచు చుండి కదలఁ దొడఁగిరి 16.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు డెబ్బది యెనిమిదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 79.

మకరాక్షుని తీవ్ర బాణ ఘాతములకు నార్తి సెంది వానరు లెల్లఁ బాఱ రాముఁడు రాక్షసులను శర వృష్టిని వారించి మకరాక్షునితో ఘోర యుద్ధ మొనరించి వానిని సంహరించుట.

కం. వచ్చిన మకరాక్షుం గని
యచ్చట సంగ్రామ కాంక్ష హరి గణ యోధుల్
హెచ్చఁగ డెందముల దుమికి
జెచ్చెర నిలిచిరి రణప్రసిద్ధులు వీరుల్ 1.

కం. హరివీర రాక్షసుల క
ష్టు రణం బొడళు లట గగురుపొడువఁగ నయ్యెన్
సురవర రాక్షస పుంగవు
ల రణము నకు నీ డగుచుఁ గరము ఘోరముగన్ 2.

కం. తరు శూల పాతనమ్ములఁ
దరుణ శిలా పరిఘ వితతి తాడనముల నొ 3.

క్కరి నొక్కరు మర్దించిరి
హరి రాక్షస వీరు లాజి నత్యధికముగన్

తే.గీ. శక్తి ఖడ్గ గదా కుంత శర సమూహ
భిండిపాల తోమర పాశ భీమ దండ
పట్టి సాశని ముద్గ రాపర మహాయు
ధముల హింసించిరి హరి సంతతి నసురులు 4.

చం. శరములఁ బీడ్యమాను లయి సంగర మందు ఖరాత్మజుండు భీ
కరముగ లాగి వేయఁగ నఖర్వముగా హరి వర్యు లెల్లరుం
బరగఁగ భీతి డెందములఁ బాఱిరి భ్రాంత మనస్కులై వెసన్
హరులను గాంచి పాఱఁగ మహాసురు లార్చిరి గెల్వ వెల్గుచున్ 5.

కం. మృగరాజు భంగి గర్వం
పఁగ నసురులు వాన రాలి పాఱుచు నుండం
గఁ గని రఘు రాముఁ డయ్యసు
ర గణమ్మును నాపె శిత శర మహావృష్టిన్ 6.

ఉ. వారితులన్ మహాసురుల వారినిఁ గాంచి ఖరాత్మజుండు సే
పారఁగ రోష మాత్మఁ గడుఁ నంతట రామునిఁ గాంచి యిట్లనెన్
ఘోరపు ద్వంద్వ యుద్ధము నకుంఠిత రీతి నొసంగు వాఁడ నే
నో రఘురామ! నిల్వుమ శరోగ్రము లేసి గ్రహింతుఁ బ్రాణముల్ 7.

ఉ. మున్నట దండకా వనినిఁ బోరున నా జనకున్ వధించితే
నిన్నరయంగ నిప్పు డిట నెమ్మదిఁ గోపము నివ్వటిల్లె నిం
గన్నులఁ జూడ కుండ నటఁ గాల్చుచు నున్నది బాధ దేహమున్
మిన్నగ దుష్ట కర్మఁ గన మించెను సంజని తాగ్రహం బెదన్ 8.

ఉ. దైవ వశమ్ముచే నిచట దర్శన మిచ్చితి నాకు నివ్విధిన్
నీవు క్షుధార్త సింహము వనిన్ మృగ మక్కట చేరి నట్లుగా
నా వర బాణ వేగమున  నాశము కాఁగఁ గృతాంతు వీటినిన్
నీవ వసింతు నీ వలన నీల్గిన వారినిఁ గూడి రాఘవా! 9.

ఉ. మాటలు పెక్కు లేల యిఁక మానక రాఘువ విన్మ నా గిరల్
పోటున నెల్ల లోకములు బూర్ణము గాంచును నిన్ను నన్నునున్
మేటి గదాస్త్ర బాహువుల మిన్నగ నేర్చిన నీదు హేతులం
బాటవ మొప్పఁ బోరెదము పన్నుగ నెంచుమ నేఁడు రాఘువా! 10.

కం. విని మకరాక్షు గిరల నిం
కను బల్కుచు నుండ నవ్వి కాకుత్థ్సుం డి
ట్లనె రిత్తగ వాగెద వే
ల నీవు పెక్కులు తగనివి రాక్షస వీరా! 11.

కం. సమరమ్మున నెంచిన శ
క్య మగునె విజయమ్ము నంద వ్యర్థము లగు వా
క్యము లాడిన మాత్రమ యు
ద్ధము సేయక యేరి కైన ధరలోఁ జెపుమా 12.

ఆ.వె. వనిని దండక నటఁ బదునాల్గు వేల ర
క్కసులు నీదు తండ్రి గ్రన్ననఁ ద్రిశి
రసుఁడు దూషణుండు రణ మందు నా చేతఁ
జంపఁ బడిరి రాక్షస వర! వింటె 13.

ఆ.వె. తనివి తీరు నట్లు తినును నీ మాంసము
కాక గృధ్ర జంబుకములు తీక్ష్ణ
తుండ నఖము లున్న తండమ్ము పాపాత్మ!
నేఁడు సంగరంపు నేల యందు 14.

చం. అన రఘు రాముఁ డిట్లు విని యా మకరాక్షుఁడు బల్లిదుండు కు
ర్సెను శిత బాణ వృష్టి నని శీఘ్రమ కిన్కను రాఘువేంద్రుపై
ఘనుఁడు రఘూత్తముండు శర కాయము పైచి యొనర్ప బాణపం
క్తి నపుడు పేయి ముక్కలుగఁ ద్రెళ్లె వసుంధర దీప్త పుంఖముల్ 15.

కం. ఖర రాక్ష సాత్మజునకు ద
శర థాత్మజునకు సుఘోర సమరం బయ్యెన్
గురు బల సంయుక్తమ్ముగఁ 16.

బరస్పరము కలవడంగ భయదం బగుచున్

ఆ.వె. జాఱ వింటి నుండి జ్యా తల శబ్దమ్ము
లాజి తలము నందు నవి వినఁబడె
నాకసమ్ము నందు నభ్ర గర్జనముల
భంగినిఁ జెలరేఁగి భైరవముగ 17.

కం. కనఁ గోరి యద్భుత సమర
మును నిలిచిరి యంతరిక్షమున సుర గంధ
ర్వ నికాయ దాన వోరగ
ఘన కిన్నరు లసుర మనుజ కాంతుల రణమున్ 18.

తే.గీ. తగుల దెబ్బ లన్యోన్య గాత్రమ్ము లందు
బలము లయ్యెను రెట్టింపు వారి కంతఁ
జేసిరి క్రియాప్రతిక్రియ లాస లుంచి
గెలువ నొకరి నొకరు నాజి తలము నందు 19.

ఉ. రాముఁడు వేయ బాణ తతి రక్కసుఁ డన్నిటిఁ ద్రుంచె నాజిలో
భీమ బలుండు రక్కసుఁడు వేయ శరమ్ము లనేక ఖండముల్
రాముఁడు సేసె వాని సమరమ్మున ముల్కుల నెల్ల దిక్కులున్
భూమియు నిండ దిట్టముగ భూతల మందు వెలుంగు లాఱెనే 20.

చం. ధనువును ద్రుంచెఁ గ్రుద్ధుఁ డయి తద్దయు రాముఁడు రాక్షసేంద్రునిం
గని మఱి యష్ట బాణములు గ్రన్నన వేసి వధించె సూతు స్యం
దనమును ద్రుంచి యశ్వముల ధాత్రినిఁ గూల్చిన వేసి బాణ పం
క్తిని విరథుండునై నిలిచె దీనముగా మకరాక్షుఁ డుర్వినిన్ 21.

తే.గీ. నిలిచి నేలపైఁ గైకొనె నలిగి కరము
శూలమును భూతముల కెల్ల క్షోభ మొసఁగు
దానిఁ బ్రభ లందుఁ గన యుగాం తాన లాభ
ము మకరాక్షుఁడు దురవాపము నిశితమును 22.

తే.గీ. రుషను జ్వాజ్వల్యమానము రుద్ర దత్త 23.

మును విసరె నంత దశరథ తనయు పైన
నపర సంహార ఘోరాస్త్ర మైన దానిఁ
ద్రిప్పి యమర భయదమును దీవ్రముగను

కం. ఖర పుత్ర హస్త ముక్తము
నరసి జ్వలించు చరుదెంచు నాశూలమునున్
శరముల మూడింటను నం
బరమున వ్రక్క లొనరించెఁ బార్థివుఁ డంతన్ 24.

తే.గీ. పెక్కు ముక్కలై శూలము చక్క నైన
స్వర్ణ మండితం బా రామ శర చయార్ది
తమ్ము నేలఁ గూలెను ద్వరితమ్ముగ దివి
నుండి గూలు నుల్క పగిది భండనమున 25.

కం. కని విఱిఁగిన శూలమ్మును
ఘనముగ నక్లిష్టకర్మ కాకుత్స్థునిచే
నినదించె భూత రాశి గ
గనమునఁ గడు చక్క నైన కార్యం బనుచున్ 26.

కం. మకరాక్షుఁడు శూలమ్మను
వికలమ్మను గాంచి ముష్టి వీర వరుం డె
త్తి కినుక నిలు నిలు మంచుఁ బ
లికె నా రాఘువుని తోడ రేఁగఁ జల మెదన్ 27.

కం. అమ్మక రాక్షుఁ గని కదియ
నమ్మనుజేంద్రుఁడు హసించి యంతట వింటిన్
సమ్మదమునఁ గూరిచి వెస
నమ్మను సంధించెఁ బావ కాస్త్రము నంతన్ 28.

ఆ.వె. ఆమహాస్త్ర ఘాతుఁడై మకరాక్షుండు
రామ ముక్త శర వరమున భిన్న
హృదయుఁడై పడె నసురేంద్రుఁ డవని పైన
సంగరమ్ము నందు సమసె నంత 29.

కం. కని మకరాక్షుని పతన
మ్మును రక్కసు లెల్ల రామ ముక్త విశిఖ భీ
తిని౯ బాఱిరి లంకా పుర
మున కర్దితులై భృశమ్ము బోరన నంతన్ 30.

ఆ.వె. రామ శర రయమున కా మకరాక్షుఁడు
ఖర కుమారుఁ డట్లు ధరణిఁ గూల
వజ్ర ఘాత పతిత పర్వతమ్ము పగిది
హృష్టు లైరి యమరు లెల్లఁ గాంచి 31.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు డెబ్బది తొమ్మిదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 80.

మకరాక్షుని మరణము నాలకించి రావణుఁడు యుద్ధమునకు సుతుని నింద్రజిత్తునిఁ బంప నాతఁ డగ్నికి హోమము చేసి యదృశ్య రూపమున రామ లక్ష్మణులపై శర వర్షమును గురిపించి శర ధారలతో రణ భూమినిఁ గప్పి వానరు లనేకులు మరణింప నింద్రజిత్తుని జయించు నుపాయములను రామలక్ష్మణులు చింతించుట.

కం. విని మకరాక్షుని మరణము
నని విజయుం డనిశ మా దశాస్యుం డంతన్
ఘన రోషాత్ముఁడు కటకట
మని పండ్లు కొఱికి తలంచె నలమట నాత్మన్ 1.

కం. కుపితుండు కార్య మేమని
విపరీతమ్ముగఁ దలంచి వివిధ విధములన్ 2.

రిపు దమను నింద్రజిత్తుఁ గ
ని పనిచె యుద్ధమునకు సుతుని మహావీరున్

కం. వధియింపు మహా వీరులఁ
బ్రధనమ్మున రాఘవులను బల మందు నహో
యధికుఁడ వీ వెల్లపు డే
విధిఁ గనఁబడి కనఁ బడకయు వీరవరేణ్యా! 3.

తే.గీ. అప్రతిమ కర్మ నింద్రుని నంక మందు
గెలిచి తీ వన్నచో మనుష్యులను గాంచి
యేల గెలువ కుందువు వీర! యాల మందు
నా విని జనకు నాజ్ఞ తనయుఁడు దాల్చి 4.

చం. చన విని యింద్రజిత్తపుడు సల్పగ హోమము యజ్ఞ భూమికిం
గొని యసు రాంగనా మణులు గూరిమి వచ్చిరి సంభ్రమించుచుం
బనివిని యంత సెట్టి తలపాగలు హేతులు తెల్లుగడ్డి యె
ఱ్ఱని వలువల్  విభీతకపు జూచిన కట్టెలు నిన్ప స్రుక్కులున్ 5.

ఉ. ఎల్లెడ లందు దర్భలను నింపుగ నగ్నికి నంతఁ జుట్టునున్
బల్లెము లుండఁగం బఱచి పన్నుగఁ బ్రాణము లున్న నిండుగా
నల్లని మేక కంఠమును నైర్రృత వర్యుఁడు పట్టి గట్టిగా
నల్లన సంగ్రహించె వెస యజ్ఞ తలమ్మున సంగ్రహింపఁగా 6.

తే.గీ. అంతఁ గనిపించె విజయ చిహ్నమ్ము లెల్ల
హోమ మట వృద్ధి వొంద నహో పొగ కన
రాని మంటలు సెలరేఁగ రాక్ష సేంద్రుఁ
డింద్రజిత్తుఁ డొనర్పఁగ నిద్ధ క్రతువు 7.

కం. కుడివైపు తిరుగు జ్వాలల
నడరుచుఁ గరగించి నట్టి యభ్ర మనఁగ మీ
ఱెడు పావకుండు స్వయముగ
వడి లేచి గ్రహించె హవినిఁ బరమ ముదమునన్ 8.

తే.గీ. వేల్చి యగ్నికిఁ దనిపి దివిజుల దాన
వులను రక్కసుల నుచితంపు గతి నంత
నెక్కఁ గాన రాని యరద మితరులకు శు
భమును శ్రేష్టమ్ము నసుర ప్రవరుఁడు వడిని 9.

తే.గీ. గుఱ్ఱములు నాల్గు లాగఁగ ఘోర నిశిత
మార్గణమ్ముల తోడుత మహిత చాప
మెక్కిడం బడ వెలిఁగెఁ దే రింపు గొలుప
భృశము జాజ్వల్య మానమై పెన్తనువున 10.

తే.గీ. కాంచ నాంచిత భూషణ కాంతు లడర
మృగ సమూహము చంద్రార్ధ కృత శశీంద్ర
రచనల నలంకృతము గాఁగ రమ్య రథము
కరము భాసిల్లు చుండె నసురుని తోడ 11.

కం. పసిడి కడియమ్ము లడరఁగఁ
బస వెలుఁగు ననలము పగిది భాసిలు చుండన్
విసవిస కదలు ధ్వజం బట
మిసిమి విదూరజ కలితము మేలుగ నమరెన్ 12.

కం. ఇన సన్నిభ బ్రహ్మాస్త్రము
తను రక్షింపంగ నయ్యెఁ దథ్యమ్ముగ నె
వ్వని కైన దురాధర్షుఁడు
ఘన బలుఁ డా యింద్రజిత్తు కయ్యము నందున్ 13.

ఆ.వె. వెడలి పురము నుండి వీరుఁ డాజి జయుండు
నసుర మంత్ర వాక్కు లతఁడు సదివి
వేల్చి వహ్ని నట్లు వేగ యదృశ్యుఁడై
పలికె నింద్రజిత్తు పలుకు లిట్లు 14.

చం. కపటముగా వనమ్ములను గ్రాలెడు వారల నిర్వ్యరన్ వధిం
చి పెనఁగి యిత్తు నే జయము శీఘ్రము తండ్రికి సంగ రార్జిత
మ్ము పరుల రామలక్ష్మణులఁ బోరునఁ జంపి ప్లవంగ హీనమై 15.

విపులఁ జరింపఁ జేయుదును వేడుక నంచు వచించి మాయమై

ఉ. వచ్చెను దండ్రి ప్రేరణను వాడి శరమ్ములు చాప ముండఁగాఁ
జెచ్చెరఁ దీక్షుఁ డయ్యసుర చెన్నుగ మూడుశిరమ్ములున్న యా
యచ్చపు సర్ప సన్నిభుల నారసె వానరు లందు విడ్వఁగా
హెచ్చుగ బాణ సంచయము నిర్వర వీరుల రాఘు వేంద్రులన్ 16.

ఉ. వీరలె రామలక్ష్మణులు వీరుఁడు రావణి నా తలంచి యే
పారఁగఁ గిన్క నారి నిడి యమ్ముల వర్షము మేఘ భంగినిన్
ధారగఁ దొల్కరించె వితతమ్ముగ సెల్లెడఁ జేరి నింగినిం
దేరు యుతమ్ము కన్పడక ధీరుల నొంచెను రాఘువేంద్రులన్ 17.

చం. ధనువునఁ గూర్చి బాణములు తక్షణ మేసిరి యస్త్ర పంక్తినిన్
ఘనముగ నావరింపఁబడి కౌణపు మార్గణ కోటిచే ననిన్
మనుజులు రామలక్ష్మణులు మానుగ సూర్య నిభాస్త్ర రాశిఁ గ
ప్పిన దివిఁ దాఁక నేర వవి వీరుని రావణి సెట్టి ముల్కులున్ 18.

తే.గీ. అసురుఁ డొనరించి పొగ తోడి యంధకార
మును నభమ్మును వెసఁ గప్పి ఘనము గాను
దిక్కులను గప్పిఁ గల్పించి వెక్కసముగ
మంచు తోడఁ జీఁకటిని శ్రీమంతుఁ డంత 19.

కం. వినరావు జ్యాతలధ్వని
యు నేమి ఖుర శబ్దములు నహో చనుచుండం
గన రా దసురుని రూపం
బని సేయుచు నుండ సుంత యైనఁ బరులకున్ 20.

తే.గీ. మబ్బు కమ్మిన చీఁకటి మాడ్కి యంధ
కారమున మహా బాహుఁడు గండు శిలల
వర్షము పగిది నారాచ బాణ వర్ష
ముఁ గురిపించె నద్భుతమును బొలసుదిండి 21.

ఉ. రాముని క్షోభపెట్టెను శరమ్ముల దత్త వరమ్ములన్ మహా 22.

భీమ బలుండు సూర్య నిభ భీకర వాజుల గాత్ర పంక్తిలో
నా మనుజాశనుండు విశి ఖావలి తప్త శరీర రాఘవుల్
హేమ సుపుంఖ బాణ ఘన వృష్టిఁ గురించిరి యింద్రజిత్తుపై

ఆ.వె. విన్ను నందు నున్న వీరు రావణిఁ జేరి
కాయ మెల్లఁ జీల్చి కంకపత్ర
ములు రుధిరము తోడ భూమిపైఁ గూలిన
వంత రామ లక్ష్మ ణాంక శిఖులు 23.

ఆ.వె. బాణ పంక్తి చేత బాధింపఁ బడు నర
ర్షభులు వడ శిఖులు రామ లక్ష్మ
ణు లరసి బహు భల్లములు వేసి ఛేదించి
రంక మందు వీరు లన్నిటి వెస 24.

కం. ఎటు సూచిన శిత శరముల
నటు వైపు కురించిరి పర మాస్త్రము లంతం
బటిమ రఘు వీర వర్యులు
ద్రుటిం జెలఁగి దాశరథులు దుర్జయు లాజిన్ 25.

చం. అతిరథుఁ డింద్రజిత్తు సక లాశలఁ దిర్గుచుఁ దేరు పైన నా
తతముగ రాఘవేంద్రులను దద్దయుఁ దీక్ష్ణ శ రాలి నొంపఁగా
నతులమ యభ్ర పుంఖ విశి ఖావలి విద్ధులు వోలి రెన్నఁగా
వితత సు మాన్వితమ్ము లగు వృక్షములం బెను కింశుకమ్ములన్ 26.

కం. ఘనముల మున్గిన రవి వలె
ధనువును నాకృతి శరము లితరములు వేగ
మ్మును సుంతయు నేర రెవరు
ఘన రాక్షస వర్యు ఘోర కార్యము లాజిన్ 27.

కం. వాని వలనఁ గొట్టఁ బడిన
వానరులు సమయ రణమునఁ బ్రాణ విహీనుల్
పే నేలఁ గూలి రప్పుడు
కానఁగ వందల కొలంది కలఁత సెలంగన్ 28.

ఉ. అంత వచించె నిట్లలిగి యగ్రజునిం గని లక్ష్మణుండు నే
నంత మొనర్ప రక్కసుల నస్త్ర వరమ్మును బ్రహ్మముం బ్రయో
గింతు ననంగ నోదరుని నింపుగ నా శుభ లక్షణున్ ఘన
స్వాంతుఁడు గాంచి యిట్లనెను జంపకు మొక్కని కోస మెల్లరన్ 29.

తే.గీ. సంగర మొనరింపని వాని శరణ మన్న
వాని దాఁగిన వానినిఁ బ్రాంజలి నిలి
చినను వానిఁ బాఱెడు వాని ననుజ! మత్తు
ని నయిన వధింపఁగఁ దగదు నీకు నెపుడు 30.

తే.గీ. ఆతని వధింప యత్నము నాజిఁ జేయఁ
దొడఁగుదము సర్ప నిభములఁ దూపులను మ
హా భుజా! ప్రయోగింత మయ్యసుర వరునిఁ
జంప రావణాత్మజుని నీ సమర మందు 31.

ఆ.వె. కాంచి నంత వానిఁ గపి యూధపులు చంపు
వారు కాన రాని తేరు నందు
మాయఁ దిరుగు వాని నా యసురుని క్షుద్రు
బలిమి నెల్ల రడరి భండనమున 32.

తే.గీ. పుడమిఁ దూటిన నింగికి వెడలిన దివ
మున కరిగిన రసాతలమున కరిగిన
దాఁగి యున్నను నా మహాస్త్రముల నసువు
లను విడిచి కూలు నిఁక భూ తలమ్ము నందు 33.

కం అని యిట్టు లర్థ వంతము
లిన కుల వీరుఁడు ప్లవగులు వృతులై యుండం
గ నృశంసు రౌద్రు నింద్రజి
తునిఁ జంపఁగ వేచు చుండెఁ దూర్ణం బనిలో 34.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నెనుబదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 81.

ఇంద్రజిత్తు రాముని మనస్సు నెఱిఁగి యుద్ధము వీడి లంక కేఁగి మాయా సీతను కల్పించి తిరిగి వచ్చి హనుమంతుఁడు మున్నగు హరి వీరులు చూచు చుండఁ గత్తినిఁ దీసి మాయా సీత మూర్ధమును బట్టి వధించుట.

కం. నేరి మహాత్ముని రాముని
యా రఘు వీరుని మనస్సు నసురుం డంతం
బోరాట దక్కి నగరికి
బోరనఁ జనె వేడబమ్ము పురికొన మదిలో 1.

కం. స్మరియించుచు హతుల మ హా
సుర వీరుల డెంద మందు శోకార్తుండై
కర మాగ్రహించి భీ మా
సురుఁ డెఱ్ఱని లోచనముల శూరుం డేఁగెన్ 2.

కం. పౌలస్త్యుఁ డేఁగుదెంచెను
వీలుగఁ బడమటఁ గలట్టి పెను ద్వారమునన్
వేల యసురులం గూడుచు
నాలమునకు దేవకంట కాసురుఁడు దృటిన్ 3.

ఉ. కాంచెను రామ లక్ష్మణులఁ గయ్యములోఁ జెలరేఁగు చుండఁగన్
మించి భృశమ్ము నింద్రజియె మేటి నృవీరుల నంత మాయ నూ
హించి యతండు వంచనపు టింతిని సీతను దేరు నందుఁ దా
నుంచి వధింప నెంచె నెద నుండఁగ రక్కసు లెల్లఁ దోడుగన్ 4.

ఉ. ఎల్లరఁ జేయ మోహితుల నిత్తఱి దుర్మతి యెంచి యింద్రజి
త్తుల్లము నందు జానకినిఁ దొయ్యలి నుంచి రథమ్ము నందు రా
నెల్లరు వానరాధిపు లహీన పరాక్రము లంతఁ గ్రుద్ధులై
పెల్లుగ నుద్యమించిరి సుభీమ శిలా కరులై రణమ్మునన్ 5.

కం. హనుమంతుఁ డేఁగి ముందఱఁ
గొని పర్వత శృంగము నతి ఘోరమ్మును నె
వ్వనికిం జేరఁగ రానిది
ఘనుఁ డా కపి కుంజరుండు కయ్యము లోనన్ 6.

మ. కనియెన్ రావణి స్యందనమ్మునను భూకన్యన్ విచా రాంగనం
దను జీ ర్ణాబల నేక వేణిఁ గృశ వస్త్రన్ దీన సంస్కార హీ
నను నేకాంబర రాఘవప్రియను గాంతా రత్నమున్ ధూళి యు
క్తను కాంతన్ హనుమంతుఁ డంకమున బాధా తప్త చిత్తుండునై 7.

ఆ.వె. కని యొకింత తడవు కాంతను సీతగ
మారుతాత్మజుండు మనము నందుఁ
దలఁచెఁ గాంచెను గద తన్విని నచిర కా
లమ్ము మునుపె తాను లంక లోన 8.

తే.గీ. కని రథమ్మున మసి తోడఁ గాయ మున్న
కాంత నతి దీనను హనుమ స్వాంత మెల్ల
నిండ వంతతో మైథిలినిఁ గను లందుఁ
గాఱఁ గన్నీరు మునిఁగె శోకమ్ము నందు 9.

చం. కని హనుమంతుఁ డయ్యసుర కాంతు రథమ్మునఁ జెంత నున్న సీ
తను వెత నున్న దీన సతిఁ దన్విని నెయ్యది సేయఁ దల్చె నీ
మె నితఁడు నా వచించుచును మిన్నగఁ దల్చి మహా కపీంద్రుఁ డం
త నలుకఁ గూడి వానరుల దాడికిఁ బర్విడె నింద్రజిత్తుపై 10.

చం. కని హరి సేన నయ్యసుర కాంతుఁడు క్రుద్ధుఁడునై మహాసి నం
త నొఱఁ గలట్టి దాని నిశితమ్మును లాగి లతాంగి మూర్ధముం
గనికర మింత లేక మది గ్రన్ననఁ బట్టి ప్లవంగు లెల్లఁ జూ 11.

డ నఱవ రామ రామ యని టక్కరి కొట్టెను సీత నత్తఱిన్

ఆ.వె. జుట్టు పట్టి లాగ సుదతి సీతను గాంచి
దీనుఁ డయ్యె హనుమ తీవ్రముగను
శోకజంపు వారి నా కపి వర్యుని
నేత్ర యుగము నుండి నిండఁ గాఱె 12.

ఆ.వె. చారు సర్వ గాత్ర జానకి రామప్రి
య మహిషి నరసి రుష ననియె రాక్ష
సాధిపాత్మజుఁ గని హనుమ పరుష వాక్య
ములను బరమ రోష మూర్ఛితుండు 13.

ఆ.వె. ముట్టి తీవు కేశముల రామ మహిషిని
నాత్మ నాశమునకు నకట పుట్టి
బ్రహ్మ ఋషుల గొప్ప వంశమున దురాత్మ!
యసురి కుక్షిఁ బుట్టి నట్టి కతన 14.

తే.గీ. పాప కర్ముఁడ నీ విట్టి పనినిఁ గట్ట
చేసి తిస్సీ యనార్యుఁడ చెడ్డ నడక
వాఁడ! క్షుద్రుఁడ! దయలేని వాఁడ! పాప
విక్రముఁడ! లేదె పనిఁ గృప వెడ యెడంద 15.

ఆ.వె. దూర మయ్యె నకట నారి గృహము నుండి
రాజ్య మందు నుండి రామ హస్త
మందు నుండి యెట్టి యపరాధ మొనరించె
నీమె నీకుఁ గొట్ట నేల దలఁతు 16.

ఉ. సీతను జంప నుండ విట జీవము లింకఁ జిరమ్ము నీకు నా
చేతికిఁ జిక్కి తీ విటుల జీర్ణము కాఁ దగి నట్టి వాఁడవై
నాతులఁ జంప నేఁగెడు ననార్య! జగమ్ముల కేఁగు వాఁడవే
వీత నిజాసుపై యధమ! విశ్వ వధార్హుఁడ! క్రూర రాక్షసా! 17.

చం. పలుకుచు నిట్లు సాయుధులు వానర వర్యులు తోడు రా మహా 18.

నిల తనయుండు పర్విడెను నిండఁగఁ గోప మెడంద రావణిన్
ఖలు నెదిరింప వచ్చెడు నఖర్వపు వానర సేన నంత వీ
ర్యు లసుర వీర వర్యులు మహోన్నత కాయులు కిన్క నాపఁగా

ఉ. ఆతఁడు వేల బాణముల నా హరి సైన్యము క్షోభ పెట్టి తా
నా తఱి యింద్రజిత్తు పవనాత్మజుఁ గాంచి వచించె నివ్విధం
బాతత రోష చిత్తుఁ డయి యా హరినాథుఁడు రాఘువుండు నీ
వే తెలిగంటిఁ గాచుటకు నిట్లరుదెంచొరొ యామెఁ జంపుదున్ 19.

ఉ. నీ విటఁ జూచు చుండఁగను నిర్దయ నిప్పుడ మారుతాత్మజా!
యీ వసుధా కుమారి వధియించి సలక్ష్మణ రాము నిన్ను సు
గ్రీవుని నవ్విభీషణునిఁ గిన్క దురాత్ముని నేఁడ చంపుదుం
గావఁగ రాదు పీడ లిడఁ గాంతలఁ జంపఁగ వచ్చు వారినిన్ 20.

ఉ. స్త్రీల వధింప రా దనుచుఁ జెప్పితి వీ వది రిత్త మాటయే
చాలును బల్కియివ్విధము చారు శుభాంగిని నేడ్చుచుండఁగా
బేలను మాయ జానకిని వేగ స్వయమ్ము వధించె నంత దు
శ్శీలత నింద్రజిత్తపుడు శీఘ్రుమ తీక్ష్ణపు ఖడ్గ ధారచే 21.

ఆ.వె. జన్నిదంపు గతిని నన్నుల మిన్న కో
యఁబడ నట్లవనిజ యవనిఁ గూలె
దీనురాలు రమ్య మైన రూపము పృథు
శ్రోణి యతిశయింపఁ జూచుచుండ 22.

తే.గీ. చంపి యింద్రజిత్తు ధరణిజ ననె నిట్లు
హనుమ తోడ వీక్షింపు రా మాత్మసతినిఁ
జంపితిని కిన్క వైదేహి చావ నయ్యె
మీ పరిశ్రమము వృథా సమీర పుత్ర! 23.

చం. సునిశిత ఖడ్గ రాజమున శూర వరేణ్యుఁడు చంపి యట్లు సీ
త నరద మెక్కి రావణి ముదం బెదఁ దద్దయు మీఱ నంత నా
ర్చె నిలిచి యింద్రజిత్తసురసేనకు మధ్యను జెంత నుండఁగా
నినదము వ్యాది తాస్యు ఘన నిస్వనమున్ విని రెల్ల వానరుల్ 24.

కం. ఘనముగ ముదితుం డయ్యెను
వనితామణిఁ జంపి కుమతి వజ్రిరిపుఁ డెదం
గని హృష్టాసురుఁ బాఱిరి
వనరుచు సువిషణ్ణ హృదులు వానరు లెల్లర్ 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నెనుబది యొకటవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 82.

ఇంద్రజిత్తు భీషణ నాదమ్మును విని యెల్ల వానరులు భీతితోఁ బర్విడ హనుమంతుని ప్రేరణముతో శిలా వృక్షములతో యుద్ధము సేయ మారుతి యనేక రాక్షసులను వధించి సీతా వధ నెఱిగింప రాముని వద్దకు నేఁగ నింద్రజిత్తు నికుంభిల కేఁగి హోమ మొనర్చుట.

కం. విని ఘోరం బగు నాద మ
శని సన్నిభము నరయుచు దిశల నెల్ల హరుల్
మనముల నుప్పొంగ భయము
ఘనముగఁ బరుపెత్తి రెల్ల కపి పుంగవులున్ 1.

చం. కపులను మారుతాత్మజుఁడు గాంచి విషణ్ణులఁ బల్కె నివ్విధిన్
విపుల భయార్త దీనులను భీతినిఁ బాఱఁగ వేరు వేరుగాఁ
గపివరు లార! దీను లయి కయ్యము వీడుచుఁ బాఱనేల మీ
కిపు డెటఁ బోయె శూరతయు నిందఱ కిట్టి విచార మేలనో 2.

ఉ. నేను జనంగ ముందుగ ననిం దగ రండిఁక నాదు వెన్కనే
మాని రణమ్ము వాఱుటయు మంచి కులమ్మున నుద్భవింపఁగా
మానము గాదు శూరులకు మారుతి యిట్లు వచింపఁ గ్రుద్ధుఁడై 3.

ఘ్రానులు ఱాళ్లు గై కొనుచు మర్కట వీరులు రేఁగి రాజిలో

చం. హనుమను జుట్టి గర్జ లిడి యంతట దూఁకిరి రాక్షసాళిపైఁ
గనలి ప్లవంగ పుంగవులు కయ్యము నందుఁ బ్లవంగ యుక్తుఁడై
యనలుని భంగి మండుచు మహాసుర సైన్యముఁ గాల్చె నుగ్రుఁడై
యనిల సుతుండు రాక్షస చయంపు మహా కదనం బొనర్చుచున్ 4.

తే.గీ. కాల సన్నిభుండు నయి కిన్క సెలరేఁగఁ
గరము డెందమ్ము నందు శోకమ్ము సెలఁగ
భృశము కపి పుంగవుం డంతఁ బెద్ద శిలను
రావణి రథముపై వైచెఁ బావని ధృటి 5.

ఉ. వచ్చెడు నమ్మహా శిలను బన్నుగ సారథి గాంచి చెప్పఁగా
నిచ్చలు నాలకించునవి నెమ్మిని గుఱ్ఱము లున్న తేరునుం
జెచ్చెరఁ దోలె దూరముగఁ జేరక యా శిల యింద్రజిత్తునిం
జొచ్చెను భూమి లోపలకుఁ జూడఁగ సారథి వ్యర్థమై వెసన్ 6.

ఆ.వె. నలిఁగి రసుర వరులు శిల పడు చుండఁ గ్రిం
ది కతి వేగముగను వికల తనులు
కలఁత సెంది రెల్ల కౌణప వర్యులు
నేల రాల ఱాయి యాల మందు 7.

ఉ. వందల కాననౌకసులు పాదప ఘోర శిలాచయమ్ములం
బొందిక నెత్తి వైచి రటఁ బోరున భీమ శరీర ధారులే
యందఱు నింద్రజిత్తు పయి నయ్యరి వర్గము వృక్ష వృష్టినిం
జిందఱ లద్రి శృంగములఁ జేసిరి యార్చిరి వింత వింతగన్ 8.

తే.గీ. భీమ రూపులు వానర వీర వర్య
లసురులను ఘోర రూపుల నప్పళింపఁ
దరుల శిలలఁ గూలిరి నిశాచరులు సమర
తలమునం జేష్ట లుడుగంగఁ దాడనముల 9.

కం. కని స్వీయ సైన్య మెల్లను 10.

ఘన వానర తాడితమ్ముఁ గయ్యము లోనన్
ఘనుఁ డింద్రజిత్తు రోష
మ్మున సాయుధుఁడై యుఱికెను మూరి రిపులపై

కం. సృజియించి శరౌఘమ్ముల
నిజ సేనా పరివృతుఁ డయి నిర్దయఁ గొట్టెన్
విజ యాకాంక్షి హరుల నిం
ద్రజిత్తనేకుల విదిత పరాక్రముఁ డాజిన్ 11.

తే.గీ. వాని యనుచర వీరులు వాన రర్ష
భులను ఖడ్గములను గూట ముద్గరముల
వజ్ర శూలరాజమ్ములఁ బట్టసములఁ
గొట్టి రాహవమం దతి ఘోరముగను 12.

తే.గీ. పెద్ద బోదెల కొమ్మల వృక్షములను
గండు శిలలతో నబ్బల్లిదుండు హనుమ
ఘోర రాక్షస కదన మవారిత గతిఁ
జేసె భీమ కర్మాసుర శ్రేణి నణఁచె 13.

ఆ.వె. పర బలమును హనుమ వారించి పలికె వ
నౌకసులను గాంచి యో కపి వరు
లార! మరలుఁ డింక నసుర బలమ్ము సా
ధింపఁ దగ దిపుడు తలంప మనకు 14.

ఉ. రాముని కీయ సంతసము ప్రాణము లందుఁ ద్యజించి యాస నే
భామ నిమిత్త మిచ్చటకు వచ్చిన వారమొ యట్టి సీతయే
తా మరణించె నింద్రజితు దారుణ ఖడ్గము చేత దీని నా
రాముని కా హరీశునకుఁ దప్పక యేఁగి వచింపఁగా వలెన్ 15.

తే.గీ. తెలిపి వారు వచించు రీతి నొనరింప
వలయు మనకు నిట్లు వచించి వానరులను
వేగ వారించి నిర్భీతి వెడలఁ దొడఁగె
నల్ల నల్లనఁ గపి సైన్య మెల్ల రాఁగ 16.

కం. కని హనుమంతునిఁ జన రా
ముని చెంతకుఁ గ్రతు వొనర్పఁ బొలదిండి వెసం
జనె నింద్రజిత్తు చైత్య
మ్మునకు నికుంభిలకుఁ గుమతి పొలుపారు తమిన్ 17.

ఉ. పావకు నంత వేలిచెను బన్నుగ నెక్కి నికుంభిలం దమిన్
రావణి వేల్పు చుండ ననలం బట పెల్గెను యజ్ఞ భూమిలోఁ
జేవను రక్త మాంస భుజి చెన్నుగ జ్వాలలఁ గూడి తృప్తుఁడై
యా వని వహ్ని సంధ్య తఱి నా రవి భంగినిఁ దోఁచె దీప్తుఁడై 18.

తే.గీ. రాక్ష సాభివృద్ధి కొఱకు రావ ణాత్మ
జుఁడు విధానజ్ఞుఁ డయ్యసురుఁ డొనరించె
హోమము విధి వంతం బరయుచు న యాన
యజ్ఞు లసురు లుండిరి గుంపు నందు నిలిచి 19.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నెనుబది రెండవ సర్గము.

# యుద్ధ కాండము

# సర్గము 83.

మేఘనాదునిచే సీత మరణించుటను విని నంత రాముఁడు మూర్ఛిల్ల లక్ష్మణుఁ డూఱడించి యింద్రజిత్తును వధించుటకై యుద్యమించుట.

కం. విని రాక్షస వానర ఘో
ర నినదములు భీమ సంగర తల జనితముల్
మనుజేంద్రుఁడు రాముఁడు వ
ల్కె నిట్లు గని జాంబవంతు గిర లుచితమ్ముల్ 1.

చం. వినఁబడె నాయుధధ్వనులు భీమ తరమ్ములు మారుతాత్మజుం
డనిఁ గడు దుష్కరంపు పని నద్భుత రీతినిఁ జేసి యుండ నో
పు నడరి సౌమ్య! ఋక్షపతి! పొమ్ము స్వసైన్యము తోడ వానరేం
ద్రున కిడ సాయ మింపుగను దూర్ణము యుద్ధము సేయు వానికిన్ 2.

ఉ. రాముని కట్లె యంచు నని క్రన్నన స్వీయ బలమ్ము తోడఁ దా
నా మరు దాత్మసంభవుని నారయ నేఁగెను జాంబవంతుఁ డా
ధామము సేరఁ బశ్చిమపు ద్వారము గాంచె ససైన్య మారుతిన్
ధీమతి రా వగర్చుచును దిర్గి రణం బొనరించి దారిలో 3.

ఆ.వె. కాంచి మార్గ మందు మించిన ఋక్ష బ
లమ్ము హనుమ యుద్యతమ్ము నీల
మేఘ సన్నిభం బమోఘమ్ము వెస నాపి
తాను గూడ మరలెఁ దత్క్షణమ్ము 4.

తే.గీ. సన్నికర్షముఁ జేరి ససైన్య మిట్లు
శీఘ్రముగ వచించె హనుమ చింత మీఱ
రామునిం గని రణ మందు మేము గాంచఁ
జంపె సీత నేడ్చుచు నుండ శక్రజిత్తు 5.

కం. కని యా దృశ్యం బరి మ
ర్దన! నే విభ్రాంత చిత్తత విచారమునం
జనుదెంచితి నెఱిఁగింపం
గ నీకు నిచ్చటకు వేగ కాకుత్స్థ వరా! 6.

కం. విని యా గిరలను మూర్ఛి
ల్లెను శో కాక్రాంతుఁడై హరిప్రవరుఁ డనం
గ నృవరుఁడు ఛిన్న మూల ఘ
న న గాభమ్ము పుడమి పయిన రఘుపతి వడెన్ 7.

చం. కని ధరఁ గూల దేవ నిభుఁ గాఱియ రాముఁ బ్లవంగ సత్తముల్
సని రపు డుర్కుచున్ దరికిఁ జల్లిరి మండెడు నగ్ని వోలెఁ జే 8.

ర నలవి కాని వీర వరు రాముని యాస్యము పైన నంతఁ జ
ల్లని యుదకమ్ముఁ దామరస రమ్యత రోత్పల గంధ యుక్తమున్

ఉ. అంతట లక్ష్మణుండు పర మార్థుఁడు కౌఁగిటఁ జేర్చి యన్ననున్
వంతను బాహు యుగ్మములఁ బల్కెను వాక్యము లర్థ వంతముల్
సంతత ముంటి ధర్మమునఁ జక్క జయించి నిజేంద్రియమ్ములన్
సుంతయుఁ గావ కున్న యెడ శోకములం దది వ్యర్థమే చుమీ 9.

తే.గీ. స్థావరమ్ములు నింకను జంగమములు
నైన భూతమ్ము లున్నవి కాని యట్టి
పగిదిఁ గన రాదు ధర్మమ్ము వసుధ లోన
నంచు నెంతును నే మది నంచితముగ 10.

ఆ.వె. స్థావరమ్ము మఱియు జంగమం బగపడు
నట్టు లిట్టి యర్థ మకట కాదు
యుక్త మెన్న నయిన నో రాఘవేంద్ర! ని
న్నిట్టు లాపద లవి చుట్టుకొనునె 11.

కం. కల దేని యధర్మము చను
ఖలుఁ డా దశవక్త్రుఁడు నరకమ్మున కెన్నం
గలుగన్నే రవు వ్యసన
మ్ములు ధర్మ చరితున కిట్లు మూరుచు నీకున్ 12.

తే.గీ. లేక యుంట విపత్తులు లేశమైన
రావణునకు నీ కిటుల మూర వ్యసనములు
భువిని రామ! ధర్మాధర్మము లిటఁ దాఱు
మాఱులె పరస్పరము నెన్న మానవేంద్ర! 13.

తే.గీ. ధర్మమున ధర్మ ఫలము నధర్మమున న
ధర్మ ఫల మగు నేని యధర్మ మందుఁ
దగిలి వీడరు ధర్మము ధరణి జనులు
ధర్మ యుతులు వొందెడు వారు ధర్మ ఫలము 14.

తే.గీ. ధనము లభివృద్ధి సెంద నధర్మ మందు
నున్న వారికిఁ గ్లేశము లుండ ధర్మ
శీలురకు రిత్త లగు రెండు చింత సేయ
ధర్మ మైనను మఱియు నధర్మ మైన 15.

ఆ.వె. కాఁగ హతులు పాప కర్మ లధర్మము
చేత నాశ కర్మ శిథిల మగు న
ధర్మ మెవనిఁ జంపఁ దగును దలఁప రామ!
స్వయము హతము గాఁగ వసుధ లోన 16.

ఆ.వె. విహితపుఁ బనుల నిది విలయ మైన లయ మొ
నర్చినను బరుల ననఘ సమేత
కర్మమున విధి యగుఁ గాంచ లిప్తము కర్త
గాఁడు రఘువరేణ్య! పాడి సెంచ 17.

కం. ప్రతిచర్య సేరనిది యే
గతి ధర్మ మరి దమనుండ! కనరానిది స
ద్గతి నీయ సమర్థ మగును
మతినిం బరికించి చూడ మనుజ వరేణ్యా! 18.

ఆ.వె. సత్తనునది యున్న సత్పురుషశ్రేష్ఠ!
కలుగునే యసత్తు కలఁత సెంద
నిట్లు నీకుఁ గలిగె నిపుడు ఘోరమ్ముగఁ
గాన ధర్మ ముంట కాదు నిజము 19.

కం. బలహీనము బేలయునై
బలమును ధర్మమ్ము కదిసి వర్తింపఁగ దు
ర్బలము నమర్యాదను మను
జులు సేవింపఁ దగ రంచు శూర! తలఁచెదన్ 20.

కం. బలమునకు లొంగ ధర్మం
బిలం బరాక్రమము నందు నెలమి విసర్జిం
చి లలితముగ ధర్మమ్మున 21.

నిలిచిన భంగిని బలమున నిలుమా రతినిన్

ఆ.వె. సత్యమును బలుకుట శత్రుఘ్న! ధర్మం బ
ని పరికించిన యెడ నిజము పలుక
ని జనకుని మ జేల నీవు బద్ధునిగ నొ
నర్ప కుంటివి కరుణా విహీను 22.

ఆ.వె. ధర్మ మైన నా యధర్మ మేనియు నున్న
మున్ను వజ్రి చంపి మునినిఁ బిదపఁ
జేయ కుండుఁ గ్రతువుఁ జిత్రముగ శతక్ర
తు వరి వీర దమన! యవని లోన 23.

కం. ధర్మము నాశము సేయు న
ధర్మ యుతం బయి రఘువర! ధరలో మనుజుల్
కర్మము లొనర్తు రన్నిటి
నర్మిలి నచ్చిన విధమ్ము నరశార్దూలా! 24.

కం. ఇదియే నాదు మతమ్మును
బదిలపు రాజ్యంబు నెల్లఁ బరమప్రీతిన్
వదలితివె ధర్మమూలము
నెదఁ దల్పక సుంత యైన నింతకు మునుపే 25.

తే.గీ. అట్లు నిట్లు సిద్ధించిన యర్థములను
వృద్ధి నెందఁగ వర్తిల్లు నిద్ధర సక
లమ్ము లైన కార్యములు శైలమ్ము లందుఁ
బాఱు సెలయేరుల పగిది పార్థి వేంద్ర! 26.

కం. ధన హీన పురుషు నల్ప మ
తి నిఖిల కర్మములు సెడును దీవ్ర నిదాఘ
మ్మున నెండు చిన్న నదుల వ
లెను బరికింపంగ శంక లే దిం దనఘా! 27.

ఆ.వె. సుఖముగఁ బెరిఁగి నతఁ డఖిలార్థములఁ ద్యజి 28.

యించి తిరిగి సుఖము లెంచి మదినిఁ
బాప కార్యములను నేపుగఁ జేయఁ దొ
డంగు దోషములు పరంగు నంత

తే.గీ. అర్థ మున్న నుందురు మిత్రు లర్థ మున్న
నాత్మ జను లుంద్రు పురుషుఁడౌ నర్థ మున్న
లోక మందుఁ బండితుఁడౌ గురుతర మర్థ
మున్న నాతండు మనుజేంద్ర! యుర్వి లోన 29.

ఉ. ఎవ్వని కున్న నర్థ మతఁ డెన్నఁ పరాక్రమ వంతుఁడౌ నహో
యెవ్వని కున్న నర్థ మిల సెల్లర కాతఁడు బుద్ధిమంతుఁడౌ
యెవ్వని కున్న నర్థ మతఁ డిద్ధర లోన నదృష్టవంతుఁడౌ
యెవ్వని కున్న నర్థ మతఁడే పరికింప మహా గుణుండునౌ 30.

చం. విడిచిన చో స్వయమ్ముగను విత్తముఁ జెప్పితిఁ గల్గు దోషముల్
వుడమిని నేన యత్తఱినిఁ బూర్ణము రాజ్యము వీడు బుద్ధినిం
దడయక నీవు కొంటకుఁ గతమ్మును రాఘవ!నేరకుంటి నా
యెడఁదను సుంత నిక్కముగ నివ్విధి దుర్విధి మూరె నిచ్చటన్ 31.

చం. అలవడు ధర్మ కామములు నర్థము తిన్నగ నర్థ మున్నచోఁ
గలుగవు విత్త హీనునకుఁ గామము మీఱినఁ బొంద నర్థముం
గలిగిన హర్ష దర్పములు కామము క్రోధ శమమ్ము లన్నియుం
దలకొను నింపుగా దమము ధర్మము రాజవరేణ్య! రాఘవా! 32.

ఉ. దేనిఁ దృజించి ధార్మికులు తృప్తి వహించి చరింతు రట్టిదౌ
మానవ వర్య! నీ ధనము మాయ మగున్ వెస దుర్దినమ్ములం
గానఁగ రాని యట్టి గ్రహ కాయము భంగినిఁ దండ్రి పంపునం
గానల కేఁగ నీ వసుర కాంతునిచేఁ బ్రియఁ గోలుపోయితే 33.

తే.గీ. ఇంద్రజిత్కృత దుఃఖము సెల్ల నేఁడు
వాపెదను కర్మము లొనర్చి భూపవర్య!
లెమ్మిఁక నరశార్దూల! త్వరితము తలఁప
వేల నిను మహాత్ముఁ గృతాత్ముఁ గోలు బాహు! 34.

తే.గీ. కూల్తు నేఁ డిషువుల సాశ్వ కుంజర రథ
సాసురేంద్ర లంకా పురి నవనిజా ని
ధన జనిత కోపి నీ ప్రియార్థం బనఘ! మ
హా నిశితములఁ జెలరేఁగి మానవేంద్ర! 35.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నెనుబది మూడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 84.

లక్ష్మణుఁడు రాముని నూఱడించు చుండ సేనను స్వస్థానమున నిలిపి విభీషణుఁడు వచ్చి రాముని వీక్షించి యిది యింద్రజిత్తు చేసిన మాయ యని సీత బ్రతికియే యున్నదని వచించి లక్ష్మణుని మేఘనాదుని వధింప నికుంభిలకుఁ బంపఁ దగు నని పల్కుట.

కం. నిలిపి నిజ గుల్మము నిజ
స్థల మందు విభీషణుండు దగ సోదర వ
త్సలుఁ డా లక్ష్మణుఁ డన్నను
లలి నాశ్వాసించు చుండ రయమున వచ్చెన్ 1.

ఉ. కాటుక ముద్ద వంటి ఘన కాయుల నాయుధ హస్త మంత్రులం
బాటవ మున్న నల్వురను బన్నుగఁ గూడి విభీషణుండు గో
త్రాట గజాభ యూథపుల లక్ష్మణు శోక నిమగ్ను నింకఁ గ
న్నీట మునింగి వానరులు నిల్వగఁ గాంచెను జేరి యచ్చటన్ 2.

ఉ. ఆ కడ మోహ సంయుత ఘనార్తు మహాత్ముని రాఘవేంద్రు ని
క్ష్వాకు కులైక వర్ధనుని భాతృ వరాంక గతుం ద్ర పార్తునిన్ 3.

పే కని లోపలం గలఁత పిక్కటిలంగ ని దేమిటం చనెన్
శోకము తోడ దీనుఁ డయి చూచుచు లక్ష్మణు దుఃఖ తప్తునిన్

తే.గీ. కని విభీషణు ముఖ మింకఁ గపి గణమ్ము
ఘనుని సుగ్రీవు మందముగ వచియించె
లక్ష్మణుండు కన్నీరు రాల నయనముల
నుండి యసురు తోడ సెడఁద నిండఁ గలఁత 4.

ఉ. సీత గతించె నింద్రజితుచే నన మారుతి నాలకించి తా
నాతత మోహ మందెను నరాధిపుఁడం చను చుండ మధ్యలో
నా తఱి నాపి లక్ష్మణుని నర్థ యుతమ్ముగ రాఘవేంద్రుతో
నాతఁ డటన్ విసంజ్ఞుని మహాత్ముని గాంచి వచించె నిట్టులన్ 5.

తే.గీ. మనుజ పుంగవ! వాయు కుమారుఁ డడలి
పలికినది యయుక్తం బని దలఁతు నెంతు
నెండె ఘోరంపు సాగరం బెల్ల నంచుఁ
బల్కు చందమ్ము దానినిఁ బార్థివేంద్ర! 6.

కం. నేరుదు దురాత్మ రావణు
తీరును జానకి గుఱించి తెల్లమ్ముగ నే
నో రామ! యెన్నఁ డైనను
గోరఁడు సీతా నిధనము క్రూరుం డైనన్ 7.

చం. అడిగినఁ బెక్కు మారులు ధరాత్మజ నిమ్మని మేలు నెంచుచుం
దొడగఁడు నాలకింపగను దొయ్యలిఁ దిర్గి యొసంగ నా దశా
స్యుఁడు పలు దాన భేదములు సూపిన సామ మశక్య మైనచోఁ
బడతినిఁ గాంచ నన్యములఁ బల్కఁగ నేల రణమ్ము నియ్యెడన్ 8.

కం. ఆ తరుణి నెఱుఁగు మాయా
సీత యని మహాభుజ! హరి శేఖరులను దా
నాతతముగ వంచించుచు
పే తరలెను రాక్షసుండు వీడి రణమ్మున్ 9.

తే.గీ. చని నికుంభి లాఖ్యఁ దనరు చైత్యమునకు
హోమ మొనరించుఁ జేసిన హోమ మతఁడు
వాస వాది దేవతలకు భండనమున
నగు దురాధర్షుఁడు దశము ఖాత్మజుండు 10.

కం. వానరుల విక్రమమునకుఁ
దా నిడ విఘ్నమ్ము నాజిఁ దద్దయు మాయన్
మానవ నాథ! తనర్చెను
మానక మాయావి యిట్లు మనుజాశనుఁడే 11.

తే.గీ. క్రతు వది ముగియుటకు మున్న కదలి సైన్య
యుతము వోవుద మచటి కాగతపు నీదు
ఘోర మిథ్యా విచారము వీర! వీడు
నీవు శోకింపఁ గాంచి క్షీణించె బలము 12.

ఆ.వె. స్వస్థ హృదిని నీవు చక్కఁగ నిలు మిట
పంపు మమ్ము ప్లవగ బలము తోడ
సత్త్వవంతు ననుజు సౌమిత్రి వీర వ
ర్యు నొసఁగి యచటకుఁ బురుష వరేణ్య! 13.

కం. ఈతఁడు నరశార్దూలా!
యాతని పని శిత శరముల నాపిన నంతన్
వీత మహిమ వధ్యుం డగు
నాతఁడు రావణి రణమ్ము నందు మహాత్మా! 14.

కం. ఘను లక్ష్మణు విహ గాంగక
సునిశిత తీక్ష్ణ శర పంక్తి శోణిత మెల్లం
దనియం ద్రాగు నసుర వ
ర్యునిఁ దాఁకి శరీరమునఁ బురుష శార్దూలా! 15.

కం. వెస శుభ లక్షణు లక్ష్మణు
నసమాన బలుని ననుపుమ నసురుని వధకై
పస తోడ వజ్రి వజ్రము 16.

ను సత్వరము పంపు నట్లు నుత రణ వీరా!

ఆ.వె. ఆలసింపఁగఁ దగ దసుర నిధన మందు
శత్రువుని వధింప సత్వర మిడు
నీదు వాణిఁ బనుపు నిర్జ రారులఁ జంప
నింద్రుఁ డొసఁగు రీతి నిపుడు రామ! 17.

కం. పూరించినఁ బని మాయం
బౌ రాక్షసుఁ డమర వరుల కైన రణమునం
బూరించిన కర్మమ్మునఁ
బోరిన సురలకును శంక మూరు బ్రతుకునన్ 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నెనుబది నాలుగవ సర్గము.

## యుద్ధ కాండము
## సర్గము 85.

విభీషణుని మాటలను దిరిగి విని లక్ష్మణుని వానర సైన్యముతోడ నింద్రజిత్తుని వధింప రాముఁడు పంప నాతఁడు విభీషణుఁడు హనుమంతుఁడు మున్నగు వారు తోడు రాఁగ నికుంభిలను జేరుకొనుట.

కం. విని రాముఁడు శోకార్తుఁడు
ఘన రాక్షసుని వచనములు కానఁడు డెంద
మ్మున స్పష్టార్థము నించుక
యును వివశాత్ముండు మాన వోత్తముఁ డకటా 1.

చం. మనమునఁ బూని ధైర్యమును మానవ వర్యుఁడు రాఘవుండు వ
ల్కెను బర వీర భంజనుఁడు కిట్టి విభీషణుఁ డుండ నివ్విధిన్ 2.

విన నెద నిచ్చగింతును విభీషణ!తిర్గి వచించి నట్టి నీ
మినుకుల నైరృతాధిప! సమీపము నందుఁ బ్లవంగు లుండఁగా

ఉ. రాముని దీన వాక్యములు రాక్షస పుంగవుఁ డాలకించి తా
నా మను జేంద్రుఁ గాంచి మును పన్నవి వాక్యము లివ్విధమ్ముగా
నే మఱకుండఁ బల్కెఁ దగ నీ బల ముంచితి నీ యనుజ్ఞతో
క్షేమపు రీతి దీర్ఘ భుజ! చెప్పిన యట్టులఁ జెప్పి నంతనే 3.

ఉ. చెన్నుగ నే బలమ్ము విభజించితి నుంచితి నేతలం దగం
బన్నుగ నెంచి న్యాయమును బార్థివ! చెప్పెదఁ దిర్గి విన్మ నా
విన్నప మార్య! యొక్కటిని వీర! యకారణ మార్తి నందఁగా
మిన్నగ నీవు తాపమున మేము మునింగితి మెల్ల రాఘవా! 4.

చం. విడువుమ చింత బూటకపు వృత్తిని వచ్చిన దాని పైరికిం
గడు ముద మిచ్చు దానిని సుఖమ్ముగ సీతను బొంద నెంచినం
గడు వడి నుద్యమింపవలెఁ గయ్యము నందు వధింప శత్రులం
బడయు మెడంద హర్షమును వంతకుఁ గాదిది కాల మెంచఁగన్ 5.

చం. నరవర! యాలకింపు రఘు నందన యొక్క హితమ్ముఁ జెప్పెదన్
గురుతర మైన సైన్యమును గూడి సుమిత్ర కుమారుఁ డేఁగ నొ
ప్పు రయమునన్ నికుంభిలకుఁ బోరున రావణి సంహరింపఁగా
నురుతర చాప ముక్త సవి షోరగ సన్నిభ మార్గణమ్ములన్ 6.

చం. పడసె నొసంగ నబ్జజుఁడు బ్రహ్మశిరం బను నస్త్ర రాజముం
బుడమినిఁ గామ గామి వర ముద్ధ భుగావలి వీరుఁ డింద్రజి
త్తడరి నికుంభిలా తటికి నాసుర సైన్యము తోడ నేఁగె నా
తఁడు కృతకర్ముఁడై మరలఁ దల్పుమ యెల్లరఁ జచ్చి నట్టులన్ 7.

ఉ. చేరక మున్నికుంభిలను జేయక యున్నను హోమ మగ్ని కే
వీరుఁడు వూని శస్త్రములు వృత్రహజిత్తు! వధించు నాతఁడే
మారకుఁ డౌను నీ కనుచు మాన్యుఁడు బ్రహ్మ వచించె మున్నహో
మారణ మవ్విధమ్ము జనమాన్య! లిఖించె విధాత వానికిన్ 8.

ఆ.వె. ఆజ్ఞ నొసఁగు మో మహాబల! రాఘవ!
చంప నింద్రజిత్తుఁ జావ నతఁడు
సచ్చె రావణుండు ససుహృజ్జనం బని
నేరఁ దగుదు వీవు నిక్కముగను 9.

చం. విని వచియించె రాముఁడు విభీషణు మాటల నివ్విధమ్ముగన్
మనమున వాని రౌద్రు ఘన మాయను నేరుదు సత్యవిక్రమా!
వనజ భ వాస్త్ర వేత్తయును బ్రాజ్ఞుఁడు మాయల మారి బల్లిదుం
డని నొనరించు మూర్ఛితుల నప్పతి నింకను నిర్జ రేంద్రులన్ 10.

ఆ.వె. అంతరిక్ష మందు నరదమ్ముపై సంచ
రించు నాతని గతి యించు కేని
కాన రాదు వీర! కమలాప్తు గమనమ్ము
భంగి మునుఁగ మేఘ పంక్తి లోన 11.

కం. అరి నా మాయా వీర్యుని
నరేంద్రుఁ డెఱిఁగి కపటాత్ము నరభోజనునిన్
గిరలు యశస్సంపన్నుని
నరసి యనుజు లక్ష్మణు నసె నా రాముఁ డిటుల్ 12.

ఉ. వానర నాథు సైన్యమును బన్నుగఁ గూడి మరుత్కుమారునిన్
వానర నేతలం గలసి భల్లగ ణేశుని జాంబవంతునిన్
సేనను గూడి యింపుగను జేరి నికుంభిల రాక్షసేంద్రు త
త్సూనుని మాయలన్ ఘనునిఁ దూర్ణము జంపుము వీర! లక్ష్మణా! 13.

తే.గీ. వాని మాయల నెఱిఁగిన యీ నిశాచ
రేంద్రుఁడు విభీషణుఁడు వచ్చు నింక నీదు
వెనుక స్వీయ మంత్రులఁ గూడి వీర! యనఁగ
రాముఁడు విభీషణునిఁ గూడి లక్ష్మణుండు 14.

తే.గీ. అద్భుత పరాక్రముఁడు వింటి నంత నెడమ
చేతి నూని కవచ మూని యాతత ముది
తాత్ముఁ డయి నిశిత శర వరాసి యుతుఁడు 15.

రామ పాదములు స్పృశించి లక్ష్మణుఁ డనె

ఉ. నేఁడు మదీయ కార్ముక సునిర్గత బాణ చయమ్ము రావణిం
బాడిగఁ జేరి చీల్చి వెస వర్ష్మము గూలును లంక లోపలం
జూడఁగ శుద్ధ పుష్కరిణి సుందర హంసలు చేరు భంగినిన్
నేఁడ వధించు రౌద్రు మెయినిం బెకలించి గుణచ్యుతమ్ములై 16.

ఉ. అని ద్యుతి మంతుఁ డిప్పగిది నగ్రజుతోఁ ద్వరితమ్ముగా గిరల్
మనమున నింద్రజిత్తు వధ మానక జేసెడు కోర్కి తోడుతం
దన గురు పాద పద్మములు దాఁకి యొనర్చి ప్రదక్షిణమ్ములం
జనెను వెసన్ నికుంభిలకుఁ జైత్య వరమ్మున కేఁప రావణిన్ 17.

ఉ. తోడుగ నవ్విభీషణుఁడు తూర్ణము వెంటఁ జరింప నన్నయే
పాడిగఁ బల్కు స్వస్తి యుత వాక్యము లేఁగెను విక్రముండు తన్
గూడఁగ వేల వానరులు కూరిమి మారుత నందనుండునున్
వేడుక మీఱ లక్ష్మణుఁడు వెన్కను రా నసురేంద్రు మంత్రులున్ 18.

ఆ.వె. వేగ మరుగుదెంచి పెద్దదౌ హరి సైన్య
ము పరివేష్టిత మయి మూరి నడవ
లక్ష్మణుండు ఋక్ష రాజ బలము గాంచె
దారి లోన నిలువ వీర వరుఁడు 19.

ఆ.వె. చాల దూర మేఁగి సౌమిత్రి మిత్ర నం
దనుఁడు రాక్ష సేంద్రు తద్ద బలము
దూర మందుఁ గాంచెఁ దోరంపు వ్యూహమ్ము
నందు నుండ ధన్వు లందు ఘనుఁడు 20.

తే.గీ. వాని మాయామయునిఁ జేరి పర దమనుఁడు
లక్ష్మణుండు ధనుష్పాణి రఘు వరాన్వ
యోత్తముండు నిలిచెను బ్రహ్మోక్త గతిని
సంహరింప నాత్మఁ దలఁచి సంగరమున 21.

కం. అరు దగు ప్రతాపవంతుఁడు 22.

నరవర సూనుఁడు విభీషణ సమేతుండై
హరి వీరుఁ డంగదునితో
మరుత్సుతుని తోడ నసుర మండలిఁ గాంచెన్

కం. చొచ్చె నమల శస్త్ర రుచుల
నచ్చమ్మును ధ్వజ రథ నిచ యాభేద్యమ్మం
జెచ్చెర సు రయము భయదము
నచ్చీకఁటిఁ బోలు దాని నరి సైన్యమ్మున్ 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నెనుబది యేనవ సర్గము.

# యుద్ధ కాండము
## సర్గము 86.

విభీషణుని యుపాయమున లక్ష్మణుఁ డింద్రజిత్తునిపై నమ్ముల వాన కురిపింప వానర రాక్షసులకు ఘోర యుద్ధము జరుగ నింద్రజిత్తు హోమము నాపి రణోద్యుక్తుఁడు కాఁగ హనుమంతుఁడు రక్కసులను బాధించుచు రావణిని ద్వంద్వ యుద్ధమున కాహ్వానింప లక్ష్మణుఁ డింద్రజిత్తును గాంచుట.

కం. అట్టి యెడ విభీషణుఁ డనె
నిట్టు లహితములు రిపులకు నింకం గడు మే
ల్పట్ట స్వజనులకు దశరథు
పట్టిం గని యర్థ సహిత వాక్యము లెలమిన్ 1.

కం. కనఁబడు రాక్షస సేనను
ఘన వర్ణాభము నెదుర్పఁగఁ దొడఁగ వలయున్
మనుజేంద్ర! తరులను గరము
ల నూని శీఘ్రముగ నిప్డు ప్లవగ వరేణ్యుల్ 2.

ఉ. రావణి సేన నెల్ల పెస లక్ష్మణ! త్రోలఁ దొడంగి నంతటం
జేవ మహోగ్ర సేనయె విశీర్ణము గాఁగ నతండు దృశ్యుఁ డౌ
నీ వని వజ్రి వజ్ర సదృ శేషు చయమ్ములు సిమ్మి యుర్కుమా
నీ వసురుండు హోమపుఁ బనిన్ నెరవేర్పక మున్న లక్ష్మణా! 3.

ఉ. చంపుమ యీ దురాత్ముని పెసం గడు వంచకు నీ యధార్మికుం
దెంపునఁ గ్రూర కర్మములఁ దేలెడు రావణి లోక భీకరుం
బంపెను లక్ష్మణుండు విని పల్కు లనంగ విభీషణుండు దా
నంప జడిన్ భృశమ్ముగ దశానన సూనునిఁ దాఁక నంతటన్ 4.

చం. హరి వర ఋక్ష వీర వరు లద్రి నఖాగమ యోధపుంగవుల్
పరువిడి రెల్లరుం గలసి భైరవ రాక్షస సైన్య భూమికిన్
ఖర శర ఖడ్గ తోమర నికాయము తోడను శక్తి యుక్తులై
హరుల జయింపఁ గోరుచు రణాంగణ మం దెదిరించి రాసురుల్ 5.

చం. పరఁగెను ఘోర యుద్ధ మట వానర రాక్షస వీర కోటికిం
బురమున లంకలోఁ జెలఁగె  బోరన శబ్దము లెల్ల దిక్కులం
దరువుల శైల శృంగములఁ దద్దయు వాడి శరమ్ములన్ నభం
బురువుగ నయ్యె నావృత మహో వివి ధాకృతి హేతి కోటినిన్ 6.

చం. ప్లవగుల మేనులన్ వికృత వక్త్రులు బాహులు నైన రక్కసుల్
గవియుచు శస్త్రముల్ సొనిపి కయ్యము నందు భృశమ్ముగా భయ
మ్ము వొడమఁ జేయ నా హరులు మూరి శిలాతరు సంచయమ్ము లె
ల్ల విసరి కొట్టి చంపి రని రాక్షస వర్యుల నెల్ల నుగ్రులై 7.

కం. సుమహా కాయులు వానరు
లు మహా బలులు సెలరేఁగి రోషం బడరన్
సమర మొనరించు రాక్షసు
ల మనమ్ముల భయమును దనరఁగ జేసి రటన్ 8.

చం. తన బల మర్ధితం బని సుదారుణ రీతిని శత్రుకోటిచే
వనట మునింగి నట్లు విని వంతను రావణి లేచె హోమపుం 9.

బని నిఁక వీడి వృక్షముల ధ్వాంతము నుండి సరోష చిత్తుఁడై
మును తగఁ గూర్చి నట్టి రథముం దమి నెక్కె సుసంయుతమ్మునున్

ఉ. భీమ ధనుర్ధరుం డసిత వేష్టిత మేఘ సమప్రభుండు ర
క్తామిత రోహి తాస్య నయ నాగ్రహ మూర్చితుఁ డంత కాభుఁడై
తా మరలంగ రావణినిఁ దద్బల మారసి తేరుపై నటుల్
భీమ జ వాసురధ్వజిని పెన్కకుఁ దిర్గె నెదిర్ప లక్ష్మణున్ 10.

ఉ. అంతట శైల సన్నిభ మహా కపి యెత్తి దురాసదమ్మునుం
బంతము మీఱఁగా హనుమ పాదప మొక్కటి మొత్తె సైన్యమున్
సొంతము రాక్షసావృతము నల్క ననేక కుజాళిఁ జేసె వి
క్రాంతుఁడు కాల వహ్ని వలెఁ గాల్చుచు రక్కసులన్ విసంజ్ఞులన్ 11.

ఆ.వె. వీరుఁ డట్లు సేయ విధ్వంసము బలిమి
ని హనుమంతుఁ డాజిని నసుర వరు
లరసి వేల మంది యాయుధములు పెద
జల్లి రలుక తోడఁ బెల్లుగాను 12.

ఉ. శూల వరాలి శూలధర శూరులు కత్తుల ఖడ్గధారులున్
మేలుగ శక్తి హస్తులు నమేయపు శక్తులఁ బట్టిసమ్ములన్
వీలుగ పట్టిసోగ్ర ధర వీరులు కుంత గదా శతఘ్నులుం
గాల వరాయసేద్ధ పరిఘవ్రజ ముద్గర భిందిపాలముల్ 13.

ఉ. ఘోర పరస్వధమ్ములును గొట్టిరి పైచి తలమ్ములం బగన్
మూరగ పిడ్గులన్ బలిమి ముష్టుల వజ్ర నిభమ్ములన్ ఘనున్
మారుత నందనుం గదిసి మారుతి కూడ యెడందఁ గ్రుద్ధుఁడై
వారల ఘోర నాశమును వారక చేసెను భండనమ్మునన్ 14.

కం. కనె నింద్రజిత్తు శైల ని
భుని నరులను జంపువాని ముక్తత్రాసున్
హనుమంతునిఁ బవన కుమా
రుని సమరమ్మునఁ జెలంగ రోషాత్ముండై 15.

ఉ. సారథిఁ గాంచి పల్కె నిటు చక్కఁగ నేఁగుమ యెచ్చ టుండె నా
వీరుఁడు మారుతాత్మజుఁడు వేగమ యచ్చట కంచు నింద్రజి
త్తారయ నాప కున్న నిట నంతము సేయును రాక్షసావలిన్
మూరి యనంగ నయ్యరదమున్ విని సారథి తోలెఁ జెంతకున్ 16.

తే.గీ. చేరి దుర్ధర్షుఁ డసురుండు మారుతినిఁ గు
రెంచె నింద్ర జిత్తమ్ముల సంచయమ్ము
ఖడ్గ పట్టి సాసి కుఠార కాయ మంతఁ
గపి వరేణ్యుని తల పైన విపులముగను 17.

కం. కొని మారుతి యా శస్త్రము
లను ఘోరములఁ బలికె ననిల సుతుఁడు రోష
మ్మున నావిష్టుఁ డయి భృశము
గని రక్కసుని వచనములు కపి వీరుఁ డిటుల్ 18.

ఆ.వె. రావణ సుత! కుమతి! రణము నా తోడ శూ
రుండ పైనఁ జేయు ముండ నేర
వీ వసువుల తోడ నీ వాయు పుత్రునిఁ
జేరి తేని మీఁటి పోరు నందు 19.

తే.గీ. దుర్మతీ! ద్వంద్వ యుద్ధము తూర్ణ మొసఁగ
నెంచి తేని నా కీ విట నంచితముగ
బాహు యుగ్మములం బోర వలయు సైచి
తేని నా వేగము ఘనుఁడ వీ వసురుల 20.

ఆ.వె. వింటి నెత్తి వచ్చు వీరుఁడీ యింద్రజి
త్తు హనుమంతు వధకుఁ దొడఁగు నంచు
లక్ష్మణునకుఁ జెప్పె రావణాత్మజుఁ జూపి
యవ్విభీషణుఁడు మహాసురుండు 21.

తే.గీ. ఇతఁడు వాసవుని జయించె సుతుఁడు రావ
ణున కరద మెక్కి చంపు హనుమను వాని
నప్రతిమ శరముల జీవితాంతకరము 22.

ల రిపు వారితములఁ జంపు లక్ష్మణ! వెస

తే.గీ. అరి విభీషణుం డయి నట్టి యా విభీష
ణుండు వలుక నవ్విధి లక్ష్మణుండు గాంచె
పర్వత నిభు రథస్థునిఁ బర దురాస
దుని దశానన సుతు బల్లిదు నసురేంద్రు 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నెనుబది యాఱవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 87.

విభీషణుఁడు లక్ష్మణునిఁ గొనిపోయి యింద్రజిత్తును హోమము పూర్తి చేయక మునుపె వధింప వలె నని పలుక నాతనిని రావణి గాంచి దూషింప రావణుని పాపకార్యముల వలనఁ దాను రాముని నాశ్రయింప వలసె నని పలికి లక్ష్మణుని బాణ వేగమునకు స సైన్యము నీవు నాశనము కాఁగల వని యింద్రజిత్తుతోఁ బలుకుట.

కం. వచియించి యిట్లు వాక్యము
లుచితముగ ముదంబు వడసి యుత్తమ ధనువున్
రుచిరముగఁ గొన్న లక్ష్మణు
నచలితుఁ గొనిపోయె రావణానుజుఁడు వెసన్ 1.

చం. అరిగి కొలంది దూరము మహావన మత్తఱిఁ జొచ్చి యంత నా
సుర వరుఁ డా విభీషణుఁడు సూపెను రావణి సేయు కర్మముం
దరువును నీల మేఘ నిభ దారుణ రూపము మఱ్ఱి చెట్టునున్
గురు రఘు వంశ వీరునకు గొప్ప నిషంగికి రాము భ్రాతకున్ 2.

చం. బలి నిట భూతరాశి కిడి బల్లిదుఁ డంతట నింద్రజిత్తు పే 3.

కలనున కేఁగు నెల్లరకుఁ గన్పడ కింతయుఁ జంపు సంఖ్యపుం
దలమున నెల్ల శత్రువుల దారుణ మార్గణ పంక్తి నింక బ
ద్ధుల ననిఁ జేయు రక్కసుఁడు దుర్జయుఁడౌ రణ మందు లక్ష్మణా

ఉ. చేరక మున్న రక్కసుఁడు చెట్టును మఱ్ఱిని రావణాత్మజుం
డో రఘువీర! మార్గణము లుగ్రములం దగ వేసి వానినిన్
సారథిఁ దేరు నశ్వములఁ జంపుమ యం చన నాలకించి యా
వీరుఁడు వాని కట్టె యని వింటినిఁ జిత్రముఁ జూచి నిల్వఁగన్ 4.

చం. కనఁబడ రావణోద్భవుఁడు ఖడ్గము కంకట మూని సధ్వజుం
డనల సమాన వర్ణ సుమహారథ మందు మహా బలుండు వ
ల్కె నినకు లేద్ధ తేజుఁ డట  లీలగ దుర్జయ! నిన్ను బిల్చు చుం
టి నిపుడు సంగరమ్మునకు డిగ్గన నిమ్ము రణమ్ము నింపుగన్ 5.

కం. అన విని తేజస్వి మహా
మనస్వి దశకంఠు పట్టి మనుజేంద్రుని చెం
తను గాంచి విభీషణుని వ
చనమ్ములు వచించె నిట్లు చాల పరుషముల్ 6.

చం. ఇచటనె పుట్టి పెర్గితివి యెన్న స్వయమ్ముగ నాదు తండ్రి కీ
వు చిన సహోదరుండ వయి పుత్రున కివ్విధి నీయ హానినిన్
రుచిర మటంచు నెంచెదవె ద్రోహి! పితృవ్యుఁడ వయ్యు దుష్ట! నీ
వు చెలిమి జాతి గోత్రమునఁ బూనవు కూరిమి ధర్మ దూషణా! 7.

ఆ.వె. నీదు ధర్మ మేని సౌదర్య మేని త
లఁపవు నింద్యుఁడవు ధర సుజనులకుఁ
గలుగు జాలి నిన్ను గన స్వజనుల వీడి
కొలువఁ బరుల నీచ!  తలపడితివి 8.

ఉ. ఎక్కడ స్వప్రజా వసన మెక్కడ యన్య జనాశ్రయమ్ము నీ
వక్కట యల్పబుద్ధినిఁ దదంతర మెన్నఁ డెఱుంగ నేరవే
యెక్కుడు మంచి వారయిన నేమి పరుల్ గుణ హీను లైననుం
జక్కని వారె స్వీయ కుల సభ్యు లమిత్రుఁ డమిత్రుఁడే కదా! 9.

తే.గీ. ఎవ్వఁడు తన పక్షమ్మును నిట్లు వీడి
చేరునో పర పక్షమ్మును జెంద స్వీయ
పక్షము విలయం బక్కట పరుల వలనఁ
జంపఁ బడును దాను బిదప సత్వరమ్ము 10.

ఆ.వె. జాలి లేక యిట్టి మే లిడని పనిని
స్వజన గణములో నిశాచరేంద్ర!
చేయ నీక తగును జిత్రముగను దశ
వక్త్ర సోదరుండ! పౌరుషమున 11.

కం. అన నిట్లు భాతృ పుత్రుఁడు
విని పలికె విభీషణుండు వింతగ నా వృ
త్తి నెఱుఁగని వాని వలె నే
లను వాఁగెద విప్విధముగ రావణ తనయా! 12.

ఆ.వె. క్షుద్ర! రాక్షసేంద్ర సూను! గౌరవమున
వీడు పరుష ముద్భవించినఁ గడు
క్రూర చరు లసురుల కులమున మేటి స్వ
గుణ మరాక్షసమ్ము కుమతి! నాది 13.

తే.గీ. అలర నేర దారుణ కర్మముల నెడంద
సంచరింప నెన్నఁ డధర్మ సంచయమునఁ
దమ్ముఁడు గుణ హీనుఁ డయిన నెమ్మి జూడ
కెట్టు లన్న తమ్ముని వీడు నెన్నఁ డైన 14.

కం. పురుషుని నధర్మశీలుని
దురిత చరితునిఁ ద్యజియింపఁ దొరపు సుఖమున్
ధరఁ బడయఁ గలరు ఘోరపు
టురగమ్మును వీడి నట్లు ఉత్తమ పురుషుల్ 15.

చం. పరుల ధనమ్మునుం బరుల భార్యలఁ గైకొను దుష్ట చిత్తులం
ద్వరితము వీడ నొప్పు జ్వలితంపు గృహమ్మును వీడు నట్టులం 16.

బర ధన దారలం గొనుట వారక మిత్రుల సంశయించుటల్
కర మివి మూడు దోషములు  కల్గిన నిచ్చు క్షయమ్ము బాలకా!

చం. మునులను జంపుటల్ సురల మొత్తుట మానము  రోష వైరము
ల్మనమునఁ బ్రాతి కూల్యమును రాక్షస నాథుని ఘోర దోషముల్
దన గుణ రాశి మూసినవి తద్ద గిరిన్ ఘన రాశి మూయు భం
గిని సిరి నింక జీవితముఁ గృత్స్న ము నాశము సేయు దోషముల్ 17.

తే.గీ. నాదు భ్రాత దోషములచే నీదు తండ్రి
విడువఁ బడెను నా చేతను దడయ కుండఁ
బురము లంకయు నీవు నసుర విభుండు
నుండ నేరరు నీ జనకుండు నింక 18.

ఆ.వె. నీచ! బాల! దుర్వినీత! దుర్గర్వి! కా
లంపుఁ బాశమునకు నింపుగాను
బద్ధుఁడ వయి తీవు పల్కు మేమే మన
నెంచి తన్నియు నను నెలమి నింక 19.

కం. నన్న నఁగ నేల నిచ్చట
నిన్నుం జేరె వ్యసనములు నేఁ డివ్విధి నీ
వన్న గమును న్యగ్రోధము
నెన్నం డికఁ జేర లేవు హీన చరిత్రా! 20.

ఆ.వె. ధిక్కరించి నీవు ధీరుఁ గాకుత్స్థు న
శక్యుఁడవు బ్రతుక న్నసత్త మేంద్రు
లక్ష్మణు నెదిరింపు రణ మందు యము నింట
సమసి సురల పనినిఁ జలుపు దెలమి 21.

తే.గీ. చూపు ముద్యతంపు బలము తూపుల వ్యయ
ము నొనరింపుమ యాయుధములను గూడి
లక్ష్మణు శర మార్గమ్ముున రాక్షస! పడి
స బల మేఁగ లే వసువులు సడల కుండ 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నెనుబది యేడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 88.

లక్ష్మణ మేఘనాదులు ఘోరముగా యుద్ధము చేయుట.

కం. విని యటులు విభీషణుని వ
చనమ్ములను శక్రజిత్తు సక్రోధుండై
చనెఁ జెంతకు రయమునఁ బలి
కె నంతఁ గడిఁది పరుషంపు గిర లిట్బంగిన్ 1.

చం. అరద మలంకృతమ్ము నసితాశ్వయుతమ్ము ఘనమ్ము నెక్కి యా
ఖర కరవాల సాయుధ నికాయ సమేతము నంతకోపముం
డురువును వేగ వంత మగు నుగ్ర ధనుస్సును సాయకమ్ములం
బర బల భేదకమ్ములను బట్టి నిశాచరుఁ డేఁగుదెంచినన్ 2.

ఉ. కాంచి ధనుర్ధరుండు నర కాంతుని లక్ష్మణు నయ్యలంకృతుం
గాంచన భూష ణావృతుఁడు గ్రాలి రథమ్మున వీరుఁ డింద్రజి
త్తుంచిత రీతి మారుతి వరాంసముపై రఘు వీరుఁ డుండఁగా
మించి విభీషణుం గలసి మిత్ర నిభుండు వచించె వారితో 3.

తే.గీ. సంభ్రమమున సౌమిత్రిని సహవిభీష
ణునిఁ గపీంద్రులఁ గని దశానన సుతుండు
చూడుఁ డిట నాదు శౌర్యము నేఁడ యంచు
నాపుఁడు మదీయ శరవర్ష మరసి మీరు 4.

తే.గీ. నాదు వింటి నుండి వెడలు నా శరములు 5.

కాల్చి  వేయును వేగ మీ కాయములను
దూది కుప్పను గాల్చెడు దుస్సహంపు
టగ్ని భంగిని నీ సంగ రాంగణమున

ఉ. చూడుఁడు తీక్ష్ణ బాణముల శూల స తోమర ఋష్టి శక్తులన్
నేఁడు యమాలయమ్మునకు నిష్ఠుర రీతిని మిమ్ము పంపెదన్
వాడి శరోగ్ర వృష్టి నిటఁ బన్నుగ నే సృజియించి యార్వఁగా
నోడక నిల్చునే యెదుట నొక్కఁడు నక్కట మేఘ భంగినిన్ 6.

ఉ. మున్ను నిశం బురస్సరుల పొందిక నిర్వురు నా శరమ్ములం
గ్రన్నన నస్థి జాశని నికాశములన్ ధరపై విసంజ్ఞులై
చెన్ను నశింపఁ గూలితిరె చేటు స్మరింపరె సర్వరోషుఁడన్
నన్నెదిరింప రాఁ దలఁతు నా మదిఁ గాలునిఁ జేరి నట్టులన్ 7.

చం. విని యసురేంద్రు గర్జితు నభీతుఁడు లక్ష్మణుఁ డాగ్రహుండునై
మినుకులు వల్కె నిట్లసుర! మించి వచింతువు దుర్గమమ్ములౌ
పనులకుఁ బార మింపుగను బారము చేతల నెవ్వఁ డోజఁ జే
రు నతఁడు బుద్ధిమంతుఁ డగుఁ గ్రూర మనస్కుఁడ! యెంచి చూడఁగన్ 8.

తే.గీ. అన్యుల కొనరింప నసాధ్య మైన కర్మ
ము నొనరుప నసమర్థుఁడ!  ఘన గిర లని
వ్యర్థములను గృతార్థుఁడ నైతి నంచుఁ
దలఁతు వీవు దుర్మతి! సంతతమ్ము నరయ 9.

ఉ. అప్పుడు నీవు మాయ మయి యాజి గణించిన మార్గ మెంచఁగాఁ
దప్పక యౌను నీచ మగు తస్కర మార్గము వీర సేవితం
బెప్పుడు కాదు బెక్కు లన నేల శరావలి నెట్లు నొంచి తీ
వొప్పుగఁ జూపు మిప్పు డది యూఱక యివ్విధి వాఁగ నేలనో 10.

చం. అన విని యింద్రజిత్తడరి యాజి జయుండు స్పృశించి వింటినిన్
ఘనుఁడు బలమ్ము నందు శర కాయము గుర్సె మహా శితావలిన్
సునిశిత మార్గణమ్ము లవి శూరుని లక్ష్మణుఁ జేరి నిస్వసిం
చు నురగ సన్నిభమ్ము లయి క్షోభ నొసంగెఁ గరమ్ము వానికిన్ 11.

ఆ.వె. వేగవంతుఁ డసుర వీరుఁ డా యింద్రజి
త్తు సుమహా రయములు తూపు లేసి
సమర మందు శూరు సౌమిత్రి శుభ లక్ష
ణు వెసఁ గొట్టె రావణు తనయుండు 12.

కం. శర విద్ధుండై కాఱ రు
ధిరమ్ము శ్రీమంతుఁడు రణ ధీరుండు వెలిం
గె రఘుకుల వీరుఁడు విధూ
మ రుచిర పావకుని వలె సమర తల మందున్ 13.

కం. నిజ కర్మమ్మును గని యిం
ద్రజిత్తు సముఖమున కరిగి రాక్షస రాజా
త్మజుఁ డంత మహానాద
మ్ముఁ జేసి వచియించె నిట్లు ముది తాత్ముండై 14.

ఉ. ఱెక్కల వాడి తూపు లివి ఱివ్వున వీడి మదీయ కార్ముకం
బెక్కుడు వేగవంతములు నింపుగఁ గైకొను నీదు ప్రాణముల్
గ్రక్కున జీవితాంతక శరమ్ములు లక్ష్మణ శ్యేన సంఘముల్
నక్కలు గ్రద్ద లెల్లయు ఘనమ్ముగ వ్రాలును జావ నీ పయిన్ 15.

ఆ.వె. క్షత్రబంధు భక్తు సౌమిత్రి! భ్రాత న
నార్య నిన్ను రాముఁ డధమ బుద్ధి
గాంచు నేఁడు హతము గాఁగ రణమ్మున
నాదు శర చయమ్ము నాట మేన 16.

కం. చూచును సడలిన కవచిని
నా చే హతుని శిరము దెగిన నరునిఁ జ్యుత నా
రాచుని సౌమిత్రి! యిచట
పేచిన నొకయింత తడవు వీర వరేణ్యా! 17.

చం. విని యన రావ ణాత్మజుఁడు వెక్కసమౌ పరుషమ్ముగా నటుల్
కనలి సహేతుకమ్ముగ నృకాంతుఁడు వల్కె మహార్థ వంతముల్ 18.

దనరకు వాగ్బలమ్మునను దద్దయు వాగెదు క్రూరకర్ముఁడా
కొనుమ యశమ్ముఁ గర్మములు కొంచెము లైన యొనర్చి దుర్మతీ!

తే.గీ. కర్మ మొనరింపకయె పలుకంగ నేల
నిట్లు రాక్షస! యెవ్విధి నెడఁద నీదు
పలుకులను నమ్మఁగలనొ యా పనిఁ దగ నొన
రింపు మింకఁ బలుక నేల రిత్తగాను 19.

ఆ.వె. పలుక కుండ నేను బరుషంపు వాక్యమ్ము
గొంచె మైన నింద యించు కేని
చేయ కుండ నిన్ను జెప్పక గొప్పను
సుంత చంపు వాఁడ చూడు నిన్ను 20.

చం. త్వరితము లాగి కర్ణములఁ దాఁకఁగ నమ్ముల నైదు వేసెఁ దా
గిర లని యిట్లు లక్ష్మణుఁడు గిన్కను రావణి ఱొమ్ము పైన నా
యురగ నిభంపు మార్గణము లుత్తమ పత్ర రయమ్ములే వెలిం
గె రవి కరాలి సన్నిభము కృత్స్నము నైర్రుతు వక్షమం దటన్ 21.

తే.గీ. ఆ శరముల నొచ్చి కడు నయ్యసురుఁ డింద్ర
జిత్తు రావణాత్మజుఁడు విశేష రోష
మునను సుప్రయుక్తము లగు మూడు బాణ
ములఁ దిరిగి కొట్టె లక్ష్మణు భూరి బలుని 22.

కం. నర రాక్షస శార్దూలుర
పరస్పర జిగీషుల ఘన భండన మయ్యెం
గరము తుముల మయ్యె ధను
ర్ధరు లిరువురు పోరు సల్ప దారుణ రీతిన్ 23.

తే.గీ. ఇద్దఱు బల సంపన్నులె యిద్ద ఱరయ
నిద్ధ విక్రమశాలురె యిద్ద ఱెంచ
నెంతొ విక్రాంతు లిద్దఱు నెల్ల యస్త్ర
శస్త్ర నిపుణు లజేయులు శౌర్య బలులు 24.

కం. గగనమ్ము నం దడరు గ్రహ
యుగమ్ము భంగి బలవృత్ర యుగ్మము పగిదిన్
విగత భయులు సంగ్రామము
నఁ గడు దురాసదులు పోరునఁ జెలఁగి రుభయుల్ 25.

తే.గీ. అమ్మహాత్ములు సింహ ద్వయమ్ము వోలె
నృవర రాక్షస సింహు లనేక మార్గ
ణౌఘములు సృజియించి బలాఢ్యు లడరి
సంతసమున నొనర్చిరి సంగరమ్ము 26.

తే.గీ. ముదితులు సమార్గణ ధనుర్విభూషితులు జ
యార్థు లొండొరు లపుడు న రాసురర్ష
భులు శరౌఘ వర్షము మేఘము వలె నాజి
భృశము వర్షింపఁ జేసిరి వీర వరులు 27.

ఆ.వె. వృద్ధి సెంది భృశము యుద్ధ మందు రణ కో
విదులు మాటి మాటి కుదరి శిత శ
రాసి శస్త్ర దండ హస్తులు శంబ రేం
ద్రులను బోలి యొండొరుల నడిచిరి 28.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నెనుబది యెనిమిదవ సర్గము.

# యుద్ధ కాండము

# సర్గము 89.

లక్ష్మణేంద్ర జిత్తుల భయంకర యుద్ధము గొనసాగుట.

కం. సంధించి శరమ్ములు మో 1.

హాం ధాసురుని పయి రాఘు వానుజుఁడు మహా
స్కంధుండు వైరి జన దహ
నేంధనుఁ డహి భంగి నిశ్వసించుచు వైచెన్

ఆ.వె. వాని జ్యా తలంపు  స్వనమును నాలకిం
ప నసుర నిచ యాధిపతి వివర్ణ
వదనుఁ డయ్యె మనుజ వర్యుని లక్ష్మణుఁ
గాంచె నింద్రజిత్తు మించ వంత 2.

చం. కని యసురున్ విషణ్ణ ముఖుఁ గయ్య మొనర్చుచు నున్న లక్ష్మణుం
గని పెస నవ్విభీషణుఁడు గాంచ నిమిత్తము లేను వీని యం
దు నెదఁ దలంతు నీతఁ డనిఁ దోరము దుర్బలుఁ డయ్యె నంచు శం
క నరయ నిందు వేగపడఁ గార్యము నీ కని పల్కె నత్తఱిన్ 3.

చం. శరముల నెక్కు పెట్టి ఫణి సన్నిభ మార్గణ పంక్తి వానిపైఁ
గురిసెను దీక్ష్ణముల్ విషము గూడిన ఘోరత రాహి కోటికిన్
సరి యగు వాని  వేయఁగను శక్ర మహాశని సన్నిభమ్ముగా
శరములు దాఁక విగ్రహము సర్వము క్షోభిల నందె మూఢతన్ 4.

ఉ. ఒక్క ముహూర్త కాలమున నూఱట నందఁగ నింద్రియమ్ములుం
జక్కఁగ సంజ్ఞనుం బడసి  సౌమ్యుని లక్ష్మణుఁ గాంచి సంస్థితున్
మిక్కిలి వీర్యునిం గదిసి మీఱిన యెఱ్ఱఁదనంపుఁ గన్నులం
బిక్కటిలంగ నాగ్రహము పే పరుషమ్ములు దిర్గి యిట్లనెన్ 5.

ఉ. ఏల తలంప వీవు మును నిచ్చట భ్రాతను గూడి యక్కటా
నేల విసంజ్ఞ దొర్లుటను నెమ్మది బంధితు లైన రీతి మీ
రాలము లోన వజ్ర సదృ శాతత ఘాత శరీరులై భువిం
గూలిరి సానుగాము లయి ఘోరముగాఁ బ్రథమంపు టాజిలో 6.

తే.గీ. నన్ను నెదిరింప నెంచెదు సన్న గిల్లె
నే స్మృతి దలంప నీకు లే దేని యేఁగ
నెంచితివొ యంతకుని యింటి కీవు నిక్క
మంచు దలఁతు దీని నెడఁద నంచితముగ 7.

ఆ.వె. మొదట జరిగి నట్టి పోరు నందు మదీయ
విక్రమమ్ము నీకు సక్రమముగఁ
గాన రాక యున్న నేన చూపించు వాఁ
డ నిలు మిచట ధైర్యమును వహించి 8.

ఉ. వాడివి సప్త బాణములు వైచెను రావణి పల్కి యిట్టులం
బాడిగఁ దాఁక లక్ష్మణుని బాణములం బది యాంజనేయుపైఁ
దాడితుఁ జేసె మార్గణ శతమ్ములు వైచి దశాస్యు భ్రాతనుం
గూడఁగ రెండు రెట్టు లయి క్రోధము సత్వర మవ్విభీషణున్ 9.

చం. అనిఁ గని యింద్ర జిత్తు పని నన్నర వర్యుఁ డభీతి నవ్వుచుం
బని యిది యల్ప మైన దని పట్టి శరమ్ములు తద్ద ఘోరముల్
గినుక వహించి లక్ష్మణుఁడు కేలను రావణి పైన వైచి ప
ల్కెను రణ శూరు లివ్విధము రిత్తగ వేయరు మార్గణమ్ములన్ 10.

కం. శరములు లఘువులు నీవి య
సుర! బలమం దల్పము లయి సుఖ దమ్ములునై
పరఁగెం గన జయ కాంక్షులు
దుర మిట్లొనరింప రనుచుఁ దూపులు పఱపెన్ 11.

ఆ.వె. కాంచనంపు టసురు కవచము లక్ష్మణ
ముక్త ఘోర బాణములకు విఱిగి
రథము పైన నంబరమ్ము వీడి పడు చు
క్కల గమి వలెఁ గూలెఁ గదన మందు 12.

ఆ.వె. కాండ పంక్తిఁ దొలఁగఁ గవచమ్ము గాయమ్ము
లడర గాత్ర మందు నయ్యసుర వ
రుండు రావణాత్మజుండు వెలింగెఁ బ్ర
త్యూష మందు వెలుఁగు ద్యుమణి వోలె 13.

ఉ. రావణి యుగ్రుఁడై కరము లక్ష్మణుఁ గొట్టెను భీమవిక్రమున్
వావిరి వేయి బాణముల బ్రద్దలు గాఁ గవచమ్ము కర్మముల్ 14.

లావున వీరు లత్తఱి దురమ్మునఁ జేసి పరస్పరమ్మునుం
గేవల మెంచి డెందముల గెల్పును మార్కొన దూఁకి రిర్వురున్

చం. శరములు నాట దేహముల సర్వ శరీరము రక్త సిక్తమై
పరగఁగ వీరు లిర్వురకు భండన విజ్ఞులు నిశ్వసించుచుం
దిరుగుచు వ్యాకులం బయి యతీతము యుద్ధము వర్తిలంగ వా
రిరువురు దీర్ఘకాల మొన రించిరి విద్ధుల నొక్కరొక్కరిన్ 15.

తే.గీ. భీమ విక్రము లిర్వురు తాము జయము
నంద నుద్యుక్తు లైరి కయ్యమ్ము నందు
బాణ జాల కీర్ణ కవచధ్వజులు కార్చు
చుష్ణ రుధిరమ్ము సెలయేరు లుదకము వలె 16.

చం. కడచెను కాల మెక్కువగఁ గయ్యము సేయుచు నుండ నిర్వురుం
గడు శర వర్ష పాతమునఁ గాల మహాసిత మేఘ భంగినిన్
బెడిదము లైన శబ్దములు పెల్వడ నాజిని మిక్కుటమ్ముగన్
బడలిక సుంతయుం గనరు భండన మాపఁ దలంప రిద్దఱున్ 17.

తే.గీ. అస్త్ర విదు లందు నుత్తము లస్త్రములను
మాటి మాటికిఁ జూపుచు మేటి యమ్ము
లిరువురు ననేకములు వేసి యెల్ల నింగిఁ
గప్పి రుచ్చావచమ్ముల నప్పు డడరి 18.

ఆ.వె. చేసి రిరువు రాజి చిత్రముగను దేలి
కగను బాగుగాను విగత దోష
ముల నడరుచుఁ దుములముగను ఘోర తర మ
న్నరవ రాసుర వర నాథు లపుడు 19.

కం. వారల తుములస్వనములు
మూరెను నిర్ఘాత నిభము భూరి చలనముల్
దారుణముగఁ బుట్టించెను
ధారుణి విడివిడిగ సమర తలమునఁ గాంచన్ 20.

కం. వా రిరువురు నిట్టూర్చుచు
ఘోరముగ రణం బొనర్పఁ గ్రుద్ధత నింగిం
దారాడు చున్న భీకర
వారిదముల ధ్వనుల మించె వారి రవమ్ముల్ 21.

తే.గీ. పసిడి పింజలఁ దనరారు వాడి సెలలు
సేసి నట్టి పుండ్లు భృశము సెలఁగు చున్న
వారు కార్చిరి రక్తము బల్లిదులు య
శస్వులు జయనిశ్చయులు భృశం బుభయులు 22.

ఆ.వె. ఆజి మేనుల పయి నభ్ర పుంఖ శరము
లెల్లఁ బడి మనుజ వరేంద్ర రాక్ష
సేంద్రుల రుధిరమున నిచ్చఁ దడిసి ప్రవే
సించినవి పుడమినిఁ జిత్రముగను 23.

ఆ.వె. నిశిత శస్త్ర రాశి నింగి నన్యమ్ములఁ
దాఁకి వా రిరువురు తద్ద యలిగి
వేసిన శరము లవి వేల ముక్కలుగఁ జే
సినవి విఱిచి వాని శీఘ్రముగను 24.

కం. వారి శర జాల మయ చయ
మా రణమునఁ గ్రతువున జ్వలి తాగ్నుల సరసన్
మూరెడు కుశ చయ నిభముగఁ
దోరమ్ముగఁ గాన వచ్చెఁ దూర్ణం బచటన్ 25.

కం. ఘును లా కృతవ్ర ణాంగులు
కనఁబడిరి మహాత్ములు దృఢ కాయులు సమర
మ్మునఁ బత్ర హీన పుష్పిత
ఘన శాల్మలి వృక్ష కింశుక తరు నిభముగన్ 26.

ఉ. కోరుచుఁ జంప నొండొరుల ఘోర రణం బొనరించి రిద్దఱున్
వీరుఁడు లక్ష్మణుం డసుర వీరుఁడు రావణి మాటిమాటికిం
బోరునఁ గొట్ట రావణ సుపుత్రుని లక్ష్మణుఁ డింద్రజిత్తు రో 27.

షారుణ వర్ణ నేత్రుఁడు మహాత్ముని లక్ష్మణుఁ గొట్ట నుగ్రుఁడై

ఆ.వె. సుంత యలసట బల వంతులు వొంద రి
రువురు నాట ముల్కులు తనువులను
మొలచి పెరిఁగి నట్టి మొక్క లున్నట్టి ప
ర్వతముల పగిదిఁ గనఁ బడిరి వారు 28.

కం. అనలమ్ము భంగి రుధిర
మ్మునం దడిసి గాత్ర రాశి ముల్కుల తోడన్
ఘనముగ వెల్గుచు నుండెను
మను జాసుర వీరులకు సమరతల మందున్ 29.

కం. కడచెను గాలము మిక్కిలి
యడరుచు నొనరింప రణము నత్యుగ్రముగన్
బడలిక నందఁబు సుంతయు
నెడ రణ వైముఖ్యము గన రింతయు నిరువుర్ 30.

కం. సమరశ్రమమ్ము నాపఁగ
సమ రాజిత లక్ష్మణునకు సాయ మొనర్పన్
సమరమున విభీషణుఁడే
సముంచితం బాత్మఁ దలఁచి చయ్యన నిలిచెన్ 31.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నెనుబది తొమ్మిదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 90.

లక్ష్మ ణేంద్రజిత్తుల ఘోర యుద్ధము గొనసాగుట, విభీషణుఁడు రక్కసులను వధించుచు వానరులఁ

ప్రోత్సహించుట, రావణి సారథిని లక్ష్మణుఁడు వధింప వానరులు రథాశ్వములను జంపుట.

చం. కలఁగని మత్త కుంజర నికాశుల మానవ రాక్ష సేంద్రులం
దలఁచి పరస్పరమ్ము వితతంపు జయమ్మును బోరు వారినిన్
బలుఁడు విభీషణుండు గన వారి రణమ్మును సంగ రావనిన్
నిలిచెను భీమ చాపమును నెమ్మి ధరించి కుతూహలమ్మునన్ 1.

ఉ. వింటినిఁ జాచి యయ్యసుర వీరుఁడు రావణు భ్రాత యంతటం
గంటక సన్ని భాగ్రములు కాండము లేసెను రాక్ష సాళిపై
నంటఁగఁ దీక్ష్ణ మార్గణము లంగము లగ్ని నిభమ్ములై నభం
బంటు నగమ్ములం జెఱచు నక్షజ భంగినిఁ జీల్చె వారినిన్ 2.

తే.గీ. అవ్విభీషణు సచివులు హస్తముల ధ
రించి శూలాసి పట్టిస సంచయమ్ము
నెల్ల రక్కసులం గొట్టి రిద్ధ వీరు
లాజిఁ జెలరేఁగి భృశముగఁ దేజు దనర 3.

ఉ. గున్నల మధ్యఁ గుంభి వలె గొప్పగ నుండె విభీషణుం డనిం
దన్నటు లుండఁ జుట్టుకొని తన్నిజ మంత్రులు ప్రీతి రక్కసుల్
చెన్నుగ రాక్షసోత్తముఁడు సేరి ప్లవంగుల నూలుకొల్పుచుం
దిన్నని కాల సంవిదుఁడు దిట్ట వచించెను బల్కు లిట్టులన్ 4.

ఉ. రక్కసులన్ వధింప సమరమ్మునఁ గోరు ప్లవంగు లార! వీఁ
డొక్కఁడె రాక్ష సేంద్రునకు నుండెను దిక్కుగ వీని సైన్య మం
దొక్కఁ డితం డిఁకన్ మిగిలె నూఱక మీ రిటు లేల నిల్తురో
మక్క నితండు రావణుని మానిన నన్య బలమ్ము శూన్యమే 5.

సీ. హతుఁ డయ్యె నాజిఁ బ్రహస్తుఁడు వీరుం డగు నికుంభుఁడు బలుండు కుంభకర్ణుఁ
డసుర కుంభుండు ధూమ్రాక్షుఁడు జంబుమాలియు మహామాలియు రయమున ఘనుఁ
డశనిప్రభుం డింక నసుర సుప్తఘ్నుఁడు యజ్ఞకోపుండు బలాతిశయులు
వజ్రదంష్ట్రుండును వైరిఘ్ను వికటుండు సంహ్రాది తపనుండు సమసి రాజిఁ
తే.గీ. బ్రఘస మంద ప్రఘాసులు బల్లిదులు ప్ర
జంఘు జంఘాగ్ని కేతు లసదృశ రశ్మి 6.

కేతు వింక విద్యుజ్జిహ్వుఁ డాతత బలుఁ
డా ద్విజిహ్వుండును సుపార్శ్వుఁ డసుర ఘనుఁడు

ఆ.వె. సూర్య శత్రు వింక శ్రుత కంప నాకంప
నులును జక్రమాలి నుత పరాక్ర
మ బలవంతులు నసమానులు దేవాంత
కుఁడు నరాంతకుండు గూలి రవని 7.

ఉ. వీరి ననేకులన్ రిపుల భీమ తరాసుర వీర వర్యులన్
మీరు వధించి సాగరము మించి తరించి స్వకీయ బాహులన్
వారక చిన్ని గోష్పదము పన్నుగ దాఁటఁగ మీర లర్హులే
మూరి జయింపుఁడీ మిగులు బోరనఁ జచ్చిరి వచ్చి దర్పితుల్ 8.

కం. జనకుఁడ నేను నిజ కుమా
రునిఁ జంపు టయుక్తము నృవరు నిమిత్తము నే
మన మందు వీడి జాలినిఁ
దనయుని వధియింపఁ దలఁతు దారుణ మైనన్ 9.

చం. తనయునిఁ జంపఁ గోరు చిన తండ్రికి నశ్రులు నిండి కన్నులం
బని నిట నాపు చున్నయవి వాని వధించు మహా భుజుండు ధ
న్వి నెగడి యాజి లక్ష్మణుఁడు వీనికిఁ జెంతఁ జరించు వైరులన్
వనచరులార! కూడికొని పన్నుగఁ జంపుడు విక్రమించుచున్ 10.

ఆ.వె. ఇవ్విధము యశస్వి యింపుగ నను రేంద్రుఁ
డురువుగఁ బురికొల్ప నుత్సహించి
సంతసమ్ము నంది శాఖామృగులు తోఁక
లఁ గదలించి రెల్ల రమ్యముగను 11.

ఆ.వె. వారిదములఁ గన్న బర్హి సంఘము భంగి
వానరర్షభులు రవమ్ము లడరు
చు నొనరించి రంత ఘనముగ సింహ నా
దముల భంగిని వివిధమ్ము లపుడు 12.

ఉ. అంతట జాంబవంతుఁడు సహానుచ రావలి గోళ్ల తోడుతన్
దంతములన్ నఖమ్ములను దారుణ రీతిని నశ్మకోటితో
వంత లొసంగె మిక్కుటము వైరుల కెల్లను గాంచి రక్కసుల్
జెంతఁ జెలంగి ఋక్షపతి శీఘ్రమ కొట్టిరి యాయుధమ్ములన్ 13.

ఆ.వె. చంపుచుండ రాక్షస గణ సైన్యమ్మును
జాంబవంతు నాజి శర సునిశిత
పరశు తోమర వర పట్టి సాదులఁ గొట్టి
రసుర వర్యు లడర నాగ్రహమ్మ 14.

ఆ.వె. తుముల మయ్యె నంత దురము హర్యసురుల
కు సురవరుల కసుర కోటి కైన
పగిది క్రుద్ధు లైన వారికి భీమ మ
హా స్వనమ్మ లడర నద్భుతముగ 15.

కం. హనుమంతుఁడు గూడ స్వయము
ఘను లక్ష్మణు దించి యంతఁ గనలు సెలంగం
గొని నగము నుండి సాల
మ్ము నసురుల కదన మొనర్చెఁ బొలియ సహస్రుల్ 16.

కం. పిన తండ్రి కొసఁగి యుద్ధ
మ్మును బలుఁ డయ్యింద్రజిత్తు మూరిన యలుకం
జనెఁ బరు పెట్టి తిరిగి య
మ్మనుజేంద్రుని పైకిఁ బర దమను పైకి వెసన్ 17.

చం. అలుకను లక్ష్మ ణేంద్రజితు లంకము నందుఁ జెలంగు చుండి ము
ల్కుల జడినిం బరస్పరము ఘోరముగాఁ గురియించి యిర్వురున్
బలముగఁ గొట్టుచుండగను బల్లిదు లిద్ద అదృశ్యులైరి య
మ్ముల గమి సూర్య చంద్రులను బోలి ఘనార్తుల వానకారునన్ 18.

ఉ. కైకొను టేని నెక్కిడుట కార్ముక మందును నారి లాగుటల్
వీఁకను బాణ ముక్తి గుఱి వీక్షణముల్ నిజ ముష్టి యత్నముల్
ప్రాకట రీతిఁ గన్పడవు వారల పాణుల లాఘవమ్ముచే 19.

నా కలహమ్ముననం దరయ నన్నర రాక్షస వీర కృత్యముల్

ఆ.వె. చాప వేగ మడర సడలి నట్టి శరజా
లమ్ము కప్ప నక్కజమ్ముగ నట
నంతరిక్ష మందు సుంతయు రూపమ్ము
లు కనరాక యున్నవి కనుల కని 20.

కం. ఒకపరి రావణి లక్ష్మణుఁ
డొకపరి లక్ష్మణు నసురుఁడు నుగ్రమ్ముగఁ జే
రి కదన మొనర్చు చుండఁగ
నకటా సందేహ మొదవె నత్యధికముగన్ 21.

కం. వా రిరువురిచే నాజి న
పారముగ విముక్త మైన వాడి ములికులన్
నీరంధ్ర మయ్యె గగనము
తోరముగాఁ జీఁక టలమెఁ దూర్ణం బెల్లన్ 22.

కం. పడు వారిద్దఱి వీరుల
కడు వాడివి శత శరములు కవియఁగ దిశలన్
బెడిదమ్ముగ శర సంకుల
మడరుచు నయ్యె నలు దిక్కు లాశ్చర్యముగన్ 23.

కం. అంతయుఁ జీఁకటి నిండఁగ
నెంతొ భయమ్ము జనియించె నెల్లెడ లందున్
శాంతింపఁగ పడమటి గిరి
చెంతను రవి రక్త నదులు సెలఁగుచుఁ బాఱెన్ 24.

తే.గీ. సంగ రాంగణమునఁ దమి సంచరించి
క్రూర మృగములు సెలరేఁగి దారుణముగ
నాదములు సేయ భీమ స్వనములు సెలఁగు
చుండ వీవఁడు వాయువు మండఁ డగ్ని 25.

ఆ.వె. స్వస్తి కలుగుఁ గాక సర్వ లోకముల కం 26.

చుఁ బలికిరి పరమ ఋషు లటఁ జార
ణులను గూడి దుఃఖితు లయిరి గంధర్వు
లాజిఁ జూచు చుండి యధికముగను

ఉ. అంతట రాక్షసర్షభు హయమ్ములఁ గాంచన భూషితమ్ములన్
సొంతము కాల వర్ణముల నాజిని నాలుగు కోల లేసి తా
నెంతొ కలంచె నాల్గిటిని నిన్నర వర్యుఁడు లక్ష్మణుండు దు
ర్దాంత బలోన్నతుం డడరి దండ ధరాభుఁడు విక్రమించుచున్ 27.

ఉ. ఇంకొక పీత భల్లమున నెంతయొ తీక్ష్ణ శరమ్మునన్ సు ప
త్రాంకము లాగి కర్ణముల నంటఁగ వాసవ వజ్ర తుల్యమున్
బింకము నూని సూతు తల వేగమ త్రుంచెఁ జరించు చున్న నా
యంకము నందు శ్రీ కలితుఁ డత్తల గర్జ ప్రతిధ్వనింపఁగన్ 28.

ఆ.వె. సారథి రణమందు సమయ మందోదరి
సుతుఁడు స్వయ మరదము సుగతిఁ దోలు
చుండి ధైర్య మూని వెండి స్పృశించెను
భీమ ధనువు వేగ వీర వరుఁడు 29.

తే.గీ. చూచు వారి కద్భుత మయ్యెఁ జూడ నేర్పు
హరుల మగ్నుఁ డైన నసురుఁ డతనిఁ గొట్టె
నిశిత శరముల ధను వందు నిలువ గుఱ్ఱ
ముల పయిన దాశరథి బాణములను బఱపె 30.

తే.గీ. చిక్క నవకాశము లడుచు శిత శరముల
పంక్తిఁ బఱపి యింద్రజితుని వడి వడి నొన
రించు సౌమిత్రి యాజిఁ జరించు వాని
వీత భీతిని రాక్షస వీరుఁ గాంచి 31.

కం. కని హతుని సారథిని రణ
ము నందు రావణ సుతుండు పోరునఁ దమక
మ్మును వీడె విషణ్ణాత్ముం
డు నయ్యె రాక్షస వరేణ్యుఁడు కలఁత సెలఁగన్ 32.

కం. కని దుఃఖావృత తప్తా
నను నసుర వరేణ్యు మురిసి నగచర యోధుల్
ఘను లక్ష్మణు శ్లాఘించిరి
మనుజ వరేణ్యు నతిరథు సమర దుర్భేద్యున్ 33.

తే.గీ. త్వరపడి రయమ్ము పెంచిరి వాన రోత్త
ములు ప్రమాథి రభస శరభులు ఘనుండు
గంధమాదనుండు సహింపక నలువురు దు
మికిరి నలు గుఱ్ఱముల పైకి మేటి బలులు 34.

ఆ.వె. పైనఁ బడిన యంతఁ బర్వత సన్నిభు
లా ప్లవంగ వీరు లట్లు గుఱ్ఱ
ముల ముఖముల రక్తము స్రవించె నరుణమ్ము
నలఁగి నేల మీద నాల్గుఁ గూలె 35.

కం. తురగమ్ములను వధించి య
సుర వర్యుని గొప్ప రథముఁ జూర్ణమ్ముగఁ జే
సి రయమున నెగిరి తిరిగి నృ
వరు లక్ష్మణు చెంతఁ బ్రీతి వ్రాలిరి నలువుర్ 36.

కం. హత సారథి రావణి యా
హతాశ్వ రథ మవతరించి యమ్ముల వానన్
వితతమ్ముగఁ గురిపించుచు
నతి రయమున నుఱికె రాఘ వానుజు పైకిన్ 37.

తే.గీ. అంత లక్ష్మణుఁడు సురగ ణాధినేతృ
నిభుఁడు వారించె శిత బాణ నిచయమున శ
రముల గుప్పు పదాతిని రావణి హత
తురగు సంగరమ్మున బల్లిదుండు సెలఁగి 38.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ దొంబదవ సర్గము.

# యుద్ధ కాండము

# సర్గము 91.

ఇంద్రజిత్తు లంక కేఁగి యన్య రథమ్మును గ్రహించి తిరిగి యుద్ధ భూమి కేతెంచి ఘోరముగా యుద్ధ మొనరించి లక్ష్మణుని యైంద్రాస్త్రమ్మున నిహతుఁ డగుట.

కం. హత హయుఁడు మహా తేజుఁడు
వితతమ్ముగఁ గ్రుద్ధుఁ డసుర వీర వరేణ్యుం
డు తనదు తేజమ్మున సమ
ర తలమ్మున నింద్రజిత్తు ప్రద్యోతించెన్ 1.

తే.గీ. ఒకరి నొక్కరు వధియింప నుగ్ర శరము
లను వలచు వారలు నిరంతరమ్ము జయము
మసల వనమునఁ జనుదెంచు మత్త కుంజ
రోత్తముల భంగి నుపమింప నుభయు లుంద్రు 2.

ఆ.వె. ఇచ్చ టచట నుండి యేఁగుదెంచు పరస్ప
రమ్ము చంప నెంచు రాక్షస హరి
వీరు లంక మందు నేరరు విడువంగ
వారి విభుల గౌరవమ్ము మీఱ 3.

చం. ముదము నొసంగ రక్కసుల మూఁకకు మెచ్చుచు సంతసమ్మునం
గుదురుగఁ బల్కె నివ్విధము ఘోర తమం బిట నెల్ల దిక్కులన్
వదలక కమ్మె సుంత దమ వారిని నన్యుల నేర నట్లు మీ
రుదరి ప్లవంగ వీరులకు యుద్ధము నందు నొసంగ మోహమున్ 4.

చం. బెదరక పోరుఁ డే నరిగి పెద్ద రథమ్మునఁ దిర్గి వచ్చెదం 5.

దదవసరమ్ముగ నం గపుల దండు సెలంగుచుఁ గాంచి నన్నిటం
గదన మొనర్ప కుండఁ దగు కార్యము లెంచుచు సేయ నర్హులే
కదలెను మోస పుచ్చి కపి కాయము నిట్లని స్యందనార్థమై

ఉ. చేరి పురమ్ము లంక కతి శీఘ్రము సేసి యలంకరింపఁగాఁ
దేరును బ్రాస ఖడ్గములు దివ్య శరావళి నింపి యింపుగా
వారువముల్ చెలంగి పఱవంగ నొనర్చి హయజ్ఞు నైపుణున్
సారథి సంగ్రహించి వెసఁ జక్కఁగ నిల్చి విజేత తేరునన్ 6.

తే.గీ. వెడలె మందోదరీ తనయుఁడు పురమ్ము
నుండి రాక్షస పుంగవు లుండఁ దోడు
తూర్ణము సమర కాంక్షుఁడు దోర్బలుం డ
సుర వరేణ్యుఁ డకట కాలచోదితుండు 7.

ఉ. వేగులు వేగ లాగ సవిభీషణు లక్ష్మణు మార్కొనన్ వెసన్
బాగుగ నింద్రజిత్తు విడి పట్టణ రాజము శత్రునాశకున్
మూగఁగ గాంచి లక్ష్మణుఁడు మోరమెకమ్ములు నవ్విభీషణుం
డా గతి రాఁగఁ దేలికకు నచ్చెరు వందిరి మిక్కుటమ్ముగన్ 8.

ఉ. కోపము నూని రావణి సుఘోర శరమ్ముల వానరేంద్రులన్
వే పగ నూని కూల్చె నని వీరుఁడు వందల వేల సంఖ్యలం
జాపము మండలీకృతము సక్క నొనర్చి సలాఘువమ్ము దాఁ
దూపులఁ జంపె వానరుల దుర్జయుఁ డాజిని విక్రమించుచున్ 9.

ఉ. అమ్ముల వధ్య మానులు మహోర్తులు జేరిరి లక్ష్మణున్ హరుల్
బమ్మను జేరు దేవతల భంగిని నంతట  యుద్ధ కోపమే
పమ్మ నెడంద లక్ష్మణుఁడు భగ్నము సేసెను వాని కార్ముకం
బిమ్ముగఁ బాణి లాఘువము నెల్లను జూపుచు బిట్టు మండుచున్ 10.

ఉ. నైరృతుఁ డన్య చాపమున నారినిఁ గూర్చుచు నుండ వేగ మే
పారగ మూడు బాణముల నద్ధనువున్ వెసఁ ద్రుంచె లక్ష్మణుం
డా రఘు నందనుం డలిగి యంతట ఖండిత చాపు ఱొమ్మునన్
మూరి శరమ్ము లైదిటిని భోగి నిభమ్ములు వేసి నొంచినన్ 11.

చం. ఉరుతర కార్ముకచ్యుతము లుర్విని఼ గూలెను వాని కాయముం
ద్వరితము సీల్చి రక్త యుత బాణము లెఱ్ఱని పాములో యనన్
విరివిగ఼ గ్రక్కి రక్తమును భిన్న తనుత్రుఁడు నోటి నుండి వి
ల్లురుతర మౌర్వినిం గొసె బలోన్నత మింద్రజితుండు నుగ్రుఁడై 12.

చం. కని ఘన వీరు లక్ష్మణుని఼ గ్రన్నన఼ గుర్సెను గాండ వర్షముం
గనఁబడ లాఘవమ్ము సుర కాంతుఁడు వర్షము఼ గుర్యు భంగినిన్
ఘన తర బాణ వర్షమును గొణప ముక్తము నా దురాసద
మ్మును దడ఼ బా టొకింతయును బొందక లక్ష్మణు఼ డాపె నింపుగన్ 13.

కం. చూపె మహా తేజు఼ డటుల
భూప కుమారుండు ఘనుఁడు ముక్తావేగుం
డేపారిన విక్రమమును
నా పల లాశనునకు఼ బరమాద్భుతము ననిన్ 14.

ఉ. అంతట మూడు మూడు సెల లాజిని నొక్కొకరిన్ రయమ్ముగా
నంతము సేసి వేసి త్వరి తాస్త్ర విభూతిని఼ జూపి యంత దే
వాంతకు నింద్రజిత్తుని శరౌఘము లేసి భృశమ్ముగా ననిం
జింతితు఼ జేసె లక్ష్మణుఁడు శీఘ్రమ మార్గణ తాడనమ్ములన్ 15.

కం. బలవంతుఁడు శత్రువు శ
త్రులఁ జంపెడు వాఁడు గొట్ట దురమున భృశ మ
ట్టుల఼ దన్ను నింద్రజిత్తు క
నలి పఱపెను విశిఖ ధార నరవరు పైనన్ 16.

ఉ. చేరక మున్న లక్ష్మణుఁడు శీఘ్రమ వానిని఼ ద్రుంచె఼ దీక్ష్ణముల్
ఘోర శరమ్ము లేసి రిపు కోటి నిహంత రఘూత్తముండు నా
పోరున నంత నా రథిక పుంగవు గౌరవ పాత్రు఼ డైన యా
సారథి మూర్ధముం దునిమె఼ జక్కఁగ నానత పర్వ పత్రినిన్ 17.

తే.గీ. లేక యున్నను సూతుఁడు వీఁక లాగె
మండల గతిం దిరుగుచుండి బెండు వడక 18.

వారువములు తడఁబడక ఘోర సమర
మందు వీక్షింప నద్భుత మయ్యెఁ గరము

ఆ.వె. దృఢ పరాక్రముండు ధీరుండు క్రుద్ధుఁడై
లక్ష్మణుండు భృశము త్రాస మొసఁగఁ
గొట్టెను శరములను గుప్పించి రావణి
గుఱ్ఱములను యుద్ధ కోవిదుండు 19.

కం. అప్పనిని సైపఁ జాలక
యప్పరమక్రుద్ధ రాఘ వానుజు పైనన్
గుప్పించె బాణములు పది
యప్పు డలుక మీఱ రావణాత్మజుఁ డాజిన్ 20.

ఆ.వె. వాని వజ్ర సన్నిభ శరము లహి విష
తుల్యములు పసిండి తొడుగుఁ దగిలి
విలయము లయి కూలె నిలను లక్ష్మణు వీడి
వింత వొడమ సంగ రాంతరమున 21.

ఉ. తోఁపఁగ వాని బొందలము తోర మభేద్యము యంచు నింద్రజి
త్తాపక పైచి బాణముల నంతట నుత్తమ పుంఖ యుక్తముల్
సూపుచు నస్త్ర వేగమును శూరుఁడు ఫాలము నందుఁ దాఁకఁగాఁ
గోపము మీఱఁ గొట్టె నట ఘోరముగా రిపు వీరు మూడిటన్ 22.

కం. వెలిఁగె రఘునందనుం డా
లలి తాంబకములను గూడి లక్ష్మణుఁ డని లో
న లలాటస్థమ్ములతోఁ
గలహశ్లాఘియె త్రిశృంగ కలి తాద్రి వలెన్ 23.

చం. అసురుని చేత నర్దితుఁడునై కడు నవ్విధి సంగరమ్ములో
వెస నసురేంద్రునిం దిరిగి బెట్టుగఁ గొట్టె శరమ్ము లైదిటం
బసిఁడి మయమ్ము లంచిత విభాసిత కుండలముల్ భృశమ్ముగా
నెసఁగెడు నాననమ్మున నహీన పరాక్రముఁ డంత నుగ్రుఁడై 24.

తే.గీ. లక్ష్మ ణేంద్రజిత్తు లడరి రణము నందు
గొప్ప వీర్యము విల్లులు కూడి నట్టి
వారు భీమ పరాక్రమ వీర వరు లొ
కరి నొకరు మార్గణములఁ గొట్టిరి శితముల 25.

తే.గీ. రక్త సిక్తులు లక్ష్మ ణేంద్రజితు లుభయు
లట్లు భీకర భండన మందుఁ బోరు
చుండ వీక్షింప వెల్గుచు నుండి రపుడు
పుష్పి తేద్ధ కింశుక భూజముల నిభమ్ము 26.

కం. మన ముంచి జయం బందున
ఘన ధన్వు లిరువురు సర్వ గాత్రము లందుం
గినుకం గొట్టిరి ఘోరము
గ నొక్కరి నొకరు పటుతర కాండావలినిన్ 27.

ఉ. కొట్టె రణాగ్రహమ్మునను ఘోర బలుండు విభీషణుం బగన్
గట్టిగ మూడు తూపుల ముఖమ్మున రావణి బల్లిదుం డనిం
గొట్టి పితృవ్యు వానరులఁ గొట్టె నయో ముఖ భాసితమ్ములన్
బెట్టుగ వేసి యొక్కొకటి వీరుల నెల్లర వీడ కేరినిన్ 28.

తే.గీ. రావణి దురాత్ముని రథ తురంగములను
జంపెను గదచే నా విభీషణుఁడు గొప్ప
తేజమున నడరెడు వీరుఁ డాజిఁ గినిసి
కరము కూల గుఱ్ఱమ్ములు గాంచి యంత 29.

ఆ.వె. వీరుఁ డింద్రజిత్తు పృథ్వి సారథి గూల
దిగి రథమ్ము నుండి దివ్య శక్తి
వైచెఁ బిన్న తండ్రి పైన మహా తేజుఁ
డలిగి భృశము ఘోర మైన దాని 30.

తే.గీ. బల్లిదుఁడు సుమిత్రానంద వర్ధనుండు
వచ్చు చున్నట్టి శక్తినిఁ బన్నుగఁ గని
పదను మీఱిన తూపులు పఱపి విఱిచెఁ 31.

గూల పది ముక్కలై యవి నేల పైన

చం. సుదృఢ తనుండు క్రుద్ధుఁ డయి శూర వరుండు విభీషణుండు పై
చెఁ దగుల వక్ష మందు నతి శీఘ్రము బాణము లైదు శక్ర జి
త్తదరఁగ నంక మందు నవి యంగముఁ జీల్చుచు రుక్మ పుంఖముల్
వదలక సెత్తుటం దడిసి పాముల మాడ్కిఁ జెలంగె నెఱ్ఱగన్ 32.

కం. కినిసి పినతండ్రి పయిఁ గై
కొనె నా రక్కసుల నడుమ ఘోర తర శర
మ్మును రావణి యమ దత్త
మ్మును నంత మహా బలమ్ము ముక్త దయుండై 33.

మ. కని యా బాణము నింద్రజిత్తు కొన సంగ్రామమ్మునన్ లక్ష్మణుం
డును నన్యమ్ము గ్రహించె విక్రముఁడు విడ్డూరమ్ముగా స్వప్నమం
దు నిడన్ వైశ్రవణుండు రక్కసులకున్ దుర్భేద్య మింద్రాదు లై
నను సాధింపగఁ జాల నట్టి శరమున్ నైపుణ్య మేపారఁగా 34.

తే.గీ. లాగ నిద్దఱును బరిఘుల వలె నున్న
బాహువుల ధనుస్సుల నట్లు బలము మీఱ
పెల్వడెఁ బెను రవమ్ములు భీకరముగఁ
గ్రౌంచ పక్షుల కూఁతల మించి యాజి 35.

తే.గీ. వీరు లిద్దఱు సంధింప విండ్లను శర
ములను శ్రేష్ఠములను భృశముగ వెలింగె
విడువఁ బడి నింగి నింపుచు వెల్గు లెల్లఁ
గొట్టికొనె ముఖము ముఖము బిట్టు శిఖులు 36.

తే.గీ. బెట్టిదమ్ముగ నమ్ములు కొట్టుకొనఁగ
రెండు ఘోర రూపమ్ములు రేఁగె నిప్పు
రవలు పొగతోడ రాపిడిఁ బ్రభవ మైన
యగ్ని దారుణం బయ్యె నత్యంత మపుడు 37.

కం. కూలిన వొక్కటి నొక్కటి 38.

యాలమ్మునఁ దాఁకి రెండు నవనిన్ శత ఖం
డాలిగ మహోగ్రహ నిభము
లా లక్ష్మణ రావణుల మహా మార్గణముల్

చం. శరములు గాఁగ వ్యర్థములు సంజనితత్రపు లల్కు మీఱఁగా
నరయుచు లక్ష్మ ణేంద్రజితు లంకము నందుఁ జెలంగి రిద్దఱున్
వరుణ వరాహ్వయాస్త్రమును బన్నుగ లక్ష్మణుఁ డేయఁ గ్రుద్ధుఁడై
యరి దమనుండు రావణి మహాస్త్రము రౌద్రము నేసె నుద్ధతిన్ 39.

సీ. రౌద్రాస్త్ర మాజిఁ గూల్పఁగ వారు ణాస్త్రముఁ గ్రుద్ధుఁడు రావణి గొప్ప తేజుఁ
డాజి జయుఁడు వేసె నంత నాగ్నే యాస్త్రమును గాల్చు గతి జగములను నెల్ల
సౌరాస్త్రముననను లక్ష్మణుఁడు వారించె వారింప దానినిఁ గాంచి రేఁగి కినుక
నాసు రాస్త్రము రావణాత్మజుఁ డరి దారుణమ్మును సంధించెఁ బమ్మి దాని
తే.గీ. నుండి వెలువడె వెల్గెడు నుగ్ర శూల
ఖడ్గ కూట కుఠార ముద్గర భుశుండ
ఘన గ దాయుధమ్ములు పెక్కు కని జనింప
దాని లక్ష్మణుం డప్పుడు తద్ద సెలఁగి 40.

తే.గీ. సర్వ భూత సంతతికిని సైప రాని
సర్వ శస్త్రములను జీల్పఁ జాలు నట్టి
యస్త్ర రాజమ్ము వారించె నని మహేశ్వ
రాస్త్రమున లక్ష్మణుండు మహా ప్రభాంగి 41.

ఆ.వె. అంత నయ్యె రోమహర్షణం బా సమ
రమ్ము నిలిచి యాకసమ్ము నందు
భూతము లవి చుట్టు ముట్టిన వింపుగ
లక్ష్మణుని మహాత్ము రఘు వరేణ్యు 42.

కం. హరి రాక్షస భైరవ ఘో
ర రవమ్ములతో నడరెడు రణముం గాంచన్
వరుసగ భూతము లా యం
బర మందు నిలువ వెలిఁగె నభమ్ము భృశముగన్ 43.

ఆ.వె. ఇంద్రు ముందు నుంచి ఋషులు గంధర్వులు
గరుడి యురగములు పితరులు సురలు
సక్క నిల్చి నింగి సౌమిత్రిఁ గాచిరి
లక్ష్మ ణేంద్రజితుల రణము నందు 44.

చం. శర మితరమ్ము శ్రేష్ఠమును జ్వాలి సమస్పృశ రాజితమ్మునుం
గరమున లక్ష్మణుండు గొనెఁ గ్రన్నన రావణి దారణమ్మునున్
సురుచిర పత్ర పర్వమును సుస్థిత కాంచన భూషితమ్మునున్
కర మనువృత్త కాయమును కాయ వినాశక పన్నగాభమున్ 45.

ఉ. ఘోరము దుర్నివార మతి దుస్సహ మాసుర భీతిదమ్మునున్
గౌరవ దేవ తార్చితము కౌణప నిర్జర యుద్ధ మందు నిం
పార జయమ్ము నిచ్చినది యబ్బల వైరికి దానిఁ గూర్చె నా
వీర వరుండు లక్ష్మణుఁడు వింటిని నమ్మున నైంద్ర మస్త్రమున్ 46.

తే.గీ. ఆజి నపరాజితము శర మంత లాగి
లక్ష్మి గలవాఁడు వీరుఁడు లక్ష్మణుండు
సార్థ వాక్యమ్ము లనియె ధర్మాత్ముఁ డిట్లు
భక్తి యుక్తమ్ముగఁ దలంచి భ్రాత నెడఁద 47.

తే.గీ. దాశరథి సత్య సంధుఁడు ధర్మ చిత్తుఁ
డప్రతిద్వంద్వుఁ డైనచో నతుల పౌరు
షమున రాముఁ డో దారుణ శరమ! మించి
చంపు మింక రావణిని నిశ్చయముగ నని 48.

ఆ.వె. లక్ష్మణుండు నారి లాగి యాకర్ణాంత
మంత విడిచె బాణ మప్రతిహత
మింద్రజిత్తు పైన నెలమి నైంద్రాస్త్రముఁ
జేర్చి యద్భుతం బజిహ్మగమ్ము 49.

తే.గీ. వేసి యైంద్రాస్త్రముం బరవీర హంత
లక్ష్మణుఁడు పడ వేసెను రణము నందు
నింద్రజిత్తు తలఁ గిరీట మింకఁ గుండ 50.

లములఁ గూడి నేల పయి దేహమున నుండి

చం. మహిఁ బడి రాక్షసాధిప కుమారు శిరం బది స్కంధ హీన దు
స్సహ భయదమ్ముగా గానఁబడె స్వర్ణ నిభమ్ముగ రక్త సిక్తమై
నిహతుఁడు నింద్రజిత్తు వడె నేల స్వకీయ శిరమ్ము కూలఁగా
సహిత కిరీటమై కవచ సంయుతుఁ డంత వికీర్ణ చాపుఁడై 51.

తే.గీ. అఱచి రెల్ల వానర వరు లవ్విభీష
ణ సహితులు మీఱ నెదల సంతసము హతుఁడు
గాఁగ నింద్రజిత్తు లయుఁడు గాఁగ వృత్రుఁ
డమర వర్యు లానందించి నట్టు లపుడు 52.

ఆ.వె. అంతరిక్ష మంత నప్సరో గంధర్వ
ముని నికాయ సర్వ భూతముల జ
య నినదముల నిండె నత్యంతముగ నింద్ర
జిత్తు కాలు నిల్లు సేరి యుండ 53.

కం. జితకాశులౌ హరులచే
వితతమ్ముగఁ గొట్టఁబడుచు వివిధ దిశలకున్
వెతఁ బాఱె నసుర సేన త్వ
రిత మెఱిఁగి పతితుఁ డతఁ డని రేఁగిన భీతిన్ 54.

ఉ. వానర వధ్యమాను లయి పాఱిరి లంకకు వీడి శస్త్రముల్
మానని భీతి మోహితులు మానిసి దిండులు కొంద ఱింకనుం
బూనక ఖడ్గ పట్టిస సమూహ పరస్వధముల్ కరమ్ములం
గానక రక్ష వందలుగఁ గ్రన్నన దిక్కుల కెల్లఁ కేఁగఁగా 55.

ఉ. కొందఱు వానరార్దితులు కూలిరి సంద్రము నందు లంకకుం
గొందఱు వాఱఁ గొండలను గొందఱు భీతిని నాశ్రయింపగాఁ
గొందఱు సేరి యింద్రజితు కూలుట నంకము నందుఁ బాఱఁగాఁ
నం దరయంగ రాఁ డట సహస్ర నిశాచరు లందు నొక్కఁడున్ 56.

ఆ.వె. సూర్యుఁ డస్తమింప సూర్య కిరణములు 57.

కాన రాని భంగిఁ గయ్య మందు
నింద్రజిత్తు గూల నెవ్వ రసురు లందుఁ
గాన రారు పాఱఁగా దిశలకు

ఆ.వె. వాడిన కిరణముల తోడి యాదిత్యుని
యట్టు లాఱి నట్టి యగ్ని వోలె
నయ్యె నంత నా మహా బాహు వింద్రజి
విగత జీవితుఁ డయి పృథ్విఁ గూల 58.

కం. శాంతింపఁ బీడ సాంతం
బంతకుఁ జేరఁగ రిపుండు నంకమ్మున దే
వాంతకుఁ డసురాధిప సుతుఁ
డంత జగం బెల్లఁ గాంచి యానందించెన్ 59.

ఆ.వె. పాప కర్ముఁ డసుర వర్యుఁడు మరణింప
సర్షి సంఘు మంత శక్రుఁడు భగ
వంతుఁ డత్యధికము సంతసించెను నింగి
దుందుభిస్వనములు విందు సేసె 60.

తే.గీ. ఆడి రచ్చర లింపుగ నలరి పాడి
రెల్ల గంధర్వులు మహాత్ము లింకఁ పుష్ప
వృష్టి కురిసెను బొగడిరి యెల్ల సురలు
హతుఁడు గాఁ గ్రూరుఁ డద్భుతం బయ్యెఁ గాంచ 61.

ఆ.వె. సర్వ లోక భయదుఁ డుర్విఁ గూల నపుడు
పావనమ్ము లయ్యె వారి నభము
రెండు సంతసించిరి సుర దానవు లరు
దెంచి రచట కడరి కాంచ నెంచి 62.

తే.గీ. దేవ గంధర్వ దానవు లా వలను ని
లిచి ముదమ్మున నిట్లు పలికిరి భూసు
రులు విగత శోకు లయి నెడఁదల భయమ్ము
లేక చరియింత్రు గాక మురియుచు నింక 63.

చం. ప్లవగులు ప్రస్తుతించి రట లక్ష్మణు నైరృత రాజపుత్రుఁ డా
హవమున నంతరింపఁ గని యప్రతిమప్రతి వీరు నట్లు ధీ
ర వరులు మారుతాత్మజుఁడు రాక్షస వంశ విభీషణుండు ఋ
క్ష వరుఁడు జాంబవంతుఁడును జక్క స్తుతించిరి గెల్వ హృష్టులై 64.

కం. బొబ్బ లిడుచు గర్జించుచు
నబ్బురముగ గెంతు చుండి హరు లత్యంతం
బుబ్బి వరింపగ లక్ష్యము
నిబ్బరముగ లక్ష్మణు దరి నిల్చిరి ప్రీతిన్ 65.

ఆ.వె. వాలములను నేల బాఁదుచు జబ్బలు
సఱచుచు హరి వరులు సంతసమ్ము
న వినిపించిరి వచనమ్ము లిట్లు జయించు
చుండు సతము లక్ష్మణుండు గనుఁడు 66.

కం. ఒకరి నొక రుంచి కౌఁగిలిఁ
బ్రకటించిరి వివిధము లట లక్ష్మణు గుణముల్
సకలమ్ముల సంతోషిం
చి కరము కపి వర్యు లంతఁ జేరి రఘువరున్ 67.

కం. మనములఁ బొంగెను హర్షం
బనితర సాధ్యంపుఁ బనిని నరయం బ్రియ మి
త్రుని లక్ష్మణు పని సురలకు
విన నింద్ర రిపు మరణమ్ము విగ్రహ మందున్ 68.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ దొంబది యొకటవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 92.

లక్ష్మణ విభీష ణాదులు రాముని చెంత కేఁగి యింద్రజిత్తు లక్ష్మణునిచే హతుఁ డయ్యె నని వివరింప
రాముఁడు హర్షించి లక్ష్మణునిఁ గౌఁగిలించికొని పొగడ సుషేణుఁడు లక్ష్మణుఁడు మున్నగు వారికి
చికిత్స సేయ నెల్లరు నారోగ్యవంతు లగుట.

కం. తత్తనువు నందు నోడిన
సెత్తు రనిని నింద్రజిత్తు నిహతునిఁ జేయం
దత్తఱ మందక లక్ష్మణుఁ
డత్తఱి శుభ లక్షణుండు హర్షితుఁ డయ్యెన్ 1.

ఉ. ఆ వర జాంబవంత పవనాత్మజ వానర సంచయమ్ము రా
మావర జేద్ధ తేజుఁడు కృతాంజలిఁ గూడి కడింది రక్తి సు
గ్రీవుఁడు రాముఁ డున్న దరికిం జనుదెంచె విభీషణున్ ఘనుం
బావని నాని లక్ష్మణుఁడు వైరి విమర్దనుఁ డంత శీఘ్రమే 2.

ఆ.వె. లక్ష్మణుండు సేరి రాముని నిలిచె న
మస్కరించి యంత మనుజ వర్యు
చెంత భక్తి నింద్రు చెంత నుపేంద్రుఁడు
నిలుచు నట్టి భంగి నెమ్మి నూని 3.

కం. దరి సేరి వీరవర్యుఁ డ
సుర వర్యుని నింద్రజిత్తు సూదనమును సం
గర మందు నుడివె గొణఁగుచు
గురువున కా లక్ష్మణుండు ఘోరపు వధమున్ 4.

ఆ.వె. లక్ష్మణుండు ద్రుంచె రావణి శిరము మ
హోత్సుకుఁ డంచు నంత నవ్విభీష
ణుండు రాఘవునకు దండ కరిగి నివే
దించె సంతసమ్ము మించ నెడఁద 5.

చం. అన విన నింద్ర జిద్వధము నవ్విధి లక్ష్మణు చేత నౌట రా
ముున కెద సంతసం బడరె మోదమునన్ రఘు రాముఁ డిట్లనెన్
ఘనుని మహాత్ము లక్ష్మణునిఁ గాంచుచుఁ దుష్టుఁడ నైతి సాధు వం
చు నని గృతం బసాధ్య మని సూనుఁడు సావ జయమ్ము లబ్ధమే 6.

తే.గీ. శిరము మూర్కొని లక్ష్మణు సిగ్గు వడుచు
నుండ బలిమి నంకమ్మున నునిచి ప్రీతి
వీర్యునిఁ బరిష్వజించి సుపీడితముగ
మరల మరలఁ జూచుచు నుండె మమత మీఱ 7.

తే.గీ. నిశ్వసించు వాని ననుజుని వ్రణ పీడి
తు రిపు బాధితు దుఃఖతప్తుని శిరమ్ము
మూర్కొని పలుమఱులు పల్కె మునుకు లూఱ
డించుచు పురుషోత్తముఁ డిట్టు లంచితముగ 8.

ఉ. తోరపు మంచి కర్మమును దుష్కర కర్ముఁడ చేసి తింపుగా
మారణ మంద నాజినిఁ గుమారుఁడు రావణు నంక మందు దు
ర్వారునిఁ గూలి నట్టులను రాక్షసు నెంతును నిశ్చయమ్ముగన్
శూరునిఁ జంప నీ వరినిఁ జొప్పడె నాకు జయమ్ము లక్ష్మణా! 9.

తే.గీ. రావణు నృశంసు కుడి చేయి రావణి సమ
రమున ఖండించితి వతఁ డాశ్రయము గాదె
జనకునకు నాజి నివ్విభీషణుఁడు మారు
తాత్మజుఁడు గొప్ప పని సేసి రంక మందు 10.

ఉ. మూడు పవళ్ల నెట్టులనొ మూరి వధించితి మూడు రాత్రు లం
దోడక వీరు నింద్రజితు నుగ్రుని హీన రిపుండ నైతి నే
నేఁడు దశాననుండు విని నేలను గూల నిజాత్మజుండు దాఁ
గూడి మహోగ్ర సైన్యమును గ్రుద్ధుఁడు వచ్చును యుద్ధ భూమికిన్ 11.

కం. వానిని రక్కసు వచ్చెడు
వానిని నందన లయార్తు వానర వర ఘో 12.

రానీకమ్మునఁ గప్పుచు
సే నా దుర్జయు వధింతు నిశ్శంక ననిన్

ఆ.వె. అనుజ! రక్షకుండ! హతుఁడు గా నింద్ర జి
త్తంక మందు నాకు నరయ సీత
యేని భూమి యేని యెవ్విధి నింక దు
ర్లభము లగును జెపుమ లక్ష్మణుండ! 13.

ఆ.వె. ఆశ్వసించి రాముఁ డనుజ వరేణ్యుని
నిట్లు కౌఁగిలించి యెలమి పిలిచి
యా సుషేణుఁ బలికె హరి పుంగవుని తోడ
లలిత గిరల నిట్లు రాఘవుండు 14.

తే.గీ. ఈతని సశల్యు సౌమిత్రి నిద్ధ మిత్ర
వత్సలునిఁ బ్రాజ్ఞుఁ నెవ్విధి స్వస్థతఁ బడ
యఁ గలఁ డవ్విధి నొనరింపు హరి వరేణ్య!
వైరి పీడితు సంప్రీతి వైద్యవర్య! 15.

తే.గీ. లక్ష్మణ విభీషణుల వానర వర ఋక్ష
వీరుల ద్రుమ యోధుల రణ విద్ధుల వ్రణ
బాధితులఁ జేయు మారోగ్యవంతు లగు వి
ధంబు క్షిప్ర మొనర్చి యత్నము మహాత్మ! 16.

కం. అన రాముండు సుషేణుఁడు
విని హరి యూధపుఁ డొసంగె వినుత మహాత్ముం
డు నసఁ బర మౌషధమ్మును
మనుజర్షభ లక్ష్మణునకు మన్నన తోడన్ 17.

కం. వడి నాఘ్రాణింప నర వ
రుఁడు గంధముఁ దొలఁగె బాధలును శల్యమ్ముల్
దడయక తగ నెల్ల వ్రణము
లడంగ నారోగ్యవంతుఁ డయ్యె భృశముగన్ 18.

కం. రామాజ్ఞను నొనరించెను
క్షేమము గూర్పఁగఁ జికిత్స శీఘ్ర తరముగా
నా మర్కట సుహృదులకును
బ్రేమ విభీషణున కామ విజ్ఞుం డంతన్ 19.

కం. హత శల్యుండు గతశ్రమ
గతజ్వరుండు క్షణ మందుఁ గలుగఁ దనువునన్
వితత ని జారోగ్యమ్ము ము
దితుఁ డయ్యెను లక్ష్మణుండు ధీరుం డంతన్ 20.

తే.గీ. లక్ష్మణు నరోగు నుత్థితు రాఘవుఁడు వి
భీషణుండు సుగ్రీవుఁడు వీర వరుఁడు
ఋక్షపతి జాంబవంతుఁడు సెల్లరు గని
సబలము సుచిర మందిరి సంతసమ్ము 21.

కం. కొనియాడె లక్ష్మణు పనిని
నని దుష్కరము గని దశరథాత్మజుఁ డిన నం
దనుఁ డా సుగ్రీవుఁడు విని
వినిపాతుం డింద్రజి యని పెల్లుగ మురిసెన్ 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ దొంబది రెండవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 93.

ఇంద్రజిత్తు మరణము విని రావణు మంత్రులు ధ్రువీకరించికొని రావణునకుఁ జెప్పినఁ గోపోద్రిక్తుండై రావణుఁడు సీతను వధింప నేఁగుచుండ మంత్రి సుపార్శ్వుఁడు తగదని వారించి యీ కోపమును రామునిపైఁ జూపి వధింపఁ దగుదు వన విరమించి తన సభ కేఁగుట.

కం. విని యింద్రజిత్తు మరణం
బని౯ బౌలస్త్యు సచివులు మహాసురులు ధ్రువం
బని యెఱిఁగి సవ్యథ దశా
నను జేరి నుడివిరి దాని నైర్బత పతికిన్ 1.

తే.గీ. యుద్ధ మందు మహారాజ! యుద్ధ బలుఁడు
నీ సుతుండు లక్ష్మణునిచే నిహతుఁ డయ్యె
సాయ మిడ విభీషణుఁడు భృశమ్ము మేము
సూచు చుండఁగ రావణి శూరవరుఁడు 2.

ఉ. శూరుఁ డజేయుఁ డంకముల శూరుని లక్ష్మణు నొవ్వఁ జేసి పా
కారి జితుండు మార్కొని మహాత్ముఁడు ఘోర శరాలి నీ సుతుం
డా రణ మందుఁ గాంచఁగ సమంచిత లోకము లేఁగె శౌర్య మే
పారఁగ రాక్షసాధిప! దశానన! రావణ! శత్రు సూదనా! 3.

ఆ.వె. ఆలకించి యా భయంకర మతి ఘోర
మతుల దారుణమ్ము నాత్మ సుతుని
యింద్రజిత్తు రాక్షసేంద్రు వధము మూర్ఛ
నందె రావణుండు డెంద మడల 4.

మ. చిర కాలమ్మున కంది సంజ్ఞ నసురశ్రేష్ఠుండు దీనుండునై
సుర విద్వేషి దశాననుండు సెలఁగన్ శోకమ్ము పుత్రార్థమై
కర మార్తిన్ విలపించె హాతనయ! రక్షస్సైన్య ముఖ్యా! మహా
సుర! నీ వింద్రు జయించి లక్ష్మణునకుం జోద్యమ్ము పాలైతివే 5.

చం. కినిసినఁ గాలు నైనఁ బరికింప జయింతువు మందరాగ్ర భే
దన మొనరింతు వమ్ములను దప్పక లక్ష్మణుఁ జెప్పనేలయా
యనిని మహాభుజా! యెవని నారయ నేఁగితి కాలధర్మముం
గని సుత! యట్టి సారి పయి గౌరవ మింపుగఁ బెర్గె నా కెదన్ 6.

ఉ. దేవత లందు యోధులకు దివ్య పథం బిది యీయఁ బ్రాణముల్
భూవరు కోసమా భటుఁడు వొందును స్వర్గము నిశ్చయమ్ముగన్ 7.

దేవ గణమ్ము లోకపులు తేఱి మునీంద్రులు నిర్భయమ్ముగాఁ
బోవఁగ నింద్రజిత్తు గనుమోడ్చ్రు సుఖమ్ముగ నేఁడు పుత్రకా!

తే.గీ. మూడు లోకము లన్నియు నేఁడు స వన
పృథివి యెల్ల నొక్కఁడు నాదు ప్రియ సుతుండు
శక్రజిత్తు గానఁగ రామి చాల శూన్య
మయ్యె నాకు హృదయ మెల్ల వ్రయ్య లయ్యె 8.

ఆ.వె. అంతిపురము నందు నసుర కన్యల రోద
నమ్ము చెవులఁ దూఱె నెమ్మన మగ
లఁగఁ గరేణు సంఘు రావముల పగిది
పర్వత గుహ లందుఁ బరఁగు చుండ 9.

ఉ. ఎక్కడ కేఁగి తీ వకట యింతినిఁ దల్లిని నన్ను నింక నీ
రక్కసులం ద్యజించుచుఁ బరంతప! చక్కటి యౌవరాజ్యమున్
గ్రక్కున లంక నెల్లఁ గడుఁ గాఱియ పెట్టుచు నెల్ల వారినిన్
మక్కువ వీడి నిర్దయఁ గుమార!వచింపుమ నన్ను జూడుమా 10.

తే.గీ. ఏఁగ నే యమాలయమున కింద్రజిత్తు!
నాదు ప్రేత కార్యమ్ములు నందన వర
నీకు కార్యమ్ము లౌఁ గద నీవు వాని
ని విపరీతములం జేసితి విట నకట 11.

తే.గీ. బ్రతికి యుండ సుగ్రీవుండు లక్ష్మణుండు
రాఘవుండును నాదు శల్యముల మాప
కుండ మమ్మెల్లరను వీడి యుండ వంత
లూని యేఁగి తెక్కడ కసు రోత్తముండ! 12.

చం. వనరుచు నుండ నిట్టు లనివార్యము రాజున కావహించె నా
త్మను ఘన కోప మంతటఁ గుమార నిమిత్త సముద్భవమ్ము క్రు
ద్ధుని నతి రోషుఁ జేసె రవిఁ దోరపు గ్రీష్మము నందు నంశువుల్
తనరి వెలుంగఁ జేయు గతిఁ దద్దయు రావణు రాక్షసేంద్రునిన్ 13.

ఆ.వె. నుదుటను గనుబొమ్మ లదరుచు ముడివడ
రావణుండు వెలిఁగెఁ బ్రళయ కాల
మందు నక్ర యుక్త మలల నడరు చుండు
నట్టి వనధి వలె దశాననుండు 14.

ఆ.వె. ఆవులింప నంత నాగ్రహమ్మున రావ
ణుండు వాని ముఖము నుండి ధూమ
సహిత మగ్ని వుట్టె జ్వలితమ్ము వృత్రుని
వదన మందు నున్న వహ్ని భంగి 15.

చం. సుత వధ తప్తమానసుఁడు శూరుఁడు రావణుఁ డాగ్రహమ్మునన్
మతినిఁ దలంచి పన్నుగ నమర్థ వశుం డసురేంద్రుఁ డాత్మలో
సతిని విదేహ నందనను జంపఁగ నత్తఱి నిశ్చయించె మా
నిత యని యెంచ కింతయును నిర్దయఁ గ్రూరత తాండవింపఁగన్ 16.

చం. ప్రకృతిఁ గడింది యెఱ్ఱనివి రావణు కన్నులు రోష వహ్నిచేఁ
బ్రకటితమై సుఘోరముగ రక్త మయమ్ములు వెల్గె మిక్కిలిం
బ్రకృతిని రూప మాతనిది భైరవ మత్తఱి మూర్ఛితుండు గా
వికృత రుషాగ్నిఁ గ్రుద్ధ పురభిత్తుగఁ దోఁచె దురాసదుండునై 17.

తే.గీ. రాలె నశ్రు బిందువులు స రక్త రావ
ణాక్షి యుగ్మమ్ము నుండి రయమ్ముగా వె
లుంగు దీపద్వయమున నభంగముగ సు
దీప్త తైల బిందువుల రీతి వితతమ్ము 18.

ఆ.వె. పటపట మని కొఱుకఁ బండ్లను వాని యా
దంత నిస్వనములు వింతగ వినఁ
బడెను యంత్ర ఘన రవమ్ముల భంగిఁ దా
నవులు ద్రిప్పుచుండ నైపుణమున 19.

కం. కాలాగ్ని భంగి క్రుద్ధుఁడు
కాలుచు నే యే వలనులఁ గాంచిన నా యా
మూలల రక్కసు లెల్లరు 20.

వాలిన భీతిని మఱుంగుపడిరి వణఁకుచున్

ఆ.వె. చేరఁ జాల రైరి యారావణుని నంత
కాభ మా కుపితుని నసురు లేరు
సకల దిక్కు లరయు సత్త్వవంతుఁ జరాచ
రములను దిన నెంచు రాక్షసేంద్రు 21.

కం. పలికెను రక్షో నాథుఁడు
నిలుపఁ దలఁచి రక్కసుల నని నభీతిని ని
ట్టుల రావణుండు వాక్య
మ్ముల నసురుల మధ్యను దశముఖుఁ డుగ్రుండై 22.

ఉ. వేల కొలంది వర్షములు పేర్మి నొనర్చితి నేఁ దపమ్ములన్
వేలుపు పెద్ద తుష్టుఁ డయి పెద్దగ నిచ్చె ఫలమ్ములం దపః
కాలము లెల్లఁ దీరగను గ్రన్ననఁ బల్మఱు లా కతమ్మునన్
మేలుగ నాకు లే దడలు మేదిని నిర్జర రాక్షసాళిచే 23.

చం. కవచము బ్రహ్మ దత్త మది కాంతిని సూర్య నిభమ్ము శక్తి వ
జ్రవర నిపాతనమ్ములను రక్కసు లార! సు రాసు రాజిలో
న విఱుఁగ కుండె నా తొడుగునం దమి నెక్కి రథమ్ము వోర న
న్నెవ రెదిరింపఁ జాలుదు రహీను స్వయమ్ముగ నింద్రుఁ డైననున్ 24.

ఉ. ఇచ్చెఁ బ్రసన్నుఁడై ద్రుహిణుఁ డిద్ద ధనుస్సు స మార్గణమ్మునున్
మెచ్చి సురాసు రాంకమున మేటి ధనుస్సును దెండు తూర్యముల్
హెచ్చుగ రేఁగ రాఘవుల నిద్దఱఁ జంపఁగ యుద్ధ మందు నే
నచ్చపుఁ బౌరుషమ్మున బలౌఘమునం జెలరేఁగి క్షిప్రమున్ 25.

కం. తన సుతు వధచేఁ దప్తుం
డునై యమర్ష వశుఁడై కడు దశాననుఁ డా
త్మను జింతించి భృశము సీ
తను జంపఁగ నెంచె నంత దారుణ బుద్ధిన్ 26.

ఉ. క్రూరుఁడు రక్త లోచనుఁడు ఘోరపు దర్శనుఁ డింక దీనుఁడున్ 27.

వారిని దీన రావములు బల్కెడు నైర్రుత కోటి రావణుం
డారసి పల్కె నా తనయుఁ డంకములో మును వంచనార్థమై
యేరినొ చంపి సీత యని యేమఱచెం గపి కోటి దానినిన్

ఉ. నిక్కము నేఁడు సేసెదను నిత్యము సీతను నే వరించినన్
మిక్కిలి దుష్ట భూపతి రమించును జానకి యీమె నాశమున్
గ్రక్కునఁ జేయు వాఁడ నని రాక్షస నాథుఁడు రావణుం డహో
యుక్కున స్వీయ ఖడ్గ వర ముగ్రుఁడు ముట్టెను భీకరమ్ముగా 28.

తే.గీ. ఎగిరి సుత శోక పరితప్తుఁ డెంతొ కినిసి
విమల గగనచ్ఛవినిఁ గనిపించు సగుణ
ఖడ్గ మూని నిజ సచివ గణము దార
లనుసరింప జానకి చోటి కాతఁ డరిగె 29.

ఆ.వె. వెడలు వానిఁ గాంచి యడరంగ సింహనా
దములు క్రుద్ధు నసుర ధవుని నొకరి
నొకరి కౌఁగిలించి యుదరుచు రాక్షసు
లెల్లరు దమ లోన నిట్టు లనిరి 30.

చం. విలయులఁ జేయు రాఘవుల వేగమ గాంచి రణమ్ము నందు భ్రా
తల నసురాధినాథుఁ డది తథ్యము నేఁడు దశాననుండు మున్
నలువుర లోకపాలురను నైపుణి నల్గి జయించెఁ గాదె శ
త్రుల ననిఁ బెక్కు మందిని సరోషము గూల్చెను గాదె బల్మినిన్ 31.

కం. కొని బలమున ముల్లోకము
ల నుండి రత్నముల నెల్ల రక్షఃపతి ప్రీ
తి ననుభవించె సదృశు లీ
తనికిన్ బల విక్రమముల ధరణిం గలరే 32.

ఉ. వారలు వల్కు చుండగను వారితుఁ డయ్యును మేలు నింపుగాఁ
గోరెడు వారి చేత వెసఁ గోప నిమగ్న దశాస్యుఁ డేఁగెఁ దా
నారయ నయ్యశోకవన మందు ధరాసుత నంత రోహిణిం
జేరెడు నింగి నా గ్రహము చెన్నున నుర్కుచు సంభ్రమమ్మునన్ 33.

తే.గీ. రాక్షస వనితా రక్షిత రామ పత్ని
క్రుద్ధు నిస్త్రింశ హస్తు మిత్రులు ననేకు
లాపు చున్నను మరలని యా దసాస్యుఁ
గాంచె సీత యనిందిత కలఁతఁ జెందె 34.

చం. పలికెను సీత దుఃఖ మయ భామ కడున్ విలపించు చిట్టు లీ
ఖలుఁ డరుదెంచు చుండెఁ గట క్రన్ననఁ జంప సనాథ నన్ననా
థ లలిని ఘోర దుర్మతి యధర్మ రతుండు కడింది క్రుద్ధుఁడై
పలుమఱు పత్యనువ్రతను భార్యవు కమ్మని నన్నలంచెసే 35.

తే.గీ. అట్లు ప్రేరేచి విఫలుఁడై యాశ లణఁగఁ
గ్రోధ మూర్ఛితుండు నయి యీ క్రూరుఁ డిప్పు
డేఁగుదెంచుచు నుండెను వేగముగ వ
ధింప నెంచి నన్నిఁక ననుకంప వీడి 36.

కం. లేకున్న నరవ్యాఘ్రుల
నా కలనునఁ జంపి యుండు నన్నను ననుజున్
వీకను రాఘువుల నసుర
నా కొఱకు ననార్యుఁ డెదఁ గనలి సేఁ డకటా 37.

ఆ.వె. లేక స్వీయ పుత్ర శోక సంతప్తుఁడు
రామలక్ష్మణులను రణము నందుఁ
జంపకుండ నన్ను జంపును బాప ని
శ్చయుఁడు ఘోర రాక్షస పతి కిన్క 38.

తే.గీ. వింటిని భయంకరమ్ములఁ బెక్కు నాద
ముల ననేకులు సంతసమున నఱచుచు
నుండ మన్ని మిత్త మకట భండనమున
రాజ నందను లిర్వురు రాలి రేమొ 39.

ఆ.వె. అల్ప మతిని నకట హనుమంతు పలుకులు
వినక యుంటి వాని వీపు పైన 40.

నేఁగి యున్న నే జయింపఁ బడక యైన
భర్త యొడిని నుందు బాధ లణఁగ

ఆ.వె. ఏక పుత్ర దీన యెప్పుడు కౌసల్య
యాలకించు సుతు లయమ్ము నప్పు
డామె గుండె పగులు నంచు నిశ్చయముగఁ
దలఁతు నెడఁద నేను గలఁత మీఱ 41.

కం. తన సుతు జన్మము బాల్య
మ్మును యౌవనమును నిజ మనమున నాతఁ డొన
ర్చిన ధర్మ కార్యములఁ దలఁ
చును గౌసల్య యని యెంతు శోకావృతయై 42.

కం. మరణింప సుతుండు నిరా
శ రా నెడఁద శ్రాద్ధ మిడి విసంజ్ఞఁ బ్రవేసిం
చు రయమున నగ్నిఁ దప్పక
చొరఁబడు కాదేని నీట శోకం బడరన్ 43.

కం. ఛీ కుబ్జ యసతి మందర
యాకుల కౌసల్య యయ్యె నా యత్యం తా
ఘాకర మానస సేసిన
యా కార్యమ్మునఁ గడింది యక్కట యిటులన్ 44.

తే.గీ. విగత చంద్ర మహాగ్రహ వివశ రోహి
ణి వలె విలపించు చున్న యతివను సీతఁ
గని తపస్వినిని సుపార్శ్వుఁ డను సుశీల
మంత్రి సచివ వారితుఁ దన మగనిఁ గాంచి 45.

తే.గీ. పలికె మేధావి సాక్షాత్తు వైశ్రవణు న
నుజుఁడు దశవక్త్రుఁ డెట్లు కినుకకు లొంగి
వీడి ధర్మమ్ము వైదేహి నాఁడు పుట్టు
వును వధింపఁ గోరుచు నుండె ననుచు నింక 46.

తే.గీ. వేద విద్యా వ్రతస్నాతుఁడే దయ విడి
స్వీయ కర్మ నిరతుఁడును వీర వర్యుఁ
డే కతమ్మున స్త్రీ వధ నిచ్చగించు
నీ క్షణమ్మునఁ జెప్పుమ రాక్షసేంద్ర! 47.

ఉ. కాంచుమ సీత రూపవతిఁ గాంతను నింపుగ రాక్షసేశ్వరా!
మించిన నీదు కోపమును మీఱి రణమ్మునఁ గూడి మమ్ములం
ద్రుంచి త్యజింపు రామునిఁ జతుర్దశి నేఁ డపరంపుఁ బక్షమం
దంచిత మీ యమావసి శు భావహ మాజికి నుద్యమింపుమా 48.

తే.గీ. శూరుఁడవు రథికుండవు ధీరుఁడవును
ఖడ్గివి రథ మారోహించి కయ్య మందు
దాశరథిని వధించినఁ దప్పక పడ
యుదువు మైథిలి నసురేంద్ర! ముదము మీఱ 49.

కం. విని హితుని ధర్మ యుక్త వ
చనములను గ్రహించి యరిగె సదనమ్మునకున్
ఘనుఁ డా రావణుఁడు తిరిగి
తన సచివులఁ గూడి సభకుఁ దరలె రయమునన్ 50.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ దొంబది మూడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 94.

రావణు నాజ్ఞ రాక్షస వీరులు యుద్ధమున కేఁగి వానరుల నెల్లర బాధించుచుండ రాముఁడు వారి నెల్లరను సంహరించుట.

కం. మృగరాజు భంగి నిట్టూ
ర్పొగయ మహాసనమున సభ కేతెంచి వెసన్
వగతోఁ గూర్చుండెఁ గినుక
బగబగ మని మండుచు దశ వక్త్రుం డంతన్ 1.

తే.గీ. పలికెఁ బుత్రవ్యసన ఘోర బాధితుండు
బల్లిదుఁడు బల ముఖ్యుల నెల్లఁ గాంచి
యంజలి ఘటించి రక్షో గణాధినేత
రావణుండు వాక్యమ్ము లాగ్రహము మీఱ 2.

చం. తరలుఁడు మీర లెల్లరు రథమ్ముల నశ్వ పదాతి యుక్త కుం
జర వర సేన తోఁ జెలఁగి సంగర భూమిని రాము నొక్కనిన్
నరవరుఁ జుట్టు ముట్టి ధృతి నైర్భృతు లార వధింప నర్హులే
కురిసి శరాలి వాన తఱి ఘోర ఘనావళి భంగి నొప్పుచున్ 3.

చం. విరివిగ మీ శరావలిని భిన్న శరీరుఁడు నయ్యు నున్నచో
నరవరు రేపు నేఁ గని రణమ్మున లోకము సూచుచుండఁగా
ఖర శర జాల భగ్న నిజ కాయునిఁ జేయుదు నన్న వాని నె
ల్లరు విని సేనఁ గూడికొని రక్కసు లేఁగిరి స్యంద నావృతుల్ 4.

చం. పరిఘ పరశ్వ ధాసి శర పట్టిస ముఖ్య మహాయుధమ్ములన్
హరులను గొట్టి రుద్ధతిని నంగ వినాశక శస్త్ర కోటినిన్
హరులును ఘోర రాక్షసుల నద్రి మహీరుహ సంచయమ్ములన్
విరివిగ వైచి వేగముగ విద్ధులఁ జేసిరి విక్రమించుచున్ 5.

కం. రవి యుదయింపఁగ మొద లయి
బవరము వెసఁ దుముల మయ్యె భయదం బయి య
ష్టు వనచర వీరులకు నసు
ర వరేణ్యుల కొండొరులకుఁ బ్రత్యర్థులకున్ 6.

తే.గీ. వాన రాసురులు గదలఁ బ్రాసలఁ గర
వాలములను గొడ్డళ్లను నాల మం ద
వారితు లయి యొండొరులను జేరి కొట్టు 7.

కొనిరి చెలరేఁగి బలమున ఘోరముగను

ఆ.వె. జరుగు చుండ ఘోర సంగ్రామ మివ్విధి
రేఁగి నట్టి దుమ్ము పృథ్వి పైన
నణఁగె నద్భుతముగ నసుర వానర వీర
వరుల శోణితమ్ము వాఱ నపుడు 8.

తే.గే. పటుతర రథ కుంజరములు తటులు గాఁగ
నశ్వ రాజము లరయ మత్స్యములు గాఁగ
ధ్వజములు తరువులుగఁ గనఁబడఁ గళేబ
రములు తెప్పలై పాఱెను రక్త నదులు 9.

ఉ. వానరు లెల్ల రక్తములు వాఱఁగ మేనుల దూఁకి దూఁకి కో
పానఁ బతాక వర్మ రథ పార్థివ శస్త్ర వరాది కోటినిన్
పే నలి సేసి రాజి నరి భీకరులై యసురేంద్ర సంతతిన్
మానక పండ్ల గోరులను మర్దన సేసిరి మిక్కుటమ్ముగన్ 10.

ఆ.వె. జుట్టు ముక్కు చెవుల బెట్టిదముగ నొస
ళులను ప్లవగ వీరులు పెసఁ బట్టి
కొఱికి గీరి యసుర కోటి బాధింపఁ దొ
డఁగిరి సమర మం దడరుచు భృశము 11.

కం. రక్కసుల పైకి వానరు
లొక్కొక్కరి పైకి నూర్గు రుద్రేకముతో
నుక్కునఁ బాఱిరి పండిన
యొక్క తరువుఁ జేరెడు శకు నోత్కరము వలెన్ 12.

ఆ.వె. అంత నసురు లలిగి యద్రి సన్నిభులు పె
ద్ద గదలం బరశ్వథములఁ బ్రాస
ల శిత ఖడ్గములను ప్లవగుల ఘోరులఁ
గొట్టిరి చెలరేఁగి బెట్టిదముగ 13.

చం. శరణము నా శరణ్య రఘు సత్తము దాశరథిన్ పెసన్ నిశా 14.

చర గణ వధ్యమాన కపి సైన్యము పేడెను జేరి యార్తితో
గురు తర తేజుఁ డంత శర కోవిదుఁ డూని శరాసనమ్మునుం
గురిసెను బాణ వర్షమును గ్రుద్ధతఁ జొచ్చి నిశాట సేనలో

ఆ.వె. చొచ్చినట్టి వాని శూరుని రామునిఁ
గాండ వహ్ని చేతఁ గరము కాల్చు
వానిఁ జేర జాల రా నిశాచరు లర్కుఁ
గదియఁ జాల నట్టి ఘనముల వలె 15.

చం చలిపిన కార్యముల్ సులభ సాధ్యము కానివి ఘోర కర్మముల్
గలనునఁ గాన నయ్యె నటఁ గౌణప కోటికి రామ కృత్యముల్
గలఁపఁగ ఘోర సైన్యమును గట్టి రథమ్ములఁ గూల్పఁ గానన
మ్ములఁ జరియించు గాలి వలెఁ బూరుష వర్యునిఁ గాన రెవ్వరున్ 16.

తే.గీ. రాముని శర జాలమ్మున బ్రద్ద లయిన
చీల్పఁబడిన యాయుధముల చేత ధగ్ధ
మైన బలముం గనిరి కాన రైరి యేరు
కర్త నా రఘు వీరునిఁ గయ్య మందు 17.

కం. కనఁ జాలరు తమ గాత్రము
లను గొట్టుచు నున్నయట్టి రాఘువు నేరున్
ఘనముల నింద్రియ భోగము
ల నూను భూతాత్ముఁ గనని ప్రజల విధముగన్ 18.

ఉ. ఈతఁడె కుంజరధ్వజిని నిత్తఱిఁ జంపుచు నున్నవాఁడహో
యీతఁడె సన్మహారథుల నీతఁడె వాజుల కాల్బలమ్ములం
జేతి శరాళిఁ గూల్చుచును జీల్చుచు నుండె నటంచుఁ గాంచి వా
రా తఱి రామ రూపులను నంతఁ బరస్పర మాగ్రహమ్ముతో 19.

తే.గీ. రామ రూప సామ్యమ్మునఁ బ్రబలు చుండ
నొండొరులఁ గాంచి  రాక్షసు లుగ్రులై క
రమ్ము కొట్టుకొనిరి సమరమ్ము నందు
నంతరంగముల నపుడు భ్రాంతి సెలఁగ 20.

కం. ఘన గాంధర్వాస్త్రమ్మున
మనముల మోహ మడరంగ మనుజేంద్రుని రా
మునిఁ గనఁ జాలరు యుద్ధ
మ్మున రాముఁడు గాల్చుచున్న మూఁకను సెల్లన్ 21.

ఆ.వె. వారు కాంతు రాహవమున వేల కొలంది
రాముల నొక తడవ రక్కసు లటఁ
గ్రమ్మఱ నది యేమొ కాకుత్స్థుఁ డొక్కఁడ
కాన నగును వారి కన్నులకును 22.

ఆ.వె. కొఱవి చక్ర నిభము ఘోరంపు టా రామ
కార్ముకమ్ము తిరుగఁ గనిరి కాని
రాక్షస వరు లేరు రామునిఁ గనఁ జాల
రైరి సుంత యైన నాజి లోన 23.

చం. తను వది నాభి కాఁగ వితతంపు బలమ్ము వెలుంగ జ్వాలలై
ఘన శిఖు లెల్ల నాకులుగఁ గార్ముక మారయఁ గమ్మి గాఁగ నా
రి నినద ముగ్ర రామ తల సృష్ట రవమ్ముగఁ దోఁపఁ దేజ బు
ద్ధి నెగడఁ గాంతియై చెలఁగ దివ్య మహాస్త్రము లగ్ర భూములై 24.

తే.గీ. ఆజి రక్కసులను జంపు నట్టి ఘోర
తరపు రామ చక్రమ్మును దదవసరపుఁ
గాలచక్రము భంగినిఁ గాంచి రపుడు
జనులు విస్మయమ్ము సెలఁగ మనము లందు 25.

సీ. కామరూపు లగు రాక్షస పుంగవుల వాయు వేగ రథమ్ములు పృథ్విఁ గూలెఁ
బది వేలు గజములు బల్లిదములు పదునెనిమిది వేలు మహినిఁ దొరంగె
నాశ్వికులను గూడి యశ్వములు పదు నాలుగు వేలు వింతగఁ గ్రుంగె నేలఁ
గాలిబంటు లవనిఁ గూలిరి పూర్ణమ్ము రెండు వందల వేలు దండి మగలు
తే.గీ. దినపు టష్టమ భాగమ్మునను ననల శి
ఖాభ శర సంచయమ్మున నక్కజముగ
నొక్క రాముని చేత మహోగ్ర సంగ 26.

రమ్ము నందు వీక్షింప భయమ్ము సెలఁగ

ఆ.వె. అంత వడి నరిగిరి హతశేషులు హతాశ్వు
లు హత రథులు శాంతులు విగతధ్వ
జు లీఁక లంక కడలి శోక తప్తులు నిశా
చరులు పర్వు లిడుచు దురము వీడి 27.

కం. హత గజ పదాతి తురగ వి
తతి నయ్యె రణాంగణమ్ము దహనాంబకు ప్రీ
తి తరక్రీడారంగము
గతి నయ్యెడ నక్కజముగఁ గడు భయదంబై 28.

కం. సుర గంధర్వ మహర్షులు
వర సిద్ధులు గాంచి యంతఁ బరమాద్భుత మై
న రఘు వరేణ్యుని కార్యము
మురియుచు బహు సాధు వంచుఁ బొగడిరి ప్రీతిన్ 29.

తే.గీ. సరస సుగ్రీవు హనుమను జాంబవంతు
నవ్విభీషణు మైందుని నా ద్వివిదునిఁ
గాంచి రాఘవుం డనియె నీ యంచి తాస్త్ర
బలము గలవారు నేను ద్ర్యంబకుఁడు నంచు 30.

కం. సముచిత శస్త్రాస్త్ర జిత
క్లముఁ డింద్ర నిభుండు చంపి రాక్షస పతి సై
న్యము మనుజర్షభుఁడు రఘు ప
తి మాన్యుఁ డయ్యె నట ముదిత దేవావలికిన్ 31.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ దొంబది నాలుగవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 95.

యుద్ధమున రామునిచేత రాక్షస వీరు లనేకులు మరణింపఁగ దుఃఖమున రాక్షస స్త్రీలు పరిపరి విధముల విలపించుట.

ఉ. రావణ ముక్త కుంజర వరమ్ములు వాజులు వేలు వేలుగా
మావటి వాండ్రు వహ్ని నిభ మండిత సధ్వజ చక్రపాదముల్
వేవురు సద్గదా పరిఘ భృత్కర రాక్షస యోధ వర్యులుం
బావన కాంచనధ్వజ విభాసిత శూర సహస్ర మయ్యనిన్ 1.

తే.గీ. కామ రూపులు నక్లిష్ట కర్ముని రఘు
రాముని సుతీక్ష్ణ తప్త కార్తస్వర సువి
భూషిత శర జాలమ్ముగ రోష మడర
మూరి మరణించి రెల్లరు పోరి పోరి 2.

తే.గీ. విని కని హత శేషు లసుర వీరు లంత
దీను లరిగి భీతిని దమ స్త్రీలఁ గూడి
వనర విధవలు హత బాంధవలు హత సుత
లు విలపించిరి గుమికూడి యువిద లెల్ల 3.

తే.గీ. శూర్పణఖ వృద్ధ యెట్టులఁ జూచె నీ క
రాళ యక్కట రాముని రతిపతి సము
వంగి నట్టి పొట్ట గలది వనము నం ద
తిసు కుమారు భూత హితుని దిట్ట మగని 4.

తే.గీ. లోక నింద్య యీ రాక్షసి లోక నుతుని
గుణ విహీన యసుర కాంత గుణచయ నిధి
సుముఖు రాముని దుర్ముఖి శూర్పణఖ వ
రించు టెట్టు లొప్పు నెదఁ దలంచి చూడ 5.

చం. అసురుల యల్ప భాగ్యమున నంగన వృద్ధయుఁ దెల్ల జుట్టుతో
మసలెడు నట్టి దుష్ట యవమాన కరం బపహాస్య కార్యమున్
వెస ఖర దూష  ణాసురుల వీర వరేణ్యుల నాశ నార్థమై
యసతియె రామ ధర్షణము నక్కట చేసెను గర్వితమ్మునున్ 6.

తే.గీ. శూర్పణఖ నిమిత్తమ్మునఁ జూ దశాన
నుండు ఘోర శత్రుత్వమును గొని తెచ్చి
కొనియె నాత్మ వధార్థంబ కోమలి జన
కాత్మజను గొనితెచ్చె దురాత్ముఁ డిట్లు 7.

కం. జనక సుతను బొందఁడు సీ
తను రావణుఁ డెన్నఁ డేని దశకంఠుఁడు రా
మునితో బలవంతునితో
డ నిట్టు లక్షయపుఁ బగఁ బడసె దుస్సహమున్ 8.

తే.గీ. వనిని వైదేహిఁ గోరిన వాఁ డసుర వి
రాధుఁ డొక్క రాముని చేత లయము నందెఁ
గాంచఁగ నిదర్శన మది యొక్కటియెఁ జాలు
నన్యముల నేల పెక్కింటి నరయ వలయు 9.

కం. పదునాలుగు వేవు రసురు
లుదర్చి శిఖల కెనయెడు శరోత్తమముల వే
విదళితులు  జనస్థానము
న దురమ్మున నక్కజముగ నరవరు చేతన్ 10.

తే.గీ. ఖరుఁడు దూషణుఁ డింకఁ ద్రిశిరసుఁడు సమ
రమున నాదిత్య సంకాశ రామ బాణ
ముల విలయు లైరి మనములఁ దలఁప నా ని
దర్శనమ్ము జాలదె  యింకఁ దరుణు లార! 11.

ఆ.వె. నెత్తు రాను వాఁడు నినదమ్ము లొనరించు
వాఁడు యోజనంపు బాహువుల న
డరు కబంధుఁడు రఘువరునిచే హతుఁ డయ్యెఁ 12.

జాలు నా ఋజు విటఁ జామ లార!

ఆ.వె. వాలి మేరు నిభుని వాసవాత్మజు బల
వంతుఁ జంపె నొక్క బాణముననె
రధిక సత్తముండు రాముఁడు వింటిరె
దలఁపఁ జాలు నా నిదర్శనమ్ము 13.

ఆ.వె. శోక మూర్ఛితుండు సుగ్రీవుఁడు హత మ
నోరథుండు హరి వరుండు ఋష్య
మూక వాసి రాజ్యమున నిలుపఁ బడియెఁ
దలఁపఁ జాలు నా నిదర్శనమ్ము 14.

ఉ. చెప్పఁగ నా విభీషణుఁడు చెన్నుగ నర్థ సధర్మ వాక్యముల్
గొప్ప హితం బొసంగఁ దగు కూర్మిని రాక్షస కోటి కత్తఱిన్
మెప్పు వహింప నేరఁడు సుమీ ధన దానుజుఁ డజ్ఞుఁ డాత్మఁ దా
నప్పుడు విన్నఁ గాడు నయి యార్తినిఁ గుందదు లంక యివ్విధిన్ 15.

ఉ. కూలినఁ గుంభకర్ణుఁ డనిఁ గూరిమి తమ్ముడు రాఘవేంద్రుచేఁ
గూలిన నింద్రజిత్తు రణ ఘోరుఁడు నయ్యతి కాయుఁ డక్కటా
యాలము నందు లక్ష్మణుని యమ్ముల నెల్లరకున్ దురాసదుల్
సాలఁడు నేర రావణుఁడు చావుల నారసి యక్కజమ్ముగన్ 16.

ఆ.వె. నాదు తనయుఁడీ రణమ్మున హతుఁ డయ్యె
విగత జీవుఁ డయ్యెఁ బృథ్వి భ్రాత
యొల్లె నాదు భర్త యింటింట వినిపించె
నార్తనాదము లిటు లకట జెలఁగి 17.

కం. కరి తురగ రథ వరమ్ములు
ధర వందలు వేలు గూలె దారుణ రీతిన్
గురుతర పదాతి బల మా
దురమున శూర వర రామ దోర్బల మహిమన్ 18.

కం. అని రుద్రుండో శతక్రతు 19.

వు నగారియొ విష్ణువొ మఱి భూతాంతకుఁ డా
యిన తనయుండొ స్వయము రా
ముని రూపునఁ జంపెనొ పగ మూఁకను నెల్లన్

కం. హతులై చనంగ వీరులు
పతి హీనలమై నిరాశ ప్రబల భృశముగన్
మతుల భయమ్మున కంతము
సతతము విలపింతుము గనఁ జాలక యిచటన్ 20.

కం. దశకంఠుఁడు దత్త వరుఁ డ
తి శూరత నెఱుంగఁ డిట నతి భయము పుట్టన్
విశదముగ ఘోర మింద్ర స
దృశ రాముని హస్తములను దృశ్యం బైనన్ 21.

తే.గీ. అమరు లైన గంధర్వులు నైన నప్పి
శాచము లయిన ఘోర రాక్షసులు నైనఁ
జేర నాజి రాముండు రక్షింప జాల
రెవ్వరును రావణుని శంక యేల యిందు 22.

చం. కనఁబడె దుర్నిమిత్తములు కయ్యము కయ్యము నందుఁ బంక్తి వ
క్త్రుని వధఁ దెల్పు నట్టివియె కొల్లలు రామునిచే రణమ్ములోఁ
గొనె నభయమ్ము రావణుఁడు కూరిమి నబ్జజుచే సు రాసు రా
లిని మఱి దాన వావలిని లెస్సగఁ గోరఁడు మర్త్య కోటిచే 23.

కం. ఇది యా మానుష వర భయ
ము దనరె నిస్సంశయముగ మూరుచు నిచటం
బ్రదుకుల నశింపఁ జేయఁగ
నుదరి దశగ్రీవున కసు రోత్కరములకున్ 24.

చం. అమరులు పీడ్యమాను లయి యబ్జజుఁ డీయ వరమ్ము లంత స
త్త్వ మరసి నట్టి రాక్షసుల భర్త దశాస్యునిచేఁ దపమ్ములన్
సముచిత రీతి పూజ లిడ సంతస మంది విధాత పల్కె వా
క్యముల హితైక యుక్తముల నారసి ప్రీతిని దేవతావలిన్ 25.

ఆ.వె. నేఁటి నుండి యసుర కోటి దానవ సంచ
యమ్ము సంచరించు నత్యధిక భ
యమున ముజ్జగముల ననవరతమ్ము ని
శ్చయముగ నన సురలు చనిరి ప్రీతి

26.

ఉ. దేవత లంత సేంద్రు లయి తేజి పురాంతకు నిర్జరాలికిన్
దేవుఁ బ్రసన్నుఁ జేయగను దృష్టిలి యా వృషభధ్వజుండు తా
నీ వచనమ్ములం బలికె నింతి యొకర్తు జనించు ధాత్రిలోఁ
బావని రాక్షసక్షయము పన్నుగఁ జేయఁగ మీ హితార్థమై 27.

తే.గీ. ఆమె యగు నీమె జానకి యమర వరుల
చేతఁ బంపఁబడంగ భక్షించును మన
ల నసురఘ్ని స రావణ రాక్షసులను
దానవులఁ బూర్వ మాఁకలి యాని నట్లు 28.

ఆ.వె. దాపరించె నిట్టి యేఁపు మనకు దుఃఖ
మున మునుఁగఁగఁ జేసి బుద్ధిహీనుఁ
డింక దుష్ట బుద్ధి సంకోచమును వీడి
చేసిన హరణమ్ము చేత నకట 29.

తే.గీ. కనము శరణ మొసఁగు వారి మనము క్రుద్ధుఁ
డాక్రమింపఁగ ఘోరంపు టాగ్రహమునఁ
బ్రళయ వేళలో మృత్యువు భంగి మీఱి
యౌర రాముఁడు బరికింప నేరి నేని 30.

ఆ.వె. శరణ మొసఁగు వారు ధర లేరు మన కిప్డు
ఘోరమైన భయముఁ గూడి యుండ
దట్ట మైన నటవి దావాగ్నిఁ జిక్కిన
యాఁడు కరుల పగిది పేఁడ మనము 31.

తే.గీ. కాలమునకుఁ దగిన యట్టి కార్యమును ఘ 32.

నుండు పౌలస్త్యుఁడు విభీషణుండు సేసె
నెవ్వని వలన భయ ముద్భవించె వేఁడె
వానినె యరిగి శరణమ్ము భక్తి తోడ

కం. అసు రాంగన లివ్విధి నపు
డు సేతులను బట్టి కొని కడు వనరిరి కలం
త సుదారుణమై జెలఁగ న
లసి రొనరించుచు రవమ్ములను భయ తప్తల్ 33.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ దొంబది యేనవ సర్గము.

# యుద్ధ కాండము
## సర్గము 96.

రాక్షస స్త్రీల యార్తనాదములను రావణుఁడు విని నిట్టూర్చి కోపోద్రిక్తుఁడై స్వయముగ నమాత్యులతో సైన్యము తోడ రామలక్ష్మణులను వానరేంద్రునిఁ జంపెద నని పలుకుచు యుద్ధమున కేఁగుచుండ దుర్నిమిత్తములను గాంచినను రావణుఁ డేఁగి భీకరముగ వానరులను జంపుట.

కం. విని యింటింటను నసురాం
గన లేడ్చుచు నుండ జాలి కదురంగఁ గడున్
వినిపించు నార్తనాదము
లను రక్షోగణ విభుండు రావణుఁ డంతన్ 1.

తే.గీ. రావణుండు నిట్టూర్చి దీర్ఘముగ నొక ము
హూర్త మొనరించి ధ్యానము నుగ్రుఁడై క
రమ్ము భీమదర్శనుఁడు పండ్లను బెదవులఁ
గొఱికి రక్తలోచనుఁ డయ్యెఁ గోప మడర 2.

ఉ. మండుచుఁ గాల వహ్ని వలె మానిసి దిండ్లకుఁ జేర రాని యు
ద్దండుఁడు పల్కె వ్యక్త రహితమ్ముగఁ గ్రోధ నిమగ్నుఁడౌట నా
దండను నున్న రాక్షసులఁ దాఁ గని చక్షులఁ గాల్చురీతి రు
ద్రుం డయి పల్కు లివ్విధము దుఃఖ రుషావృత మానసుండునై 3.

తే.గీ. త్వరిత మో మహోదర! మహాపార్శ్వ! రాక్ష
సా విరూపాక్ష! రాక్షస సైన్యములు మ
దాజ్ఞఁ జన వలె నాజికి నని వచింపుఁ
డసుర పుంగవులార! మహాత్ములార! 4.

తే.గీ. అసురు లసురేంద్రు వాక్యము లాలకించి
భయము తోడ నార్తాత్ములై పార్థి వాజ్ఞ
నూని యవ్యగ్రులై రాక్ష సోత్తములను
ననికిఁ బ్రేరేచి రింపుగ నప్పు డేఁగి 5.

ఉ. వారలు పల్కి యట్లె యని భైరవ రూపులు ఘోర రాక్షసుల్
వారల స్వస్తి వాక్యములఁ బన్నుగఁ గైకొని యుద్ధ భూమినిం
జేరఁగ నుద్యమించి వెసఁ జెన్నుగ జేని కొసంగి మ్రొక్కులం
జేరువ నిల్చి రంజళులు సేర్చి మహారథు లా జిగీషువుల్ 6.

తే.గీ. కని మహాపార్శ్వుని మహోదరుని విరూప
నేత్రు రాక్షసుల నగవు నెగడ పలికె
రావణుఁడు క్రోధ మూర్ఛితుఁ డీ వచనము
లను మహోద్ధతి నతుల పరాక్రముండు 7.

ఉ. పరమ ధనుర్విముక్తముల బాణములన్ లయ కాల తత్ప్రభా
కర సదృశమ్ములన్ మనుజ కాంతుల రాముని నింక లక్ష్మణుం
ద్వరితము కాలు నింటి కనుపంగఁ బ్రహస్తుఁడు నింద్రజిత్తిఁకన్
ఖరుఁడును గుంభకర్ణుఁడును గాంతురు శాంతిని నా ప్రతిక్రియన్ 8.

ఆ.వె. అంతరిక్ష మైన నా దిశ లేనియు
స్వర్గ సాగరములు మార్గణ తతు 9.

లేను వేయ మూరి కానిపింపవు నిండ
నేఁడు నిక్కముగను జూడుఁ డింక

ఆ.వె. వింటి నుండి వేగ వేసి ఱెక్కలు గల
బాణములను నేఁడు వానర వర
యోధుల విడివిడిగ యుద్ధమ్మునఁ జెలంగి
చంపువాఁడ బలిమి సొంపు మీఱ 10.

తే.గీ. వాయు తుల్య తేజోరథ వరము నుండి
నేఁడు కార్ముకాంబుధి నుండి పొడిగ జని
యించి నట్టి శిత శరోర్మిఁ ద్రుంచు వాఁడ
వానర వర సైన్యమ్మును నేను గనుఁడు 11.

ఆ.వె. వికచ పద్మ వక్త్ర పృథు పద్మ కేసర
కాంతుల కపి యూధ గణ తటాక
ములను మదయుత గజము పగిది చెలరేఁగి
కలఁచు వాడ నేఁడు గాంచ వలయు 12.

ఆ.వె. సమర మందు నేఁడు శరము లున్న వదన
ములను గూడి ప్లవగ ముఖ్య యూధ
పులె యలంకరింత్రు పుడమి నెల్ల సనాళ
పంకజ నిచయమ్ము పగిది గనుఁడు 13.

ఉ. ఉదుటున వంద వంద కపి యూధము లందుఁ బ్రచండులన్ వెసం
గుదురుగఁ బాద పాయుధులఁ గోతులఁ గూల్తు శరం బొకండునన్
వదలిన యశ్రులం దుడుతు భ్రాతలు నాథులు పుత్రు లాఱఁగా
గుదగుద లాడు రాక్షసులకుం గనుఁ డింపుగ నేఁడ యెల్లరున్ 14.

తే.గీ. నేఁడు యత్నమ్ము వలననె చూడుఁడు ధర
కానఁబడు నట్టు లొనరింతుఁ గయ్య మందు
మత్శర చయ భిన్న వికీర్ణ మర్క టాలి
చే నచేతన దళముచే శీఘ్రముగను 15.

ఆ.వె. బాణ తప్త పరుల పలముల నక్కల
గ్రద్దలను మఱి పలలమ్ముఁ దినెడు
నితరములను నేఁడు వితతమ్ముగం దృప్తి
వడయు నట్లొనర్తు భండనమున 16.

మ. సమకూర్చుం డిట నాదు స్యందనము నా చాపమ్మునుం దెండు క్షి
ప్రము శేషాసుర వీరు లెల్లరు వెసన్ రండింక నావెంట నం
చు మహోగ్రుండు వచింప రావణుఁడు రక్షోనాథుఁ డచ్చోట ను
న్న మహాపార్శ్వుఁడు వంచె సిద్ధపఱుపన్ నానా బలాధ్యక్షులన్ 17.

తే.గీ. లఘు పరాక్రము లరిగిరి రాక్షస బల
నేత లంత నింటింటికి నాతతముగ
రాక్షసుల నెల్లఁ బ్రేరేప నా క్షణమున
సంభ్రమమున లంకాపురి సత్వరమ్ము 18.

ఆ.వె. ఆ ముహూర్తమున మహాసురులు సు భీమ
దర్పను లఱచుచు వితతముగను భ
యంకర వదనులు మహాయుధముల వివి
ధములఁ గొని భుజములఁ దరలి రంత 19.

ఉ. శూల శతఘ్ని పట్టిస విశుద్ధ గదా ముస లేద్ధ తీక్ష్ణ ధా
రా లస దోగ్ర శక్తి సుపరశ్వథ ముద్గర కూట యష్టి చ
క్రాలఘు భిండిపాల పరమాసి వరాన్య మహాయుధమ్ములన్
మేలుగ నూని రాక్షసులు మేదిని నిండఁగ వచ్చి రత్తఱిన్ 20.

ఉ. గ్రక్కున నెల్ల సేనకును గాంతుఁడు తేఁ దుర గాష్ట యుక్తముం
జక్కని తేరు నంతట ససారథి స్వప్రభలన్ వెలుంగు దాఁ
డెక్కెను రావణుండు వడి నెంతయొ భీతి నొసంగు మేను వాఁ
డెక్కుడు సేనఁ గూడి చనె నిద్ధ బలుం డిలఁ జీల్చునో యనన్ 21.

ఆ.వె. అంతటఁ జెలరేఁగె నసుర కలహ రవ
ముల మృదంగ పటహములయుఁ దూర్య
శంఖములయు గొప్ప స్వనము లచ్చ టచట 22.

నుండి  చేయు చుండ మెండుగాను

ఉ.  వచ్చెను రాక్షసాధిపతి బ్రాహ్మణ ఘాతి సురాలి కంటకుం
డచ్చము ఛత్ర చామర వరావృతుఁడై మహి జాపహారియున్
హెచ్చుగ దుష్ట చిత్తుఁడును  యెంచి రణం బొనరింప రాముతో
నిచ్చను నంచు గర్జనము లెల్ల వినంబడె వింత వింతగన్ 23.

కం.  చలియించెను శబ్దమ్ముల
నిలాతలం బెల్లఁ గడిఁది యాక్షింపంగం
గలకలము నాలకించి హ
రులు పాఱిరి భీతి సెలఁగ  లోలాత్ములునై 24.

ఆ.వె.  విజయ మెంచి యనికి వేగ వచ్చె మహాభు
జుండు రాక్షసాధిపుండు రావ
ణుండు తేజమున ఘనుండు సంరంభియై
సచివు లుండ వెంట సధ్వజుండు 25.

తే.గీ.  త్వర మహాపార్శ్వుఁడును మహోదరుఁడు నెక్కి
రరదములు విరూపాక్షుఁడు నానతీయ
రావణుండు దుర్ధర్షులు రహినిఁ బుడమి
పగులు నట్లఱచుచు గెల్పుఁ బడయఁ గోరి 26.

తే.గీ.  అంతఁ దేజస్వి రక్షోగ ణావృతుండు
ధనువు కాలాంతక యమరాజ నిభము పెస
నెత్తి సమరార్థము నిలిచి రెచట రామ
లక్ష్మణు లరిగె నట్టి  ద్వారమ్ము నుండి 27.

తే.గీ.  ప్రభలు లేని వాఁ డయ్యెను భానుఁ డపుడు
తిమిర మావహించె సకల దిశల నపుడు
పక్షు లొనరించె దారుణ ధ్వనుల నపుడు
మూరి కంపించెఁ గనుచుండ భూమి యపుడు 28.

తే.గీ.  రక్త వర్షము కురిసెఁ బర్జన్యుఁ డపుడు 29.

గుఱ్ఱములు తడఁబడుచును గుంటఁ దొడఁగె
ధ్వజముపై వ్రాలె నొక్క గృధ్రమ్ము వింత
మిక్కిలి యమంగళమ్ములు నక్క లఱచె

చం. కదలెను వామ లోచనము కంపిత మయ్యెను వామ బాహువున్
వదలెను కాంతి యాస్యమును స్వానము దగ్గెను గొంచె మత్తఱిం
గదలఁగ నాజి కట్లు దశకంఠుఁడు వుట్టెను రాక్షసేంద్రు చా
వొదవుటఁ దెల్పు నట్టివి రణోర్వి నిమిత్తము లివ్విధమ్ముగా 30.

ఆ.వె. అంత నుల్కలు వడె నంతరిక్షము నుండి
పిడుగు రొదలఁ బోలు పెన్ను లివులఁ
గాకములను గూడి గ్రద్ద లమంగళ
కరము లఱవఁ దొడఁగెఁ గఱకుగాను 31.

తే.గీ. వీని గణియింప కించుక యేని దుర్ని
మిత్తముల నివ్విధమ్ముగ మీఱి నట్టి
వాని మోహ మగ్నుండు రావణుఁడు కాల
చోదితుఁడు వ్యధార్థ మరిగె శూర వరుఁడు 32.

చం. అసురుల యా మహాత్ముల మహా రథ శబ్దము లాలకింపఁగా
నసమ బలాఢ్య మా కపి మహా చము వంక మొనర్పఁ బాఱె నం
త సమర మయ్యె ఘోరముగఁ దత్కపి రాక్షస సేన కెల్లఁ బే
ర్లు సదివి పిల్వ నొండొరుల రోష జిగీషులు వాన రాసురుల్ 33.

కం. విపరీతము క్రుద్ధుం డయి
యపుడు దశగ్రీవుఁ డమ్మహారథి వీరుం
డు పసిడి ముల్కులను బఱపి
కపి సేనా వీరవర్య కదన మొనర్చెన్ 34.

ఉ. కొందఱు రావ ణార్దితులు కోసిన మూర్ధము లున్నవారునుం
గొందఱు ఛిన్న వక్షులును గొందఱు భీకర భగ్న కర్ణులుం
గొందఱు ఘ్రాణ హీనులును గొందఱు దారిత పార్శ్వ యుగ్ములుం
గొందఱు హీన చక్షులును ఘోర రణమ్మునఁ గాంచ నత్తఱిన్ 35.

కం.	కినుకం గన్నులఁ ద్రిప్పుచు
ను నెక్క డెక్కడికి నేఁగును దశాననుఁ డా
ఘనుఁ డక్క డక్కడను శర
ఘన వేగము సైఁపఁ జాలక నలఁగిరి హరుల్	36.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ దొంబది యాఱవ సర్గము.

# యుద్ధ కాండము
## సర్గము 97.

సుగ్రీవుఁడు రాక్షసుల ననేకులను సంహరించి ఘోర యుద్ధమున విరూపాక్షునిఁ జంపుట.

కం.	దశకంఠుని బాణమ్ముల
భృశముగఁ దెగి నట్టి గాత్ర వితతిం బ్లవగుల్
కృశియించి పెసం దూల వి
వశులు హరుల తోడ నిండె వసుధా తలమే	1.

తే.గీ.	సైఁపఁ జాలని రావణు శర నిపాత
మొక్క దశకంఠు కృత్యము యోధు లెవ్వ
రును సహింప రైరి హరుల ననలమును సు
దీప్తమును బతంగముల రీతి నని లోన	2.

ఆ.వె.	వాని ఘోర నిశిత బాణజాలమ్మున
నర్దితులయి కరము హరులు పఱచి
రాజి  ననల కీల లందుఁ జిక్కిన మండు
చున్న కరులు పాఱు చున్న రీతి	3.

ఉ. మారుత మభ్ర రాశిని సమస్తము నెల్లెడఁ ద్రోయు రీతిఁ దా
నా రణ మందు వానర మహా ధ్వజినిం గడు భీతిఁ బాఱఁగా
మూరి యొనర్చి బాణములఁ బోరున వానరులన్ వధించుచుం
జేరెను రావణుం డనిని శీఘ్రమ రాముని రాఘవేంద్రునిన్ 4.

ఉ. ఆవిధిఁ బాఱుచుండ నని నారసి భంజిత వానరాళి సు
గ్రీవుఁడు సేన యందుఁ బరికించి సుషేణుని నాత్మసన్నిభుం
గావఁగ నుంచి వీరవరుఁ గయ్య మొనర్పఁ దలంచి శత్రు వీ
రావలి మార్కొనంగఁ జనె నంతట వృక్ష మహాయుధుండునై 5.

ఉ. వానికి పెన్కఁ బ్రక్కలను వానర యూథపు లెల్ల రంతటన్
మానుగ వెంటఁ నేగి రని మ్రానులు శైలము లూని కేళులన్
వానర నాథుఁ డార్చుచును భండన మందు మహా స్వనమ్ముల
న్మానిసి దిండ్ల నొంచి కడు నైరృత వర్యులఁ జేరె నన్యులన్ 6.

మ. ఘన కాయుండు ప్లవంగ రాడ్వరుఁడు రక్షశ్చక్రముం గ్రుద్ధుఁడై
యనిలో మొత్తెను వృక్ష సంచయముఁ గాలాంతాభ్రముల్ గూల్చు భం
గిని రక్షో బల మందు ఘోరముగ శృంగివ్రాత వర్షమ్ము గు
ర్సెను మేఘమ్ములు ఱాల వాన వనిఁ బక్షివ్రాత మందున్ వలెన్ 7.

కం. కపిరాజ ముక్త శైలము
లు పడ నటుల భగ్న గాత్రులు వికీర్ణ వరాం
గ పలాశను లంత నిక్క
త్త పర్వతములు జెదరిన విధమున పడి రిలన్ 8.

తే.గీ. క్షీణు లగుచు భంగపడుచుఁ జెదర నసురు
లెల్లెడలను సుగ్రీవు చేఁ బెల్లఱచుచుఁ
బే రనుచు విరూపాక్షుఁడు చేర రాని
ధన్వి దిగి రథ మిభపు స్కంధమ్ము నెక్కె 9.

ఉ. దక్షత నెక్కి కుంజరము తత్క్షణ మేసి శరమ్ములన్ విరూ
పాక్షుఁడు వానరేంద్రు పయి నార్చుచు నుర్కుచు వానరాళిపై
రాక్షస వీరు లందఱు కరమ్ము తపింపఁగ నూఱడించుచున్ 10.

రక్షణ మిచ్చి నిల్పె నని రక్కసు లందఁగ హర్ష మింపుగన్

ఉ. మిక్కిలి విద్ధుఁడై పదను మీఱిన ముల్కుల రాక్షసేంద్రుచే
నక్కపినాథుఁ డప్పుడు మహోగ్రహ మూర్ఛితుఁ డార్చి చంపఁగాఁ
గ్రక్కున నెంచి డెందమున క్ష్మాజము నెత్తి ప్రహారి చేరి తా
నుక్కునఁ గొట్టె నాస్యమున నుగ్రుఁడు శూరుఁడు కుంజరమ్మునున్ 11.

కం. తగులఁగ సుగ్రీవుని దె
బ్బ గజేంద్రము ఘోరముగను బాణాసన మా
త్ర గరిష్ఠ దూరము చనియె
వగఁ గూర్చుండఁ బడి చేసె భైరవ రవముల్ 12.

చం. పతిత గజమ్ము నుండి దిగి వానర నాథున కీయఁ ద్రాసమున్
వితత పరాక్రముం డసుర వీరుఁడు వేగమ యూని యార్షభాం
చిత వర చర్మ మింకను విశేష శితాసిని వానరేంద్రు సం
స్థితు లఘు విక్రముండు కదిసెం బగ నాజిని నుగ్ర శత్రువున్ 13.

తే.గీ. అరసి సుగ్రీవుఁడు కినిసి యభ్ర సన్ని
భాశ్మముఁ గొని విరూపాక్షు నంగము పయి
కి విసరఁ గని తొలఁగి పెఱికి యసిఁ గొట్టె
వేగ మవ్విరూపాక్షుఁడు విక్రముండు 14.

తే.గీ. రక్కసుని ఖడ్గ సుప్రహరణము చేత
నూఁగి సుగ్రీవుఁ డొక్క ముహూర్త మట వి
సంజ్ఞుని పగిది నయ్యెను జయ్యన హరి
లేచి హృది ముష్టి నసురుని లీలఁ గొట్టె 15.

ఆ.వె. కొట్టఁ బడఁగ ముష్టి ఘోరముగను విరూ
పాక్షుఁ డలిగి యసిని హరి వరేణ్యు
కవచముఁ బడ వేసెఁ గయ్యమున నతండు
పదము లంత దెబ్బ కదురఁ బడెను 16.

చం. పెసఁ బతితుండు లేచి కపి వీరుఁడు పైచెను స్వీయ వజ్ర కీ 17.

ల సమ తలప్రహారమును రక్కసు పైనను  ఘోర రావ మా
యసురుఁడు నైపుణమ్ము నను నక్కపి ఘాతము నుండి ముక్తుఁడై
పస గల ముష్టి ఘాతమును వానరు వక్షము నందు నుంచఁగా

కం. కడు కోపించెను సుగ్రీ
వుఁడు వానర నాథుఁ డట్లు వొలియ ప్రహారం
బడర నసురేంద్రు కుశలత
యెడఁదను వీక్షించి నంతఁ గృత రిక్తమ్ముల్ 18.

తే.గీ. అంత నంతరమును గాంచి యసుర వర్యు
నందు హరి వరేణ్యుఁడు కిన్క చింద సెలఁగి
యవ్విరూపాక్షుని కణఁత యందు పైచె
నిజ మహాతల ఘాతము  సెగడి మిగుల 19.

తే.గీ. అంత శక్రాశని నిభ త లాహతి క్షితిఁ
గూలె నా విరూపాక్షుఁడు క్రుంగి రక్త
సిక్తుఁ డయి క్రక్కి రక్తము చెవుల నెల్ల
స్రోతముల ఝరముల స్రవించు జలము వలె 20.

ఆ.వె. మూర నురుఁగు రుధిరమునఁ దడిసిన వాని
రేఁగి నట్టి కినుకఁ ద్రిప్పుచుండ
లోచనమ్ములను విరూపాక్ష తరు విరూ
పాక్షుఁ గనిరి ప్లవగు లక్కజముగ 21.

తే.గీ. కొట్టుకొను చున్న వానిని బెట్టిదముగ
దొర్లుచుండంగఁ బ్రక్కలఁ దోరముగను
జాలి పుట్టంగ నార్చు రాక్షస వరేణ్యుఁ
గాంచిరి విరోధి నచ్చట కపి వృషభులు 22.

కం. హరి రాక్షస సైన్యము ల
ట్లు రణమ్మునఁ గూడికొని పటుతరార్ణవ తు
ల్య రవమ్ము లార్చె వేలా
విరహిత శరధిద్వయమ్ము వీఁక ఘనముగన్ 23.

కం. కనిన విరూపాక్షు లయము
వనచర విభు చేత నసుర వానర బల మ
య్యె నపుడు విజృంభి తానిమి
ష నదీ సన్నిభము ఘోర సమరం బందున్ 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ దొంబది యేడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 98.

మహోదరుఁడు విజృంభించి వానరలను వధియించు చుండ సుగ్రీవుఁడు మార్కొని వానిని వధించుట.

కం. బలములు పరస్పరమ్మును
గలహమ్మునఁ జంపుకొనఁగ ఘర్మమున సర
స్సులు క్షీణించిన భంగినిఁ
బలుచగ నయ్యె నుభయములు భండన మందున్ 1.

కం. తన సైన్యము నశియింపగ
ఘనుఁడు విరూపాక్షుఁ డణఁగఁ గయ్యము నందుం
గినుక ద్విగుణీకృతం బ
య్యెను బౌలస్త్యునకు రాక్ష సేంద్రున కంతన్ 2.

ఉ. వానర వధ్యమానమును భైరవ రాక్షస సైన్య నాశముం
గానఁగ యుద్ధ రంగమునఁ గ్రమ్మిన దైవ విపర్యయమ్మునుం
బూనెను డెంద మందు వ్యధఁ బుణ్యజనుండు దశాస్యుఁ డంతటం
దాను మహోదరున్ సచివు దాపున గాంచి వచించె నిట్టులన్ 3.

ఉ. ఇప్పుడు నాకు దీర్ఘ భుజ! యింక జయాశ వెలుంగు నీ పయిన్
మెప్పు వహింప శత్రువుల మీఱి వధింపుము చూపు విక్రమం
బొప్పుగ దీర్ప భర్తృ ఋణ ముత్తమ వీర! రణం బొనర్పు నా
నప్పతి పల్క నట్లె యనె నప్డు మహోదరుఁ డాదరమ్ము నన్ 4.

చం. అని రిపు సేన లోనికి మహాత్ముఁడు సొచ్చె మహోదరుండు వ
హ్ని నడరి తూఱ వేగముగ నేఁగు పతంగము భంగిఁ జేసె నం
త నరుల నాశనమ్ము వెసఁ దద్దబలుండు స్వ వీర్య కారణ
మ్మునఁ బతి చోదనమ్మునను బోరున వానర భంజనమ్మునున్ 5.

ఉ. వానరు లంత బల్లిదులు పట్టి భృహచ్ఛిలలన్ రిపూగ్ర సే
నా నివహమ్మునుం గదిసి నైరృత వీరులఁ గొట్టి రెల్లరన్
దాని మహోదరుండు గని తద్దయుఁ గిన్కను జీల్చె వేసి తా
వానర పాదముల్ దొడలు పాణులు నభ్ర విభూషి తేషువుల్ 6.

తే.గీ. అర్దితు లయి భృశమ్ముగ నసుర వరుల
చేతఁ బాఱిరి ప్లవగులు శీఘ్రము దశ
దిశలకును కొంద ఱంత భీతి సెలగంగ
నాశ్రయించి రా సుగ్రీవు హరివరేణ్యు 7.

కం. కని భగ్న వాన రానీ
కిని సుగ్రీవుఁడు పరువిడె కీ శాధీశుం
డని నమ్మహోదరుని పై
కి నుండ డగ్గఱను గాంచి కిన్క సెలంగన్ 8.

ఆ.వె. కొండఁ బోలు నట్టి ఘోర మైన శిలను
విపులమును గ్రహించి వేగ వైచె
వానిఁ జంప నెంచి వాన రేద్రుండు తే
జస్వి యలుక నసుర సత్తము పయి 9.

కం. త్వర నరుదెంచుశిల మహో
దరుఁడు దురాసదముఁ గాంచి తడఁబడక యహో
శరముల ఛేదించె మహా 10.

సురుండు ఘోరముల నాజి శూరుఁడు లీలన్

చం. శిల పడె వేయి ముక్కలుగ ఛిన్నము గా విశి ఖౌఘ ఘాతమై
యిల పయి వ్యాకులం బయిన యెక్కటి గృధ్ర సమూహ భంగి ము
క్క లయిన జాతి నట్లు కపి కాంతుఁడు క్రుద్ధుఁడు గాంచి సాలమున్
బలమునఁ బీఁకి పైవ వెస బ్రద్దలు సేసె నతండు దానినిన్ 11.

తే.గీ. అంతటఁ బరపురంజయుఁ డా మహోద
రుండు శరముల నొంచెను మెండుగఁ బ్లవ
గేంద్రు నాజిలో సుగ్రీవుఁ డెలమినిఁ బడి
యున్న పరిఘమ్ము నారసె నుర్వి పైన 12.

ఆ.వె. వెలుఁగు చున్న గుదియఁ బృథ్వి పయిన నెత్తి
కొట్టి యయ్యసురునకుఁ దగఁ జూపి
వాని గుఱ్ఱములను బరిఘమ్ముతో ఘోర
గతి నడిచి వధించెఁ గపి విభుండు 13.

కం. హత హయ గణమ్ము రథమును
వెతం దిగి మహోదరుండు వీర వరుం డా
యతము గదా దండమును ద్వ
రిత మూని కినిసి కడు చెలరేఁగె రణమునన్ 14.

తే.గీ. ఆ గదా పరి ఘాయుధ హస్తు లిరువు
రార్చుచును గో వృషభ నిభు లాజి మెఱపు
లున్న మేఘ ద్వయము భంగి మిన్నగఁ దల
పడిరి యరివీర మర్దను లడరి యపుడు 15.

చం. విసరె మహోదరుండు గద వెల్గఁగ భాస్కర కాంతి తుల్యమై
వెస రజనీచరుం డలిగి వీరవరుం డగు వాన రేంద్రుపైఁ
గసి సెలగంగ వచ్చు గదఁ గాంచి మహోగ్రము రోష రక్త వం
త సదరు ణాక్షుఁ డుగ్రుఁ డయి తత్పరి ఘమ్మునఁ గొట్టె నగ్గదన్ 16.

ఆ.వె. కూల గుదియ విఱిగి నేల గదాహతి 17.

నంత నినుప ముసల మవని నుండి
ఘోర మైన దాని సారి కాంచన భూషి
తమ్ము కై గ్రహించె నెమ్మి మీఱ

ఆ.వె. ముసల మంత నెత్తి విసరె నసురునిపై
నదియు నింక నన్య మైన యసురు
గదఁ బరస్పరమ్ము కదియంగ విఱిఁగి ప
డినవి ముక్క లయి యవనిని రెండు 18.

తే.గీ. అరసి తేజో బల సమృద్ధు లాయుధమ్ము
లట్లు భగ్న ములై పడ నవని దీప్త
వహ్ని యుగ్మ సన్నిభ వీర వరులు తలప
డఁ దొడఁగిరి ముష్టిఘాతములఁ దనరించి 19.

ఉ. అప్పుడు వార లిద్దఱు మహా బలు లొక్కరి నొక్కరుం పగం
దప్పక కొట్టు కొంచు నినదమ్ము లొనర్చుచు నప్పళించుచుం
గొప్పగఁ గైల నేల పయిఁ గూలిరి తూర్ణము లేచి యోడకే
రొప్పి భుజమ్ములం గదిసి గ్రుచ్చి యొనర్చిరి యుద్ధ ముద్ధతిన్ 20.

తే.గీ. అంత బాహు యుద్ధమ్మున నలసి రా ప
రంతపు లిరువురు ఘనతరము మహోద
రుండు గని సమీపమ్మున నొండు ఖడ్గ
మును గ్రహించెను డాలుతో ఘన రయుండు 21.

ఆ.వె. డాలు తోడ నుండ డగ్గఱ ఖడ్గము
వేగ వత్తరుండు బాగుగఁ గని
శూరు లందు ఘనుఁడు సుగ్రీవుఁడు గ్రహించె
నుఱికి యంత వానరోత్తముండు 22.

కం. కినిసిన యిర్వురు నార్చుచు
ఘనులా యుద్ధమున నెత్తి కత్తులను రణ
మ్మున శస్త్ర సంచయము లం
దు నిపుణు లొండొరుల పైకి దుమికిరి బలిమిన్ 23.

తే.గీ. జయము నందుంచి మనము లుభయులు దక్షి
ణముగ మండల గతినిం దనరుచుఁ గోప
మూని యన్యోన్యము తిరిగి రా నగచర
వర నిశాచరు లత్తఱి భండనమున 24.

ఉ. తాను బరాక్రముం డని సతమ్ము దలంచెడు నమ్మహోదరుం
డూని మహోగ్ర ఖడ్గమును నుక్కున నాటెను చర్మమందునున్
దానిని లాగుచుండఁగను దత్తఱిఁ డారసి వానరేంద్రుఁడే
వాని శిరమ్ము ఖడ్గమున వారక త్రుంచె సకుండలమ్మునున్ 25.

తే.గీ. మకుట యుక్త శిరమ్మును మర్కట పతి
నఱక నమ్మహోదరుఁడు ఘన బల దర్పి
తుండు గూలఁగ నేల నొక్కండు రాక్ష
సేంద్రు బలమునఁ గాన రా డెందు నపుడు 26.

తే.గీ. వానరులఁ గూడి హర్షించె వానరేంద్రుఁ
డాజిఁ జంపి మహోదరు నధికముగను
గోప మూనె దశాస్యుఁడు ఘోరముగను
రాఘవేంద్రుండు భృశము హర్షమ్ము నందె 27.

కం. దీన మనస్కు లయి విష
ణ్ణానను లసుర వరు లెల్ల రావృత చింతా
మానసులు పాఱిరి భయము
తో నిటు నటు నాజి వీడి తూర్ణం బంతన్ 28.

తే.గీ. నేలఁ గూల్చి మహోదరుని గిరి యందు
నొక్క భాగముఁ జెదరు నట్లొనరుచు క్రియ
సూర్య సుతుఁ డరుల కెదిరించుటకు రాని
వాఁడు జయలక్ష్మి వెలిఁగెఁ బ్రభాకరుఁ డన 29.

కం. సుర యక్ష సిద్ధ భూ తల
వర భూత గణములు హర్ష పరవశమున నా 30.

హరివల్లభునిఁ బొగడినవి
పరఁగ విజయుఁడై కరమ్ము భండన మందున్

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ దొంబది యెనిమిదవ సర్గము.

# యుద్ధ కాండము
## సర్గము 99.

అంగదుని చేత మహాపార్శ్వుఁడు మరణించుట.

కం. కని సుగ్రీవ నిహతు న
ట్లనిని మహోదరుని నమ్మహాపార్శ్వుఁడు ర
క్త నయనుఁడు బలుఁడు కోప
మ్మున నంగదు భీమ సేన ములికుల నొంచెన్ 1.

ఆ.వె. తొడిమ నుండి పండు సుడిగాలి రాల్చి న
ట్లయ్యసుర వరుండు హరుల సేన
లోన ముఖ్యు లైన వానరుల తలల
రాల్చె నాజి లోనఁ బ్రబల బలుఁడు 2.

చం. శరములు వేసి కొందఱి భుజమ్ములఁ జీల్చెను వానరావళిం
ద్వర పడి గొప్పపార్శ్వుఁడు ప్లవంగులఁ గొందఱి పార్శ్వ భాగముల్
గురుతర మాగ్రహించి పగఁ గోసెను గోయ విసంజ్ఞు లైరి యె
ల్లరు హరు లంది రార్తి సమరమ్మున కంతఁ బరాఙ్ముఖత్వమున్ 3.

కం. కని యుద్విగ్న నిజ బల
మ్మును రాక్షస భంజితమ్ముఁ బోరున నట్లున్
ఘన వేగుఁడు పర్వమ్ముల 4.

వననిధి వలె నంగదుండు వడి నటఁ బెంచెన్

చం. కరమున నాయసంపుఁ బరిఘుప్రవరమ్ము గ్రహించి వేగ వా
నర వరుఁ డంగదుం డలిగి నైరృత వర్యుని పైన వైవఁగా
నరదము నుండి యయ్యసురుఁ డర్దితుఁడై గత సంజ్ఞుఁడై వెసన్
ధర పయినన్  ససారథి సతాపము గూలె నచేతనుండునై 5.

తే.గీ. వారిద నిభ యూధము నుండి భల్లుక పతి
కాటుకను బోలు వాఁడు పే కదలి పెద్ద
శిలను బట్టి యశ్వమ్ములఁ జేవఁ జంపెఁ
గినిసి విఱిచె రథమ్మును ఘన బలుండు 6.

ఆ.వె. అవని నుండి లేచి యంత మహాపార్శ్వుఁ
డొక ముహూర్తముననె యుగ్రుఁ డంగ
దుని ననేక శరములను వేసి బాధించెఁ
దిరిగి మిక్కుటముగ గురు బలుండు 7.

ఉ. కొట్టెను ఋక్షరాజు ననిఁ గ్రుద్ధుఁ డురమ్మున జాంబవంతునిన్
గట్టిగ మూడు బాణములఁ గాండ చయమ్ముల నా గవాక్షునిం
గొట్టె నిశాచరుం డలుకఁ గొట్ట గవాక్షుని జాంబవంతునిం
బట్టెను యంగదుండు గని పాణిని నా బరిఘమ్ము క్రుద్ధుఁడై 8.

ఉ. వాలి కుమారుఁ డంగదుఁడు భాస్కర రశ్మి సమప్రభా మహా
భీలము నైన నా గుదియ భీకర రోష విలోచనుండు పే
కేలులఁ బట్టి త్రిప్పి పరికించి సుదూరుని పైచెఁ జంపఁగా
నాలము నందుఁ గోపమున నయ్యసు రేంద్రుని గొప్పపార్శ్వునిన్ 9.

తే.గీ. అంగదచ్యుత పరిఘమ్ము సంగరమున
రక్కసుని చేతి నుండి శర సహితమ్ము
చాప వరమును నా శిరస్త్రాణముఁ బడ
వైచె వేగమ్ముగఁ బుడమి పైన నంత 10.

కం. చేరి రయమ్మున వానిని 11.

వీరుఁడు వాలి తనయుండు వేగమ చఱచెన్
ఘోర తలమున సకుండల
మా రక్కసు కణత పయిన నాగ్రహ మడరన్

ఆ.వె. అమ్మహాద్యుతి సుమహావేగుఁ డమ్మహా
పార్శ్వుఁడు కుపితుండు పన్నుగ నొక
హస్తమున గ్రహించె నతి విపులంపుఁ బ
రశ్వధమ్ము నంత రాక్షసుండు 12.

కం. తైలమునఁ గడిగి నట్టిది
మేలి యినుప గొడ్డలిని నమేయ బలమునన్
వాలి సుతుని పై నసురుఁడు
సాల కినిసి వైచె నంత సంగర మందున్ 13.

ఆ.వె. ఎడమ భుజము పైనఁ బడఁగ వేసిన దాని
నంగదుండు మీఱ నాగ్రహమ్ము
తనరి నైపుణమునఁ దప్పించి కొనియెఁ బ
రశ్వధమ్ము నంతఁ బ్లవగ వరుఁడు 14.

తే.గీ. అంగదుండు వీర వరేణ్యుఁ డాగ్రహించి
మిక్కుటముగఁ దండ్రి సమానుఁ డుక్కు నందు
వజ్ర సంఖాశ నిజ ముష్టి వైరి వీర
దమనుఁ డంత బిగించెను దత్క్షణమ్ము 15.

తే.గీ. అంగదుండు మర్మజ్ఞుండు చంగున నసు
రేంద్రు వక్షస్థలమ్మున నింద్ర వజ్ర
సన్నిభస్పర్శ ముష్టిచేఁ జఱచె బెట్టి
దముగ నమ్మహా పార్శ్వుని దరికి నరిగి 16.

కం. పగిలెను బిడికిలి పోటున
కు గుండె యసు రోత్తమునకుఁ గుండ వలె వెసన్
విగతప్రాణుఁ డయి నగ
మ్ము గతి మహాపార్శ్వుఁ డంతఁ బోరునఁ గూలెన్ 17.

కం. మరణింప మహాపార్శ్వుఁడు
ధరఁ బడఁ గంపించె సేన తద్దయు నంతన్
దురమున రావణుఁ డయ్యెను
బరమక్రుద్ధుండుగ దశ వక్త్రుం డరయన్ 18.

తే.గీ. అమర సంచయ సేంద్ర నాదములఁ బోలు
సమద వానర సింహ నాదముల చేత
లంక సాట్టాల గోపుర మింకఁ బగులు
నట్టు లయ్యెను వీక్షింప నపుడు వింత 19.

కం. విని సుర వానర రావము
ల నింద్ర శత్రు వటుల సమరమ్మున రోష
మ్ము సెగడ భృశమ్ముగ నిలిచె
ననికి సుముఖుఁడై తిరిగి దశాస్యుం డంతన్ 20.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందుఁ దొంబది తొమ్మిదవ సర్గము.

## యుద్ధ కాండము
## సర్గము 100.

విరూపాక్ష మహోదర మహాపార్శ్వుల మరణమును గాంచి రావణుఁడు కోపోద్రిక్తుఁడై యుద్ధమునకుఁ దలపడ రామ రావణులకు ఘోర యుద్ధము వాటిల్లుట.

తే.గీ. అమ్మహాపార్శ్వుఁడును విరూపాక్షుఁడును మ
హోదరుండును వీరులు యుద్ధ మందు
హతులు గాఁగ నావేశింప నాగ్రహమ్ము
రావణుఁడు సూతుఁ బ్రేరేచి రాజు పలికె 1.

ఆ.వె. మరణ మంది నట్టి మంత్రుల వలని దుః
ఖమ్ము నింక పట్టణమ్ము ముట్ట
డింప నడరిన వగఁ జంపి నేఁ బాపుదు
రామలక్ష్మణులను రణము నందు 2.

సీ. రణ వనమ్మున నేఁడు రామ వృక్షమును సీతా కుసుమము నుండి వీఁక ఫల మొ
సంగు దాని విరివి శాఖ లనంగ సుగ్రీవుఁడు దుర్ధర్ష కీశ విభుఁడు
జాంబవంతుండు ఋక్ష విభుండు కుముదుండు ద్వివిదుండు మైందుండు ధీర వర్యుఁ
డంగదుండు యువరా డధిక బలుఁడు గంధమాదనుం డుగ్రుఁడు మారు తాత్మ
తే.గీ. జుఁడు సుషేణుం డితర హరి శూరు లెల్లఁ
దనరు నట్టి దాని వధింతుఁ గనుమ యంచుఁ
బల్కి రథ ఘోషములు నిండఁ బది దిశలను
రాము నెదిరింప వడి నేఁగె రావణుండు 3.

కం. ధరణి చలించెను నదులను
గిరులను వనములను గూడి కృత్స్నము నిండం
గ రవమ్ములు భీతిల్లుచుఁ
గరమ్ము సింహద్విజ మృగ గణములు వాఱెన్ 4.

ఉ. భీమత రాస్త్ర రాజమును వేసెను దామసమున్ గ్రహించి సం
గ్రామము నందు రావణుఁడు కాల్చె వరాస్త్రము వానరావళిన్
భూమినిఁ గూలి రెల్లెడల బోరన లేచె రజమ్ము మిన్నగా
లేమి బలమ్ము సైపరు విరించి యొనర్చిన తామ సాస్త్రమున్ 5.

కం. కని సేనలం దనేకుల
ఘు నాసురేంద్రు శిత శర నికాయములం గూ
ల నవని భగ్నుల వందలు
గ నిలిచె ధృతి రాముఁ డలుకఁ గయ్య మొనర్పన్ 6.

ఉ. చూచెను రాక్షసర్వభుఁడు శూరుఁడు దోలి ప్లవంగ సేననున్
వేచిన వాని లక్ష్మణుని వీరునిఁ గూడిన వాని రామునిం
దోఁచుచు నుండ వాసవుని తోడుత విష్ణు వనంగ దుర్జయుం 7.

డై చను వానిఁ దోయజ దళాక్షు నరిందముఁ జాప హస్తునిన్

చం. కని యట దీర్ఘబాహుఁడు నృకాంతుఁడు లక్ష్మణుఁ డుండఁ దోడుగా
వనచరు లోడి యుండఁగను వచ్చెడు రావణు రాక్షసేంద్రునిన్
మనమున సంతసించి విలు మధ్యను గట్టిగ పట్టి లాగఁ జా
గెను నినదమ్ము సీల్ప భువిఁ గృత్స్నము ఘోరము వేగ వంతమున్ 8.

ఆ.వె. అవనిఁ గూలి రంత నసుర వరేణ్యులు
వందల కొలఁది దశవక్త్రు బాణ
వేగమున రఘువరు వింటి మ్రోతల నాల
కింప వింత సంతరింప నపుడు 9.

కం. నరవరుల రాజ పుత్రుల
శర పథమున రావణుఁడు దశ వదనుఁడు నిశా
చరుఁ డల శశి సూర్యుల చెం
త రాహువు పగిది వెలింగెఁ దత్సమయమునన్ 10.

ముం దొనరింప లక్ష్మణుఁడు బోరును దేజిత మార్గణమ్ములం
దొందర వంచి చాపమును దూపులు వేసెను గీల తుల్యముల్
సెందక మున్ను తన్ను నతి శీఘ్రమ రావణుఁ డేసి బాణముల్
కుందక యాకసమ్మునసె కోలల నాపెను వేసి నంతటన్ 11.

తే.గీ. ఒక్క బాణమ్మున శరము నొకటి మూటి
నంత మూడింటను బదింట నప్పదింటి
రయము మీఱఁ గూల్చెను వేయ లక్ష్మణుండు
రావణుండు సూపుచుఁ గర లాఘవమ్ము 12.

తే.గీ. దాఁటి సౌమిత్రి నంత నా దశ వదనుఁడు
రణ జయుండు సమీపించె రాముని నప
ర గిరి భంగి నిలువఁ గ్రోధ రక్త లోచ
నుండు సంగరమున రావణుండు వేగ 13.

ఆ.వె. చేరి రాఘవేంద్రుఁ జెలఁగి కురిసె శర 14.

వర్ష మతని పైనఁ బంక్తి ముఖుఁడు
రాక్షసేశ్వరుండు రావణుం డడరి ఘో
రముగ బాణ ధారలఁ గని యతఁడు

తే.గీ. రావ ణాంబక ధారలు రాఘవుండు
వచ్చి పడఁగఁ గైకొనె నంత భల్లములను
దీప్యమాన రోష ఫణి సదృశ విశిఖులఁ
ద్రుంచెఁ దీక్ష్ణ శరమ్ములఁ దూర్ణ మంత 15.

ఆ.వె. రాఘవుండు మూరి రావణుని పయిన
రావణుండు నడరి రాఘవేంద్రు
పయిఁ బరస్పరమ్ము బాణ వర్షమ్ము గు
రిసిరి వివిధముల విరివిగ నంత 16.

తే.గీ. కుడి యెడమ లిర్వురుం దిరుగుచు వడివడిఁ
జిత్ర గతుల గుండ్రముగ విశిఖుల వేగ
మునకు నన్యోన్యము మరల వెనుక కని యొ
నర్చి రపరాజితు లసుర నర వృషభులు 17.

కం. ఇరువురు యమాంతక నిభులు
గురుతర రౌద్రులు పఱపఁగఁ గోలల నెల్లన్
విరివిగను నేక కాలము
న రణము గని భూతములు ఘనముగ భయపడెన్ 18.

కం. గగనము ఘర్మాంతమ్మున
మొగుళుల సతటిత్తుల వలెఁ బోరున నంతం
దగఁ గప్పఁ బడెను దట్ట
మ్ముగ వివిధములైన బాణముల చేత వెసన్ 19.

కం. కనిపించె నభం బప్పుడు
ఘన వేగ సగృధ్రపత్ర కాం డావృష్టిం
గనులకుఁ గిటికీలం గూ
డి నట్లు వేగముగ వేయ డిందక యుభయుల్ 20.

ఆ.వె. తపనుఁ డస్త గిరికిఁ దరలక మున్న యు
త్థిత ఘనద్వయమ్ము తీరున దివి
నంధకార మయము నమ్ములతో నొన
రించి రక్కజముగ మించి ఘనులు 21.

కం. సంకుల సమరం బయ్యెను
బొంకమ్మునఁ జంప నెంచి పోరుచు నుండం
గొంకకయ వృత్ర వాసవ
సంకాశ మచింత్య మిం కశక్యము సేరన్ 22.

చం. ఇరువురు గొప్ప ధార్మికులెయిద్దఱు యుద్ధ విశారదుల్ ఘనుల్
వరులు మహాస్త్ర వేత్తలను భండన సంచరితుల్ భృశమ్ముగా
నిరువురు సేఁగి రే గతిని నింపుగ నా గతి బాణ భంగముల్
దరలెను వాయు కంపిత నితాంత పయోధి తరంగ భంగినిన్ 23.

చం. నిపుణ కరద్వయుం డడరి నించెను మార్గణ సంచయమ్మునుం
గుపితుఁడు లోక రావణుఁడు క్రూరుఁడు రావణుఁ డాజి లోన నా
నృపవరు ఫాల భాగమున నీల కవేల సమప్రభన్ ఘనుం
డపుడు కలంగఁ డర్క కులుఁ డస్త్ర పరిచ్యుత బాణ పంక్తిచే 24.

ఉ. పిమ్మట మంత్రముల్ సదివి వీరుఁడు రౌద్ర వరాస్త్ర మింపుగా
నెమ్మి గ్రహించి బాణములు నీరజ నేత్రుఁడు వంచి వింటినిం
గ్రమ్మఁగ నాగ్రహం బెడఁద గ్రక్కున వైచె వరిష్ఠ తేజుఁడే
యమ్మను జాధినాథుఁడు మహాత్ముఁడు రాముఁడు రాక్షసేంద్రుపై 25.

ఉ. రావణు మేఘు సన్నిభపు రమ్య తనుత్రము నందు నాటఁగా
నే విధి బాధ నీయ వసురేంద్రున కప్పు డవధ్య మౌటచే
భూవరు ముల్కులే రఘు నృపుం డనిఁ దిర్గి రథస్థు నస్త్ర స
త్కోవిదుఁ డస్త్ర రాజమునఁ గ్రూరునిఁ గొట్టె లలాట మందునే 26.

తే.గీ. పంచ శీర్ష సర్పమ్ముల వంటి యా శ
రములు భేదించి శరముల రావణచ్ఛ 27.

తముల నిశ్వసించుచుఁ గడు దగ్గి చేవఁ
దూఱిన వవి పుడమి లోనఁ దూర్ణ మంత

తే.గీ. కూల్చి రాఘు వాస్త్రమ్ము ను గ్రోధ మూర్ఛి
తుండు నయి భృశముగ రావణుండు ఘోర
మన్యము నసు రాస్త్రమ్ము మహాస్త్రమును జె
లఁగి ప్రయోగించె నప్పుడు రాముని పయి 28.

ఉ. కాకుల వ్యాఘ్ర సింహముల గ్రద్దల డేగల నక్క లింకనుం
బ్రాకట కంక పక్షుల నరణ్యపుఁ గుక్కల మోము లున్నవౌ
భీకర మైన బాణములు పెల్లుగ నైదు ముఖమ్ము లున్నవౌ
యా కనువిన్కు లమ్ములను నాజి దశాస్యుఁడు వేసె నుగ్రుఁడై 29.

తే.గీ. ఖర వరాహ కుక్కుట శునక మక రాహి
తదిత రాస్య సంయుత బాణ తతుల నేసె
రాముని పయిన మాయావి రావణుండు
నిశ్వసించుచుఁ దేజస్వి నేర్పు మీఱ 30.

కం. ఆవృతుఁడై సంగరమున
భూవరుఁ డాసుర మహాస్త్ర ముఖ్యమ్మున నా
పావక నిభుఁడు సృజించెను
బావక నామాస్త్రము రఘు వరుఁ డోజ వెసన్ 31.

చం. అనల సమప్రభాస్యముల నమ్ముల సూర్యము ఖాంబకమ్ములం
గనలెడు ధూమకేతు ముఖ కాండము లర్ధ శశీంద్ర వక్త్ర బా
ణ నివహ మింక తారక ఘనగ్రహ వర్ణ విభాసితమ్ములన్
ఘన కన దుల్క వక్త్రములఁ గన్నన వేసెఁ దటిద్రసాభముల్ 32.

ఆ.వె. రాఘు వాస్త్ర విద్ధ రావణ ఘోర శ
రమ్ము లాకసమున లయము లైన
వెల్ల నొక్క త్రుటిని నిలఁగూలె వేల కొ
లంది ముక్క లయి కలఁగ నసురులు 33.

తే.గీ. అరసి యక్లిష్ట కర్మునే నా రఘుపతి
చేతఁ గూలిన యస్త్రమ్ముఁ జేరి రాము
ని ముద మారంగ సుగ్రీవుని సహితమ్ము
కామ రూపు లార్చిరి ప్లవగ వరు లంత 34.

కం. బల మడర రావ ణాస్త్రము
ను లలిన్ శాంతింపఁ జేసి నొవ్వక రాముం
డల హర్ష మందెఁ గపి వీ
రు లార్చిరి ముదమ్ము మీఱ రుతులు సెలంగన్ 35.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూఱవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 101.

రామ రావణుల యుద్ధము కొనసాగు చుండఁగ లక్ష్మణుఁడు రావణుని వింటినిఁ ద్రుంప విభీషణుఁడు రావణుని గుఱ్ఱములను వధింప రావణుండు లక్ష్మణుని వక్షముపై శక్తి వేసిన సౌమిత్రి మూర్ఛిల్ల రాముఁడు రావణునితో ఘోరముగ యుద్ధము సేయ భీతిని రావణుఁడు పాఱిపోవుట.

కం. రిత్త యయి పడఁగ నస్త్రం
బత్తఱిఁ గని రావణుఁడు దసాస్యుఁడు కో పా
యత్తుఁ డయి ద్విగుణ మయ్యసు
రోత్తముఁ డన్యాస్త్ర మూనె నుగ్రుండు వెసన్ 1.

చం. అడరెను వేయ భీకరము నమ్మయ నిర్మిత మన్య మస్త్రమున్
వడివడి రాఘవేంద్రు పయి వాలిన క్రుద్ధతఁ గాంతి మంతమున్
వెడలెను వింటి నుండి కడు వెల్గెడు శూల గదాద్యయోగ్రముల్
దడయక వజ్ర సారములు తారుచు దిక్కుల కన్ని చోట్లకున్ 2.

ఆ.వె. కూట పాశ వజ్ర కోటి ముద్గరములు
వివిధము లవి బయలు వెడలెఁ దీక్ష్ణ
ములును దీప్తములును విలయ కాలమ్మున
వీచు గాలి వోలె వింత నంత 3.

తే.గీ. ఉత్త మాస్త్ర కోవిదు లందు నుత్తముండు
రాఘవుండు గాంధర్వాస్త్ర రాజమున న
డంచె నప్పర మాస్త్రమ్ము నంచితముగ
రామ నిహతాస్త్ర మారసి రావణుండు 4.

కం. కినుకం గన్నుల రాలం
గ నిప్పు లరుణాక్షుఁ డంతఁ గౌణప పతి పే
సెను సౌరాస్త్రమ్ము దశా
ననుండు పరమాస్త్రమును గనలుచు భృశముగన్ 5.

చం. దశముఖు వింటి నుండి త్వరితమ్ముగ వెల్లుచు వచ్చెఁ జక్రముల్
భృశముగ దీప్త చక్రములఁ బెల్లుగ వెల్గె నభోతలం బనిన్
దిశలను సూర్య చంద్రుల గతిన్ వెలిగింపఁగ వాని రాముఁ డం
త శిత శరాళిఁ జేసె వెస ధ్వంసము రావణు నాయుధమ్ములన్ 6.

తే.గీ. రిక్త సౌరాస్త్రమును గాంచి రేఁగఁ గినుక
రాక్షసాధిపుం డుగ్రుండు రావణుండు
దశ శరమ్ములు రాముని తనువు నందు
మర్మముల వేసి యడిచెను మనుజ విభుని 7.

ఆ.వె. కొట్టఁ బడిన నట్లు ఘోర శరమ్ముల
రావణచ్యుతముల రాఘవుండు
తేజమున ఘనుండు దృఢతఁ గంపింపఁడు
సుంత యేని గొప్ప శూరవరుఁడు 8.

కం. అంత ర ణాజేయుం డ
త్యంతక్రోధుండునై దశాననుఁ జింతా 9.

క్రాంతునిఁ జేసెను వేసి య
నంత శర నికాయ మతని యంగము లందున్

మత్తకోకిల. ఇంతలోపల లక్ష్మణుండు నరేంద్రు రాముని సోదరుం
డంతఁ గైకొని సప్త బాణ చయమ్ము శాత్రవ పక్ష వీ
రాంతకుం డతి రోష సంకలి తాత్ముఁ డయ్యసు రేంద్రు దు
ర్దాంతు మానవ మూర్ధ కేతన రత్నముం దునుమాడియున్ 10.

ఉ. సారథి నంత బాణములఁ జంపె సకుండల శీర్ష రాజమున్
వీరుఁడు ద్రుంచి బల్లిదుఁడు పిమ్మట రాక్షస నాథు వింటినిన్
ఘోరముఁ బంచ బాణములఁ గుంజర హస్త నిభమ్ముఁ ద్రెంపఁగా
నారసి యవ్విభీషణుఁడు నంతట లక్ష్మణ వీరకృత్యమున్ 11.

తే.గీ. ఎగిరి రావణు నీలాంబుద గిరి నిభ వి
రాజమాన సద్ఘోటక వ్రాతమును ద
శాన నానుజ వరుఁడు స్వీయ పటుతర గ
దాయుధమ్మునఁ జంపె నమేయ బలుఁడు 12.

కం. ఘన వేగవంతుఁడు రయ
మ్మున వీడి హతాశ్వ రథము వోరునఁ గోప
మ్మున రావణుండు గాంచెను
దన తమ్మునిఁ గోప మధికతరముగఁ బెఱిఁగెన్ 13.

ఉ. అంతఁ బ్రతాపవంతుఁడు దశాస్యుఁడు శక్తిని శక్తిమంతమున్
సొంతము దీప్త శక్ర పర మాశని భంగి వెలుంగు దానినిం
బంతముతోడ భ్రాతపయి వైచెను జేరక మున్న దాని ధీ
మంతుఁడు నీల్చె లక్ష్మణుఁడు మర్కటు లార్వఁగ మూడు ముల్కులన్ 14.

ఆ.వె. పడెను బుడమి పైనఁ బసిడి మాలల శక్తి
మూడు ముక్క లయి నభో గ తోల్క
ల గమి విస్ఫులింగ రాజితము గగన
తలము వీడి పడు విధమ్ము దోఁప 15.

ఉ. అంత గ్రహించెఁ గాలునకు నైనను జేరఁగ రాని స్తుత్యముం
గాంతుల వెల్గు దాని దశకంఠుఁడు ఘోరము నన్య శక్తి దు
స్స్వాంతుఁడు బల్లిదుం డది ప్రభారుచులం దగ వెల్గుచుండె న
త్యంతము వేగవంతమును నల్క వహించి యొనర్చె దానినిన్ 16.

తే.గీ. ఇంతలోఁ బ్రాణ సంశయ మేర్పడఁగ వి
భీషణునకు వీక్షించి యా వీర వరుఁడు
లక్ష్మణుం డాదుకొనఁగ శరములు కురిసె
వంచి విల్లు శక్తి కరు రావణుని పైన 17.

తే.గీ. చిమ్మఁబడ శరౌఘమ్ముఁన నమ్మహాత్ము
చేత దశముఖుఁడు విముఖీ భూత విక్ర
ముం డనుజు విభీషణుఁ దలఁపండు గొట్ట
గ నపుడు పలికెఁ గాంచి లక్ష్మణుని నిట్లు 18.

ఉ. రావణుఁ డంత రక్షితుని భ్రాతను గాంచి వచించె నిల్చి తా
నా వర వీరు కట్టెదుట నంచిత రీతిని మీఱి కాచితే
నీ విట వీర్యమాని వయి నెమ్మి విభీషణు వీడి వానినిం
గావున శక్తి నీ పయినిఁ గ్రన్ననఁ గూలును జూడు లక్ష్మణా! 19.

తే.గీ. నెత్తుటి మఱక లున్నట్టి యుత్తమంపు
శక్తి పరిఘ సదృశములు శక్తిమంత
ము లగు నా బాహువుల చేత ముక్తమై చె
లంగి నీ ప్రాణములఁ గొని లక్ష్మణ! చను 20.

చం. విడిచెను బల్కి యివ్విధము వేగమ యెన్మిది గంట లున్నదౌ
బెడిదపు శక్తి రావణుఁడు పేర్మినిఁ జేయ మయుం డమోఘముం
దడయక రామసోదరునిఁ దాఁకఁగ ఘోరము మండు దాని నా
యొడయుఁడు దద్ద క్రుద్ధుఁ డయి యుద్ధతి నార్చె ఘనస్వనమ్ములన్ 21.

కం. ఘన వజ్రాశని సదృశ
స్వనము దశాస్యచ్యుతమ్ము శక్తి రణ తల
మ్మున లక్ష్మణు పైకి రయ 22.

మ్ముఁన రాఁ దొడఁగె నపుడు గొలుపుచు భయ మెదలన్

తే.గీ. వచ్చు చున్న శక్తినిఁ గాంచి పలికె రాముఁ
డిట్లు సౌమిత్రి కగుఁ గాక యింపు స్వస్తి
నీ విచట హతోద్యమవునై నిలుతు గాక
రిత్తవై చనెదవు గాక యిత్తఱి నిఁక 23.

ఉ. రావణ ముక్త శక్తి పణి రాణ్ణిభ శస్త్రవరం బభీతు నా
ప్రావృత లక్ష్మ ణోరమున వారక మున్గెను వేగవంత మా
శీవిష జిహ్వ నాఁ దనరి శీఘ్రము వెల్గుచు గొప్ప కాంతులన్
రావణ వేగ మూలమున లక్ష్మణుఁ డంతట భగ్న వక్షుఁడై 24.

తే.గీ. నాటఁగ సుదూర మా శక్తి నరవరుండు
పుడమి పై వీర్య వంతుండు వడెను జెంత
నున్న రాముఁ డట్టి యవస్థ నన్న గాంచి
యనుజ స్నేహమున విషణ్ణుఁ డయ్యె నెడఁద 25.

తే.గీ. ఒక్క నిమిషము చింతించి యుగ్రుఁ డయ్యెఁ
బ్రళయ కాలాగ్ని భంగి నరర్షభుండు
భాష్ప లోచనుండు దలంచి వనరఁగ సమ
యమ్ము కాదని కాంచుచు ననుజు నంత 26.

ఆ.వె. తుముల యుద్ధ మాజి దుర్జయుఁ డొనరింపఁ
దొడఁగె నంత రాముఁ డెడఁద నిశ్చ
యించి ఘోరు రాక్షసేంద్రుని వధియింతు
నెల్ల యత్నము లొనరించి యంచు 27.

ఆ.వె. శక్తి భిన్న తనుని సర్పయు క్తాచల
సన్నిభు ననుజ వరు సమర మందు
లక్ష్మణుని నరసెను రక్త సిక్తాంగుని
రాముఁ డార్తితో నరర్షభుండు 28.

చం. అసురుఁడు క్షిప్ర హస్తుఁడు దశాననుఁ డమ్ములఁ గొట్టుచుండఁగా 29.

విసరుచు రావణాసురుఁడు వేసిన శక్తిని లాగ జాల రా
యసమ బలాఢ్య వానర గణావలి శ్రేష్ఠులు ఘోర యత్నముల్
వెస నొనరించినం దమిని వీర వరేణ్యులు రావణార్దితుల్

తే.గీ. చొచ్చె నా శక్తి పుడమిని శూరు లక్ష్మ
ణు ఘన వక్షమ్ము ఛేదించుచు ఘన బలుఁడు
రాముఁడు కరద్వయమ్మున లాగి దాని
భయదమును ముక్కలుగఁ జేసెఁ బార్థివుండు 30.

ఉ. లాగుచు నుండ రాఘవుఁడు రావణ హస్త విముక్త శక్తినిన్
వేగమ మర్మభేది శరవృష్టి శరీరమునం గురింపఁ దా
నాఁగఁడు లెక్క సేయఁడు మహాత్ముఁడు కౌఁగిలి నుంచి తమ్మునిన్
బాగుగ గాంచి మారుతుని వానర నాథుని రాముఁ డిట్లనెన్ 31.

చం. నిలువుఁడు చుట్టి మీ రనుజునిం గపి పుంగవు లార! వచ్చె నేఁ
డలరి పరాక్ర మింపుగను నంచిత కాలము మచ్చిరేప్సితం
బిల ఖలు పాపనిశ్చయుని నీ దశవక్త్రు వధింప వానకో
యిలలకు వానకాలమున నింపుగ మేఘము దోఁచు రీతినిన్ 32.

ఆ.వె. ప్రతిన నూని నేను బలుకు చుంటి నిజం బ
చిరము నిశ్చయముగ హరి వరేణ్యు
లార! చూచు వా రరావణ మేని య
రామ మేని కాఁగ భూమి మీరు 33.

చం. కలిగెను రాజ్య నాశము సకంటక కానన ఘోర వాసముం
గలిగెను దండకా గమన కార్యము దార ఘు నావమానముం
గలిగిన ఘోర దుఃఖమును గయ్యమునన్ వధియించి రావణున్
విలయ మొనర్తు నే నడరి వేగమ యెల్లను రౌర వాభమున్ 34.

తే.గీ. ఎవ్వని కొఱకుఁ దెచ్చితి నీప్లవంగ
సేన సుగ్రీవుఁ జేసితి నేను విభునిఁ
జంపి వాలి వంతెన కట్టి సాగరమ్ము
దాఁటితి నతఁడు గనిపించె మేటి పాపి 35.

తే.గీ. నాదు దృష్టిఁ బడిన దశాననుఁ డనర్థుఁ
డగును జీవింప దృష్టి విషాహి దృష్టిఁ
బడ్డ వాని వలెను నింక వైనతేయు
దృష్టిఁ బడిన సర్పమ్ము రీతి హరులార! 36.

ఆ.వె. స్వాస్థ్యమునఁ గనుండు వానర వర్యు లా
రా! యజేయు లార! రామ రావ
ణ సమరమ్ము నిలిచి నగరాజ శిఖరమ్ము
లందు నిబ్బరముగ నలరు చుండి 37.

తే.గీ. దేవ గంధర్వ చారణ దివ్య ముని యు
తమ్ము ముల్లోకములు నేఁడు నెమ్మి నాజి
నడరు రామ రామత్వమ్ము నద్భుతమ్ముఁ
గాంచు నిపుడు కనుఁడు ప్లవంగ వరు లార! 38.

చం. చరములు స్థావరమ్ములును జక్కఁ ద్రిలోకము లందు దేవతా
వరులును సంగరం బయిన భంగిని నెల్లరు కూడి చెప్పు కొం
దు రవని యుండు నంత తఱిఁ దూర్ణ మొనర్తును నేఁడు గాంచుఁడీ
దురమున నట్టి కార్యమును దూల్చెద నాజిని రాక్షసేశ్వరున్ 39.

చం. పలికి రఘూత్తముం డిటుల భర్మ విభూషిత తీక్ష్ణ మార్గణ
మ్ముల దశకంఠుఁ గొట్టె నని మూరి సమాహితుఁడై భృశమ్ముగాఁ
గలఁగి దశాననుండు శిత కాండములన్ ముసలమ్ములన్ ధృతిం
జెలఁగి పయోద ధార లన శీఘ్రముగాఁ గురియించె రాముపై 40.

ఆ.వె. రణ తలమ్ము నందు రామ రావణ ముక్త
శరము లొండొరులను జక్కఁ దాఁకి
కొట్టుకొనుచు నుండ బెట్టిదముగఁ జెల
రేఁగె ఘోర రవము లాఁగకుండ 41.

కం. ధర రామ రావణచ్యుత
శరమ్ము లాకసము నుండి శకలమ్ములునై 42.

విరివి సెదరి దీప్తాగ్రము
లరయం గూలినవి యెల్ల నాశ్చర్యముగన్

ఆ.వె. అద్భుతోపమమ్ము లయ్యెను రామ రా
వణుల నారి ధ్వనులు భయ మొసంగ
సర్వ భూతములకు సమర తలమ్మున
మిక్కుటముగఁ జేయ మేటి బలులు 43.

కం. శర వృష్టి సిమ్ముచు ధను
ర్ధరుండు బాధింపఁ గరము రఘు వీరుఁడు సం
గరమున వాయు హత ఘన మ
న రావణుఁడు భీతిని స్వజన యుతము వాఱెన్ 44.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యొకటవ సర్గము.

## యుద్ధ కాండము
## సర్గము 102.

మూర్ఛిల్లిన లక్ష్మణుని వీక్షించి రాముఁడు సుషేణునకుఁ జూపి విలపింప నాతని పనుపున హనుమంతుఁ డోషధి గిరిఁ దెచ్చిన సుషేణుఁ డౌషధ మొసంగ లక్ష్మణుఁడు తేఱికొని రావణు వధకై రామునిఁ బ్రోత్సహించుట.

చం. సమరము నందు శూర వరు శక్తివ రార్దితుఁ గాంచి లక్ష్మణున్
విమలుని రావ ణార్దితునిఁ బెల్లుగ రక్తము నందు మున్గఁగన్
సమర మొసంగి శత్రునకుఁ జల్లుచు రాముఁడు బాణ ధారలం
గుమిలి సుషేణు తోడ రణ కోవిదుఁ డంత వచించె నివ్విధిన్ 1.

ఉ. రావణ విక్రమమ్మునను లక్ష్మణుఁ డీతఁడు గూలె నేలపై 2.

వావిరి పెంచి నా వెతను బన్నగ రాజము భంగి నక్కటా
యీ విధిఁ గొట్టుకొంచును మహీతల మందు విసంజ్ఞ నుండ స్వీ
యావరజుండు ప్రాణముల కత్యధికుండు మునింగి నెత్తుటన్

ఉ. ఏ విధి శక్తి యుక్తుఁడను నిత్తఱి నౌదు రణం బొనర్పఁగా
నీ వర లక్షణుండు సమరేద్ధ నుతుండు సహోదరుం డహో
చావును జేర ప్రాణముల సౌఖ్యము లందును లాభ మేమి నే
నీ వగ నింక డెందమున నెట్లు భరింతు బలమ్ము రిత్తయే 3.

తే.గీ. ధనువు జాఱుచుండె నిట హస్తమున నుండి
కనులు కన్నీటి మయమయ్యెఁ గాండములు కృ
శించెఁ గలలోనఁ జను మానిసి వలె నంగ
ములు చలించెఁ గలంత మూర్ఛ పుట్టె 4.

తే.గీ. దుష్ట చిత్త రావణునిచేఁ దూలి నట్టి
తమ్మునిఁ గన మూల్గుచు నుండఁ దగులఁ దనదు
మర్మభాగమున బయట మసలు ప్రాణ
మనఁగ నత్యధిక ప్రియుని నార్తి సెలఁగె 5.

ఆ.వె. చూచి యంట దుమ్ము శోకపరాయణుఁ
డయ్యె రాఘవుఁడు ని జానుజునకు
నతి విషాద మెడఁద నావహింప వనరె
మేదినీ విభుండు మిక్కుటముగ 6.

కం. విజయమ్మునఁ బ్రీతి మనము
న జనింపదు నాకు సుంత నయన విహీనుం
డు జగతిఁ బొందునె హర్షము
ను జంద్రుఁ డుదయింప నింగి నుత వీరుండా 7.

కం. ఏల రణ మేల ప్రాణం
బాలము రుచియింప నేర దంక తలమునన్
నా లక్ష్మణుండు మూర్ఛం
గూలి పరుండంగ నిట్లు ఘో రావస్థన్ 8.

కం. వన మేఁగెడు నన్నును న
న్ను ననుస రించిన పగిది ననుజ పుంగవు నే
ను ననుసరింతును సౌమి
త్రిని యమ సదనమున కిపుడు ప్రీతి సెలంగన్ 9.

తే.గీ. బంధువులకు నిత్యము ప్రేమఁ బంచు వాఁడు
ప్రీతి నన్ను నిత్య మనుసరించు వాఁడు
కూట యోధు లసురులచే ఘోర మైన
యీ యవస్థను దాఁ బొందె నిచటఁ గంటె 10.

ఆ.వె. దేశ దేశముల నతిప్రియ లగు దార
లుంద్రు బంధు జనులు నుర్వి నుంద్రు
దేశ దేశములను దేశముఁ గన నెందు
నుండుఁ దమ్ముఁడు సహజుండు నేను 11.

చం. వనరుచు నుండ నిప్పగిది బాధను విహ్వలి తేంద్రియుండు జా
లి నెగడఁ గంపితుండు నయి రేఁగఁగ నిశ్వసనమ్ము లత్తఱిన్
ఘన కపి యా సుషేణుఁడు నృకాంతునితో ననె నూఱడించుచున్
మినుకుల నిట్టు లింపొదవ మిన్నగ నంతటఁ గాంచి లక్ష్మణున్ 12.

ఉ. కాఁడు మృతుండు భ్రాత యనఘా విను రాఘువ! దీర్ఘ బాహుఁ డు
న్నాఁ డిట లక్ష్మి వర్ధనుఁడు నాటిన శక్తి సజీవుఁడై తగన్
వాడదు సుంత వక్త్రము ప్రభా లయ మింతయు లేదు శ్యామముం
గూడదు గాంచ లక్ష్మణునకుం దను విత్తఱి ధీర పుంగవా! 13.

ఆ.వె. సుప్రభాయుతమ్ము సుప్రసన్న మతని
యాస్యము పరికింప నక్కు లరయ
సుప్రసన్నములు సుశోభితములు హస్త
ములు సరోజ రక్త తలము లెన్న 14.

కం. కనిపింపదు రూపమ్ము మృ
తున కివ్విధ మెన్నఁ డేని దుఃఖింపకుమీ 15.

మనమునఁ జిరాయువుల కుం
డు నిట్లు మర్త్యుల కరయ విడు కలఁత సెల్లన్

ఆ.వె. వీరుఁ డంద లేదు ప్రేతత్వమును లక్ష్మ
ణుండు లక్ష్మివర్ధనుండు ప్రాణ
సహిత మున్నవాఁడు శత్రు వినాశకుం
డనఘ! వీడు శోక మార్య! యింక 16.

తే.గీ. సడలి నట్టి గాత్రమ్ములఁ బుడమి పైన
నిదుర నుచ్ఛ్వాసముల తోడఁ గదలు చుండి
మాటి మాటికి హృదయమ్ము మనుజ నాథ!
చెప్పుచున్న దీ విషయమ్ము నొప్పిదముగ 17.

కం. అని యిట్లు మహా ప్రాజ్ఞుఁడు
ఘనుఁడు సుషేణుఁడు నరేంద్రు కాకుత్స్థునితో
హనుమంతు సమీపమ్మునఁ
గని చక్కఁగఁ బల్కె నంతఁ గపివరుఁ డిట్లున్ 18.

ఉ. వీర వరేణ్య! సౌమ్య! చని వేగమ మారుత పుత్ర! ఋక్ష రా
జేరిత మౌష ధాద్రికిఁ గపీశ్వర! దక్షిణ శృంగ జాతమున్
నేరి మహౌషధమ్ము తగు నేర్పున క్షిప్రము తెమ్ము లక్ష్మణున్
వీరు రుజా విహీనునిగఁ బేర్మినిఁ జేయ నొసంగి దానినిన్ 19.

తే.గీ. వడి వడి విశల్యకరణి సవర్ణకరణి
తరలి సంధానకరణి వాత సమ వేగ!
తెమ్ము సంజీవనిగ నొప్పు దివ్య మైన
దాని లక్ష్మణు బ్రతికింప వానర వర! 20.

ఆ.వె. పనుపఁ బడఁగ నిట్లు వాతాత్మజుండు సే
రి తగ నోషధుల గిరిని రయమున
వాని నెఱుఁగ లేక వానర వర్యుఁడు
చింత లోన మునిఁగె శ్రీయుతుండు 21.

ఉ. మారుతి కంతఁ బుట్టి మతి మానస మందు మహా బలాఢ్య తే
జోరుచి రోగ్ర వీరునకుఁ జోద్యముగా గిరి శృంగ యుక్తమే
జేరఁగ నొప్పు నంచు నిటఁ జెన్నుగ నోషధు లుండు నంచు నే
నేరుదు నూహఁ జెప్పెఁ గద నెమ్మి సుషేణుఁడు నాకు నట్టులన్ 22.

ఉ. నేఁ జనినన్ విశల్యకరణిం గొనకుండ గతింపఁ గాలమే
పే జనియించు దోష మది పెల్లుగ దుఃఖము కల్గు నెన్నఁగాఁ
దాఁ జని యెంచి యిప్విధము తత్క్షణ మద్రికి మూడు మారులుం
దేజున నూపి శృంగమును దిట్ట సవృక్షము నెత్తెఁ జేతులన్ 23.

తే.గీ. సజల నీల జీమూతమ్ము సరణి నొప్పు
గిరి శిఖరమును బెకలించి హరి వరుండు
నింగి కెగిరి మహా వేగి చంగునఁ బయ
నించి వేగమ్ముగఁ గదిసి యంచితముగ 24.

తే.గీ. ఉంచి చెంత శృంగము విశ్రమించి సుంత
పల్కెను సుషేణు వీక్షించి పవన సుతుఁడు
నే నెఱుఁగమి నౌషధము మహానగ శిఖ
రమ్ము కృత్స్నముం దెచ్చితి నెమ్మి నంచు 25.

తే.గీ. అనఁగ వానిని కీర్తించి హనమ నంత
నా సుషేణుండు గైకొనె నౌషధమును
సురలకును దుష్కరం బగు హరి వరేణ్యు
పనిని వీక్షించి యాశ్చర్య పడిరి హరులు 26.

ఆ.వె. వాన రోత్తముండు దాని నలఁగఁ గొట్టి
యా సుషేణుఁ డమ్మహా ప్రభా యు
తుండు ముక్కు లోనఁ బిండె నౌషధమును
లక్ష్మి వర్ధనుఁ డగు లక్ష్మణునకు 27.

తే.గీ. శల్య సహితుండు సౌమిత్రి శల్య రహితుఁ
డయ్యెఁ బీల్చి పరంధముఁ డంత మందు
రోగ మెల్ల నశింపఁగ వేగ లేచెఁ 28.

బుడమి నుండి ప్లవంగుల కడర ముదము

చం. ప్లవగులు గాంచి యుత్థితుని లక్ష్మణుఁ బల్కిరి సాధు సాధు వం
చు వర హరిన్ సుషేణు నటఁ జూచి స్తుతించిరి సంతసిల్లి తా
నవరజు రమ్ము రమ్మనుచు నన్న రఘూత్తముఁ డంతఁ గంట నీ
రు వఱలఁ గౌఁగిలించె నృవరుండు సహోదరుఁ బ్రీతి రేఁగఁగన్ 29.

ఆ.వె. తమిఁ బరిష్వజించి తమ్మునితో ననె
భాగ్యవశము చేత భ్రాత! నిన్ను
గంటి తిరిగి రాఁగ నంటి మృత్యువు నిట్లు
నీవు లక్ష్మణుండ! నేను బ్రీతి 30.

ఆ.వె. సీత వలన జయము జీవితమ్ముల నే ప్ర
యోజనమ్ము నాకు నుండ దయ్య!
పడసిన నిఁక నీవు పంచత్వమును వీని
వలన నర్థ మేమి భ్రాత! చెపుమ 31.

కం. పలుకుచు నుండ మహాత్ముఁ డి
టుల రాముఁడు పురుష వర్యుఁడు శిథిల వచన
మ్ముల నా లక్ష్మణుఁ డప్పుడు
పలుకఁ దొడఁగె నిట్టు లర్థ వంతములు వెసన్ 32.

తే.గీ. మున్ను సత్యపరాక్రమ! మూరి ప్రతిన
సలిపి యిట్లు తెలికగ నసత్త్వు పగిది
పలుక నీ వర్హుఁడవు గాదు పన్నుగఁ బరి
కింప రాఘవేంద్ర యెదఁ జింతింపు నుంత 33.

తే.గీ. వమ్ము సేయరు చేసిన ప్రతిన నేరు
సత్య వచను లెన్నండైన శపథ పాల
నమ్ము పరికింప గొప్పతనమ్మున కిల
లక్షణ మగుఁ గాదె సతమ్ము రాఘవేంద్ర! 34.

ఆ.వె. నర వరేణ్య! యిట్లు నైరాశ్యమును నా కొ 35.

ఱకు నయి నెడఁదఁ బడయకుము రావ
ణుని వధించి సమరమునఁ బరిపాలించు
నీదు ప్రతిన నేఁడు నీరజాక్ష!

ఆ.వె. వాడి దంష్ట్ర లున్న పంచాస్య మడరి గ
ర్జించు చుండ గజము పంచ సేరి
బ్రతుక లేని పగిది రామ! నీ శర గతిఁ
బడి యరి చనలేఁడు ప్రాణములను 36.

కం. దినకరుఁ డస్తాద్రిఁ గనక
మునుపు రఘుకు లాబ్ధి చంద్ర! పూరిత కర్మం
డు నయి దురాత్ముని పౌల
స్త్యుని వధ నేఁ గోరుకొందుఁ దూర్ణముగ నిటన్ 37.

తే.గీ. క్రూరు రావణుని వధింపఁ గోరి తేని
వీర! నీ భాషఁ బాలింపఁ గోరి తేని
నీ రమణ నృప సుతఁ బొందఁ గోరి తేని
యార్య! నా మాట మన్నింపు మడరి నేఁడు 38.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట రెండవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 103.

ఇంద్రుఁడు ధనుర్బాణ శక్తులను రథమును సారథి మాతలితోఁ బంపిన రాముఁడు రథము నధిరోహించి రావణునితో యుద్ధము సేయుట.

కం. విని లక్ష్మ ణోక్త వాక్యము 1.

లను బర వీరఘ్నుఁ డంత రఘు పుంగవుఁ డా
ఘన వీరుఁడు పెస సంధిం
చెను గైకొని కార్ముకము విశిఖ వరములతో

చం. శరములు రావ ణార్థముగ శత్రు చయఘ్నుఁడు రాఘవుండు పే
సె రణము నందు ఘోరములఁ జెన్నుగ నన్య రథమ్ము నూని యా
సుర గణ వల్లభుండు వడి సూర్యుని మార్కొను రాహువో యనం
బరువిడి రావణుండు శిత బాణము లేసెను రాఘ వేంద్రుపై 2.

తే.గీ. రథము నందుండి వేయ వజ్ర నిభ శరము
లద్రి పై ధారలు కురించు నభ్రము వలె
రావణుండు రాముని పైన రాముఁ డగ్ని
నిభ శరమ్ములు వేసె వాని పయిఁ గినిసి 3.

ఉ. రావణుఁ డుండఁ దేరు పయి రాముఁడు నిల్వఁగ నేల పైననున్
భూవరుఁ డెట్లగున్ సమము పో రిట నంచును దేవగాయనుల్
దేవత లింక కిన్నరులు ధీవరు లెల్లరు పల్కుచుండఁగా
దేవ విభుండు వజ్రి విని తియ్యని పల్కులు పిల్చి మాతలిన్ 4.

ఉ. నా రథ మెక్కి భూమి పయినం దగ నిల్చిన ధార్మికోత్తమున్
వీరు రఘూత్తముం గదిసి వేగమ యేఁగి యొనర్పు మాతలీ!
సారథి! దేవతా హితము సక్కఁగ నం చన నాలకించి యా
ధీరుఁడు సేసి వందనము దేవపతిం గని పల్కె నివ్విధిన్ 5.

తే.గీ. శీఘ్ర మేఁగెద దేవేంద్ర! చేయుదుఁ దగ
నేను సారథ్యమును పచ్చని హయములను
గూర్చి స్యందనోత్తమమునఁ గూర్మి తోడ
రామ రావణ భీకర రణము నందు 6.

సీ. అంత పసిడి మయ మంగమ్ము చిఱుగంట లుండ వంద లడరి యుదయ భాను
భంగిఁ జెలఁగుచున్న వైడూర్య మయ కూబరం బుండ సిత చామరముల నడరు
కాంచన భూషిత గంధర్వములు సూర్య సదృశములు హరులు స్వర్ణ వేణు
సద్ధ్వజ మడరంగ శక్ర రథ మడర దానిపై నెక్కి మాతలి సురేంద్రు

ఆ.వె. సారథి యనుపంగ శక్రుండు దివి నుండి
వేగ యవతరించి వీర వర్యుఁ
గదిసి సంభ్రమమునఁ గాకుత్స్థుని నమస్క
రించి పలికె నిట్టు లంచితముగ 7.

కం. మునికోల తోడ స్యందన
మున నిలిచి మొగిడ్చి హస్తములు రామ! సహ
స్రనయనుఁ డిచ్చెను రథమును
మనుజేంద్ర! విజయము కొఱకు మన్నన తోడన్ 8.

ఆ.వె. ఇది మహేంద్రు చాప మిది కవచం బగ్ని
సన్నిభమ్ము సూర్య సదృశ శరము
లివి విమలము తీక్ష్ణ మిది ఘోరతర శక్తి
యింద్ర దత్తము లివి యెలమిఁ గొనుము 9.

ఆ.వె. ఎక్కు మీ రథమ్ము రక్కసు రావణుఁ
జంపు నేను నిలువ సారథిగను
వీర! రాజ వర్య! వేగముగ మహేంద్రుఁ
డాజి దాన వాలి నణఁచి నట్లు 10.

కం. అన నిట్లాతఁడు విని తే
రునకుఁ బ్రదక్షిణము నరవరుఁ డొనర్చి స భ
క్తి నమస్కరించి యెక్కెను
దన తను కాంతుల జగములు తద్ద వెలుఁగఁగన్ 11.

కం. జరిగె గగుర్పొడుచు తుముల
తర రణము మహాభుజుఁ డగు దాశరథికి భూ
వరునకు రక్షో జనపతి
కి రావణున కప్పుడు సెలఁగి కఠోరముగన్ 12.

తే.గీ. అంత గాంధర్వ దైవ నామాస్త్రములు ద
శాన నుండు సంధించి వేయంగఁ గినిసి
మూరి గాంధర్వ దైవాస్త్రములను వేసి 13.

రాముఁ డస్త్ర మేత్త యడంచె రణము నందు

ఉ. ఘోరము రాక్ష సాస్త్రమును గ్రుద్ధుఁడు రావణుఁ డంత రక్కసుం
డా రఘు వీర వర్యుని మహాత్ముని పై విడువంగఁ దిర్గి యా
వీరు దనుస్సు నుండి తగ వెల్వడి శ్రీ యుత సర్పరాసులై
యా రఘు రాము పైకి వెస నాజిని నుర్కెఁ బసిండి బాణముల్ 14.

ఉ. కక్కుచు నోళ్ల మంటలను గాంతి మదాననముల్ వెలుంగఁగా
మిక్కిలి విప్పి యాస్యముల మీఱి భయం బిడ రాఘుపేంద్రుపై
గ్రక్కున దూఁకఁ జొగెఁ బడగల్ గడు వెల్గఁగ నావరించుచున్
దిక్కుల నెల్ల వాసుకి విధిం దమ స్పర్శ సెలంగ సర్పముల్ 15.

కం. కని యా సర్ప సమూహముఁ
జనుదెంచుచు నుండఁ బైకిఁ జయ్యన నంతన్
మనుజేంద్రుఁ డేసెఁ గోప
మ్మున ఘన గారుత్మతాస్త్రమును భయదమ్మున్ 16.

ఉ. పుట్టి నరేంద్రు చాపమున భూరి శరమ్ములు వోల్ప వహ్ను ల
ప్పట్టున నంతఁ గాంచన సుపర్ణులు నై ఫణి కాయ శత్రువుల్
కిట్టి శ రాహి జాలమును గృత్స్న ము ద్రుంచె మహాజవమ్మునుం
బట్టి సుపర్ణ రూపములు బాణవరమ్ములు కామరూపులున్ 17.

కం. ప్రతిహతము కా ని జాస్త్రం
బతి రోషుండై శరౌఘ మంతట రక్షః
పతి కురిసెను ఘోరమ్మును
వితతమ్ముగ దుర్జయ రఘు వీరుని పైనన్ 18.

కం. శర వర సహస్రముల నా
నరేంద్రు నక్లిష్టకారి నలిపెట్టి శిఖుల్
విరివిగ వేయుచు మాతలి
సురేంద్రు సారథినిఁ గొట్టె శూరుం డలుకన్ 19.

తే.గీ. అంత గుఱి సూచి కాంచన మాధ్వజమ్ము 20.

నొక్క యమ్మునఁ బడవైచి చక్క రథము
నుండి యరదము పయి రావణుండు బాణ
నిచయమునఁ గొట్టె నమరేంద్రుని హయములను

తే.గీ. అద్దురాత్ము రావణు కర్మ మట్టు లడరఁ
గాంచి చారణ గంధర్వ సంచయమ్ము
దానవులఁ గూడి మిక్కిలి తల్ల డిల్లె
నుల్లముల నిండఁగ నతిశయిల్లి చింత 21.

తే.గీ. చూచి యార్తుని రాముని శోకమున ము
నింగిరి ఋషులు సిద్ధు లనేక కపులు
రావ ణానుజునిం గూడి రావణుఁ డను
రాహు వడరుచుఁ గబలింప రామ చంద్రు 22.

కం. బుధుఁ డాక్రమించె రోహిణి
విధి దైవతమును హిమకరు ప్రియ నశుభ మొసం
గు ధరా జనుల కని తెలుపు
విధమ్ముగ నపుడు కడింది వింత జనింపన్ 23.

కం. కడలి పొగఁ గూడిన యలల
నడరి జ్వలించెడు విధమున నర్కుని వెసఁ దాఁ
కెడు భంగిని నుప్పొంగెను
గడు రోషం బావహింప గ్రక్కున నంతన్ 24.

కం. అసివర్ణుఁడు సుపరుషుఁడు ది
వసకరుఁ డతి మంద రశ్మి భానుఁ డగపడెన్
దెస నడరి యుండ మొండెము
మసల నపుడు దోఁక చుక్క మరలక చెంతన్ 25.

ఆ.వె. కోసలాధిపతుల కూర్మి నక్షత్రముఁ
దరణి వహ్ని దైవతమ్ముఁ జారు
తర విశాఖ యనెడు తార నంగారకుం
డాక్రమించి నిలిచె నంబరమున 26.

కం. కనిపించె దశగ్రీవుఁడు
తన యిరువది భుజము లెల్లఁ దనరుచు నుండన్
ధనువును ధరింప మైనా
క నగము వలె రావణుండు గంభీరముగన్ 27.

కం. వారితుఁడై రాముఁడు భృశ
మా రాక్షస నాథుచే మహాత్ముఁడు ఘోరం
బౌ రణ భూమిని శరముల
నా రాఘువుఁ డేయఁ జాలఁ డత్తటి నకటా 28.

కం. కనుబొమలు ముడిచి సంర
క్త నయనుఁ డై క్రోధ మూనెఁ గాకుత్స్థుం డం
త నిజాంబకముల నప్పు
ట్టునఁ గాల్చు విధమ్ము రాముఁడు భృశముగ నటన్ 29.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట మూడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 104.

ఆకసమున దేవ గరుడ గంధర్వాదులు చూచు చుండ రామ రావణ ఘోర యుద్ధము కొనసాగుట.

కం. భూతము లెల్లను త్రాసం
బాతత మందె రఘునాథు నాగ్రహ వదనం
బా తఱి వీక్షింపంగన్
భూతల మెల్లఁ జలియించె బోరన నంతన్ 1.

ఆ.వె. సంచలించె సింహ శార్దూల చలిత వృ
క్ష చయ సంయుతమ్ము శైల వరము
సాగరమ్ము గాంచ సంక్షోభి తంబయ్యె
రక్త లోచను గని రాఘవేంద్రు 2.

ఆ.వె. ఖగములు ఘనములు గగన మందు ఖర తర
ఘోష లడర దుశ్శకునము లనఁగ
నెల్లెడలను దల్లడిల్ల నుల్లమ్ములు
తిరుగు చున్న వెల్లఁ దెల్లముగను 3.

కం. కని పరమ రోషు రాఘవు
ని నింక నతి దారుణ మగు నిఖి లోత్పా తా
లిని భీతిలె భూతమ్ములు
ఘన భయ మొదవెను మది దశకంఠున కంతన్ 4.

తే.గీ. భీమ నానాయుధమ్ముల వీర వరులు
పోరఁ బ్రళయ కాల రణము మూరి కనిరి
ఋషులు దేవ గంధర్వ ఫణీంద్ర దైత్య
దానవులు విమానముల నభాన గరుడి 5.

కం. పలికిరి సు రాసురు లపుడు
కలహించుచు నొండొరులను గయ్యి మరయుచుం
జెలరేఁగ భక్తి హర్ష
మ్ములు భృశముగ నంత డెందముల నిబ్బంగిన్ 6.

తే.గీ. చక్క నిలిచి యసురు లెల్ల జయము నందు
నాజి దశవక్త్రుఁ డని పల్క నపుడు సురలు
నీవు నెగ్గుమ రాఘవ! నెమ్మి ననుచు
మాటి మాటికిఁ బల్కిరి మాట లిట్లు 7.

ఉ. కోపము చేత రాము నెడఁ గ్రూరుఁడు దుష్టుఁడు రాక్షసేంద్రుఁ డా
టోపమునన్ గ్రహించెను బటుత్వపు టాయుధ మంతలోన య 8.

ద్రూపము శృంగ సన్నిభమొ తూర్ణము దానిని ఘోర నాదముం
జూపఱ కార్తి నిచ్చు శిత శూలము రౌద్రము వజ్రసారమున్

తే.గీ. శత్రు చయ నాశమును ధూమ సహిత వహ్ని
నిభ శిఖిని రౌద్రమును యమునికి దురాస
దమ్ము భూత సంచయ భయదమ్ము దార
ణమ్ము భేదనమ్ము నిజ కరమ్మునఁ గొనె 9.

ఆ.వె. మండు నట్టు లున్న మహిత శూలమ్మును
మధ్యఁ బట్టె నయ్యమర రిపుండు
సమర శూర వరులు చక్కఁ దనను జుట్టి
యుండఁగా ననేకు లుగ్రుఁ డడరి 10.

ఉ. ఎత్తి మహాశరీరుఁ డసురేంద్రుఁడు శూలము భైరవమ్ముగా
నత్తఱి నార్చె రక్తకలితాక్షుఁడు హర్షము నంద రాక్షసుల్
మొత్తము భూమి యాకసము మూలలు దిక్కులు పిక్కటిల్లఁగాఁ
గ్రొత్తగఁ గంప మందినవి ఘోర తరమ్ముగ వాని గర్జకున్ 11.

కం. అతి దుష్టాత్ముని రావణు
నతి నాదుని నాదము విని యఖి లావని భూ
త తతి భయపడె భృశముగ వి
తతముగ క్షోభించెఁ గడలి ధ్వానం బడరన్ 12.

చం. పలికెను రాక్షసాధిపుఁడు పన్నుగ శూలము నెత్తి యిట్లు దో
ర్బల గత ఘోర దర్పితుఁడు భాతృ సహాయుఁడ! చూడు శూలమున్
సలలిత వజ్రసారము భృశమ్ముగ నేఁ డిది నీదు ప్రాణముల్
కలనునఁ దీయు వేగ దశకంఠ మహోగ్ర కరచ్యుతమ్మునై 13.

తే.గీ. నిన్ను జంపి రణశ్లాఘి! నే నొనర్తు
నేఁడు సేనా ముఖమ్మున నిన్ను నసుర
శూరులకు రణ హతులకుఁ జూడు బలిమి
నెల్లరకు సమానునిగను గల్ల కాదు 14.

కం. నిలు రాఘువ! యీ శూలము
న లీలఁ జంపుదు నిను వచనము లిట్లని తా
బలమున విసరెను శూలము
ఖలుఁ డా రాక్షస విభుండు కాకుత్స్థునిపై 15.

ఆ.వె. రావణ కర ముక్త రౌద్ర శూల మశని
ప్రభల గంట లుండ రంజిలుచు నె
నిమిది ఘోరము లగు నిస్వనమ్ములఁ జేరి
విన్ను నంచితముగ వెల్గె నపుడు 16.

శా. శూలమ్ముం గని రాఘువుండు వెస రక్షోనాథ ముక్తమ్ము నా
భీ లాగ్రమ్మును మండు చుండఁగను నా వీరుండు ఘోరమ్మునున్
మేలౌ వింటిని వంచి బాణ తతినిం బెల్లేసె వారింపఁగా
నాలం బందు యుగాంత వహ్ని హరి నీరౌఘుమ్మునన్ భంగినిన్ 17.

తే.గీ. రామ కర ముక్త మార్గణ రాశి నెల్ల
రావణుని మహా శూలము రణమున దహి
యించె శీఘ్రముగఁ బతంగ సంచయమ్ము
నగ్ని చెలరేఁగి వెసఁ గాల్చు నట్టు లంత 18.

కం. కని యా శరముల శూల
మ్మునఁ బొడి యయి మాఱ నంత బూడిదగ నభ
మ్మున రాముఁ డూనెఁ గోప
మ్ము నెదఁ బ్రళయ కాల రుద్రుఁ బోలె రణమునన్ 19.

తే.గీ. అతఁడు మాతలి తెచ్చిన యమర నాథ
సమ్మతమ్మును శక్తిఁ గ్రోధమ్ము మీఱఁ
గదలుప వెలిఁగించె నది నాకసము గంట
ల ధ్వను లడర యుగాం తోల్కల వలెఁ బ్రభల 20.

ఆ.వె. విసర శక్తి నట్లు వీరుఁడు రాఘువుఁ
డసుర విభుని శూల మందుఁ బడెను
బడఁగ శక్తి శూల వరము భగ్న మయి కాం 21.

తు లణఁగ ధరఁ గూలె దొర్లు చుండి

చం. శరముల వేగ వంతములఁ జంపెను రావణు ఘోటకమ్ములన్
గురుతర వేగ వాజులను ఘోర శితాలి నజిహ్మగమ్ములన్
శరములు రాక్షసేశ్వరు విశాలపు ఱొమ్మున నాటి పెక్కు లం
త రఘు వరుండు ఫాలమున దారుణ పత్రులు నాటె మూడిటిన్ 22.

తే.గీ. బాణ భిన్నావయవ తప్త వపుఁడు రక్త
సిక్త స్వీయేంద్రియుఁడు ప్రకాశించె వృక్ష
సంచయస్థ ఫుల్లాశోక సాల భంగి
రాక్షసేశ్వరుం డాజిని రావణుండు 23.

కం. రామ శ రార్త ని జాంగుఁడు
భీమ నిశాచరుఁడు రక్త ఫేనార్ద్రుఁడు దుః
ఖామేయక్రోధమ్ముల
నా మనుజాశనుల మధ్య నందె నెడందన్ 24.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట నాలుగవ సర్గము.

# యుద్ధ కాండము
## సర్గము 105.

మహోగ్రుండైన రాముఁడు జనస్థానమున సీతాపహరణము కుత్సిత కర్మ మొనరించి నందులకు నిందించి శస్త్రాస్త్రముల మిక్కిలి బాధింప నలసి నిశ్చేష్టుఁడై యుండ రావణుని సారథి రావణుని సమర తలము నుండి గొనిపోవుట.

కం. కినిసిన కాకుత్స్థునిచే
ననిలో ఘో రార్దితుఁ డయి యధికక్రోధ 1.

మ్మను సమరశ్లాఘి దశా
ననుండు రావణుఁ డెడంద నైర్ఋతుఁ డూనెన్

చం. కను లవి కిన్క నెఱ్ఱఁ బడఁ గార్ముక మూని దశాననుండు రా
ముని రణ మందు నింపి పెయి ముల్కుల ధారను నింగి నున్న యా
ఘన మది తోయ ధారలను గ్రన్నన దొర్వను నింపు భంగినిన్
మనుజ వరేణ్యు వీరు సుర మాన్యుఁ గలంచెను మిక్కుటమ్ముగన్ 2.

ఆ.వె. పోరున శర పంక్తిఁ బూరింపఁ బడియు ధ
నుర్వరచ్యుతములను గదలింప
రాని శైల మనఁగ రాముఁడు కంపింప
నేరఁ డింత యేని వీర వరుఁడు 3.

కం. నిలిచి సమర మందు మహా
బలుండు కాకుత్స్థుఁ డడరి వారించె శర
మ్ములఁ బఱిపి బాణ జాలము
ములికలను దినేశు కిరణము లన సహించెన్ 4.

కం. శరములు సహస్రములు పే
సె రాముని యురమ్ము నందు క్షిప్ర కరుం డై
న రణశ్లాఘి దశాస్యుం
డు రావణుండు ఘన రోషుఁడు నిశాటుఁ డనిన్ 5.

ఆ.వె. రణము నందుఁ దడిసి రక్త మందు భృశము
లక్ష్మణాగ్రజుం డరణ్య మందుఁ
బూసి నట్టి గొప్ప మోదుగు చెట్టు వో
లె నగపడె ఘనుండు మనుజ విభుఁడు 6.

మ. శర జాలార్త సుసంభ్రమమ్మునఁ గొనెన్ శల్యాలిఁ గాకుత్స్థుఁ డా
నర శార్దూలుఁడు కల్ప భాస్కర సమానద్యోత తేజస్వి యి
ర్వురు యుద్ధమ్మున రామ రావణులు వీరుల్ మార్గణధ్వాంత మం
దరయం జాలరె యొక్కరొక్కరిని బాణౌఘమ్ము లేపారఁగా 7.

కం. అంతం గ్రోధావిష్ట ని
జాంతఃకరణుండు నగుచు నాతని రక్షః
కాంతుఁ గని రాముఁడు పరుష
వంత వచనములు వచించెఁ బన్నుగ నిట్లున్ 8.

ఉ. నే నెఱుఁగంగ రాని గతి నీచుఁడ నా సతిఁ దెచ్చితే జన
స్థానము నుండి యా వివశ జానకి వీరుఁడ పెట్టు లౌదుపే
దీనను నుండ నయ్యటవి దేవిని భర్తృ విదూరనే బలం
బూని కొనంగ శూరునిగ నుద్ధతి నెంతువె రాక్ష సాధమా! 9.

ఆ.వె. స్త్రీల యందు నింక దీన లనాథ లం
దకట కాపురుషులు నధము లొనరు
చు పనిఁ జేసి నేను శూరుఁడ నని పర
దార హర్త! శూర! తలఁతె నీవు 10.

ఆ.వె. కట్టుపాట్ల నణఁచి పెట్టి చని చెడు దా
రిఁ ద్యజియించి సిగ్గు రిత్త మృత్యు
వుఁ గొని సరస నుంచి తగ శూరుఁడను నే న
ని మది నకట తలఁతె నిన్ను నీవు 11.

తే.గీ. చేయఁబడె గొప్ప కార్య మమేయ యశము
నిచ్చు శ్లాఘనీయమ్ము నహీన మైన
యట్టిది ధనదు భ్రాతచే నసుర సైన్య
మున్న నీ చేత శూరుచే మిన్నగాను 12.

ఆ.వె. నింద్య మహిత మైన నీ చేత గర్వము
న నొనరింపఁ బడ్డ పనికి గొప్ప
ఫలము నేఁడు నీవు పన్నుగఁ బొందుమ
తప్ప కిప్పు డింకఁ ద్వరిత గతిని 13.

ఆ.వె. నేను శూరుఁడ నని నిన్ను నీవు తలంచు
చుందు వెడఁద నెపుడు చోద్యముగను
దొంగ వోలె సీత దొంగిలించితి వీవు 14.

లేదు సిగ్గు నీకు నో దురాత్మ!

కం. నా సన్నిధి నీ చే సీ
తా సతి యవమాన మంది తపియించినచో
నా సాయకముల నిహతుఁడ
వై సోదరుఁ గాంచు వాఁడ వౌదువు ఖరునిన్ 15.

ఆ.వె. దైవ వశము చేత నీ విట్లు నా కంటఁ
బడితి దుష్ట చిత్త! పంపు వాఁడ
నేఁడు శరము లేసి నిన్ను దీక్ష్ణమ్ములు
యముని యింటికి నసురాధమ! నిలు 16.

తే.గీ. ఈడ్చుఁ గ్రవ్యాదము లడరి యిపుడు కుండ
లమ్ముల వెలుంగు నీదు శిరమ్ము నాదు
వాడి శరముల ఛిన్నమై పడఁగ దుమ్ము
లోన దొర్లంగ రణభూమి నానఁ గోరి 17.

ఆ.వె. నేలఁ గూల నీవు వ్రాలి గృధ్రమ్ములు
నీదు ఱొమ్ము పైన నాదు బాణ
శల్య సంచయమున స్రవియించు నీ రుధి
రమ్ముఁ ద్రాఁగుఁ గాక నెమ్మి నేఁడు 18.

తే.గీ. మచ్చరాలి భిన్నాంగునిఁ దుచ్ఛు విగత
జీవునిఁ బతితుఁ బక్షులు సేరి లాగు
గాక ప్రేవుల నెల్లను గరుడి సర్ప
ములను జెలరేఁగి లాగు నట్టుల నడరుచు 19.

చం. పలుకుచు నిట్లు రాఘవుఁడు వైరి చయఘ్నుఁడు చెంత నున్న యా
ఖలు నసు రేంద్రు ముంచె విశిఖమ్ముల వర్షము నందుఁ గ్రుద్ధతం
గలనునఁ గోర వైరి దశకంఠ వధమ్మును వీర్య విక్రమ
మ్ములు ముద మస్త్ర రాశి బలమున్ ద్విగుణమ్ములు నయ్యె నత్తఱిన్ 20.

కం. స్ఫురియించె మహాస్త్రమ్ములు 21.

విరిసె నెడఁద సంతసమ్ము విదితాత్మునకున్
గురు తేజస్వికిఁ బెరిఁగెను
గర లాఘువ మత్యధికము కాకుత్స్థునకున్

కం. తన లోని శుభ నిమిత్తము
ల నెఱిఁగి యసురాంతకుండు రాముం డంతన్
ఘనముగఁ బీడించెఁ దిరిగి
మనుజేంద్రుఁడు రావణుని సమరతల మందున్ 22.

తే.గీ. హరి వరుల శిలావర్ష మడరఁగ రామ
బాణ వర్షము మీఱ రావణుఁడు పీడి
తుండునై విచలిత హృదయుండు నయ్యె
భృశతరము దశగ్రీవుండు వీర వరుఁడు 23.

ఆ.వె. అంతరాత్మ సెంద వ్యాకులం బప్పుడు
శస్త్ర వరము లేయఁ జాలకుండెఁ
జాప వరము నైన సంధింపఁ జాలండు
ప్రతిఘటింపఁ డతఁడు రామ బలము 24.

ఆ.వె. కదియ నంత మృత్యు కాలము రాక్షస
విభుఁడు వేగ మడర విసరి నట్టి
శరము లైన వివిధ శస్త్రమ్ము లైన ర
ణార్థము నట రిత్త లయ్యె నెల్ల 25.

కం. అసురేంద్రు నవస్థను గాం
చి సూతుఁ డరదంపు నేత సెందక తడబా
టిసుమంతయు మెల్లగఁ రథ
ము సమరమున కపుడు దూరముగఁ గొనిపోయెన్ 26.

కం. గత వీర్యునిం బరాజయుఁ
బతినిం గని సారథి పెస వారిద నిభ వి
స్తృత రవ రథమును గొని చనె
నతి భీతి మరల్చి వీడి యంకము నంతన్ 27.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యేనవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 106.

యుద్ధభూమి నుండి తొలఁగఁ జేసిన తన సారథిని రావణుఁడు నిందింపఁ దా నట్లొనరించుటకుఁ దగిన కారణముల నాతఁడు వివరింపఁ దృప్తిల్లి దశాననుండు సమరావనికిఁ గొనిపొమ్మని యాజ్ఞ నొసఁగ సారథి యట్లొనర్చుట.

కం. మోహ వశమ్మునఁ గ్రుద్ధుం
డాహవమును వీడి నట్టి యా సారథితో
నోహటిలఁ గాలచోదితుఁ
డై హేయ వచనము లనె దశాననుఁ డిటులన్ 1.

చం. సమరము నందు నన్నిటు లశక్తుని వీర్య విహీను భంగిఁ తే
జ మకట లేని వాని వలె జంకిన భీరుని వోలె మాయ లె
ల్ల మఱచి నట్టి వాని వలె రావణుఁ బౌరుష హీను భంగి నీ
వు మసలి స్వీయ బుద్ధినిఁ గుబుద్ధి! కరమ్ము పరాభవించితే 2.

తే.గీ. అస్త్ర హీను నట్టుల నేల యరదము గొని
పోవఁ బడెను నీ చే శత్రువు లరయంగ
నన్ను నవమానపఱచియు నన్నడుగక
యిట్టు లక్కట కారణ మెద్ది చెపుమ 3.

కం. చిర కాలార్జిత కీర్తియుఁ
బరాక్రమము నమ్మకమ్ము ప్రభయు లయము ల
య్యె రయమున నీ వలన నో 4.

దురాత్మ! సారథ్య మూన దుష్కార్యమునన్

ఆ.వె. పరమ యుద్ధ లుబ్ధుఁ బ్రఖ్యాత శత్రువు
స్వీయ విక్రమమున విరివి ముదము
నొసఁగు వాఁ డరయుచు నుండ నీచ పురుషుఁ
జేసి తీవు నన్ను వాసి యణఁగ 5.

తే.గీ. దుష్ట! రథము మోహమ్ముచే దూరము గొని
పోక యున్నచో నీ విట్లు పోరు నుండి
సత్యముగ నెంతు సత్కార మత్యధికము
నంది తీవు పరుల చేత నంచు నాత్మ 6.

ఉ. నీ వొనరించి నట్టి పని నింద్యము శత్రులు సేయు కార్యమే
యే వర మిత్రు లివ్విధము నెన్నఁడు సేయఁ దలంప రెన్నఁగన్
నీవు మదీయ సన్నిధిని నెమ్మి స్మరించిన నాగుణమ్ములన్
నీ వరదమ్ముఁ దోలు వడినిం బరుఁ డేఁగక మున్న సారథీ! 7.

కం. పరుషమ్ముగ దుర్బుద్ధి య
గు రావణుఁ డనంగ నిట్లు కోపం బడరం
గరము హిత బుద్ధి సారథి
గిరల ననునయముగ నిట్లు కేల్మోడ్చి యనెన్ 8.

ఉ. భీతుఁడఁ గాను గానె యవివేకిని శత్రుల విత్తముం గొనం
బ్రీతిని వీడ లేదె యొనరించిన సత్క్రియలం దలంతు నే
నే తఱి మత్తులో నిలువ నీ హిత మప్రియ మేను జేసి నీ
యాతత కీర్తిఁ బెంచితిని యాత్మ ప్రసన్నము గాఁగ మైత్రిచే 9.

ఉ. దోషిగ నన్ననార్యునిగఁ ద్రోల రథమ్ము రణమ్మునం బ్రభూ
రోషము నూని చూడకుమ క్రూరుఁడు నల్పుఁ డటంచు నీవు నా
భాషల నాల కింపు మిటఁ బల్కెద నేఁగిన కారణమ్ము లా
ఘోష నదీ రయం బరయ గుట్టల వీడఁ బెరుంగు భంగినిన్ 10.

తే.గీ. నేరితిని గొప్ప రణ మందు నీదు శ్రమను 11.

వీర్యమున సుముఖత్వము కార్య మందుఁ
గాంచ కుంటి నీ యాధిక్య మించు కేని
లాగ రథము గుఱ్ఱమ్ము లలసిన వెల్ల

ఆ.వె. తేరి భార మూని వారువములు భగ్న
ము లయినవి రణమున నలసి యుండె
వేఁడిమికి నితాంత వృష్టి హతము లైన
గోవుల వలె నపుడు ఘోరముగను 12.

తే.గీ. ఏ నిమిత్తము లిట నుద్భవించె నధిక
ముగ విచారింప నవి యెల్లఁ బోరు నందు
మనకుఁ బ్రతికూల రీతినిఁ గనుల కగప
డినవి తెల్లముగ నసురేంద్ర! నిజ మెంచ 13.

తే.గీ. దేశ కాలమ్ము లింక రథికుని వదన
మందు భావ లక్షణముల నరయ వలయు
హర్ష ఖేదమ్ములు బల దైన్యములు నేర
వలె మహా బల! సారథి కలహ మందు 14.

ఆ.వె. పుడమి సెత్తు పల్లములు సమ విషమమ్ము
లెల్ల నేర వలయుఁ దెల్లముగను
యుద్ధ కాలముల సముచిత రీతి నెఱిఁగి
పగల లోపముల నెఱుఁగ వలయును 15.

తే.గీ. కదియుట చనుట దూరము కయ్య మందు
మరలుటయు మున్నగున వెల్ల నరద మందు
నున్న రథ కుటుంబులు నేర నొప్పు రాక్ష
సేంద్ర! సముచిత రీతిని నింక వినుమ 16.

కం. తగు విశ్రాంతిని నీకు నొ
సఁగ సమ రాశ్వమ్ముల యలసట రౌద్రము నె
ల్లఁ గని తొలగింప వేగ
మ్ముగ నొప్పిదపుఁ బనిఁ జేయఁ బూనితి హితమున్ 17.

కం. మరలింప లే దధిప! నే
ను రథమ్ము నిజేచ్ఛతో వినుమ నిజ పతిపైఁ
గర మడర నెడఁద స్నేహము
త్వరపడి యిట్టు లొనరింప వలసె రణమునన్ 18.

తే.గీ. ఆన తిమ్మరిసూదన! నే నొనర్తు
నీవు వచియించి నట్టుల నీదు ఋణము
తీఱు తీరున నీ యానతిని వహించి
యొదలను రాక్షసేశ్వర! యంచితముగ 19.

కం. అన విని సంతుష్టుండై
తన సారథి పల్కుల నెడఁదం గడు వచియిం
చెను యుద్ధ లుబ్ధుఁడు దశా
ననుఁడు ప్రశంసించి భాషణమ్ముల నిట్లున్ 20.

కం. తేరును జేర్పుమ శీఘ్రము
గా రాముని చెంత కింకఁ గయ్యము నందుం
దా రిపులను వధియింపక
యీ రావణుఁడు మరలఁడు వహించి చలమ్మున్ 21.

ఆ.వె. రావణుండు పలికి రంజిల్లి యిట్లొసం
గెఁ దన సూతున కటఁ గేల నున్న
యుత్త మాభరణము నొక్కటి నంత మ
రల్చె రథము నతఁడు రావణు విని 22.

కం. రావణ చోదితుఁడు నడపె
నా వారువముల రయముగ నా సారథి పే
రావణుని మహా రథము మ
హా వీరుని రాము స్యంద నాగ్రముఁ గదిసెన్ 23.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యాఱవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 107.

యుద్ధమును వీక్షింప దేవతలను గూడి బ్రహ్మర్షి భగవంతుఁ డగస్త్యుఁడు రాముని చెంతకు వచ్చి యుద్ధమున గెలుపు నందుటకునై యాదిత్య హృదయమును రామున కుపదేశించుట.

చం. పరమ మునీంద్రుఁ డప్డు భగవంతుఁ డగస్త్యుఁడు గాంచ యుద్ధమున్
సురలను గూడి వచ్చి రఘు శూరుని రామునిఁ గ్లేశ మంద సం
గరమున రావణుం డలసి కయ్యము సేయఁగ రాఁగఁ దిర్గి చూ
చి రఘు వరుండు నిల్వగను జింతను జేరి వచించె నిట్టులన్ 1.

తే.గీ. రామ! రామ! మహాబాహు! రమ్యమును ర
హస్యమును సనాతనమును నైన దాని
వత్స! దేని వలన రిపు వ్రాతమును జ
యింప నగును దాని వినుమ యింపు గొలుప 2.

తే.గీ. నిరత మాదిత్యహృదయము నీ వడరి జ
పింప వలయు శత్రువుల వధింప నొప్పు
దాని నఘములను హరించు దాని నక్ష
యమును బరమ శివమును బుణ్యము జయదము 3.

తే.గీ. మంగళమ్ముల కెల్లను మంగళమ్ము
సర్వ పాప వినాశము సర్వ దుఃఖ
భగ్న హేతువు నాయుర్వివర్ధనమ్ము
పరమ మాదిత్య హృదయమ్ము నరవరేణ్య! 4.

తే.గీ. రామ! పూజింపు ముద్యితు రశ్మి మంతు 5.

నిర్జ రాసుర వందితు నిఖిల లోక
పతిని నా వివస్వంతు నా భాస్క రాఖ్యు
సకల దేవాత్మకునిఁ బ్రభాశాలి రవిని

కం. ఈతఁడు దే వాసుర తతి
నాతతముగ జగతిఁ గాచు నంశుల నిత్యం
బీతండె బ్రహ్మ విష్ణువు
నీతఁడె శివ వరుణ గుహులు నీతఁడె యముఁడున్ 6.

కం. ఈతఁడె ప్రజాపతి ధనదుఁ
డీతండె మహేంద్రుఁ డీతఁ డీతఁడె కాలుం
డీతఁడె సోముండు పితరు
లీతండె వసువులు నీతఁ డీతఁడె సాధ్యుల్ 7.

కం. ఈతఁడె మరుత్తు లశ్వియు
లీతఁడె మను వీతఁ డగ్ని యీతఁడె యనిలుం
డీతఁడె ప్రజ లితఁడె ప్రభల
దాత యసువులు ఋతు కర్త ధర నీతండే 8.

తే.గీ. సూర్యుఁ డాదిత్యుఁడు ఖగుఁడు సురభి నిభుఁడు
భానువు గభస్తి పూషుఁడు పసిడి వీర్యుఁ
డు దివసకరుఁడును సవితృఁడు హరి దశ్వుఁ
డును సహస్రార్చి సప్తాశ్వుఁడు సకిరణుఁడు 9.

చం. తిమిర హరుండు శంభుఁడు నతీత మరీచియుఁ ద్వష్ట యీ మహం
డము జనియించు వాఁడు ధర డయ్య మహా తపనుం డహస్కరుం
డమరు హిరణ్య కుక్షిగ మహా శిశిరఘ్నుఁడు నగ్నికుక్షి త
ప్త మనుజ కోటికిన్ శిశిర దత్తుఁడు శంఖుఁడు నాదితేయుఁడున్ 10.

తే.గీ. భాస్కరుఁడు రవి యాకాశ భర్త గగన
గామి ఋగ్యజు సామ వే దామిత నిపు
ణుఁడు తమో భేది తద్వరుణు సుహృదుండు
నాతప యుతుండు ఘన వృష్టి యర్కవంశ! 11.

తే.గీ. మండలి కవి శత్రు వనురక్తుండు పింగ
ళుండు మృత్యు వఖిల తాపనుండు విశ్వుఁ
డుగ్ర తేజస్వి సర్వభ వోద్భవుండు
వరుఁడు గ్రహ తారలకు విశ్వ భావనుండు 12.

కం. తేజస్వుల నెల్ల మహా
తేజస్వివి ద్వాదశాత్మ! దివ్యాంగా! నీ
వీ జగముల నెల్లం గన
నోజ నమస్సు లగు నీకు నున్నత భక్తిన్ 13.

తే.గీ. వందనములు పూర్వాద్రికి వందనములు
పశ్చి మాగమమున కహర్పతికి వంద
నములు జ్యోతిర్గణావలి నాథున కిల
వందనములు సమర్పింపఁ బడును గాక 14.

కం. జయ మిడు వానికి భద్రము
జయము లొసఁగు వానికి దివసకరునకు సహ
స్ర యుగాక్షున కాదిత్యున
కయి హర్యశ్వ విలసితున కయి వందనముల్ 15.

కం. ప్రణతులు శత్రూగ్రునకును
బ్రణతులు సారంగునకును బ్రణతులు సునభో
మణికిని మార్తాండునకును
బ్రణామము ప్రచండునకును బద్మసఖునకున్ 16.

తే.గీ. నలిన జేశాన నారయణస్వరూపు
నకును నాదిత్య వర్చస్సునకును సూర్యు
నకును భాస్వంతునకు రౌద్రునకును సర్వ
భక్షకునకు నమస్కార మక్షయముగ 17.

తే.గీ. ఆ తమోఘ్న హిమఘ్న ద్విషావళిఘ్ను
నకుఁ గృతఘ్న ఘ్ననకును ఘన తర హృదయు 18.

నకును జ్యోతిర్పతికి దేవునకును భక్తి
సంయు తాంచిత వందన సంచయములు

తే.గీ. తప్త చామీక రాభ శుద్ధచ్ఛవి విల
సితునకు హరున కవనిపైఁ జీఁకటిఁ దొలఁ
గించు వానికి లోకసాక్షికిఁ బ్రకాశ
కెలమి విశ్వకర్మునకు నతులు సభక్తి 19.

తే.గీ. భూతములను సృష్టించు విభుం డితండు
లయ మొనర్చు నితండు కిరణములం ద
పించు నెండించు నింక వర్షించుచుండు
దినకరుండు లోకమ్మునఁ దనరి భృశము 20.

తే.గీ. నిలిచి యితఁడ భూతము లందు నిద్ర నున్న
నవి మెలఁకువగ నుండుఁ దా ననవరతము
నగ్ని హోత్రుఁడు నీతఁడె యగ్ని హోత్రు
ల ఫలము నయి యితఁడు తనరారుచుండు 21.

కం. క్రతువులు క్రతు ఫలములు దే
వత లీతండె పరికింపఁ బరమంపు విభుం
డితఁడు జగం బందున్న వి
తత కార్యమ్ములకు నెల్లఁ దర్కింపంగన్ 22.

ఆ.వె. ఆపద సమయమ్ము లందు దుఃఖమ్ముల
భయము లందు ఘోర వనము లందు
నార్తి నే పురుషుఁడు కీర్తించు నీతని
నాతఁడు రఘువర!లయమ్ము కాఁడు 23.

ఆ.వె. దేవు నీ జగత్పతిని రామ! యేకాగ్ర
చిత్త మూని తగ భజింపు మూడు
మారులు జపియింప మంత్రమ్మును జయింతు
వీవు సమర మందు భూవరుండ! 24.

కం. రావణు నీ క్షణ మందునె
నీవు వధింతువు రణమున నీరజ నేత్రా!
యీ వాక్కు లని యగస్త్యుఁడు
దా వెడలెను వచ్చి నట్లు తాపసుఁ డంతన్ 25.

ఆ.వె. నష్ట శోకుఁ డయ్యె నరవరేణ్యుఁడు విని
యధిక తేజుఁ డంత నాత్మఁ దలఁచి
నిశ్చలమతి వూనె నెమ్మి జపించి ము
మ్మారు లాచమించి యా రవిఁ గని 26.

తే.గీ. శుచి యయి ధనువు నూని సురుచిర మంత
రావణు నరసి పడసి హర్షమ్ము సమర
మెంచి దరి సేరె వధియింప నెంచి సర్వ
యత్నముల రాముఁ డంత దృ ఢాత్ముఁ డయ్యె 27.

కం. మురియుచును రవి వచించెను
ద్వరపడు మని రామునిఁ గని ప్రమదాత్ముండై
సుర గణముల మధ్య నిలిచి
యరసి దశాస్యుని క్షయమ్ము నాదిత్యుఁ డటన్ 28.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యేడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 108.

రావణుని రథమును గాంచి రాముఁడు మాతలికిఁ దగు కర్తవ్యమును దెలిపి రథమును రావణుని దెస కరుగు మని నుడువ నంత రావణుని పరాజయము రాముని జయమును సూచించు నిమిత్తము లుద్భవించుట.

ఉ. సారథి సంతసించి యెద శత్రు చమూ భయదమ్ము మూర నా
కారము నందు దేవ వర గాయన పట్టణ భంగి ఘోర ర
క్షో రథముం బతాక యుత శుద్ధ సువర్ణ తురంగ యుక్తమున్
మూరఁగ యుద్ధ సాధన సమూహము సధ్వజ రాజితమ్మునున్ 1.

ఉ. తోలెను నింగి మ్రింగు విధిఁ దోరము భూమి ధ్వనించు భంగినిం
గ్రాలఁగ శత్రు సైన్య మట రాక్షస సైన్యము సంతసింపఁగా
నాలము నందు వేగముగ నాసుర వర్యుని సూతుఁ డాత్మలో
మే లొనరింపఁ గౌతుక సమేతుఁడు క్షిప్రము రావ ణాజ్ఞతో 2.

మ. కనె నా రాముఁడు మాన వేశ్వరుఁడు రక్షః కాంతు తార్క్ష్యమ్మునుం
దన పై కత్తిటి వచ్చు చుండఁగను సద్ధ్వానమ్ముతో మూరుచున్
ఘన కాలాశ్వ చయోక్తమై తనరగం గాంతుల్ మహా రౌద్ర భం
గిని సూర్యాభమునౌ విమాన మన నింగిన్ పెల్ల వర్చస్సులన్ 3.

తే.గీ. మెఱపుల వలె టెక్కెమ్ములు మెఱయ నింద్ర
చాపమును బోలు ప్రభల సంచయము లడర
బాణ ధారల విడుచుచు వారి దాంబు
ధారల పగిది నరద మేతేరు చుండ 4.

తే.గీ. వజ్ర హత గిరి ధ్వనిఁ బోలు స్వనము లడర
మేఘు సన్నిభ రథమును రాఘవుండు
సూచి వచ్చుచుండఁగ ధనుస్సు నట వంచి
బాలశశి భంగి వేగమ పలికె నిట్లు 5.

ఆ.వె. ఇంద్రు సారథిని నరేంద్రుఁడు వీక్షించి
మాతలి! యని కితఁడు మరల వచ్చు
చుండఁ దొందరగను జూడుమ యపసవ్య
ముగను దనదు మరణము కొఱ కనఁగ 6.

కం. కనుక నిలుమ భద్రమ్ముగఁ
గొని పొమ్మరి స్యందనమునకు నెదురుగన్ నే 7.

ననిలం బుత్థిత మేఘ
మ్మును భంగిని గోరుదు లయము నొనర్పంగన్

ఆ.వె. భయ మెడంద వీడి పడక తొందర యిసు
మంత సూపుల సెద వంత నంద
కుండఁ గళ్లెములను గుదురుగఁ బట్టి తే
రిని ద్రుతముగ నడపు మనిని నార్య! 8.

తే.గీ. చాలు నీ కింక నేఁ జెప్ప నేల యిటుల
నింద్ర రథమున కుచితుఁడ వీవు భృశము
సమర మేకాగ్ర చిత్తతఁ జలుపఁ గోరి
గుర్తు సేయుదు నేర్పంగఁ గోర నేను 9.

కం. పరితుష్టుం డయి రాముని
గిరల నమర సారథి నిజ కేలీ లీలన్
దుర మందు నడపె మాతలి
యరదము సత్తముఁడు ప్రీతి యాత్మఁ జెలంగన్ 10.

ఉ. స్యందన మంతఁ జేయ నపసవ్యము రావణు గొప్ప తేరికిం
జింద రజమ్ము చక్రజము చెన్నుగఁ గప్పె దశాస్యు నాజినిన్
డెందము నిండఁ గిన్కను వడిన్ రుధిరాక్షుఁడు రావణుండు వే
యిందు నిభాస్యు నొంచెను నరేంద్రుని రాముని సాయకమ్ములన్ 11.

ఉ. కోపము నీయ ధర్షణము ఘోర తరమ్ముగ నూని ధైర్యమున్
భూప వరేణ్యుఁ డందె జవమున్ దివిజేంద్రు ధనుస్సు రాఘువుం
డేపున వేగ వంతముల నింపుగ భాస్కర రశ్మి తుల్యముల్
దూపులఁ దా గ్రహింప వెస దుర్భర మయ్యెఁ బరస్ప రాంకమే 12.

తే.గీ. వైరు లన్యోన్యము వధింపఁ గోరు చుండి
యభిముఖు లయి యయ్యిర్వురు నలయ కుండ
మత్త సింహద్వయము భంగి నత్తఱిఁ దల
పడుచు నుండఁ దుముల మయ్యెఁ గడు రణమ్ము 13.

తే.గీ. రావణక్షయమ్ముగను గోరు దేవ సిద్ధ
గణ మహర్షి గంధర్వ నికాయ మపుడు
సేరె రథిక ద్వయ మడరి చేయు సంగ
రమ్ము వీక్షింపఁగఁ గుతూహలమ్ముతోడ 14.

ఆ.వె. పొడమిన వట శకునములు దారుణమ్ములు
రోమ హర్షణము లురువుగ నంత
రావణాసురుని విలయము రాముని విజ
యమ్ముగను దెలుపెడు విధమ్ము దోఁప 15.

కం. కురిసెను బర్జన్యుండు రు
ధిర వర్షము రాక్షసేంద్రు తేరు పయి ననిం
దిరుగుచు నపసవ్యమ్ముగ
గిరగిర గుండ్రమ్ముగ వణఁకించెను గాలుల్ 16.

కం. విరివిగ వడి వడి నెగురుచుఁ
దిరుగాడెడు గ్రద్ద లసురు తే రే దెసలం
దిరిగిన నా యా దిక్కుల
కరుగుచు నున్న వరయంగ గములై నింగిన్ 17.

ఆ.వె. సంధ్య యలము కొనిన సమయమం దా లంక
కనఁబడెను జపా సుమ నిభము దిన
మందుఁ గూడ మండు నట్లధికమ్ముగ
నెల్లెడలను వింత నెట్టగాను 18.

తే.గీ. రాలెఁ బిడుగులఁ గూడి యుల్కలు మహోస్వ
నమ్ము లప్పుడు రావణునకు నహితము
లెల్లఁ గలిగించుచు విషాద మెల్ల రక్క
సులకు నెదల మిక్కుటముగఁ జోద్యముగను 19.

తే.గీ. రావణుం డెక్క డెక్కడ రాక్షస పతి
నిలిచె నక్క డక్కడ ధర చలిత మయ్యె
సమర మొనరించు చుండ రాక్షసుల బాహు 20.

వుల సెవరొ పట్టి నట్లయ్యెఁ బోరు నందు

ఆ.వె. పడిన వెఱుపు పసుపు పచ్చని తెల్లని
నల్లని సవితృ కిరణములు రావ
ణు నెదుట నగ రాజమున నున్న ధాతు రా
శి సరణి నగపడుచుఁ జిత్రముగను 21.

చం. వెనుకను వెంబడించుచును వేగమ గ్రద్దలు రాఁగ సంభ్రమ
మ్ము నెగడ నాడు నక్కల సమూహము గక్కుచు నోళ్ల మంటలం
గనుచును రాక్షసేశ్వరు ముఖమ్మును నార్చె నమంగళమ్ముగా
ననిలము వీచె లేచి రజ మక్షులఁ గప్ప విరుద్ధ రీతినిన్ 22.

ఆ.వె. ఘన ఘ నారవములు విన బడకున్నను
నసుర సైన్య మందు నంతటఁ బిడు
గు లడరుచుఁ బడినవి ఘోరముగ భరింప
రాని నిస్వనముల రణము నందు 23.

ఆ.వె. చీఁకటి యలము కొనెఁ జిత్రమ్ముగను దిక్కు
లందు మూల లందు నాకసమ్ము
గాన రాక యుండెఁ గప్పఁబడఁగ దుమ్ము
కురియ మిక్కుటముగఁ గొంచెమైన 24.

కం. కలహించుచు నట గోర్వం
క లఱచుచును దారుణమ్ముగను వందలు వం
దలు ఘోరావేశమునఁ ద
మ లోన రావణు రథమున మరలక వ్రాలెన్ 25.

ఆ.వె. మొలల విస్ఫులింగములు నేత్రముల నుండి
యశ్రువులను వాని యశ్వము లిల
రాల్చినవి నిరంతరం బగ్ని ని జలముఁ
దుల్యముగను వింత దురము నందు 26.

కం. ఈ విధ మనేకములు సమ 27.

రావని నుత్పాతము లట నగపడినవి ర
క్షోవరు వినాశమునకు భ
యావహములు దారుణములు నాశ్చర్యముగన్

ఆ.వె. రామునకును సంగరమున నిమిత్తము
లుద్బ వించె నప్పు డద్భుత జయ
సూచిక లవి పెక్కు సురుచిరము లతి సౌ
మ్యమ్ము లెల్లెడల శుభావహములు 28.

ఆ.వె. సంతసించె భృశము శకునములను సౌమ్య
ములను గాంచి విజయము సెఱిగించు
వాని రాముఁడు దశవక్త్రుఁడు మరణించి
నట్టు లెంచె నంత నాత్మలోన 29.

కం. కని తన నిమిత్తములు రణ
మున విఙ్ఞం డిల నిమిత్తముల హర్షించెన్
ఘనముగ సుఖము వడసి చూ
పెను రాముం డాజి లోనఁ బెను విక్రమమున్ 30.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యెనిమిదవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 109.

రామ రావణుల ఘోర యుద్ధము కొనసాగుట.

కం. అతి ఘోర యుద్ధము మహో
న్నత రథికద్వయము మధ్య నర రాక్షస సం 1.

తతి రామ రావణుల కట
వితతక్రూర గతి నయ్యె వీర వరులకున్

చం. నిలిచెను వీత చేష్టల ననీక యుగమ్ము ప్లవంగ రాక్ష సా
వలి గొని యాయుధమ్ములను బన్నుగ భండన భూమిలోఁ గుతూ
హలముగ మాన వాసురుల నత్తఱి యుద్ధము నందుఁ గాంచుచున్
బలమున మించ నిద్దఱును వావిరి విస్మయ మందె రెండునున్ 2.

ఆ.వె. నగచరులు నసురులు నానాయుధమ్ముల
నూని భుజము లందు నొక్క రొక్క
రి పయిఁ దలపడక నిలిచిరి యాశ్చర్యమ్ము
దనర మనము లందుఁ దద్ద యపుడు 3.

ఉ. బొమ్మలఁ బోలె నిల్చి రటఁ బోరున రావణుఁ జూచి రాక్షసుల్
గ్రమ్మఁగ విస్మయం బపుడు గన్నుల రాముని గాంచి వానరుల్
గ్రమ్మిన యా నిమిత్తములఁ గాంచి స్థిరమ్ముగ రామ రావణుల్
వమ్మిన యాగ్రహమ్మునను వార కభీతిఁ బెనంగి రిద్దఱున్ 4.

తే.గీ. నెగ్గ వలె నంచు రాఘవుఁ డగ్గలముగ
మరణ మైన రానిమ్మని మదిని రావ
ణుండు నిశ్చయించి ధృతిని భండనమున
చూపి రెల్ల వీర్యమ్మును గోప మూని 5.

ఉ. రావణుఁ డంతఁ గోపమున రామ శతాంగపు టా పతాకముం
దా వడిఁ గూల్ప బాణముల ధార్మిక వర్యుఁడు గూర్చి వేయఁగా
దేవ నికాయ నాథవరు తేరి పయిం గల శక్తిఁ దాఁకఁగా
నా వసుధా తలమ్మున మహోర్బటిఁ గూలె ధ్వజమ్ముఁ జేరకే 6.

తే.గీ. అంత రాముఁడు కూడఁ గ్రుద్ధాంతరంగుఁ
డయి ప్రతిక్రియ నొనరింప నాత్మ నిశ్చ
యించి యుత్సాహ మడరంగ మించి నట్టి
వేగమున విల్లు గొని వంచి వీర వరుఁడు 7.

ఉ. రాముఁడు రావణధ్వజము లక్ష్యముగా నిశి తాంబకమ్మునున్
భీమ ఫణీంద్ర సన్నిభము పెల్ల నిజప్రభ నంత వేసె సం
గ్రామము నందు వేయ శిత కాండము చీల్చి ధ్వజమ్ము నంతటన్
పే మహిఁ దూఱె నా ధ్వజము పృథ్విని గూలె నికృత్తమై పెసన్ 8.

ఆ.వె. ఖండితంపు ధ్వజము గాంచి దశగ్రీవుఁ
డసహనమున నవ్వి నట్లగపడి
బల్లిదుండు బాణ వర్షము కురియించెఁ
గోప వశత మండి ఘోరముగను 9.

చం. నరవరు నశ్వ రాజముల నైరృత నాథుఁడు దీప్త మార్గణో
త్కరముల నొంచెఁ దొట్రిలవు దాఁక వహింపవు భ్రాంతి నింతయుం
దురగము లబ్జ నాళములతోఁ బ్రహరించు విధమ్ము స్వాస్థ్య సం
భరిత నిజాంతరంగములఁ బన్నుగ నున్నవి సంగరమ్మునన్ 10.

కం. వారువముల భయ హీనం
బారసి క్రుద్ధుం డడరి దశాస్యుం డంతన్
ఘోర శర వర్షము గురిసె
నా రక్షో విభుఁడు తిరిగి యాహవ మందున్ 11.

చం. పరిఘ గదాది చక్రములు పర్వత శృంగ తరూన్నతమ్ములుం
బరశువు లింక శూలములు భైరవముల్ ముసలమ్ము లెల్లనున్
విరివిగ మాయఁ జేయఁ బడ పే లవి గుర్సెను శస్త్ర వర్షమే
శరముల వేల నశ్రమము సంగర భూమిని వేసె నుద్యతిన్ 12.

తే.గీ. వ్యాకులమ్ము భీమమ్ము భయమ్ము నొసఁగు
నట్టి యుద్ధ మనేక శస్త్రావళి మయ
మైన వర్షము వర్షింప నద్భుతముగ
నుద్భవించె నవ్వేళ నత్యుగ్రముగను 13.

ఆ.వె. విడిచి రాము రథము నడరి వానర బల
మందు సాయకముల నంతరిక్ష
మందు నంతరమ్ము నరయని భంగిని 14.

నింపె రావణుండు సంపఁ దలఁచి

తే.గీ. వదలె నిస్సంగ మనమున బాణములను
రావణుం డుద్యమింప నరయుచుఁ దత్పు
రు నసురేంద్రుఁ గని నగుచు సునిశిత శర
ములను వేవేల వేసె రాముఁ డతని పయి 15.

ఆ.వె. వాని గాంచిన దశవక్త్రుఁడు నిరవకా
శ మొనరించె నింగి శర చయమున
నా శర చయ యుగ్మ మడర నభము శర
బద్ధ మపర నభము వలె వెలింగె 16.

తే.గీ. రామ రావణ శిఖుల నలక్ష్యములు న
భేద్యములు నిష్ఫలము లైనవి కన రావు
యుద్ధమున నవి యెల్ల నొండొరులఁ దాఁకి
ముక్కలయి కూలినవి వేగ పుడమి పైన 17.

తే.గీ. గగనమును నిరుచ్ఛ్వాస నికాశముగ నొ
నర్చి రిరువురు వేసి బాణములు కుడి యె
డమల నెడతెగని విధమ్ము సమర మిద్ద
 అపుడు సేసిరి యతి ఘోర మైన రీతి 18.

ఆ.వె. రాఘవుండు గొట్ట రావణు తేజుల
రావణుండు గొట్టె రాముని హయ
ముల నొక రొకరిని నిటు లనుకరించి చే
యఁ దొడఁగిరి రణమున నలిగి యలిగి 19.

కం. కోపము వహించి యిర్వురు
నాపక చేయ సమరమ్ము వ్యాకుల మయ్యెన్
భూ పాసుర వరుల రణ మ
హో పులకింప భృశ మొక ముహూర్తం బంతన్ 20.

కం. బల్లిదులు రామ రావణు 21.

ఉల్లమ్ముల( బంత మూని యుద్ధ మొనర్పం
బెల్లుగ శరముల రాముం
డల్లన( గూల్ప ధ్వజ మసురు( డాగ్రహ మందెన్

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట తొమ్మిదవ  సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 110.

రామ రావణుల యుద్ధము ఘోరముగా( బవలు రాత్రి యంత క్షణ మైన విరామము లేక దేవ దానవ యక్ష పిశా చోరగములు సూచుచుండ జరుగుట.

కం. సమరమున రామ రావణు
లమితమ్ముగ( బోరుచుండ నాశ్చర్యము నిం
డ మనము లందు నఖిల భూ
తము లరయుచు నిలిచిన వట( దద్ద వివశతన్ 1.

కం. అరదమ్ములు పీడించుచు(
బరస్పరము నుత్తమములు బైరవముగ సం
గరమున నే(గుచు రెండు సె
దు రెదురుగ నమర్ష మడర( దోరము సెల(గెన్ 2.

తే.గీ. తిరుగుచును గుండ్రముగ దూర మరిగి కదిసి
వీథుల( జను గతులను జూపి వివిధముల
నరదములు భయదము లయ్యె నా పరస్ప
ర వధ నెంచి యగపడ సారథుల నేర్పు 3.

తే.గీ. రాము( డాజి( బీడింప(గ రాక్షసేంద్రు
రావణుండు పీడించెను రాఘవేంద్రు 4.

నంది ప్రతి వేగమునకుఁ దుల్య మగు వేగ
ము నుభయులు నుద్యమించుచుఁ బోరు నందు

కం. చిమ్ముఁగ బాణము లిర్వురు
పమ్మి భృశం బుభయుల రథ వరము లపుడు నీ
రమ్ముల ధార లడరు మే
ఘమ్ముల భంగిఁ జరియించెఁ గలహం బందున్ 5.

తే.గీ. చూపి గతు లనేకమ్ములఁ జోద్యముగ ర
ణమున స్యంద నోత్తమములు నైపుణమునఁ
దిరిగి నిలిచిన వంత నెదు రెదురుగను
జేరినవి రెండు చేరువ శీఘ్రముగను 6.

కం. కదియ రథమ్ములు కాఁడికి
నెదురుగఁ గాఁడియును జేర నిఁక వాజులవౌ
వదనమ్ము లయ్యుభయములు
గదియఁ బతాకములు నొక టొకటిఁ గదిసె వెసన్ 7.

ఉ. రాముఁడు నాల్గు బాణముల రావణు నాలుగు ఘోటకమ్ములన్
పే మరలంగఁ జేయ నని వీర వరేణ్యుఁడు విక్రమించి రో
షామిత తామ్ర నేత్రుఁడు దశాననుఁ డవ్విధిఁ జూచి వాజులన్
రాముని పైన వేసెను శరమ్ములు తీక్ష్ణము లంత నుద్ధతిన్ 8.

ఉ. కొట్టఁ బడంగ బాణముల ఘోరముగా దశకంఠు చేత న
ప్పట్టున నే వికారమును బాధను జెందఁడు రాముఁ డింతయున్
నెట్టన నంత రావణుఁడు నేర్పున మాతలి నింద్రసారథిన్
గట్టిగఁ వజ్ర పాత సమ గర్జన పత్రులఁ గొట్టె నుగ్రుఁడై 9.

చం. శరములు వేగ వంతములు చయ్యన మాతలి పైన గూలినన్
దురమున మోహ మీయ విఁక దుఃఖము సుంత యొసంగ వత్తఱిన్
నరవరుఁ డట్లు మాతలిని నైరృత నాథుఁడు నొవ్వఁ జేయఁగా
నరసి కలంతఁ జెందెఁ గడు నాతఁడు నొవ్వఁడు స్వీయ బాధకున్ 10.

తే.గీ. విముఖునిం జేసె వెస శత్రు వీరు నంత
బాణముల రాముఁ డప్పుడు పఱపెఁ జెలఁగి
యిరువదియు ముప్పది వరుస నింక నఱువ
ది మఱి వందలు వేలు రథము పయినను 11.

ఆ.వె. రావణుండు కినిసి రాక్షసేశ్వరుఁడు భృ
శమ్ము నిలిచి తాను స్యందనమ్ము
న గదలు ముసలములు నరనాథుపైఁ గురి
యించి బాధ పెట్టె మించి యాజి 12.

చం. ఒనరుప నిర్వురం దిరిగి యుద్ధము వ్యాకుల మయ్యె గగ్గురుల్
గనఁబడె మిక్కిలిం బరిఘ కాండ గదా ముస లౌఘ వేగ సం
జనిత మరుజ్జవమ్మునను సప్త సముద్రము లత్తఱిన్ మహా
నినదములం జలించినవి నిష్ఠుర రీతిని భీకరమ్ముగన్ 13.

తే.గీ. సాగరమ్ము లల్లాడఁగ వేగతరము
వ్యథితు లై రెల్ల పాతాల వాసు లురగ
దానవులు వేల కొలఁది తద్ద భయము సెల
రేఁగ నంతరంగము లందుఁ గ్రింద నుండ 14.

కం. చలియించె నెల్ల మేదిని
కలసి గిరులను వనములను గాననములఁ దా
నిల వీవఁడు వాయు వటఁ బ్ర
భలు లేక నిలిచెను వింత భాస్కరుఁ డంతన్ 15.

కం. సురలు మహర్షు లురగ కి
న్నర చయ గంధర్వ వర గణమ్ములు సిద్ధుల్
గర మందిరి దుఃఖము నె
ల్లరు నా సమయమ్ము నందు రణ మరయంగన్ 16.

తే.గీ. స్వస్తి యగుఁ గాక యెల్ల గో బ్రాహ్మణులకు
శాశ్వతమ్ము నిలుచుఁ గాక జగ మఖిలము
రాముఁడు జయించు గావుత రావణు నసు 17.

రేంద్రు నాజి లోన ననుచు నిట్టు లపుడు

తే.గీ. రామ రావణ భీకర రణముఁ గాంచి
రోమహర్షణమ్మును దాప సామరవర
నిచయ గంధర్వులు జపింప నెమ్మి తోడ
నగపడిరి యెల్లరు నిలిచి యాకసమున 18.

తే.గీ. ఆకసమునకు సాటియె యాకసమ్ము
సాగరమునకు సాటియె సాగరమ్ము
రామ రావణ సమరమ్ము రామ రావ
ణ రణమునకె సాటి యనుచు గిరల ననుచు 19.

ఆ.వె. అప్సరసల సంచయమ్ము గంధర్వ స
మూహ మరపి భీక రాహవమును
బరవశమ్ము నంది భండనమ్మును గాంచఁ
జాగి రప్పు డట్లు జరుగుచుండ 20.

చం. కినుక వహించి రాఘువుల కీర్తి వివర్ధనుఁ డంత ఘోర స
ర్పనిభ శరమ్ము వింటిఁ దగ రాముఁడు గూరిచి కుండలమ్ములన్
ఘనముగ వెల్గు నయ్యసుర కాంతుని శీర్షముఁ జీల్చెఁ జీల్వఁ గూ
ల నిలను ముజ్జగమ్ములును రంజిలి చూచిన వా శిరమ్మునున్ 21.

ఆ.వె. మొలచె నొండు శిరము మొదలిటి తల వంటి
ది వెస రావణునకు నృవరుఁ డరసి
దానిఁ ద్రుంచె వేగ తత్క్షణమ్మున నాజి
వేగవంతుఁ డంత వీర వరుఁడు 22.

ఉ. ఛిన్నము గాఁగ రావణుని శీర్షము రెండవ దంప వానచేఁ
గ్రన్నన నుద్భవింపఁ దల రాముఁడు ద్రుంచెను సాయకమ్ములన్
భిన్నము లయ్యె నివ్విధము వేగముగా శత శీర్ష రత్నముల్
సెన్నుగ నుండఁ దుల్యముగ శీర్షము లన్నియు స్వీయ కాంతులన్ 23.

కం. నృవరుఁడు కౌసల్యానం 24.

ద వర్ధనుఁడు నస్త్ర కోవిద మహా రథికుం
డవిరళ బాణ యుతుండు మ
ది విచారించె  దశముఖుఁడు దెగకున్న ననిన్

సీ. మారీచుఁ జంపిన మార్గణములు ఖర దూషణుల ననిలోఁ ద్రుంచినయవి
క్రౌంచ వనమ్మున ఘనుఁ గబంధుని దండకా వనిని విరాధుఁ గడపినయవి
సాల పర్వతముల వాలినిఁ గూల్చిన యట్టివి కడలికి వ్యథ నొసంగి
నట్టివి నాకు నత్యంత విశ్వాస పాత్రములు సకల సంగరమ్ము లందు
ఆ.వె. నట్టి సాయకమ్ము లక్కట మంద తే
జమ్ము లయ్యె నేల సమర మందు
రాక్షసేశ్వరుఁ డగు రావణు నందుఁ గా
రణము సుంత కాన రాదు మదిని 25.

కం. చింతా పరుఁడై యివ్విధి
నంత నెడఁద నప్రమత్తుఁడై రావణ బా
హ్వాంతరమున శర వర్షము
నంతక సన్నిభుఁడు రాముఁ డాజినిఁ గురిసెన్ 26.

కం. రావణుఁడు గూడఁ గ్రుద్ధతఁ
జేవ గదా ముసలములు విశేషముగ ననిన్
వేవేగ వైచి రాముని
భూవరు నొప్పించె భృశము పుణ్యాత్మునినిన్ 27.

కం. కలిగింప గగుర్పాటు తు
ములమై సమరమ్ము  దివిని భూమిని గిరులం
దలపడఁగ రామ రావణు
లలయక వర్తిల్లె నప్పు డాశ్చర్యముగన్ 28.

తే.గీ. దేవ దానవ యక్షులు దివిఁ బిశాచ
రాక్ష సోరగ గణము లరయుచు నుండ
రామునకు నసురేంద్రుఁడు  రావణునకు
సర్వ రాత్రము సాగెను సంగరమ్ము 29.

ఆ.వె. రామ రావణ సమరమ్ము దినము నందు
సైన రాత్రి యందు సైన నొక్క
క్షణము గూడ నాగక విరామ మెఱుఁగక
కొంచె మైన జరిగె ఘోరముగను 30.

కం. అరయక రాముని విజయము
నరవర రాక్షస రణమ్మున మహాత్ముం డా
సురపతి సారథి మాతలి
త్వరితము రణరతుని తోడ వచియించె నిటుల్ 31.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట పదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 111.

మాతలి గుర్తు సేయ రాముఁడు బ్రహ్మాస్త్రమును బ్రయోగించి రావణుని సంహరించుట.

కం. స్మరియింపఁ జేసె మాతలి
నరేంద్ర! పెన్నంటు దేల నైర్రృత పతినిన్
దురమున నెఱుఁగని వాని వ
లె రాఘవేంద్ర! స్మృతినిఁ జెలరేఁగుమ యాజిన్ 1.

ఆ.వె. వదలు మస్త్ర వరము పైతామహము రామ!
యీతని వధియింప నెంచి యింకఁ
జెప్పి రెద్ది యమరు లొప్పుగ నట్టి వి
నాశ కాల మిప్పు డీశ! వచ్చె 2.

ఉ. మాతలి గుర్తు సేయఁగను మానవ వీర్యుఁడు రాఘవుండు దా
నాతత దీప్త బాణమును నంచిత నిశ్వస నాహి తుల్యముం 3.

బ్రీతి నగస్త్యుఁ డీయఁగ విరించిదమున్ భగవంతుఁ డెంతొ వి
జ్ఞాతుఁడు మున్ను గైకొనెను జక్క నమోఘము సంగరమ్మునన్

తే.గీ. ఇంద్రున కొసంగ నిర్మిత మీ శరమ్ము
బ్రహ్మ చేతఁ దేజస్వి చే వాసవునకు
ముజ్జగమ్ములను విజయము నెదఁ గోరు
వాని కీయఁ బడెను మున్ను మానితముగ 4.

తే.గీ. మసలు దాని ఱెక్కల లోన మారుతమ్ము
యగ్ని సూర్యు లుందురు దాని యగ్ర మందుఁ
గాయ మెల్ల వీక్షింప నాకాశ మయము
మేరు మందర తుల్యము భార మందు 5.

తే.గీ. తనువు జ్వాజ్వల్యమానమై తనరు చుండుఁ
బుంఖము విలసిల్లును హేమ భూషిత మయి
తీర్పఁ బడె భూత రాసుల తేజములను
గాంతి పరికింప భాస్కర కాంతి సమము 6.

ఆ.వె. ధూమ యుక్త కాల దుర్వార వహ్ని ని
భమ్ము వెల్గు చుండుఁ బమ్మి నర గ
జాశ్వ బృందముల లయం బొనరించును
క్షిప్ర మాజి లోన క్షిప్ర కారి 7.

కం. ద్వారమ్ములఁ బరిఘమ్ముల
దారుణ పర్వతముల వితతము భేదించున్
మూరు నిజ శరీరము మే
దో రక్తములం దడియఁగఁ దోరం బనిలో 8.

చం. ఘనతమ నాద సంయుతము కర్కశ వజ్ర సమాన సారముం
బెనఁకువ లందుఁ జీల్చునది భీమము క్రుద్ధత నిశ్వసించు పా
మునకు సమాన మైన యది భోజన మిచ్చును గంక గృధ్ర గో
మి నిచయ రాక్ష సావలికి మించి బకాలికి నిత్య మాజిలో 9.

తే.గీ. యమ సదృశ రూప మడర భయదము వాన
రేంద్రులకు హర్ష దాయక మెల్ల రక్క
సులకు లయదము గరుడి ఱెక్కల విచిత్ర
ముల నొనర్పఁ బడెను జవము ఘనతరము 10.

మ. అనిలో రాఘువుఁ డట్టి మార్గణము నత్యంతోత్తమమ్మున్ భయ
మ్మును నిక్ష్వాకుల కెల్ల వారికి వడిం బోకార్చుచున్ శత్రు కీ
ర్తిని విధ్వంసము సేయు దానిని నతిప్రీతిన్ మదిం గూర్చు దా
నిని మంత్రించుచు వేద సూక్తములు వింటిం గూర్చె నుగ్రుండునై 11.

తే.గీ. అట్లు సంధించు చుండంగ నస్త్ర వరము
రాఘువుం డుత్తమమ్మును రణము నందు
సర్వ భూతమ్ము లందెఁ ద్రాసమ్ము నవని
యెల్లఁ గంపించె నెల్లరు తల్లడిల్ల 12.

ఆ.వె. వంచి కార్ముకమ్ము మించి క్రుద్ధుండునై
సావధానుఁ డయి మహాత్ముఁ డంత
మార్గణమ్ము వైచె మర్మ విదారణ
మా దశాస్యు పైన నద్భుతమును 13.

ఆ.వె. వజ్రి బాహు ముక్త వజ్రమ్ము భంగి కృ
తాంత సన్నిభము దశానన ఘన
వక్ష మందుఁ బడె నవార్యమై రామ ము
క్త శర రాజ మంత దారుణముగ 14.

చం. శర మది ముక్తమై యటుల సంహస నాంతక మంత శత్రు భీ
కరము దురాంతరాత్ము దశకంఠుని వక్షముఁ జీల్చె వేగ చీ
ల్చి రుధిర సిక్తమై యసుర శేఖరు దుష్కర కర్ము రావణా
సురు నసువుల్ హరించియె వసుంధరఁ జొచ్చెను వేగవంతమై 15.

ఆ.వె. చంపి రాక్షసేంద్రు సమర మందు శరము
సుకృత కర్మ మంతఁ జోద్యముగను
రక్త సిక్త కాంతి యుక్తమై స్వీయ తూ 16.

ణీర మందుఁ జొచ్చె నెల వనంగ

తే.గీ. హతుని విగత జీవితు రావ ణాసురు ఘన
హస్త తలమున నుండి రయమున వాని
యసువులను గూడి కార్ముక మంబకమ్ముఁ
గూడి ధరణీ తలమ్మునఁ గూలె నంత 17.

కం. నైర్భత విభుఁ డతి వేగుం
డా రావణుఁడు ద్యుతి మంతుఁ డసు హీనుఁ డహో
యా రథము నుండి ధరఁ బా
కారి కులిశ నిహత వృత్రుఁ డనఁగం గూలెన్ 18.

కం. హత శేషులు రక్కసులు ప
తితు ధరపైఁ బతిని గాంచి దిశలకు భీతిన్
విత తార్తులు పరువు లిడిరి
హత నాథులు వీడి సంగ రాంగణ మెల్లర్ 19.

ఆ.వె. వారి నెల్లెడలను వానరులు జితకా
శులు ఘన తరు యోధు లలరి వెంట
నంటి రపు డరసి దశానను మరణము
నెల్ల రుత్సహించి హీన భయులు 20.

కం. హరి వీరులు బాధింపఁగ
నిరాశ్రయులునై యసురులు నీ రొలుకంగాఁ
గర మక్షుల జాలి నెగడ
నరిగిరి లంకకు నడలున నార్తి నెలంగన్ 21.

తే.గీ. విజయ సుప్రకాశ ముఖులు వీర వరులు
వానరులు సంతసించిరి మాన వేంద్రు
రాముని జయమ్ము కొనియాడి రావణు వధ
నుడివి నినదించి రెల్లరు బెడిదముగను 22.

ఆ.వె. అంతరిక్ష మందు నంత మ్రోగినవి సౌ 23.

మ్య సుర దుందుభు లట నమర గంధ
యుక్త సుఖద మారు తోత్తమ మపుడు వీ
చె నడరుచు భృశమ్ము చెలువముగను

కం. కురిసెను రామస్యందన
వరమునఁ జల్లుచును బుష్ప వర వృష్టి భువిన్
దురవాపమ్ము నతి మనో
హర మాకాశమున నుండి యానందదమై 24.

కం. వినిపించె రాఘవస్తవ
నినదమ్ములు సాధు వంచు నింగిని నమరుల్
ఘనముగ వచించు చుండఁగ
మునుల మహాత్ములను గూడి ముద మడరంగన్ 25.

కం. ఆవేశించెను హర్షము
దేవతలకుఁ జారణ వితతి సహిత మంతన్
రావణుఁడు రౌద్రుఁడు హతుఁడు
గా విశ్వ భయంకర దశకంఠుం డట్లున్ 26.

ఆ.వె. సుప్రసన్నుఁ డట్లు సుగ్రీవు నంగదు
బల్లిదు నొనరించె నుల్లసిల్లఁ
బ్రాప్త కాములుగను రాముఁడు వధియించి
రావణుని రణమున రాక్షసేంద్రు 27.

చం. పడసిన దా మరుద్గణము పన్నుగ శాంతిని వెల్గె దిక్కు లె
ల్లెడల నభం బహో విమల మింపుగ నయ్యెఁ జలింప దింతయుం
బుడమియు వీచె మారుతము మూరి వెలింగె దివాకరుండు న
ప్పుడు నిజ కాంతులం గరము పోరున రావణుఁ డాజ నవ్విధిన్ 28.

ఉ. ఆ విజయమ్ము నందఁగ మహాత్ముఁడు రాఘవుఁ డాజి లోన సు
గ్రీవ విభీష ణాంగదులు హృష్టులు లక్ష్మణు గూడి రామునిన్
భూవరు మిత్ర సంయుతము భూరి విదార వరాభిరామునిన్
వావిరి సంస్తుతించిరి యపార ముదం బడరన్ యథావిధిన్ 29.

కం. హత ఘోర రిపుండు స్థిర
ప్రతిజ్ఞుఁడు రఘుకుల వర నృపతి స్వజన బ లా
వృతుడై తేజస్వి త్రిదశ
తతి పరివృత వజ్రి భంగిఁ దద్ద వెలింగెన్ 30.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట పదునొకండవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 112.

అన్న రావణుఁడు సమరమున మరణించి పుడమిపై శయనింపఁ గని విభీషణుండు శోకార్తుండై విలపించు చుండ రాముఁ డూఱడించి యన్నకు నంతిమ సంస్కారము లొనరింప విభీషణు ననుమతించుట.

కం. అగ్రజు శయనింప నిహతు
నుగ్ర రణం బందు నరసి సోదరుఁ డంతన్
వ్యగ్రుండు నై విభీషణుఁ
డగ్రమున నిలిచి కలంత నట విలపించెన్ 1.

ఆ.వె. వీర వరుఁడ! సుప్రవీణ! విక్రాంత! వి
ఖ్యాత! యుత్తమ శయనార్హుఁడ! నయ
కోవిద! శయనింతు వీ వక్కజముగ ని
ట్లేల నిహతుఁడ వయి నేల నేఁడు 2.

ఉ. అంగద భూషితమ్ముల మహాత్మ! భుజమ్ముల నున్నతమ్ములన్
సంగర భూమి నిట్లునిచి సన్నగిలంగ స్వచేష్ట లన్నియుం
గ్రుంగఁ గిరీట కాంతులు సుఘోరముగా నిట భాస్కరాభముల్
భంగము గాఁగ నిట్లు నిజ పౌరుష మెల్లను నేల నుంటివే 3.

ఉ. మున్నట నేను జెప్పినది మూరఁగఁ గామము మిక్కుటమ్ము నీ
వెన్నని యట్టి దిప్పు డరుదెంచెను వీర వరేణ్య! యివ్విధిం
గ్రన్నన నా ప్రహస్తుఁ డతి కాయుఁడు రావణి కుంభకర్ణుఁడున్
మన్నన సేయ రుద్ధతిని మంచి గిరాలి నరాంతకుండునున్ 4.

ఆ.వె. అతిరథుండు నీవు నన్యులు నంగీక
రింపకుండ నుత్సహింప దాని
ఫలము మించి నేఁడు వచ్చిన దీ రూప
మున నిశాచరేంద్ర! పుడమిఁ గూల 5.

సీ. మంచి నీతుల యెల్ల పంచత్వ మందెను ధర్మశరీరము తఱిఁగె నిపుడు
సత్త్వసంక్షేపమ్ము సడలె నెల్లఁ బొగడ్తల గతి నశించె నిల నరయంగ
నాదిత్యుఁ డక్కట యవనిఁ గూలి నిలువఁ జంద్రుండు మున్గె మేచకము నందు
నాఱిన జ్వాలల నగ్ని యుత్సాహ మణఁగ నుద్యమింపఁడు విగత రుచుల
ఆ.వె. శస్త్రధరుల మేటి శస్త్రధరుం డిట్లు
రాక్షసేశ్వరుండు రావణుండు
వీర వరుఁడు గూలఁ బృథ్వీ తలమ్మున
మేదినీశుఁడు నరిసూదనుండు 6.

కం. నిదురించి నట్టు లుండం
గ దుమ్ము లో రాక్షస గణ కాంతుం డిట్లుం
జెదరిన బలమ్మున మిగిలి
న దేమి యున్నది జగముల నైరృత వర్యా! 7.

తే.గీ. ధైర్య మనెడు ప్రవాళము దాల్మి యనెడు
సుమము శౌర్య మనియెడు మూలము దనరెడు
రావణుఁ డనెడు వృక్షమ్ము రాముఁ డనెడు
మారుతమ్ముచేఁ గూలె సమర తలమున 8.

తే.గీ. దంతములు గాఁగఁ దేజము దనర వెన్నె
ముకగ వంశము దన కోపము కరుణలు బ
రగఁగ వీపు తుండములుగ రావణ మద 9.

గజము గూలె నిక్ష్వాకు మృగపతి చేత

తే.గీ. విక్ర మోత్సాహ జృంభిత స్వీయ భీక
రార్చి స్వబల ప్రతాపము నతుల సుప్ర
తాపవంత రాక్షస నామ దారు ణాగ్ని
యాఱె నాజిలో రామ నామాంబుదమున 10.

తే.గీ. తోఁక మూపు కొమ్ములు గాఁగ వీక నసుర
సింహు లరి నాశి లౌల్యపుఁ జెవుల కనుల
శ్రమ నొసఁగ మద కరి రాక్షసర్షభమ్ము
రాజ శార్దూల వరముచే రాలె నేల 11.

చం. పలుకఁగ నా విభీషణుఁడు బాధ యెడందఁ జెలంగ రాముఁ డి
ట్టు లనెను హేతుమంతపు నుడుల్ పరికింపఁగ నిశ్చయార్థముల్
విలయుఁడు గాఁ డచేష్టలను భీకర చండ పరాక్రముం డనిం
గలహ మొనర్చి తా నుదరి కౌణప నాథుఁ డభీతి రాలెనే 12.

ఉ. ఎవ్వరు క్షత్ర ధర్మమున నింపుగ నిల్చి వరింత్రు వృద్ధినిన్
నెవ్వరు వారు గూల నని నొంచె నెవండు పరాక్రమమ్మునన్
రివ్వున ముజ్జగమ్ములను రేఁగి బలారినిఁ గూడి యా బుధుం
డివ్విధిఁ గూల నేల నశియింపఁగఁ గాలము కాదు చింతకున్ 13.

ఉ. మున్నిలఁ గాదు నిశ్చయము పోరున గెల్పు దలంప నేరి కే
నెన్నఁడు నాజిఁ జంపుటయు నేని పరాలినిఁ దాను జచ్చు టే
నెన్నగ నౌను క్షాత్రవుల కియ్యది యుక్తము రాచ పుట్టువే
చన్న రణమ్ము సేయుచు విషాదము నందఁగ రాదు వానికై 14.

ఆ.వె. దీని నెఱిఁగి తత్వ మూని మది విచార
ముడిగి యిప్పు డింక నొప్పు నట్టి
పని నొనర్పఁ బూన వలయుఁ జింతింపుమ
దాని నింక నీవు త్వరిత గతిని 15.

కం. గిరల ననిన విక్రాంతుని 16.

వర రాజకుమారు నరసి వచియించెను నో
దర హిత మనంతరమును నొ
నరింపఁగ విభీషణుండు నలినాక్షునితో

కం. అపరాజితుఁ డాజి నితం
డు పూర్వము మహోగ్ర వీరుఁడు సురల కమ రా
ధిపతికినిఁ గదిసి నృవరా
ధిప! నిను వేలఁ గదియు వనధి పగిది నోడెన్ 17.

తే.గీ. యాచకుల కిచ్చెఁ బెక్కింటిఁ బ్రోచె భృత్య
గణము ననుభవించెఁ గడు భోగముల మిత్రు
లకు సమర్పించె విత్తములను రిపులకు
నొసఁగె వైర మడరి రాక్షసోత్తముండు 18.

తే.గీ. ధరణి నిత్యాగ్నిహోత్రుండు తాపసుండు
వేద వేద్యుండు కర్మాలి వినుత శూరుఁ
డితని ప్రేత కృత్యమ్ముల సే నిట నొన
రింప నిచ్చగింతు ననుమతింప నీవు 19.

కం. కరు ణావృత వాక్యమ్ముల
సురుచిరముగ వేఁడుకొన నసుర రాడ్వర నో
దరుఁడు నరేంద్ర కుమారుఁ డ
పర లోకపుఁ గర్మములకుఁ బనుపు నొసంగెన్ 20.

కం. మర ణాంతమ్ములు వైరము
లరసితిమి స్వకార్యము మన మందఱ మాజిన్
గురు సంస్కారము లెల్ల నొ
నరింపు నీకు నితఁ డెట్లొ నాకును నట్లే 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట పండ్రెండవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 113.

రావణుని మరణ వార్తను విని రావణ కాంత లంతఃపురమును వీడి యుద్ధ భూమికి వచ్చి నేలపైఁ బడి యున్న రావణునిఁ గాంచి విలపించుట.

కం. విని రావణు మరణమ్మును
మను జేంద్రుని చేత నసుర మానిను లా రా
మునిచే నని నంతఃపుర
ము నుండి వెలువడిరి త్వరితముగ శోకార్తల్ 1.

కం. వారించినఁ బెక్కు గతుల
నారీ మణులు కురు లూడ నైరాశ్యమునన్
వారలు దొర్లుచు దుమ్మున
ఘోర తరముగ హతవత్స గోవులు వోలెన్ 2.

చం. అసురులఁ గూడి యుత్తరపు టా పెను ద్వారము నిష్క్రమించి యా
యసురులు సంగ రాంగణము నంగన లంతటఁ జేరి రోయుచున్
వెసఁ బతి నార్యపుత్ర! యని వేదనఁ బల్కుచు నాథ! యంచు న
ల్దెస రుధిరంపు ఫేనములు దేలఁ గబంధము లుండఁ గాంచుచున్ 3.

తే.గీ. ఎల్లెడల నుండి యరుదెంచి తల్లడిల్లి
కనులఁ గన్నీరు నిండంగఁ గాంత శోక
తప్త లార్చి రప్డు హతయూధప కరేణు
గణము భంగిని ఘోరముగ ధ్వను లడర 4.

ఉ. కాంచిరి వారు రావణునిఁ గాటుక ముద్దను బోలు వానినిన్
మించిన వీర్యవంతుని నమేయ శరీర మహా ప్రభాయుతుం
బంచత నంది నేలఁ బడ భర్తను దొర్ల రజమ్మునం దటుల్
గాంచిన ఛిన్నవల్లు లన గాత్రములం బడి రెల్ల రంతటన్ 5.

ఉ. ఒక్కతె గౌఁగిలించికొని యుగ్మలి యీతని గౌరవమ్ముతో 6.

నొక్కతె వట్టి పాదముల నొక్కతె కంఠముఁ బట్టి యేడ్వఁగా
నొక్కతె యెత్తి బాహువుల నుర్విని దొర్లుచు నుండ నార్తితో
నొక్కతె గూలె మోహమున నుక్కిన వాని ముఖమ్ముఁ గాంచఁగా

ఆ.వె. శిరము నంక మందుఁ జేరిచి యొక్కతె
యేడ్చెఁ గాంచుచును నిజేశు ముఖము
నశ్రములఁ దడుపుచు నాస్యమును దుషార
మంబుజమును భంగి నార్తి తోడ 7.

ఆ.వె. ఆర్త లింతు లిట్లు భర్తను హతు ధరా
పతితుఁ గని యనేక గతులఁ బలవ
రించుచును గలంత మించ నేడ్చిరి యెల్ల
రప్డు మరల మరల నసుర సతులు 8.

ఉ. ఎవ్వరు శక్రు భీతు నొనరించెను గాలుని తోడ నాజి నిం
కెవ్వరు గెల్చి వైశ్రవణు నింపుగఁ గైకొనెఁ బుష్పకమ్ము నిం
కెవ్వరు దేవగాయనుల నెల్ల సురర్షులనున్ భయార్తులై
నివ్వటిలంగఁ జేసె ననినిం బగ నాతఁడు గూలి పండెనే 9.

కం. దేవాసు రోరగమ్ముల
నేవిధి భయ మరయని యసురేశ్వరునకు ని
ట్లీ వసుధ మానవ భయ మ
హోవారక దాపురించె యుద్ధము లోనన్ 10.

కం. సురల కవధ్యుఁడు రాక్షస
వరులకు నైనఁ బరికింప భండన మందున్
నరవరుని పదాతి వలన
దురమునఁ గూలి శయనించె దుర్జయుఁ డైనన్ 11.

తే.గీ. ఎవఁ డశక్యుఁడు సురలకు నేని యక్షు
ల కసురుల కైన వధియింప రణము నందు
నట్టి వాఁ డబలుం డైన వట్టి మర్త్యు
ని వలనఁ బడసె మృత్యువు భువిని నేఁడు 12.

కం. విలపించి రిట్లు వాని స
తులు పలుకుచు ఘోరతరము దుఃఖిత లింకం
బలవించిరి మరల మరల
విలపించిరి బలు తెఱగుల వేదన మీఱన్ 13.

తే.గీ. వినమి సుహృదుల నీ హితము సెదఁ గోరు
వారి నీ మరణార్థమ నారి సీత
తేఁ బడెను గూలె నసుర తతి రణ మందుఁ
బతితులము మేము నీవును నుత బలాఢ్య! 14.

ఆ.వె. ప్రియపు టవరజుఁడు విభీషణుండు హితము
వలుక వాక్యములను బరుషములను
బలికి పంపి తీవు తెలియక స్వీయంపు
వధ నెడందఁ గోరు విధము దోఁప 15.

ఆ.వె. సీత నిచ్చి యున్న నా తఱి రామున
కీవు మైథిలి నసు రేంద్ర! నేఁడు
మూలహరము ఘోరము వ్యసనమ్ము నకట
యందఱ మిటఁ బడయ కుందు మిట్లు 16.

తే.గీ. ప్రాప్త కాముఁడై యుండును భ్రాత మిత్ర
కులుఁడు నై యుండు రాముండు వెలయు చుందు
మెల్లర మవిధవల మయి యుల్లసిల్లి
కారు మన శత్రు లెల్ల సకాము లిట్లు 17.

కం. క్రూరుఁడ వగు నీ చేతను
ఘోరమ్ముగ నుంచఁ బడియెఁ గోమలి చెఱలో
నీ రాక్షసాలి నీవును
దారలు మేముఁ బతితులము త్రయము సమముగన్ 18.

కం. కా వసురేశ్వర! కతములు
నీ వాంఛించిన పను లవి నిక్కం బెంచన్ 19.

దైవము చేయును సర్వము
దైవ విఘాతమున హతులు తథ్యముగ జనుల్

కం. వానర వినాశ మేనియు
నీ నీ రాక్షసుల చావు లేనియు నింకన్
నీ నిర్యాణం బైన ద
శానన! దైవమ్ము చేత నైనవి యెల్లన్ 20.

తే.గీ. అర్థమున నైనఁ గోరిక నైన విక్ర
మమ్మున నయినఁ జింతింపఁ బమ్మి నట్టి
యుగ్ర మైన యాజ్ఞ నయిన నుద్యమింప
దైవ గతినిఁ దప్పింపఁగఁ దరము గాదు 21.

కం. అక్షయ భాష్ప జ లాపూ
ర్ణేక్షణలు విచార తప్త హృదయలు దీనల్
రక్షా హీనత నేడ్చిరి
యా క్షణమునఁ గురరుల వలె నసు రాంగనలే 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట పదుమూడవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 114.

రావణాసురుని రాముని చేతిలో హతుని రణ భూమిలోఁ గాంచి జ్యేష్ఠ పత్ని మండోదరి విలపించుట,
రాముని యాదేశముతో విభీషణుఁ డన్నకు నగ్ని సంస్కారము లొనరించుట.

కం. విలపించు రాక్ష సాంగన
ల లోన జ్యేష్ఠ సతియుఁ బ్రియు రాలు నిజ పతిన్
విలయుని నచింత్య కర్ముని 1.

వలనను మండోదరి గని వగ విలపించెన్

ఆ.వె. రామ హస్త నిహతు రావణు దశకంఠు
నంత నరసి దీన యై భృశముగ
జాలి గొలుపు రీతిఁ జాల విలాపించెఁ
బట్టమహిషి యిట్లు బెట్టిదముగ 2.

ఉ. పర్వదె భీతి శక్రునకు వైశ్రవ ణానుజ! యూన భీక రా
ఖర్వపు టాగ్రహమ్ము నెదఁ గట్టెదుటన్ నిలువంగ నింక గం
ధర్వులు చారణర్షులును దద్ద భయంపడి దీర్ఘ బాహుఁడా
గర్వము వీడి పాఱ దశకంఠ! దిశాలికి మున్నెఱుంగమే 3.

చం. మదిఁ ద్రప నూన వక్కజము మానుష మాత్రున కోడి యాజి నే
మిది యసురేంద్ర! ముజ్జగము లెల్లను బల్మిని నాక్రమించి నీ
వుదరి సిరిన్ వహించి కడు నుద్ధతి వర్ధిలఁ గాననమ్ములన్
వదలక తిర్గు మానవుఁడు పట్టి యెటుల్ వధియించె దుస్సహున్ 4.

చం. నరులకు రాని చోటున ఘనమ్ముగ నిల్వఁగఁ గామ రూపతం
బరఁగెడు వాని నాశనము భండన మందు రఘూద్వహుం డొన
ర్ప రుచిర మంచు నెట్టు లన వచ్చును నమ్మఁగఁ జాల నేను సం
గరమున నుండ సిద్ధత నృకాంతుఁడు ధర్షితుఁ జేసె నిన్ననన్ 5.

ఉ. కానన మందు నా ఖరుఁడు కౌణప యుక్తుఁడు భ్రాత తజ్జన
స్థానము నందు నవ్విధము సంపఁ బడంగఁ దలంప హర్త దా
మానవ మాత్రుఁ డౌనె హనుమానుఁడు లంకను దేవతా గణం
బేనియుఁ జేర రానిది తపించితి మప్పుడె చేర బల్మినిన్ 6.

తే.గీ. ఘోర వానరు లెప్పుడు వారిరాశి
వారధినిఁ గట్టి రప్పుడె యా రఘు సుతు
రాముని యమానుషత్వము నా మనమ్ము
నందు శంకించితిని నాథ! డెంద మడల 7.

ఆ.వె. లేనిచోఁ గృతాంతుఁ డేని స్వయమ్ముగఁ 8.

బన్ని మాయ నిట్లు వచ్చి యుండ
నోపు నిపుడు రామ రూపమ్మున ననూహ్య
ముగను నీదు నాశము నరయంగ

ఆ.వె. లేక వాసవుండు రేఁగి నిన్నెదిరించి
యుండ నోపు నేమొ దండి బలుఁడ!
యయిన నిన్నెదిర్ప నాజిలో నాతని
కట్టి శక్తి కలదె యరసి చూడ 9.

సీ. వ్యక్త మితండు మహాయోగి పరమాత్ముఁడు సనాతనుండు నడుము తుది మొద
లును లేని పరమ పురుషుఁడు ఘనుఁ డతీతుఁ డజ్ఞానమున కెల్ల నరయ ధాత
శంఖ చక్ర గదా లసద్ధస్త విలసిత శ్రీవత్స వక్షుండు శ్రీ యుతుండు
నిత్యం బజేయుండు సత్య పరాక్రముండు ధ్రువుఁడు శాశ్వతుండు నర రూప
తే.గీ. మూని విష్ణువే యమరులు వానరత్వ
మూని పరివృతు లై యుండఁ దాను సర్వ
లోక నాథుండు హిత మీయ లోకములకుఁ
జంపె నిన్ను సరాక్షస సంచయమ్ము 10.

కం. మున్నింద్రియముల నీ వె
ల్లన్నిర్జించి భువనమ్ముల జయించితివే
యెన్నినవో యా వైర మ
నన్నిన్నోడించిన వవి నాథా! యకటా 11.

కం. తనరుపు తగ నవిరోధం
బనఘా! రాఘవుని తోడ నంచును నీ తో
డ ననేక వారములు నే
నన నొల్లవు దాన వచ్చె నా ఫల మిట్టుల్ 12.

ఉ. జానకి పైఁ దటాలున నిజక్షయ కారక ముద్భవించె నీ
మానస మందుఁ గామ మది మాపఁగ సంపద బంధు వర్గముం
గానఁగఁ దా నరుంధతికిఁ గల్లరి! రోహిణి కెన్న మిన్నయౌ
మానిని భంగ పెట్టి కడు మాన్యను దుష్కృత మీ వొనర్చితే 13.

చం. స్వజన నిజాంగ నాశకుఁడ! క్ష్మాకును క్ష్మా యగు శ్రీకి శ్రీయు నా
విజనను జానకీ సతినిఁ బెన్నునవద్యను భర్తృ వత్సలం
గుజన మతీ గ్రహించి వనిఁ గొంచును వచ్చితి కోర్కి తీరకే
కుజ సుతపః ప్రభావమునఁ గ్రూరుఁడ! దగ్ధుఁడ వైతివే ప్రభూ! 14.

తే.గీ. సీత నా తను మధ్యను వీత భీతి
నీవు తాఁకిన యప్పుడె నీఱు కాక
యుంటి వేలన భీతిల్లి యుండి రింద్రుఁ
గూడి దేవత లెల్ల నీకు ననలుఁడును 15.

చం. ఫల మొనగూరుఁ దప్పకయె పాప మొనర్చెడు నెల్లవారి కీ
యిల నిజ పాప కర్మముల కెల్లను గాలము దాపురింపఁగా
వల దిట శంక కల్గును శుభం బొనరింప శుభమ్ము చెడ్డకుం
గలుగును జెడ్డ నీకుఁ జెడు గల్గ విభీషణుఁ డందె సౌఖ్యముల్ 16.

ఉ. రూపము నందు నత్యధిక రూపవతుల్ లలితాంగు లెందఱో
ప్రాపున నుండ నీకు స్మర వశ్యత నజ్ఞత నేర కుంటివే
రూపము నందు నేర్పున సులోచన సీత కులమ్ము నందు నో
హో పరికింప నెక్కు డయి యుండునె నా కిల లేక తుల్యయే 17.

కం. కారణము లేక మరణం
బేరిని నెన్నండును వరియింపదు కన నీ
కా రీతి నయ్యె మైథిలి
కారణము లయమునకు దశకంఠ! దృఢముగన్ 18.

తే.గీ. చేరె సీతా నిమిత్తము దారుణంపు
మృత్యు వెంతొ దూరము నుండి మీఱి నిన్ను
మైథిలి విహరించు నిఁక రామ నృవరేంద్రుఁ
గూడి యెల్ల శోకమ్మును వీడి రహిని 19.

ఉ. కూలితి నల్ప పుణ్యను సుఘోర విచార సముద్ర కుక్షిలో
మేలుగ వెండి కొండ పయి మేరు స మందర పర్వతమ్ములన్
లీలగ సంచరించుచు వరిష్ఠ విమానము లందు దేవతా 20.

పాలిత వాటికా తతులఁ బన్నుగఁ జైత్ర రథాంగణమ్ములన్

తే.గీ. ఇంపుగ నతుల వైభవ సంపదల ధ
రించి చిత్ర స్రగంబర సంచయమ్ము
చూచితిఁ దగ నీతో బలుచోట్లు దఱిఁగెఁ
గామ భోగమ్ము లిఁక నీవు భూమిఁ గూల 21.

ఆ.వె. అట్టి నేను గాంచ నన్యకాంతను భంగి
నైతి నేఁడు దీన నైతి నకట
చంచలమ్ము లౌను సార్వభౌముల సంప
ద లవి చీ తలంప ధరణి లోన 22.

ఉ. గోముగ మంచి కన్బొమలఁ గొప్ప త్వచమ్మున నెత్తు ముక్కునన్
దామర వెల్గుఁజేనులకుఁ దమ్ముల గొంగకు నీడుజోడునై
నీ ముకుటంపు సొంపు జిగి నివ్వటిలంగఁ గడింది యెఱ్ఱనై
మోము సెలంగు చుండుఁ గడు మున్నది హా యసు రేంద్ర! నేఁ డహో 23.

ఉ. కల్లు గొనంగ మిక్కుటము కన్నులు దిర్గఁగఁ గల్లుపాకలో
నుల్లము గొన్న దండల నహో చిఱునవ్వులఁ బల్కు సుద్దులున్
గొల్లున రేఁగు నా మొగము కొట్టఁబడంగను రాము తూపులం
ద్రుళ్లఁగఁ గ్రొవ్వునున్ మెదడు దుమ్మున వెల్గదు కాఱ నెత్తురున్ 24.

కం. చివరి దశ యేఁగుదెంచెఁ గ
ద విధవగ నొనర్చునట్టి దారుణ గతి యి
ట్లవు నంచు మంద బుద్ధి న
యి విషయ మూహింప నైతి నే మన వచ్చున్ 25.

తే.గీ. దానవేశ్వరుండు స్వయము దండ్రి నాకు
రాక్షసేశ్వరు నేను భర్తగఁ బడసితి
నా సుతుఁడు శక్రనిర్జేత యీ సరణిఁ ద
లంచి గర్వింతు నిత్యమ్ము మించి నేను 26.

ఉ. నమ్మితి నిశ్చయమ్ముగను నా మన మందు మదీయ రక్షకుల్ 27.

సమ్మత శత్రు మర్దనులు సన్నుత వీర్య పరాక్రమోన్నతుల్
గ్రమ్మ నెఱుంగ రెట్టి భయ కారక వేదన లంచు సంతతం
బిమ్మెయి రాక్షసప్రవరు లెట్లగు మానవ భీతి మీ కిటుల్

సీ. నున్నని నల్లని మిన్న యయ్యింద్రనీలము వంటి మేను శైల సదృశమ్ము
కేయూర వైడూర్య కాయాంగద సిత ముక్తాహార మాలల కాంతు లడరు
గాత్రము విహరించు కాలమ్ముల రణమ్ములందు భృశము వెల్గు నంగ మాభ
రణ రాశినిఁ తటిత్తుల పగిది రంజిల్లు నట్టిది దుర్లభ మంటఁ దిరిగి
తే.గీ. ముళ్లపంది యీాకలఁ బోలు ముల్కు లుండ
నిరవకాశముగను మర్మ నివహముల వె
లువడఁ బ్రేవులు ధరఁ గూల వివశ మంది
రక్త కాంతుల వెల్గుచు రణ తలమున 28.

ఆ.వె. వజ్ర ఘాత భంగ పర్వతమ్మును బోలి
నేలఁ గూలి నట్టి కాల మేఘు
సన్ని భంపు మేన నున్న నశక్య మ
య్యె నిను గౌఁగిలింప నిపుడు నాకు 29.

కం. కలయా యిది సత్యంబా
యిల మృత్యున కీవు మృత్యువే పరికింపన్
విలయుఁడ వెవ్విధి నైతివి
కలనున రాఘవుని చేతఁ గాలు వశుఁడవై 30.

తే.గీ. ముజ్జగమ్ముల విత్తంపు భోక్త వీవు
ముజ్జగమ్ములకును భయము నిడి తీవు
లోకపాలుర గెల్చితి వీఁక నీవు
శంకరుని నెత్తి తింపుగ సత్త్వ మూని 31.

తే.గీ. నిగ్రహించితి గర్వుల నిత్య మీవు
నిల్పితి పరాక్రమమ్ము ననల్పముగను
క్షోభపెట్టితి జగముల ఘోరముగను
భూతముల నేడిపించితి మూరి ధ్వనుల 32.

ఆ.వె. విక్రమించి శత్రు వీరుల సన్నిధిఁ
బల్కుదు పరుషంపు వాక్యములను
స్వీయ వర్గ సర్వ భృత్యుల రక్షకుం
డ వతి భీమ కర్మల వధియింతు 33.

ఆ.వె. దానవేంద్ర! యక్ష తతుల వేల వధించి
నాఁడ వీవు బలము తోడ నని ని
వాత కవచుల వెసఁ బన్నుగ సంగ్రహిం
చితి వసుర వరేణ్య! వితత శూర! 34.

తే.గీ. నాశనమ్ము సేయుదువు జన్నముల నడరి
రక్షకుండ వగుదు స్వీయ రాక్షసులకుఁ
గూల్తు ధర్మవ్యవస్థను గోప మూని
మాయ సృష్టించు చుందు సమరము లందు 35.

కం. దే వాసుర మానవ క
న్యావలిని హరించు వాఁడ వచ్చట నచటన్
వేవేగ రిపుల నారుల
కీ విత్తు వెతలను నేతవే స్వజనులకున్ 36.

ఆ.వె. అసుర నిచయ నిలయ మైన లంకాద్వీప
మునకు రక్షకుఁడవు భూరి భీమ
కర్మము లొనరించు కౌణప పతివి మ
హా రథుండ విత్తు వన్ని మాకు 37.

తే.గీ. ఇట్టి యతుల ప్రభావ మున్నట్టి పతిని
రాము పాతితుఁ గాంచి స్థిరముగ నుంటి
దేహ మూని ప్రియుఁడు వీడ దేహ మాజిఁ
గరిన చిత్తను నేను నిక్కమ్ము నెంచ 38.

కం. గొప్పవి యగు తల్పమ్ముల
నప్పుడు శయనించి చక్క నసుర గణేశా!
యిప్పుడు దుమ్ము నెలంగెడు 39.

నిప్పుడమిఁ బరుంటి వేల నివ్విధి నాథా!

ఆ.వె. తనయు నింద్రజిత్తు విని లక్ష్మణుని చే హ
తుఁ డయి నట్లు కొట్టఁ బడితి నపుడు
బెడిదముగ నిపు డిటఁ బడఁ గొట్ట బడతి ఘో
రముగ నిట్లు నేను రాక్షసేంద్ర! 40.

ఆ.వె. హీన బంధు చయను హీన నాథను నేను
గామ భోగములకు నీ మహీ త
లమున దూర మయి చిరమ్ము శోకించు చుం
దు నిఁక శాశ్వతముగ దుఃఖమునను 41.

ఉ. పొందితె దీర్ఘ మార్గమును బోవ నశక్యము రాక్షసేశ్వరా!
కుందున నే వసింప నిటఁ గోర ననుం గొని పొమ్ము నీవు లే
కెందుల కిట్లు నన్ను విడి యెంచితి వేఁగ వచింప వేల నే
వందుచు నుండ దీన నయి వాక్యము లెవ్వియు మంద బుద్ధితో 42.

కం. నగర ద్వారము నుండి ము
సుఁగు లేకయె రాఁగ నడచుచును నాథా! నే
ను గని సహింపక క్రుద్ధుఁడ
వు గాదు గద నా పయిం బ్రభు! నిజాంగనపై 43.

ఆ.వె. ఇష్ట దార! దార లిట్లు వెడలి రాఁగ
వీడి ముసుఁగు లెల్ల బిడియ పడక
బయట కెల్లరు గని పడయ వేల కినుక
సుంతయుఁ బరికింపఁ జోద్య మయ్యె 44.

ఆ.వె. క్రీడ లందుఁ దోడు కృత్స్న మీ దారా జ
నమ్ము నీకు నిల్చె నుమ్మలించి
యిట ననాథ భంగి నేల యోదార్పవు
గౌరవింప కుంటి కరుణ వీడి 45.

ఉ. స్త్రీలు పతివ్రతా మణులు  సేవలఁ బెద్దలఁ దన్పు వారు నీ 46.

చే లలితాంగు లెందఱో కృశించిరి యార్తిని భర్తృ హీనలై
వాలఁగ వారి శాపములు వశ్యుఁడ వైతివి వాని కివ్విధిన్
వ్రాలిన విప్లు నీ పయిన భర్తలఁ బాసిన వారి తిట్టులే

తే.గీ. పడ విలఁ బతివ్ర తావలి భాష్పములు ద
లంప రిత్తగ నెన్నండు రాక్షసేంద్ర!
యన్న నానుడి యిత్తఱి నయ్యె నిజము
నీ యెడలఁ బరికింపగఁ బ్రాయికముగ 47.

కం. లోకముల నాక్రమించి య
హో కుత్సిత కార్య మెట్టు లొనరించితి నీ
వీ కాంతా చౌర్యమ్మును
నీకుఁ దగునె గర్వమాని! నిస్సత్త్వుఁడవే 48.

కం. మృగ కపటమ్మునఁ దోర
మ్ముగం దఱిమి రాముని వని భూసుతఁ గొన్న
ట్టి గతి దలఁపఁ బిరికి తనమె
తగునే శూరుల కొనర్పఁ దలఁపవు మదిలో 49.

కం. పిరికితనం బది నీ యం
దు రణమ్ముల నుండ నెఱుఁగ దుర్భాగ్యమునన్
ధరణిజఁ దెచ్చితి లక్షణ
ము రాక్షస! యది యఘు పక్వమునకుఁ దలంపన్ 50.

తే.గీ. జరిగినవి జరిగెడివియు జరుగు చున్న
వి యెఱుఁగఁ గలట్టి నా మఱఁది యపహృతను
సీతఁ గాంచి నిట్టూర్చుచుఁ జింత సేసి
యా విభీషణుం డన్నది యరుగుదెంచె 51.

తే.గీ. సత్య వచనుండు దీర్ఘ భుజద్వయుండు
వలికిన యసుర ముఖ్యుల పాటు వచ్చెఁ
గామ రోష సంజనితము కాంత పైన
మోహ మడరంగ నీ కిట్లు మూరె లయము 52.

ఉ. నీదు నిమిత్తమే కలిగె నెవ్వగ మూల హరమ్ము ఘోరమే
యీ దెస రాక్ష సాన్వయమె హీన మనాథగ నయ్యెఁ ద్వత్కృతిన్
రా దిల నేను నొవ్వగను రాడ్వర! వీర్యుఁడ పౌరుషోన్నతా!
నా దగు స్త్రీ స్వభావమున నాథ! వహించితి దైన్య మాత్మలో 53.

కం. కొని పుణ్యముఁ బాపమ్మును
జని తీ వరయఁగ నిజ గతి సలిపి సమరమున్
నిను గని నిహతుని దుఃఖ
మ్మున నే శోకించు చుంటి బోరునఁ బుడమిన్ 54.

కం. విన వీవు సఖుల నీ హిత
మును గోరెడు వారి గిరల మోహాంధుఁడవై
యను జోక్తమ్ముల నైనను
వినవే హితముల దశాస్య! వెఱ్ఱితనమునన్ 55.

తే.గీ. చేయవు విభీషణుఁడు సక్కఁ జెప్పి నట్టి
పనిని హేత్వర్థ యుతము శుభము నొసంగు
పనిని శాస్త్ర సమ్మతముగఁ బరఁగు దాని
యుక్తి యుతము నక్రూరము నుచిత మైన 56.

కం. మారీచ కుంభకర్ణులు
తీరుగ నా తండ్రి నేను దేఁటపఱుప ర
క్షో రాడ్వర! బల మత్తత
మూర వినమి యీ ఫలమ్ము మూరెం జుమ్మీ 57.

తే.గీ. నీల ఘన సన్ని భాంగుఁడ! మేలి పసుపు
రంగు బట్ట లతిశయిల్లఁ బ్రభల నంగ
దమ్ములు మెఱయంగ నవయవమ్ము లుంచి
నేల నెత్తు రోడఁగ శయనింతు వేల 58.

ఆ.వె. నాథ! పలుక వేల నా తోడ ననిఁ బాఱ
నట్టి వీర్య యుతుని నఖిల జన ను 59.

త వర యాతుధాను దౌహిత్ర!నిద్రించు
నట్టి వాని పగిది నార్త తోడ

తే.గీ. క్రొత్త యవమాన ముదయించె ఘోర రీతి
నేఁడు లంకాపురము నందుఁ జూడు సూర్య
రశ్ము లవి సొచ్చుచుండె నిర్భయముగాను
నెమ్మి నిద్రింతు విట్లేల లెమ్ము లెమ్ము 60.

చం. కరమున నుంచి దేని నరి కాయముఁ ద్రుంచితి వాజిలోఁ బ్రభా
కర సదృశప్రభాచయ నికాశము వజ్ర నిభమ్ము ఖండి తో
గ్ర రిపు గణమ్ము కాంచన వికాశి భవార్చిత హేతి యట్టి నీ
పరిఘను జూడు ముక్క లయి బాణములం బడి యుండె వేలుగన్ 61.

కం. ప్రియ సతి నా నేల యిటుల
శయనించితి కౌఁగిలించి సమరావని న
ప్రియ వోలెను నా తోడుత
నయముగ మాటాడ వేల నాథా! చెపుమా 62.

ఆ.వె. వనరునం బగులదు పంచత్వ మంద నీ
విట్లు నాదు గుండె యిచట వేయి
ముక్కలుగను గఠినము కడింది యిస్సిరో
యిది తలంచి చూడ నెప్పగిదిని 63.

కం. విలపించుచు నశ్రుల న
క్షులు వ్యాకులము లయి యుండఁ గుందుచు నంతన్
వలపు సెలంగ మనము దు
ర్బలమ్ము గా మోహ మందె రాణి భృశముగన్ 64.

ఆ.వె. మూర్ఛ సన్నగిల్లి పొలఁతి రావణు వక్ష
మందు వెలిఁగె సంధ్య యందు నెఱ్ఱ
నై చెలంగు మేఘు మందుఁ బ్రకాశించు
నట్టి మెఱపు పగిది నసుర కాంత 65.

చం. సవతులు దుర్భరం బగు దశం గల యట్టి సపత్ని లేపి యం
త వగచు చుండి యాతురలు దారను మిక్కిలి యూఱడించి దే
వి! విదితమే గదా విభుల విత్తము లెల్లను జంచలమ్ము లౌ
టవి దశ మాఱి నంతటనె యంచు వచింపఁగ వార లెల్లరున్ 66.

ఆ.వె. ఆలకించి వార లనుచుండ మండోద
రి విలపించె ధ్వనులు రేఁగ భృశము
కాంత తడుపు చుండి కన్నీట నిర్మ లా
స్యము నురోజముల విచార మడర 67.

ఉ. ఆరసి యంతలోన నట నయ్యసురేంద్రు విభీషణున్ మహా
వీరుఁడు వల్కె రాఘవుఁడు వేగ విభీషణ! యన్న కింక సం
స్కార మొనర్పు మింపుగను గాంతల పే మరలింపుమా తగన్
వారిని నూఱడించి యనఁ బార్థునిఁ గాంచి విభీషణుం డనెన్ 68.

చం. మదిఁ బరికించి ధర్మ రత మాన్యుఁడు పల్కులు ధర్మ యుక్తముల్
విదిత మితండు క్రూరుఁ డవివేకి నృశంసుఁ డసత్య వాదియుం
దదుపరి సంగ్రహించుఁ బర దారల ధర్మ విహీనుఁ డెన్న నే
ను దగనె యగ్ని కార్యములనుం దమి వీని కొనర్ప రాఘవా! 69.

ఉ. రావణుఁ డన్న రూపమున వ్రాలిన శత్రు వితం డనర్హుఁడే
భూవర! పూజ లందఁగను బూజ్యుఁడు నైన గురుండు గావుటన్
నీవు నృశంసుఁ డౌదు వని నేరి త్యజింతురు నన్ను భూజనుల్
రావణు దుర్గుణమ్ములను రామ! యెఱుంగ స్తుతింత్రు వారలే 70.

కం. విని ప్రీతుండై యాతనిఁ
గని ధర్మధరుల ఘనుండు కాకుత్స్థుం డా
మినుకుల నేరిన నేర్పరి
యనెఁ దా వాక్యమ్ము లిట్టు లర్థ యుతమ్ముల్ 71.

ఉ. నేనును నీకునుం బ్రియము నెమ్మి విభీషణ! చేయఁగా వలెం
గానఁగ నీదు సాయమునఁ గయ్యము గెల్చితి రాక్షసేశ్వరా!
కాన నవశ్య మే నుడువఁగా వలె యుక్తము లైన వాక్యముల్ 72.

మానుగ నీకు నిత్తఱిని మంచివి కొన్నిటి నాలకింపుమా

ఉ. ఈతఁ డధర్మ వర్తనుఁడు నింక నసత్య వచో యుతుండునౌ
యాతత వీర్యుఁ డంకముల నంచిత శూరుఁడు గొప్ప తేజ మం
దీతని కీతఁడే సముఁడు సేంద్ర సురాలి కజేయుఁ డాజిలో
నీతని విందు మట్టు లసురేంద్రుఁడు లోక విరావణుండునున్ 73.

కం. మర ణాంతమ్ములు వైరము
లరసితిమి స్వకార్యము మన మందఱ మాజిన్
గురు సంస్కారము లెల్ల నొ
నరింపు నీకు నితఁ డెట్లొ నాకును నట్లే 74.

తే.గీ. అర్హుఁ డీతఁడు నీ నుండి యందఁగ విధి
పూర్వకమ్ముగ సంస్కారములను ధర్మ
యుక్తముగను విభీషణ! యుచిత కీర్తి
నందఁ గలవాఁడ వీవు నమంద రీతి 75.

కం. విని రాఘ వేంద్రు వాక్యము
ల నా విభీషణుఁ డపుడు త్వరపడుచును దొడం
గె నొనర్పఁగ సంస్కారము
లను రావణునకు సభక్తి రణ నిహతునకున్ 76.

తే.గీ. గంధపుం జెక్కలును బద్మకములు వట్టి
వ్రేళ్లు నున్ని బట్టల పైన వేసి నొదను
బేర్వ వేద యుక్తమ్ముగ వీర వర్యు
రావణు నపర క్రియలు పరఁగఁ దొడంగె 77.

తే.గీ. రాక్ష సేంద్రున కొనరించి రా క్షణమున
నుత్తమ పితృమేధముఁ జక్క నుంచి యంత
వేది నాగ్నేయమున నగ్ని వెలయఁ జేసి
రి దగి నట్టి స్థానమ్ములఁ గుదురు గాను 78.

తే.గీ. పెరుఁగు నేతిని నిండ నింపిన స్రువమ్ము 79.

పైచి రాతని భుజముపైఁ బాదముల స
రస శకటము నుంచిరి తొడల దెస బోటి
నుంచిరి దశకంఠున కప్పు డంచితముగ

తే.గీ. ఎల్ల దారు పాత్రమ్ముల నింక నరణి
నుత్త రారణి బోటిని నుక్త రీతి
నన్యముల వాని స్థానము లందుఁ జెంత
నుంచి నొద చుట్టు తిరిగిరి యుచిత రీతి 80.

ఉ. అంతటఁ జంపి శాస్త్రముల నారసి నట్టి విధమ్ము మౌను ల
త్యంతము చెప్పి నట్టి గతి నంచిత జంతువు నెల్ల రక్కసుల్
సాంతము నాజ్య మం దిడిన యట్టి వపం దగ రాక్షసేంద్రు నా
స్యాంతర మందు నుంచిరి దశాస్యున కత్తఱి దీన మానసుల్ 81.

ఉ. రావణు గంధ మాల్యముల రాక్షసు లంత నలంకరించి నా
నా వస నోత్తమమ్ముల ఘనమ్ముగఁ గూడి విభీషణున్ ఘనున్
వే పెదచల్లి లాజలను వేదన నేడ్చిరి శాస్త్ర రీతినిం
దా వగ నా విభీషణుఁడు తత్క్షణ మిచ్చెను వహ్ని నన్నకున్ 82.

ఆ.వె. స్నాన మాచరించి తా నార్ద్ర వస్త్రుండు
నంత దర్భ లున్న యట్టి యుదక
మును దిలలను నోదరునకు నర్పించి శి
రమ్ము వంచి మ్రొక్కె రావణునకు 83.

ఆ.వె. రాక్ష సాంగనలను వీక్షించి యనునయిం
చెను విభీషణుండు వనిత లార!
వెడలుఁ డింక నంచు వడి మాటి మాటికి
నగరి కేఁగి రంత నారు లెల్ల 84.

కం. చేర నతివ లెల్లఁ బురము
నా రక్షోవర విభీష ణాఢ్యుఁడు నమ్రుం
డై రాముని చెంత నిలిచె
గౌరవ మేపార నంతఁ గాకుత్స్థునిపై 85.

కం. రాముండు ససుగ్రీవ స
సౌమిత్రి ససైన్యము రిపుఁ జంపి రణమునం
దా మోదమ్ము వడసె సు
త్రాముఁడు వృత్రుని విధమ్ము రాఘవుఁ డంతన్ 86.

తే.గీ. శత్రు సంహారకుం డంత స శర చాప
ము కవచము మహేంద్ర సుదత్తము విడనాడె
రోషమును గూడి చంప శత్రువును రాఘ
వుండు సౌమ్యుఁ డయ్యె నెడంద మెండుగాను 87.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట పదునాలుగవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 115.

రాముని పంపున లక్ష్మణుఁడు విభీషణునకు లంకా రాజ్యాభిషేకము సేయుట, రాముఁడు సీతకుఁ గుశల వార్తను దెలిపి సందేశమును దెచ్చుటకు హనుమంతునిఁ బంపుట.

కం. సుర దానవ గంధర్వు ల
సురేంద్రు రావణుని వధను జూచి రణము నం
దరిగిరి శుభ కథ లనుచును
మురియుచుఁ దమ తమ విమానములఁ ద్వరితముగన్ 1.

ఉ. రావణు ఘోర మైన వధ రాముని వీర్యము వాన రాలి పో
ర్చేవయు వాన రాధిపుని చింతన సీత పతివ్రతా గుణం
బా వర వీర్య లక్ష్మణుని యగ్రజుపై రతి వారు వల్కుచుం
బావని విక్రమమ్ము రహి వచ్చిన దారిని వేఁగ రెల్లరున్ 2.

తే.గీ. రాఘవుఁడు మహా బాహువు రథము నింద్ర
దత్తమును వహ్ని సదృశము నుత్తమముగ
గౌరవించి మాతలిని నా సారథిఁ దగ
ననుమతించెను మరలంగ నంత దివికి 3.

కం. అనుమతి నంది యటుల రా
మునిచే నరదమ్ము దివ్యమును మాతలి యె
క్కి నగారి సారథి ముద
మ్మున నింద్రునిఁ గాంచఁ జనె నభో వీథిఁ దమిన్ 4.

తే.గీ. స రథము దివ మేఁగఁగ సుర సారథి రథి
కప్రవరుఁడు రాముఁడు ప్రీతిఁ గౌఁగిలించి
కొనియె సుగ్రీవుఁ బ్రేప ననుజుఁ డంత
హరులు పూజింపఁ జేరె బలాలయమ్ము 5.

ఆ.వె. కాంచి చెంత నంతఁ గాకుత్స్థుఁ డట లక్ష్మ
ణు శుభలక్షణుని ఘనుని స్వ తేజ
మందుఁ బలికె నిట్టు లా సత్య సంపన్ను
తోడ గిరలను బరితోష మడర 6.

ఉ. చెన్నుగ నీవు చేయు మభిషిక్తుని సౌమ్యుని నీ విభీషణుం
గ్రన్నన లంక కింపుగను రాజుగ భక్తుఁ డితండు రక్తుఁడున్
మున్నుపకార మింపుగను మూరి యొనర్చెను గోర్కి యాత్మలో
మిన్నగఁ గాంచ రాజుగను మిత్రు విభీషణు రావణానుజున్ 7.

కం. అన రాముఁ డిట్టు లట్టులె
యని లక్ష్మణుఁ డన్న తోడ నానందముగన్
మనుజర్షభుండు వేగమ
కనకంపు ఘటమ్ము నొకటి గైకొని యంతన్ 8.

ఆ.వె. కనక ఘటము నుంచి కపి నాయకుల హస్త
మందు లక్ష్మణుండు తొందరగ మ
నోజవులను హరులను బలాఢ్యులను సము 9.

ద్ర జలము గొనితేరఁ దడయ కనిపె

కం. చని శీఘ్రమ్ముగఁ బ్లవగులు
మనోజవు లెగురి గభీర మకరాలయముం
గని నీరమ్మును ఘటమునఁ
గొని తెచ్చిరి యుద్యమించి కోరిన రీతిన్ 10.

తే.గీ. అంత లక్ష్మణుండు గ్రహించి యా ఘటమును
నిలిపి తగ విభీషణు ఘనుని వర పీఠ
మున విభునిగ లంకా రాజ్యమునకు విమల
జలమున నభిషేకించెను లలిత రీతి 11.

తే.గీ. మంత్ర దృష్టిని నసురుల మధ్య స్నేహి
తులను గూడి రామాజ్ఞ సంతోషముగ య
థా విధి నభిషేకించిరి తరుచరు లసు
ర వరులు స్తుతించిరి మురిసి రాఘవేంద్రు 12.

కం. కని లంకా పురి కభిషి
క్తు నమాత్యులు సంతసింపఁ దోరమ్ముగ నా
తని భక్తులు హర్షించిరి
ఘనమ్ముగ విభీషణు నిజ కాంతుని సెదలన్ 13.

ఆ.వె. రాముఁ డతుల ముదము లక్ష్మణ సహితమ్ము
వడసె నంత నసుర వరుఁడు రాజు
గా విభీషణుండు కాకుత్స్థ దయ రాజ్య
మందఁ బరమ హర్ష మందె నెడఁద 14.

కం. పౌరుల నోదార్చి యసుర
వీరుండు విభీషణుండు వినయమ్ముగఁ దా
జేరెను ముదమ్ము మీఱఁగ
నా రాముని చెంత కంత నసురేశ్వరుఁడే 15.

ఉ. తెచ్చిరి పౌరు లక్షతలు తియ్యని మోదక కోటి లాజలున్ 16.

విచ్చిన పుష్పరాసులు విభీషణునిం గని యిచ్చి రింపుగా
మెచ్చుచు నా నిశాచరులు మేటి నిశాటుఁడు వాని నంది దాఁ
గ్రచ్చఱ మంగళమ్ములను రాఘవ వర్యుల కిచ్చె భక్తిమై

కం. కని కృత కార్యుని సంప
న్ను నా విభీషణు గ్రహించెను రఘువరుఁడు నె
మ్మిని సమ్మతించి యన్నిటి
మనుజేంద్రుండు సఖుఁడు పరమప్రీతుండై 17.

కం. అంజలి ఘటించి నిల్చిన
యంజన సుతుని హనుమంతు నారసి సరసం
గంజ దళాక్షుఁడు రాముఁడు
మంజులముగఁ బల్కె నంత మాటల నిట్లున్ 18.

ఆ.వె. గౌరవించి యసుర కాంతు విభీషణు
ననుమతిఁ బడసి తగ నాంజనేయ!
సౌమ్య! లంక కేఁగి జానకిఁ గని రావ
ణాలయమ్ము నందు హరి వరేణ్య! 19.

తే.గీ. విజయమున కభినందించి వీర వర్య!
నాదు సుగ్రీవు లక్ష్మణు నరవరేణ్యు
కుశలములు దెల్పి రావణు కూలుట నెఱిఁ
గించి నా చేత రణ మందు నంచితముగ 20.

కం. హరి వీర యీ ప్రియమ్మును
ధరణిజకు వచించి నీవు తగిన విధముగం
దిరిగి యిటకు సందేశము
పరిగ్రహించి యరుదెంచ వలె శీఘ్రముగన్ 21.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట పదునేనవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 116.

రామునిచే నాదేశింపఁ బడి హనుమంతుఁడు విభీషణు ననుజ్ఞ వడసి లంకా పురిలో నశోక వృక్ష
మూలమున దుఃఖముతో నున్న జానకిఁ గాంచి రామ సందేశము దెలిపి నా భర్తను జూడఁ
గోరుచున్నా నన్న సీతా సందేశమును రామునకు వచింప వచ్చుట.

కం. ఆనతి నివ్విధము వడసి
వానర వర్యుండు హనుమ వాయు కుమారుం
డానందమున నిశాచర
మానితుఁడై లంకకుఁ జనె మానినిఁ గాంచన్ 1.

చం. హనుమ విభీష ణానుమతి నంత గ్రహించి పురమ్ము లంకకుం
జని తగ వృక్షవాటికను జానకి సేరిన మారుతాత్మజుం
డనిల జవుండు సేరి కనె నార్తను సీతను రాక్షసీ వృతం
దనువె యలంకరింపని విధంబున నుండఁగ హర్ష హీననున్ 2.

తే.గీ. వృక్ష మూలమ్ము చెంతను భీత రోహి
ణీ సతీ నిభ నారసి నిలిచెఁ జేరి
వంగి వినయమ్ము మీఱఁగ వందన మొన
రించి మౌనమ్మును వహించి యంచితముగ 3.

ఉ. వచ్చిన మారుతాత్మజుని బల్లిదు నచ్చట గాంచి యాత్మఁ దా
నచ్చెరు వంది మౌనముగ నత్తఱి జానకి యుండి క్రమ్మఱన్
హెచ్చుగ నూనె సంతసము నీతని నంతట గుర్తుపట్టఁగా
నిచ్చను సౌమ్య వక్త్రమును నింపుగ మారుతి గాంచి యంతటన్ 4.

చం. పలుకఁ దొడంగె రాఘవుని వాక్యము లెల్ల విదేహరాట్సుతా!
యిలఁ గుశలుండు రాముఁడు హరీశ్వరు లక్ష్మణుఁ గూడి యా ప్లవం
గుల బల సంయుతమ్ముగను గ్రూరుని రావణుఁ జంపి ఘోరపుం
గలనున వారి సాయమునఁ గాంతరొ పల్కెను నీకు క్షేమమున్ 5.

చం. పలికెను దాఁ గృతార్థుఁ డయి పార్థుఁడు రాఘవుఁ డిట్లు వాక్యముల్
సలలిత మైన నీ ప్రియము సక్కఁగఁ బల్కుదు సంతసింపుమా
లలన! జయింప నే ననినిఁ బ్రాణములం దనరంగ నయ్యె నీ
కిలఁ గన భాగ్య వశ్యమున నింపుగ నివ్విధి ధర్మపారగా! 6.

చం. మనకు లభించెనే జయము మానుగ జానకి వీడి దుఃఖమున్
మనమున సంతసింపు మిఁక మ్రుందె దశాస్యుఁడు వైరి లంకయున్
మన వశ మయ్యె నిద్ర విడి మానిని నిన్ను జయింప సాగర
మ్మున వెసఁ గట్టి వంతెనను మూరి ప్రతిజ్ఞను నిర్వహించితిన్ 7.

ఆ.వె. రావ ణాలయమున నీ వుండ వలదు సం
భ్రమము లంక యెల్ల రాక్షసేశ్వ
రుఁడు విభీషణునకు లొంగి యుండు పగిది
సేయఁ బడియె నిపుడు చింత యేల 8.

కం. కాన మది నూఱడిల్లుమ
నీ నివసన మందు నున్న సెటి వైదేహీ!
కానఁగ నిను సంతోషము
నూని విభీషణుఁడు వచ్చు నున్నత గుణుఁడే 9.

కం. అన విని లేచి శశి నిభా
నన సీత సెలంగ ముదము నారీమణియే
యన లేక యడ్డు కొనఁగ వ
చనమ్ము లెవ్వియు నిలిచెను జక్కఁగ నెదుటన్ 10.

ఉ. ఏలనొ సుంత యేని బదు లీయని సీతను గాంచి వాయుజుం
డేలను దేవి యుంటి వచియింపక యెద్ది దలంతు దేని నీ
వేలను నంచుఁ దన్నడుగ నెంతయొ ప్రీతి వచించె భాష్పముల్
సాల స్రవింప గద్గదతఁ జాగని మాటల సీత యిట్టులన్ 11.

తే.గీ. ధర్మ పథ మందు నిల్చిన ధరణిజ గని
యనిల నందను ననియె నో హనుమ! వినఁగ
భర్తృ విజయమ్ము సంతోష వశను గాఁగ 12.

నోట నొక క్షణ మే నుంటి మాట రాక

ఆ.వె. కాన రాక యుంటి దేని నొసఁగ నీకుఁ
గల్గు సుఖము మదికిఁ గపివరేణ్య!
ప్రియము చెప్పి నట్టి వినుత సౌమ్యున కేను
బుడమి నందు నెందు నడరు దాని 13.

ఆ.వె. సాటి రావు నీదు మాటలకు గణింప
వెండి యైన నా పసిండి యైన
వివిధ రత్నములును విను ముజ్జగమ్ముల
రాజ్య మేని వానరప్రవీర! 14.

కం. పలుకఁగ వైదేహి వచన
ము లివ్విధమ్ము ప్లవగోత్తముఁడు హర్షుండై
నిలిచి యెదుట సీతకు నం
జలి తోడ మరుత్సుతుండు సయ్యనఁ బలికెన్ 15.

చం. పతి హితముం బ్రియమ్ములను భర్తృ జయం బెద లోనఁ గోరెడిన్
సతి వయి స్నేహ వాక్యమును జక్కఁగఁ బల్కఁగ సౌమ్య! నీకె యీ
గతి జనకాత్మజా! తగును గాంత! యనిందిత! సారవంత మం
చితమును రత్నరాశికిని శ్రేష్ఠమ యెక్కుడు దేవ భూమికిన్ 16.

తే.గీ. సుస్థితుని రాముని విజయ శోభి తాత్ముఁ
గాంచితిని నేను దేవి! సుఖమ్ముగ నిట
ననఁగ దేవరాజ్యము మొదలైన గుణము
లన్నిటినిఁ బొందితిని భూజ! యంచితముగ 17.

మ. అన వాక్యమ్ముల నాలకించి మదిలో నానంద మేపారఁగా
హనుమంతుం గని సీత యంత శుభవాక్యమ్ముల్ వచించెం దగన్
ఘనముల్ లక్షణ పుష్కలమ్ములగు వాక్యమ్ముల్ సు మాధుర్యముల్
గన నష్టాంగ యుతుండ వాడితివి శాఖా సన్మృగేంద్రా! మతిన్ 18.

తే.గీ. ఇట్లు వచియింప నర్హుఁడ వీవ శ్లాఘ 19.

నీయుఁడ వనిల సుతుఁడవు నిగమ వేత్త
పరమ ధార్మికుండవు శౌర్య బల పరాక్ర
మ వినయస్థైర్య తేజః క్షమా గుణుఁడవు

ఆ.వె. సత్త్వ దాక్ష్య ధృతులు సద్గు ణాన్యమ్ము ల
నేకముల నలరుచు నిత్య ముందు
వీవు నుత చరిత్ర! నీ విట్లనంగ న
చ్చెరువు నంద నేల హరి వరేణ్య! 20.

ఉ. అంతట నిల్చి కట్టెదుట నంజలి హర్షము మీఱ నమ్రుఁడై
సుంతయు భీతి లేక యరిసూదనుఁ డిట్లు వచించె సీతతో
నింతుల రాక్షసాంగనల నెల్లర నిత్తఱి నీకు మున్నహో
వంత లొసంగి నట్టి వెడ భామలఁ జంపుదు నాన నిచ్చినన్ 21.

ఉ. వింటిని రాక్ష సాంగనలు వే పరుషమ్ములు వల్కఁ బల్మఱుం
గంటకముల్ వికారములు గన్నులు సూపులు నివ్వటిల్లఁగా
వెంట చరించి సంతతము వేదన లిచ్చుచు భర్త దేవకుం
దొంటిని నయ్యశోక వనిఁ దొయ్యలి! నీవు కలంత నుండఁగా 22.

ఉ. ఘోర తరంపు వర్తనలు ఘోరత రాకృత రాక్ష సాంగనల్
క్రూరలు క్రూర భాషణలు క్రూర క చేక్షణ లెల్లరున్ వెసన్
వీరిని ఘోర మానసల బెట్టిదముల్ వివిధమ్ము లైన వౌ
దారుణ మైన ఘాతములఁ దప్పక చంప వరమ్ము నీయుమా 23.

తే.గీ. పిడికిళుల చేతి దెబ్బలఁ బెద్ద బాహు
వులను బిక్కల మోకాళ్ల వెలయు దెబ్బ
ల రదములచేఁ గొఱికి చెవుల నసలం ది
ని నెఱులం బీఁకి లంఘించి తనువుల పయి 24.

తే.గీ. ముఖములం బట్టి యెండించి మూరి చీల్చి
విఱుగ మెడలును బ్రక్కలు పెను భుజములు
వ్రాల మొండెమ్ము లెల్లఁ జంపంగ నెంతు
నీకు కీ డొనరించిన నెలఁతల నిట 25.

కం. ఇట్టు లనే కాభిహతులఁ
గొట్టి వధింతును సుకీర్తి! ఘోరాంగనలన్
బెట్టిదముగ నిను బాధలు
పెట్టిన దుష్టాంగనలను భీకర రీతిన్ 26.

కం. హనుమంతుం డిట్లన విని
జనకాత్మజ దీన జన నిచయ వత్సల ప
ల్కెను జింతించి యొకింత మ
దినిఁ బరిశీలించి కరుణ తేటపడంగన్ 27.

కం. రాజాశ్రయ వశ్యల నిజ
రాజాజ్ఞం జేయు వారి రామావలి దా
సీ జనముల నెవ్వండు మ
నోజవ! కని కోప మూనును హరివరేణ్యా! 28.

ఉ. మున్నొనరించి నట్టి పని మూరిన భాగ్య వియోగ హేతువే
నన్నిటు లుంచ దుఃఖమున నా కిది యెల్ల భుజింప నర్హమౌ
యెన్నగ స్వీయ కర్మ మిది యిట్లు వచింపకు దీర్ఘ బాహుఁడా!
చెన్నుగ దైవ చోదితము సేరె దశాయత యోగ మివ్విధిన్ 29.

తే.గీ. వీర! రావణ దాసులు వీరి సైఁతు
రావ ణాజ్ఞ నదల్చిరి చేవ మీఱ
హతుఁడు గాఁగ నాతం డిప్పు డతివ లింక
నన్ను దర్జింప రయ! వాయు నందనుండ! ! 30.

కం. కల దొక్క వ్యాఘ్ర సన్నిధి
నెలుఁగు వచించినది శ్లోక మింపైన పురా
ణ లలిత సూక్తము దాని న
నిల నందన! తెలిసికొనుమ నెమ్మిని హనుమా! 31.

ఆ.వె. పరుల కింత యేని పాప కర్ముల కుత్త
ముండు హాని దలఁప కుండు నెపుడు 32.

సత్పురుషులు ధరణిఁ జారిత్ర భూషణు
లౌటఁ గాతురా నియమము నెపుడు

ఆ.వె. పాపు లైనఁ బరమ పావను లైనను
జంపఁ దగిన నైన నింపుగ దయ
సూపఁ దగును హనుమ! సుజనుల కపరాధి
కాని వాఁడు కలఁడె కాంచఁ బుడమి 33.

కం. తగదు చెడు సేయ నేరికి
జగముల హింసించు చుండి సంచారము సే
యఁగ గమకించెడు నసురుల
కుఁ గపీంద్ర! యఘముల లోనఁ గూరిన నైనన్ 34.

చం. అన వచనమ్ము లిట్లు విని యా ప్లవగేంద్రుఁడు వల్కె నిట్టులన్
విను తగు ధర్మపత్నివి భువిన్ రఘు రామున కీవు సద్గుణా!
చనియెద రాము చెంతకును జక్కని యుత్తర మిమ్ము దేవి! నా
కన ననె సీత నాదు ప్రియ కాంతుని దర్శన మేను గోరెదన్ 35.

కం. విని జానకి వాక్యములను
హనుమంతుఁడు సంతసించి యనిలాత్మజుఁ డి
ట్లనెను మహాద్యుతి వైదే
హిని హర్షితఁ జేయుచును హరీంద్రుం డంతన్ 36.

తే.గీ. ఆర్య! గాంతువు పూర్ణ చంద్రానను ని స
లక్ష్మణు స్థిరమిత్రుని రఘు రాముని హత
శత్రువుని శచీ దేవి యా శక్రుఁ బతినిఁ
గాంచిన విధము వల్కి యిట్లంచితముగ 37.

తే.గీ. శ్రీ సతీ సన్నిభము వెల్గు సీత తోడఁ
బలికి యిట్లు హరీంద్రుఁడు వాక్యములను
మారుతాత్మజుం డింపుగ మారుత నిభుఁ
డేఁగె రాముని చెంతకు వేగముగను 38.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట పదునాఱవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 117.

రాముని యాజ్ఞతో విభీషణుఁడు సీతా దేవి చెంత కేఁగి రాముని వచనములను జెప్పి స్నాత సాలంకృతను రాముని చెంతకు రప్పించుట.

కం. సాదరము మహా ప్రాజ్ఞుని
మేదిని లోన విలుకాండ్ర మేటి నరవరుం
దా దాశరథిఁ గని హనుమ
పే దండము లిడి వచించె వికచాస్యునితో 1.

ఉ. ఎవ్వరి కోస మీ పనుల నింపుగఁ జేసితి మిట్టు లార్య! నీ
వవ్వనితా మణిన్ ఫలము నంచిత దేవిని శోక తాపమే
నివ్వటిలంగ నున్న సతినిం గన నర్హుఁడ వౌదు రామ! నీ
యివ్విజయమ్ముఁ నేరి మది నెంతయొ సంతస మందె సీతయే 2.

తే.గీ. కాంత భాష్ప పర్యాకు లేక్షణ మును నను
గన్న నమ్మకమున నన్ను గాంచి పలికె
రాముని కృతార్థునిఁ బతి సలక్ష్మణుఁ గనఁ
గోరుచుంటి నంచుఁ దనదు కోర్కి నపుడు 3.

కం. హనుమంతుండు వచింపఁగ
విని ధర్మాత్ముల ఘనుండు వీరుండు మన
మ్మున ధ్యాన మగ్నుఁ డయ్యెను
గనులన్ నీ రొలుక నంతఁ గమలాక్షుండే 4.

ఉ. వేఁడిగ నిశ్వసించి కడు పెద్దగఁ జూచుచుఁ దాను మేదినిం
బాడిగ నా విభీషణునిఁ బ్రక్కన కాంచి వచించె మజ్జనం 5.

బాడిన దివ్య భూషణవ రాంచిత చర్చిత భవ్య వస్త్రఁ బూఁ
బోఁడిని సీత నిచ్చటను బోరన నిల్పుమ రాక్షసోత్తమా!

చం. పలుకఁగ నిట్లు రాఘవుఁడు పమ్మిన వేగము తోడ నేఁగి తా
నిలయము నా విభీషణుఁడు నెమ్మినిఁ జొచ్చి నిజాంగ నాదులం
దెలుపఁగ సీత కంపి కని దేవిని సీతను మోడ్చి చేతులం
బలికెను రాక్షసేశ్వరుఁడు వాక్యము లిట్లు వినమ్రుఁడై తగన్ 6.

తే.గీ. దేవి! దివ్యానులేపన దివ్య భూష
ణ వర భూషితవు నయి యానమ్ము నెక్కు
భద్ర మగు నీకు జానకి! భర్త రాముఁ
డువిద! నిను జూడ నటఁ గోరుచున్నవాఁడు 7.

ఉ. నా విని స్నాతఁ గాక నిజ నాథుని రామునిఁ గాంచఁ గోరెదన్
నా వచియింప సీత విని నైరృత నాథుఁడు వల్కె నివ్విధిన్
నీ వొనరింపఁగాఁ దగుదు నీ పతి రాముఁడు చెప్పి నట్టులన్
నా విని యా పతివ్రత యనంతర మార్తిని నట్టులే యనెన్ 8.

తే.గీ. జానకిని శిరస్స్నాతను జవ్వను లల
రుచు నలంకరింపఁగ నగలు వసనమ్ము
లందు విలసిల్లఁగ నునిచి యసుర గుప్త
పరమ వసన వృత శిబికా వరము నందు 9.

తే.గీ. చేరి యా మహాత్మునిఁ దెలిసియును ధ్యాన
మందు నున్న రాముని వంగి యవ్విభీష
ణుండు సంతోషమును బొంది మెండుగ నెద
వచ్చెను జనకాత్మజ యంచుఁ బలికి నిలిచె 10.

ఉ. వచ్చెను సీత యన్న విన స్వాంతము నందు ముదమ్ము దైన్యమున్
హెచ్చుగ రోషముం గలిగె నిత్తఱి మూడును నేక కాల మం
దచ్చట రాక్షసాలయము నందు చిరమ్ము వసించి దారయే
వచ్చుటఁ జేసి రామునకుఁ బార్థ వరేణ్యున కక్కజమ్ముగన్ 11.

ఆ.వె. అంతఁ బార్శ్వ గతుని నా విభీషణుఁ గాంచి
పలికె రాముఁ డిట్లు వాక్యములను
సహ విమర్శనము విచారించి వీత హ
ర్షమున రాఘవుండు సద్గుణుండు 12.

ఆ.వె. సతము గోరు దీవు సౌమ్య! నా విజయమ్ము
రాక్షసాధిసేత! రాగ మడర
నాదు చెంత కిపుడు వైదేహి శీఘ్రము
గ నరుదెంచుఁ గాక కౌణపాఢ్య! 13.

కం. విని రాఘవేంద్రు పల్కులు
జనులం దొలఁగించు పనుల సద్ధర్మజ్ఞుం
డు నిశాచరేంద్రుఁ డొనరిం
చె నప్పుడు విభీషణుండు సీతార్థంబై 14.

కం. తలపాగలు నొక్కాయలు
గల వారలు బెత్తములను గాయ లడరు చే
తులు గల వారలు యోధులఁ
దొలఁగం జేయుచుఁ దిరిగిరి దొర లెల్లెడలన్ 15.

కం. కపి ఋక్ష రాక్షస గణము
లపు డెగిరి పెడలిన వంత నతి దూరముగం
గృప లేక తోలుచుండఁగ
విపరీతమ్ముగ నెడఁదల వెఱఁగు సెలంగన్ 16.

కం. వారు దొలఁగింపఁ బడఁగా
మారుతమున రేఁగి నట్టి మకరాలయ ఘో
రారవముల మించ ధ్వనులు
వారించెను రాముఁడు విని వాత్సల్యమునన్ 17.

కం. ఆక్షణమున నాగ్రహమునఁ
జక్షులఁ గాల్చెడు సరణి భృశతరప్రాజ్ఞున్
వీక్షించి విభీషణు నసె 18.

నాక్షేపమ్ముగ వచనము లాశ్చర్యముగన్

తే.గీ. నను దలఁప కిట్టు లేల యీ జనము రాక్ష
సేంద్ర! నీ చేత భృశము బాధింపఁ బడుచు
నున్న దిఁక నాపు మిది యెల్ల సెన్న నీ జ
ను లనఘా! స్వీయ జనులు ఘనులు దలంప 19.

తే.గీ. కావు గృహములు బట్టలు కావు కావు
చుట్టు గోడలు తెర లైనఁ జూడఁ గావు
రాజ సత్కారములు నిట్టు లీ జగతిని
కావు రక్షలు వృత్తము కాంతల కగు 20.

చం. వ్యసనము లందుఁ గృచ్ఛ్రముల నాజుల యందు స్వయంవరమ్ము లం
దు సవన వేళలం దరయ దూష్యము గాదు వివాహ వేళ లం
దు సునయ నాలి దర్శనము దోరపుఁ గష్టము నందు నున్న నా
దు సరసనే విశేషముగఁ దోయలి సీతను గాంచ నొప్పగున్ 21.

ఆ.వె. తెమ్ము జానకీ సతిని విభీషణ! నాదు
చెంత కసుర వర్య! శీఘ్రముగను
నన్ను నా సుహృదుల నగచరుల నడుమ
సీత గాంచు నిచట వీత శంక 22.

కం. విని యా రాముని పల్కులు
మనమునఁ జింతించి సుంత మానిని నా సీ
తను రాఘవేంద్రు చెంతకు
ననిపె విభీషణుఁడు సవినయము శీఘ్రముగన్ 23.

తే.గీ. లక్ష్మణుండు సుగ్రీవుఁడు ప్లవగ వర్యుఁ
డాంజనేయుఁడు భృశముగ నాత్మ లందుఁ
గలఁతఁ జెందిరి రామ వాక్యముల నాల
కించి వాని భావము పరికించి నంత 24.

ఆ.వె. దారుణంపు టింగితమ్ముల వీక్షించి 25.

స్వీయ భార్య పైనఁ బ్రేమ లేని
యట్టు లుండఁ బల్కు లాత్మలఁ దర్కించి
రాలిఁ గాంచి కాఁడు హర్షుఁ డంచు

చం. బిడియము తోడ నంగములు పెల్లుగఁ గ్రుంగ విభీషణుండు రా
వడి వడి వెంట భూ తనయ భర్తను జేరెను గప్పి యాస్యమున్
మడుఁగున సిగ్గు పిక్కటిల మందినిఁ గాంచఁగఁ జేరి భర్తఁ దా
నడుగిడి యార్యపుత్ర! యని యంగన యేడ్చెను భర్తృ దేవయే 26.

తే.గీ. విస్మయమున హర్షమ్మునఁ బ్రేమను బతి
దేవుని ముఖము సౌమ్యమ్ము దేవి సౌమ్య
తర వదన గాంచె నప్పుడు ధరణిజ రఘు
రాముని సమీప మరుదెంచి రామ సీత 27.

కం. మనసునఁ గ్లేశము విడిచె న
వనిజ విమల చంద్ర వదన పతి పూర్ణ శశాం
క నిభ ముఖముఁ జిర కాలము
గన నట్టిది గాంచి యపుడు కమనీయముగన్ 28.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట పదునేడవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 118.

రాముఁడు సీతతో నీ కపకారము సేసిన రావణుని వధించి నీ చెఱను విడిపించితిని మా యిక్ష్వాకు వంశ గౌరవమును గాపాడితిని కనుక నీవు యథేచ్ఛ నెవరి రక్షణ మైన నెంచి యేఁగ వచ్చు నని పరుష వాక్యములను వచించుట.

కం. ప్రక్కన వంగి నిలఁబడిన
యక్కమలాక్షి జనక సుత నరసి పలుక ని
ట్లక్కాకుత్స్థుఁడు క్రోధం 1.

డక్కజముగఁ దొడఁగె నంత నవనిజ తోడన్

తే.గీ. నిర్జిత వయితి విఁక భద్ర! నీవు క్రూరుఁ
డైన శత్రు జయింప నే నడరి పౌరు
షమున నెయ్యది యొనరింపఁ జక్కఁగఁ దగు
నయ్యది యొనరింపఁ బడెను గయ్య మందు 2.

చం. అరసితి నేను గోపమున కంతము ధర్షణ మెల్ల నంత మ
య్యె రుచిర రీతి శాత్రవుఁడు నియ్యవమానము రెండు నొక్క మా
రరయ నశించె నా వలన నాత్మ పరాక్రమ మెల్ల దృష్ట మ
య్యె రణమునన్ ఫలించె శ్రమ మిట్టులఁ దీర్చి ప్రతిజ్ఞ నిల్పితిన్ 3.

తే.గీ. మద్విరహితను గొనితెచ్చె మాయఁ జలిత
చిత్తుఁ డసురుండు దైవంపుఁ జేఁత దోష
మిప్పు డొక మానవుని చేతఁ దప్పక గెలు
వఁబడె నా చేత నిబ్బంగిఁ బౌరుషమున 4.

ఆ.వె. కలిగిన యవమానము లయ మొనర్పక
యున్న సత్వరమ్ము చిన్న దైన
స్వాంత మున్న పురుషు పౌరుషమ్మున నేమి
యర్థ ముండు వాని కరసి చూడ 5.

తే.గీ. సఫల మయ్యెను హనుమంతు శ్లాఘ్య కర్మ
మర్ణవమ్ము దాఁటుట లంక నంతఁ జేరి
ఘోర తరము మర్దించుట వైరి పురము
నెల్ల స్వీయ విక్రమమున నెలమి నేఁడు 6.

తే.గీ. సఫల మయ్యెను సుగ్రీవు సంగరంపు
విక్రమము హిత మంత్రమ్ము స్వీయ సైన్య
సహిత మొనరించిన సుపరిశ్రమము నాయ
కత్వ మింపుగ నేఁడు వీరత్వ మెల్ల 7.

ఆ.వె. సఫల మయ్యె నసుర సత్తముని విభీష 8.

ఋని పరిశ్రమ మగుణు దశకంఠు
నగ్రజునిఁ ద్యజించి యంచితముగ నన్ను
గదిసి చేసి నట్టి కర్మ మెల్ల

చం. పలుకఁగ నిట్లు రాఘవుఁడు పల్కులు జానకి యాలకించి క
న్నులను స్రవింప భాష్పములు నొవ్వున లేటి విధమ్ము లోచన
మ్ములు కడు విప్వ నిల్వఁ గని భూజను నా హృదయప్రియాంగనం
గలవర మంది భీతిలి జగజ్జన వాదము సెంచి యార్తుఁడై 9.

తే.గీ. సీత నుత్పల పత్రాక్షి స్నిగ్ధ నీల
కుంచి తాంచిత మూర్ధజ గురు కటిస్థ
లి నసుర హరుల మధ్యను గని వచించె
భ్రుకుటి ముడిచి యిట్టులు రాఘవుండు గిరలు 10.

చం. అవమతి నార్పఁ జేయఁ దగి నట్టిది మానిసి కెద్ది దాని సే
నవనిజ! మూరి చేసితిని యా రిపుఁ జంపితి మాన కాంక్షినై
భువిఁ దగ నైతి నిర్జితవు భూరి తపమ్మున దక్షి ణాశ నా
యవని సురుం డగస్త్యుఁడు మహాత్ముఁడు గెల్చిన రీతి మానినీ! 11.

ఆ.వె. సఖులఁ గూడి బలిమి సమర పరిశ్రమ
మిట్లు దాఁటు టెల్ల నెఱుఁగు మబల!
నీ కొఱకుఁ జెలంగి సేను జేసినది గా
దనుచు నీకు భద్ర మగును గాక 12.

తే.గీ. తలఁచి స్వీయ వృత్త మపవాదముల నెల్ల
దిశల రక్షింప నింపుగ యశము నందు
మిన్న యైన నా కులమున కెన్నఁ డేని
మచ్చ వలదని చేసితి నిచ్చ సేను 13.

తే.గీ. శంక నంది నడత యందు నంక మందు
నిలిచి తీవు నాకు నిచట నిన్ను సమ్మ
తింపఁ జాల ధర్మముఁ బరికింప సేను
సేత్ర రోగికి దీపంపు నిభము గాను 14.

ఆ.వె. ఏఁగు మనుమతింతు నెక్కడ కైనను
దశ దిశల యథేచ్ఛఁ దనరి భద్ర!
జనక తనయ! నాకుఁ బని లేదు నీ తోడ
నెందు నింక వలదు సందియమ్ము 15.

కం. పర గృహ మందు వసించిన
తరుణీ మణి నే నరుండు తాదాత్మ్యమునం
దిరిగి గ్రహింపఁగ నెంచును
గురుతర వంశోద్భవుండు కోమలి! చెపుమా 16.

ఆ.వె. రావణాంక మందు భ్రష్టవు దుష్టంపుఁ
గనులఁ జూడఁ బడితివి నిను నెట్టు
లే నకట గ్రహింతు నిద్ధ వంశమ్మును
జెప్పుకొంచు సీత! గొప్పగాను 17.

తే.గీ. గెలువఁ బడితివి నా చేతఁ గులము కొఱకుఁ
గీర్తి గడియించితిఁ దిరిగి గెలిచి రిపుని
లేదు నీ యందు నాసక్తి నాదు మదిని
నేఁగ వచ్చు యథేచ్ఛ మహీజ! నీవు 18.

కం. పలికితి నే నిట్లు మదినిఁ
దలంచి దృఢముగను భద్ర! తరలి సుఖముగం
లలనా! లక్ష్మణు నందై
న లేక భరతు పయి నేని నడపుమ రక్షన్ 19.

తే.గీ. లేక శత్రుఘ్నుఁ గాని సుగ్రీవుఁ గాని
యవ్విభీషణుఁ గాని ధరాత్మజ! గణి
యింపు మీవు రక్షణమున కిట్లు కాని
చో సుఖం బెట్లు నీ కట్లు చూచుకొనుమ 20.

కం. చిర కాలము నిజ గృహమున
నరసి మనోరమను నిన్ను నా దశవక్త్రుం 21.

డు రుచిర దివ్యాకార న
సు రాధముఁడు సైపఁ గలఁడె చోద్యము కాదే

కం. విని ప్రియములు వినుటకుఁ దగు
వనితామణి యప్రియములు పతి ప్రియుఁడు వచిం
ప నిభ కర కంపిత లత వ
లె నవనిజ వణఁకె భృశముగ రేఁగిన వశ్రుల్ 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట పదునెనిమిదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 119.

రాముని మాటలకుఁ గలఁత సెంది మిక్కుటముగ సీత తగిన యుత్తరము నొసంగి తన పాతివ్రత్యమును నిరూపించుకొన నగ్ని ప్రవేశము సేయుట.

కం. అన రోమహర్షణములు వ
చనములు పరుషమ్ము లిట్లు సక్రోధముగం
మనుజేశ్వరుండు రాముఁడు
విని సీత కలంత నందెఁ బృథ్వీజ కడున్ 1.

చం. అవనత యయ్యె సిగ్గున ధరాత్మజ పల్కులు పూర్వ మెన్నఁ డే
ని వినని వాలకించి ధరణీ జన సంఘము చూచుచుండఁగా
నృవరుఁడు స్వీయ భర్త యన నిష్ఠుర రీతిని వాక్చరమ్ములే
యవయవ రాశిఁ దూఱఁ గను లందు స్రవించెను భాష్పతోయముల్ 2.

ఉ. భామ నిజాస్య మంతటను భాష్ప జలార్ద్రము దుడ్చుకొంచునుం
దా మగనిం దగం గనుచుఁ దద్దయు గద్గదయై వచించె ని 3.

ట్లమివి శ్రోత్ర దారుణము లీ వన రానివి వాక్కు లేల నో
రామ వచింతు విచ్చటను బ్రాకృతుఁ డక్కట ప్రాకృతన్ వలెన్

తే.గీ. నే మహా బాహు! నన్నిట నీ వెటుల నె
ఱింగితివొ యెదఁ గా దట్టి యంగన నక
ట నను నమ్ము వచింతు నొట్టు నొనరించి
నాదు చరితమ్ము పైనను నాథ! నీకు 4.

తే.గీ. కాంచి ప్రాణేశ! సామాన్య కాంతల నడ
వడిని శంకించు చుంటివి యెడఁద జాతి
నెల్ల మున్ను బరీక్షించి తేని నన్ను
వీడు మీ సందియమ్మును వీర వర్య! 5.

చం. కలిగిన స్పర్శ మంగమునఁ గల్గె నవశ్యత నాకు నచ్చటం
దలఁపకు కోరి చేసిన విధమ్ముగ దానిని నెంచి చూడఁగాఁ
జెలఁగెను దైవ దోషమునఁ జిత్తము నా వశ మందు నుండ నే
వలతును నిన్ను నిత్యము నవశ్యము లంగము లేమి సేయుదున్ 6.

తే.గీ. మానద! కలసి పెరిగిన పైనముననను
మంచి సంబంధ ముండుట నంచితముగ
నన్ను నేర కుంటివి యేని చెన్నుగ నెద
నప్పుడె హతను స్థిరముగ నైతి నేను 7.

ఉ. పంపితి వీవు నన్ వెదక వాయు కుమారుని నుంటి లంక నీ
వంపిన వేళ నే నపుడె యక్కట యేల త్యజింప లేదు నీ
పంపును నాలకించి కపి వక్త్రము నుండి విసర్జ నార్తి లోఁ
బెంపు వహింప జీవితము వీర! త్యజింపఁగ నోపు దాననే 8.

తే.గీ. జీవితము నుంచి శంకను జేసి నట్టి
యీ వృథా పరిశ్రమ మెల్ల నింకఁ దప్పి
యుండు నీ సహృదుల క్లేశ ముండ కుండు
రామ! యప్పుడు సుంతయు రాఘవేంద్ర! 9.

ఆ.వె. స్త్రీత్వ మొక్క దాని చిన్న నరుని భంగి
నాత్మ లోన ముఖ్య మంచు రోష
ముద్భవింపఁ దలఁచి తుర్వీప శార్దూల!
యెంచ వన్య మెద్ది యేని యిపుడు 10.

తే.గీ. పుట్టితి జనకునకు నని భువిఁ బ్రసిద్ధి
పుట్టితిని నేను నిజముగ భూమి నుండి
నాదు వృత్తము వృత్తజ్ఞ! నాథ! నీవు
గౌరవింపవు మదిలోన వీర వర్య! 11.

ఆ.వె. పాణి పీడనమ్ము బాల్య మందు జరిగి
నది ప్రమాణ మంచు మది గణింప
వకట నాదు గుణము నంచిత భక్తిని
నెట్టితివి వెనుకకుఁ గట్ట యిపుడు 12.

ఉ. మానిని పల్కి యేడ్చుచును మాటలు బొంగురువోవ లక్ష్మణున్
దీనుని ధ్యాన మగ్నుఁ గని దీన గతిన్ వచియించె నివ్విధిన్
నేను భరింప నిట్టి యపనిందను వంతకు నౌషధమ్ముగాఁ
గానఁగ వచ్చు నా చితినిఁ గ్రన్నన లక్ష్మణ! నాకుఁ బేర్చుమా 13.

తే.గీ. బ్రతుక మిథ్యాపవాద తప్త నయి నేను
గుణములకు సంతసింపని కోర నట్టి
భర్త ప్రజ ముందు విడువఁగ భార్య కెద్ది
యర్థ మం దేను వెసఁ జొత్తు ననల మందు 14.

చం. పలుకఁగ సీత రుట్టునకు వశ్యుఁడునై కడు లక్ష్మణుండు శ
త్రుల వధియించు వాఁడు నృవరుం గనె రాముని నన్న యింగిత
మ్ములఁ గని యంత రాఘవుని బుద్ధి నెఱింగి మనమ్ము నందుఁ దా
వెలయఁగఁ జేసెఁ జింతఁ జితి వీర వరుండు సహోద రాజ్ఞతో 15.

తే.గీ. అంత కాలాంతక యముని యట్టు లున్న
రాఘు వేంద్రుని నేరు నరయుట కేని
కదిసి ప్రార్థించుటకు నేని తుదకుఁ బలుకు 16.

టకు నయినఁ జాలకుండిరి సకల సఖులు

చం. పతికి నధో ముఖాబ్జునకుఁ బన్నుగఁ జేసి ప్రదక్షిణమ్ము నున్
సతి తగ హవ్యవాహనుని సన్నిధి కేఁగి నమస్కరించి సీ
త తమి సురాలి కింక వసుధా సుర కోటికి నాత్మలోన నం
చితముగఁ బల్కె వాక్యములు సేతులు మోడ్చి సభక్తి యిట్టులన్ 17.

ఆ.వె. ఎట్లు నాదు హృదయ మెప్పుడు రాముని
నుండి సుంత తొలఁగ కుండు నట్లు
లోక సాక్షి నన్ను వీఁక సెల్లెడలను
గాచుఁ గాక వహ్ని కరుణ తోడ 18.

ఆ.వె. ఎట్లు దుష్ట నంచు నెంచెడు పతి గల
యేను శుద్ధ చరిత నెప్పు డట్లు
లోక సాక్షి నన్ను వీఁక సెల్లెడలను
గాచుఁ గాక వహ్ని కరుణ తోడ 19.

ఆ.వె. నారి నెట్లు నే మనః కర్మ వాక్కుల
సర్వ వేత్త రామ సక్త నట్లు
లోక సాక్షి నన్ను వీఁక సెల్లెడలను
గాచుఁ గాక వహ్ని కరుణ తోడ 20.

తే.గీ. సూర్య భగవానుఁ డనలుండు సోముఁడు దిశ
లహము సంధ్యయు రాత్రియు నవని యటులె
యన్యులును శుద్ధ చరిత నే నంచు నెట్లు
నేర్తు రట్లగ్ని నను గావ నేర్చుఁ గాక 21.

తే.గీ. పలికి యిట్లగ్ని చుట్టును వడి వడి నెద
లేక యెట్టి కోర్కి తిరిగి దూఁకె సీత
మంట లోన నిశ్శంకను గంటి రబల
జనులు బాలవృద్ధులఁ గూడి జ్వాలఁ దూఱ 22.

కం. కనినవి సమస్త భూతము 23.

లనలమ్ముగ రుక్మ వేది కాభను బడుచుం
డ నతివను విశాలాక్షిని
జనకాత్మజ రామ సతిని సంభ్రమ మడరన్

కం. కనె ముల్లోకము లన్నియు
ననలములో నతివ సౌర మహాభాగను సీ
త నపుడు పుణ్యాజ్యాహుతి
యన నక్కజముగ వసుంధ రాత్మజ నంతన్ 24.

ఆ.వె. మంత్ర శుద్ధ హవ విమల రుచి రాజ్య ధా
రా నిభముగ నగ్ని రామ పత్ని
దూఁకు చుండ నేడ్చి రా కాంత లెల్ల ర
చ్చటఁ గలంత నంది స్వాంతములను 25.

తే.గీ. ముజ్జగములు గంధర్వులు పుడమి సుతను
దేవ దానవు లరసిరి దేవత వలె
శప్త యయి నరకమునకు జాఱుచుండ
దేవ లోకము నుండి పతిత యయి వెస 26.

కం. అనలమునఁ జొచ్చుచుండ న
వనిజ హరుల రక్కసుల రవమ్ములు హా హా
యని విపులమ్ముగఁ జెలరేఁ
గిన వద్భుతముగఁ గలంత గిర లచ్చోటన్ 27.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట పందొమ్మిదవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 120.

సీతా దేవి యగ్నిలో దూఁక రాముని చెంతకు బ్రహ్మ, మహేశ్వరుఁడు, దేవత లెల్లరు విమానములలో వచ్చి చేర బ్రహ్మ దేవుఁడు రామునితో నీవు సాక్షాత్తు మహా విష్ణు వని తెలిపి స్తుతించుట.

కం. విని సకల జనాక్రందము
లను ధర్మాత్ముఁడు భృశముగ రాముండు కలం
త నరసి కన్నీ రొలుకం
గనులను జింతించె నొక్క క్షణ మెద లోనన్ 1.

సీ. యక్ష రాజాధి రా జా కుబేరుండు యముండు పితరులతో నుండి దేవ
రాజు సహస్రాక్ష రాజితుండు జలేశ్వరుం డైన యా వరుణుండు పరమ
శివుఁడు షడర్ధ రాజిత లోచనుం డీశ్వరుండు వృషభ సద్ధ్వజుండు శ్రీ మ
హా దేవుఁ డఖిల లోకావలి కర్తయు బ్రహ్మవిత్ప్రవరుండు బ్రహ్మ దేవుఁ
తే.గీ. డిట్టు లన్యులు గుమికూడి యెల్ల రేఁగు
దెంచిరి విమానముల నెక్కి యంచితముగ
సూర్య నిభముల లంకకు నార్యు రాఘ
వేంద్రు నింపుగఁ గదిసిరి యెలమి తోడ 2.

కం. పలికిరి త్రిదశశ్రేష్ఠులు
సలలిత హస్తాభరణ లసద్బాహుల నె
త్తి లపనము లిట్లెదుటఁ బ్రాం
జలి నిలిచిన రాఘవుఁ గని సచ్చారిత్రున్ 3.

తే.గీ. కర్త వీవు రాఘవ! ముజ్జగముల కెల్ల
జ్ఞానవంతుల మేటివి జగతి విభుఁడ
వీ వుపేక్షించితివి యేల యింతి యగ్నిఁ
బడ నెఱుఁగ వేల నిను సురవరుఁడ వీవు 4.

తే.గీ. మును వసువుల లోన ఋతుధాముఁడవు స్వయము
విభుఁడ వీవు ప్రజాపతివి త్రిజగముల
నాది కర్తవు రుద్రుల నష్టముఁడవు
సాధ్యు లందెంచఁ బంచమ సాధ్యుఁడ వయ! 5.

తే.గీ. అశ్వినులు కర్ణములు నీకు నక్షు లరయ 6.

సూర్య చంద్రు లాదిఁ దుదినిఁ జూడఁ బడుదు
సీత నేల యిటుల నుపేక్షించి తీవు
ప్రాకృతు వలెఁ బరంతప! రాఘవేంద్ర!

ఉ. రాముఁడు లోక నాథుఁడు సురవ్రజ మట్లు వచింప ధర్మ స
త్తామల చిత్తుఁ డిట్లనియె నయ్యమ రావలి తోడ నిర్జరుల్!
రాముఁడ నేను దాశరథి రాఘవుఁడన్ మనుజుండ దేవ! గా
కే మిది నేనెవండను సురేంద్ర! వచింపుమ యెట్లు వచ్చితిన్ 7.

కం. అన విని కాకుత్స్థునితో
ననె బ్రహ్మవిదుల వరిష్ఠుఁ డబ్జజుఁ డంతన్
వినుమా సత్యపరాక్రమ!
ఘనచరితమ్ముఁ వివరింతుఁ గమనీయముగన్ 8.

కం. నారాయణుఁడవు దేవా!
నేరుమ చక్రాయుధుఁడవు నీవు పురా భ
వ్యారాతిఘ్నుఁడవు విభుఁడ
వో రామ! వరాహుఁడ వగు దొక శృంగముతో 9.

తే.గీ. అక్షరము సత్యము మఱియు యాది నంత
మున వెలుంగు బ్రహ్మవు నీవు మూరి లోక
ములకు వర ధర్మ మౌదువు నలు భుజుండ
వవుదు నీవు విష్వక్సేనుఁడవు విభుఁడవు 10.

తే.గీ. శార్ఙ్గ ధన్వి వజితుఁడవు సత్తముండ
వును హృషీకేశుఁడవు నీవు పురుషుఁడవు మ
ఱి పురుషోత్తముఁడవు నింక విపుల ఖడ్గ
ధారి విష్ణువు కృష్ణుఁడు తగుదు వనఁగ 11.

తే.గీ. నీవు పరమ సేనానివి నీవు గ్రామ
ణివి క్షమ దమలు బుద్ధివి నీవు భవము
లయము లీ వుపేంద్రుండవు రాఘవ! మధు
సూదనుఁడ వీవు నిజముగ శూర వర్య! 12.

చం. ఒనరుతు వింద్రకర్మముల నొప్ప మహేంద్రుఁడ వీవు మాపు దీ
వనులను బద్మనాభుఁడవు నందురు దివ్య మహర్షి పుంగవుల్
నిను శరణార్థి సంతతికి నిత్య శరణ్యుఁడ వౌదు వంచు వే
ల నెగడ శృంగముల్ శత శిరమ్ములు మిన్కుల కాత్మ వౌదువే 13.

తే.గీ. ఆది కర్తవు లోకత్రయమ్ము నందు
స్వయము ప్రభు వీవు సిద్ధాలి సాధ్య తతికిఁ
బూర్వజుండ వాశ్రయుఁడ వఖర్వముగను
యజ్ఞ మీవు వషట్కార మౌదు వీవు 14.

శా. ఓంకారమ్ము పరాత్పరుండవును నీ యుత్పత్తి నీ నాశమున్
శంకం జెల్లును నేర రెవ్వరు నహో సందేహ మెవ్వారికిం
బంకేజాక్ష యెవండ వీ వని గనన్ వర్తీవు భూతాలి నే
వంకం గన్నను గో ద్విజావలిని నభ్రస్థావరజ్యానులన్ 15.

తే.గీ. వేలు పదములు దృక్కులు వేలు వంద
లుత్త మాంగమ్ము లడరు శ్రీ యుతుఁడ వీవు
మోయు దీవు భూతమ్ములఁ బుడమి శైల
వరములను గూడి నిత్యము భద్రముగను 16.

కం. కనఁ బడుదు నీటి లోన య
వని కంతమ్మున నిలిచి భువనముల మూడిం
టిని గంధర్వుల దానవు
లను సురల వహించు నా యురగ రూపమునన్ 17.

చం. అరయఁగ నేను నీ హృదయ మౌదు సరస్వతి దేవి జిహ్వయౌ
సురల శరీర రోమముల చొప్పున నే సృజియించితిం దమిం
బరఁగును నీవు ఱెప్పలను బన్నుగ మూసిన రాత్రి విప్పినం
దిరముగ ఘస్రమై చెలఁగుఁ దీఱు సమస్తము నీవు లేనిచో 18.

తే.గీ. నీదు సంస్కారము లవియె వేదము లగు
జగతి నీ శరీరము నీదు స్థైర్య మగును 19.

భూమి కోప మగ్ని ప్రసాదము శశియై య
డరును శ్రీ వత్స లక్షణుండవు రఘువర!

కం. మును నీ వీ ముల్లోకము
ల నాక్రమించితివి పదములన్ మూడింటన్
ఘనుని మహేంద్రుని రాజుగ
నొనరించితి కట్టి బలిని నుగ్రాసురునిన్ 20.

కం. సీత మహాలక్ష్మియె వి
ఖ్యాత మహావిష్ణు వీవు కాకుత్స్థవరా!
నేతవు ప్రజలకుఁ గృష్ణుఁడ
వైతివి దేవ!నరునిగ దశాననుఁ జంపన్ 21.

ఆ.వె. ధర్మభృత్తు లందుఁ దద్ద శ్రేష్ఠుండ! యీ
మా పని కృత మయ్యె మానవేంద్ర!
నీ వలన సమసెను రావణుం డని రామ!
చేరు మింక దివికి మూర ముదము 22.

తే.గీ. నీదు వీర్య మమోఘము నీదు విక్ర
మం బమోఘము నీ దర్శనం బమోఘ
మౌ యమోఘమే నీ కమనీయమైన
సంస్తవమ్ము రఘువరేణ్య! సంతతమ్ము 23.

తే.గీ. నీదు భక్తు లమోఘులు నిత్యు ధ్రువుని
దేవుఁ బురుషోత్తముఁ బురాణు స్థిరత నెవ్వ
రుంద్రు కని భక్తు లయి వార లొందఁ గలరు
కామము లిహ పరమ్ముల రామ! నిజము 24.

కం. దీనిని నార్షస్తవమును
మానుగఁ గీర్తింతు రేరు మహి దివ్యముఁ బ్రా
చీనము నితిహాసము వా
రే నిందల నంద రెన్నఁడేని నరేంద్రా! 25.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యిరువదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 121.

బ్రహ్మ దేవుని వాక్యమ్ము నాలకించి యగ్ని దేవుఁడు సీతను భద్రముగ నొడిలోనుంచి చితిపై నుండి లేచి సీత పవిత్రురాలని వక్కాణించి రామునకు సమర్పింప రాముఁడు సంతోషముగఁ దన భార్యను స్వీకరించుట.

కం. విని యా పితామహుం డా
డిన శుభవాక్యమును దన యొడి నునిచి వైదే
హినిఁ బైకి లేచెను హుతా
శనుండు వెస నంత నక్కజం బేపారన్ 1.

ఆ.వె. పుడమి పట్టినిఁ గొని మూర్తి మంతుండునై
హవ్యవాహనుండు భవ్యముగను
నొదఁ దొలంగఁ జేసి యుదరి యుత్థితుఁ డయ్యె
సీత తోడ నంత శీఘ్రముగను 2.

చం. పొలతినిఁ దప్త కాంచన సుభూషణ నూతన సూర్య తుల్య బా
ల లలిత రక్త వస్త్రధర రామను నీల సుకుంచితాంగజన్
లలితను మాల్య భూష లవి రాజిలు చుండఁగ మాయ కింత యే
నిల సుత సీతఁ దొంటి గతి నిచ్చెను రామున కా యనిందితన్ 3.

ఆ.వె. పలికె నొసఁగి సీతఁ బావకుం డఖిల లో
కముల సాక్షి యిట్లు గని రఘు వరు
నిదివొ రామ! చూడు మింతి నీ వైదేహిఁ
బాప మంట నేర దీ పడతికి 4.

ఆ.వె. మనసు చేత నైన మినుకుల నైనను
సీత తనదు బుద్ధి చేత నైనఁ
జక్షువుల నయినను సద్వృత్త కాంక్షిని
నిన్నతిక్రమింప నేర దమల 5.

ఉ. నీ వట లేక యున్న తఱి నిర్జన మైన యరణ్య మందుఁ దా
రావణు వీర్య దర్పితు పరాక్రముచే హృత యయ్యె బల్మి నా
రావణు నింట బంధితగ రాక్షస కాంతలు ఘోర దర్శనల్
వావిరిఁ గాచుచుండఁగను బావని నీ పయి నుంచె చిత్తమున్ 6.

ఆ.వె. లోభపెట్టఁ బడినఁ దా భయపెట్టఁ బ
డినను మిక్కుటముగ మనము నందు
నీవు నిలువ సతము రావణు లెక్కకుఁ
గొనదు సుంత నీదు కూర్మి దార 7.

తే.గీ. శుద్ధ బావము లున్నట్టి యిద్ధరణిజఁ
బాప మింతయే నెఱుఁగని భామ సీత
నిప్పు డామె నింక ననక యెద్ది స్వీక
రింప వలయు నీ విది నాదు పంపు సుమ్ము 8.

ఆ.వె. అంతఁ బ్రీతి నంది యంతరంగమ్మునఁ
బలుకు లాలకించి తలఁచె సుంత
భాష్పలోచనములు వఱలంగ రాముఁడు
ధర్మరతుఁడు గిరలఁ దద్ద దిట్ట 9.

కం. అనవిని దృఢవిక్రముఁడు ద్యు
తి నధికుఁడు రఘూద్వహుండు దిట్ట ఘన నయ
జ్ఞ నరులలో సుర వర్యునిఁ
గని యంచితముగ వచించెఁ గాకుత్స్థుఁ డిటుల్ 10.

ఉ. లోకము లందుఁ దప్పక సులోచన జానకి శుద్ధి కర్హ యౌ
యా కడ రావణాలయము నందు వసింపఁగ దీర్ఘ కాలమే
యీ కలకంఠి మంగళయు నీ రఘురాముఁడు కాముఁ డందురే 11.

లోకులు నన్నశోధిత నిరుద్ధను గైకొన మూర్ఖుఁ డంచునున్

తే.గీ. ఇయ్యనన్య హృదయను నహీన భక్త
ను జనకాత్మజ మైథిలి నిజ మనమ్ము
నందు నిత్యము చరియించు నతివ నేను
నెఱుఁగు వాఁడను బావని నింపుగాను 12.

కం. నిజ తేజో రక్షిత నవ
నిజను విశాలాక్షినిఁ దగుసే దాఁటంగన్
నిజ మరయ రావణుఁడు ఘో
ర జలధి దాఁటఁ గలదే ధరణి నా వేలన్ 13.

తే.గీ. ముజ్జగమ్ముల నమ్మింప ముఖ్యముగను
సత్య సంశ్రయుండ నయి నే సత్యముగను
హవ్యవాహన! వాక్యమ్ము లట్టు లాడి
యవనిజను నుపేక్షించితి నగ్నిఁ దూఁక 14.

కం. జనకాత్మజ నెదిరింపఁగ
మనసున నైనఁ గడు దుష్ట మానసుఁడు దశా
ననుఁ డసమర్థుఁడు కదియం
గ నశక్యను దీప్త భుజి శిఖా సదృశముగన్ 15.

తే.గీ. మంగళప్రదురా లైన మైథిలికి ద
శాన నాంతః పురము లోన నడరు నట్టి
వాని యైశ్వర్యమున లేదు పని దినకరు
ప్రభ పగిది నా కనన్యము రామ సీత 16.

ఆ.వె. కడు పవిత్రురాలు గాంచ ముల్లోకము
లందు సీత విడువ నవనిజ నస
మర్థుఁడను యశమ్ము మనుజ వరేణ్యుఁడు
వీడ లేని భంగి విశ్వ మందు 17.

ఆ.వె. లోకపాలు రిట్టులు వచింప సస్నేహ 18.

ము హిత మొసఁగు వాక్యము నది యింకఁ
దప్పకుండఁ జేయఁ దగు నట్టి కార్యంబ
యగును నాకు నిప్పు డార్యులార!

తే.గీ. పలికి విజయుం డధిక బలవంతుఁ డిట్లు
మురిసి స్వీయ కార్యమునకుఁ బొగడఁ బడుచుఁ
బ్రియను గూడి సుఖార్థుఁడు ప్రీతి రాముఁ
డందె సౌఖ్యమ్ము నంతట నధికముగను 19.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యిరువది యొకటవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 122.

రాముని శుభ వాక్యముల నాలకించి మహేశ్వరుఁడు ప్రీతిఁ జెంది రామ లక్ష్మణులతో విమానమున నింద్రునితోఁ గూడి వచ్చిన దశరథునకు మొక్కుఁ డనంగ వారట్లు సేయ దశరథుఁడు వారికి హిత వచనములు పలికి రాముని నయోధ్య కేఁగి పట్టాభిషిక్తుఁడవు కమ్మని తిరిగి యింద్రునితోఁ గూడి యమర లోకమున కేఁగుట.

కం. అన రాఘవుఁ డట్లు శుభ వ
చనమ్ములు మహేశ్వరుండు శంభుఁడు వచియిం
చె నిటుల శుభతర వాక్య
మ్మును రామునిఁ గాంచి యంత మోదం బలరన్ 1.

ఉ. చేసితి రామ! యిప్పనిని శీలవరేణ్య! పరంతపా! మహా
భాసిత వక్ష! దీర్ఘ భుజ! భాగ్య వశమ్మునఁ బుష్కరాంబకా!
వాసెను రావ ణోద్భవము భైరవ భీతి తమమ్ము సంపఁగా
నా సమరమ్ములో నసురు నావృత మెల్లను లోక రాశినిన్ 2.

సీ. భరతుని దీను నాశ్వాసించి కౌసల్య నా యశస్వినిఁ దగ నాశ్వసించి
కైకేయి నరసి లక్ష్మణ మాత నా సుమిత్రం గని యింపుగ రాజ్య మయ్యు
యోధ్య లోనఁ బడసి యుచిత రీతి సుహృజ్జనుల నెల్ల నలరించి లలిత రీతి
నిక్ష్వాకు వంశము నింపుగ స్థాపించి యశ్వమేధ క్రతువు లలరి చేసి

ఆ.వె. బ్రాహ్మణుల కొసంగి పన్నుగ విత్తమ్ము
నత్యధికముగను మహా భుజుండ!
వాని చేత నంది పరమ యశమ్మును
దివికి నరుగ నర్హుఁడవు రఘువర! 3.

తే.గీ. రాజు దశరథుం డీతఁడు రామ! యివ్వి
మాన మందు వెలయు వాఁడు మాననీయ
జనకుఁడు నరలోకమ్మున మనుజ వర్య!
నీకు ఘన కీర్తిమంతుండు నీరజాక్ష! 4.

ఉ. ఏఁగె మహేంద్ర లోకమున కీతఁడు నీవు తరింప రాఘవా!
బాగుగ నందనుండ వయి భ్రాతను లక్ష్మణుఁ గూడి తండ్రికిన్
వేగమ యాచరింపు మిటఁ బ్రీతి యుతమ్ముగ వందనమ్ములన్
నాఁ గనె నవ్విమాన వహనస్థుని లక్ష్మణు తోడ మ్రొక్కుచున్ 5.

ఆ.వె. స్వీయ కాంతి తోడఁ జెన్నుగ వెల్గుచు
విమల వాసనమ్ము లమరి యుండ
జనకుఁ గాంచె రాముఁ డనుజ వర్యునితోడ
విభుఁడు సంతసమున వీర వరుఁడు 6.

చం. ముదము సెలంగ మిక్కుటము భూపతి నిల్చి విమాన పీఠికం
గుదురుగఁ గాంచి పుత్రు ననుగుం దమిఁ బంక్తిరథుండు నచ్చటం
బదపడి యుంచి యంకమునఁ బ్రాణము కన్నను మిన్న వాని నం
తఁ దనయుఁ గౌఁగిలించికొని దాశరథిన్ వచియించె నిట్టులన్ 7.

కం. రుచియింపదు విను స్వర్గము
వచింతు సత్యమ్ము నేను వత్స! కననిచో
రుచిరంపు నీ ముఖమ్మును 8.

బచరించిన సురల గౌరవం బది నాపై

తే.గీ. ఛేది తామిత్ర సంపూర్ణ చిత్తు నిన్ను
దీర్ణ వనవాస ముదిత హృదినిఁ గుమార!
నిన్ను వీక్షింపఁగా నాకు నేఁడు ప్రీతి
సందడించె భృశమ్ముగ డెంద మందు 9.

కం. కైకేయి యన్న పలుకులు
నీ కానన వాసమునకు నిలిచిన వెదలో
నా కింకను ఘోరమ్ములు
కాకుత్స్థ కులోద్భవుండ! కాఱియ సెలఁగన్ 10.

కం. కని నిన్ను క్షేమముగ నీ
యనుజుని సౌమిత్రిఁ గూడి యాశ్లేషింపం
దనయా! తొలఁగితి దుఃఖ
మ్మున నుండి హిమమ్ము నుండి పోవు రవి వలెన్ 11.

కం. తరియింపఁ బడితి నీ చే
నురుతరము సు సుతు వలనఁ గహోలుఁడు ధరణీ
సురుఁ డష్టావక్రునిచేఁ
దరియింపఁ బడిన విధమ్ము తనయా! ప్రీతిన్ 12.

కం. రావణ వధార్థ మివ్విధి
దేవత లొనరించి నట్లు తెల్లమ్ముగ నా
కో వత్సా! తెలిసె నిపుడు
నీ వా పురుషోత్తముఁడవు నేరితి నిన్నున్ 13.

ఆ.వె. నిన్ను దిరిగి చేర నిలయమ్ము కౌసల్య
వనము నుండి వెడలి పన్నుగ నరు
దెంచ నీవు మురియు మించి సిద్ధార్థ యై
శత్రుసూదను నటఁ జక్కఁ గాంచి 14.

ఆ.వె. చేరఁ బురము నీవు సిద్ధార్థు లౌదురు 15.

జనులు నిన్ను గాంచి మనుజ ధవుని
గ నభిషిక్తు నిన్ను గాంతురు హర్షింతు
రపుడు మిక్కుటముగ నంద అడరి

చం. భరతుని శుద్ధు ధర్మచరు బల్లిదుఁ గూడిన నిన్ను రామ! నే
నరయఁ దలంతు నెమ్మది నిజానుజు తోడుత సీత యుండగా
దరి వన వాస మింపుగఁ గృతమ్ము గదా పదునాలు గేండ్లు నా
వర సుత! నా ప్రతిజ్ఞ రఘు వర్య గనం బరి పూర్ణ మిట్టులన్ 16.

ఉ. రావణుఁ జంపి దేవతల రంజిలఁ జేసితి భండనమ్మునన్
నీ వొనరించి కర్మమును నెమ్మి యశమ్మును శ్లాఘనీయ మి
ట్లీ వసుధా తలమ్మున గ్రహించితి దీర్ఘపు టాయు వింపుగన్
భూవర! యంది రాజ్యమును బొందుమ తమ్ములఁ గూడి రాఘవా! 17.

మ. అన రాజేంద్రుఁడు పల్కు లిట్లు విని తా హస్తమ్ములన్ మోడ్చి ప
ల్కెను గాకుత్స్థుఁడు రాముఁ డిట్లు కని తండ్రిం బార్థశార్దూల! గై
కను నా సోదర పుంగవున్ భరతునిం గారుణ్య మేపారఁగాఁ
గను ధర్మజ్ఞుఁడ! వీడితిన్ సుతునితోఁ గైకేయి నాఁ బల్కితే 18.

ఆ.వె. మున్ను ఘోర కోపమున శాప మయ్యది
వారిఁ దగుల కుండు వరము నిమ్ము
ప్రభు! దయా సముద్ర! రాముఁ డిట్లన విని
తండ్రి యట్లె యనెను దశరథుండు 19.

తే.గీ. దశరథుం డంతఁ గౌఁగిలి తద్ద ప్రీతిఁ
దనయు లక్ష్మణునిఁ దిరిగి యనియె నిట్లు
సీత తోడుత రాముని సేవ సేసి
ముద మొసఁగితి ధర్మ సుఫలముం బడసితె 20.

ఆ.వె. ధర్మ మందఁ గలవు ధర్మజ్ఞ! కీర్తిని
విస్తృతముగ నీవు పృథ్వి లోన
సుప్రసన్నుఁ డైన సువ్రతుఁ డా రాముఁ
డందఁ గలవు స్వర్గ మధిక మహిమ 21.

కం. భువి రాము సుమిత్రానం
దవర్ధన! భజింపు శుభము దనరును నీకున్
నృవరుఁ డతఁడుఁ వర్తించు న
నవరతము జగద్ధితం బొనర్ప ముదమునన్ 22.

తే.గీ. వీర లింద్రునితో లోక వీరు లింక
సిద్ధులు పరమర్షులు నెల్లఁ జేరి యిమ్మ
హాత్ముఁ బురుషోత్తముని భక్తి యతిశయిల్ల
వచ్చి రర్చింప నింపుగ మెచ్చి పనిని 23.

తే.గీ. పుడమి నవ్యక్త మక్షరమ్ముఁ సురహృదయ
సంస్థితము సౌమ్య! గుహ్యము స్వయము బ్రహ్మ
మిట్లు రామునిగను సృజియింపఁ బడిన
దంచు నుక్తమ్ము బుధులచే నంచితముగ 24.

ఆ.వె. పడసితివి కుమార! వైదేహి తోడుత
సేవ సేసి భక్తి నీ విటుల ని
తనికి సంతతమ్ము ధర్మాచరణము య
శమ్ము లక్ష్మణా! భృశమ్ముగాను 25.

చం. అని సుతు తోడ నిప్పగిది నంజలి నిల్చిన సీతఁ గోడలిం
గని వచియించెఁ బుత్రి యని కమ్మని పల్కుల నిట్లు మెల్లగాఁ
గినుక వహింప కమ్మ! పలికెం బతి యవ్విధిఁ గోరి నీ హిత
మ్మును నిను శుద్ధి సేయఁగను బుత్రి! యొనర్చి తసాధ్య కర్మమున్ 26.

కం. పర నారీ మణుల యశం
బరయఁగ క్షీణించె సాధ్వి! యమలం బగు నీ
చరితమ్మున నిప్పుడు దు
ష్కర కర్మమ్మునను దల్లి! కాంతామణిరో! 27.

తే.గీ. భర్తృ సేవ గుఱించి చెప్పఁ బని లేదు
నీకు మైథిలి! నిజ మెన్న నే నయినను 28.

జెప్పఁ దగు నింత మాత్రము సీత నీకు
పరమ దైవము నిరతమ్ము భర్త సతికి

కం. ఉపదేశించి కుమారుల
కపు డివ్విధిఁ గోడలికిని ననుమతి నిడి యా
నృపతి దశరథుం డేఁగె సు
ర పతి పురమునకు విమాన రత్నము నందున్ 29.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యిరువది రెండవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 123.

దశరథుఁ డేఁగువాఁడు కాఁగ మహేంద్రుఁడు ప్రీతుం డయి రాముని వర మేదేనిఁ గోరుకొను మనంగ రాముఁడు మరణించిన వానరుల నెల్ల బ్రతికింపు మన నట్లు సేసి యమరలతో దశరథునితోఁ బాకశాసనుఁడు మరలి వెడల వానరులు విశ్రాంతి నందుట.

కం. చను వాఁడగు చుండఁగ నా
మనుజేంద్రుఁడు దశరథుం డమర నాథుఁడు రా
మునిఁ బ్రాంజలినిం గని హ
ర్ష నిమగ్నుండు నయి పాకశాసనుఁ డంతన్ 1.

తే.గీ. పలికె మా దర్శనము రామ! వ్యర్థ మగుట
తగదు మీకు నరర్షభ! తద్ద ప్రీతి
నందితిని నేను నీ మన మందు నున్న
యీప్సితమ్మును వేఁడుమ యిత్తు నేను 2.

ఉ. నా విని యింద్రుఁ డట్లన ఘనంపుఁ బ్రసన్నుఁడు సుప్రసన్నుఁడై 3.

భూవరుఁ డంజలించి సహ భూమిజ  లక్ష్మణుఁడై వినమ్రతం
దా వచియించె దేవ వర! తద్ద ముదమ్ము నెడందఁ బొందినన్
నా వలనం దగన్ నిజ మొనర్పుమ పల్కుదు నాదు మాటలన్

ఉ. నా కయి విక్రమించుచు రణమ్మునఁ గాలునిఁ గాంచి నట్టి వా
రా కపి వర్యు లెల్లరు మహాత్మ! సజీవము లేవఁ గోరెదన్
వీఁకను బోరి నా కొఱకు వీడిరి కూలఁగఁ బుత్ర దారలన్
నీ కృపఁ గాంచ నెంచెదను నేను సుఖమ్ముగ రాఁగ వారినిన్ 4.

కం. బ్రతికింపుమా విపన్నులఁ
గృత యత్నుల శూరుల మృతికి భయపడని స
న్నుత విక్రాంతప్లవ సం
తతి నెల్లఁ బురందర! వినుత దయా హృదయా! 5.

ఆ.వె. మత్ప్రియానురక్త మర్క టోత్తములు గ
ణింప రేరు మృతిని నింపు కొలుప
నీ ప్రసాదమునను నిర్జర గణ నాథ!
వారు లేచి వచ్చు  వర మడిగెద 6.

తే.గీ. ఎలుఁగుగొడ్లు  గోలాంగూలములు రుజలు వ్ర
ణములు లేక పౌరుష మగణ్య బలము లడ
రంగ మానద! రాఁగ గాంచంగఁ గోరు
వాఁడ నీదు కరుణతోడ నేఁడు మదిని 7.

తే.గీ. ఎక్క డుందురు వానరు లక్క డమర
నాథ! మూల ఫలమ్ములు నదులు విమల
ములు నకాల మైనను నిత్యము విలసిల్ల
వలెను గరుణ వహించి యీ వరము నిమ్ము 8.

కం. విని రాఘువుని మహాత్ముని
యిన వంశోద్భవు వచనము లింపెసలారన్
మనమున మహేంద్రుఁడు  వచిం
చె నుత్తరమ్మును ముదమ్ము నెలఁగు విధమునన్ 9.

కం. వర మది నీ యడిగిన యది
నర పుంగవ గొప్పదౌ౽ గన మును పలుక నే
ను రఘూత్తమ! రెండు గతుల
జరగు నటులె యందు వలన శంక వల దిటన్ 10.

ఉ. లేతురు ఋక్ష వానరులు లీలగ నెల్లరు రాక్షసాలి సం
పాతులు ఘోర యుద్ధమున భగ్న భు జానన తప్త దేహులున్
వీత రుజా వ్ర ణార్తు లయి విస్తృత వీర్య స పౌరుషాఢ్యులై
యీ తఱి నిద్ర నుండి వెస నింపుగ లేచిన భంగి దోఁపఁగన్ 11.

తే.గీ. బంధు మిత్రుల జ్ఞాతుల స్వజనుల ముద
మార నింపుగ నెల్లరు నర్మిలిఁ గల
యఁ గలరు సజీవులై యీ ప్లవగులు నిశ్చ
యముగ భక్త వరులు నీకు నంచితముగ 12.

కం. తనరు మహేష్వాస! తరులు
ఘన చిత్ర సుమ ఫలముల నకాలము నందై
నను భృశముగ విలసిల్లు నిఁ
క నదులు జల పూర్ణము లయి కమనీయముగన్ 13.

తే.గీ. నిద్ర నుండి లేచిన భంగిని మును గాయ
ములను గూడి యిప్పుడు గాయము లవి లేని
కాయముల తోడ లేచిరి కపులు విస్మ
యమ్ము నంది రెల్లరు నేమి యట యిది యని 14.

కం. పరి పూర్ణార్థుని రాముని
సురోత్తములు గాంచి యంత స్తుతియించుచు నా
నరవరు సలక్ష్మణు వచిం
చి రిట్లు ప్రీతాత్ము లయి రుచిరముగ నంతన్ 15.

మ. చనుమా రాఘవ వీడి వానరుల రాజా! నీ వయోధ్యా పుర
మ్మునకున్ సీతను నూఱడింపుమ యశః పూర్ణాంగనా రత్నముం 16.

గని నీ యం దనురక్త భ్రాత భరతుం గాకుత్స్థ! శత్రుఘ్నుతో
డను వీక్షింపుమ యార్తు నీ కొఱకుఁ గట్టా తల్లులం జూడుమా!

తే.గీ. ఏఁగి యభిషిక్తుఁడ వయి నీ వింపుగ నటఁ
బౌరులకు నిమ్ము హర్షమ్ము పార్థివేంద్ర!
పలికి యిటుల సహస్రాక్షుఁ డలరి సురల
తోడఁ జనె విమానమ్ములఁ దూర్ణముగను 17.

కం. సురలకు నమస్కరించి నృ
వరుండు రాముండు దన యవరజునితో వా
నరుల కట విశ్రమింపఁగఁ
గరుణ నొసంగె ననుమతినిఁ గ్లమ మాఱంగన్ 18.

కం. వెలిగిన దా హృష్ట జనుల
నలరెడు చము వెల్లెడల మహా రఘుకుల చం
ద్రుల రక్షణమున శోభలఁ
గలువల దొర వలన వెలుఁగు క్షణద పగిదినిన్ 19.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యిరువది మూడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 124.

రాముఁ డయోధ్య కేఁగ నుద్యుక్తుఁడు గాఁగ విభీషణుఁడు పుష్పక విమానమును రామునకై తీసికొని వచ్చుట.

కం. నిసి నిదురించి తగిన రీ
తి సుఖమ్ముగ మేల్కన నృపతి రఘూత్తమునిన్
వెస నంత విభీషణుఁడు గ 1.

దిసి పలికి జయమ్ముగ్రను వినతి ననియె నిట్లున్

ఉ. స్నానపు టంగ రాగములు స్వర్ణ విభూషణ వస్త్ర రాజముల్
మానిత గంధ మాల్యములు మంచివి దివ్య పదార్థ కోటినిన్
మానిను లూని హస్తముల మాన్యలు నిల్చిరి తమ్మికంటులే
కానఁగ వీ రలంకరణ కర్మవిదల్ నిను స్నాతుఁ జేయఁగన్ 2.

తే.గీ. నన్ననుగ్రహింపఁ గొనుమ నర వరేణ్య!
వాని నెల్ల ననఁగ విని బదు లిడె రఘు
వరుఁడు సుగ్రీవ ముఖ్య ప్లవగుల స్నాన
మునకుఁ బిలువుమ రాక్షస ముఖ్య నాథ! 3.

చం. భరతుఁడు నా నిమిత్త మట వంత మహా భుజుఁ డుండెఁ దా నిరం
తరమును సత్య సంశ్రయుఁడు ధర్మ రతుండు సుఖోచితుండు సే
నరయక వానిఁ గైక సుతు నా సుకుమారుని నొల్ల నంబ రా
భరణము లూన నో యసుర వర్యుఁడ! స్నానము నాచరింపఁగన్ 4.

కం. చనుదు నయోధ్యకు వెస నే
రినదే గద దారి యాపురికి దుర్గమమే
కన మార్గమ్ము భృశమ్ముగ
నన రాముండు విని యిట్టు లసురేంద్రుఁ డనెన్ 5.

చం. నరవర! చక్క నిన్నొక దినమ్మునఁ బంపెద నయ్యయోధ్య కం
బరమణి తుల్య పుష్పక విమానము భ్రాత కుబేరు నుండి సం
గరమునఁ దా జయించి దశకంఠుఁడు గొన్నది బల్మిఁ గోరు న
ట్లరుగును దివ్య మున్నది త్వదర్థము రాఘవ! భద్ర మయ్యెడిన్ 6.

చం. చనఁ గల వెట్టి యానమున సన్నుత యట్టి విమాన మియ్యెడన్
ఘన ఘన సన్నిభమ్ము మదిఁ గాఱియ నంద కయోధ్యకున్ వెసం
గను మిట నిల్చియున్న యది గల్గిన సద్దయ నా గుణమ్ము లెం
చిన నిలు మొక్క ఘుస్ర మిటఁ జెన్నుగ నాపయి స్నేహ మున్నచో 7.

ఉ. తమ్మునిఁ గూడి లక్ష్మణుని దారను గూడి విదేహ కన్యనున్ 8.

నెమ్మి సమస్త కామముల నిన్నిట నింపుగ గౌరవింప సై
న్యమ్మును మిత్ర సంఘము ఘనమ్ముగ నేను దలంచి నట్టి క
ర్మమ్మును స్వీకరింపుము కరమ్ము ముదమ్ము వహించి చేయఁగా

ఆ.వె. గౌరవమ్ము ప్రేమ కాకుత్స్థ! స్నేహమ్ము
తోడ వేఁడు చుంటి ఱేఁడ! నేను
గింకరుండను ఘన కీర్తిమంత! యిటుల
నరయ విన్నపంబ యాజ్ఞ కాదు 9.

చం. పలుక నిటుల్ విభీషణుఁడు వాక్యము లింపుగ నాలకించి యి
ట్టుల వచియించె రాముఁడు గడుం గడు యుక్త వచస్సులం బ్లవం
గు లసురు లెల్లరున్ వినఁగఁ గూరిమి మిత్రుఁడ! పూజితుండఁ జే
ష్టలను బరఘ్న! సాయమున సర్వ విధమ్ముల సౌహృదమ్మునన్ 10.

తే.గీ. రాక్షసేశ్వర! నీ మాటలను విన నను
మాట లేదు నిక్కముగను మనసు నాది
భరతు వీక్షింప క్షిప్రమ్ము భ్రాతృ వర్యు
నిపుడు త్వరపఱుపఁ దొడంగె విపులముగను 11.

తే.గీ. మున్ను చిత్రకూటమ్మున సన్నిధి యయి
నన్ను మరలింపఁ దల వంచి మన్నన నడు
గంగఁ గా దంటి నెవ్వనిఁ గాంచ నెంతు
వాని నో విభీషణ! క్షిప్ర మేను వినుము 12.

తే.గీ. కాంచఁ గౌసల్యను సుమిత్రఁ గైక నా య
శస్విని జననుల గుహుని సఖుని పౌరు
లను జనపదులం గూడి తలంతు నను మ
తింపు మైతిఁ బూజితుఁడఁ గోపింప వలదు 13.

కం. నిలుపుము విమాన వరమును
లలి రాక్షస నాథ! సత్వరమ్ముగ నింకన్
వలయును కృత కార్యునకుం
దలంప వాస మది యసుర దక్షా! చెపుమా 14.

కం. విని రాఘవేంద్రు పలుకులు
సని యంత విమానము రవి సన్నిభమును వ
చ్చెను గొని విభీషణుం డసు
ర నాథుఁ డతి వేగముగను రామార్థమ్మున్ 15.

సీ. కాంచన చిత్ర వికా సాంగము వర వైడూర్య మణి మయ పటుతర వేది
కా విలసిత మండ పావృతమ్ము రజత శోభితము ధవళ సురుచిర ధ్వ
జ పతాక భూషిత విపులమ్ము కాంచన పద్మ భూషిత ఘన భర్మ హర్మ్య
లసితమ్ము కింకిణీ రవ నాదితమ్ము ముక్తామణి మయ గవాక్ష పరివృతము
తే.గీ. వితత మేరు శృంగ నిభమ్ము విశ్వకర్మ
నిర్మితమ్ము ముక్తా రూప్య నిలయ వృతము
స్ఫటిక చిత్రావృత తల నిచయ విలసిత
సుంద రాస్తర ణాసన బృంద యుతము 16.

కం. విమలతర పుష్పక విమా
నమును మనోజవము నుంచి నరవరు నెదుటన్
సముదము విభీషణుండు త
రము కాని దెదిర్ప నిలిచె రాముని చెంతన్ 17.

కం. కని పుష్పకమ్ముఁ గామ గ
మనమ్మును విమానము నగమ నిభము సౌమి
త్రినిఁ గూడి యచ్చెరువు నం
దెను రాముఁ డుదార బలుఁడు దెచ్చిన దానిన్ 18.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యిరువది నాలుగవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 125.

రాముని కోరిక మేరకు విభీషణుఁడు వానరుల నెల్ల ధన రత్న భూష ణాదుల సత్కరింప సంతసించి
సీతా సమేత రాముఁడు లక్ష్మణునితో విభీషణ సుగ్రీ వాది వానర సమూహముతో నయోధ్యకుఁ
బుష్పక విమానమున బయలుదేరుట.

తే.గీ. పుష్ప సంచయ భూషిత పుష్పకము వి
మానము నునిచి దరి నున్న మాన వేంద్రుఁ
గాంచి రామునితో నంజలించి పలికెఁ
ద్వరితుఁ డింకేమి నేఁ జేయ వలయు నంచు 1.

చం. వినయముగా విభీషణుఁడు పేరిమిఁ బల్కఁగ లక్ష్మణుం డటన్
విన ననె నాత్మలోఁ దలఁచి వీరుఁ డొకింత రఘూత్తముండు నె
మ్మిని ఘన తేజుఁ డారసి సమీప విభీషణు గారవమ్మునన్
వనచరులం గృతార్థులను బన్నుగ నెల్లర సత్కరింపుమా 2.

చం. ధనము లనేక రత్న వివిధమ్ము లొసంగు విభీషణా! పుర
మ్మును సమ రానివర్తు లని మూరుచుఁ బ్రాణ భయమ్ము వీడి పో
రిన ముద మూని గెల్చితివి రేఁగి భృశమ్ముగ నీవు విక్రమ
మ్మున నసురేశ్వరా! బలమ మోఘము వర్తిల దుస్సహమ్ముగన్ 3.

ఉ. చేసిరి కార్య మెల్లఁ గపి శేఖరు లెల్లరు విత్త రత్నముల్
వాసిగ నిచ్చి యా పనిని భద్రముగా సఫలమ్ము సేయుమా
చేసినచోఁ గృతజ్ఞతను సిద్ధుల కర్థుల కీగి మానదా!
యీ సమయమ్ము నందు హరు లెల్లరు హర్షితు లౌదు రాత్మలన్ 4.

ఉ. త్యాగినిఁ బ్రీతిఁ జేర్చుకొను నాతని జాలి గలట్టి వానినిన్
బాగుగ నింద్రియమ్ములను వారక నెగ్గిన వాని నెల్లరున్
వేఁగక చేరు చుందు రిలఁ బ్రీతి వచించుచు నుంటి నందుకే
యీ గతి నెంచి స్నేహ మసురేంద్ర! విభీషణ! యాలకింపుమా 5.

కం. ప్రేమ విహీనునిఁ దన సం
గ్రామము లందు వధియించు కరుణా హీనున్
భూమీశుని నిజ వాహిని
యేమఱక త్యజించు నింక నేఁపు నెలంగన్ 6.

కం. పలుకఁగ రాఘువుఁ డిట్టుల
నలరి విభీషణుఁ డపుడు ధనాధిక రత్న
మ్ములు పంచి యంచితముగ హ
రులఁ బూజించె నసురేశ్వరుం డందఱినిన్ 7.

కం. కని రత్నార్థమ్ముల హరు
ల నట్లు పూజింపఁ బడఁగ రఘురాముం డె
క్కెను వర విమాన మంక
మ్మున నిడి లజ్జితను సీత మురిసి యనుజుతో 8.

తే.గీ. నిలిచి యా విమానమ్మున నెమ్మి గౌర
వించి తగ వానరుల నెల్ల నంచితముగఁ
బల్కె రాముఁడు వీక్షించి వాన రేంద్రు
నసుర నాథు విభీషణు నంత నిట్లు 9.

ఆ.వె. మిత్ర కార్య మెల్ల మేలుగఁ జేసిరి
వానరర్షభు లనివార్యముగను
జనుఁడు మీర లింకఁ జక్క నచ్చిన రీతి
ననుమతింతు మిమ్ము నార్యు లార! 10.

తే.గీ. ఏది సేయఁ దగు సఖుని హితుని చేతఁ
బ్రేమ నీ చేత నది యయ్యె వెఱపు ధర్మ
మందుఁ గలవాఁడ! సుగ్రీవ! డెంద మలర
నేఁగు కిష్కింధకు ససైన్య మింక వేగ 11.

తే.గీ. నా యొసంగిన లంకను నైర్రుత ధవ!
స్వీయ రాజ్యమ్ము నందు విభీషణ! వసి
యింపు మింపుగ నెదిరింప నేరు సేంద్ర
సురులు కారు సమర్థులు సుమ్మి నిన్ను 12.

కం. అరిగెద నయోధ్యకు జనకు
ని రాజధానికి ననుమతిని నొసఁగ వలె నె 13.

ల్లరు నడుగుచుంటి మిమ్మా
దరమున నన రాఘవుండు తద్దయుఁ బ్రీతిన్

కం. విని సుగ్రీవుండు ప్లవగు
లు నవ్విభీషణుఁ డసుర వరుఁడుఁ బ్రాంజళులై
కని రాఘవేంద్రు మనుజేం
ద్రునిం బలికిరి వచనమ్ములు పరమ రక్తిన్ 14.

కం. కనఁ గోరు వారల మయో
ధ్య నెల్లరమును గొనిపొమ్ము దయతో నీతో
వనముల నుపవనముల ముద
మున విహరింతు మట మేము భూరి యశస్వీ! 15.

తే.గీ. కని యట నభిషేకార్దుని నిను నరేంద్ర!
కని జననినిఁ గౌసల్యను వినతి మ్రొక్కి
యచిర మెల్లర మిండ్లకు నంతఁ దనిసి
యేఁగు వారము పెస మాన వేంద్ర! వినుమ 16.

ఉ. ఆ వచనమ్ములన్ విని మహాత్ముఁడు గాంచి ప్లవంగ కోటి సు
గ్రీవుని నా విభీషణునిఁ బ్రీతిని నెల్లరఁ బల్కె నివ్విధిన్
నే పెడలంగఁ గూడి మిము నెమ్మి యగున్ ద్విగుణం బయోధ్యకై
యో వర మిత్రులార! మది నుద్భవ మింపుగ నంది నా కటన్ 17.

తే.గీ. వానరులఁ గూడి సుగ్రీవ! వడి విమాన
మెక్కుమ ప్లవంగ నాథుఁడ! చక్కఁగాను
రాక్షసేంద్ర! మంత్రులఁ గూడి రమ్యముగ వి
భీషణ! యధిరోహింపుమ ప్రీతి నిపుడు 18.

ఆ.వె. వానరులను గూడి వాన రాధిపుఁ డెక్కె
దివ్య పుష్పకమును భవ్య రీతి
నవ్విభీషణుండు సామాత్యుఁ డెక్కెను
సంతసమ్ము మీఱ సద్గుణుండు 19.

కం. ఘన మా కౌబేరం బా
స నోత్తమం బెల్ల రెక్కఁ జక్కఁగ నంతన్
మనుజేంద్రుఁడు రాముఁ డొసఁగ
ననుజ్ఞ నింగి కెగిరె పెస నాశ్చర్యముగన్ 20.

కం. అంచలఁ గూడి వెలుంగుచు
సంచారం బాకసమునఁ జలుపు వర విమా
నాంచితమున రాముఁడు గని
పించెఁ గుబేరుని విధమ్ము వినుతుఁ డలరుచున్ 21.

తే.గీ. ఋక్ష వానర వర్యులు రాక్షసులు బ
లాన్వితులు దివ్య పుష్పక మందు నిఱు కె
ఱుంగక సుఖ మేపారఁగ నంగములకు
నలరి కూర్చుండి రెల్లరు పులకితు లయి 22.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యిరువది యేనవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 126.

పుష్పక విమానమున నేఁగుచు రాముఁడు సీతకు మార్గమున లంకా నగరము భండన భూమిని సంగర విశేషములు నల సేతువు వివరించుచుఁ గిష్కింధలో సీత కోరఁగ వాన రాంగనలను విమానమున నెక్కించుకొని యయోధ్యకు మరలుట.

కం. అనుమతి నొసంగ రాముఁడు
ఘనుండు వర హంస యుక్త కమనీయము వా
హన మెగిరె మారు తోద్ధత
ఘన మేఘ నికాశ మంత గగనమ్మునకున్ 1.

కం. నలు దెసలఁ బఱచి చూపులు
పలికెను రఘు నందనుండు పన్నుగఁ గని మై
థిలిని శశి నిభాస్యను సీ
త లలిత వాక్యమ్ములను ముదమ్మున నిట్లున్ 2.

శా. కైలా సాద్రి శిఖాభ శృంగ చయ యుక్తంబౌ త్రికూటమ్మునం
దీ లంకా పురి విశ్వ కర్మ కృతమౌ యీదివ్యముం జూడు మా
భీ లాంకస్థలి మాంస పంక రుధి రోపేతమ్ము రక్షో ప్లవం
గాలిప్రక్షయ కారకం బవనిజా! యాత్మేశ్వరీ! కాంచుమా 3.

తే.గీ. దత్త వరుఁడు రాక్షస గణ ధవుఁడు పీడ
లొసఁగు వాఁడు రావణుఁ డిట నుర్వి పైన
నిదుర నున్న వాఁడు హతుఁడు నీ కొఱకు వ
ధించితిని విశాలాక్షి! కోపించి మిగుల 4.

తే.గీ. కుంభకర్ణుండు ఘోరుండు గూలె నిచట
నిహతుఁ డయ్యెఁ బ్రహస్తుఁడు నీరజాక్షి!
చంపఁబడెను ధూమ్రాక్షుఁడు సమర మందు
హరి వరేణ్యుం డయిన యట్టి హనుమ చేత 5.

కం. హతుఁ డా విద్యున్మాలి వి
త తాత్ముని సుషేణు చేత ధరఁ గూలెను దు
ర్గతి నింద్రజిత్తు రావణి
యతుల బలుని లక్ష్మణుని మహాత్ముని వలనన్ 6.

శా. రక్షో వీరుని ఘోరు నా వికటు నాలం బందు నా యంగదుం
డక్షోభుండు వధించెఁ దత్త్రిశిరుఁ డంకాసహ్యుఁ డింకన్ విరూ
పాక్షుం డుగ్ర మహోదరుం డసహనుం డాజిన్ మహాపార్శ్వుఁడున్
దక్షుం డైన యకంపనుండు నితరుల్ దర్పాంధులై చావఁగా 7.

మ. అతికాయుండు నరాంతకుండు మఱి గర్వాంధుండు దేవాంతకుం
డతు లోత్సాహులు నాజిఁ గుంభుఁడు నికుం భాఖ్యాసురుండుం బ్రభా
యుత సత్పుత్రులు కుంభకర్ణునకు యుద్ధోన్మత్తుఁడున్ మత్తుఁ డిం 8.

కితరుల్ దంష్ట్రుఁడు వజ్రదంష్ట్రుడును దేవీ! కూలి రంకమ్మునన్

మ. మకరాక్షుం డని దుర్జయుండు సమసెన్ మత్సాయ కౌఘమ్ముచే
నకటా దుర్మతి శోణితాక్షుఁడును యూపాక్షప్రజఘ్నాదులున్
వికలాంగవ్రజు లైరి యంకమున నుద్విగ్నాత్ములై యుద్ధమం
దు కరాళుండగు యజ్ఞశత్రువును విద్యుజ్జిహ్వుఁడుం గూలిరే 9.

మ. ఘన భీభత్సుఁ డకంపనుండు నగ సంకాశుండు సుప్తఘ్నుఁడున్
ఘన వీర్యుం డగు సూర్యశత్రువును సంగ్రామమ్ములో బ్రహ్మశ
త్రుని యుక్తంబుగ నన్య వీరులును ఘోరుల్ భగ్న దేహమ్ములం
జని రా కాలుని వీటి కెల్లరును రక్షః కాంతు దుర్నీతినిన్ 10.

కం. ఇక్కడ మండోదరి యను
రక్కసుల విభుని సతి యితర సపత్నులతో
స్రుక్కెను భాష్పమ్ము లొలుక
మిక్కుటముగ రావణుండు మేదినిఁ గూలన్ 11.

కం. ఇక్కడి తీర్థము గనుమా
యిక్కడలిని దాఁటి సీత యింపుగ నిసి మే
మెక్కఁడ వసించి యుంటిమొ
చక్కఁగ నంభోజ నయన! సదమల చరితా! 12.

కం. కనుమా దుష్కర సేతువు
వననిధిఁ గట్టితిని నేను బన్నుగ దాఁటన్
వనజాక్షీ! నీ కొఱకై
వినుమా నలసేతు వనఁగ విదితం బిదియే 13.

కం. కను మక్షోభ్యం బీ కడ
లి నపారము నూర్మి చయ సలిల నిలయమ్మున్
ఘన వరుణాలయమును గ
ర్జన యుతమును శంఖ శుక్తి సద్విలసితమున్ 14.

చం. కనుమ హిరణ్య నాభమును గాంచన శైల వరమ్ము మైథిలీ! 15.

హనుమ కొసంగ విశ్రమము నర్ణవ తోయము నుండి లేచెఁ బ్రీ
తిని నిటఁ జూడు మప్పరమ దేవుఁడు పూర్వము సాగరుండు కు
క్షిని దగ లేచి యిచ్చటను జెన్నుగ నం గరుణించె నత్తఱిన్

ఉ. సాగర బంధనం బనఁగఁ జక్కఁగ ముజ్జగ మందు ఖ్యాతినిన్
బాగుగ వెల్గు తీర్థ మిది పాతక నాశక పావనమ్ముఁనౌ
భాగము రాక్షసోత్తముఁడు వచ్చిన చోటు విభీషణుండు న
న్వేగమ కోరఁగా శరణు విజ్ఞుఁడు జానకి! రావ ణార్తినిన్ 16.

తే.గీ. తరుణి! కిష్కింధ సుగ్రీవు పుర వర మిది
చిత్ర కాననమ్ముల విలసితము సతము
వాలి చంపఁ బడె నిచట బాణ మొకట
నపుడు నా చేతఁ గినుక ధరాత్మజ! కను 17.

ఆ.వె. వాలి పాలిత పుర వరమును గిష్కింధ
నరసి సీత పలుకు లనియె నిట్లు
వినయ మారఁ బ్రీతి వెలయ సంభ్రమ మెద
రాముని బతిఁ గాంచి రమ్యముగను 18.

ఉ. నే వెడలంగ నెంతు తరుణీ మణి తార కపీంద్రు భార్య సు
గ్రీవుని దార లన్యలును స్త్రీలును వానర కోటి దారలున్
భూవర! నాదు వెంటఁ జన భూరి పురంబున కయ్యయోధ్య కీ
వీ వర మిమ్ము నాకు నిట నింపుగ నాథ! దయార్ద్రమానసా! 19.

తే.గీ. ఇట్లన జనకాత్మజ రాముఁ డట్లగు నని
యవ్విమానముఁ గిష్కింధ నాపి చక్క
రాఘవుండు సుగ్రీవుని రాజు నరసి
పలికె నింపుగ నివ్విధి వాక్యములను 20.

ఉ. ప్రీతిని వానరర్షభ! హరిప్రవరుల్ నిజ దారలం దమిన్
సీతకు నుండఁ దోడుగను శీఘ్రము తోడ్కొని రాఁగఁ బల్కుమా
చూతము పట్టణమ్ము నతి సుందర మైన యయోధ్య నింపుగా
నీ తఱి నంచు నవ్విధి హరీశ్వర! నీవును రమ్ము వేగమే 21.

ఉ. నా విని గొప్ప తేజుఁడు నృనాథుఁడు వల్కఁ బ్లవంగ నేత సు
గ్రీవుఁడు శ్రీ విరాజితుఁడు ప్రీతినిఁ గూడి ప్లవంగ కోటినిం
దా పెసఁ జేరి యంతిపురి తారను భార్యను గాంచి యిట్లనెం
బావని సీత కోరగను బార్థుఁ డనుజ్ఞ నొసంగె మీ కిటుల్ 22.

తే.గీ. హరుల దారల నెల్లర నంచితముగఁ
గూడి ప్రియ! యేఁగఁగ నయోధ్యకు ననుమతి నొ
సంగె రండు త్వరితముగ నంగనా మ
ణి! దశరథుని దారలను జూచెదము తార! 23.

కం. విని సుగ్రీవుని పలుకులు
తను శోభలఁ గరము వెల్గు తారా సతి యం
త నగచరుల భార్యా మణు
ల నెల్లరను బిలిచి పల్కుల ననియె నిట్లున్ 24.

తే.గీ. అనుమ తించిరి హరు లెల్ల హరి విభుండు
కూడ నేఁగ నయోధ్యకుఁ గూర్మి నొసఁగు
కార్య మియ్యయోధ్యా పుర గమన మెంచ
నాకు సత్వర మిఁక రండు నాతులార! 25.

తే.గీ. పౌర జానపదుల తోడ మూరి రాముఁ
డయ్యయోధ్యలోఁ జొచ్చుట యా దశరథు
నెల్ల భార్యల యైశ్వర్య మెల్లఁ గాంచు
టయును బ్రీతి నొసంగు నెడంద నాకు 26.

ఉ. వార లలంకరించికొని వానర నారు లనుజ్ఞ నీయఁగాఁ
దార యథోక్త రీతినిఁ బ్రదక్షిణ మింపుగ నాచరించి సీ
తా రమణీ మతల్లి వర దర్శన కాంక్షలు వేగ హర్ష మే
పారఁగ నవ్విమానమును నంగన లెక్కిరి సంభ్రమమ్ముననన్ 27.

కం. వారిని గూడి విమానము
నారసి యెగురంగ రాముఁ డవనిజ తోడం 28.

జేర వెస ఋష్యమూకము
నారీ మణి సీతఁ గాంచి నరవరుఁ డనియెన్

ఉ. కంటె స విద్యు దంబుద నికాశము శైలము ఋష్యమూకముం
గంటిని వానరేశ్వరునిఁ గాంచన ధాతు విరాజి నద్రినిన్
వెంటఁ జరింప లక్ష్మణుఁడు బ్రీతిని నిచ్చటఁ దొల్లి వాలిఁ గ్రా
ల్గంటిరొ చంపఁ బల్కితినిఁ గంటకు వానరు భ్రాతృ బాధకున్ 29.

కం. ఇది పంపా నది చూడుమ
ముదమారఁగఁ బద్మ చిత్ర భూరి వనమ్ముల్
సుదతీ వెలయం గుందితి
నెద నిన్నరయమి భృశంపు టేఁపు సెలంగన్ 30.

తే.గీ. దీని తీర మందు శబరి సేను ధర్మ
చారిణిం గంటి వైదేహి! చారు నేత్రి!
భయదు యోజన బాహుఁ గబంధు నిచట
నే వధించితి నప్పుడు నీరజాక్షి! 31.

ఉ. మానుగ గోచరం బిచట మానిని! పాదప రాజ మీ జన
స్థానము నందు బల్లిదుఁడు తద్ద జటాయువు మేటి పక్షులం
దా నిట సీత! నీ కొఱకు ధాత్రినిఁ గూలె దశాస్యుఁ డుగ్రుఁడై
వీనిని ఘోర యుద్ధమున భీమ నిశాటుఁడు గొట్టఁ గ్రూరతన్ 32.

తే.గీ. ఖరునిఁ దిన్నఁగఁ జరియించు శరముల వధి
యించిన స్థల మిది త్రిశిరు నిద్ధ బలుని
దూషణుని రక్కసుల బల్లిదులను జంపి
నట్టి మన యాశ్రమం బిది యంబుజాక్షి! 33.

కం. మన పర్ణశాల యియ్యది
కనఁబడు చున్న దిటఁ జిత్ర కానన మందున్
నిను నెచ్చట రావణుఁడే
గొని పోయెను బల్కి చూడు కోమలి! యిదియే 34.

కం. ఇది పావన గోదావరి
సదమల జల పూర్ణ మవనిజ! కనుమ రమ్యం
బిది ముని యగస్త్యు నిలయము
కదలీ వన శోభితమ్ము కనఁబడు చుండెన్ 35.

తే.గీ. వెలుగుచు సుతీక్ష్ణుని మహాత్ము స్వీయ సుంద
రాశ్రమము దృశ్య మిచ్చట యరయు మింక
ను శరభంగు నాశ్రమము మును చనుదెంచె
నెచటకుఁ బురందరుం డదియె యిది కనుమ 36.

చం. కనఁబడు చుండెఁ దాపస నికాయము లిచ్చట యత్రి యెచ్చటన్
ఘనుఁ డన లార్క సన్నిభుఁడు గ్రాలు విభుం డయి యిచ్చ టే మహాం
గు నసురునిన్ విరాధు నతి ఘోరునిఁ జంపితి సీత! యిచ్చ టీ
వనమున నీవు తాపసినిఁ బన్నుగఁ గంటివి దర్మచారిణిన్ 37.

కం. తనుమధ్య! చిత్రకూటము
ఘన శైలము రమ్యముగఁ బ్రకాశించుచు నుం
డె నిచట కైక కుమారుఁడు
నను వేఁడఁగ వచ్చియుండె నరవరుఁ డిటకున్ 38.

కం. ఇది యా యమునా నది యు
న్నది కనఁబడి దూరముగ వనమ్ములు వెలుగం
గఁ దనరి చిత్రమ్ములఁ గను
మ దరి భరద్వాజు మఠము నడరఁగ శ్రీలన్ 39.

ఆ.వె. కాన వచ్చు చుండె గంగా నది త్రిపథ
గ కడుపావనము జనక కుమారి!
కాననమ్ము లెల్ల నానా ద్విజ గణా వృ
తమ్ము లింకఁ బుష్పితమ్ము లరయ 40.

తే.గీ. శృంగిబేర పుర మదివొ స్నేహితుండు
గుహుఁడు నం గలిసిన చోటు కోమలాంగి!
యూపమాలినిఁ గను  సరయూ నదిని వి 41.

విధ తరు కుసుమ రాసుల వెలయు దాని

తే.గీ. అదివొ కనిపించు చున్నది యయ్యయోధ్య
రాజధాని నా తండ్రికి రమణి! కనుమ
తిరిగి వచ్చితి మింపుగ దేవి! వంద
నమ్ము లాచరింపుమ భక్తి పమ్మ మదిని 42.

కం. హరులు విభీషణు తోడ న
సురు లెల్లరు నెగిరి యెగిరి జూచిరి యా సుం
దర పురము నయోధ్య నచట
మురియుచు నవ్వేళ డెందముల నధికముగన్ 43.

తే.గీ. ధవళ హర్మ్య మాలికలను దనరు దానిఁ
గడు విశాల కక్ష్యలు హయ గజము లడరు
పురము గనిరి ప్లవగులు నసురులు నింద్రు
ని యమరావతి భంగిని నెగడు దాని 44.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యిరువది యాఱవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 127.

రాముఁడు భరద్వాజుని యాశ్రమమున కరిగి నమస్కరించి యయోధ్యా నగర క్షేమమును భరతుని మాతల కుశలమ్ము నెఱుంగుట.

కం. పదునాలు గేండ్లు పరిపూ
ర్తిఁ దనర నైదవది యైన తిథి నరుదెంచెన్
ముద మార లక్ష్మ ణాగ్రజుఁ
డెదను భరద్వాజు దరికి నెరఁగెను భక్తిన్ 1.

ఉ. ఓజ నమస్కరించి పురుషోత్తముఁ డిట్లడిగెన్ వెసన్  భర
ద్వాజుని దేవ! వింటిరె స్వ పట్టణ భద్ర మనామయమ్మునుం
దేజుఁడు యుక్తుఁడై చనునె ధీమతి యా భరతుండు పల్కుఁడీ
నా జననీ మణుల్ ధర ఘనమ్ముగ నుండుదురే స జీవలై 2.

కం. అన నిట్టులఁ గాకుత్స్థుఁడు
విని ముని నవ్వుచు ననె రఘు వీరుని తోడన్
మినుకులను భరద్వాజుఁడు
మనమున సంతోష మడర మాన్యుం డిట్లున్ 3.

తే.గీ. పంక మంటంగ భరతుండు వనరు చుండి
జడల నూని పేచుచు నుండె నడరి నీదు
పాదుకుల గౌరవించుచు భద్ర గతిని
నెల్ల రున్న వా రచ్చట నిండ్ల లోన 4.

ఉ. మున్నిటఁ జీర వస్త్ర ధరు భూజ తృతీయునిఁ జొచ్చు వానినిన్
నిన్ను నరణ్య మత్తఱిని నీరజ లోచన! రాజ్య దూరునిన్
మన్నన నుంచి ధర్మమున మానవ పుంగవ! కేవలమ్ముగా
నెన్ని త్యజించి సర్వము నరేంద్రుని యానతిఁ బాద చారివై 5.

చం. దివమున సర్వభోగ వితతిం ద్యజియించిన దేవు వంటి మా
నవ వర! నిన్నుఁగాంచఁ గరుణా రస పూరిత మానసుండ నై
తి వినుమ కైక వాక్కుల రతిం గొని మూల ఫలాశి వై మహో
గ్ర వనిని సంచరించి నను గాంచఁగఁ జేరిన నాఁడు రాఘవా! 6.

తే.గీ. నేఁడు సిద్ధార్థుఁడవు నయి నీవు రాఁగ
బంధు మిత్ర యుతమ్ము గఁ బార్థివేంద్ర!
నిన్ను వీక్షింప విజితారి నీరజాక్ష!
సంతసం బుద్భవించె నితాంత మాత్మ 7.

సీ. స సుఖ దుఃఖము జనస్థానమం దీ వందినది యెల్ల  రాఘవ! యాత్మ నెఱుక
నాకు ద్విజులు వేఁడ నరవర్య! తాపసులను గాచు చున్నట్టి రామ! నీదు

భార్య రావణు చేత వన మందు దొంగిలింపఁ బడుట మారీచుఁ బడతి సీత
గాంచుట యంతటఁ గాంతాపహరణమ్ము సూచుటయుఁ గబంధు సువ్రత! వెసఁ

తే.గీ. జనుట పంపకు సుగ్రీవు ఘనుని చెలిమి
వాలి వధ సీత వెదకుట వాయు తనయు
కర్మ మవనిజఁ గనుట లంకా దహనము
నలుఁడు సేతువు నిర్మించిన విధ మెల్ల 8.

తే.గీ. బంధు మిత్ర సూ నామాత్య స్వబల యుతము
దేవ కంటకు రావణుఁ ద్రెంపుటయును
సుర సమాగమ మొసఁగుట వరము లలరి
నా తపశ్శక్తి నేరుదు నర వరేణ్య! 9.

ఆ.వె.. అవని రాఘవేంద్ర! యఖిల ప్రజలకు గో
విత్త ధాన్య మిత్ర వితతి గౌర
వమున కర్థము నరవర్య! మిన్న యగును
జనని జన్మభూమి స్వర్గమునకు 10.

కం. ఏఁగుదు రయోధ్యకుఁ బలుక
బాగుగ నా శిష్యు లచటి వార్తల నెల్లం
జేఁ గొను మిత్తు వరము రే
పేఁగు మయోధ్యకు గ్రహించి యీ సత్క్రియలన్ 11.

ఆ.వె. అట్లె యంచు రాముఁ డా గిర లౌదల
నూని రాజ తనయుఁ డుత్తమముగ
నడిగె వరము నిట్లు పుడమి విభుండు శ్రీ
మంతు నా మహర్షి సంతసమున 12.

తే.గీ. ఒప్పుగ నకాల మందు నయోధ్య కేఁగు
దారిఁ దరులు తేనె లొలుకు భూరి ఫలము
లమృత గంధ యుక్తమ్ముల నడర నిమ్మ
నేకముల వివిధముల మునీంద్ర! కరుణ 13.

కం. ప్రతిన నొసఁగ నట్లె యగు న 14.

ని తాపసుం డెల్లెడలను నెగడిన వంతన్
వితత దివపాదపమ్ముల
గతి నచ్చటి పాదపములు కమనీయముగన్

తే.గీ. ఫల సమృద్ధమ్ము లయ్యె నిష్ఫల తరువులు
పుష్ప హీనము లయ్యెను బుష్ప వంత
ములుగ శుష్క తరులు పత్రముల వెలింగె
మూడు యోజనముల దారి నోడెఁ దేనె 15.

కం. వానర వర్యులు ఫలముల
నూనిరి తమకమ్ము మీఱ నుత్సాహముతో
నా నాకమ్ము జయించిన
పైనము హర్షాన్వితు లయి బహు విధ ఫలముల్ 16.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యిరువది యేడవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 128.

రాముని యాజ్ఞఁ దలఁ దాల్చి హనుమంతుఁడు శృంగిబేర పురమున గహునకుఁ గుశలముగ రాముని పునరాగమనమును దెలిపి నందిగ్రామమున కరిగి భరతుని దర్శించి రాముని వృత్తాంతము తిరిగి రాకను దెలుఁప భరతుడు పరమానంద మంది హనుమంతుని సత్కరింపఁ దలంచుట.

కం. కని తా నయోధ్య రాముఁడు
ఘనత్వరిత విక్రముండు కడఁగి ప్రియ మొన
ర్ప నృవరుఁడు దృష్టి సారిం 1.

చి నగచరులపైఁ గని హరి శేఖరు హనుమన్

చం. అరిగి పురం బయోధ్యకు మహాత్మ! ప్లవంగ వరేణ్య! శీఘ్రమే
నరవరు నింట నెల్లర యనామయ మీ వెఱుఁగంగ నొప్పు నో
హరి వర! శృంగిబేర పురి నా గుహుఁ గాంచి యరణ్య వాసినిన్
వర నిషధాధి నేత నిజ భద్రముఁ జెప్పుమ నాదు వాక్కులన్ 2.

ఉ. నేరిన నాదు క్షేమమును నిల్వ నరోగిగ వీత బాధలన్
మారుతి! యందు నా గుహుఁడు మానస మందు సమగ్ర హర్షమున్
దారిని నీ కయోధ్యకు ముదమ్మునఁ జెప్పును బల్కు నింపుగాఁ
బేరిమి తోడుతన్ భరతు వృత్తము నా సమ మిత్రుఁ డెన్నఁగా 3.

చం. పలుకుమ నాదు మాటలను భార్యను లక్ష్మణుఁ గూడి యున్న నా
సలలిత సౌఖ్య మెల్ల నట సర్వము నా దగు కార్య సిద్ధినిన్
లలనను జానకీ సతిని రావణుఁ డుగ్రుఁడు దొంగిలించుటం
గలియుట వానరోత్తముల కాంతునిఁ గన్న న వాలిఁ గూల్చుటన్ 4.

తే.గీ. మైథిలీ మార్గణమ్మును మారుతాత్మ
జా! యనంత తోయ మయము సాగరమును
నీవు దాఁటి చూచిన గతిఁ బావని! వచి
యింపు మింపుగ భరతున కెల్ల నచట 5.

చం. కడలిని వేగ డాయుటను గ్రాంతిని సాగర దర్శనమ్మునుం
వడి వడి సేతు బంధనము భండన మందు దశాస్యుఁ జంపుటం
బడయుట నే వరమ్ములను వజ్రి నదీశ సరోజయోను ల
య్యెడ నిడఁ బల్కుమీ హనుమ! యీశ్వరు సద్దయఁ దండ్రిఁ గూడుటన్ 6.

ఉ. వచ్చిన వానిగా నిటకు వానర నాథుని రాక్షసేంద్రునిం
జెచ్చెర నుంచి తోడుగను జీల్చి విరోధుల నెల్లఁ గీర్తి నే
నిచ్చ వహించి కార్యము ఫలింప బలాఢ్యులు స్వీయ మిత్రులే
వచ్చుచు నుండ వెంటఁ దమి వాయుజ! తమ్ముని తోడఁ జెప్పుమా 7.

కం. ఇది విన్న భరతుఁ డెట్బం 8.

గిఁ దాల్చు నాకారము నెఱిఁగి కొనుమ నాకై
యెదఁ దా నెవ్విధి వర్తిలు
నది యెల్ల గ్రహింప వలయు నాత్మ హరీంద్రా!

తే.గీ. అచ్చటి కథల నెల్ల నీ వరయ వలయు
భరతు నింగితముల ముఖ వర్ణముల వ
చనముల నిజముగ నచట సంగ్రహింప
వలయు నరసి వివరముగ వాయు తనయ! 9.

తే.గీ. సర్వ కాల సమృద్ధ మఖర్వ భూమి
హస్తి తురగ రథ వర సమావృతమ్ము
రాజ్యము పితృ పైతామహ ప్రాప్త మెవరి
మనము మరలింప కుండును హనుమ వినుమ 10.

ఉ. కూడికొనంగ రాజ్యమును గోరిక కల్గినఁ బాలనమ్ముపైఁ
బాడిగ నాతఁ డేలు నిఁక వారక రాజ్యము నెల్లఁ బ్రీతిమై
ఱేఁడయి వాని బుద్ధిని నెఱింగి కపీశ్వర! వాని యత్నముల్
తోడన రమ్ము నేరి తగ దూరము సాగక మున్న మే మిటన్ 11.

ఉ. ఆనతి నీయ నివ్విధము హర్షమునన్ హనుమంతుఁ డంతటన్
మానవ రూపధారి యయి మారుత సూనుఁ డయోధ్యకై వెస
న్మానుగఁ బైకిఁ దా నెగిరె నాగులకై వినతా సతీ మహా
సూనుఁడు మించు భంగి కపి శూరుల ముఖ్యుఁడు సంభ్రమమ్మునన్ 12.

తే.గీ. ఎగిరి తండ్రి మార్గమున ద్విజేంద్ర నిలయ
మందు గంగా యమునల సమంచితంపు
సంగమమ్మును దాఁటి యా శృంగి బేర
పురము నొచ్చి కూడి గుహుని మురిసి పలికె 13.

ఉ. రాముఁడు నీదు స్నేహితుఁడు రామను తమ్మునిఁ గూడి యింపుగా
నా మును జేశుఁ డడ్గెను గుహా! కుశలమ్మును నిన్ను క్షేముఁడై
తా ముని చెంత నిల్చి నిసిఁ దాపసు నానతి నూని కాంచ ని
న్గోముగ సత్య విక్రముఁడు కూరిమి వచ్చు నిషాద రాడ్వరా ! 14.

తే.గీ. పలికి తేజస్వి కపి గగుర్పాటు వొడమ
వేగవంతుండు మారుతి వేగముగను
బై కుఱికె నవిచారము వీఁకఁ జాగఁ
దొడఁగె నాగక యెచట సంతోషముగను 15.

తే.గీ. కాంచె రామతీర్థమ్మును గాంచె నదిని
వాలుకినిని వరూధినిఁ బావనంపు
గోమతిని సాల వనమును భీమమును వి
శాల జనపదములఁ గాంచెఁ జాల జనుల 16.

చం. త్వర త్వర యేఁగి దూరము ప్లవంగ వరేణ్యుఁడు స్త్రీలు వృద్ధులుం
దిరుగఁగ నుండ వెంటను రతిం దమ పిల్లలు సేరె శీఘ్రమే
తరువుల నంది పేరున శ్రుతమ్ము భృశమ్ముగ గ్రామ మందుఁ జై
త్ర రథముఁ బోలు నట్టి వని రమ్యముగాఁ గనిపించు దానినిన్ 17.

చం. గురు నగరం బయోధ్య కొక క్రోశపు దూరమునన్ జటాధరున్
భరతుఁ గృశాంగు నాశ్రమ నిబద్ధుని నింపిరి గాత్రుఁ ద్వక్కు టం
బరు ఫల మూల భోజనుని వల్కల వస్త్రునిఁ దాప సాభునిన్
గురు పద చింత నార్తిఁ గనెఁ గూరిమి దాంతుని ధర్మ చారినిన్ 18.

చం. పరఁగచు నుండఁగా జడల భారము బ్రహ్మ ఋషిప్రభా నిభున్
సురుచిర నీతిమంతు నతి సుందర చిత్తుని గారవించుచున్
విరివిగ నన్న పాదుకలఁ బృథ్విని గాచుచు నున్న వాని నా
భరతుని నాల్గు వర్ణములఁ బన్నుగఁ బ్రోచెడు లోక రక్షకున్ 19.

చం. సచివులు నా పురోహితులు సద్గుణు లుండ సమీప మందు స్వీ
య చమువు సాయ ముండఁగ సమంచిత రీతినిఁ గావి చీరలన్
రుచిరము లూని నట్టి జనులుం దన నింపుగఁ జుట్టు ముట్టఁగాఁ
బ్రచురపు ధర్మవత్సలుని రాజకుమారునిఁ బౌర యుక్తునిన్ 20.

తే.గీ. ధర్మ విదుఁ దను వూనిన ధర్మ మపర
మనఁగ నున్న వానినిఁ గాంచి హరివరుండు 21.

పలికె నంజలి ఘటియించి పలుకు లిట్లు
మారుతి పరమ నిపుణుండు మాట లందు

తే.గీ. దండకారణ్యమున మున్ను తాప మంది
తెట్టి చీర జటా ధారి నెంచి రాజ!
యట్టి కాకుత్స్థుఁడు కుశల మడిగె నిన్ను
నేఁడు ప్రియము పలుకు చుంటి వీడు వగను 22.

కం. దారుణ శోకము వీడుమ
వీరా! యీక్షణము నంద ప్రీతిని భరతా!
నీ రాముని భ్రాతను వెస
గారవముగఁ గలయఁ గలవు కలవర మేలా 23.

ఉ. రావణు రాక్ష సాధముని రాముఁడు సంపి గ్రహించి జానకిన్
దేవిని సిద్ధినిం బడసి తిన్నగ బల్లిదు లైన మిత్రులన్
భూవర! గూడి నిం గదియు మున్నిడి లక్ష్మణు జానకీ యుతుం
డై వెస నింద్రు వెంట శచి హర్ష సమేతము సాగు నట్టులన్ 24.

కం. అన హనుమంతుం డిట్టుల
విని భరతుఁడు కైక సుతుఁడు పృథ్విని గూలెన్
ఘన హర్షమ్మున మోహ
మ్ము నంది యెద లోపల భృశముగ నొక్క త్రుటిన్ 25.

కం. అంతట లేచి భరతుఁ డొ
క్కింత తడవున కెద నూఱడిల్లి తగ హనూ
మంతుని వీక్షించి పలికె
సంతస ముప్పొంగ నిట్లు సంభ్రమ మడరన్ 26.

కం. తడిపెం గౌఁగిలి ప్లవగుని
వడి హర్షాశ్రువులఁ గరము వాయుజు నంతం
గడు సంభ్రమమున నా భర
తుఁడు శ్రీమంతుఁడు కడింది తుష్టుం డగుచున్ 27.

చం. నరుఁడవొ నీవు దేవుఁడవొ నాకుఁ బ్రియమ్ముఁను దెల్పితిట్టులన్
వరముగ లక్ష గోవులను వంద పురమ్ముల నిత్తుఁ గన్నెలన్
ధరఁ గొనుమా పదాఱుగుర దారలఁ గుండల రాజి తాస్యలన్
సురుచిరలన్ మహాత్మ! కడు సుందర దాసుల నిత్తు వారికిన్ 28.

తే.గీ. పసిడి వర్ణపు వారిని స్వర్ణ భూషి
తలను సంపన్నలను మంచి కులమున జని
యించి నట్టి వనితల ననేకుల నొసఁ
గుదు ముదము మీఱఁ గొను మీవు కోర్కి తీర 29.

కం. విని రాము వింత రాకను
మనుజేంద్ర సుతుఁడు ముదమ్ము మనమున నిండం
గన నెంచి రాముని వచిం
చెను భరతుం డిట్లు సంతసిల్లి వచనముల్ 30.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యిరువది యెనిమిదవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 129.

సీతా రామ లక్ష్మణుల వనవాస విశేషములను హనుమంతుఁడు భరతుఁ డడుగ నెల్లరు వినుచుండ వివరించుట.

కం. వనమునఁ బెక్కేండ్లు చరిం
చిన నా నాథుని కథ నిటఁ జేకుఱ ముదమే
వినుచుంటిని గద రఘు రా
ముని చరితమ్మును వచింపుము పెస మహాత్మా! 1.

కం. మానవుఁడే జీవించిన 2.

యానందము వంద యేండ్ల కైనను గను వాఁ
డీ నానుడి నా యందు న
హో నిజ మైనది దలఁప సముచితపు రీతిన్

ఉ. రాముని కా ప్లవంగులకు రమ్యపు సంగమ మెట్టు లెక్క డే
సీమలఁ గల్గె నెవ్వరినిఁ జేర లభించెను జెప్పు మద్దఁగా
నో మహితాత్మ! సత్యమును యుక్తముగా నడుగంగ నట్టులన్
గోముగఁ బీఠ మిచ్చి హరి కూర్చొని చెప్పఁ దొడంగె నిట్టులన్ 3.

సీ. ఓ మహాభుజ యుగ్మ! నీ మాత కెట్లు వరము లీయఁ బడినవొ రాముఁ డెట్లు
వనములకై వెసఁ బంపఁ బడెనొ పుత్రు పై నార్తి జనకుండు వ్రాలె నెట్లు
రాజగృహము నుండి రప్పింపఁ బడి తెట్లు దూత వరేణ్యుల చేత నీవు
సేరి యయోధ్యను గోర కుంటివి రాజ్య మెట్లీవు శీఘ్రము యేఁగి చిత్ర
తే.గీ. కూట గిరికి రాజ్య మొసఁగఁ గూడ దనియె
నెట్లు రిపు నాశకుఁడు భ్రాత యెంచి నీతి
రాజు నానతి తలఁ దాల్చి భ్రాత పాదు
కుల గ్రహించి మరలి తీవు కలఁత నెట్లు 4.

ఆ.వె. నిజముగ నిది యెల్ల నీవ యెఱుంగుదు
తెల్లముగను జనఁగఁ దల్లడిల్లి
నీవు జరిగిన కథ నే నుడివెద రామ
చరిత మెల్ల నీకుఁ జక్కఁగాను 5.

చం. వెడలఁగ నట్లు నీ వడవి భీకర మయ్యె మృగద్విజాలితో
నడలుచు మిక్కుటమ్ముగను నార్య జనావృతమై భృశమ్ముగా
వడి వడిఁ జొచ్చె రాఘవుఁడు వ్యాఘ్ర కరీంద్ర మృగేంద్ర జంతువుల్
వెడవెడఁ దిర్గు చుండగ నభీతిని భైరవ దండకా వనిన్ 6.

కం. చను చుండ వారి యెదుటను
వనమున ఘోర నినదమ్ము పరఁగఁగఁ గన్న
ట్టెను బల్లిదుఁడు విరాధుఁడు
కని యూర్ధ్వభుజుని నధో ముఖ మడరు నసురున్ 7.

తే.గీ. లేపి వానిని ఘోరు గర్జించు చున్న
గజ మనఁగ గుంట లోన ముఖమ్ము దనర
నడుగు వైపున వైచిరి యన్నదమ్ము
లంత రామలక్ష్మణులు నితాంత బలులు 8.

తే.గీ. దుష్కరపుఁ గర్మ మొనరించి దొడ్డ బలులు
రామ లక్ష్మణు లవ్విధి రమ్యపు శర
భంగు నాశ్రమమ్ము గనిరి వనము నందు
వారు మునిమాపు వేళను భక్తి తోడ 9.

తే.గీ. దివ మరుగ శరభంగుఁడు దివ్య ముని వ
రేణ్యుఁడు మునులకు నర వరేణ్యుఁ డంత
వందనము లాచరించి సభక్తి కదిసె
నంతఁ దా జనస్థానము నలరి మిగుల 10.

చం. కదిసెను గాంత శూర్పణఖ కైణప భామయె కామ సక్తయై
పదపడి రాము నాజ్ఞఁ గరవాలము తోడుత లక్ష్మణుండు వే
విదిలిచె ముక్కునుం జెవుల వీర వరేణ్యుఁడు రాముఁ డత్తఱిం
దుదిఁ బదునాల్గు వేవురను దుష్టులఁ జంపెను దత్స్థలమ్మునన్ 11.

ఆ.వె. కయ్యమునకు నడరి కలసి వచ్చిన రక్క
సులను రాముఁ డొకఁడు చోద్యముగను
బగటి నాలుగవది భాగములోన ని
శ్శేషముగ వధించె శీఘ్ర గతిని 12.

తే.గీ. దండకారణ్య వాసులఁ దాపసుల కొ
సంగ విఘ్నములను గాంచి చంపె వేగ
రాఘవుండు రణము నందు రక్కసు ఖరు
దూషణుఁ ద్రిశిరసునిఁ గూల్చెఁ దూర్ణముగను 13.

ఆ.వె. అంత శూర్పనఖ కలంత సెంది కదిసె
రావణు నసుర పతి రావణ సఖుఁ
డపుడు రత్న మృగపు టాకృతి మారీచుఁ 14.

డూని లోభపఱచె నుర్వి సుతను

ఆ.వె. సీత గాంచి మృగము ప్రీతిఁ బలికె దీనిఁ
బట్టి తెచ్చి యీయ వలయు నంచు
నాశ్రమమున నుంచ నంద మొసఁగు నని
యంత రాముఁ డరిగె నందుకొనఁగ 15.

కం. ధను వూని రాముఁ డప్పుడు
చనె వెంట మృగమున కంత సత్వరముగ దా
నిని జంపెను బాఱ రయము
న నంద కున్న నత పర్వ నారాచమునన్ 16.

చం. మృగమును బట్ట రాఘవుఁడు మించి చనంగ సుమిత్ర పట్టియున్
మగువను వీడి యేఁగగను మాయను రావణుఁ డేఁగుదెంచి బ
ల్మిఁ గుజుఁడు రోహిణిం బగిది లీలగఁ గైకొని చాగె శీఘ్రమే
తెగఁబడ నా జటాయువును దిట్ట తనమ్మునఁ గూల్చె నిర్దయన్ 17.

చం. గిరి శిఖరమ్ము పై నసురు కృత్యము గాంచిరి నిల్చి వింతఁగా
హరి వరు లెల్ల రావణ మహాసురుఁ డంబర వీథి నేఁగఁగా
గిరి నిభ కాయు లెల్లఁ బరికించిరి రక్కసు విస్మయమ్మునన్
ధరణిజఁ గూడి పుష్పకపుఁ దద్ద విమానము నందుఁ జాగఁగా 18.

తే.గీ. చని మనోజవంపు విమానమున స సీత
యెక్కి బలవంతుఁ డసురుండు గ్రక్కున నగ
రమ్ము సేరె నా లంకను రాక్షసేశ్వ
రుండు రావణుండు దశముఖుండు ప్రీతి 19.

ఆ.వె. స్వర్ణ సౌధ మందు జానకి నుంచి శు
భ తర వేశ్మ మందుఁ బలికి మంచి
వాక్యములను గొన్ని వైదేహి నూఱడిం
పఁ దొడఁగె నవనిజను బహు విధముల 20.

ఆ.వె. గడ్డి పరక వోలెఁ గాంత భావించి ద 21.

శాస్యు భాషణముల నవనిజ మది
నుంచి భర్తను వసియించె నశోక వ
నమ్ము లోన నెడఁద నమ్మి పతిని

ఆ.వె. జింకఁ జంపి మరలి సీతను గానక
కాంచి హతుని గ్రద్దఁ గలఁత నెందెఁ
దండ్రి కన్న ప్రియునిఁ దనతోడ నుడువంగ
రావణుఁడు హరించె రమణి నంచు 22.

తే.గీ. సంస్కరించి తండ్రి సఖునిఁ జక్కఁగాను
వెదకుచుఁ బడతి సీతను వెంట నుండ
లక్ష్మణుండు గోదావరీ లలిత తటిఁ జ
రించుచుఁ గబంధు నసురునిఁ గాంచె నచట 23.

కం. విని యా కబంధు వచనము
లను సత్య పరాక్రముండు రాముఁడు సుగ్రీ
వునిఁ గలిసె ఋష్యమూక
మ్మున గిరిశిఖరమ్మునఁ గపి ముఖ్యుని సుహృదున్ 24.

తే.గీ. మును జనించె వారల స్నేహము విన నొకరి
నొకరు గాఢ మయ్యెఁ జెలిమి యుగ్రుఁ డన్న
వాలి సుగ్రీవుఁ దఱిమెను వానిఁ జంపి
రాముఁ డనుజున కిచ్చెను రాజ్య మెలమి 25.

ఆ.వె. రాజ్య మందు నిలుప రాముఁడు సుగ్రీవు
నవనిజను వెదుకఁగ హరి వరుండు
మాట నొసఁగె నంత మనుజ నాథునకుఁ బ్ల
వంగ గణ విభుండు వత్సలుండు 26.

తే.గీ. పంపె నాల్గు దిక్కులకును బ్లవగులఁ బది
కోట్ల వీరుల నెల్లర కోమలిఁ బరి
కించి రాఁగ మహాత్ముఁడు సంచరింప
వింధ్యలో మాకు గతి తప్పె వెఱపు పుట్టె 27.

తే.గీ. కడవఁ గాలము మిక్కిలి కలఁత రేఁగ
బాధ పడుచుండఁగ జటాయు భ్రాత మాకుఁ
దెలిపె సంపాతి రావణు నిలయ మందు
సీత వసియించు చున్నది జేరుఁ డనుచు 28.

కం. తొలఁగించుచు బంధువుల పె
తల వీర్యము నాశ్రయించి తద్ద ముదమునన్
జలనిధిని వంద యోజన
ముల దాఁటితి రామ కృపను బుడమి తనయకై 29.

ఉ. చూచితి నే నశోక వని సువ్రత మాసిన చీర మానినిన్
వేచుచు నుండ భర్త కయి వేదన మీఱఁగఁ బట్టు వస్త్రనుం
దోఁచుచు నుండ దుఃఖ మెదఁ దూర్ణము నన్నెఱిగించికొంచు వే
వే చని యంగులీయకము ప్రీతి నొసంగితి నానవాలుగా 30.

చం. అవనిజ నుండి నే మణిని హర్షమునం గొని యానవాలుగా
నృవరున కీయ వెల్గు మణి నెమ్మిని నే యరుదెంచి శీఘ్రమే
యువిదను గూర్చి విన్న పురు షోత్తముఁ డాశను జీవితమ్మునం
దవిరళ మూనె రోగి యిల నయ్యమృతమ్మును గొన్న భంగినిన్ 31.

కం. విని రాముఁ డుద్యమింపం
గ నెంచెను లయ మొనరింపఁ గ్రన్నన లంకం
గనలిన యనలుండు జగము
లను గాలుచు భంగి నంత లయ కాలమునన్ 32.

ఆ.వె. అంతఁ జేరి యెల్ల రర్ణవమును సేతు
వు నొనరింప నలుఁడు వన నిధి పయి
దాఁటి రెల్ల రంత త్వరిత గతిఁ కడలిఁ
బ్లవగ వీర వరులు రమ్యముగను 33.

తే.గీ. నీలుఁడు వధించెను బ్రహస్తు లీల నాజిఁ
గుంభకర్ణు వధించెఁ గాకుత్స్థుఁ డడరి 34.

యింద్రజిత్తును లక్ష్మణుఁ డెదిరి చంపె
రావణుని స్వయముగఁ జంపె రాముఁ డాజి

తే.గీ. శక్రు యమునిని వరుణుని శంభు నింక
బ్రహ్మ దేవుని దశరథు రాఘవుండు
కలిసెఁ బడసె వరములు మునుల సురర్షు
లను గలిసె వార లొసఁగిరి ఘన వరములు 35.

తే.గీ. దత్త వరుఁడు రాముఁడు హర్షిత హృదయుండు
వానరవ్రాతమును గూడి మానవేంద్రుఁ
డేఁగుదెంచెను గిష్కింధ కింపుగాను
పుష్పక విమానవరమునఁ బురుష వరుఁడు 36.

తే.గీ. తాను గంగా నదినిఁ జేరి తాపసేంద్రు
చెంత నున్నవాఁడు మనుజ శేఖరుండు
రామునిఁ గన నర్హుండవు రాజపుత్ర!
నీవు బుష్య యోగమ్మున నెమ్మి రేపు 37.

కం. విని హనుమంతుని గిరలను
మనముప్పొంగ భరతుండు మాటలఁ దా ని
ట్లనెను జిర కాల మీ రీ
తినిఁ దీరెను నాదు కోర్కి తియ్యగ నంచున్ 38.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట యిరువది తొమ్మిదవ సర్గము.

## యుద్ధ కాండము

## సర్గము 130.

భరతుని యానతిని రాముని రాకకు సంతోషించి యయోధ్యా నగర పౌరులు నగరము నలంకరించి

భరతుని వద్దకు రాఁగ రాముఁడు నందిగ్రామమును జేరి భరతునిఁ గలసుకొనుట. పుష్పక విమానమును దిరిగి రాముఁడు కుబేరుని వద్దకు పంపుట.

కం. విని పరమానందములు వ
చనమ్ములు భరతుఁ డనుపమ సంతోషమునన్
ఘనుఁడా సత్యపరాక్రముఁ
డనిపెను శత్రుఘ్నుఁ దమ్ము నానందితునిన్ 1.

చం. పురమున నున్న చైత్యములఁ బుణ్య సురాలయ సంచయమ్మునున్
నరు లతి శుద్ధులై నిజ మనమ్ములఁ జందన మాల్య పంక్తులన్
సురుచిర రీతిఁ బూజలను శూర వరేణ్య! యొనర్పఁ బంపుమా
గురు తర వాద్య నైపుణులు కోవిదులున్ వర సూత పంక్తులున్ 2.

చం. గణికలు వంది మాగధులు కాంతల యుక్తము రాజ మాతలున్
వణిజులు వాహిణీ సచివ వర్యులు రాజకుమార కోటి బ్రా
హ్మణులు పురప్రవీరులు  మహాత్ముని రాముని దర్శనార్థమై
గుణ గణ వంద్యు నా శశి ముఖుం గన నెల్లరు నేగఁగా వలెన్ 3.

కం. విని భరతుని వాక్యములను
బనివారి ననేకుల నటఁ బంచెను పరవీ
ర నికాయఘ్నుఁడు బల్లిదు
లను శత్రుఘ్నుం డపుడు పరమ నైపుణులన్ 4.

తే.గీ. ఫూడ్ప వలయుఁ బల్లములను బుర మయోధ్య
వఱకు వేగ నందిగ్రామ పరిసరముల
నుండి సమముగఁ జేయుఁడు మండితముగ
దారిఁ దొలఁగింపుడి యవరోధముల నెల్ల 5.

ఉ. చల్లుడు శీత లోదకము  సల్లుడు లాజలు పూవు లెల్ల మీ
రెల్లెడ లందు టెక్కెముల నింపుగ నుంచుడు వీథులం దహో
కొల్లలుగాఁ బ్రభాతమునఁ గూర్చుఁడు శోభల నెల్ల వీడులన్
సల్లలితంపు రీతులను జక్కఁగ నింక నలంకరించుచున్ 6.

తే.గీ. పూల దండలు విడి విడి పూల నెల్లఁ
జల్ల వలయు రాజ గతులఁ జక్కఁగాను
వందల కొలఁదిగ జనులు పంచ వర్ణ
ములను ముగ్గు లేయ వలయు లలితముగను 7.

ఆ.వె. శాసనమ్మును విని శత్రుఘ్నుఁ డీయ జ
యంత ధృష్టి విజయు లరిగి రర్థ
సాధకుం డశోక సన్నామ సిద్ధార్థ
మంత్రపాలురును సుమంత్రుఁడు వెస 8.

ఉ. కొందఱు మత్త నాగముల గొప్ప ధ్వజమ్ముల భూషితమ్ములం
గొందఱు హేమ మేఖలల కుంజర యుక్త కరేణు పంక్తిపైఁ
గొందఱు స్యందనమ్ముల సుఘోర మహా రథు లేఁగ వేగమే
కొందఱు నేఁగఁ జాగిరి రఘుప్రవరుం గన ఘోటకమ్ములన్ 9.

ఆ.వె. శక్తి ఋష్టి పాశ సధ్వజ స పతాక
హస్తు లేఁగఁ దొడఁగి రంత వేల
కొలఁది కాల్బలులు రఘువరుని వీక్షింపఁ
బరివృతు లయి పౌర వరుల తోడ 10.

కం. కౌసల్య కైకయు సుమి
త్రా సతి మున్నగు దశరథు దారలు ప్రీతిన్
భాసుర వాహనములలో
నా సవతులు సనఁ దొడఁగిరి యానందమునన్ 11.

తే.గీ. నగర మెల్ల నందిగ్రామము గనె నంత
హరుల గిట్టల రవములు స్యందనముల
కమ్మి ధ్వనులు గ్రామమ్మునఁ గ్రమ్మె శంఖ
దుందుభుల తోడఁ జలియించెఁ దోరము భువి 12.

సీ. బ్రాహ్మ ణోత్తములతో వర్తకశ్రేణి ముఖ్యులఁ గూడి మోదకములును విరుల
దండలు నుండ హస్తమ్ము లందు నమాత్యులను గూడి భరతుండు ఘనుఁడు ధర్మ
రతుఁడు భేరీ శంఖ రావమ్ములను గూడి పొగడఁగ వందులు మూరుచు నుప

వాసములఁ గృశించి వఱలు చున్నట్టి దీనుండు నారల నూని యుండి యన్న

తే.గీ. రాకకై మురిసిన వాఁడు భ్రాతృ పాదు
కలు శిరమునఁ దెల్లని గొడు గలరఁ గరము
నందు పెల్ల దండం గొని యంది వ్యజన
మెదురు చనఁ జాగె నన్నకు నెలమి నపుడు 13.

తే.గీ. కాంచి పవనాత్మజునిఁ బ్లవగ వరుని భర
తుండు పలికె నంతఁ గన రాకుండె రాఘ
వుండు ప్లవగ చాపల్యతఁ బూని పలుక
వు గద! కనఁ బరంతపునిఁ బ్లవగ వరేణ్య! 14.

కం. అన విని హనుమంతుఁడు వ
ల్కెనంత వివరింప నెంచి లీలఁగ నీ రీ
తిని సత్య విక్రముని భర
తు నాశ్వసింపంగ నిట్లు దొడఁగెను బ్రీతిన్ 15.

చం. నిరతము పండ్లు పుష్పములు నిండిన చెట్లను గూడి తేనియల్
గురియుచు నుండు నట్లుగను గూరిమి మౌని వరమ్ము నీయ ష
ట్చరణము లుండ నాదముల సంతస మంది ప్లవంగ వీరులే
స్థిరముగ దాఁటి గోమతినిఁ జేరుచు నుందు రటంచు నెంచెదన్ 16.

తే.గీ. మును భరద్వాజున కొసంగె మునికి వాస
వుండు వర మింపుగను ముని పుంగవుం డొ
సంగెను గద యాతిథ్యము సంతసమున
భరత! సైన్యయుతమ్ముగ వనిని నీకు 17.

తే.గీ. అదె వినఁబడు చుండెను గపు లఱచు చుండఁ
గలకలధ్వను లచ్చట పలు విధములు
దుమ్ముఁ గనుమ యచట నుత్తితమ్ము సాల
వనమును గదల్చు చుంటిరి వనచరు లట 18.

మ. కనుమా చంద్ర నిభమ్ము పుష్పకము భూకాంతా! విమానమ్మునున్
ఘన మా దివ్యము బ్రహ్మ నిర్మిత మహో కన్పట్ట దూరమ్ముగా 19.

నని నా రావణుఁ జంపి బంధు యుతు స్వీయామాత్య సంతాను నీ
యిన వంశోద్భవుఁ డింపుగాఁ బడసె దేవేంద్రాభుఁ డీ రాముఁడే

కం. తరు ణాదిత్య నికాశము
నరేంద్ర! రఘు రామ వాహన వరము యక్షే
శ్వర సుప్రసాదము నిరం
త రాతుల మనోజవమ్ము తరలెను గనుమా 20.

ఉ. అంతట రామ లక్ష్మణులు నంగన సీతను గూడి యుండఁగాఁ
జెంతను వానరేశ్వరుఁడు సేరఁగ నంత విభీషణుండు దా
సంతస మంది నిల్వఁగ భృశమ్ముగ హర్ష సమేత మంతటన్
వింతగ రేఁగె శబ్దములు విన్నును ముట్టుచు రామ శబ్దముల్ 21.

తే.గీ. స్త్రీలు బాలురు వృద్ధులు సేరె రాఘు
వుండిట కని కీర్తించుచు నుండ మిక్కు
టముగ నంది యానంద మెడంద లందు
దిక్కు లెల్లఁ బిక్కటిలంగ వెక్కసముగ 22.

కం. తురగ రథ కరుల నుండి ది
గి రయమ్మునఁ బుడమి నిలిచి కేళుల మొగిడిం
చిరి నరులు గాంచి రాముని
నర వరుని విమాన మందు నడయాడ ఘనున్ 23.

కం. భరతుం డంజలి నూని పె
స రామునకు స్వాగతమును జక్కఁగ వచియిం
చి రఘు వరుఁడు పూజించెను
నరర్షభున కెదురు నిలిచి నమ్రత నార్తిన్ 24.

తే.గీ. మన మలర బ్రహ్మ సుకృత విమాన మందు
నపర వజ్రపాణి యనంగ నన్న రాముఁ
డగపడె విశాల లోచనుఁ డప్పుడు భర
తాగ్రజుఁడు ప్రకాశించుచు నంబరమున 25.

ఉ. సోదరు నా విమానమునఁ జూచుచు నా భరతుండు రాముఁ దా
నాదర వీక్షణమ్ముల మహాత్ముని మేరువు నందు సూర్యుఁ డో
నాఁ దనరంగ రాఘవు ఘనమ్ముగ మ్రొక్కెను హంస యుక్తమై
మేదిని వ్రాలె వాహనము మించి రఘూత్తముఁ డీయ నాజ్ఞనున్ 26.

తే.గీ. అంత నెక్కింపఁ బడ నట్టు లవ్విమాన
మందు భరతుండు ముదమున నన్నఁ జేరి
నతులొసంగినఁ దిరిగి యన్నకు ననుజుని
నంకమున నుంచి కౌఁగిలె నన్న ప్రీతి 27.

తే.గీ. అక్షి పథమునఁ గనఁబడ నతఁడు చాల
కాలమున కక్కునం జేర్చి వీలుగాఁ బ
రిష్వజించికొనియె మదిఁ బ్రీతి సెలఁగ
రాముఁ డనుజుని భరతుని రాగ మడర 28.

కం. భరతుండు కదిసి లక్ష్మణుఁ
బరంతపుఁడు జనక సుతను బన్నుగ నంతన్
ధరణిజను గాంచి నతు లా
దరమున నొసఁగె వచియించి తన పేరు తగన్ 29.

తే.గీ. కైక సుతుఁ డంత సుగ్రీవు నా కపీంద్రు
జాంబవంతు నంగదు కపి సత్తముని ద్వి
విదుని మైందుని నీలునిఁ బేర్మి ఋషభుఁ
గౌఁగిలించెను భరతుండు కపివరులను 30.

ఆ.వె. నల సుషేణులఁ బ్లవగుల గంధమాదను
శరభు నింకఁ బనసు హరి వరేణ్యు
లను బరిష్వజించె రామానుజుండు గ
వాక్షుని సహితమ్ము నలర మనము 31.

ఉ. వారలు మానవాకృతుల వానరు లూని నరేంద్ర సూనునిన్
మూరి యనామయం బడిగి మోదము నందఁగఁ గామ రూపులే
వీరుని వానరేశ్వరునిఁ బేరిమి గాంచి పరిష్వజించి తా 32.

నా రఘు వీరుఁ డీ గిరల నంతటఁ బల్కెను ధర్మ యుక్తముల్

తే.గీ. మా నలువురకీవు మహాత్మ! మాన్యుఁ డ వగు
సేనవ సహోదరుండవు వానరేంద్ర!
ప్రేమఁ జనియింత్రు మిత్రులు ద్విషుల స్వీయ
లక్షణం బపకారము ప్లవగ నాథ! 33.

కం. భరతుం డంత విభీషణు
నరసి వచించె నతి కష్టమైన పనియె నీ
యరుదగు సాహాయ్యముతోను
బరఁగె సుసాధ్యముగ నసుర వర్య! మహాత్మా! 34.

తే.గీ. రాముని సలక్ష్మణునిఁ జేరి భ్రాత లందు
ఘనుఁడు శత్రుఘ్నుఁ డట నమస్కారము లొన
రించె భక్తి వినయమున వంచి శిరము
సీత చరణమ్ము లంటి చేసెను నతులను 35.

ఉ. పాదము లంటి మాత కిడె వందనముల్ రఘు రాముఁ డంతటన్
మోద మొసంగ మిక్కుటము పొంగిన వేదన నున్న కాంతకున్
సాదర మా సుమిత్రకును నంజలిఁ గైకకు వందనమ్ములన్
గాదిలి తల్లు లన్యులకు గ్రన్నన జేసి పురోహితుం గనెన్ 36.

కం. నృవరా! కౌసల్యానం
ద వర్ధనా స్వాగత మని తగ నాగరికుల్
వివశులునై కని యా రా
ఘువు నంజలు లిడి పలికిరి కాకుత్స్థునితో 37.

తే.గీ. పౌరులు నిలువ దోసిళ్ల మూర వేల
కొలఁది వికసించి యున్నట్టి నలినముల ప
గిదిఁ గనఁబడిన వవి పరికింప రాఘ
వునకు భరతాగ్రజునకు నృపుంగవునకు 38.

చం. స్వయముగఁ దెచ్చి పాదుకలు పాద యుగమ్మున నుంచి యంతటన్ 39.

నయముగఁ బల్కె నిట్లు నర నాథుని నా భరతుండు గాంచి యో
నయ విద! గొన్మ రాజ్యమును న్యాసము నగ్రజ! నీకు నింక నే
నియతిని దీనినిం దిరిగి నెమ్మి నొసంగెద నాదరమ్మునన్

తే.గీ. నేఁడు నా జన్మము పుడమి ఱేడ! యది కృ
తార్థ మయ్యెను సిద్ధించె నంచితముగ
నా మనోరథము పురమున కరుదెంచఁ
దిరిగి నీ వయోధ్యకు రామ! నరవరేణ్య! 40.

ఆ.వె. బొక్కసముల నిండ్ల పెక్కసముగ నున్న
గాదెలను బలమ్ము గాంచు మయ్య!
దశ గుణములు నయ్యె భృశము నీ తేజము
న నవి యెల్ల రామ! నర వరేణ్య! 41.

తే.గీ. భరతుఁ డట్లను చుండఁగ భ్రాతృ వత్స
లుండు రాక్షసుండు విభీషణుండు వాన
ర వరు లెల్లరు నశ్రువులను విడిచిరి
యంత నానంద భాష్పము లతనిఁ గాంచి 42.

ఉ. అంకము నందు నా భరతు హర్షమునం దగ నుంచి రాముఁడా
పంకజ లోచనుండు నిజ వాహిని తో భర తాశ్రమంపు టా
వంకకుఁ జేరె నంత దిగి వాహన రాజము నిల్పె ధాత్రి నా
టంకము లేక రాఘవుఁడు డగ్గఱి తాను విమాన మింపుగా 43.

తే.గీ. ఉత్తమ విమానము నరసి యుచిత రీతిఁ
బలికె ననుమతింతు నిను నో వాహనంబ
మోయుమీ కుబేరుని నింక మోదముగను
నాఁ జనె నుదీచికి నది ధనదుని కడకు 44.

తే.గీ. రావ ణాపహృత మయిన యా విమాన
ముత్తమమ్ము సేరెను వేగయుతము వైశ్ర
వణుని వేశ్మమునకు నర వర్యుఁ డా ర
ఘూత్తముని యాజ్ఞను వహించి యుత్సహించి 45.

తే.గీ. ఆత్మ సదృశ పురోహితు నంఘ్రు లంటి
వాసవుండు బృహస్పతి పాదములను
దాఁకి నట్లు రాఘవుఁ డంతఁ దద్ద ప్రీతి
సరసఁ గూర్చుండెఁ దగఁ బరాసనము నందు 46.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట ముప్పదవ సర్గము.

# యుద్ధ కాండము

## సర్గము 131.

భరతుఁడు రామునకు రాజ్యము నప్పగింప నయోధ్యా నగరమున శ్రీరాముఁడు రాజ్యాభిషిక్తుఁడై మిత్రుల నెల్ల సత్కరించి సాగ నంపుట, యజ్ఞ యాగాదులను జలుపుచు శ్రీరాముఁడు పదునొకండు వేల సంవత్సరములు సుభిక్షముగా రాజ్య పాలనము సేయుట, శ్రీరామాయణ మహా కావ్య పఠన మాహాత్మ్యమును భగవానుఁడు వాల్మీకి మహర్షి వివరించుట.

కం. అవిరళ కైకేయ్యానం
దవర్ధనుఁడు నుదుటఁ గేలు దగిలించుచు నా
నృవరునిఁ గౌసల్యానం
దవర్ధనునిఁ గాంచి పలికెఁ దగు గిర లిట్లున్ 1.

తే.గీ. రాము నా జ్యేష్ఠు సత్యపరాక్రముఁ గని
నా కొసఁగి నట్టి పూజించి నా జననిని
రాజ్యము నొసఁగు చుంటిని రామ తిరిగి
నీ కని పలికె భరతుండు నెమ్మి నూని 2.

చం. బలమున మిన్న దొక్క వృషభమ్ము వహించెడు గొప్పభార మె
ట్టుల నొక దూడ మోయును బటుత్వము చాలునె మోయ దానికిం
దలఁగుదు రాజ్యభారమును ధైర్యము తోడ వహింప రాఘవా! 3.

కలుగదు శక్తి నాకు నరకాంత! భరింపఁగ నింక రాజ్యమున్

ఉ. సేతువు వారి వేగమున ఛిద్రము కాఁగ స్రవించు నీటి సే
రీతిని నాపఁగా నగును రేఁగఁగ రాజ్యము నందు ఛిద్రముల్
నా తర మౌనె వారణ మొనర్ప రయమ్మున నెంచి చూడఁగా
నే తఱి నైన నగ్రజ! నరేశ్వర నీ వలె రక్ష నీయఁగన్ 4.

ఉ. గాడిద గుఱ్ఱపుం గతినిఁ గాంచఁగ వాయస మంచ మార్గముం
గూడని రీతి నీ గతినిఁ గోరఁగఁ జాల నరిందమా! మదిన్
వేడుక నాట వాకిలిని వృక్షము నింపుగ గొప్ప శాఖలం
గూడిన నెక్కరాని దయి కోర ఫలమ్ములు దక్క కుండినన్ 5.

ఉ. నాటిన వాని కప్పుడు కనంగ ఫలం బది కల్ల నేర్చునే
సూటిగ మమ్ము గావఁగను శూరుడ! నీవు దలంపకున్నచో
మేటి మగండ వై పుడమి మిన్నగ పాలన మీ వొనర్పకే
దీటుగ మమ్ము భృత్యులను దేర్పక యుండిన లాభ మేమియో 6.

కం. జగ మరయుఁ గాక రాఘువ!
తగ నభిషిక్తుఁడవు గాఁగ ధర్మజ్ఞా! సూ
ర్యు గతిని మధ్యాహ్నమున వె
లుఁగు తేజమ్ము దనరఁగ సురుచిరప్రభలన్ 7.

తే.గీ. వాయిదమ్ముల గము లవి మ్రోయు చుండ
నందియల నొడ్డణమ్ముల నడరు నట్టి
మ్రోతలను తియ్యనై నట్టి గీతములఁ బ
రుండు మగ్రజ! మేల్కొను రుచిరముగను 8.

తే.గీ. వసుమతీ చక్ర మున్నంత వఱకుఁ దిరుగు
నంత వఱకు జ్యోతిష్చక్ర మడరి రాఘు
వేంద్ర! స్వామివై వర్తింపు మింపుగాను
భూ జనుల కెల్లరకు నీవు భూరి యశుఁడ! 9.

కం. విని యా భరతుని మాటలు 10.

మనుజేంద్రుఁడు సమ్మతించె మన మలరంగం
గని పర పురంజయుం డా
సనమును గూర్చుండె నంత సమ్మోదమునన్

తే.గీ. అంత శత్రుఘ్ను నానతి నతి నిపుణులు
శీఘ్ర కర్ములు సుఖముగ చేయు వారు
మంగళులు చుట్టు ముట్టిరి మాన వేంద్రు
రాముని రయమ్ము న నట సంభ్రమము మీఱ 11.

తే.గీ. మున్ను భరతుండు స్నాతుఁడై చన్న లక్ష్మ
ణుండు బల్లిదుఁడు విభీషణుండు వాన
ర పతి సుగ్రీవుఁ డొనరింప రాముఁడును జ
డలను విప్పి జలకమాడి నిలిచె నంత 12.

ఆ.వె. మడుగుల నీఁకఁ జిత్ర మాల్యానులేపన
ముల విభూషితుఁ డయి వెలుఁగుచు నిజ
తేజమున భృశమ్ము దేవ విభు నిభుండు
రాఘువుండు నిలిచె రమ్యముగను 13.

తే.గీ. రామునకు నింపుగ నలంకరణము సేయ
నంత నియమించె శత్రుఘ్నుఁ డర్క వంశ
వర్ధనుండు శ్రీమంతుఁడు పరమ లక్ష
ణునకు లక్ష్మణునకును వినుత యశుండు 14.

ఉ. సీతను నంతఁ బంక్తిరథు స్త్రీలు మనస్విను లెల్ల రింపుగాఁ
బ్రీతి నలంకరించిరి యపేక్ష వహించి మనోహరమ్ముగా
నాతుల వాన రాంగనల నారుల రత్నము రామ మాత తా
నాతత రీతి నెల్లరను నందముగా హవణించెఁ బ్రీతిమై 15.

తే.గీ. సారథి సుమంత్రుఁ డద్భుత స్యందనమ్ముఁ
దెచ్చె శత్రుఘ్ను నానతిఁ దివ్య రథము
నంత సర్వాంగ శోభన మంచితమ్ము
నర్కమండల సంకాశ మడరు దాని 16.

కం. కనియా రథమ్ము నంచిత
మును గాకుత్స్థుండు దీర్ఘ భుజుఁ డధిరోహిం
చెను బర పురంజయుం డా
మనుజేంద్రుఁడు రాఘవుండు మాన్యుం డంతన్ 17.

కం. చని రా సుగ్రీవుండును
హనుమంతుఁడు స్నాతు లయి మహార్హ వసనముల్
దనర మహేంద్ర నిభద్యుతు
లు నెగడ శుభ కుండలమ్ములు వెలుఁగు చుండన్ 18.

చం. నగరముఁ గాంచు కోరిక ఘనమ్ముగ భూషల నెల్ల నూని యా
మగువలు సుంద రాంగులును మర్కట నాథుని పత్నులున్ మదే
భ గమన జానకీ సతిని భామను గూడి సకుండలమ్ములం
దగ వెడలంగఁ జాగిరి రథమ్ముల మోదము నిండ నాత్మలన్ 19.

ఉ. అంత నయోధ్యలోఁ బురి నజాత్మజు మంత్రులు నాపురోహితుం
జెంతను మంతనమ్ములను జెన్నుగఁ జల్పిరి గాంచి యెల్లరున్
సొంతము రామ వృద్ధికిని నంచిత పట్టణ వృద్ధి నెంచుచున్
స్వాంతములం దశోక ముఖ సన్నుత మంత్రులు నన్య నాములున్ 20.

తే.గీ. విజయుఁడు మఱి సిద్ధార్థుఁడు వినుత మంత్రు
లిట్లని రభిషే కార్థమ యీ జయార్హు
నకు మహాత్మున కీ రాముని కొన రింప
వలయు నెల్ల మంగళముల నలరి యిపుడు 21.

ఆ.వె. మంత్రు లెల్ల రిట్లు మంతనములు సల్పి
యాపురోహితునకు నానతి నొసఁ
గి నగరమ్ము నుండి మనుజేంద్రు దర్శింపఁ
బయలు దేరి రంతఁ బార్థు కడకు 22.

సీ. హరి యుక్త రథమున నమరేంద్రు భంగిని రాముఁడు సనె నెక్కి రథ వరమును
భరతుండు కళ్యాలఁ బదిలమ్ముగాఁ బట్టె శత్రుఘ్నుఁడు వహించె ఛత్రవరము

లక్ష్మణుం డూని వాలవ్యజనమ్ము్మను వీవఁ దొడంగెను బ్రేమ మీఱఁ
జెంత విభీషణుం డంత నన్యము సిత వ్యజన మూనె శశి నిభమ్ము రక్తి

ఆ.వె. గగన మందు ఋషి నికాయము స మరుద్గ
ణమ్ము సంస్తుతింప నెమ్మి రాము
ని వినిపించె మధుర రవము లంచితముగ
దేవతలు నుతింప దివ్యముగను 23.

కం. కుంజర రాజము వర శ
త్రుంజయ నామమ్ము నెక్కె రుచిరమ్ముగ నా
మంజుళ తమ సుగ్రీవుఁడు
సంజాతుఁడు కపి కులమున సంతోషముగన్ 24.

కం. తొమ్మిది వేల గజమ్ముల
నెమ్మి నరాకృతుల నూని నిఖిలప్లవముల్
సమ్మదమున సర్వాభర
ణమ్ముల వెలుఁగుచుఁ దరలిరి నగచరు లంతన్ 25.

చం. చెలఁగఁగ శంఖ దుందుభులు సెన్నుగ రమ్యపు నిస్వనమ్ములే
తరలెను మానవర్షభుఁడు తద్ద పురమ్మున కా యయోధ్యకై
పరఁగఁగ హర్మ్య పంక్తులను బన్నుగఁ గాంచిరి వచ్చు చుండఁగా
నర వరు నట్లు రాఘవు ఘనప్రభలన్ రథ మందు నిల్వఁగా 26.

తే.గీ. రాము నతిరథు నరసి పుర జనులు జయ
వాచ్యములు వల్కి రింపుగ వారిఁ గాంచి
రాముఁ డభినందనము లిడఁ బ్రజలు మురిసి
యనుగ మించిరి చక్కఁగ ననుజులఁ గని 27.

కం. తారల మధ్య సుధాకరు
నా రాముఁడు వోలి వెలిఁగె నవనీసురులుం
బౌరు లమాత్యులు వృతులై
వార లనుగమింపఁ దన యవయవప్రభలన్ 28.

చం. కదలెను రాఘవుం డపుడు కంజదళాక్షుఁడు స్వస్తికమ్ములన్ 29.

సదమల వాద్య తాళములు చక్కగ నూనిన వార లేఁగు చుం
డ దరి ముదమ్ము నూని మును డయ్యక యించుక మంగళమ్ములన్
మది యలరంగఁ బాడుచును మానవ పుంగవు కీర్తనమ్ములన్

తే.గీ. మును చనఁ దొడంగి రక్షతలను బసిడినిఁ
గైకొని నరులు విప్రులు కన్య లావు
లు సన మోదక పాణులు పెస నరేంద్రు
రాఘవున కగ్రమునఁ గదలం దొడఁగిరి 30.

ఉ. ఆ వర వాన రాలి పని నాసుర సైన్య బలమ్ము నెల్ల సు
గ్రీవుని తోడి స్నేహమును బ్రీతిని మారుతి ప్రాభవమ్మునున్
భూవరుఁ డెల్ల మంత్రులకు మూరి వచింపగ విస్మయమ్మునున్
వావిరి పొందిరా నగర వాసులు డెందము లందు నెల్లరున్ 31.

తే.గీ. రాక్షసేంద్రు విభీషణు రాఘవుండు
నుడివెఁ దాను గూడుట సద్వినుత చరిత్రు
నంతఁ జేరె నయోధ్యను సంతసమున
నున్న జనుల గూడిన యట్టి తన్నగరము 32.

తే.గీ. ఎగుర వేసిరి యింటింట నెలమిఁ బౌరు
లెల్ల రడరి పతాకము లింపుగాను
రుచిర మిక్ష్వాకుల గృహము నచిరము గని
చేరె రాముఁడు తన తండ్రి శ్రేష్ఠ గృహము 33.

కం కౌసల్యకు నింక సుమి
త్రా సతికిం గైక కొసఁగి తన వందనముల్
భాసుర పితృ గృహముఁ గదిసి
పే సోదరు భరతుఁ గాంచి పేర్మి నిటు లనెన్ 34.

చం. భరతుని శ్రేష్ఠు ధార్మికుల భ్రాతను గాంచి వచించె నర్థ యు
క్త రుచిర భాషణమ్ములను దత్కపి రాజున కిమ్ము శోక స
త్తరు సవిడూరజమ్ము లసితమ్మును మౌక్తిక భాసితమ్మునున్
హరికి మదీయ సౌధము మహాత్మున కిత్తటి రాఘవోత్తమా! 35.

కం. విని యాతని వాక్యములను
ఘన సత్య పరాక్రముండు కరముల సుగ్రీ
వునిఁ గొని భరతుం డాలయ
మునఁ జొచ్చెను బ్రీతి దనర బోరన యంతన్ 36.

ఆ.వె. తైల దీపములను దల్ప పర్యంకము
లఁ గొని తెచ్చి రంత రయమునను న
నుజ్ఞ నీయ నా ఘనుండు శత్రుఘ్నుఁడు
వాన రాధిపతికి భటులు రక్తి 37.

కం. ఘన తేజుఁడు రామానుజుఁ
డనఘుఁడు సుగ్రీవుఁ గాంచి యభిషేక మొన
ర్ప ననుపుమ దూతలఁ ప్లవం
గ నాథ!యని వేడె నంతఁ గపి రాడ్వరునిన్ 38.

కం. బంగరు కుండలఁ గాంచి ప్ల
వంగుల నల్వుర నొసంగె స్వర్ణ మయములం
జెంగునఁ దేర జలము నిం
డంగను నాల్గింటి నలు కడళుల జలములన్ 39.

తే.గీ. ఇచ్చి పలికె సుగ్రీవుఁడు వచ్చి జలము
నిండి నట్టి ఘటములతో నెమ్మి యుదయ
మందు నెదురు చూడ వలయు హరి వరేణ్యు
లార! నా యాజ్ఞ కొఱకునై మీర లంచు 40.

కం. అన నిట్లు వానరులు నా
గ నిభు లెగిరి రంత నుదరి గగనమ్మునకున్
ఘన వేగమున గరుత్మం
తునిఁ బోలుచు వీర వరులు తోషం బడరన్ 41.

ఉ. మారుతి జాంబవంతుఁడును మాన్య హరీంద్రుఁడు వేగదర్శియున్
వీర వరుండు నా ఋషభ విశ్రుత నాముఁడు నాల్గు కుండలన్ 42.

ధీరులు నైదు వందల నదీ జలకమ్ముల నిండి యుండఁగం
దీరుగఁ దెచ్చి రింపుగను దిట్ట తనమ్మున నాథు నానతిన్

ఉ. రాముని కంతఁ బ్రా గుదధి రమ్య జలమ్ము సుషేణుఁ డగ్ర్య శా
ఖా మృగ సంచ యోత్తముఁడు కాంచన రత్న మయంపుఁ గుంభిలో
గోముగఁ దెచ్చె స్వర్ణ మయ కుంభములో ఋషభుండు గంధ వృ
క్షామల శాఖలం బఱచి యామ్య మహోదధి నీరముం గొనెన్ 43.

చం. గవయుఁడు పశ్చి మాబ్ధి యుదకమ్మును దెచ్చెను రత్న కుంభిలోఁ
బ్రవిమల శీతలమ్మును శుభమ్ముగ మారుత విక్రముండు తో
య వరము నుత్త రార్ణవము నందు గ్రహించి నలుండు వచ్చె ధ
ర్మ విదుఁడు సద్గు ణాన్వితుఁడు మారుత తార్క్ష్య పరాక్రముండునై 44.

తే.గీ. వానర వరులు తెచ్చిన పావ నోద
కమ్ము నరసి రామాభిషేకమ్మునకు న
మాత్య సహితుండు నెఱిఁగించె మాన్యునకుఁ బు
రోహితునకు నాప్తులకు శత్రుఘ్నుఁ డలరి 45.

చం. అన విని సావధానుఁ డయి యంత వశిష్ఠుఁడు కూడి విప్రులన్
ఘన మణి పీఠ మందుఁ దగఁ గాంతను సీతను గూడి రామునిన్
మనుజ వరేణ్యు నింపుగను మాన్యునిఁ దా నుపవిష్టుఁ జేయఁగా
మునివరు లా వశిష్ఠుఁడును బుణ్యతముం డగు వామదేవుఁడున్ 46.

తే.గీ. కాశ్యపుండు కాత్యాయన గౌతమ విజ
యులు సుయజ్ఞుఁడు జాబాలియుఁ బురుషర్ష
భు నభి షేకించిరి సుగంధపు సలిలముల
వసువు లా వాసవుని భంగి వఱల నంత 47.

ఉ. ముందుగ విప్ర ఋత్విజులు ముగ్ధలు గన్యలు మంత్రి వర్యులున్
సుందర యోధ వర్తకులు సుస్థిర ముండ నభమ్ము నందు నా
నందముగా సురావలియు నల్వురు నుత్తమ లోకపాలు రిం
కందఱు నౌషధమ్ముల మహాత్ముని వా రభిషిక్తుఁ జేయఁగా 48.

సీ. బ్రహ్మచే మున్నెద్ది పన్నుగ నిర్మిత మయ్యె మనువు పూర్వ మెయ్యది ధరి
యించె నాతనికి జనించిన వా రెయ్య దూనిరి క్రమముగ నుజ్జ్వలమ్ము
నట్టిది పసిడి మయమ్మును దీప్తము రత్న ఖచితమును రమ్యమును స
భాస్థలి రత్న విభాసిత పీఠమున యథావిధి నునిచి నయ విదుండు

తే.గీ. ముని వశిష్ఠుఁ డంతఁ గిరీటమును మహాత్ముఁ
డుంచె రాముని శిర మందు నంచితముగ
ఋత్విజులు భూషణమ్ముల నెల్ల వా ర
లంకరించిరి రాముని రమ్యముగను 49.

మ. చని తాఁ బ్రీతి ఘనుండు వట్టె ధవళచ్ఛత్రమ్ము శత్రుఘ్నుఁడే
ఘన సుగ్రీవుఁడు పట్టె హర్షమున శాఖా చారి వింజామర
మ్మును గాకుత్స్థున కప్డు పట్టెఁ దగ సంపూర్ణాబ్జ సంకాశమున్
గని యన్యమ్మును నా విభీషణుఁడు రక్షః కాంతుఁ డింపారఁగన్ 50.

కం. తను కాంతులం బ్రకాశిం
చు నగ నొసంగె శత పుష్ప శోభితమును నా
యనిలుండు సువర్ణము రా
మునకుఁ బురందరుని యాజ్ఞఁ బుణ్యాత్మునకున్ 51.

ఆ.వె. సర్వరత్న మయము సకలమణి విలసి
తమును మౌక్తికములు దనరు హార
ము నొసఁగె ననురక్తిఁ బురుహూతు నానతి
మానవర్షభునకు మారుతమ్ము 52.

తే.గీ. అర్హు నభిషేక సమయమ్ము నందుఁ బాడి
రఖిల గంధర్వు లాడిరి యప్సరసలు
రాఘ వేంద్రు ధీమంతుని రమ్యమైన
యట్టి యభిషేకము నరసి యంచితముగ 53.

ఆ.వె. సస్య వంత మయ్యెఁ జక్కఁగ వసుమతి
ఫలము లీనె నపుడు పాదపములు
గంధవంతము లయి కన్పట్టె పూవులు
రాఘవోత్సవమున రమ్యముగను 54.

చం. ఒసఁగెను లక్ష గుఱ్ఱముల నొయ్యన నావుల లక్ష సంఖ్యలం
బస గల వంద యెద్ల నట బ్రాహ్మణ కోటికి మానవేంద్రుఁడే
యొసఁగెను గోట్లు ముప్పదుల యుక్త హిరణ్యము లగ్ర జాతికిన్
వసనము లింక భూషలను బార్థివుఁ డత్తఱిఁ జేసె దానమున్ 55.

తే.గీ. అంత సుగ్రీవున కొసంగె నర్క రశ్మి
సన్నిభ సువర్ణ మాలను సన్మణి విల
సితము దివ్యమ్మును బురుష శేఖరుండు
గారవమ్మునఁ బ్లవగ శేఖరున కలరి 56.

కం. ధృతి మంతుఁ డొసఁగె రాముఁడు
వితత విడూరజ వర మణి వృత రత్న సమా
వృత మంగద మంగదునకు
రతి వాలి సుతున కపుడు పరమ హర్షమునన్ 57.

చం. వర మణి జుష్ట ముత్తమము భామకు మౌక్తిక హార మంతటన్
ధరణిజ కాలి కిచ్చె హిమ ధామ వరాంశు నిభప్రభా లస
త్సురుచిర మింక భూషలు విశుద్ధ దుకూల యుగమ్ము దివ్యముం
దరుణి కొసంగె రాఘవుఁడు దద్దయుఁ బ్రీతిని సీత యంతటన్ 58.

తే.గీ. చూచుచు హనుమంతుని నంత సుదతి సీత
తనదు కంఠము నుండి సత్వరము తీసి
హారమును మాటి మాటికి నరయు చుండెఁ
బతిని వానర కోటిని భావ యుతము 59.

తే.గీ. ఇంగితజ్ఞుఁడు సతి భావ మెఱిఁగి పలికెఁ
దేజము యశము నేర్పును ధృతియు నీతి
పౌరుషము బుద్ధి వినయము పరఁగు నేరి
కతని కిమ్ము తుష్టి నిడిన యతని కంచు 60.

ఆ.వె. వాయు సుతున కిచ్చె వైదేహి హారము
హార మూని వెలిఁగె హనుమ చంద్ర 61.

కాంతు లడరు మాల నంతఁ దెల్లని మబ్బు
లున్న యద్రి పగిది మిన్న గాను

చం. ద్వివిదున కింక మైందునకు వీరుఁడు నీలున కెల్ల వాన రా
లి వఱలు పెద్ద వారికినిఁ బ్రీతి నొసంగెను భూషణమ్ము లిం
క వసన రాజముల్ పుడమి కాంతుఁడు సక్కఁగఁ గోర నొప్పు న
ట్టి వొసఁగె నర్హ రీతినిఁ గడింది సఖిత్వము నెంచి యాత్మలో 62.

ఉ. వావిరి జాంబవంతుఁడును వాయుజుఁ డన్య హరీంద్ర కోటి సు
గ్రీవుఁడు నవ్విభీషణుఁడు గృత్స్న ము పూజితు లైరి కోర్కులన్
భూవరు చేత రత్నముల భూరిగ వారలు వచ్చి నట్టి యా
త్రోవను నేఁగఁ జాగిరి సతోషము వానరు లింక రక్కసుల్ 63.

కం. ప్లవగులు మహాత్ము లెల్లరు
నృవరునకు నమస్కరించి నెమ్మి వెడలి రం
త వడిం గిష్కింధకు రా
ఘవుం డనుమతింప వారిఁ గారుణ్యమునన్ 64.

కం. పురిఁ జేరెను సుగ్రీవుం
డరయఁగ నభిషేకముఁ దగ నర్చితుఁ డయి భూ
వరుచే రాముని చేతను
విరివిగఁ గిష్కింధను హరి విభుఁడు ముదమునన్ 65.

ఆ.వె. కుల ధనము గ్రహించి కూర్మి విభీషణుం
డరిగె లంక కంత నసుర వరులఁ
గూడి రాజు ధర్మ కోవిదుండు మహా య
శుండు  రక్కసుల విభుండు మురిసి 66.

తే.గీ. కీర్తి మంతుఁడు సక లారి హర్త యఖిల
ము నిజ రాజ్యమ్ము నేలెను మురిసి భృశము
రాఘవుం డుదారుఁ డరసి లక్ష్మణు నయ
విదుని ధర్మవత్సలుఁ డనె సదయ నిట్లు 67.

ఉ. భూమిని నీవు ధర్మవిద! పూర్వులు నేలిన రాజ్య మింపుగా
గోముగ యౌవ రాజ్యమునఁ గూడి ననుం దగ భ్రాత! యేలుమా
యీ మహి భార మూను మయ యింపుగఁ నిత్తఱిఁ దండ్రు లేల నాఁ
డే మఱకుండ వర్ధిలిన దెల్లను నేనును నుండఁ దోడుగన్ 68.

చం. పలుమఱు నిట్లు వేఁడినను బార్థుఁడు లక్ష్మణు ధర్మవేత్తనున్
నిలువఁగ యౌవరాజ్యమున నెమ్మిని నొల్లక యున్న భ్రాతయే
లలిత మనస్కు నా భరతు భ్రాతను దా నభిషిక్తుఁ జేసె నం
త లలి మహాత్ము రాఘవుఁడు ధారుణికిన్ యువరాజుగా వెసన్ 69.

తే.గీ. పౌండరీ కాశ్వ మేధ స వాజపేయ
యాగములు పెక్కు లొనరించి యన్యములను
వివిధములను బూజించెను బ్రీతి దేవ
తలను వేల వర్షములు రాట్తనయుఁ డేలె 70.

ఆ.వె. ఆచరించి వంద యశ్వమేధమ్ముల
నుత్త మాశ్వరాజ యుతము భూరి
దక్షిణల నొసంగి ధరణి నాథుఁడు ద్విజ
పుంగవులకుఁ బ్రీతిఁ బుడమి నేలె 71.

తే.గీ. రాముఁ డాజాను బాహుఁడు భీమ వక్షుఁ
డును బ్రతాపవంతుఁడు లక్ష్మణుని సహితము
చక్కఁ బాలించె నీ భూమి సద్గుణుండు
సర్వమును లీలఁ గాకుత్స్థ సత్తముండు 72.

కం. నుత ధర్మాత్ముఁడు రాముఁడు
క్రతువు లనేకము లొనర్చె రాజ్యమ్మును నా
తతమును గ్రహించి తన స్నే
హితులను జ్ఞాతులను గూడి యిల బాంధవులన్ 73.

ఆ.వె. విధవ లేడ్వఁ గలఁత వినము క్రూర మృగము
ల భయ మెందు గనము లవ మయినను
వ్యాధులఁ గన మెందు బాధల నీయఁగ 74.

రాముఁ డేలు చుండ రాజ్య మడరి

ఆ.వె. లేరు దొంగ లిలను లే వనర్థము లెందుఁ
వృద్ధు లైన వారు పిల్లల కయి
వేఁగఁ జేయ రెందుఁ బ్రేత కార్యములను
రాముఁ డేలు చుండ రాజ్య మడరి 75.

ఆ.వె. ఎల్ల నిండెను ముద మెల్లరు ధర్మప
రు లయిరి కని రఘువరు నొక రొక్క
రెవ్విధమున నయిన హింసించు కొన రెందు
రాముఁ డేలు చుండ రాజ్య మడరి 76.

ఆ.వె. వేల యేండ్లు గడిచె వేల పుత్రుల తోడ
విగత రోగములను విగత శోక
ములను లోకు లుండి రలరి భృశమ్ముగ
రాముఁ డేలు చుండ రాజ్య మడరి 77.

ఆ.వె. రామ రామ యంచు రాముని గాథలు
ప్రజల లోన ననవరతము సెలఁగె
రామ మయమునై ధరాతలము వెలిఁగె
రాముఁ డేలు చుండ రాజ్య మడరి 78.

చం. తరువులు పూలఁ బండ్లను సతమ్ము నొసంగుచు నున్న వెల్ల సె
ట్టి రుజలు లేక వానలు పటిష్ఠము లయ్యెను గోరి నంతటం
బరఁగె సుఖంపు మారుతము పన్నుగ నిత్యము రాముఁ డేలఁగా
ధరణిసు రాలి క్షత్రియులు ధాత్రిని వైశ్యులు శూద్రు లెల్లరున్ 79.

చం. అలరిరి వారి వారి పనులం దను రక్తి వహించి నిత్యముం
బరఁగిరి వీడి లోభమును బన్నుగ నుండిరి ధర్మ బద్ధులై
గిరలు వచించి సత్యముగఁ గీర్తి గడించిరి మిక్కుటమ్ముగన్
నర వరు లెల్ల రచ్చటను నైపుణి రాజ్యము రాముఁ డేలఁగా 80.

కం. అందఱు లక్షణ వంతులె 81.

యందఱు తత్పరులు ధర్మ మందున నిరతం
బందఱు వశింతు రట నా
నంద మెదలఁ దాండవింప నరవరు లెలమిన్

కం. పది వేల వత్సరమ్ములుఁ
బది వందల యేండ్లు ఘనుఁడు పాలించె దయా
హృదయుండు రాముఁ డింపుగ
సదమల వృత్తుండు భ్రాతృ సహితము ధరణిన్ 82.

చం. పరగును ధర్మ సమ్మతము పన్నుగ నాయువు నిచ్చుఁ గీర్తినిన్
నర పతి కిచ్చు సజ్జయము నైపుణి వ్రాసెను బుట్టపుట్టువే
గురుతర మార్ష సత్కృతము కోరి పఠించిన నాది కావ్యముం
బురుషుఁడు విన్న లోకమునఁ బోవును బాపము లెల్ల వానికిన్ 83.

తే.గీ. రామ పట్టాభిషేకము రక్తి వినిన
జగతిఁ బుత్ర కాములు వడయఁ గలరు తన
యులను ధన కాములు ధనము నుర్విఁ గాంత్రు
ధరఁ గెలుచు రాజు వధియించు నరుల నెల్ల 84.

ఉ. రాముని చేత మాతయును లక్ష్మణు చేత సుమిత్ర యింకనున్
శేముషి తోడ నా భరతు చేతను గైకయు జీవ పుత్ర లై
రీ మహిఁ జక్క నవ్విధమ యింపుగ నొందురు కాంత లచ్చటం
బ్రేముడిఁ బుత్ర పౌత్రులును బెంపు వహింపఁగ నిత్య హర్షలై 85.

తే.గీ. ఘనుని రాముని యక్లిష్ట కర్ముని విజ
యమ్ము గూడిన రామాయణమ్ము నెల్ల
నాలకించిన దీర్ఘంపు టాయువుఁ బడ
యఁ గల రెల్ల జనులు నిశ్చయముగ నవని 86.

కం. మును ముని వాల్మీకి రచిం
చిన యీ కావ్యము నెవండు జిత రోషుండై
మనమున శ్రద్ధ దనరఁ జదు
వు నా నరుఁ డతిక్రమించు బోరన పెతలన్ 87.

కం.	ముని ముని వాల్మీకి రచిం
చిన యీ కావ్యము నెవండు చెన్నుగ విను నా
మనుజుండు ప్రవాసాంత
మ్మునఁ గూడును బంధువులను ముదము వహించున్ 88.

ఉ.	కోర వరమ్ము లింపుగను గూరిమి రాముని చేతఁ బొందుదుర్
కోరిక లాలకించి సుర కోటి సమస్తము వొందు హర్షమున్
వారి యెడం బఠింపగను వారి గృహమ్మున సంచరించెడున్
ఘోర వినాయకప్రజలు గూర్మిని శాంతి వహింతు రంతటన్ 89.

కం.	ధర నింపుగ గెల్వఁ గలరు
ధరాధి నేతలు బహిష్కృత నరపతులు స
త్వరముగ స్వాస్థ్యమ్ము వడయు
దు రింపుగఁ బఠించిన నిది తోరపు భక్తిన్ 90.

తే.గీ.	సుతుల నుత్తములం గందు రతివ లా ర
జస్వలలు పఠించినను బూజ లొసఁగినఁ బు
రాతన మితిహాసమునకు వీత పాపు
లగుదు రాయువు దీర్ఘము నందఁ గలరు 91.

చం.	వినవలె నెల్ల క్షత్రియులు విప్రుల నుండి వినమ్ర మూర్ధులై
ఘన ధన పుత్ర లాభములు గల్గును విన్న పఠింప నేరికిం
గన మిసు మంత సందియము కాంతుని రాముని గాథ నింపుగా
మనమున నొందు సంతసము మాన్య సనాతన విష్ణు వాతఁడే 92.

తే.గీ.	హరియు నారాయణుండును నాది దేవుఁ
డీ మహా బాహువు నర వరేంద్రుఁ డెన్న
నితఁడు  సాక్షాద్రఘు వరుండె యితని కనుజుఁ
డైన లక్ష్మణుఁ డగు శేషు వవని లోన 93.

కం.	విని యర్థ వంత కావ్య
మ్మును ధన ధాన్య సకుటుంబముల వృద్ధి నిలన్ 94.

వనితా సుఖముల నంద న
గు ని జాఖిల కార్య సిద్ధి గురుతర రీతిన్

ఆ.వె. యశము నింక నాయు వారోగ్యముల బుద్ధి
శుభము లింకను ననుజుల ననుంగు
ప్రేమ నొసఁగు దాని వినఁ దగు సద్బుద్ధు
లకును నియమ గతిని రామ గాథ 95.

తే.గీ. ఇట్లు మున్ను జరిగి నట్టి యీ వర కథ
నుడువుఁ డెల్లరకును  భయపడక యెదల
భద్ర మగు మీకు విష్ణుని బలము వృద్ధి
సెందు గాక ధరణి లోన శ్రేష్ఠముగను 96.

కం. సుర వరు లనుగ్రహింతురు
కరము గ్రహించినఁ జదివినఁ గమనీయముగా
వర రామాయణ మెలమిఁ బి
తరు లెల్లరు సంతసింత్రు తప్పక యెదలన్ 97.

కం. ముని కృతము సంహితము నీ
మనుజేంద్ర చరితము నెల్ల మన్నన లిఖియిం
చిన నరులు వసింత్రు దివ
మ్మున సంతోష మడర సతము సుఖస్థితులై 98.

శా. నీలాంగద్యుతి పుంజ నిర్జిత చలన్నిర్భేధ్య పర్జన్యమా!
వేలాక్రాంత యశః పయోధి! కృత నిర్వీ ర్యోగ్ర  రత్నాకరా!
లీలా మానుష రూప సంచరిత కేళీ ఖండితాస్యవ్రజా!
బాలా భూమిజ హస్త పూజిత పదా! పద్మాయతాక్షద్వయా! 99.

మాలిని. దశరథ నృప సంజాతా సరోజాయతాక్షా!
నిశిత విశిఖ వర్షన్వీ! వినీ లాభ్ర గాత్రా!
దశవదన శిరో హర్తా! జగత్త్రాణ దక్షా!
స శమ దమ విరాజత్స్వాంత! శ్రీరామ భూపా! 100.

ఇది శ్రీ వాల్మీకి మహర్షి కరుణా కలిత కామేశ్వరీయ శ్రీమదాంధ్ర రామాయణమున యుద్ధ కాండ మందు నూట ముప్పది యొకటవ సర్గము.

శ్రీమదాంధ్ర రామాయణము యుద్ధ కాండము తోడ సర్వము సంపూర్ణము.